శ్రీ

# కందుకూరి వీరేశలింగ కవికృత గ్రంథములు.

## ఏడవ సంపుటము : ఉపన్యాసములు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము,

రాజమహేంద్రి.

వెల రు. 6-0-

# పీఠికానుబంధము.

## ఉపన్యాసకాలసూచిక

**ఈ సంపుటమున బ్రకటితములైన యుపన్యాసముల కాలక్రమము.**

15—8—1875 ఐకమత్యము

7—1879 స్త్రీ పునర్వివాహ విషయకోపన్యాసము

3—8—1879 స్త్రీ పునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

9—1879 .. ప్రవర్తకపక్షాజ విజ్ఞాపనము

12—10—1879 .. ద్వితీయ ..

1880 హిందూమతములు

.. వర్ణములు

1881 అతి బాల్యవివాహము

.. జన్మాంతరము

20—1—1882 స్త్రీ పునర్వివాహ శాస్త్రసంగ్రహము

6—1883 విద్యాధురీణుల యర్హకృత్యములు

9—6—1885 రాజమహేంద్రపుర స్త్రీ పునర్వివాహచరిత్రము

5—4—1886 ప్రార్థన

15—1—1887 స్త్రీ పునర్వివాహ వ్యాపారము యొక్క భూతభవిష్య ద్వర్తమానములు

26—3—1887 దానములు

27—10—1889 ఈశ్వరదత్త పుస్తకములు

9—3—1891 ఈశ్వరోపాసనము

30—4—1892 మానుషధర్మము

5—5—1893 వేశ్యకాంతలగూర్చి యుపన్యాసము

1893 విద్యార్థికుల ధర్మములు

1894 సకాయకష్టకర్మలు

.. స్వయంకృషి

1895 వైరాగ్యము

1896 జీవితపరమార్థము-దానినిపొందు లాభములు

6—1—1897 విగ్రహారాధనము

8—6—1897 గోదావరీమండల సాంఘికసభలో చేసిన ప్రసంగము

పైవానిలో చివరది తప్ప తక్కిన యుపన్యాసములన్నియు ప్రార్థన సమాజమున, విజయనగరము మహారాజావారి బాలికాపాఠశాలయందు చేయబడి యున్నవి.

# శ్రీకందుకూరి వీరేశలింగకవికృత గ్రంథములు.

## ఏడవ సంపుటము:- ఉపన్యాసములు

## పీఠిక

గద్యతిక్కన యని ప్రసిద్ధికెక్కిన కందుకూరి వీరేశలింగము పంతులుగారధునాతనాంధ్ర వచన వాఙ్మయమునకు మూలపురుషులు. పంతులుగారి సంపూర్ణ గ్రంథావళి యందిది యేడవ సంపుటము. ఇందులో పంతులుగారాయాసమావేశముల యందు, సభలయందు నొసంగిన యిరువదియొక్క యుపన్యాసములు గలవు. వచనవాఙ్మయమున, సాహిత్యవిమర్శ, చరిత్ర, శాస్త్రీయగ్రంథరచన, వ్యాసరచన మున్నగు శాఖల యభివృద్ధికి పంతులుగారెట్లు కారకులో, అట్లే ఉపన్యాసరచనమున గూడ నందె వేసిన చేయియై నవ్యసాహితీరంగమున నాశాఖ కొక ప్రత్యేక విశిష్టస్థానము గడించిన మహావ్యక్తి.

ఈ సంపుటమున ప్రకటితములైన యుపన్యాసములలో కాలక్రమమున 'ఐకమత్యము' అను నుపన్యాసము మొదటిది. అది తే 15-8-1875 దిని పంతులుగారు తమ ప్రాణమిత్రులగు బసవరాజు గవర్రాజుగారి యాహ్వానముపై "రాజమహేంద్రవర దేశపాఠశాలా సమాజ" ప్రారంభోత్సవమున నొసగినది. ఇదియే వారి యుపన్యాసరచనకు ప్రారంభము. ఈ సందర్భమున మన మానాటి దేశకాల పరిస్థితులను కొంత తెలిసికొనవలసి యున్నది. ఇప్పటివలె నాకాలమున సభలు, సమావేశములులేవు. ఉన్నను నవి ప్రజాసామాన్యమున కందుబాటులోలేని పండిత పరిషత్తులు ప్రభువులయాస్థానములు మాత్రమే క్రీ.శ. 1857లో చెన్నపురి విశ్వవిద్యాలయమేర్పడినది. ఆంగ్లేయభాషాద్వారమున నున్నత విద్యాశిక్షణయేగాక, దేశభాషలలో గూడ నుత్తమ సాహితీసంప్రదాయకమగు విద్య గఱప బడుచుండెడిది. పాశ్చాత్యసంస్కృతి, నాగరకత, సంస్కారములను గ్రహించిన యాంగ్లేయ భాషాధురంధరులగు నాంధ్రయువకులకు, కొంతవఱకు నింగ్లీషునేర్చి, యుద్యోగస్థులైయుండు పెద్దలకు మన ప్రాచీనసంస్కృతి, మన మతసాంఘికపరిస్థితులు, మన సాహితీ విశిష్టత తెలుసుకొనుటకు నాకాలమున నొక నూతనావేశము సంఘమునందు బయలుదేరినది.

ఇట్టి యభివివేశము గలిగినను, నప్పటి ప్రభుత్వకార్యస్థాన విద్యాశాఖాప్రజా శికలనుబట్టి, యట్టివారందఱు నొకచో సమావేశమై, ఒక నియమితకాలములో, తామెఱుగగోరు విషయములను గ్రహించుటకు నగుపగు పరిస్థితులేర్పడలేదు. అట్టి సమావేశములు జరిగినను, విషయముల నెఱుకపఱుచువారు, ప్రాచీన పండితులే యగుటచేతను, వారైనను, పాండిత్యప్రకర్షను ప్రకటించు పత్రికల నొకరికొకరు వ్యక్తిపరముగ వ్రాసికొనుచు వాదముచేయుటతప్ప, ప్రజాసామాన్యమున కనువగురీతిని ప్రాచ్యవిజ్ఞానమును ప్రచారముచేసి సాంఘికోత్తేజమును గలిగించువారు లేరైరి. కాని మన విజ్ఞానమంతయు నట్టి పండితులయధీనమందుటచేతను, సంస్కృతిభాషలోనుండు మూలగ్రంథములనుచదివి యర్థముచేసికొని, విషయగ్రహణము చేయువారి సంఖ్య యత్యల్పముగ ననగా వేయిమందిలో నొక్కరికైన లేకుండుటచేతను, నాగ్రంథములైన నందఱికి సులభముగా లభింపకపోవుటచేతను, నట్టిప్రాచీనపండితులే యీసమావేశములకు నుపన్యాసములకు మూలపురుషులు కాదగిన పరిస్థితి యేర్పడినది.

క్రీ.శ. 1870 లో నీసమావేశోపన్యాస మహోద్యమమునకు మార్గదర్శకులైన మహాపండితు లిరువురు. ఒకరు విశాఖపట్టణ వాస్తవ్యులు, పండితమండలాఖండలులు, ప్రథమమహామహోపాధ్యాయబిరుదాంకితులు, పరవస్తు రంగాచార్యులుగారు. రెండవవారు మదరాసు వాస్తవ్యులు, పండితాగ్రేసరులు, ద్వితీయమహామహోపాధ్యాయబిరుదాంకులు, బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు! ప్రాచీనరీతిగా పండితులు వ్రాసికొను పత్రికావాదములను విరమింపజేసి, సభల నేర్పాటుచేసి, నియతోపన్యాసములను నిచ్చుపద్ధతి మొదట చెన్నపురిలోనేకాక, యావదాంధ్రదేశమున నిల్పినకీర్తి వేంకటరత్నముపంతులు గారిది. వారు చెన్నపురిలో "హిందూశ్రేయోభివర్ధనీసభ" అను నొక సభనేర్పాటుచేసి, ప్రతి పదునైదు దినములకు, కళాశాలావిద్యార్థులను, నుద్యోగస్థులను, నియమితకాలమున వచ్చునట్లుచేసి, తాముపన్యాసములు చేయుచుండెడివారు. విశేషమేమన తెనుగురాని గొప్ప అఱవ, కన్నడపండితులను గూడ బిల్పించి, వారి యుపన్యాసములను తాము తెనుగులో చెప్పుచుండువారు. చెన్నపురిలోని యీసభ ప్రారంభమైన యొక యేడాదికి విశాఖపట్టణమున "ఆర్షమతసభ" స్థాపితమైనది. దానికి నియతోపన్యాసకులు రంగాచార్యులుగారు. వీరు ప్రత్యేకముగ క్రైస్తవమతప్రవాహము నరికట్టుటకు, హిందూమతోద్ధరణము కొఱకు, మనమతములను గూర్చియు, శ్రుతిస్మృతి

పురాణేతిహాసములగూర్చియు. సరియగు నభిప్రాయములు గలుగునట్లు చేసిన మహనీయులు. హిందూశ్రేయోభివర్ధనీ సమాజవృత్తాంతము లాకాలమున వేంకటరత్నముపంతులు గారిచే ప్రకటింపబడుచుండెడి 'ఆంధ్రభాషాసంజీవనీ' పత్రికయందు, ఆర్షసభావృత్తాంతములు 'సకలవిద్యాభివర్ధని' యను రంగాచార్యులవారి పత్రికయందు ప్రకటితములగుచుండెడివి. ఈ పండితు లిరువురు, ప్రాచ్యవిజ్ఞానము నుజీర్ణించుకొన్న విద్వాంసులగుటచేతను, ననమానమగు వాగ్ధోరణి కలవారగుటచేతను, ఉపన్యాసములు కొంచెము కఠినశైలినున్నను విద్యావంతులనందఱను నాకర్షించి, సమ్మోహితులుగ చేసిపైచెడివారు. ఆనాటి యుపన్యాసములధోరణి యెట్లుండిదో, శ్రీరాయసం వేంకటశివుడుగారు వ్రాసిన "వీరేశలింగ సంస్మృతి" అను గ్రంథములో 7 నుండి 10 పుటలవఱకు జదివిన తెలియగలదు. కాబట్టి ప్రారంభదినములలో నీ సభాసమావేశములు నుపన్యాసములును, వ్యక్తి వక్తృత్వ గౌరవములనుబట్టి కొంతవఱకు మాత్రమే సభ్యులకు జిజ్ఞాసాదోహదములను కలిగించెడివి.

సభాసమావేశములను, ఉపన్యాసములను, జాతీయాభ్యుదయమున కొక మహత్తరసాధనముగా పరిణమింపజేసిన దూరదర్శి వీరేశలింగముపంతులు. పంతులవారికి వక్తృత్వము లేదనుమాట సర్వజనవిదితము. అయినను వక్తృత్వమే ప్రధానముకాదనియు, నది పంచదారపానకమువలె నొకప్పుడు మాత్రమే ప్రయోజనకారియనియు, సర్వజనలభ్యమగు మంచినీటివలె సులభగ్రాహ్యమగు శైలిలో, విషయవిభజనము గావించి చెప్పిన యెంతక్లిష్టవిషయమైనను సభ్యులు గ్రహించి దానినిగూర్చి మననముచేసి, కార్యాచరణకు గడంగుదురని మొదట చాటి చెప్పినదీమహాశయుఁడే. పంతులవారి యుపన్యాసము లన్నిటియందు నీక్రింద వివరించిన లక్షణములు గన్పట్టును.

1. చెప్పవలసిన విషయములోని భావములను స్పష్టపఱచుటకు విషయవిభజనము గావించుట.
2 అక్షరజ్ఞానము గలవారి కెల్లర కందుబాటులో నుండు సులభమైన రచన గలిగియుండుట.
3. కఠినసంధులు, దూరాన్వయములు లేక రచన సరళత గలిగి మార్దవము గలిగి యుండుట.
4. సంస్కృతశ్లోకము లేవైన యుదాహృతములైనచో, వానిక్రింద తెలుగు తాత్పర్యము చెప్పుట.

5. వ్యవహారరీతిని భాషలో ప్రయుక్తమగుచున్న యన్యదేశీయములను తెనుగు సాంప్రదాయప్రకారము వాడుట.

6. జాతీయముల నౌచిత్యము పాటించి ప్రయోగించుట.

నాటికిని నేటికిని, పంతులవారి రచనను మించినరచన లేదనియే చెప్పవచ్చును. నవ్యయుగమునందలి ప్రపంచవిజ్ఞానము నీనాడు మనతెనుగుభాషలో ననువదించుటకు తగినరీతిగ వచనరచనను సంస్కరించి, దానికి స్థిరత్వము గల్పించి, తెనుగువారికి నూతనోజ్జీవమును ప్రసాదించినది వీరేశలింగమే।

ఈయుపన్యాసములు దిద్దితీర్చిన వ్యాసములవలెనుండి విద్యార్థులకు, విద్వాంసుల కెట్లు సుగమముగ విషయవిభాగము గావింపబడియున్నవో తెలుపుటకు, "విద్యాధురీణుల యర్థ్యకృత్యములు" అను మపన్యాసము నుండి యీక్రింది విభాగముల నిచ్చుచున్నాను.

"దేశక్షేమమునకై విద్యాధికులు చేయవలసిన కార్యములు మితిమీఱి యున్నందున వానినన్నింటిని వివరించుట శక్యముగాదు. వానిలోఁ గొన్నింటిని మాత్రమిందు పేర్కొని మిగిలినవానిని విడిచిపెట్టెదను. 1 వ్యవసాయవిషయము. 2 శిల్పాదికర్మలు. 3 ఆరోగ్యధర్మములు. 4 నీతివృద్ధి. 5 అతిబాల్యవివాహములు. 6 వితంతువివాహములు. 7 అపాత్రదానము. 8 స్త్రీ విద్యాస్వాతంత్ర్యములు."

ఈ సంపుటమున నుపన్యాసములను మూడువిధములుగా విభజింపవచ్చును. 1 మతము. 2 స్త్రీ పునర్వివాహవిషయము. 3 సాంఘికప్రవృత్తి. హిందూమతము, వర్ణము, జన్మాంతరము, విగ్రహారాధనము, వైరాగ్యము అనునవి మతసంబంధములైనవి. అతిబాల్యవివాహములు, రాజమహేంద్రవర స్త్రీ పునర్వివాహచరిత్రము; స్త్రీ పునర్వివాహవిషయకోపన్యాసము; స్త్రీ పునర్వివాహవిషయక ప్రథమ, ద్వితీయ ప్రవర్తకసమాజ విజ్ఞాపనములు; స్త్రీ పునర్వివాహశాస్త్ర సంగ్రహము, స్త్రీ పునర్వివాహ వ్యాపారభూతవర్తమాన పరిస్థితులు, వితంతువివాహమునకు సంబంధించినవి. అనాథ స్త్రీ బాలికల నుద్ధరించి, ఆంధ్రదేశమున సంఘమునకు నుత్తేజకరమగు సంస్కరణముకొఱకు తన జీవితసర్వస్వమంతయు ధారవోసిన వీరేశలింగముపంతులవారి యుపన్యాసములలో నీవిషయము ప్రధానస్థాన మలంకరించిన దనుట యతిశయోక్తి కాదు. వీరేశలింగము పంతులవారును, వారి సహచరులును నెన్నెన్ని శ్రమలుపడి, ఎట్టి దుష్కరపరిస్థితుల కెదురీది, యీమహోద్యమము జయప్రదముగ నడిపించినదియు, నీయుపన్యాసములు చదివిన దెటపడును.

మఱియు వీరేశలింగము పంతులవారి విజ్ఞానసంపత్తి, కార్యదీక్ష, మానసికధైర్య సాహసములు వీనిలో ప్రతివాక్యమునందును ప్రతిబింబించుచున్నవి. సత్కార్యా చరణమున నెట్టివిఘ్నములు వచ్చినను, స్థిరచిత్తముతో భగవంతుని నమ్మి, పరిశ్రమచేసిన ఘనప్రయత్నములు సర్వదా ఫలవంతములగునను సూత్రమును వారెల్లాచరణలో బెట్టి, తెనుగువారిని విశ్రుతకార్యోత్సాహకులుగ, దృఢవ్రతులుగ జేసినదియు నీయుపన్యాసములు తేటతెల్లము సేయుచున్నవి.

పరిశుద్ధాస్తిక మతతత్త్వమును ప్రబోధించుటకును, సాంఘికప్రవృత్తి యందు మార్పుగలిగించుటకును, ఈశ్వరదత్తపుస్తకములు, ఈశ్వరోపాసన, ప్రార్థన, జీవితపరమార్థము- దానిని పొందు మార్గము అను నుపన్యాసములు పంతులవారు చేసిరి. వివిధశాఖలుగా చీలి, భిన్నభిన్న భావములతోనున్న సంఘమును, జాతిమత వివక్షతలేకుండ, నందఱికి సమానహక్కుగల యేకేశ్వరారాధనమును వారిందు ప్రతిపాదించిరి. ఇట్లు పరమార్థమును సంఘము సాధించునట్లు చేయుటయే గాక, యైహికజీవితమును మానవుడెట్లు సమన్వయింప జేసికొన వలయునన్న యాదర్శముగూడ ఫలోన్ముఖమగునట్లుగా, స్వయంకృషి, కాయకష్ట కర్మలు, ఐకమత్యము, మానుషధర్మములు, విద్యాధికుల ధర్మములనిందు పంతులుగారు వివరించినారు.

రాజకీయ సంస్కరణముల కర్హులమగుటకు సంఘసంస్కరణము మొదట కావలయును. ఈనాడు రాజకీయముగ మనకు గలిగిన స్వాతంత్ర్యమునకు మన సంఘ మర్హతగడించిన దన్నచో నది వీరేశలింగముపంతులువారి సంఘసంస్కరణ మహోద్యమ ఫలితమే యని ఘంటాపథముగ చెప్పనొప్పును. విద్వాంసులకే గాక విద్యార్థులకు పండితులకేకాక, పామరులకు, స్త్రీలకేకాక పురుషులకు, వేయేల? సర్వాంధ్రజనులకు నవశ్యపఠనీయములైన యిట్టి యుపన్యాససంపుటమును బ్రకటించిన హితకారిణీసమాజ కార్యదర్శులు శ్రీ దంగేటి నారాయణ స్వామిగారిని బ్రశంసించుచు నీ పీఠికను ముగించుచున్నాను.

మదరాసు,
1-1-1951.

నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.,
మద్రాసు విశ్వవిద్యాలయాంధ్రభాషా శాఖాధ్యక్షుఁడు.



కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు.

# విషయసూచిక

# జన్మాంతరము.



ప్రియమిత్రులారా:

కడచిన శనివారమునాఁటి రాత్రి నే నిక్కడ జేసిన యుపన్యాసమునందు జీవునకుఁ బునర్జన్మ ముండునా యుండదా యను విషయమునుగూర్చి మఱియొకనారి ప్రసంగించెద నని సూచించి యుంటినిగదా? ఈవిషయమునను వివిధమతములు వివిధముగా బోధించుచుండుటయు స్వవాదోపబలార్థముగా నానామతములవారు విశేష ప్రయాసపడి తమబుద్ధి సంపదను వినియోగపఱిచి బహుహేతువులను గల్పించి స్వసిద్ధాంతస్థాపనము చేయ గడఁగియుండుటయు, అందఱు నెఱిఁగియున్నయంశమే కాని యెఱుఁగనిసంగతి కాదు. అట్లు దీర్ఘపరిశ్రమము చేసి పుస్తకములను వ్రాసియున్న బుద్ధిమంతులలో నొక్కరితోనైనను నే నీవిషయమునను సమానుఁడను గాఁ బోవుటయు విను ర్యసియమయిన యీ మహావిషయమునందు నిర్దోషమయినసిద్ధాంతమును దేల్చుట పండితులకుసహితము సులభసాధ్యము కాకపోవుటయు నెఱిఁగినవాఁడ నయ్యును, పండితులబుద్ధికిసహితము గోచరముగానియంశ మొకానొకప్పుడు చదువ నెఱుఁగని బాలునిమనస్సునకు స్ఫురించుట కలదుగనుకను నావాక్యము లొకవేళ సహేతుకములుగాఁ గనఁబడి మహాజనులను రంజింపఁ గలుగునేమో యనుభ్రాంతి నాహృదయమును బాధించుచున్నందునను సంకోచము మాని యీవిషయమున నాకుఁ గలయభిప్రాయమును నేఁడు మీకడఁ దెలుప సాహసించుచున్నాఁడను! నాప్రసంగము నంతను మీరు సావధానముగా విని యెదుటివాదముమీఁద నేను జేయు పూర్వపక్షములను నాసిద్ధాంత

మును స్వాతముగాఁ బరిశీలించి నావాదము మీహృదయములకు సారవంతముగాఁ గనఁబడినపక్షమున నంగీకరించి యాదరింతురుగాక! ఈవిషయమున నన్యదేశీయులమతము లెల్లను భిన్నాభిప్రాయములు కలవిగా నున్నను, మనదేశమునం దున్నమతము లన్నియు నైకకంఠ్యముగా జీవాత్మకు జన్మపరంపర కలదని నొక్కి ఘోషించుచున్నవి. పునర్జన్మ మెప్పుడును ప్రత్యక్షమగునది గాదుగనుకను కనఁబడునది లేవని యెప్పుడును ననుమేయము గనుకను, ఎవ్వరు పునర్జన్మ మున్నదని వాదింతురో వారిమీఁదనే తమ పక్షమును స్థాపించుకొనవలసిన భారమంతయు నొఱిగి యుండును. కాఁబట్టి యిప్పుడు ఋజువుచేయవలసినబాధ్యత పునర్జన్మము కలదనువారిదిగాను, వారియుక్తులపై ప్రతియుక్తులు చెప్పి వారివాదమును ఖండించి తమవాదమును సహేతుకముగా స్థిరపఱుచుకొనవలసినబాధ్యత పునర్జన్మము లేదనువారిదిగాను నేర్పడును. మనమిప్పు డుభయపక్షములవారికిని గల యాక్షేప సమాధానములను నిష్పాక్షికబుద్ధితో విమర్శించి గుణదోషముల్ యెఱిఁగి బాహుళ్యమును సయుక్తికము నని తేలిన పక్షమును జేకొందము.

సత్యమును గనుఁగొనవలె నన్నచో, భగవంతునిస్వభావమును బట్టి చూడఁగా, నతఁడు జన్మపరంపరలను జీవులకుఁ గలిగించు నని నమ్మఁదగియున్నదా, పూర్వోత్తరజన్మములు జీవులకుఁ గలవని స్థిరపఱుచుటకుఁ జాలినంత బలమయినహేతువు లేమియున్నవి, పూర్వోత్తరజన్మములున్నవని నమ్ముటవలన లోకమునకు లాభముకలుగునా నష్టముకలుగునా, లేవనిచెప్పుటకు గల ప్రబలహేతువు లేవి, జన్మాంతరములు లేవనుకొనుటవలనఁ బ్రజలయోగక్షేమాభివృద్ధికి హాని సంభవించునా పుష్టి కలుగునా, యను నంశములను మొదట విచారింపవలయును.

౧. ఈశ్వరునికరుణాళుత్వమును బట్టి చూచినను, అపరిమిత బుద్ధిసంపదనుబట్టి విచారించినను, న్యాయైకశీలతనుబట్టి విమర్శించి నను జీవాత్మల కతఁడు జన్మపరంపరలను గలిగించునని యూహించుటకు లేశమయినను నవకాశము గనఁబడదు. జీవుఁడు పూర్వజన్మముసందుఁ జేసినకర్మలకయి యాతనిని శిక్షించుటకొఱకే కదా యీశ్వరుఁడు జన్మపరంపరలను గలిగించినాఁడని మతవారందఱును జెప్పుదురు. భగవంతుని నీతిస్వభావమునుబట్టి విమర్శింపఁగా నతఁ డట్టి శిక్షను విధించునని మందబుద్ధికైనను తోఁచదు. దండార్హుని కుత్తముఁడయినప్రభువు చేయుశిక్ష యెప్పుడును దోషి తా నీ నేరమును జేయఁబట్టి తనకీశిక్ష కలుగుచున్నదని తెలిసికొని ముం దట్టియపరాధమును జేయుటకు వెఱచి బుద్ధితెచ్చుకొని పాటుపడుటకును, అట్టి దుర్మార్గులకుఁ గలుగుచున్న దండనమును జూచి యితరులు తా మెన్నఁడు నట్టి యకార్యకరణమునకు సాహసింపక పాపభీతులై యుండుటకును, అనుకూల మైనదిగా నుండును. అట్లుగాక శిక్ష పగదీర్చుకొనునుద్దేశముతోనే చేయఁబడుచున్నట్టు కనఁబడినను, ఏనేరముకొఱకు శిక్ష విధింపఁబడినదో తెలుపఁబడక పోయినను, ఎల్లవారలహృదయములకు శిక్షను విధించుప్రభువు దయాశూన్యుఁడు గాను కార్పణ్యస్వభావుఁడుగాను పొడకట్టును. ఈజన్మమునందుఁ బొందెడియాపదలను వ్యాధిబాధలును పురాకృత కర్మఫలములే యందురేని, పూర్వజన్మమునం దేదోషమును జేయఁబట్టి తనకవి సంప్రాప్తమయినవో యెఱుఁగుట కెవ్వనికిని సాధ్యముకాదు. కాఁబట్టి యట్టి శిక్షవలన నేమియుఁ బ్రయోజనము కలుగకపోవుటయేకాక మీఁదుమిక్కిలి జను లట్టిశిక్ష విధించినయీశ్వరుఁడు క్రూరస్వభావుఁ డని భ్రమించుటకును గారణ మగుచున్నది; అట్టి శిక్షవలన దోషియైన బుద్ధి తెచ్చుకొని పశ్చాత్తాపపడి తనప్రవ

ర్తనమును క్రమపఱుచుకొనుటకును వీలు కలుగదు; ఇతరులు సాధు
వర్తనము కలిగి మెలఁగుటకును ప్రోత్సాహము కలుగదు. ఈలోకము
నందు సహితము మనలో నెవ్వరినో యొకరిని రాజభటులు పట్టుకొనిపోయి
మన మీనేరమును జేసితి మని దానిస్వభావమును దెలుపకయు నితరులు
దెలిసికొనుట కవకాశము గలిగింపకయు మనలను గొన్నిమాసములు
కారాగృహమున నుంచి నిర్బంధించి విడిచిపెట్టినచో మన నాఁటి
ప్రభుత్వమువారిని క్రూరులని భావింతుమే కాని మనము పూర్వ మెన్నఁ
డో నేరము చేసినందునకు శిక్షించియుందురని యెంచనైనఁ
దలఁపము; ప్రజలును వారిని క్రూరులని దూషింతురు. ఇది యిట్లుం
డఁగా భగవంతుఁడే నిజముగా పూర్వకృతకర్మమునకు శిక్షగా
జన్మము కలుగఁజేసి యంధత్వము మొదలయిన యంగహీనత్వమువల
నను దీర్ఘరోగములు మొదలయిన కష్టములవలనను శిక్షించు ననెడు
పక్షమున, శిక్షను బొందువారికి తమనేరముయొక్క స్వభావమును దెలు
పకుండ శిక్షించుచున్నందున క్రూరుఁ డనియు, స్వల్పదోషములకయి
కాళ్లు చేతులు మొదలయిన వికటీకరించి మనుష్యులను నిరుపయోగులను
గాఁజేయు క్రూరదండనలను విధించు దుష్టరాజులవలెనే కన్ను కాలు
మొదలయిన యవయవములకు భంగము కలిగించుచున్నందున ద్వేషైక
ప్రధానుఁడనియు, దోషనివారణమునకయి యుపచరింపనిశిక్షను
విధించుచున్నందున దూరాలోచనయు బుద్ధిసంపదయు లేనివాఁడనియు
ఎందునకు శిక్షించుచున్నాఁడో యితరులకుఁ దెలియకుండ మఱుఁగు
పఱుచుచున్నందున న్యాయబుద్ధిగలవాఁడు కాఁడనియు, భగవంతునిం
జెప్పవలసి వచ్చును. అయినను లోకములోని యాస్తికమతములవా
రందఱు పరమేశ్వరుఁడు సర్వకారుణ్యుఁడనియు రాగద్వేషరహితుఁ
డనియు సర్వజ్ఞుఁడనియు నపరిమితబుద్ధిమంతుఁ డనియు ధర్మస్వరూపుఁ

డనియు నైకర్తవ్యముగా నొప్పుకొనుచున్నారు. కాబట్టి జీవాత్మలకు జన్మపరంపరను గలిగించు ననుట యీశ్వరుని స్వభావమున కెంతమాత్రమును బొసఁగి యుండదు.

౨. ఇఁక జీవాత్మలకు బహుజన్మములు కలవని సాధించుట కయి చూపెడు హేతువుల బలాబలములనుగూర్చి కొంత విచారింతము. పూర్వజన్మకర్మము నంగీకరింపని పక్షమున లోకమునందలి జనులలోఁ గల స్థితిభేదములకును, కొందఱు బీదవారుగాను కొందఱు ధనికులుగాను, కొందఱు రాజులుగాను, కొందఱు సేవకులుగాను, కొందఱు తెలివిగలవారుగాను, కొందఱు తెలివితక్కువవారుగాను, ఉండుటకును హేతువులేక పోవునని యనుచున్నారు. జీవదయాపరుఁడయిన పరమేశ్వరుఁడు మానవులయొక్కయు అభివృద్ధికొఱకునే ప్రపంచములో స్థితిభేదములను గల్గించి యున్నాఁడు. అట్టి స్థితిభేదములు లేకపోవునేని లోకములో నెవ్వరికిని సుఖసంతోషములు కలుగవు. ఈ లోకమున వేలువేలు స్థితులవలననే మనకు భగవంతుని యందు భక్తియు బుద్ధియు దయాళుత్వమును మతింప నెల్లడి యగుచున్నవి. స్థితిభేదములు లేక యందఱును నొకరీతివృత్తి గలవారును, ఒకరీతిబుద్ధి కలవారుగాను నుండు రేని యందఱును నసౌఖ్యమునే పొందవలసి యుండుటచేత లోకవృత్తమే నడవక పోవలసివచ్చును. ఎట్లనఁగా నందఱును మహారాజులుగానే యుందురనుకొందము; అందఱును సింహాసనములమీఁదనే కూరుచుండి మహారాజభోగము ననుభవించువారే యగుదురేని, వ్యవసాయముచేసి ధాన్యాదులను పండించువారు లేక యందఱును నచిరకాలములోనే పస్తుపడి చావవలసి వచ్చును; అందఱును కృషిచేసి ధాన్యాదులను పండించువారే యగుదు రేని, ఇతరవృత్తులు చేయువారు లేమింజేసి మంచిబట్టలు, లేక చలిచేతను

ఎండచేతను బాధపడవలసినవారును, గృహములు కట్టువారు లేక బయల నివసించి పెక్కుకష్టములకు లోనుగావలసినవారును నగుదురు. ఈప్రకారముగానే జను లందఱు నేదైన నొకవృత్తినే ప్రత్యేకముగా నవలంబించువా రగుదు రేని యొక్కరును సుఖపడరు ; స్థితిభేదము లుండి యందఱు నన్నివ్యాపారములయందును బ్రవర్తించుచుఁ బరస్పర సహాయులగుచుండుటంబట్టియే యందఱును సుఖించు చున్నారు. కాఁబట్టియే ప్రపంచముయొక్క- క్షేమముకొఱకుఁ గొందఱు సేద్యము చేయువారుగాను కొందఱు బట్టలు నేయువారుగాను, కొందఱు పనిముట్లు చేయువారుగాను, కొందఱు కూలిపని చేయువారుగాను, కొందఱు జనుల కన్యాయము సంభవింపకుండఁ గాపాడువారుగాను, ఈవిధముగానే మఱియు బహువిధ వ్యాపారములు గలవారుగాను, ఉండక తప్పదు. ఇందుచేతనే భూమిమీదఁ గొందఱు రాజులుగాను, కొందఱు కాపులుగాను కొందఱు యజమానులుగాను, కొందఱు సేవకులుగాను, నానావిధ తారతమ్యములు గలవారుగా నుండుట యావశ్యక మయినది. అట్లుండుటవలననే యిరుదెఱఁగులవారికిని గూడ సౌఖ్యమును సంతోషమును గలుగుచున్నవి.—ఎట్లనఁగా నడవవలసిన ప్రయాస మక్కఱలేకుండఁ బల్లకిలో నెక్కి గ్రామాంతరము పోఁగలిగినందుకు ధనికునకును తిండికి శ్రమపడ నక్కఱలేకుండఁ గూలి దొరికినందుసకై పల్లకిని మోచిన బీదవాఁడ్రకును గూడ సుఖమును సంతోషమును గలుగుచున్నవి. కాఁబట్టి యీస్థితిభేదములనుబట్టి దేవుఁడు పక్షపాతియని గాని పూర్వజన్మ మున్నదని కాని యూహించుటకు మాఱుగా, మన క్షేమలాభములకొఱకే వానిని గల్పించెఁగదా యని యానందమునుబొందుచుఁ గృతజ్ఞతతో జీవదయాపరుఁ డయిన యీశ్వరుని స్తుతింపవలసియున్నది. మఱియుఁ గొందఱు

ధనికులుగాను కొందఱు దరిద్రులుగాను ఉండుటనుగూర్చి యించుక విచారింతము. అందఱు నేకస్థితియందే యుండుట నష్టకరమని యీవఱకే చెప్పియున్నాను గనుక, కొందఱు ధనవంతులుగాను కొందఱు ధనహీనులుగాను నుండవలసి యుండుటయే యావశ్యకము. అయినను ధనమువలనఁగాని యీలోకమునందలి యేయితరపదార్థసంచయము వలనఁగాని మనకు కలుగవలసిన ప్రయోజన మంతయు సౌఖ్యమేకాని యంతకంటె నధిక మేమియు లేదు. కాఁబట్టి యేమనుష్యునకుఁగాని తన సౌఖ్యమునకుఁ గావలసినదానికంటె నధికముగా ధనాదులు కలుగుటవలన లేనివారికి సాహాయ్యము చేయుటచే, గలిగెడు సంతోషము తప్ప వేఱుప్రయోజన మేదియు లేదు. సర్వసముఁడయిన భగవంతుఁడు పాటు పడుటకుఁ దగినయవయవముల నందఱికిని సమానముగా ననుగ్రహించి యున్నందున, ఎల్లవారును వాని నుపయోగించుకొని పాటుపడవలయు ననుటయే భగవదుద్దేశ మయినట్టు కరతలామలకముగాఁ గనఁబడుచున్నది. అట్లు దేహము వంచి పాటుపడినచోఁ దనసౌఖ్యముకొఱకును భార్యాపుత్రాదుల సౌఖ్యముకొఱకును గావలసినంత ధనమును సంపాదించుకో లేనివాఁ డెవ్వఁడును నుండఁడు. మనదేశములో నొకఁడు పాటుపడి సంపాదించుచున్నచో వానిని నాశ్రయించుకొని సోమరు లగుబంధువులు పలువురు జీవించుచుండుటవలనను, పాటుపడుట తమగొప్పతనమునకుఁ దగినపని గాదనియు నుద్యోగములు చేయువారు తామిబ్బంది పడియైనను ధనాదిదానములు చేసి గౌరవపఱిచి తమకు సుఖజీవనము గలుగఁజేయుట కయి బద్ధులయి యున్నా రనియు నమ్మెడి యొక తెగవారు యాచ్ఞావృత్తిచే నితరులమూలముననే జీవనము చేయుచుండుటవలనను, ఈదేశమున బీదలసంఖ్య యంతకంత కధిక మగుచున్నది. దేహదార్ఢ్యము కలవా

రయ్యును పాటుపడకయు జూదము మొదలయిన దుర్వ్యాపారములయందుఁ ప్రవేశించి ధనమును పాడుచేసికొనియు బీదలయి యన్నవస్త్రాదులకు లేక కష్టపడువారు భగవదాజ్ఞ నుల్లంఘించి కష్టములను స్వయంకృతాపరాధమువలననే తెచ్చిపెట్టుకొన్నవా రగుదురుగనుక వారిస్థితిని జూచి మన మంతగాఁ బరితపింపవలసిన పని లేదు; అట్లు చేయుటలో భగవంతునిదోషమును లేదు. పాటుపడువారు నిజదారసుతోదరపోషణమునకును సౌఖ్యమునకును వలయునంత ధనమును సంపాదించుకొఁగలవారే యగుదురుగనుక వారు విశేషవిత్తవంతులు కాకపోయితిమిగదాయని విచారింపవలసిన పని లేదు. భాగ్యవంతులకు బీదలకంటెఁ గొన్నివిషయములలో నధికసుఖ మున్నను వారికిఁ గలబాధ్యతలును కష్టములును గూడ బీదలకంటె నధికముగానే యుండును. కాఁబట్టి మొత్తముమీఁద ధనికులకును దరిద్రులకును సుఖదుఃఖములు సమానముగానే యుండును. ధనవంతులు కష్టపడకయే సుఖజీవనము చేయవచ్చును. బీదలు కష్టపడినఁగాని సుఖజీవనము చేయఁజాలరనకొంద ఱన వచ్చును. కానిసర్వసముఁ డయినపరమాత్ముఁ డెల్లవారును పాటుపడిననే సుఖమనుభవింపవలసినవారయినట్లు నిర్ణయము చేయుచున్నాఁడు. దేహపరిశ్రమ లేక యింటఁ గాలు కదలుపక కూరుచుండి స్థూలకాయు లయియుండుధనవంతులే పాటుపడెడుబీదలకంటె నధికసుఖపడుచున్నా రని యనుకొనుచుండుట వట్టిభ్రమయే కాని వేఱు కాదు. ధనవంతులకు భక్షించుటకు పంచభక్ష్యపరమాన్నములును గలిగియు దేహకష్టము లేకపోవుటచేత నేది భుజించినను జీర్ణముకాక వారు బలహీను లయి బాధపడు చుందురు; ఎంతబలమయినయాహారపదార్థములను దిన్నను దానిసారమును గ్రహింపఁజాలక యారోగ్యదూరు లగుదురు; నాలుగడుగులు నడచిన నాయాసపడుదురు; తఱుచుగా

సంతానహీనులును నల్పాయుష్కులును నగుదురు. బీదవాండ్రు భక్షించుటకు మంచిపదార్థములు లేకపోయినను పాటుపడుటచే తిన్నగా రక్తప్రసారణము గలిగి దృఢకాయులయి యుందురు; గంజి త్రాగినను దానిసారమును గ్రహించి పూర్ణారోగ్యదశను గాంచి యుందురు; దినమునకు నాలుగామడ లైనను దిట్టముగా నడవఁగలిగి యుందురు; సాధారణముగా సంతానవంతులును దీర్ఘాయుష్మంతులును నగుదురు. కాఁబట్టి నిజమయినసౌఖ్య మంతయు దేహపరిశ్రమమును బట్టియేయుండును. ధనరక్షణాదికార్యములయందును గౌరవవాంఛాదుల యందును ధనికులకే బీదల కెప్పుడును నుండనివిశేషకష్టము లుండును. బీదవాని కెవ్వరైన నాలుగుడబ్బు లిచ్చిన వాఁడు పరమానందభరితుఁ డగును; ఆనాలుగుడబ్బులనే భాగ్యవంతునిచేతిలోఁ బెట్టినఁ దన్నవ మానపఱిచినట్టు భావించి దుఃఖించును. పలువిషయములలో సాధారణులకు స్వల్పలాభమువలననే సంతోషము కలుగును; గొప్పవారికి విశేషలాభము సంభవించినంగాని కలుగదు. కాఁబట్టి మెట్టుమీఁద నిరువురకు సుఖసంతోషాదులు సమానముగానే యుండును. వివేకము లేనియెడలఁ దమకు సుఖించుటకుఁ జాలినంతధన మున్నను మఱింత లేకపోయె నని ఖేదము నొందెడి యొకానొక సామాన్యమానవుని వలెనే, యొకానొక ధనాఢ్యుఁడును కావలసినంత ధనముండియు నతి ధనాశచేత దాని ననుభవింప మనసు పుట్టక తిన్నగా తిండి యైనను దినక దరిద్రునికంటెను నధికముగా బాధ పడును. నిజముగా విత్త వంతుల కుండెడుకష్టము లన్నియుఁ దెలిసినయెడల వారిస్థితితోడ బీద వాండ్రు తమస్థితిని మార్చుకొనుటకైన నొప్పుకోక పోవచ్చును. పూర్వము సర్వాధికారముగల రాజులుసహితము కొందఱు కష్ట సమయములయందును కార్యభారమున మునిఁగియున్నప్పుడును తమ

స్థితిని దలఁచుకొని సామాన్యస్థితియందుఁ బుట్టకపోతిమిగదా యని సాధారణజనులస్థితి కాశపడినట్టు కొన్నిచరిత్రములు సాక్ష్య మిచ్చుచున్నవి. ఈపయిని జెప్పినదానినిబట్టి చూడఁగా నెల్లవారును నధికారము, రాజ్యము మొదలయినవానివలన సౌఖ్యమే కలుగునని యెదురు చూచినను, ఎల్లప్పుడును వానివలన సౌఖ్యమే కలుగక కొన్ని సమయములయందు దుఃఖముకూడఁ గలుగుననియు, బీదతనము సేవకవృత్తి మొదలగువానివలన దుఃఖమే కలుగునని పరీక్షించినను వానివలననే సౌఖ్యముకూడ గలుగు ననియు అందుచేత రాజైనను కాపైనను మొత్తముమీఁద తుల్యసుఖము నేయనుభవించుచుండు ననియు తేటపడుచున్నది గనుక, కొందఱిని రాజులనుగాను తక్కినవారిని కాపులనుగాను జేయుటచేత భగవంతునియెడల పాక్షికత్వ మున్నదని యూహించుట కవకాశము లేదని వేఱుగ వివరింపవలసిన యక్కఱయే లేదు. కాఁబట్టి యీయంశమును విడిచిపెట్టి కొందఱు తెలివిగలవారుగాను కొందఱు తెలివితక్కువవారుగాను నుందు రన్న విషయమునుగూర్చి కొంత చర్చింతము. పూర్వోక్తములైన స్థితిభేదములు లోకముయొక్క క్షేమాభివృద్ధికయి యెట్లవశ్యముగా నుండవలసియున్నవో యట్లే తెలివియందును తారతమ్యము లవశ్యముగా నుండవలసియే యున్నవి. అట్లుగాక యందఱును విశేషబుద్ధిశాలులయి కవిత్వము చెప్పువారే యైనను, గణితశాస్త్రప్రవీణులయి యసాధ్యములయిన లెక్కల నాలోచించి చేయుచుండువారే యైనను, మఱి యేయితరవిషయములలోనైన నొకదానిలోనే పూర్ణముగా వ్యాపించుబుద్ధి గలవారయినను తక్కినవిషయము లన్నియు పాడుపడి యెవ్వరికిని సుఖము కలుగక పోవచ్చును. కాఁబట్టి లోకహితార్థమే పరమేశ్వరుఁడు కొందఱిని గణితాదిశాస్త్రములయందు వ్యాపించుబుద్ధి

గలవారినిగాను, కొందఱిని ప్రకృతిశాస్త్రములయందుఁ బ్రకాశించు బుద్ధి గలవారినిగాను, కొందఱిని జనులవేడుకకొఱకు నుపయోగించు కవిత్వాదులనురచింప శక్తులనుగాను, కొందఱిని మతబోధ చేయుటకు సమర్థులనుగాను, కొందఱిని చమత్కారముగా మాటాడఁగలుగు వారినిగాను, నానావిధముల నానావిషయములయందు బుద్ధి వ్యాపించు వారిని సృజియించి యున్నాఁడు. కొంద ఱెంతకాలము చదువుకొన్నను తిన్నగా చదువు రాకపోవుటయు కొందఱు శీఘ్రకాలములోనే పండితు లగుటయు సంభవించుచున్నదే దాని కేమి చెప్పగల రని మన వారు శంక చేయవచ్చును. మనకు ముఖ్యముగాఁ గావలసినవి యుక్తా యుక్తములను దెలిసికోఁదగినజ్ఞానమును లోకకార్యములను జక్కఁగా నడుపుటకై కావలసినవ్రాఁతయు లెక్కలును నేర్చుకోఁగలుగుటయు; కష్టపడిచదువుకొన్న పక్షమున నంతవఱకు రానివాఁ డెవ్వఁడునుండఁడు; ఇహపరలోకసుఖముల కయి యంతవఱకే చాలియుండును. భగవంతుఁ డందఱును విద్యాజీవనమే చేయవలయునని యుద్దేశించలేదు గనుకను, అందఱును విద్యాజీవనమునకే చొచ్చినచో నెవ్వరికిని సుఖము కలుగ నేరదు గనుకను, విద్య చురుకుగా రానివారిబుద్ధిని సంగీతమునందుఁ గాని శిల్పములయందుఁగాని, కృషివాణిజ్యాదులయందుఁగాని, జనోప యుక్త మయినమఱియొక వ్యాపారమునందుఁగాని వ్యాపించునట్లుగా నీశ్వరుఁడు కటాక్షించి యున్నాఁడు. గొప్పబరువు మోయువాఁడు కవిత్వము చెప్పుట కెట్లు పనికిరాఁడో యట్లే గొప్పకవీశ్వరుఁడును శరీరదార్ఢ్యమును మోటుతనమును గావలసినపనులకు పనికిరాకుండును. అయినను లోకమునకు కవీశ్వరుఁ డెంతయావశ్యకమో భారవాహియు నంతే యావశ్యకము. కాఁబట్టి బుద్ధిసంపదయందుఁగూడ తారతమ్యము తప్పక యుండవలెను. మనదేశములోమాత్ర మెవనిబుద్ధి యే

విషయమునఁ బ్రవర్తించునో వాడావృత్తియందుఁ బ్రవేశింపక, కొన్నివర్ణములవారు తమకు రాజకీయోద్యోగములే కావలయుననియు శరీర ప్రయాసమును గోరు కర్మలను చేయఁగూడ దనియు పట్టుపట్టి కూరు చుండుటవలనఁ గొంద ఱెందునకుం బనికిరానివా రగుచున్నారు. అది స్వయంకృతాపరాధమే యగుటవలన, మనుష్యులలోఁ గల బుద్ధితార తమ్యమునుబట్టి యీశ్వరునియందు వైషమ్య మారోపింపవలసి వచ్చు నని చెప్పుటకుఁగాని లేనియెడలఁ బూర్వజన్మ మొప్పుకోవలసివచ్చు నని చెప్పుటకుఁగాని యణుమాత్ర మయినను అవకాశము లేదు. లోకములో కొందఱు పుట్టుకతోనే గ్రుడ్డివారుగాను, చెవిటివారు గాను, మఱి యితరావయవములు లేనివారుగాను, అయి యుండఁగా మనము చూచుచున్నామే పూర్వజన్మకర్మము నంగీకరింపనిపక్షమున వారిస్థితి కేమి సమాధానము చెప్పఁగల రని మనవారు ప్రశ్న వేయ వచ్చును. ఈయంగహీనతలు వారికి స్వదోషమువలన వచ్చినవి కాక పోయినను, సంబంధదోషమునుబట్టి వచ్చినవిగాఁ గనఁబడుచున్నవి. ఈలోకములోఁ గొందఱికిఁ గొన్నియాపదలు పరస్పరసంబంధము వలననే సంభవించుచున్నవి. ఈశ్వరశాసన మొక్కని విషయ మయి యెప్పుడును మాఱ్పు చెందునదికాదు గనుకను, మన సుఖాభివృద్ధి కయి యన్యోన్యసంబంధ మవశ్యముగాఁ గావలసి యుండును గనుకను, అట్టియవస్థ లప్పుడప్పుడు సంభవింపక తీరదు. ఎట్లనఁగా పాషాణము పొరపాటున నైనను గొంతుకలో పడినపక్షమున దోషిని నిర్దోషిని నేకరీతిగానే మరణము నొందించును. నిప్పంటించిన మంచియోగ్యుని యిల్లును దుర్మార్గునియిల్లును నేకరీతిగానే కాలును. ఆప్రకారముగానే జననీజనకుల కుండుజబ్బుచేతనో, పిండోత్పత్తిసమయమునందు సంభ వించెడి యే యితరదోషమువలననో కొందఱి కంగలోపములు కలుగు

చున్నవి. వ్యాధులవిషయమయియుఁగూడ మనవా రిటువంటిప్రశ్నమునే చేయవచ్చును. సాధారణముగా రోగములు మన శరీరారోగ్యవిషయ మయినవిధులను మీఱుట నడుచుటవలననే సంభవించుచున్నను, తల్లి దండ్రులు సుఖవ్యాధులు కుష్ఠరోగములు మొదలయినవి కలవా రైరేని వారిసంతతివారి కిటువంటిరోగములు వంశపరంపరగా వచ్చు చుండుటయుఁ గలదు. ఈరెండువిషయములునుగూడ పూర్వజన్మ మున్న దని సాధించుట కెంతమాత్రమును సమర్థములు కావు. అయినను గుడ్డితనము మొదలయిన వెక్కడనో యరుదుగా వేయి మందిలో నొక్కనికి వచ్చునవియే కాని బాహుళ్యముగా వచ్చునవి కావు. అప్పుడుసహిత మటువంటి యంగవైకల్యమువలన సుఖా భావము కలుగకుండుటకయి దయాస్వరూపుఁడయిన యీశ్వరుఁడు సాధనములను ప్రసాదించియే యున్నాఁడు. ఈయొక్క యంగవైకల్య ముల విషయముననేకాక తక్కిన యన్ని యాపదలలోను దుఃఖ శాంతి శీఘ్రముగా కలుగుటకయి భగవంతుఁడు తగిన యేర్పాటు లను జేసియున్నాఁడు. ఆపద వచ్చినదినమునకంటె మఱునాఁడు కొంత తగ్గిపోవును; ఈప్రకారముగా దినదిన క్రమమున కష్టము యొక్క క్రౌర్యము తగ్గుచువచ్చి యనుభవించువారికి సాధారణ ముగా జను లనుకొనువానిలో షోడశాంశమయినను బాధయుండదు; మిత్రసందర్శనాదులవలన సగమాపద తగ్గిపోవును; తనకంటెను హీన స్థితియందుండు వారితోఁ దన్ను పోల్చుకొనుటచేతను ధైర్యముచేతను పోవచ్చునన్న యాశచేతను బాధలో విశేషభాగము తోఁచక పోవును. ఇంతేకాక లోకములో సుఖదుఃఖములు మనుష్యులస్వభావ ము ననుసరించియుండుటనేకాని జనులనుకొనురీతిగా నుండవు. కొందఱు మనుష్యులు ధనాదులలేమివలననే మనస్సులకు స్థిరత్వమును తృప్తి

యును గలిగి సుఖించుచు తమకు ధనికులస్థితి నెప్పుడును గలుగఁ జేయ కుండుటకై యీశ్వరుని ప్రార్థించుచు నెమ్మదితో నుందురు; కొందఱు తమకధికారాదులు పట్టకపోవుటయే మేలని యెంచుకొనుచు రాజకీయోద్యోగములన్న నేవగించుచు, అట్టివి తమకు తటస్థించినను నిరాకరించి స్వేచ్ఛగానుండి సుఖింతురు; కొంద అంధత్వాదులు కలిగి నను, అట్టివి కలుగఁటకూడ తమకు క్షేమకరమేయని భావించుకొని తమకాలమును లోకోపకార కార్యములయందు వినియోగించుచు సుఖపడుదురు; కొందఱు సత్ప్రవర్తనము గలిగి లోకములో నెన్ని యాపదలువచ్చినను నెందఱెన్నివిధముల బాధపెట్టినను లక్ష్యము చేయక సత్కార్యాచరణముచేతనే సుఖింతురు. మఱియు తమకున్న యధికారమును, ధనమును, ఇతరసంపదలను భార్యాదిభోగములను బుద్ధిపూర్వకముగా వదలివేసి సన్యాసు లయ్యును విరాగు లయ్యును భగవంతుని నారాధించుచు స్థిరమయిన యానంద మనుభవించు వారిని మన మెందఱిని జూచుచున్నాముకాము? కాఁబట్టి సుఖదుఃఖ ములు వారివారి మనోరీతి ననుసరించి యుండును. ఇందుమీఁద భగ వంతుఁడు సర్వసమఁుడుగదా పూర్వజన్మమే లేనియెడల నీలోకములో పాపమును, మనుష్యాదులయందు లోపములను బాధలను నెందుకుఁ జేసెనని యాక్షేపణము చేయవచ్చును. పాపమనిడిది యొకటి ప్రత్యే కముగా లేదు. వెలుతురుయొక్క యభావ మేప్రకారముగా చీఁకటి యనఁబడునో యదేప్రకారముగా పుణ్యముయొక్క యభావమే పాప మగును. మనము సృష్టింపఁబడినవార మగుటచేతను, మన మీశ్వ రులము కానేరము గనుకను జ్ఞానాదులయందంతకంతకు వృద్ధి నొందు వారమే యయినను మనము పరిపూర్ణుల మగుటమాత్ర మెన్నటికిని సంభవించదు; కాఁబట్టి మన కెప్పుడును కొన్నిలోపము లుండక

తప్పదు. మనకు లోపము లుంచుట యనివార్యమే గనుకను, మన కీశ్వరుఁడు స్వాతంత్ర్యమును దయచేసి యున్నాఁడు గనుకను మనమే భగవదాజ్ఞనుమీరుటచే పాపులమయి కొన్ని బాధలకు లోనగుచుందుము. మనక్షేమాభివృద్ధికై యప్పుడప్పు డాపదలుకూడ నుండుట యావశ్య కమని దూరాలోచన గలబుద్ధిశాలు లనేకులు చెప్పుచున్నారు. మన కప్పుడప్పుడు వ్యాధులు లేకపోవునేని, ఆరోగ్యమువలని సుఖమును విలువను గ్రహింపలేనివార మగుదుము. బొత్తిగాదుఃఖము లేకుండు నేని, సుఖము వలన నానందమే కలుగదు; భగవంతుని మఱచిపోవు టయు దుర్మార్గమునకు వెఱవకపోవుటయు సంభవింపవచ్చును. ఎప్పుడు జ్ఞప్తికి రాకపోయినను కష్టదశయందు భగవంతుఁడు తప్పక జ్ఞప్తికి వచ్చి యాతనిస్మరణమును సన్మార్గాసక్తి యుఁగలిగి బాగుపడిన వా రనేకులు గలరు. భగవంతుఁడు మనలను లోకమునఁ బరిశోధన కయి పుట్టించినాఁడనువారిమతమున, మనస్వభావమును బరిశోధిం చుటకయి యాపత్సమయమే యనుకూల మయినదిగా నుండును. ఒకడు ధైర్యశాలి యగునోకాఁడో పరిశీలింపవలెనన్నచోఁ గష్టసమ యమునఁగాని మఱియొకప్పుడు శక్యముకాదు. ఒకఁడు సత్యము పలు కునోలేదో పరీక్షింపవలె ననుపక్షమున వాని కబద్ధమాడవలసినంత కష్టము వచ్చినప్పుడె కనుఁగొనవలెను. అవసరము రానంతవఱకు నందఱును మంచివారుగానే కనఁబడుదురు. ఇతరులకు వచ్చినయాప దలే మనకు భయమునుగలిగించి సన్మార్గమునకు దింపుటకును, వారి యెడ కనికరమును గలిగించి పరోపకారాదులకు బ్రేరేపించుటకును సాధనము లగును. మనము పూర్వజన్మకర్మమునే యిప్పు డనుభ వించు చుండనిపక్షమున దుర్మార్గులకు శిక్షయును సన్మార్గులకు బహు మానమును ఈలోకములో కలుగకపోవుటకును, కొందఱుదుర్మార్గ

లీలోకములో సుఖమునే యనుభవించుచుండగా కొందఱు సన్మార్గులు కష్టమునె పొందు చుండుటకును కారణము నేమని యూహింపగల, మని పూర్వజన్మవాదు లడుగుదురు. నిప్పంటినచో దేహముం కెట్లో యట్లే పాప మంటిన నెప్పుడో యొకప్పు డాత్మకును తాపము కలుగక తప్పదు. ఈజన్మము పరిశోధనముకొరకో మనయభివృద్ధికొఱకో యేర్పఱుపఁబడినదే కాఁబట్టి యన్ని నేరములకును శిక్ష యిక్కడనే కలుగదని యీవఱకే చెప్పియున్నాను. ఇక్కడ మంచివారికి బహుమానమును చెడ్డవారికి శిక్షయును సదా కలుగక పోవుటయే మనము చేసిన కార్యములకయి మనకు సుఖదుఃఖముల నిచ్చెడిపరలోక మొక్కటి యున్నదని స్పష్టమగుచున్నది. మనలను భగవంతుఁడు కార్యము చేసినవెంటనే శిక్షించుచు వచ్చినట్టయిన మనకిచ్చినస్వాతంత్ర్యము వలని ప్రయోజనము కలుగక, మన మేపని చేయఁబోయినను కత్తియెత్తి యొకడు కొట్టుటకు సిద్ధముగా దగ్గరనిలుచున్నట్టుండి మనకు భయమెక్కువయి సౌఖ్యమన్న మాటయే లేకపోవలసివచ్చును. వెంటనే శిక్షించకపోయినను మనమెప్పుడును సన్మార్గముననే నడచుచుండునట్లు చేయరాదా యనెడుపక్షమున, అప్పుడు మన విభాగజ్ఞానమును స్వాతంత్ర్యమును వ్యర్థములయి సుఖసంతోషాదులు లేక మనము యంత్రములవంటివార మగుదుము. కాఁబట్టి యీప్రశ్నకు మనలను భగవంతుఁడు పశుపక్ష్యాది తిర్యగ్జంతువులఁగాఁగాని శిలాపర్వతాదిజడపదార్థములఁగాఁగాని యేల చేయరాదని యర్థ మేర్పడును. భగవంతుఁడు మనకంటె నెన్నోమడుఁగులు బుద్ధిమంతుఁడయి యట్లుచేయక పోఁబట్టియే మన మిప్పుడు సృష్టిలోని సమస్త పదార్థములకంటెను నుత్తమజన్మము గలవారమని సంతోషింపఁ గలుగుచున్నాము. ఈ లోకములోఁ గొందఱు మంచివారు కష్టములపాలగుచుండుటయు కొందఱు

ష్టులే సుఖ మనుభవించుచుండుటయుఁ తటస్థించుచున్నదే దాని కేమి కారణమని సందేహము కలుగవచ్చును. జనుల కెల్లను సమానముగానే స్వాతంత్ర్యము కలిగియుండుటయు జనులలోఁ బరస్పర సంబంధము గలిగియుండుటయు నే పయియాక్షేపమునకు సమాధానముగా నుండును. మనకు స్వాతంత్ర్యము లేకపోయిన, సౌఖ్యముండదనియు మనమిప్పుడు మృగాదులకంటె నధికులము కానేరమనియు వెనుకనే చెప్పియున్నాను. జనకులు బిడ్డలు, రాజులు రాష్ట్రములు భర్తలు భార్యలు, గురువులు శిష్యులు, అధికారులు ప్రజలు, మొదలయిన సంబంధములవలన నీతిమంతు లయినచో సమస్తసుఖములును గలుగునట్లే యందులో నెవ్వరయిన నీతిమాలినవా రగుదురేని సంబంధదోషమువలన రెండవవారికి యోగ్యులకునయితము కష్టములు సంభవించును. తల్లిదండ్రులు కోపిష్ఠు లగుదురేని నిష్కారణముగా నిరపరాధులయిన బిడ్డలను కొట్టి హింసపెట్టుదురు. బిడ్డలు దుర్మార్గులగుదురేని జననీజనకులకు మనస్తాపము కలిగింతురు. రాజులు దుష్టాత్ము లయిరేని దేశజనులను బాధింతురు; జనులు స్వామిద్రోహులయి తిరుగఁబడువా రగుదురేని రాజులకు మనోవ్యథ కలుగును. భర్తలు సురాపానాదిదుర్వృత్తుల మరిగినవారైరేని భార్యలు దుఃఖభాజనలగుదురు భార్యలుజారిణులగుదురేని భర్తలుసుఖదూరులగుదురు; గురువులుమోసగాండ్రగుదురేని శిష్యులుభ్రష్టులగుదురు; న్యాయాధికారులులంచములు గైకొనువా రగుదురేని ప్రజలు క్షోభపడుదురు. పాపభీతివలన నందఱును నీతిమంతులైనచో నిటువంటి బాధ లించుమించుగా నివారణమగును. జగత్తునఁ గొందఱు చిన్నప్పటినుండియు దుష్టస్వభావము కలవారుగాను కొందఱు సత్స్వభావము గలవారుగాను నుండుటకు స్వాతంత్ర్యమే కారణ మగును. ఇట్లు రెండువిధ

సాక్షి నాడీసముదాయములలో వేనినిగాని యంటినవి కాకపోవుటయు, అవి ప్రత్యేకముగా జీవగుణములే యగుటయుఁ దలపోసి చూడఁగా శరీరనాశమువలన వానికి భంగము కలుగుటకు హేతు వేదియుఁ గనఁబడదు. కాఁబట్టి జీవులకు బహుజన్మములే యుండి యిప్పుడు మనదేహములో నున్నజీవాత్మ వెనుక నొకజన్మ మెత్తినదే యయిన పక్షమున వెనుకటి జన్మములో జీవునకుఁ గలిగినజ్ఞానమును, నేర్చుకొన్న విద్యలును చేసినకార్యములును గొంతవఱకైన నీజన్మమునఁ గలిగి యుండవలెను. అట్లు లేక జన్మ మెత్తిన ప్రతిజీవుఁడు ప్రతివిషయమును క్రొత్తగా నేర్చుకోవలసి యుండుటయు, ప్రతిభాషయు నూతనముగా నభ్యసింపవలసి యుండుటయు, పూర్వజన్మములోని దొక్కసంగతియైన స్మరణము లేకపోవుటయు, పూర్వజన్మము లేదనుటకుఁ జాలినంత నిదర్శనములుగా నున్నవి. జ్ఞానము లేకపోవుటకును భాష రాకపోవుటకును గారణము పూర్వజన్మమున నీయాత్మ శిలావృక్షాది జడజన్మమును గాని మహిషవాయసాది తిర్యగ్జన్మమును గాని పొంది యుండుట యయి యుండవచ్చునని చెప్పవత్తురు. శిలాపర్వతాది జడపదార్థములయం దాత్మ యుండునని చెప్పెడు మనవారి సిద్ధాంతము నకన్న పరిహాసాస్పదమైన విషయము మఱి యొకటి యుండునని నే నూహింపఁ జాలను. ఆత్మస్వభావలక్షణముల నెఱిఁగినబాలుఁ డయినను జడపదార్థములయం దాత్మయుండదని సులభముగాఁ జెప్పఁగలుగునపుడు విశేషజ్ఞులయిన మీకడ నేనావిషయమునఁ బెంచి చెప్పవలసినయావశ్యక ముండదు. అందుచేత మనుష్యాత్మలు జడములగుననుట యున్మత్త వాక్యమునకంటె నెక్కువ గౌరవనీయ మయినదిగాఁ గనుపట్టదు. పశు పక్ష్యాదులు మనుష్యు లగుదురని చెప్పుటయు నించుమించుగా నంత విశ్వాసనీయ మయినవాక్యమునుగానే

గ్రహింపఁ దగియుండును. ప్రపంచమునందలి యన్నిమతములవా రును నైకకంఠ్యముగా సృష్ట్యాదియం దాదిమదంపతు లల్పసంఖ్య కలవారుగానే సృజియింపఁ బడిరని చెప్పుచున్నారు; ఇప్పు డంత కం తకు జనసంఖ్య ప్రపంచములో నెక్కువగుచున్నట్లు మనమందఱము నెఱుఁగుదుము. జనసంఖ్య వృద్ధియగుట యనఁగా నాత్మలసంఖ్య వృద్ధియగుచున్న దనుటయే గనుక, ఈప్రత్యక్ష నిదర్శమే మొదట నున్నయాత్మలే కర్మబంధవశమున మరలమరల జన్మము లెత్తుచున్న వన్న వాదమును ఖండించి పూర్వోత్తరజన్మము లుండవను సిద్ధాంత మును స్థాపించుచున్నది. ఇంతయేకాక యొకవేళ వాదమునిమిత్తము పశుపక్ష్యాదులు మనుష్యజన్మము లెత్తుచున్నవని యొప్పుకొంద మన్నను ఒక యావునుగాని యొక మేకనుగాని కొన్నవారికి కొంత కాలములోనే వానిసంఖ్య యెంత వృద్ధియగునో మన మందఱము నెఱిఁగియున్నాము గనుక, ఆపక్షమునను మరల మరల నొల్లింటి యాత్మలే జన్మించుచుండుట కవకాశము కనఁబడక క్రొత్తయాత్మలే పుట్టుచున్నట్లు స్థిరపడుచున్నది. జన్మాంతరము నొప్పుకొను మనవా రయినను లోకములో నందఱును జన్మములనే యెత్తుచుండవలయు నని చెప్పఁజాలరు, పుణ్యాత్ములు కొంద ఱయినను క్రమక్రమముగాఁ బునరావృత్తిరహితశాశ్వత పుణ్యలోకముల నొందుదు రని యొప్పు కొందురు గనుక, ఆసిద్ధాంతప్రకారమును జన్మము లెత్తవలసిన జీవు లసంఖ్య యంతకంతకు తక్కువయై కొంతకాలములో జనులసంఖ్య క్షీణదశ నొందవలెను. అట్లుగాక జనసంఖ్య నానాటికి వృద్ధియే యగు చున్నది గనుక, జన్మపరంపర లేదని సులభముగా నూహింపఁదగి యున్నది. కర్మానుబంధమే జన్మమునకుఁ గారణ మని మనవారు చెప్పెడి సిద్ధాంతప్రకారముగా, మొట్టమొదటి జన్మమునందుఁ గర్మ

యెక్కడినుండి వచ్చినదని ప్రశ్న రాఁగా తగిన సమాధానము కుదురక యీశ్వరునితో పాటుగా కర్మయు ననాదియని యుక్తిరహితముగా మనవారు తమసిద్ధాంతమును సమర్థింపఁ జూతురు. కర్మ యనాది యైనచో జన్మలు ననాదియే కావలసివచ్చును. అప్పుడు మనల నీశ్వరుఁడు సృజించనేలేదని సిద్ధాంతము తేలును. అందునకును వెనుక తీయక మనవా రాప్రకారముగానే జీవు లనాదు లని చెప్పి జీవుల నీశ్వరుఁడు సృజింపలేదనియు, జీవాత్మలు సృజింపఁబడినవే యయినప క్షమున నాశనముకూడఁ బొందవలసి యుండు ననియు, కాఁబట్టి భగవంతుఁడు మనలను సృజించినాఁ డనుట కర్థము కరణకళేబరములతోఁ గూర్చినాఁ డనుట యనియుఁ జెప్పుదురు. మొట్టమొదటకరణ కళేబరాదులయినను గలిగించినవాఁ డీశ్వరుఁడే యందురుగనుక తప్పక యెప్పుడో జీవుల కీశ్వరుఁడు జన్మమును కలిగించినకాల మొకటి యున్నదని యొప్పుకొని తీఱవలెను. అందుచేత జీవులజన్మముల కాది యుండక తప్పదు. జీవులకు జన్మము లేనప్పుడు కర్మయుండుట యసందర్భముగనుకజన్మతోనే కర్మకును నాదియున్నదనియంగీకరింపకుండనయితికాదు. అందుచేతఁ గర్మ యనాదియను సిద్ధాంతము పడిపోయినది భగవంతునకువైషమ్యాదులు లేవనియే వారిసిద్ధాంతముగనుక, మొదటిజన్మముననందఱును సుకృతాత్ములయినయుండిరనవలెను. ఆజన్మముననందఱును యోగ్యులెయయిపుణ్యకర్మలు చేసినవారుగానేయుందురుగనుక, దాని మఱుచటిజన్మమునందుఁగాని మఱియేజన్మమునందుఁ గాని కొందఱు పాపాత్ములగుటకును వారికి జన్మపరంపర వచ్చుటకును గారణముకనఁబడదు. కాఁబట్టి వారి జన్మపరంపరాసిద్ధాంత మయినను లోకములోని పుణ్యపాపములకును స్థితిభేదములకును గతిని కల్పింపఁ జాలదు. పూర్వజన్మమే యున్నపక్షమున మన కాజన్మములోని

సంగతు లేవియు నెందుకు స్మరణకు రాకపోవు నని చేసినయాక్షేపణమున కుత్తరముగా, నమ మీజన్మములోఁ జేసినపనులే కొన్ని మఱచిపోవుచుండగా నెంతో కాలముక్రిందట జరిగిన వెనుకటిజన్మములోనిసంగతులు మన కెట్లు జ్ఞప్తి యుండఁగలవని చెప్పుదురు. ఈ జన్మమునందలి యనావశ్యకము లైనసంగతులను మనము మఱచిపోయినను ముఖ్యము లయినసంగతులను మనము జ్ఞప్తియుంచుకొనేయుంచుకొందుము. సర్వకారుణ్యుఁ డయినయీశ్వరుఁడు మనమేలుకొఱకే కొన్నిసంగతులను మనకు జ్ఞప్తికి రాకుండులాగునఁ జేసియున్నాఁడు. మనము ప్రతిదినమును నేమేమి పదార్థములను భుజించితిమో యేమేమి మాటలాడితిమో యెక్కడెక్కడఁ దిరిగితిమో మొదలైనప్రతిస్వల్పవిషయమును స్మృతికి వచ్చుచుండుటవలనఁ బ్రయోజనము లేదు; మీఁదిమిక్కిలి నష్టమును గలుగును. మన మేదియైన నొక మహావిషయము నాలోచించఁగడఁగునపుడు మనము చిన్నప్పటినుండియు బ్రతిదినమును తినుచువచ్చిన కూరగాయలు మొదలయినవియు నేలమీఁద బ్రాకుట తప్పటడుగు లిడుట లోనుగాఁగల వ్యాపారములును నొక్కసారిగా మనోవీధిని ప్రవేశించి స్మరణకు వచ్చినచో స్థిరచిత్తత కలుగక కార్యాలోచనము చెడిపోవును; వెనుక సంభవించినయాపద లన్నియుఁ దఱచుగా జ్ఞప్తికి వచ్చుచున్నచో సుఖాభావము కలుగును. కాఁబట్టియే యీశ్వరుఁ డివి యన్నియు మఱచునట్లు చేసి ప్రధానాంశములనుమాత్రమే జ్ఞప్తికి వచ్చుచుండునట్లు చేసియున్నాఁడు. వెనుక మన మేదియయిన నొక ఘోరపాతకమును జేసియుండి దానికి శిక్ష కాకపోయినయెడల మనకు తీరికగలిగి యాలోచింప నవకాశము కలిగినప్పుడెల్ల ముందుగా నదే స్మరణకువచ్చి మన మనస్సునకు నొప్పి కలిగించి మనవర్తనమును క్రమపఱుచును. ఒక్క

లోకోపకారక మయినఘనకార్యమును జేసియుండినపక్షమున దాని వలనఁ గలిగినకీర్తియును మనస్సంతోషమును జ్ఞప్తికివచ్చి సత్కార్యాచరణమునకు మనలను బ్రోత్సాహపఱచును. ఈప్రకారముగా నిష్ప్రయోజనము లైనవిషయముల నన్నిటిని మఱచినను, బాల్యావస్థయందుఁగాని యౌవనదశయందుఁగాని పూర్వము మన మొక స్థితియం దుంటిమన్న ముఖ్యాంశమునుమాత్రము మన మెన్నటికిని మఱచిపోము. శిక్షను బొందుచున్న కాలములోఁ దా నేనేరమున కయి శిక్ష ననుభవించుచున్నాఁడో యెవ్వఁడును మఱచిపోఁడు; అట్లు మఱచిపోయెడుపక్షమున శిక్షవలన ఫలము కలుగక యొకఁడు తన నడతను దిద్దుఁబఱచుకొనుట కవకాశము లేనివాఁడగును. ఈలాగు ననే దేనిని మనము జ్ఞప్తియం దుంచుకొనుటవలన ముందు మనకుఁ బ్రయోజన ముండునో యటువంటి యేవిషయమును భగవంతుఁడు బొత్తిగా మఱచునట్లు చేయఁడు. మనవారు చెప్పెడు ప్రకారముగాఁ బూర్వజన్మమే యొకటి యుండి యీజన్మము వెనుకటిజన్మమునఁ జేసినకర్మలకు శిక్షయే యగునేని, ఏజన్మమునఁ జేసినయపరాధముల కయి మనము శిక్ష ననుభవించు చున్నామో యాజన్మమున్నసంగతినే బొత్తిగా మఱచిపోవుచున్నామనుటకన్న వింత మఱియొకటియుండదు. అయినను పూర్వజన్మములోని సంగతు లన్నియు స్మరణకు రాక పోయినను దానిలో జరిగినప్రధానసంగతులుగాని యధమపక్షముజన్మమెత్తినసంగతిగాని యేలస్మరణమునకు రాకపోవునని చేసినయాక్షేపణకుత్తరముగా మనపండితులు మరణానంతరము మనోబుద్ధిచిత్తాహంకారము లాత్మను విడుచునని చెప్పుదురుగాని యీనాలిగింటిని విడిచి యాత్మయందున్నని చెప్పుట జ్ఞానకర్మేంద్రియాదు లగునవయవముల నెల్లను విడిచి శరీర ముండునన్నట్లుగా నర్థము లేనిమాటగా నుండును.

కాఁబట్టి పునర్జన్మము లేదనుసిద్ధాంత మీచెప్పిన [illegible]వలననే....సిద్ధాం తము కావచ్చును.

౫. ఇపుడు పునర్జన్మము లేదనుకొనుటవలనఁ [illegible] వృద్ధికి నష్టము సంభవించునా పుష్టికలుగునా యన్నకడపటియంశమును గూర్చి కొంచెము ముచ్చటించి యీవిషయము ముగించెదను. నాబుద్ధి ప్రచారమునకు గోచర మగునంతవఱకుఁ బూర్వోత్తరజన్మములు లేవనుకొనుటవలనఁ గలిగెడునష్ట మొక్కటియుఁ గానరాకున్నది. పూర్వజన్మకర్మలను నమ్మకపోవుటవలనఁ బ్రతిమనుష్యుఁడును తాను జేసెడు పనులకుఁ దానే యుత్తరవాది నని తెలిసికొని మంచిపనులను చేయఁ బ్రయత్నించును; దైవపరుఁడు కానందున యుక్తమయినపని చేయుటకే యీశ్వరుఁడు తనకు దృఢమయిన యవయవములను దయచేసి యున్నాఁడని సోమరితనము విడిచి తనజీవనమున కయి పాటుపడును; ఇతరులకు సంభవించెడి యాపదలను జూచినప్పుడు కనికరము కలిగి యంగహీనులు మొదలయినదానయోగ్యులకే సహాయము చేయుచు నపాత్రదానమును బొత్తిగా కట్టిపెట్టును; సర్వకార్యసిద్ధులును తనప్రయత్నములోనే యుండునని నమ్మి యేకార్యమునకును నదృష్టమును నమ్ముకొని యుండక సర్వకాయకష్ట పడునుగనుక సర్వశుభములును కలుగును; వ్యాధులు మొదలయినవి వచ్చునపుడు ప్రారబ్ధమును నమ్మి యుపేక్షాపరుఁడు గాక యుక్తసమయముననే తగినచికిత్సలు చేయించుచు మనుష్యప్రయత్నమునఁ లోప మేమియు లేకుండఁ జేసి మేలు పొందును. పునర్జన్మము లేదనుకొనుటవలననే సత్కర్మలు చేయుటకుఁ బ్రోత్సాహమును దుష్కర్మలు చేయుటకు నిరుత్సాహమును గలుగును.



ఈపయిని వర్ణించిన యేదంశములవలనను పునర్జన్మము లేక

పోవుటయే పరమార్థమని మీకుఁ దేటపడి యుండవచ్చును. ఈ ప్రపంచములోఁ బాపముకూడ నుండుటకుఁ గారణము మనకు మనసు వచ్చినట్టు పనిచేయుటకయి స్వాతంత్ర్య ముండుట తప్ప వేఱొక టేదియు లేదు. మన పాపకార్యములకు జన్మాంతరములను గల్గింపకయే యీశ్వరుఁడు పరలోకమున సర్వా దండనము విధించును. మనకు విభాగజ్ఞానమును స్వాతంత్ర్యమును బ్రసాదించియుండుటవలన మనము చేయు నెల్లకార్యములకు మన మీశ్వరున కుత్తరవాదులముగా నుందుము. ప్రపంచములో నదృష్ట మనిగాని ప్రారబ్ధ మనిగాని యేదియు లేదు. పాపభీతి కలుగఁజేసి మనలను సన్మార్గమునకుఁ ద్రిప్పెడి యద్భుతశక్తిగలదివ్యౌషధము భగవదారాధన మొక్కటియే గనుక, మన మీశ్వరు నెన్నఁడును మఱచిపోక యాసర్వకారుణ్యుని సదా స్మరించుచు నాతని గుణానుభవము గలిగి యాయనయాజ్ఞలను జెల్లించుచు నానంద మనుభవింప నెల్లవారును బ్రయత్నింపవలయును.

# అతిబాల్యవివాహము

ఓవిద్వన్మహాజనులారా!

ఈసమాజముయొక్క అగ్రాసనాధిపతిగారు కొన్నిదినముల క్రిందట నన్నొకయుపన్యాసము చదువు మని యడిగినప్పుడు నాశక్తిని వక్తవ్యాంశముయొక్క గౌరవమును లేశమాత్రమును విచారింపక సాహసము చేసి బాల్యవివాహమునుగూర్చి యుపన్యసించుట కొప్పుకొన్నాఁడను. కాని యీదినమున నేను కలము చేతఁబట్టుకొని వ్రాయ నారంభింపఁగానే, నాకంటె సమర్థతరులకు విడిచిపెట్టవలసినకార్యభారమును, నేను పైని వేసికొన్న హేతువుచేతగాఁబోలును కలము సాగక నాచేయి నడఁక మొదలు పెట్టెను. నాకంటె విద్యయందును బుద్ధియందును అధికులయిన యీసామాజికులలో మఱియెవ్వరయిన సమర్థులీబాల్యవివాహమునుగూర్చి వ్రాసినచో మిక్కిలి రసవంతముగాను జనరంజకముగాను ఉండునని నే నెఱిఁగినవాఁడ నయ్యును, రోటిలో తల దూర్చినతరువాత రోకటిపోటునకు వెఱవఁదగ దన్నసామెతను స్మరించుకొని నాకు తోఁచినది వ్రాయ తెగించుచున్నాను. కాఁబట్టి నే నిప్పుడు చెప్పఁబోవుదానిలో మీ రెఱుఁగని క్రొత్తసంగతులుగాని క్రొత్తయుక్తులుగానియుండునని యాశపెట్టుకొనఁ బోకుఁడు. లోకములోననుభవింపఁదగిన సమస్తసుఖములలోను వివాహబంధమువలననేభార్య, భర్త, తండ్రి, బిడ్డ, అక్క, చెల్లెలు, అన్న, తమ్ముఁడు, మొదలయినసమస్తబంధుత్వములునుకలుగుననియు, ఈవివాహబంధమువలననే బిడ్డలుమృగప్రాయులుగాక తగినసంరక్షణమును విద్యాబుద్ధులను పొంది వెలయుదు రనియు, ఈవివాహబంధమువలననే స్త్రీపురుషులు యావజ్జీవమును స్నేహపాశాబద్ధులయి యుండి యిరువురునొక్క

దేహముగా పరిగణింపఁ బడుచుందు రనియు, ఈవివాహబంధమువల ననే పురుషుల యావశ్యకములను స్త్రీలును, స్త్రీల యావశ్యకములను పురుషులును తీర్చి పరస్పరసుఖాభివృద్ధి పొందుదు రనియు, మీ రందఱు నెఱిఁగియున్నవిషయమే గనుక వివాహముయొక్క ప్రాశస్త్యమును గుఱించియు ప్రయోజనములను గుఱించియు నే నిక్కడ చెప్పవలసిన యావశ్యకము లేదు. అనురణమును వధూవరులకుఁ గలుగవలసినసుఖమునకుఁ గాని దుఃఖమునకుఁ గాని వధూవరుల యోగ్యతాయోగ్యతలే ప్రధానములై నవనియు, సంసారసుఖము దంపతులయొక్క పరస్పరానురాగము ననుసరించియే యుండు ననియు, మీకు విశదపడినయంశమే గనుక వివాహకాలమునకు ముందే వధూవరులు వివాహబంధమువలనఁ దమకు ముందు కలుగఁబోయెడు సంసారభారముయొక్క గౌరవమును తాము ముందెల్ల కాలమును కలసిమెలసి యుండవలసినవారిగుణాగుణములను తెలిసికొ తగినంతప్రాజ్ఞత గలవారుగా నుండవలసిన దన్నయంశమునుసహితము నేను వివరింపవలసిన యావశ్యకము లేదు. అయినను వివాహము లెవ్వరి సుఖసంతోషాదులనిమిత్తముద్దేశింపఁబడినవో, వానియందలి లోపమువలన నెవ్వరు కలకాలమును దుఃఖ మనుభవింపవలసినవా రగుదురో, తమచిరకాల సుఖజీవనమున కనుకూలప్రతికూలములుగా నుండుసాధకబాధకముల నాలోచించుకొనుట కెవ్వ రర్హులో, వారియంగీకారమును పరస్పరేచ్ఛను లేశమాత్రమును గణింపక మనదేశమునందు కొన్ని వర్ణములవారు వివాహములయం దాస్వాతంత్ర్యము నంతను తామే యక్రమముగా వహించి యాచారబలము చేతను మఱికొన్ని కారణములచేతను యుక్తాయుక్తవిచారమును జేయఁజాలక నిర్దోషు లయినబిడ్డలకు మితిమీఱినకష్టములను తెచ్చి పెట్టుచుండుట చూడ నెంతయుశోచనీయముగానున్నది. సంసారసుఖకల్పవృక్షమును మూలచ్ఛేదము చేయుటకై

వేరుపురుగువలెనున్న యీబాల్యవివాహమును రూపుమాపినంగాని మన దేశమునందలి కుటుంబములలో వివాహములవలని సంపూర్ణ ఫల మెన్నటికిని కలుగనేరదు. ఈబాల్యవివాహము మనదేశమునం దంతకంతకు ప్రబలుచుండుట కనేక కారణము లగుపడు చున్నవి. కొందఱు తాము బ్రతికియుండఁగానే తమబిడ్డలకు వివాహము చేసి ముద్దులను ముచ్చటలను వేడుకలను చూడవలెనను నుద్దేశముతో పసిబిడ్డలకు వివాహములు చేయుదురు; మఱికొందఱు బిడ్డలయొక్క పెండ్లిండ్లను తామెప్పుడు చూతుమా యని తొందరపడుచుండెడు వృద్ధులయినజనకులయొక్కయు బంధువులయొక్కయు నిర్బంధముచేత చేయుదురు; కొందఱగవుతగవుల నిమిత్తమును కట్నములు కానుకలు మొదలైనవాని నిమిత్తమును పోరుపెట్టెడు మూఢురాండ్రయిన భార్యలయొక్క ప్రోత్సాహముచేత చేయుదురు; కొందఱు దంభమునకయి యతివ్యయము చేసి దక్షిణలచేతను బ్రాహ్మణసంతర్పణములచేతను ప్రతిష్ఠ పొందవలె నన్నకోరికతో చేయుదురు; కొందఱు వివాహములో వివాహము చేసిన సొమ్ము కలిసివచ్చునని చేయుదురు; మఱికొందఱిప్పటియాచారమునుబట్టి తమబిడ్డల కెంతశీఘ్రముగా వివాహము చేసిన లోకులు తమ్మంత మంచివా రనుకొందు రని పేరున కాశపడి చేయుదురు; కొందఱు కోడండ్రమీఁద నధికారము చేయవచ్చు నన్న యభిలాషతో నుండెడియిల్లాండ్రయొక్క యభిమతములు తీర్చుటకయి చేయుదురు; కొందఱు మంచిసంబంధముల కాశపడి చేయుదురు; కొందఱు వేగిరము వివాహములు కాకపోయినపక్షమున తమబిడ్డలు చెడిపోదురను సచ్చింతతోనే చేయుదురు; ఇంకను కొందఱు బాల్యవివాహములు చేయకుండుట శాస్త్రవిరుద్ధ మన్నభ్రమచేత చేయుదురు. ఈ తెగలవారు గాక స్వప్రయోజనపరులై మానుషధర్మమును విడిచి దయాశూన్యులై రొక్కమును పుచ్చుకొనియో, అల్లుఁడు చచ్చి

నదో వానిసొత్తంతయు తమకే వచ్చుననియో, అల్లునియింటఁ జేరి తామందఱును సుఖజీవనము చేయవచ్చుననియో, తాముకన్న నోరెఱుఁగనిశిశువులను అప్రయోజకులకును వికలాంగులకును వృద్ధులకును వివాహవ్యాజమున బలియిత్తురు. ఏకారణములచేత జరిగెడు బాల్యవివాహములకైనను పురోహితులును యాజకులును తోడుపడ సర్వవిధముల బాల్యవివాహములను ప్రోత్సాహపఱుతురు. ఇటువంటి కార్యములచేతనే ధనము సంపాదించి పొట్ట పోసికోవలసినస్వప్రయోజనపరులు ప్రోత్సాహము చేయక మఱి యేమి చేయుదురు? ఎవరి ప్రోత్సాహముచేత చేసినను, ఏయుద్దేశముతో చేసినను, ఏకారణముచేతఁ జేసినను, స్వభావవిరుద్ధమనఁదగు బాల్యవివాహము వలనఁ గలిగెడి దుర్వారములైన దుష్ఫలములు కలుగక మానవు అతిబాల్యవివాహమువలన సంభవించుచున్న యనర్థములలోఁ గొన్నిటినిమాత్ర మిందు వివరించెదను. బాలారిష్టములును స్ఫోటకము మొదలగు సాంక్రామిక రోగములును వానివలన కలిగెడు మరణములును బాల్యదశయందే విస్తారముగా నుండునన్న సంగతి యెల్లవారికిని తెలిసినదే. అందుచేత ౧౮౮౦ వ సంవత్సరాంతమునందు మన దేశమునందు చేసిన జనపరిగణనమును బట్టి చూడఁగా తొమ్మిది సంవత్సరములకు లోపలి వయస్సుగలిగి వివాహమన్న నేమో యెఱుఁగనిదశలోనున్న బాలురలో భార్యలను పోగొట్టుకొన్నవారు లెక్క తెలిసినంతవఱకు ౨౮౭౨౩ గురు కనఁబడుచున్నారు. వీరి వివాహసమయములయందు వ్యయపఱిచిన ధనమంతయు వ్యర్థమగుటతప్ప, ఈ బాలురుగాని వారి బంధువులుగాని యేమిలాభము ననుభవించినవారయినారు? బాలికలగతి బాలురదానికంటెను సహస్రగుణములు దుఃఖబహుళమయినదిగా నున్నది. పురుషులు మరల వివాహము చేసికొననైన నర్హులుగా నుందురు గాని నిరపరాధిను లయిన పసిబా

లికల కామాత్రపు పుణ్య మయినను లేక క్రూరమయి చిరకాలాగతమయిన యొకదురాచారప్రాబల్యముచేత నోరెఱుఁగని దశలో తల్లిదండ్రులుతమవేడుకకొఱకువివాహమని పేరుపెట్టి యొకతంతునడపినదోషమునుబట్టి యావజ్జీవమును ప్రపంచసుఖములకు దూరురాండ్రై మరణమునకంటెను తీవ్రవేదనాకరమయిన దుస్సహవైధవ్యబాధ ననుభవింప నిర్బంధింపఁబడుచున్నారు. అప్పటి జనపరిగణనమును బట్టి యిట్టి దుస్స్థితిపాలయి యున్న పసిబాలికలు మనదేశమునందెందఱున్నారో యాలోచింపుఁడు. ఆ సంవత్సరమున తొమ్మిది యేండ్లకు లోఁబడిన వయస్సు గలవారయి భర్తలని చెప్పఁబడిన పురుషులను పోఁగొట్టుకొన్న దురదృష్టతను వహించిన దయనీయ లయిన బాలికలు ౭౮౯౭౬-గు రుండిరి. ధనము వ్యయముచేసి యీ పసిబాలికలకు వృథాగా తెలియని దుఃఖమును గొని తెచ్చిపెట్టుకొనుటకుఁ గాక వీరి వివాహమువలన నెవరి కేవిధమయిన లాభము కలిగినది? ఈచెప్పినవారుగాక యీసంవత్సరమున పదునాలుగు సంవత్సరముల ప్రాయమునకు లోపుగా నున్న ౨,౦౭,౩౮౮గురు బాలికలుకూడ విధవలయి యుండిరి. ఈమూడులక్షల బాలికలును తలిదండ్రులచేతను సంరక్షకులచేతను బాల్యవివాహ మను పెనుభూతమునకు నిష్కారణముగా బలి పెట్టబడి కలకాలమును దుఃఖపరంపరపాలు చేయఁబడినవారేకదా? మన దేశమునందలి వైధవ్యదుఃఖమున కంతకును బాల్యవివాహమే ప్రధానకారణము కాకపోయినను ఇన్ని లక్షలబాలికల వైధవ్యమున కయినను కారణమయినందుకు లేశమాత్రమును సందేహములేదు. ఇఁక వైధవ్యమును పొందక తిన్నగా నున్నవారిగతి విచారింపుఁడు. వివాహమునాటికి చక్కగానున్న పురుషులుగాని స్త్రీలుగాని పలువురు స్ఫోటకము మొదలయినవ్యాధులచేత కన్నును కాలును చెడియు, వికలాంగు లయియు, దుర్బలశరీరు లయియు,

సంసారసుఖమునకు పనికిరాక యుండోరులకు దుఃఖహేతువు లగుచున్నారు. కొన్ని సమయములయందు యోగ్యు లయినపురుషుల కయోగ్యురాండ్రు భార్య లగుట లభించియు, గుణవంతురాండ్రయిన స్త్రీలకు గుణహీనులు భర్త లగుట లభించియు, పరస్పరాంగీకారము లేక పోవుటచేత మనసు కలియకయు, భర్తకంటె ముందుగా భార్య యెదిగి కాపురమునకు వచ్చియు, దంపతులలో నొకరు విద్యావంతు లయిన నొకరు మూర్ఖశిరోమణులుగా నుండఁ దటస్థించియు, బహు దంపతు లేకగృహమున వసించుచుండియు సుఖ మన్నమాట యెఱుఁగనివా రగుచున్నారు. పెద్దపెరిగినతరువాతఁగాని సుగుణములో దుర్గుణములో తిన్నగా స్థిరపడవు గనుక చిన్నతనములో వివాహము నాటికి మంచివా రనుకొన్నవారే కొందఱు తరువాత చెడ్డవా రయి మరికొన్ని దాంపత్యములు దుఃఖదాయకము లగుచున్నవి. బాల్యవివాహప్రభావముచేత జనకు లన్నపేరు చెఱుప నవతరించిన మనుష్యరూపముననున్న ఘోరరాక్షసులు ధనాశాపాశబద్ధులై తమ ముద్దుబాలికలను వృద్ధవిగ్రహములకును వారికంటెను అధము లయిన రోగిష్ఠులు మొదలయినవారికిని విక్రయించుచుండుటవలన ఆముద్దరాండ్రీడేరి కాపురమునకు వచ్చునప్పటికి పతులు స్వర్గయాత్ర కున్ముఖులై యుండియు జీవచ్ఛవములవలె నుండియు యువతులు పలువురు దుఃఖములపాలు కావలసినవా రగుచున్నారు. ఇంతేకాక మనదేశములో నున్నయనేకవర్ణభేదములచేతను వానిలోని మితిమీఱినశాఖోపశాఖలచేతను తల్లిదండ్రులు వేఱుగతి లేక రంభవంటికొమార్తె నైనను కొన్నిసమయములయందు వికలాంగున కయినను దరిద్రున కయినను ఇచ్చి వివాహము చేయవలసినవా రగుటచేత కొందఱుకన్నియలు సుఖ మెఱుఁగనివా రగుచున్నారు.

ఇట్టి వేమియు లేక సుఖ మనుభవింపుచున్నా రనుకొనుచున్న

బాహుదంపతుల యవస్థను చూడుడు. ఒక్క మనదేశమునందు తప్ప సమస్త దేశములయందును పురుషులు తాము స్వతంత్రముగా భార్యాపుత్రులను పోషింప శక్తి వచ్చిన తరువాతనే వివాహము చేసికొందురు. మనదేశమునం దట్టుగాక తల్లిదండ్రులు పసిబిడ్డలకే వారియనుమతివిచారింపక భార్యల నంటగట్టుటచేత మనబాలురు కౌమార దశయందలి స్వతంత్రవర్తనమును సంతోషమును చవిచూడనివారయి సదా నిరుత్సాహులగుచున్నారు. కాఁబట్టియే యొకహూణపండితుఁ డొకపాఠశాలయం దుపన్యసించుచు అన్ని దేశములవారికిని కౌమారదశ యుండఁగా మనపెద్దలు మనబాలుర కాదశ నపహరించి జనసామాన్యమునకు భగవంతుఁ డనుగ్రహించియున్న యత్యంతప్రయోజనకర మయిన కౌమారదశానిక్షేపము తక్కువ చేసి యున్నారని వచించియున్నాఁడు. అందుకు సందేహము లేదు. ఈకౌమారదశయందే పురుషులు తమప్రవర్తనమును స్థిరపరుచుకొని, సుగుణసంపదను గడించి, విద్యాబుద్ధులయందు ప్రబలి, ధైర్యసాహసాదులను నేర్చుకొని, స్వతంత్రవృత్తి నలవరుచుకొని, తరువాతి లౌకికయాత్ర కనుకూలమయిన సాధనసామగ్రినెల్లను సంపాదించుకోవలసినది. దుఃఖములు నెఱుఁగక నిర్విచారముగా నుండవలసిన యటువంటిసుఖకాలములోనే యాఁబోతునకు గుదెకట్టి కట్టినట్టు మనవారు బాలురకు సంసారము నంటకట్టి తల యెత్తుకొనకుండఁ జేయుటవలన మనవారుత్సాహమును ధైర్యసాహసాదులును లేనివారయి పూనికతో స్వతంత్రించి యేపకార్యమును జేయుటకును పనికిమాలినవా రగుచున్నారు. అందుచేతనే మనబాలురు సాధారణముగా వివాహములేక పాఠశాలలో చదువుకొన్నంతవఱకును దేశోపకారము నిమిత్తము పాటుపడవలెననియు, సంఘదురాచారమును మాన్పవలెననియుఁ స్త్రీలయొక్కయు నీచకులమువారియొక్కయు స్థితిని బాగుచేయవలెననియు, తలఁచి మిక్కిలి యుత్సా

హాముతో సమాజము లేర్పరచి ప్రసంగములు చేసి ధైర్యముతో దురాచారములను దూషింపఁ గలిగియు, వివాహమై భార్యకాపురమునకు వచ్చిన రెండుమూడు సంవత్సరములలోపలనే తమ పూర్వావస్థ నంతను మఱచిపోయి తొంటియుత్సాహము చెడి దీనముఖములు గలవారయి, దేశాభిమాన మన్నమాటను స్మరణకు తెచ్చుకొనక, తొంటిప్రసంగములను సమాజములను విడిచిపెట్టి, ధైర్యసాహసములను స్వాతంత్ర్యమును కోలుపోయి, ఎవ్వరియడుగులకు మడుగులొత్తియైనను ఎన్ని యిచ్చకము లాడియైనను నెలకు పదియేనురూపాయలపని సంపాదించి లంచములుపుచ్చుకొనియో కల్లలాడియో తమ భార్యాపుత్రులను పోషించుటయే పరమార్థమని సిద్ధాంతము నేర్పఱచుకొని, లోకము నిమిత్తమయి పాటుపడఁదలఁచినవారిని జూచి పరిహసించుచు వారిని నిరుత్సాహపఱిచి, తాము లోకమునకు నిష్ప్రయోజకు లగుచున్నారు. పురుషులగతి యిట్లుండఁగా వారిభార్యలకింకొకదురవస్థకూడ ప్రాప్తించుచున్నది. ఆచిన్నది మగనికొలువుమాత్రమేకాక అత్తగారికొలువుకూడ చేయవలసి యుండును. సాధారణముగా మగఁ డింటఁ గూరుచుండి సుఖభోజనము చేయుచుండు పరాధీనుఁడుగా నుండుటచేతను, తన్నుమాత్రమేకాక తనభర్తను కూడ పోషింపవలసినవా రత్తమామలే యగుటచేతను, అత్తమామలకుఁ బూర్ణముగా కోపమువచ్చినపక్షమున ఇంట నిలుచుటయే పొసఁగనేరదు గనుకను, బాలభార్య మగనికంటె అత్తమామలకే యెక్కువలోఁబడి వారికే యాజ్ఞానువర్తినిగా నుండవలసిన దగుచున్నది. ఈహేతువునుబట్టి బాలభార్యలుపలువురు మగలమనసులకెడయై యావజ్జీవమును సుఖ మెఱుఁగనివా రగుచున్నారు. అదిగాక అత్తలకు కొందఱకు కారణ మున్నను లేకపోయినను కూడ కోడండ్రను బాధించునప్పటి కంటె నధికసంతోషము మఱియెప్పుడును కలుగదు.

అత్తగా రెంతమూర్ఖురా లయిన, ఈబాధ యంతయధికముగా నుండును. కొడుకు కేమైననుసరే కోడలిత్రాడు కోటిపల్లెరేవున త్రెంచినఁ జాలు నని సంతోషించు అత్తలును మనదేశములో పలువురున్నారు. ఈబాధలనుబట్టినే "అత్తపోఁగొట్టిన దడుగోటికుండ, కోడలుపోఁగొట్టినది క్రొత్తకుండ" యనుసామెతయు, ఇటువంటివే మఱికొన్నిసామెతలును వెలసి యున్నవి.

ఈసుఖ మంతయు నిట్లుండఁగా నీ బాలదంపతులకు లభించెడి యితరావస్థలను చిత్తగింపుఁడు. కాలము రాకమునుపె గర్భాధాన మగుటచే కలిగినసంతానము సాధారణముగా దుర్బల మయి పురిటిలో పోవువారును తరువాత కొంతకాల మాదంపతులకును బంధువులకును శ్రమ యిచ్చి పోవువారును అయి యుందురు; అంతటిభాగ్యమును వహింపక చిరకాలము కష్టముల ననుభవించుచు బ్రతుక నోచుకొన్న బిడ్డలు చిడుము మొదలయిన వ్యాధులచేత చిక్కి దుర్బలమయిన శుష్కదేహములు గలవారయి పెద్దవారయినప్పుడుసహిత మాబిడ్డలకు పుట్టినబిడ్డలు తాము తమకాలములో పురాణములయందు వర్ణింపఁ బడిన యంగుష్ఠమాత్రశరీరులను పుట్టింపఁ బ్రయత్నించుచున్నవారివలె నుందురు. ఆడుకోవలసినయవస్థలోనే బాలికలకు బిడ్డలు పుట్టుటచేత కూడ తల్లులు తిన్నగా పిల్లలను పెంచుటకు చేతఁగాక వారినిపాడు చేయుచున్నారు. బిడ్డలమాట యటుండఁగా బిడ్డలను గన్నతల్లులు తండ్రులు సహితము కొంతకాలములోనే శరీరపటుత్వము చెడి పడుచుతనములోనేముసలివారయి యల్పాయుష్కులగుచుందురు. రజస్వల యయినంతమాత్రముచేత కన్య సంభోగార్హురాలు గాదనియు, సమస్తావయవపరిపూర్తి యగుటకు మఱికొన్నిసంవత్సరములు జరగవలెననియు, ఈలోపల వధూవరులను కలిపినయెడల వారిదేహములు చెడి రోగాశ్రయము లగుటయేకాక వారికి పుట్టినబిడ్డలును చెడుదు

రనియు వైద్యశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈవిధముగా బాల్యవివాహమువలన సుఖము కలుగకపోవుటయేకాక వివాహము లేనియెడల దృఢకాయులయి చిరకాలము జీవింపఁదగిన దంపతులయాయువుకూడ సన్నమగుచున్నది. మఱియు బాల్యవివాహమువలన బాలికయొక్క చదువుమాత్రమే కాక బాలయొక్క చదువుకూడ చెడిపోవుచున్నది. సంసారదుఃఖములు లేక స్వేచ్ఛగా బ్రతుకవలసిన బాల్యదశలోనే సంసారమువచ్చి మీఁదపడుటచేత చదువుకోఁచక, ఇంట నొక మూల తల్లిదండ్రులును మఱియొకమూల నాలుబిడ్డలును ద్రవ్యార్జనము కుటుంబభరణము చేయుమని నిత్యమును పోరుచుండఁగానుద్యోగము నిమిత్తమయి యీబాలుఁడు కృషిచేయువలసినవాఁడుకాక యెటుండఁ గలఁడు? మన మెఱిఁగినవారిలోనే యెందఱు బాలురు మిక్కిలి తెలివిగలవారయ్యును గొప్పపరీక్షలం గృతార్థులయి యున్నతస్థితికి రాఁదగిన బుద్ధిసంపద గలవారయ్యును సంసారభారము మీఁద పడుటచేత నడుమ చదువు విడిచిపెట్టి భావిమహాఫలములను చెడగొట్టుకోవలసినవా రగుచున్నారు కారు? ఎందఱు బాలురు తమ చిన్నభార్యల నింట నొంటిగా విడిచి రా వలనుపడక యత్యల్పదూరములో నున్నశాస్త్రపాఠశాలలకు సహితము పోయి చదువుకో లేక చదువునం దెంత యాసక్తిగలవారయినను కార్యము లేక చిన్న పనులతోనే తృప్తి పొందవలసినవా రగుచున్నారు కారు? ఒక్క విద్యాభివృద్ధిమాత్రమే కాక సమస్తాభివృద్ధులకును బాల్యవివాహము ప్రతిబంధకముగా నున్నది. వివాహ మైనతోడనే తరుచుగా బాలికలను పాఠశాలలనుండి మాన్పించుచున్నారు. ఇదిగాక యీబాల్యవివాహమువలన చిన్నతనములోనే సంతానము గలిగి వారు పోషింపలేనియవస్థలోనే కుటుంబములు పెరుగుచుండుటచేతను వారి వివాహములనిమిత్తమయి కులాచారానుసారముగా విశేషవిత్తమును

వ్యయము చేయవలసి వచ్చుటచేతను మనదేశములో బహుకుటుంబములు పేదఱికముపాలయి పిమ్మట ఋణములపాలయి చిరకష్టములపాలు కావలసిన వగుచున్నవి. కొన్నిచోట్ల వివాహములనిమిత్తము చేసినయప్పులచేత పురుషులు తమకంతకు మునుపు జీవనాధారములుగా నున్న మాన్యములను పోఁగొట్టుకొన్నవా రయి భార్య లింటికి కాపురమునకు వచ్చునప్పటికి తిండికి లేక తిరిపె మెత్తుకోవలసినస్థితిని పొందుచున్నారు. మఱికొన్నిచోట్ల వారి వివాహములనిమిత్తమయి చేసిన ఋణములను వారి మనుమ్మలును వారి సంతతివారునుకూడ తీర్చుకోవలసినవా రగుచున్నారు. పనికిమాలిన బాల్యవివాహములకయి దుర్వ్యయము చేయుటకంటె, ఆధనములో కొంతభాగము పెట్టి బాలురకు విద్య చెప్పించినపక్షమున వా రెంతసుఖపడుదురు? మనవారు బహ్వనర్థములకు మూలమయినయీబాల్యవివాహమును మాని పించి యేల తమబిడ్డల సుఖాభివృద్ధి చేయ బ్రయత్నింపరాదు? ముసలివాండ్ర వేడుకకొఱకు కడుపున పుట్టినబిడ్డలను పాడుచేయుట మానుష ధర్మ మగునా? తమ కంత వేడుక చూడవలెనన్న మనసున్నపక్షమున బొమ్మలపెండ్లిండ్లు చేయించి సుఖ మనుభవింపరాదా? అంతటితో తృప్తి కలుగక పోయినయెడల నిజముగా బిడ్డలనే పల్లకులలో పెట్టి యూరేగించి సంతోషమనుభవింపరాదా? "ఎలుకకు ప్రాణసంకటము పిల్లికి చెల్లాటము" నన్నట్లు ముసలివాండ్రయొక్కయు మూర్ఖులయొక్కయు వినోదముకొఱకు పసిబాలికలయొక్కయు బాలురయొక్కయు సుఖము చెడఁగొట్టుట క్రూరకృత్యము కాదా? తల్లియొక్క యగవుతగవులనిమిత్తమును వేడుకలనిమిత్తమును బిడ్డలకు వివాహము చేయుటయు, వానివలన కలిగెడుకీడుల నాబిడ్డ లనుభవింపవలె ననుటయు నెంత కానిపని?

ఈబాల్యవివాహములు మనదేశములో చిరకాలమునుండియు

న్నను, ఇప్పు డంతకంతకు ప్రబల మగుచున్నవి. నాచిన్నతనములో ఏడెనిమిది సంవత్సరములకు లోపు వయస్సుగలబాలికలకు వివాహము చేయుట ఎక్కడనో యరుదుగానుండుచు వచ్చెను. ఇప్పుడు పాలు విడువని బాలికలకుసహితము వివాహములు చేయుట సర్వసామాన్య మగుచున్నది. ఈదురాచార మొక్క పామరులలో మాత్రమేకాక చదువుకొన్నవారిలో కూడ వ్యాపించుచున్నది. ఇక్కడి విద్యాశాల యందు సర్వకళాశాలాపరీక్షకు చదువుకొనుచు బహుధైర్యముతో బాల్యవివాహము లనర్థదాయకములని వాదించుచువచ్చిననామిత్రుఁడే యొకఁడు తనవంతు వచ్చినప్పుడు కొమార్తెకు నాలుగుసంవత్సరముల యీడు వచ్చులోపలనే వివాహము చేయఁగా చూచి యున్నాను. చదువుకొన్న వారికిని, చదువుకొననివారికిని మాటలయందు తప్ప కార్యములయం దంతగా భేద మగపడుచుండ లేదు. ఈనడుమను చెన్నపురమునందు జరిగిన మహాసభలో సర్వకలాపరీక్షలం దేటి పట్టపరీక్ష నిచ్చి మెప్పించినంత మహావిద్యావంతులు కూడ తమ కొమార్తెలకు పదిసంవత్సరములకు లోపల వివాహము చేయకుండు టకు బద్ధుల మయ్యెదమని వాగ్దానము చేయలేకపోయిరి. వారందుకు కనఁబఱిచిన హేతుబలమును కొంచెము చిత్తగింపుఁడు. ఈకొమార్తె లను గన్నతండ్రులు తామే తల్లిదండ్రులచాటు బిడ్డలఁట! స్వాతం త్ర్యము లేనివా రఁట! ఉన్నను తల్లిదండ్రులమనస్సులను నొప్పింప నిష్టము లేనివారఁట! అహా! లోకములో నింతకంటె బానిసతన మేమున్నది? వివాహవిషయమయిన సాధకబాధకముల నాలోచించు కొను స్వాతంత్ర్యము వివాహసంబంధము వలని సుఖదుఃఖములను యావజ్జీవమును అనుభవింప వలసిన వధూవరులకును లేక, వారి తల్లి దండ్రులకును లేక, అంతలపొంతలవారికా యుండవలసినది? పట్ట పరీక్షలం గృతార్థులైనవారు తాము స్వతంత్రముగా పొట్టపోసికోలే

మను భయముచేతనా తా మయుక్తమని యెఱిఁగినదియు తాము ప్రేమించెడివారికి నష్ట కరమయినదియు నైన యకార్యమును చేయ వలసినది! తమ కడుపున పుట్టినవారి సౌఖ్యాభివృద్ధితో చేరిన యీవిష యమునందే స్వాతంత్ర్యము లేకపోయినయెడల మఱియేవిషయము నందుఁ గలుగును? కారణము లేనివిషయములలో న్యాయము కాని కట్టుకట్టి కాటికి కాళ్ళుచాచుకొని యున్నవృద్ధు లయినజననీజనకుల మనస్సును నొప్పింపలేనంత దయార్ద్రహృదయముగలవారు, కల కాలము సుఖముగా బ్రతుకవలె నని కొండంతయాశ పెట్టుకొని దయనీయులయి తమకడుపునపుట్టిన ముక్కుపచ్చలారని ముద్దుకూఁతు లను వేగిరపడి స్వయంకృతాపరాధమువలన యావజ్జీవమును దుఃఖ ములపాలు చేయఁగలరా? ఈరీతి సాకులను విడిచిపెట్టి మనలోని చదువుకొన్నవారు తాము మంచికార్యమని దృఢముగా నమ్మిన దానిని పామరులకు భయపడక నిశ్శంకముగా నెప్పుడు చేయ నారం భింతురో, అప్పుడే మనదేశము బాగుపడ నారంభించునుగాని క్రియ లేని శూన్యవచనములచేత నెప్పుడును బాగుపడదు. "చదువవేసిన నున్న మతియుచెడిన" దన్నట్టు మనదేశమున చదువు హెచ్చుటతోనే బాల్యవివాహములును హెచ్చుచున్నవి. పూర్వకాలమునందు బ్రాహ్మ ణులు కానివారు కన్నులు తెఱవని పసికూనలకు వివాహము చేయు చుండుట సాధారణముగా లేదు. ఈకాలమున మూఁడేండ్లకు ముండ మోసిన బాలికలుగూడ శూద్రులలో కనఁబడుచున్నారు. ఇప్పుడు నష్టకరములని యెంచి బ్రాహ్మణులు తమ యాచారములను కొన్ని టిని మానుకొన ప్రయత్నించుచుండఁగా లాభనష్టములను కొంచె మయినను విచారింపక శూద్రులు మొదలయినవారు కొందఱు బ్రాహ్మణు లాచరించినట్టు తా మాచరించినచో తమకు గౌరవము వచ్చునని యెంచుకొని యనాలోచితముగా బ్రాహ్మణుల దురాచార

ములను కొన్నిటి నవలంబించుచున్నారు. అందుచేత పూర్వకాలము నందు బ్రాహ్మణ వైశ్యజాతులలో మాత్రమే యున్న బాల్యవివాహము లిప్పుడు సర్వవర్ణసామాన్యములయి శూద్రులలో కూడ వెలయుచున్నవి. శూద్రులు చేయనారంభించిన పనినే తామును చేయుచున్నచో తమకు గౌరవాధిక్యము లేదనుకొని యాలోచనలేని బ్రాహ్మణోత్తములు తా మేలాగున నయినను వారిని మించవలెనని యొకరు ప్రయత్నించుచుండుటచేత కడపట నందఱును చెడుచున్నారు. అందుచేత నీవివాహములు క్రమక్రమముగా వివేకులకుఁ బరిహాసపాత్రములయి, పెండ్లిపీటమీఁద పెండ్లికొడుకు తల్లిని గానక యేడుచుటయు, పెండ్లికూఁతురు పాలకై యేడుచుటయు, వారి నోరుపుడుపుటకయి కొన్నిసమయములయందు బెత్తము చేతఁ బట్టుకొని యయ్యవారును మఱికొన్ని సమయములయందు పప్పు బెల్లములును కావలసివచ్చుటయు, భార్య యెవ్వరో తెలియక పిల్ల నొడిలోఁ బెట్టుకొని చన్నుగుడుపుచున్న తల్లి మెడకే పెండ్లికొడుకు మంగళసూత్రధారణము చేయుటయు, పోరుపెట్టిన పెండ్లికొడుకుచేత పుస్తె కట్టించుటకు చేతఁగాక పురోహితుఁడే పెండ్లికొమార్తెకు తాళిబొట్టు కట్టి వివాహతంత్రము నడుపుటయు, దటస్థించుచున్నది. మూఢము లనియు శూన్యమాసము లనియు, పయిసంవత్సరము లగ్నములు లేవనియు, చెప్పి యనుగ్రహించెడి జ్యోతిష్కులముహూర్తములు కూడ బాల్యవివాహములను త్వరపెట్టుచున్నవి. ఈజ్యోతిషముచేత జనులు మోహపడి జాతకపత్రిక బాగుండలే దను హేతువుచేత కులములో దొరక తగిన వారిలో కూడ మంచిమంచి వరులను నిరాకరించి యధములను స్వీకరించుచున్నారు. ఇందుచేతకూడ బహుదాంపత్యములు సుఖదాయకములు కాకున్నవి ఈముహూర్తములవలన జ్యోతిషమునే వృత్తిగా నేర్పఱచుకొన్న వారి కుటుంబపోషణము జరుగుచుండుట తప్ప నాకు

వేఱు ప్రయోజనము గుపడుచుండ లేదు. తక్కిన యే శుభకార్యముల కెట్లు చేసినను వివాహకార్యమునందు మాత్రము వరుని జాతకపత్రము పరిశీలింపించికొననివారును మంచిముహూర్తమును పెట్టించుకొననివారును సాధారణముగా నుండరు. అట్లయినను ముహూర్తమును పెట్టించుకొనని హూణులు మొదలయినవారిలోకన్న సుముహూర్తములకు కాలమును ధనమును వెచ్చపెట్టెడు హిందువులలోనె విధవ లధికముగానున్నారు. జ్యోతిషమువలన ప్రయోజనలేశమయినను కలిగినయెడల శుభలగ్నములయందు వివాహిత లయినవారిలో నిన్నిలక్షలమంది బాలవిధవ లెందుచేత కావలయునా యని నాకు సందేహము కలుగుచున్నది. ఇట్టి సందేహమే మనవారి కందఱికిని కలిగెడుపక్షమున, ముహూర్త మృత్యుదేవతనోటినుండి విధవలు కాకుండ ప్రతిసంవత్సరమును లక్షలకొలఁది పసిబాలికలను కాపాడ వచ్చు నని నాకు తోఁచుచున్నది. అది యట్లుండ నిండు.

మనవారిప్పుడు సామాన్యముగా బ్రాహ్మణవర్ణమునకు, హిందూశాస్త్రములు బాల్యవివాహములు విధించుచున్న వనియు, శాస్త్రవిధానము దుర్లంఘ్యమనియు భావించుచున్నారు. అట్టివారికి సంశయనివారణము కలుగుటకయి నాకుఁ దెలిసినంతవఱకు వివాహవిషయమునఁ గల శాస్త్రమునుకూడ సంగ్రహముగా వివరింతుచున్నాను. వేదమంత్రములును మంత్రవినియోజకవాక్యము లయిన కల్పసూత్రములును సంబంధించి యున్నంతవఱకును, బాల్యవివాహముల కనుజ్ఞ యెక్కడను లేదు సరిగదా, వ్యక్తురాలయిన కన్యకే వివాహము చేయవలసినట్టుకూడ కనఁబడుచున్నది.

వివాహమంత్రములోని "సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః తృతీయో అగ్నిష్టే పతి స్తురీయ స్తే మనుష్యజాః ॥ సోమో దద ద్గంధర్వాయ గంధర్వో దద దగ్నయే । రయించ పుత్రాం

శ్చాద్దాదగ్ని ర్మహ్యమధో ఇమాం॥" అను ఋగ్వేద వచనమునుబట్టి కన్నియను మొదట సోముఁడు వరించుననియు, తరువాత గంధర్వుఁడు వరించుననియు, అటుపిమ్మట నగ్ని వరించుననియు, ఆపయిని మనుష్యుఁడు వరించు ననియు, కన్నియను సోమాదు లొకరితరువాత నొకరికియ్యఁగా కడపట మనుష్యునకు వచ్చుననియు, శాస్త్రమర్యాద యున్నది. కన్నియను పురుషుఁడు వివాహ మాడుటకుముందు సోమాది దేవతలు వరించవలసిన పక్షమున, ఆసోమాదులు వరించెడికాలమేది, అటుతరువాత మనుష్యుఁడు పొందవలసినకాలమేది, అవి తెలిసికోవలసియుండును. దీనికాధారముగా సంవర్తస్మృతియందు 'శ్లో॥ రోమదర్శన సంప్రాప్తే సోమో భుఙ్క్తేథ కన్యకాం। రజోదృష్ట్వాతుగంధర్వాః కుచౌదృష్ట్వాతుపావకః॥" అని యర్థోరోమదర్శన కాలమందుసోముఁడునురజోదర్శనకాలమునందు గంధర్వుఁడును కుచదర్శన కాలమునందు పావకుఁడును వరింతురనియు, అటుపిమ్మట నగాఁగా కన్నియయు కౌవయస్సు వచ్చి రజస్వలయయి కుచపరిపూర్తి యయినపిమ్మట నేపురుషుఁడుపివాహ మాడవలయుననియు, ప్రమాణవచనము కనఁబడుచున్నది. దీనినిబట్టి చూడఁగా నీడేఅనివారిని వివాహ మాడకూడదనియేకదా స్పష్టమగుచున్నది. రోమదర్శనాది కాలములయందు సోమాదులు వరింతురనఁగా వారా కాలములయందు వరుసగా శరీర శుచిత్వమును, వాక్చాతుర్యమును, పరిశుద్ధతను కలుగఁజేయుదురని తాత్పర్యమే కాని వారు నిజముగా వరింతురనియే యర్థముకాదు. అందుచేతనే యాజ్ఞవల్క్యస్మృతియందు "శ్లో॥ సోమ శ్శౌచం దదౌ స్త్రీణాం గంధర్వాశ్చ శుభాంగిరం। పావకస్సర్వమేధ్యత్వం మేధ్యావై యోషితో హ్యతః॥" అని స్త్రీలకు సోముఁడు శౌచమునిచ్చుననియు, గంధర్వుఁడు మంచి పలుకులనిచ్చుననియు, పావకుఁడు సర్వపరిశుద్ధతలనిచ్చు ననియు, కంఠోక్తిగాఁ జెప్పబడియున్నది. ఈ శ్లోకములోని కడపటి చరణమునకు

వ్యాఖ్యానముచేయుచు విజ్ఞానేశ్వరయోగి "స్త్రియస్సర్వత్ర స్పర్శనాలింగనాదిషు శుద్ధాః" అని వ్రాసియున్నాఁడు. కాఁబట్టి స్త్రీలు వివాహకాలమునకు సంపూర్ణావయవములు కలవారయి యీడేఁటి వాక్ప్రౌఢిమ కలవారయి యుండవలెనని యేర్పడుచున్నది. శ్రుతిస్మృతులయందీప్రకారముగా నుండఁగా బాల్యవివాహములను వ్యాపింపఁజేసినవారు జ్యోతిర్నిబంధమను గ్రంథములోని దగు "శ్లో॥ షడబ్దమధ్యే నోద్వాహ్యా కన్యా వర్షద్వయంయతః। సోమోభుఙ్క్తే తత స్తద్వద్గంధర్వశ్చ తథానలః॥" అని స్త్రీ కాఱేండ్లలోపల వివాహము చేయఁగూడదనియు, సోమగంధర్వపావకులు రెండేసి సంవత్సరము లనుభవింతురనియు వ్రాసి, సోమాదు లనుభవించుకాల మాఱేండ్లలోనే పోవుననియు నేడవయేఁడు మొదలుకొనియే కన్నియ వివాహయోగ్యురాలనియు బోధపడునట్లు చేసియున్నారు. కాని సోమాదులు కన్నియను పసితనములోనే వరించి శౌచాదుల నిత్తురనుట యుక్తికిని శాస్త్రమునకునుకూడ విరుద్ధము. గంధర్వుని నుద్వాహము చేయునప్పుడు వివాహములో పఠించెడు ఋగ్వేదమంత్రములోనే "ఉదీర్ష్వాతో విశ్వావసో నమసేడా మహేత్వా। అన్యామిచ్ఛ ప్రఫర్వ్యగ్ంసంజాయాంపత్యా సృజ। ఉదీర్ష్వాతః పతివతీహ్యేషా విశ్వావసుం నమసా గీర్భి రీట్టే। అన్యామిచ్ఛపితృషదం వ్యక్తాగ్ంసతే భాగో జనుషాతస్యవిద్ధి" అని గంధర్వుఁడయిన విశ్వావసుఁడు వివాహితయయిన యాస్త్రీని విడిచిపెట్టి వ్యక్తురాలు కాని పితృగృహముననున్న యవివాహితకన్య యొద్దకు పోవ ప్రార్థింపఁబడుచున్నాఁడు. ఇట్టి బలవత్తరమయిన శ్రుతి ప్రమాణముండఁగా నిర్ణయసింధువునం దుదాహరింపఁబడిన పయివచనమునుబట్టి కన్నియకు నాలవయేటనే స్తనోద్గమము కలుగుననికాని, ఏడవయేటనే వివాహము చేయవలెననికాని, వివేకు లెవ్వరయిన చెప్పసాహసింపఁగలరా?

అంతేకాక వివాహములో నాలవదినమున వధూవరులకు జరిగెడి సంభాషణములో "అపశ్యం త్వా మనసా చేకితానం తపసో జాతం తపసో విభూతం। ఇహప్రజా మిహరయిగ్ంరరాణః ప్రజయా స్వప్రజయాపుత్రకామ" అని వరునిగూర్చి వధువు 'నీవు యోగ్యుఁడవును తపసుచేత పుట్టి తపస్సుచేత వర్ధిల్లితివనియు నేను మనస్సుచేత తెలిసికొంటిని గనుక, నాయందు పుత్రకాముఁడవయి యున్న నీవిఁక సంతోషపూర్వకముగా సంతానము పొందుమనియు, "అపశ్యం త్వా మనసాదీధ్యానాగ్ం స్వాయాం తనూగ్ం ఋత్వియేనాధమానాం। ఉపమాముచ్చా యువతిర్బభూయాః ప్రజయాత్వ ప్రజయాపుత్రకామే" అని వధువునుగూర్చి వరుఁడు 'నీవీసమయమునందు నాధునితో కూడవలె నని యపేక్షించుచున్నట్టు నామనస్సుచేత కనిపెట్టితిని గనుక, యువతివయి పుత్రకామురాలవయి యున్న నీవు నన్ను పొంది సంతానము కనుము' అనియు, మంత్రములచేత చెప్పుదురు. ఇటువంటి సంభాషణము సంభోగమునూట యటుండఁగా వివాహమనఁగా నేమో యెఱుఁగని బాలునకును బాలికకును జరిగెడిదని మతిమంతుఁ డెవ్వఁ డయిన చెప్పఁగలుగునా? వివాహ దినములలోనే వరుఁడు వధువునుగూర్చి "గృహాం గచ్ఛ గృహపత్నీ యథా సోవశినీ త్వం విదథమావ దాసి" అను ఋగ్వేదమంత్రముచేత 'నీవు గృహమునకువచ్చి గృహయజమానురాల వయి యింటికి వచ్చిన వారి నాదరించి గృహకృత్యములను నిర్వహింపు' మని పలుకుటయు, వధువునుగూర్చి బ్రాహ్మణులు "ఇహప్రియం ప్రజయా తే సమృధ్యతా స్మిన్ గృహే గార్హపత్యా యజాగృహి। ఏనాపత్యాతన్వగ్ం సంసృజస్వాధాజి ప్రీవిదథమావదాథః" అను ఋగ్వేదవచనముచేత 'ఇప్పుడు ప్రియపడి నీ వీగృహమునందు సంతానమును పొంది గృహ యజమానత్వము నందు జాగరూకురాల వయి, నీశరీరమును నీపతి

శరీరముతో చేర్చి మీరు ముసలివారగువఱకును గృహమునను పరామర్శింపుము' అనిపలుకుటయు, బాల్యవివాహమున కిసుమంతయుయినను పొసఁగి యుండునా? ఆపస్తంబ, ఆశ్వలాయనాది సూత్రము లన్నియు వధూవరులు మూడుదినము లధశ్శయ్యనుండి బ్రహ్మచర్యము చేయవలెననియు నాలవదినము రాత్రి గర్భాధానము జరగవలె ననియు విధించుచున్నట్టును, గర్భాధానముతోగాని వివాహపూర్తి కానట్టును శాస్త్రజ్ఞానము కలవారి కందరికిని తెలియునుగదా? ఇప్పుడు జరుగుచున్న శాస్త్రవిరుద్ధ మయినబాల్యవివాహములలో వివాహమున కావశ్యకమయిన గర్భాధానమును జరపకపోయినను మన పురోహితులు నాలవనాటిరాత్రి గర్భాధానమంత్రముల నేకరువు పెట్టుచుండుట నందఱు నెఱుఁగుదురుగదా? ప్రాచీనము లయిన మన ధర్మశాస్త్రము లన్నియు యుక్తవయస్సు వచ్చిన స్త్రీలకే వివాహమును విధించుచున్నవి. అందుచేతనే మన ధర్మశాస్త్రకర్తలు వివాహయోగ్యకన్యా ప్రాశస్త్యమును చెప్పునప్పుడు "శ్లో॥ కన్యాక్షతయోనిః స్యాత్కులీనా పితృమాతృతః। బ్రహ్మాదిషు వివాహేషు పరిణీతా యధావిధి॥ సా ప్రశస్తా వరారోహా శుద్ధయోనిః ప్రశస్యతే" అని బ్రాహ్మాది వివాహములయందు కులీనురాలును పురుషసంభోగ మెఱుఁగనిదియు ప్రశస్తురా లని వృద్ధగౌతముఁడును, "గృహస్థో వినీతక్రోధహర్షో గురుణానుజ్ఞాతః స్నాత్వా అసమానార్షా మస్పృష్టమైథునాం యవీయసీం సదృశీం భార్యాం విందేత" అని వరుఁడు గురువుయాజ్ఞ పొంది పురుషసంసర్గ మెఱుఁగని తనకంటె చిన్నదానిని వివాహ మాడవలయునని వసిష్ఠుఁడును, "శ్లో॥ అసపిండాచ యా మాతు రసగోత్రాచ యా పితుః। సా ద్విజానాం ప్రశస్తా స్త్రీ దారకర్మణ్యమైథునీ" ద్విజాతులలో మైథున మెఱుఁగని స్త్రీ భార్యగా స్వీకరించుటకు ప్రశస్తురాలని మనువును, బ్రాహ్మ్యాదివివాహములయందు పురుషసంభోగము లేని కన్నియలనే

ప్రశస్తురాండ్రనుగాఁ జెప్పియున్నారు; రజస్వలలు కానివారికే ద్విజాతులలో వివాహములు జరగవలెనని యీ ఋష్యాదు లుద్దేశించి యుండినయెడల, వా రుపయోగించిన అక్షతయోని, శుద్ధయోని, అస్పృష్టమైథునా, అమైథునా, అను పదము లన్నియు వ్యర్థములగును గదా? ఇది యిటుండఁగా మనువు మొదలగువారు వ్యక్తురాండ్రైన స్త్రీలకు వివాహములు విధించియున్నారు. "శ్లో॥ త్రీణివర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీసతీ। ఊర్ధ్వంతుకాలాదేతస్మాద్విందేత సదృశంపతిం॥ అదీయమాన భర్తార మధిగచ్ఛే ద్యది స్వయమ్। నైనఃకించిదవాప్నోతి నచయం సాధిగచ్ఛతి॥" అని కుమారి ఋతుమతి యైనతరువాత మూఁడు సంవత్సరములు వేచియుండి, తండ్రి వివాహము చేయని యెడల స్వయముగానే వరుని కోరుకోవచ్చు ననియు, ఆప్రకారముగా వరించిన స్త్రీ గాని దాని భర్తగాని యేవిధ మయిన పాపమును పొందరనియు, మనువు స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. "త్రీణి వర్షా ణ్యృతుమతీ కాంక్షేత పితృశాసనమ్। తత శ్చతుర్థే వర్షే తు విందేత సదృశం పతిమ్॥" ఋతుమతి యైనస్త్రీ మూఁడు సంవత్సరములు తండ్రి యాజ్ఞకయి వేచియుండి నాలవ సంవత్సరమున తగినభర్తను కోరుకోవలసినదని బోధాయనులు చెప్పియున్నాఁరు. "ఋతుత్రయ ముపాస్యైవ కన్యాకుర్యాత్స్వయంవరమ్" అని మూఁడుఋతువు లైనతరువాత కన్య స్వయముగానే వరింపవచ్చునని విష్ణుస్మృతియందును జెప్పఁబడి యున్నది. ఇట్లు వీరందఱును ఋతుమతి యైనతరువాత వివాహము నంగీకరించుటయేకాక, మంచి వరుఁడు దొరకని పక్షమున కొంతికాలమయినను కన్యను వివాహము లేకయే యుంచవచ్చునని కూడ మన్వాదులు విధించి యున్నారు. "శ్లో॥ కామమామరణాత్తిష్ఠే ద్గృహేకన్యర్తుమత్యపి। నత్వేవైనాం ప్రయచ్ఛేత గుణహీనాయ కర్హిచిత్॥" అని కన్య ఋతుమతి యైనను

మరణపర్యంతమును గృహమునసే యుంచవలసినదికాని గుణహీనున కెన్నఁడును నియ్యఁగూడదని మనువును "దద్యా ద్గుణవ తే కన్యాం నగ్నికాం బ్రహ్మచారిణే। అపివా గుణహీనాయ నోపరుంధ్యా ద్రజ స్వలామ్॥" అని కన్యను గుణవంతుఁడయిన బ్రహచారి కియ్యవలసి నదేకాని రజస్వలనైనను గుణహీనుని కియ్యఁగూడదని బోధాయను లును, మఱికొందఱు ఋషులును చెప్పి యున్నారు. ఇట్లు చెప్పి నను రజస్వలయైన కన్యను వివాహములేక చిరకాల మింట నుంచిన పక్షమున చోరరతియు దానిఫలములైన భ్రూణహత్యాదు లును సంభవింపవచ్చునని యెంచి కొందఱు ఋషులు రజస్వలయైన దానిని శీఘ్రముగా వివాహము చెయ్యనిపక్షమున పాపము వచ్చునని చెప్పియున్నారు. "శ్లో॥ ప్రాప్తే ద్వాదశమే వర్షే యః కన్యాం నప్ర యచ్ఛతి। మాసిమాసి రజస్తస్యాః పితా పిబతి శోణితమ్॥" పండ్రెండవ సంవత్సరము వచ్చినతరువాత తండ్రి కన్యకకు వివాహము చేయని పక్షమున, ప్రతిమాసమునందును నాచిన్నదాని ఋతురక్తమును పానము చేసినట్లని యమస్మృతియందును, ఇత్యాదివచనములు కొన్ని మఱి కొన్ని చిల్లరస్మృతులయందును గానఁబడుచున్నవి. మన్వాదులు ధర్మ కార్యమునిమిత్తమయి కొన్ని సమయములయందు మాత్రము కొంచెము బాల్యవివాహముల కనుజ్ఞ యిచ్చియున్నారు. "శ్లో॥ త్రింశద్వర్షోద్వ హేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీమ్। త్ర్యష్టవర్షోష్టవర్షోవా ధర్మే సీదతి సత్వరే॥" ధర్మమునకు గావలసినప్పుడు ముప్పదిసంవత్స రములవాఁడు పండ్రెండేఁడ్ల చిన్నదానిని ఇరువదినాలుసంవత్సరముల వాఁడు ఎనిమిదేండ్లదానిని వివాహమాడవచ్చునని మనువు వ్రాసి యున్నాఁడు. ఇట్టిస్థలములలోతప్ప సాధారణముగా బాల్యవివాహ ములు చేయకూడదు. బాల్యవివాహములు పూర్వకాలమునందు లేవుగనుకనే యత్రిస్మృతియందు "శ్లో॥ వివాహే వితతే యజ్ఞే

హోమకాల ఉపస్థితే। కన్యాం ఋతుమతీం దృష్ట్వా కథం కుర్వంతి యాజ్ఞికాః॥ స్నాపయిత్వాతు తాం కన్యా మర్చయిత్వా హుతాశనమ్। యుంజానహోమం కుర్వీత తతః కర్మ ప్రయోజయేత్॥" అని కన్య వివాహమధ్యమున ఋతుమతి యైనపక్షమున స్నానములు మొదలయినవి చేయించి కర్మ జరపవలసినదని చెప్పఁబడి యున్నది. మన పురాణములయందు సహితము పూర్వకాలమునందు బాల్య వివాహములు జరిగిన జాడను విని యుండలేదు. "శ్లో॥ పితా దృష్ట్వా సుమంతోపి స్త్రీచిహ్నంయౌవనే స్థితా। కస్మై దేయా కన్యేత్యచింతయ దతీవ సః॥ మునిః కౌండిన్యనామా వైవాహేచ్ఛురథాగతః। తస్మై ప్రదేయా కన్యేతి సుమంత్వే నాపి నిశ్చితమ్॥" అని సుమంతుఁడను బ్రాహ్మణుఁడు స్త్రీచిహ్నములు ధరించి యౌవనవతియై యున్న తన కొమార్తెను కౌండిన్యున కిచ్చినట్లును, ఇట్టి వివాహము లనేకములు జరుగుచుండినట్లును పురాణముల యందు పెక్కుచోట్ల కానఁబడు చున్నది.

ఇదిగాక మనపూర్వులు పురుషులలో బాల్యవివాహముల కవకాశము లేకుండనే కట్టుదిట్టము లేర్పఱిచియున్నారు "శ్లో॥ గర్భాష్టమేబ్దే కుర్వీత బ్రాహ్మణస్యోపనాయనమ్। గర్భా దేకాదశే రాజ్ఞో గర్భాత్తు ద్వాదశే విశః॥ ఆషోడశా ద్బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే। ఆద్వావింశా త్క్షత్రబంధో రాచతుర్వింశతే ర్విశః॥" అను వచనములనుబట్టి బ్రాహ్మణుల కేడవసంవత్సరము మొదలుకొని పదియాఱవ సంవత్సరము లోపలను, క్షత్రియులకు పదవసంవత్సరము మొదలుకొని యిరువదిరెండవ సంవత్సరములోపలను, వైశ్యులకు పదునొకొండవ యేడు మొదలుకొని ఇరువదినాల్గవ సంవత్సరము లోపలను ఉపనయనము జరుగవలసియున్నది. "శ్లో॥షట్త్రింశ దాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్। తదర్ధికంవా పాదంవా గ్రహణాంతికమే

వవా॥" అను ననువచనమునుబట్టి బ్రహ్మచర్యము చేయవలసిన కాల మెప్పుడును తొమ్మిదిసంవత్సరములకు తక్కువ యుండదుగనుక, ఎవ్వరికిని పదియాఱు సంవత్సరములలోపల వివాహ మాడుటకే వీలు లేదు. ఇది యిట్లుండగా బాల్యవివాహమున కాధారముగా నేమి ప్రమాణము లున్నవాయని యాలోచింపఁగా, "శ్లో॥ అష్టవర్షాభవేద్గౌరీ నవవర్షాతురోహిణీ। దశవర్షా భవేత్కన్యా అత ఊర్ధ్వంరజస్వలా॥" అన్న వచనముతప్ప మఱియేదియు కనఁబడదు. వివాహమంత్రము లయందు కన్యాశబ్ద మగుపడుచుండుట చేతను స్మృతులయందుకూడ కన్యాశబ్దమే తఱుచుగా కనఁబడుచుండుట చేతను, బాల్యవివాహము ను నెలకొల్పనెంచినవా రెవరో యీశ్లోకమును కల్పించి, కన్యాశబ్ద మునకు విపరీతార్థ మిచ్చి స్వాభిమతము నెఱవేఱునట్లుగా నొక స్మృతి యందు కలుపఁగా తక్కినవారును దానిని స్వీకరించి యుందురు. అట్లు కానియెడల నీ సంకేతనామముల కేమిప్రయోజనము కలదు? వానికి కొంచెము ప్రయోజన మగుపడునట్లుగా, "శ్లో॥ గౌరీందదన్నాకపృష్ఠం వైకుంఠం రోహిణీం దదత్। కన్యాం దద ద్బ్రహ్మలోకం రౌరవం తు రజస్వలామ్॥" అని మఱియొకశ్లోకము కల్పింపఁబడినది. ఈ కడ పటి శ్లోకమే లేకపోయినయెడల గౌరీ, రోహిణీ శబ్దములతోడ ప్రయో జనమే యుండదు. కొన్ని స్మృతులయందు నగ్నికా శబ్దము కనబడు చున్నందున దానినికూడ బాలికాపరముగా పర్యవసితము చేయుట కయి "శ్లో॥ అష్టమేతుభవే ద్గౌరీ నవమేనగ్నికా భవేత్। దశమే కన్య కా ప్రోక్తా ద్వాదశే వృషలీ తథా॥" అని పయిదానికి విరుద్ధముగా మఱియొక శ్లోకము కల్పింపబడినది. వివాహానుక్రమణిక యందు "శ్లో॥ కన్యాం కనకసంపన్నాం కనకాభరణై ర్యుతాం। దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోకజిగీషయా॥" అని కన్యాదాన మొక్కటి యే చెప్పఁబడి యున్నది. కాని రోహిణీగౌరీదానము లెక్కడను

చెప్పఁబడి యుండలేదు. కన్యాశబ్దమునకు సాధారణముగా వివాహముకాని పడుచే యర్థ మయినను కొన్ని స్మృతులయందు "ఋతుస్నాతాతు శుద్ధా యా సా కన్యే త్యభిధీయతే" అని ఋతుస్నాతయే కన్యయనియు, అట్టి కన్యావివాహమే ముఖ్యమయినదనియు చెప్పఁబడి యున్నది. బ్రాహ్మణకన్యల కెనిమిదవయేట వివాహము చేయవలెనని యొకానొక చిల్లరస్మృతియందు ప్రక్షిప్త వచన మొకటి కానఁబడుచున్నది. పయిని చెప్పిన శ్లోకములు ప్రక్షిప్తములు కాకపోయినను, వానియందు సహితము పదిసంవత్సరములదే కన్యయని చెప్పఁబడియున్నది గనుక, నేను పయినిచూపిన బాధకములను చక్కఁగా విచారించి పదిసంవత్సరములకు లోపలనయినను బాలికకు వివాహము చేయక మనవారు జాగరూకు లయి యుందురని నమ్ముచున్నాను. ఇందులో ముఖ్యముగా చదువుకొన్నవారు తమచేత నయినంత ప్రయత్నము చేసి తమయింట నతిబాల్యవివాహములు చేయకయు, తమ పలుకుబడి యున్నంతవఱకు చేయనీయక వారించియు, తెలియనివారికి బాల్యవివాహమువలననష్టములను చెప్పియు, నుపన్యసించియు, ప్రకటించియు, పాటుపడుదురని నమ్ముచున్నాను. మనలోని విద్యార్థికుల కిటువంటి సద్బుద్ధి నుదయింపఁ జేసి, శీఘ్రకాలములోనే యతిబాల్యవివాహములు మన దేశములో నామమాత్రావశేషము లగునట్లు ప్రసాదించి, ఈ భరతఖండమునకు పూర్వపుమంచిదశను మరల కలిగింప జగదీశ్వరుని ప్రార్థించుచున్నాను.

# విగ్రహారాధనము

ఓ ప్రియసహోదరులారా!

మనుష్యుఁ డనుభవింపఁ దగిన సమస్తానందములలోను, పొందఁ దగిన సమస్తాభివృద్ధులలోను, ఆత్మానందాభివృద్ధులు మహోత్కృష్టములయిన వని వివేకుల కందఱికిని తెలిసిన విషయమే కదా? ఈ యానందాభివృద్ధులు సత్య మయిన యీశ్వరారాధనమువలనను, సత్య మయిన జ్ఞానమువలనను కలుగు ననియు కొంచెమాలోచించి చూచువారి కెల్లను ఇంచుమించుగా తెలిసెడి విషయమే. సత్య మయిన జ్ఞానమును వ్యాపింపఁజేసి పరిశుద్ధ మయిన యీశ్వరారాధనమును వర్ధిల్లఁ జేయవలెనన్న పక్షమున, మనుష్యబుద్ధి కల్పితములయి మతమునం దనావశ్యకముగా ప్రవేశించి చిరకాలమునుండి యీశ్వరైకార్హ మయినపూజ నక్రమముగా ననుభవించుచున్న యసత్యదేవతల యొక్కయు కుత్సితప్రతిమల యొక్కయు ఆరాధనమును మూలముట్టుగ తొలగించుటకయి ప్రబల ప్రయత్నము చేయవలయును. ఇట్టి ప్రయత్నమువలనఁ గొందఱికి చిత్తశాంతి పోయి మనస్తాపము కలుగుట యనివార్యమే యయినను, ఒరులమనస్సునకు నొప్పి కలుగఁ జేయుట నాకెంత యిష్టము లేకపోయినను మానవకోటియొక్క నిత్యానందమునకు భంగము కలుగుచున్నప్పుడును సర్వకారుణ్యుఁ డయిన పరమేశ్వరునికి చెందవలసిన భక్తికైంకర్యాదులు తుచ్ఛములయిన విగ్రహములపాలయి మౌఢ్యముచేత నీశ్వరమహిమ మఱుఁగుపఱుపఁ బడుచున్నప్పుడును మాత్రము నాశక్తియుక్తుల నెల్లను వినియోగపఱిచి, ఆనందసస్యము పెరుఁగక బీడుపడియున్న యస్మద్దేశీయుల

హృదయ క్షేత్రములయం దీశ్వరరాజ్యబీజమును స్థాపించుటకయి పాటుపడక, జడములయిన ప్రతిమలయందును ప్రతిమలను నమ్మి కొలుచువారియందును దాక్షిణ్యము వహించి నే నూరకుండఁజాలను. ప్రతిమార్చనము తగదన్న దోషమునకయి మూఢులును, జనులను మౌఢ్యమునం దుంచి వారి మౌఢ్యమువలననే కుటుంబభరణము చేసికొని లాభముపొంద నలవాటుపడిన స్వప్రయోజనధురంధరులును నన్ను నిష్కారణముగా నాస్తికుఁ డనియు బౌద్ధుఁడనియు నిందించినను నిందింపనిండు. పామరులయొక్కయు స్వార్థపరులయొక్కయు దూషణలను, ప్రతిబంధములను పాటిగాఁ బట్టక సత్యము నే యవలంబించెడు బుద్ధిని, వేయివిఘ్నములు వచ్చినను వెనుకతీయక నిశ్శంకముగా సత్యమును లోకోపకారార్థమయి బోధించునట్టి ధైర్యస్థైర్యాదులను, పరమకృపాళుఁ డయిన యీశ్వరుఁడు నాకు ప్రసాదించునుగాక !

సకల జగత్కర్తయైన యీశ్వరుఁ డొక్కఁడనియు, అతఁడు నిరాకారుఁ డగుటచేత బాహ్యేంద్రియములకు గోచరించువాఁడు కాఁడనియు, కేవలమానసైకవేద్యుఁ డనియు, సర్వమతములవారును నైకకంఠ్యముతో నంగీకరించిన రాద్ధాంతాంశమే గనుక దానిని స్థాపించుటకయి నేనిక్కడ యుక్తులు చెప్పి గ్రంథ బాహుళ్యము చేయవలసినపని లేదు. ముండకోపనిషత్తునందు "న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దేవై స్తపసా కర్మణావా । జ్ఞానప్రసాదేన విశుద్ధ సత్త్వః తతస్తుతం పశ్యతే నిష్కలం ధ్యాయమానః" అని యీశ్వరుఁడు నేత్రముచేతఁగాని, వాక్కుచేతఁగాని, ఇతరేంద్రియములచేతఁ గాని, తపస్సుచేతఁగాని, కర్మచేతఁగాని గ్రహింపఁబడఁడనియు, మన శ్శుద్ధి కలవాఁడు ధ్యానముచేసి యీశ్వరుఁడు ప్రసాదించిన జ్ఞానము చేతనే యూతనిని తెలిసికొనునవియు, చెప్పబడియున్నది. ఈశ్వరుని

ధ్యానమార్గముననే జ్ఞాననేత్రముచేతఁ జూడవలెనని యుపదేశించు టయేకాక వేదము బహుస్థలములయందు దేవుఁడు నిరాకారుఁ డని తెలిసికొని యారాధించువారికే కాని నిజమయిన యానందము లేదనియు ఘోషించుచున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తునందు "తతోయదుత్తర తరం తదరూప మనామయం య ఏతద్విదు రమృతా స్తే భవ న్త్య థేతరే దుఃఖమేవాపి యన్తి" అని యీశ్వరుఁ డుత్కృష్టపదార్థము లలో నెల్ల నుత్కృష్టుఁడనియు నిరాకారుఁడనియు నిరామయుఁడనియు నెవ్వ రెఱుఁగుదురో వారు నిత్యసుఖత్వమును పొందుదురు, తదితరులు దుఃఖమునే పొందుదురనియు, వివరింపఁబడి యున్నది. అంతేకాక యీశ్వరు ననేకముగాఁ జూచువారు మోక్షపదవి నందక చెడుదు రనియు, ప్రకృతినిగాని సృష్టిపదార్థమునుగాని యుపాసించువా రంధ కారమునఁ బడుదురనియు కూడ వేదమే మొఱ యిడుచున్నది. కఠోప నిషత్తునందు "మనసై వేదమా ప్తవ్యం నేహ నా నాస్తి కించన । మృత్యోః స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి" యని మనస్సుచేత మాత్రము బ్రహ్మము నందఁదగు ననియు అక్కడ ననేకమనునది లేదు కాఁబట్టి యిక్కడ ననేకమునుగాఁ జూచువాఁడు మృత్యువునుండి మృత్యువునకుఁ బోవు ననియు, మఱియు వాజసనేయోపనిషత్తునందు "అన్ధం తమః ప్రవిశంతి యేసంభూతి ముపాసతే, తతో భూయ ఇవ తే తమో యే సంభూత్యాగ్ంరతాః" అని ప్రకృతి నుపాసించువా రంధ కారమునం బ్రవేశింతు రనియు సృష్టిపదార్థముల నుపాసించు వా రంతకంటెను హీనమయినయంధకారమునఁ బడుదురనియు, స్పష్ట పఱుపఁబడి యున్నది. ఈశ్వరుఁడు మానసైకవేద్యుఁ డనియు, ప్రకృతినిగాని విగ్రహాదులనుగాని యుపాసించుట దూష్య మనియు, చూపుటకయి వేదమునుండి యిటువంటి ప్రమాణశతముల నుదా

హరింపవచ్చునుగాని గ్రంథవిస్తారమువలన నధికప్రయోజనము లేదు. కాఁబట్టి యింతటితో విరమించెదను. హిందువు లందఱిచేతను సర్వోత్కృష్టప్రమాణముగా నంగీకరింపఁబడుచున్న వేదమే యీ ప్రకారముగా ప్రతిమార్చనము వలదని బహుముఖముల ఘోష మిడుచుండగా దానిని విశ్వసింపక, నిన్న మొన్న పుట్టిన పురాణముల యందు విగ్రహారాధన విషయమయి వేదవిరుద్ధముగా జొప్పింపఁ బడిన వాక్యములను మనవా రెట్లు పరమప్రమాణములనుగా స్వీక రింపఁ గలుగుచున్నారో నేనూహింపఁజాలకున్నాను. శబ్దప్రమాణము లలో నెల్ల నధమము లయిన యీపురాణములు సహిత మజ్ఞులవిష యమున విగ్రహారాధనమును శ్లాఘించుచు వచ్చినను, ప్రాజ్ఞుల విషయమయి పలుకవలసిన వచ్చినప్పుడు విగ్రహారాధనము నింద్యమని బొత్తిగా చూపకున్నవికావు. అయినను మనదేశము చేసికొన్న పాప మేమో కాని చిరకాలమునుండి మనవారికి పురాణములయందలి యధ ర్మములవలె నందలి సద్ధర్మము లంతగా రుచింప కున్నవి. పురాణ ములయందు విగ్రహారాధనము నిరసింపఁ బడలేదని నమ్మియుండెడి విజ్ఞుల యుపయోగార్థము వరుసగా శైవవైష్ణవ పురాణములనుండి రెండుమూఁడు వచనములను మాత్ర మెత్తిచూపుచున్నాను. స్కాంద పురాణమునందు "ఆత్మసంస్థం శివం త్యక్త్వా బహిస్థం యజతే శివం। హస్తస్థంపిండముత్సృజ్య లిహేత్కూర్పరమాత్మనః॥ శివమాత్మనిపశ్యన్తి ప్రతిమాసునయోగినః। అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పి తాః॥" అని తనలోనుండు నీశ్వరుని విడిచిపెట్టి బయిటనుండు శివుని పూజించుట యఱచేతిలోని యన్నమును పాఱవైచి మోచేతిని నాకు టయే యనియు, యోగు లీశ్వరుని తమలోఁ జూతురుగాని ప్రతిమల యందుఁ గాదనియు, తెలివితక్కువవారి భావనానిమిత్తమయి ప్రతిమలు

కల్పింపఁబడిన వనియు చెప్పఁబడియున్నది. ఈలాగుననే శ్రీమద్భాగవతతృతీయస్కంధమునందును "శ్లో॥ అహం సర్వేషు భూతేషు భూతాత్మావస్థిత స్సదా। తమవజ్ఞాయ మాం మర్త్యః కురుతేర్చా విడంబనమ్॥ యో మాం సర్వేషు భూతేషు సంత మాత్మాన మీశ్వరమ్। హిత్వార్చాం భజతే మౌఢ్యా ద్భస్మ న్యేవ జుహోతి సః॥" అని నేను (ఈశ్వరుఁడు) సదా సకలభూతములయందును ఆత్మస్వరూపుఁడనయి యుండఁగా అటువంటినన్నవమానపఱచుటకయి మనుష్యుఁడర్చ యను పరిహాసమును జేయుచున్నాఁ డనియు సర్వభూతముల యందును ఆత్మస్వరూపుఁడనుగానున్న యీశ్వరుని నన్ను విడిచి మూఢత్వముచేత నెవ్వఁ డర్చను చేయుచున్నాఁడో వాఁడు బూడిదలో హోమము చేయువాఁడే యనియు ప్రతిపాదింపఁబడియున్నది. ఈపురాణములనుబట్టి విచారించినను విగ్రహములనుపాసించువారు బుద్ధిహీనులనియు, బుద్ధిహీనులనిమిత్తమే ప్రతిమలు కల్పింపఁబడినవనియు నే తేటపడుచున్నది. "ప్రతిమా స్వల్పబుద్ధీనాం। సర్వత్ర విదితాత్మనాం" అని దేవుఁడు బుద్ధిహీనులకు ప్రతిమలయందును, తెలిసినవారికిసర్వత్రనుండు నన్నుయు త్తరగీతా వచనమువలనను, "కాష్ఠలోష్టేషుమూఢానాం యుక్తస్యాత్మని దేవతా" యని దేవుఁడు మూఢులకు కాష్ఠలోష్టములయందును వివేకులకు మనస్సునందును నుండు నన్నుప్రమాణాంతరమువలనను, కేవలమూఢులకే గాని జ్ఞానలేశము కలవారికి బింబోపాసనము తగదని కరతలామలక మగుచున్నది. చెప్పినను మూఢులు గ్రహింపలే రని భ్రమించి వారీశ్వరజ్ఞానము లేక కేవల నాస్తికులయి చెడిపోవుటకంటె ప్రతిమలను పూజించుటవలన నయినను వారికొకప్పుడు కాకపోయిన నొకప్పుడయిన సర్వమును సృజించి పాలించెడు ప్రభు వొకఁ డున్నాఁ డన్నజ్ఞానము కొంచెము పుట్టవచ్చునని యెంచి

మనపూర్వులు దీర్ఘాలోచన లేక మూఢులనిమిత్తమయి ప్రతిమలను కొంతకాలముక్రిందట సచ్చింతతోనే కల్పించి యుందురు. ఈప్రతిమ లందుచేత మొట్టమొదట మూఢశిరోమణులనిమిత్తమే యుద్దేశింపఁ బడినను, ఏమి కాలధర్మదోషముననో కాని మనదేశమునం దిప్పుడు విగ్రహములు పామరుల గుడిసెలయందుమాత్రమేకాక పండితు లనఁ బడెడువారిపవిత్రగృహములయందుకూడ నిరాటంకముగా ప్రవేశించి, యీశ్వరుని సర్వాధికారమును తామేవహించి సర్వత్రపూజ నొందుచు, జనులను విగ్రహారాధనమే సర్వోత్కృష్టమని భావించి వాదించునం తటిదుస్థితికిఁ దెచ్చినవి. ఓహో! స్వప్రయోజనపరులై విగ్రహారా ధనమే సర్వార్థదాయక మని బోధించెడి పండితవేషధారుల యనుగ్ర హమువలన, పూర్వకాలమునందు పరమేశ్వరుని యేకదివ్యాలయముగా నుండి పరిశుద్ధేశ్వరోపాసనముచేత సుప్రసిద్ధ మయియుండిన యీభరత ఖండమున కిప్పు డెంత దుర్గతి పట్టినది! జ్ఞానానందసంధాయకుఁ డయిన యేకేశ్వరుని యుత్తమారాధనమును విడిచిపెట్టి జడము లయిన లెక్క లేని శిలాలోహవిగ్రహములకాళ్ళకు మ్రొక్కవలసివచ్చిన మన దేశపు ప్రస్తుతదుర్దశను తలఁచుకొన్నఁగా నాదేహ మిప్పుడు కంప మెత్తుచున్నది. గౌరవస్థానములయిన పీఠములమీఁద నెక్కి, ఈశ్వరునకిని మనుష్యు లకును మధ్య నిలిచి యీశ్వరైకార్హ మయిన పూజాసత్కారమును తా మయోగ్యముగా పొందుచున్న యీవిగ్రహములు మరల తమ కుచిత మయినస్థితిని బొంది బొమ్మరిండ్లలో బిడ్డలవినోదమునకే యుప యోగపడుచుండఁగా చూచి సంతోషించెడిభాగ్యము భగవత్కటా క్షమువలన మనదేశ మున కత్యంతశీఘ్రకాలములోనే కలుగునుగాక !

మన మిఁక మూఢులకయినను విగ్రహారాధనమువలన ప్రయో జనలేశము కలుగునా యన్న యంశమును, విగ్రహారాధనమువలనఁ

గలుగుచున్న యనర్థములను, ప్రతిమార్చనము మానుటవలన సంభ వించెడి లాభములను, కొంచెము విమర్శింతము. ప్రపంచములోని సమస్తదేశములలోను సమస్త మతములలోను ఒక్క హిందూదేశ మునందును దానిలోపల ఒక్క హిందూమతమునందును మాత్రము విగ్రహారాధనము కొంతకాలమునుండి పారంపర్యముగా వచ్చు చున్నది. మనవారు గ్రంథములయందుఁ జెప్పిన ట్లొక్కపామరులే కాక పండితులు సహితము మన దేశములో నిప్పుడు సర్వసాధారణ ముగా ప్రతిమలను సేవించుచున్నారు. అన్యదేశములయందున్న పామ రులకు సహితము మానసికారాధనము పనికివచ్చి వారికి దానివలన నాత్మశాంతి మొదలయిన సమస్త ప్రయోజనములును గలిగి వారు తరించుచుండఁగా, ఒక్కమనదేశమందు మాత్రము పండిత పామర సామాన్యముగా నెల్లవారికిని మానసికారాధన మేల పనికిరాదో, విగ్రహార్చనమే యేల కావలెనో, నా కూహింప శక్యము కాకున్నది. ఇతర దేశములలోని పామరులకన్నను మన దేశములోని పండితులు గ్రహణాదిశక్తులయందు తక్కువవారనియు, అందుచేత నాధ్యాత్మికా రాధనమున నర్హులనియు, విశ్వసించుటకును నామన స్సొప్పకున్నది. ఇతర విషయములయందు మనలోని పామరులు కొందఱు విగ్రహా రాధన లేనిజాతులవారిలోని పామరులకంటె జ్ఞానాధికులై యుండు టయు, మరికొందఱు వారికంటె జ్ఞానహీనులుగా నుండకుండుటయు, మనము స్వానుభవమువలన నెఱిఁగియున్నాము. కాఁబట్టి దీనికంతకు కొంతకాలమునుండి మన దేశములో నంధపరంపరగా వచ్చుచున్న దురాచారము తప్ప వేఱుకారణము నా కగపడదు. చక్కగా బోధ చేయు గురువు లున్నపక్షమున నిరాకార నిర్వికారుఁ డయిన యీశ్వ రుని కళ్యాణగుణములను తెలిసికొని మనస్సులో సోమహామహాని

ధ్యానింపలేనంత మూఢుఁ డేదేశమునందును నేజాతియందును కేవల చిత్తోన్మాదము గలవాఁడు తప్ప మఱియొకఁడుండఁడని నానిశ్చితాభిప్రాయము. లోకానుభవము నాయభిప్రాయమును సిద్ధాంతీకరించుచున్నది. అది గాక మూఢులకు సహితము విగ్రహముల మూలమున నీశ్వరవిషయకజ్ఞానమును కలిగింపఁబూనుటకంటె సృష్టికార్యములనుబట్టి యీశ్వర స్వభావాదులను తెలుపుటయే సహస్రగుణముల సులభ మని నామనస్సునకు తోఁచుచున్నది. పగలును, రాత్రియు, భూమిమీఁదను, ఆకాశముమీఁదను, సమస్త ప్రదేశములయందును, విరామము లేక సృష్టికర్తయొక్క దివ్యమహిమలను చాటుచుండు దేదీప్యమానములయిన సూర్యుని, చంద్రుని, వివిధ సుందరరూపములు గల వృక్ష లతాదులను, విచిత్రవర్ణములుగల పాదరసపుబుడ్లవలె ప్రేలుచు నేత్రోత్సవముచేయు నక్షత్రములను జూపి, వానిని సృజించి నడిపించుచున్న సర్వశక్తిగల పరమేశ్వరుని దివ్యలక్షణములను మనసునఁ బట్టించుటే సులభమో, కదలమెదల నేరని నిర్జీవము లయిన రాతి ప్రతిమలను జూపి యీశ్వరగుణాదులను బోధించుట సులభమో, ఊహించుకొనుట కిచ్చటి బుద్ధిమంతులకే విడిచిపెట్టెదను. సర్వశక్తిసంపన్నమయి, జ్ఞానస్వరూపమయిన యగోచరపదార్థమును బోధించుటకయి ప్రత్యక్షముగా కనఁబడుచుండు జడమయి మొద్దులాగుననుండు దారుమయవిగ్రహము నొక దానిని జూపి యది దీనివలె నుండునని చెప్పి యెంతబుద్ధిహీనుని నైనను నమ్మించుట సాధ్యమగునా? సర్వవ్యాపియయి సర్వజ్ఞుఁడయి యింద్రియాగోచరుఁ డయిన యీశ్వరుఁడు మనప్రార్థన లాలించి మన యభీప్సితముల నిచ్చునని విశ్వసించుటకంటె, కొండలనుండి తెచ్చి కాలుచేతులు చెక్కి గుడులలో పెట్టిన రాతివిగ్రహములు మనప్రార్థ

నలు విని మన వాంఛితముల నిచ్చునని విశ్వసించుట సులభమా ? మన కగపడకున్న యీశ్వరుఁడు సర్వజ్ఞుఁ డనుటకన్న రాగిప్రతిమ సర్వజ్ఞుఁ డనుకొనుట కష్టతరముకాదా ? యీసంగతి యటుండనిండు.

విగ్రహారాధనము స్థాపించిన మనవారు సహితము ప్రతిమారాధనము మౌఢ్యబోధక మనియు, మానసికారాధనము జ్ఞానబోధక మనియు నేకదా చెప్పుచున్నారు. లోకములో మౌఢ్యప్రధాన మయిన దెప్పుడును అసత్యముగాను, జ్ఞానప్రధానమయిన దెప్పుడును సత్యముగాను ఉండును. లోకములో నొకయక్రమము మనుష్యుని మఱియొక యక్రమమున కీడ్చును గాని యెప్పుడును క్రమమార్గమునకు దారి చూపదు. అసత్యమువలన నెప్పుడును సత్యము కలుగనేరదు. కాఁబట్టి యజ్ఞానజనక మయిన విగ్రహారాధనమువలన క్రమక్రమముగా జ్ఞానోదయముకలిగి కాలాంతరమున మానసికారాధనమునకు మార్గ మేర్పడునని యెవ్వ రెంత చెప్పినను అట్టిస్థితి యెప్పుడును పొసఁగనేరదని మనము లోకానుభవమువలనను వస్తుతత్త్వమువలనను స్పష్టముగా నెఱుఁగుదుము. మౌఢ్యజన్య మయిన ప్రతిమార్చనము మఱింత మౌఢ్యమునే వృద్ధిపొందించి జనుల నంతకంతకు పరమేశ్వరునినుండి మఱింతదూరముగానే తొలఁగించుచుండును. మన దేశమందించుమించుగా రెండువేల సంవత్సరములనుండి విగ్రహారాధనము జనులంతకంతకు భగవన్మహిమలను దెలిసి జ్ఞానాధికులు కాక యంతకంతకు భగవంతుని మఱచి జ్ఞానహీనులయి చెడుచుండుట ప్రత్యక్షదృష్టము. పూర్వ మొక్క మూఢులనిమిత్తమే ప్రతిమార్చనము కల్పింపఁబడినను, రాఁగారాఁగా నించుమించుగా నిప్పుడు హిందువు లందఱును విగ్రహారాధకులే యయిపోయినారుకదా ? ఒక యక్రమము మఱియొక యక్రమమునకు దింపక మానదు. సూర్యాగ్ని

సముద్రాది మహోత్కృష్టపదార్థములమూలమున భగవన్మహిమలను దెలిసికొని యారాధించినమనవారు కొంతకాలమునకీశ్వరునెట్లో మఱచి సూర్యాదులనేకొలుచువారయినారు. ఏకేశ్వరుని విడిచినతోడనే బహు దైవతములను గొలువనారంభించి, మనవారంతకంతకా దేవతలసంఖ్య నధికపఱచుచు వచ్చి ముప్పదిమూడుకోట్ల దేవతలను కల్పించి, తుదకు కొలిచెడు జనుల సంఖ్యకంటె గొలువఁబడు దేవతలసంఖ్యనే యెక్కువ చేసినారు. మనవా రంతటితోను తృప్తినొందక గృహదేవతలతోను కులదేవతలతోను స్థలదేవతలతోను గ్రామదేవతలతోను కూడ మన దేశమునంతను నింపివేసినారు. ఈశ్వరుని మొదట మనుష్య రూపమునకు దింపిన మనవారు, కాలక్రమమున దేవుని మృగరూప మునను పక్షిరూపమునను క్రిమికీటకరూపమునను కడపట జడ రూపమునను కూడఁ గల్పించి కొలువ పాలుపడినారు. ఇంతకు వచ్చినవా రెంతకురారు? అటుతరువాత ప్రత్యక్ష మృగాదులనే కొలువసాగినారు. మన దేశములో వృషభములను గొలుచు వా రెందఱున్నారు కారు? గరుడాది పక్షులను సేవించు వా రెందఱున్నారుకారు? పాములను పూజించు వా రెందఱున్నారు కారు? జెట్టులకు మ్రొక్కువా రెందఱున్నారుకారు? అశ్వత్థాదివృక్ష ములకు ప్రదక్షిణ నమస్కారములు చేయువా రెందఱున్నారుకారు? తుదకు సన్నికండ్లకును గోడలకును బొట్టు పెట్టి పూజచేయువా రెంద ఱున్నారుకారు? జను లింతకన్నను మూఢు లగుట యెన్నఁడయిన సా ధ్యమగునా? మనదేశమున కింతకన్నను దుస్థితి మఱియేమి పట్టును? సర్వోత్కృష్టుఁడయిన భగవంతుని నిర్మలమయిన మానసి కారాధనమును విడిచి తప్పుత్రోవ త్రొక్కమొదలు పెట్టినతరువాత మనకంటెను పరమ నికృష్టములయిన పశుపక్ష్యాదులకును జడపదార్థ

ములకును దాసులముగాక మన ముత్కృష్టదశ నెట్లు పొందుదుము? దేవుని నీప్రకారముగా పశుపక్ష్యాది రూపములకుఁ దీసికొనివచ్చుట చేత మనబుద్ధిలోపమే వెల్లడియయి మనమే చెడిపోదుముగాని పరిశుద్ధుఁడయిన యాపరమేశ్వరునికి గోరంతయు కొంచెము రాఁబోదు. మానవశిలారాధనము విడుచుటవలనఁ గలిగిన చెడుగు లింతే కావు. మనము జ్ఞానానందమయుఁడయిన యీశ్వరుని మాని జడపదార్థములను గొలుచునంతటి బుద్ధిమంతుల మయినతరువాత మన యారాధన క్రమమును మనబుద్ధికి తగినట్టు యుండును. ఈశ్వరుని హృదయపూర్వకముగా ప్రేమించుటకును త్రికరణశుద్ధి యయిన భగవదాజ్ఞానుసరణమునకును మారుగా, మన భక్తియంతయు విగ్రహములకు స్నానములు చేయించుటతోను బట్టలు కట్టుటతోను నగ లలంకరించుటతోను ధూపదీపనైవేద్యాదు లర్పించుటతోను భోగములు చేయించుటతోను ప్రతిసంవత్సరమును వివాహములు చేయుటతోను రథోత్సవములతోను సమాప్తి నొందినది. అంతటితో సరిపోయినను కొంత మేలుగానేయుండును. కొందఱు విగ్రహముల ప్రీతికయి భుజములను కాల్చుకొనుచున్నారు; కొందఱు భుజములయందును నాలుకయందును శూలములు గ్రుచ్చుకొను చున్నారు; కొందఱు వీపులకు గాలములు గ్రుచ్చుకొని సిడులాడ లోనగుచున్నారు; కొంద ఱుపవాసములు చేసి శరీరములు శోషిల్లఁ జేయుచున్నారు; కొందఱు కోడిపిట్టలను మేకపోతులను తుదకు దున్నపోతులను కూడ రాతిదేవతలకు బలియిచ్చి జీవహింస చేయుచున్నారు. దొరతనమువారు మాన్పఁబట్టి కాని లేకపోయినయెడల తమ తోడిమానవులను తమకడుపున బుట్టిన బిడ్డలను కూడ కొందఱు తాముకొలుచువిగ్రహములవలెనే తామును రాతిగుండెనే కలవారయి ప్రతిమలకు బలియియ్య వెనుకతీయకపోవు

టన్నే కాక మొండిచేతులజగన్నాథస్వామివారి రథచక్రముల క్రింద పడి యాత్మహత్యలు చేసికొనుటకును తెగించుచున్నారు. మనుష్యుఁ డింతకంటెను క్రూరకృత్యములు మఱియేమి చేయఁగలుగును? ఈ ప్రకారముగా జనులు మానుష స్వభావమును మఱచి ప్రత్యక్షరాక్షసులు కాఁగలుగుట విగ్రహారాధన ప్రభావముచేతనేకదా? ప్రతిమార్చనమువలన నిట్లు మానుషస్వభావమే చెడినప్పుడు నీతిచెడుట యొక వింతకాదు. "యథా దేవ స్తథా భక్తాః" అను న్యాయము మన వారెఱుఁగనిదికాదు. మనము కొలుచు దేవతలనీతి యెట్లుండునో, మననీతియు నట్లే యుండును. అందుకు నిదర్శనము చూడుఁడు. శ్రీకృష్ణవిగ్రహమును గొలుచువారు కృష్ణలీలలనుపాడెడు పాటలు విన్న పక్షమున వివేకులు సిగ్గుచేత తలలు వంచుకొనవలసియుండును; వైష్ణవులలో నాచరింపఁబడు కంచుకోత్సవము, రాసక్రీడ, వల్లభమత సంప్రదాయము, తలచుకొన్నంత మాత్రముచేత మానవజాతి యింత నీతిమాలినదగునాయని శరీరము పులకించుచున్నది. మగనాండ్ర రవికల నెల్లను చీఁకటిగదిలో వేసి యేపురుషునకెవతె రవిక దొరకునో వాఁడు దానితో వావివరుసలు లేక పరకాంత యనక సంభోగించుట పశుకృత్యముకాక మఱి యేమగును? ఇదేనా రాధామాధవ మతము? ఇదేనా కంచుకోత్సవము? ఓమతమా! నీ పేరునకెంత యవమానము వచ్చినది! ఇట్టిది మతమని చెప్పుకొనుట సిగ్గుచేటు కదా? పశ్చిమ హిందూస్థానమున వల్లభమతాచార్యుని శ్రీకృష్ణమూర్తినిగా భావించి మానాభిమానములు విడిచి తల్లులు తమ కూఁతులను, అన్నలు చెల్లెండ్రను, అత్తలు కోడండ్రను, భర్తలు భార్యలను, వెంటఁబెట్టుకొనిపోయి పట్టపగలు పలువురు చూచుచుండఁగా దక్షిణలిచ్చి సంభోగార్థ మర్పించి, పుణ్యముపేరు చెప్పి వారివి నీతికిని పాతి

ప్రత్యమునకును మృత్యుదేవతయయిన యూగురువు శయనగృహము నకు పంపుట మతమగునా ? పశుకృత్యమగునా ? మతముపేరు చెప్పి చైతన్యశిష్యులగు వైష్ణవులు కొందఱు తప్పఁద్రాగి సిగ్గులు లేక గుంపులుగూడి వీధులలో వికారముగా వడఁకురోగము వచ్చినవారివలె తల లెగరవైచుచు గంతులువైచునప్పుడు చూచువారికి మానవజాతి యింత మృగప్రాయ మగునా యని యాశ్చర్యము కలుగకపోదు. విగ్రహారాధనము మనుష్యుల నీతిని చెఱచినదన్నందుల కీరెండు మూఁడు నిదర్శనములే చాలును. దివ్యస్థలములను తఱచుగా సేవించినవారు కొన్ని దివ్యక్షేత్రము లెట్లు వ్యభిచారమునకును దొంగఁబోతుతనమునకును జన్మాలయములయి యున్నవో యెఱిఁగి యుండవచ్చును. కాఁబట్టి యిక్కడ నింతకంటె నధికముగాఁ జెప్పుట యనావశ్యకము.

ఈశ్వరుఁడు రూపములేనివాఁడు, గనుక ఆతని ప్రతిరూప ముండుటయే సంభవింపదు. కాఁబట్టి విగ్రహము లెప్పుడును తామీశ్వర రూపదృశ్యమును పొందఁ జాలవు. ఒకవేళ నీశ్వరునకు రూపమున్నదనియు, విగ్రహము లారూపమును తెలుపుననియు వాదసౌకర్యార్థముగా క్షణకాల మంగీకరించినను మన కాతని రూపముతో లేశ మయినను ప్రయోజనము లేదు. దేవుఁడు నల్లనివాఁడయినను, తెల్లనివాఁడయినను, పర్వతమంతవాఁడయినను, పరమాణువంతవాఁడయినను, మన కందువలన వచ్చెడిలాభ మేదియు లేదు. నిష్కళంకములయిన యాతని దివ్యగుణముల కద్భుతామోదములనొంది, సాధ్య మయినంతవఱకు నాగుణముల నవలంబించి ఆయనయాజ్ఞానుసారముగా ప్రవర్తింపఁ గలుగుటకయి భగవంతుని కళ్యాణగుణస్వభావాదులనే మనము తెలిసికోవలసి యుండును.

మనము విగ్రహములవంక వేయిసంవత్సరములు తెప్పవాల్చక చూచి నను భగవంతునియొక్క బుద్ధిగాని, సామర్థ్యముగాని, జ్ఞానముగాని కరుణాళుత్వముగాని, పరిశుద్ధతగాని, మఱి యేకళ్యాణగుణముగాని, యించుకైన బోధపడునా? మన మొక మనుష్యునిప్రతిమను చూచి నంతమాత్రముచేత, అతఁ డెంతటి శక్తియుక్తుఁడో, అతనియందు సుగుణసంపద యున్నదో లేదో, కొంచెమయినను గ్రహింపఁ గలుగుదుమా? సాకారమయినజడపదార్థదర్శనమువలన నిరాకార మయి విరుద్ధధర్మముగల జ్ఞానవస్తువివేక మెన్నటికిని కలుగనేరదు. జడాత్మకములయి నవిగ్రహసాహాయ్యమున నేత్రేంద్రియముచేత మానసైకవేద్యమయిన పరమాత్మనే తెలిసికొనుట సాధ్యమయ్యెనేని, అప్పుడు చీఁకటిని చూచుటచేత వెలుతు రిట్టి దనియు విషమును చవిచూచుటచేత చక్కెరయొక్క మాధుర్య మిట్టి దనియు తెలిసికొనుటకూడ సాధ్య మగును. కాఁబట్టి సత్యజ్ఞానానందస్వరూపుఁడయిన యీశ్వరుని ఒక్క మనస్సుచేతనేగాని మఱి యేయింద్రియముచేతను గ్రహించి యారాధించుటకు శక్యము కాదు. దేవుని మనము కన్నులతోఁ జూచి చేతులతోఁ బూజింపఁ దలఁచుకొన్నపక్షమున మనలను జేసిన దేవుని విడిచి మనము చేసినజడములయినవిగ్రహముల నర్చింపవలసినవారమయి యాప్రతిమలకంటెను జడుల మగుదుము. అప్పుడు మూఢభక్తి ముదిరి వివేకము చెడి, దురభిమానము హెచ్చి, బహుదైవతము లేర్పడి, మతద్వేషము పుట్టి, రాగద్వేషాదులు ప్రబలి, మానవధర్మము లయిన దయాసత్యశౌచాదులయందు విపరీతజ్ఞానము గలిగి మనము సర్వవిధముల చెడిపోదుము. విగ్రహారాధనమువలనఁ గలిగినవిపరీతజ్ఞానమాహాత్మ్యమువలననేకదా వైష్ణవులు శైవునిమొగము చూచిన పాపము వచ్చి తమ్ము చుట్టుకొను ననియు శైవులు వైష్ణవుసముఖదర్శనమాత్ర

మననే ఘోరపాతకము సంభవించునని యుపరస్పరము దూషించుచు ద్వేషించుచు మానుషస్వభావమును మఱచి ముక్తికి తులసిపూసల తావళములును దుష్టనామములుమాత్రమే సాధనములని యొకరును రుద్రాక్షమాలలును విభూతిపెండెకట్లునుమాత్రమే సాధనము లని మఱియొకరును పోరాడుచున్నారు! ఈవిగ్రహముల భాగ్యమువలననే కదా తమకు పనిచేయు బ్రతికియున్నయెడ్లను తిన్నగా మేఁత పెట్టకయు త్రాగ నీరుపోయకయు కోలలు మెలిపెట్టియు ములుకోలకఱ్ఱలతో పొడిచి తూట్లు పుండుచేసియు మోయరానిబరువులు మోపి చావ మోదియు బాధించుభక్తాగ్రేసరులు రాతితో చేసినవృషభము కంట బడఁగానే కాలిజోడు వదలి చేతులు జోడించుకొని మ్రొక్కి ఫలములు సమర్పించి పూజించుచున్నారు! ఈవిగ్రహసంపదచేతనే కదా తమ జోడి పేదమానవులు నిలువ నీడ లేక నిరంతరకష్టములపాలయి భార్యా పుత్రాదులతోఁగూడ బాధపడుచుండఁగా చూచి వారి కొక్క చిన్న కుటీరమునయినను కట్టించి యిచ్చునంతటికనికరము పుట్టనిభూత దయాళురు తాము కట్టించి యిచ్చినంగాని యీశ్వరున కేమో నిలువ నీడ లేకపోవు నన్నట్టుగా వేలకొలఁది రూప్యములు వెచ్చించి క్రొత్తగా మలిపించిన రాతిదేవతలు కాపుర ముండుట కయి గుడులను గోపుర ములను కట్టించుచున్నారు! ఈపశుపక్ష్యాదిరూపములనున్న విగ్రహ ముల నారాధించు పెన్నిధానమబ్బుటచేతనే కదా భగవత్కుటుంబ మయినయీలోకములో తమకు సోదరులుగా జనించి మందభాగ్యులై యున్న జోడిమానవు లంగవైకల్యాదులచేతను దీర్ఘవ్యాధులచేతను దిక్కుమాలి బాధపడుచుండఁగా చూచి యొక్కపూట యింతగంజి పోయలేని ధర్మస్వరూపులైనపుణ్యాత్ములు బియ్యపుమూటకట్టుకొని వెదకుకొనుచుఁ బోయి చీమలపుట్టలకడ పోయుచు, చేపలను మాంస

మును గొని చెట్లవెంబడిని గుట్టలవెంబడిని పరుగులెత్తి తలలు పయికెత్తి గరుడపక్షులను పిలిచి మాంసాదుల నెగరవేయుచు, సార్థక దానములను చేయుచున్నారు! విగ్రహారాధనమువలనఁ గలుగుచున్న విషతుల్యములయిన దుష్ఫలితము లింతకంటెను మఱియేమికావలెను ?

మనవారు జడములయిన విగ్రహముల నారాధించుచుండలే దనియు గుఱి కుదిరి మనస్సు చలింపక యొకదానిమీఁద నిలుచుట నిమిత్తమయి విగ్రహముల నెదుర నుంచుకొని యీశ్వరునే యారాధించుచున్నారనియు, విగ్రహార్చనము భగవదారాధనమునకు సహాయపడి క్రమక్రమముగా మానసికారాధనమును పుట్టించునని యు చెప్పుదురు. మన మనస్సెప్పుడును స్వభావముచేత నొక్క వస్తువుమీఁద నేకాని యేకకాలమునందు విరుద్ధగుణములుగల యనేకవస్తువులయందు నిలువదు. ఈశ్వరునకును మనకును మధ్య మఱియొకవస్తు వుండినపక్షమున, మనధ్యానము భగవంతునినుండి తొలఁగి బహూంతరముగా నడుమనున్న ప్రతిమలమీఁదనే మనలక్ష్యము నిలుచును. కావలసిన యీశ్వరునియందు నిలువక విగ్రహములయందు గుఱి కుదురుటవలన నేమి ప్రయోజనము కలుగును? ఆరంభదశయందు దేట్లున్నను క్రమక్రమముగా విగ్రహములే పూజకు విషయములుకాక మానవు. అటు పిమ్మట నిగ్రహానుగ్రహసామర్థ్యములును పరమాద్భుతమహిమలును కూడ విగ్రహములకే యారోపింపఁబడి, జను లవియే యాపదలను తొలఁగించు ననియు కోరికల నిచ్చు ననియు నమ్ముచుందురు. అందు చేతనే సామాన్యముగా జనులు కొన్నివిగ్రహముల కెక్కువమహత్త్వమున్న దని భ్రమించి తమయూర నున్నవిగ్రహములను విడనాడి దేవతాసందర్శనము నిమిత్తమయి సకలశ్రమలును పడి దూరదేశయాత్రలు చేయుచుందురు. అదిగాక యొక్కదేవత నారాధించువారే

మాయూరిదేవత యెక్కువని మావీధిదేవత యెక్కువని దురాగ్రహముతో పోరాడి వ్యర్థవైరములను పరస్పరద్వేషమును పూని యైకమత్యమును చెడఁగొట్టుకొందురు. ఒకవేళ కొందఱిదృష్టియం దీశ్వరుఁడు బొత్తిగా పోక కొంతవఱ కున్నను, అతఁడు స్వాభావిక స్వచ్ఛగుణములతో మాత్రము కనఁబడఁడు. మనము చూడఁదలఁచు కొన్నవస్తువునకును కంటికిని నడుమ దేసనైనను పెట్టుకొని చూచిన పక్షమున, చూడఁదలఁచిన వస్తువు కనఁబడినను వికారరూపముతో కనఁబడునుగాని స్వచ్ఛముగా కనఁబడ దనుట యెల్లవారికి ననుభవసిద్ధమే. అదే ప్రకారముగా మన మారాధింపవలసినయీశ్వరునికిని మనకును మధ్య విగ్రహము లడ్డముండునేని భగవద్గుణాదులు మనకు విపరీతరూపముతో పొడకట్టును. అందుచేతనే విగ్రహారాధకులు తమ దేవునియందు జారత్వచోరత్వాదులు సహిత మారోపించి, తమగీతములయందట్టియపవిత్రవిషయములను కళ్యాణగుణము లని చెప్పించి భక్తిపరవశు లయి పాడుచు, ఆహేయగుణములు తమమనస్సుల కసహ్యములు కాకపోవుటవలన తాము వానిని సులభముగా పొంది కలతో నైనను పాపవిచారము లేక యుందురు. మనుష్యనిర్మితములయినవిగ్రహములనే నమ్మి కొలుచువారికి చూచుటవలనను, ధ్యానించుట వలనను, పూజించుటవలనను, భగవద్గుణానుభవము కాని సత్యమయినజ్ఞానముకాని నిజమయినప్రేమకాని కలుగనేరదని యీవఱకే చూపి యున్నాను. అదిగాక యింద్రియగోచరము లగుపదార్థములను గొలుచుట యింద్రియసుఖములకే యాశ పడునట్లు చేసి, ఆధ్యాత్మిక సుఖములను మఱపించి, నీతిని మన్నింపకుండునట్లును జేయును. కాఁబట్టి విగ్రహారాధకులకు కలిగెడి సుఖ మంతయు విగ్రహముల నలంకరించుటవలనను, వానికి ధూపదీపనైవేద్యాలు సమర్పించుటవలనను,

ప్రసాదము భుజించుటవలనను, పాటలు వినుటవలనను, ఇంద్రియముల ద్వారమున వచ్చినదేకాని మానసికారాధకులకు కలిగెడి మహత్తరమయిన యాత్మానందము వారికి లేదు. బొమ్మలకు సొమ్ములు పెట్టి బట్టలు కట్టి, గుజ్జనకూండ్లు వండి, బొమ్మలపెండ్లిండ్లు చేసి, బొమ్మలతో నాడుకొనుజ్ఞానమురానిపసిబిడ్డలకు కలుగుసంతోషముపలెనే బాలప్రాయులయిన యావిగ్రహారాధకులకును తమ విగ్రహముల నలంకరించుటయందును, ఉత్సవములు జాతరలు చేయుటయందును ప్రసాదము లారగించుటయందును, పాటలు పాడుటయందును, ఒకవిధ మయినయింద్రియసుఖము కలుగునే కాని, పరిశుద్ధభక్తితో మానసికముగా నీశ్వరధ్యానము చేసెడివారి కెల్లయెడలను వ్యక్తమయ్యెడి యీశ్వరుని సర్వశక్తిత్వమువలనను, అపరిమితబుద్ధిసంపదవలనను, అపారకరుణాపూర్ణత్వమువలనను హృదయములయందు పొంగిపొరలెడి యీశ్వరవిషయకమయిన యద్భుతప్రేమయు నిరుపమానకృతజ్ఞతయు, నిశ్చలభక్తియు, అసాధారణగౌరవమును, పరమవిధేయతయు దృఢవిశ్వాసమును, ఉత్తమచిత్తౌన్నత్యమును, అసమానమానసికానందమును వారి కెట్లు కలుగ నేర్చును? ఆధ్యాత్మికారాధనము లేనివారికి మనోజయ మెట్లు కలుగును? బాహ్యపూజవలననింద్రియములకు తృప్తి కలుగ వచ్చునుగాని యాత్మశాంతి యెట్లుకలుగును? భగవదారాధనమువలనఁ గలుగవలసిన ఫలమంతయు పరమేశ్వరుని సంపూర్ణగుణానుభవము పొంది, యీశ్వరసాన్నిధ్యముచేత బాహ్యప్రపంచమును మఱచి, ఆపరిశుద్ధుసికల్యాణగుణముల కానందపరవశత్వము నొంది, ఆపరమదయాళుని నిశ్చలభక్తిపూర్వకముగా ప్రేమించి, సర్వవిషయములయందునుమనోవాక్కాయకర్మలచే నాపరమపితకు ప్రీతికరముగా నడుచుచు, స్వప్రయోజనపర్వతమును రూపు

మాపి, పరోపకారపరాయణత వహించి, ప్రాణములను శరీరములను భగవదాజ్ఞాకైంకర్యాదుల కర్పించుటయయియుండఁగా ఈబ్రహ్మా నందము వేయియేండ్లు తలక్రిందైనను విగ్రహారాధకుల కెట్లులభింప నేర్చును ? ఈశ్వరుఁడు మనలను సృజించి పెంచి కాపాడు చున్నందు నను, దేహము మొదలుకొని సమస్తము మన కాయన యిచ్చినదే యైనందునను, సమస్తసుఖములను సుఖసాధనములను కల్పించిన వాఁ డతఁడే యైనందునను, మన మీశ్వరవిషయమున చెల్లింపవలసిన భక్తికైంకర్యాదులను చెల్లింపక యాగౌరవమున కనర్హము లయిన యన్యపదార్థముల నాతనిస్థానమున కల్పించుకొని సేవించుటయేకదా విగ్రహారాధనము ? అట్టి తప్పుదారివలన నిశ్చలానంద మెన్నటికిని కలుగ నేరదనుట నిశ్చయము. విగ్రహారాధనము లేనికాలములో విద్యచేతను నాగరికతచేతను సర్వజనసమ్మాన్యమై మహోన్నత దశయందుండిన మనదేశము విగ్రహారాధనము వెలసినతరువాతనే యైకమత్యాభావమును పొంది నానాటికి క్షీణించి యన్యాక్రాంత మయి తుద కిప్పటిహీనదశకు వచ్చుటయు, పశ్చిమఖండవాసులు విగ్ర హారాధనమును త్యజించి మానసికారాధనము నవలంబించినతరు వాతనే తమహీనస్థితిని పోఁగొట్టుకొని దినదినక్రమమున నభివృద్ధి పొంది నాగరికాగ్రగణ్యు లయి యిప్పటి మహోన్నతదశకు వచ్చు టయు, చరిత్రములయందించుకజ్ఞానము కలవారి కందఱికిని కన్నులకు కట్టినట్లుండకపోదు. ఇట్టి సర్వానర్థదాయకమయిన యావిగ్రహారాధ నమువలన నొక్కమతాచార్యులకు తప్ప మఱియెవ్వరికి నేవిధమయిన లాభము లేదు. వారి కిది జీవనాధారముగా నుండుటచేత మతగురువు లెప్పుడును జనులను మూఢులనుగానే యుంచి వారిని వంచించి విత్త మపహరించి కుటుంబపోషణము చేసికొనుటకయి తమచేత నయినన్ని తంత్రములు పన్ని విగ్రహారాధనమును నిలువఁబెట్టుటకే యత్నిం

తురుగాని వారు స్వప్నావస్థయందును స్వలాభకరమైన దీనిని నశింపఁ జేయుట కాలోచింపరు. ఈమతాచార్యులలో విద్యామహిమచేత నిది యయుక్తమని తెలిసియు ధనాశచేత బుద్ధిపూర్వకముగానే పామరులను మోసపుచ్చువారు కొందఱును, చిరకాలాభ్యాసముచేత నిది యుక్తమే యనుకొని నిష్కపటముగానే ప్రోత్సాహపఱుచువారు కొందఱును ఉందురు. ఈయిరుతెగలవారును ప్రతిమార్చనమును నిరుత్సాహపఱుపరు. కాఁబట్టి జనక్షేమమును దేశక్షేమమును కోరు సుజనులు వారిదుర్బలహేతువులను ఖండించి వారి యుక్తులకు తగిన సమాధానములు చెప్పి దేశమునందు మానసికారాధన మెల్ల యెడలను నల్లుకొనునట్లు చేసి పవిత్రమయిన యీశ్వరరాజ్య మెల్ల వారలహృదయములయందును కుటుంబములయందును స్థాపఁ ప్రయత్నింపవలయును.

విగ్రహారాధనమును ప్రోత్సాహపఱిచెడిమహానుభావులు భక్తి ప్రధాపన మనియు, దేనిని నమ్మి కొలిచిన అదే దైవమనియు, విగ్రహములను కొలుచుటవలన బాధకము లేదనియు చెప్పుదురు కాని వారివాక్యములు యుక్తియుక్తము లయినవి కావు. కేవల భావన వలనను, నమ్మకమువలనను ప్రయోజన మేమియు నుండదు. ఒకఁడు తాను రాజు నని నమ్మినంతమాత్రముచేత తాను రాజగునా? దొంగను మంచివాఁ డని భావించిన, వాఁడు పరిశుద్ధుఁ డగునా? అమృత మని నమ్మి విషము త్రాగినయెడల నాలుక యీడ్చుకొనిపోవు నట్లు చేసి ప్రాణోపద్రవము కలుగఁజేయక మన కావిషము దేహ పుష్టిని కలుగఁజేసి యమృతత్వము నిచ్చునా? రజ్జువును సర్ప మను కొన్నచో దానికి ప్రాణము వచ్చి లేచి తిరుగునా? రాతిని తెప్ప యని పట్టుకొన్నయెడల అది నదిని దాటింపఁగలుగునా? ఈప్రకార ముగా వట్టివిశ్వాసము లౌకిక కార్యములయందే పని చేయదని స్పష్ట

ముగా నెఱిఁగి యున్నపుడు పారమార్థికవిషయములలో కార్యకారి యగునని నమ్ముటకన్న మూఢత మఱి యేదియు లేదు. మేలు కలుగుట కయి యెప్పుడును సత్యమయిన వస్తువులయందే యర్థవిశ్వాసముండవలెను. అట్లుగాక భ్రమచేతఁగాని యజ్ఞానముచేతఁగాని యనుచితవస్తువులయందు విశ్వాసము పుట్టినయెడల, దానివలన కీడే కలుగునుగాని మేలెన్నటికిని గలుగదు.

ఈశ్వరుఁ డన్నిటియందు నుండునుగాన దేనిని గొలిచినను దోషము లేదని మఱియొకహేతువు చెప్పుదురు. దేవుఁ డంతటను నిండి యుండుటసత్యమే యయినను, సృష్టపదార్థములుమాత్ర మెప్పుడు నీశ్వరస్వరూపములు కావు. అవి యెప్పుడును ఈశ్వరునికంటె భిన్నములయియే యుండును. వెలుతురు గదిలో నంతటను నిండియున్నంతమాత్రముచేత గదిలోనిబల్లలు మొదలయిన వన్నియు వెలుతురే యని మతిమంతుఁ డెవ్వఁ డయిన చెప్ప సాహసించునా? ఇందలి యేబల్ల నైనను చీఁకటిలోనికిఁ గొనిపోయిన వెలుతురు కలుగునా? ఉష్ణత మనదేహమున నంతటను వ్యాపించి యున్నను, ఉష్ణము దేహముకంటె భిన్నమయినదే యందురుగాని యెంత మందబుద్ధులయినను దేహమంతయుఁగాని దానిలోని యేయవయవ మయినను గాని యుష్ణమని చెప్పఁగలుగుదురా? అలాగుననే దేవుఁడు సర్వవ్యాపియైనను, సృష్టిపదార్థము లన్నియు దేవునికంటె భిన్నము లని స్థూలబుద్ధిసహితము సులభముగా గ్రహింపవచ్చును. కాఁబట్టి యీశ్వరునికి మాఱుగా దేని నారాధించినను ఆరాధింపవచ్చు ననుట వెఱ్ఱిమాట. సర్వాంతర్యామియైన యీపరమాత్ము నొక్కనినే మానసికముగా నారాధింప వలయును.

సర్వమును బ్రహ్మమయముగాన దేని నైనను సేవింపవచ్చు నని మఱియొక కారణాభాసమును జెప్పుదురు. [illegible] బ్రహ్మ

మయినపక్షమున దేనిని గొలువవలసిన యక్కఱయు లేదు. అప్పుడు గొలుచువాఁ డెవ్వఁడు? గొలువఁబడువాఁ డెవ్వఁడు? ఒక్కదానిని గొలువవలెనన్న తోడనే గొలిచెడివాఁడొకఁడును గొలువఁబడునది యొక్కటియు వేఱుగ నుండి తీఱవలెను. అప్పు డన్నియు బ్రహ్మమున కంటె భిన్నములయి యుండవలెను. అందుచేత సర్వమును బ్రహ్మ మనుట సరిపడదు. ఈశ్వరోపాసకులు సర్వమును బ్రహ్మమే యనుట స్వోక్తివ్యాఘాతము. కాఁబట్టి దేనినైనను గొలువవచ్చు ననువారి యుక్తిని తలపెట్టినైనను తలపెట్టఁగూడదు. అద్వైతసిద్ధియై యీశ్వరునిలో నైక్యమయినవా రున్నయెడల వారు తప్ప, అస్తికు లందఱును జగత్కర్తను మానసికముగానే ధ్యానించి యానంద మనుభవింపవలెను.

ఈశ్వరజ్ఞానమును కలిగించుటకయి విగ్రహము లక్షరతుల్యము లనియు, ధ్వనులను నేర్పుటకయి వర్ణములు గుఱుతులుగా నేర్పఱుపఁబడినట్టు లివియు నేర్పఱుపఁబడిన వనియు, ఇందొకయుక్తిని చెప్పుచున్నారు. అక్షరాభ్యాసమువలన లోకములో నెల్లవారును విద్య నేర్చి జ్ఞానాధికు లగుచుండఁగా మనము ప్రత్యక్షముగా చూచుచున్నాము. ఆప్రకారముగా విగ్రహారాధమువలన జనులు శుద్ధమయినయీశ్వరజ్ఞానమును పొందుచుండఁగా మన మెక్కడనైనఁ జూచుచున్నామా? మనదేశములో బహుశతవర్షములనుండి లెక్కలేనిజనులు యావజ్జీవమును విగ్రహారాధనము చేయుచున్నను దేవుని విషయమయి వారి కెక్కువ తెలివి కలుగుచుండఁగా మన మొకప్పుడును చూచుచుండలేదు. గనుక, ముందటిజ్ఞానము కలుగు ననుటకును మన కాధారలేశము కనఁబడదు. అందుకు విరోధముగా నెల్లదేశములయందును విగ్రహారాధనము జేయువా రెప్పుడును మూఢభక్తులే యయి, కాలక్రమమున మానసికారాధనమునే మూలపుట్టించి సర్వ

జనులను విగ్రహారాధకులనుగానే చేయుచుండుటవలన, విగ్రహారాధనము భగవద్విషయకజ్ఞానమునకు సాధకము కాకపోవుటయేకాక బాధకముకూడ నని స్పష్ట మగుచున్నది. కాఁబట్టి విగ్రహములచే నీశ్వరజ్ఞానాభివృద్ధిని కలుగఁజేయుదు మనుట, నిప్పుచే శైత్యము నభివృద్ధి చేయుదు మనుటయే. కాఁబట్టి యీశ్వరజ్ఞానాభివృద్ధికయి సర్వవిధముల ప్రతిమలను దృష్టిపథమునకు దూరము చేయవలెను.

విగ్రహములే లేకపోయినయెడల విద్యావిహీనులగు మూఢులలో నీశ్వరజ్ఞానమే నశించు ననియు, అప్పుడువారికి పాపభయము లేకపోవు ననియు అందుచేత మూఢుల నిమిత్తమయి విగ్రహారాధనముండవలె ననియు, కడపటియుక్తి నింకొకదానిని చెప్పుదురు. విగ్రహములు రూపము లేని యీశ్వరుని ప్రతిరూపము లగుట సాధ్యమయినయెడల నవి యాతని రూపమునే తెలుపును గాని గుణములను తెలుపవనియు, 'ఈశ్వరారాధనమున కాయన దివ్యగుణములు కావలెను గాని రూపముతో ప్రయోజనము లేదనియు, నేను ముందే చెప్పియున్నాను. కాఁబట్టి విగ్రహములు నిరాకారుఁ డయిన యీశ్వరుని రూపమును తెలుపుటకు సహితము పనికిరావు గనుక సర్వ విధములచేతను ప్రతిమలు కేవల నిష్ప్రయోజనములు. ఒకఁడు చేసిన విచిత్రవస్తువులను చూచుటవలన కర్తను చూడకపోయినను కర్తయొక్క బుద్ధికుశలతను, సామర్థ్యమును, మంచితనమును, కొంతవఱకు కనిపెట్టి సంతోషింప వచ్చును. అలాగుననే యీశ్వరుని గుణసామర్థ్యాదులను దెలిసికొని యానందించుటకు మనకు మార్గప్రదర్శకములయిన భగవన్నిర్మితపదార్థములు సర్వత్ర లెక్కకు మిక్కిలిగా నిండియుండి యాయనదివ్యగుణములను దివ్యశక్తులను సహస్రముఖముల ఘోషించుచున్నవి. ఇట్లుండఁగా నెంతటిమూఢునకును భగవంతుని తెలిసికొనుటకయి మూగవిగ్రహము లావశ్యకము లగునా? ప్రతిమ

లక్కఱ లేకనే మనము చూడని మనుష్యులయొక్క చరిత్రములను చదివియు వినియు వారి గుణస్వభావాదులను తెలిసికొనుచుండలేదా ? హరిశ్చంద్రునియొక్కగాని ధర్మరాజుయొక్కగాని పటముల నెప్పుడును చూడకపోయినను వారి సత్య ధర్మ ప్రవర్తనములు వినిగాని చదివిగాని విద్యావిహీనులుసహితము వారిని ప్రేమించి, వారికాపద వచ్చినదన్నప్పు డాయాపద తమకే వచ్చినట్లు కన్నుల నీరు పెట్టుకొని పరితపించుచున్న, వారికి శుభము కలిగిన దన్నప్పుడు తనకు మేలు కలిగినట్లు సంతోషించుచు నుండలేదా? ఒకరిని ప్రేమించి గౌరవించుటకయి వారిసుగుణసుచరితలు కావలెనుగాని రూప మక్కఱలేదు గదా? అప్రకారముగానే భగవంతుని దివ్యలక్షణాదులను వివరించెడి గ్రంథములను చదివిగాని సద్గురుముఖమున వినిగాని యీశ్వరుని తెలిసికొని యానందింపలేనంతటి మూఢుఁ డెవఁడుండును ? మన కేయుపకారమును చేయక యెప్పుడో లోకాంతరగతు లయిన గుణసంపన్నుల చరిత్రములను విన్నంత మాత్రముననే మనకు మనస్సులలో వారి యం దాదరమును ప్రేమయు కలుగుచుండఁగా, నిత్యమును భగవంతుఁడు దయచేసిన మితిమీఱినపదార్థముల ననుభవించి సుఖించుచున్న మన మాయనసృష్టిని విమర్శించుటవలనను దివ్యగుణములను వినుటవలనను మన కాపరమాత్మునియందు భక్తియు ప్రేమయు కలుగక పోవునా ? గంభీరమయి యనంతములయిన జంతుజాలములకు నివాసమయిన మహాసముద్రమును, మనభూమికంటెను సహస్రగుణములు పెద్దవియు చిన్నవియు నయిన సూర్య చంద్ర నక్షత్రాది గోళకోటులను బంతులవలె ధరించినయాకాశమును, వివిధములయినపల్లవములు పత్రములు పుష్పములు ఫలములు మొదలయినవానితో నిండియున్నవృక్షలతాగుల్మాదులచే నావరింపఁబడి యున్నభూమియు, మహావృక్షములను వ్రేళ్ళతో పెల్లగింపఁ గలిగిన బలముండియు మెల్లఁగా

పోఁకి దేహములచెమట లార్చి జీతములేని పరిచారకునివలె సేవించు చుండు వాయువును, లోకముల నన్నిటి నొక్కసారిగా దహింపఁగల శక్తి యుండియు నెల్లవస్తువులలో నడఁగి యుండి చలి పాపి, పచనాది కార్యములకు తోడుపడుచుండు నగ్నియు, మనకు భగవన్మహిమలను తెలుపక యీశ్వరజ్ఞానమును పోఁగొట్టి బుద్ధిమాలిన్యము కలుఁగజేయు ప్రతిమలా మన కీశ్వరసద్భావమును మహిమలను భక్తిమార్గమును ఉపదేశించునవి? విరామము లేక యీశ్వరమహిమలను ఘోషించు బాహ్యవస్తువులమాట యటుండఁగా మనప్రయత్న మక్కఱలేకయే మనము నిద్రించుచున్నప్పుడును మేలుకొని యున్నప్పుడును నిరంతర మును మనసుఖాభివృద్ధికయి పనిచేయున్న మనదేహయంత్ర మొక్క టియే మనల నీశ్వరునివంక కాకర్షించు చుండలేదా? మనకద్భు తములయిన జ్ఞానేంద్రియములను దయచేసి బాహ్యప్రపంచములో మన కన్నులను దృప్తిపఱుచుట కయి వివిధసుందరరూపములను, కర్ణ ములను తృప్తిపఱుచుటకయిబహువిధ శ్రావ్యనాదములను, జిహ్వను తృప్తిపఱుచుట కయి నానావిధ రుచ్యపదార్థములను, ఘ్రాణమును తృప్తి పఱుచుట కయి పలు తెగల సువాసనలను, స్పర్శేంద్రియ మును తృప్తిపఱుచుట కయి వివిధమృదుశీతపదార్థములను, కటాక్షిం చిన దయానిధి యైన యాపరమపితయందు మన మెంత ప్రేమయు విధేయతయు కృతజ్ఞతయు కలవారమయి యుండవలెను! వానచిను కులయినను లెక్క పెట్టవచ్చునుగాని మన కీశ్వరుఁడు ప్రసాదించిన సుఖసాధనముల నెన్నికయిడ శక్య మగునా? ఎంతటిమూఢు లయినను తమకు మేలుచేసినవారియెడ కృతజ్ఞతను ప్రేమను పొందుటకును, ఏలినవారియెడ ప్రభుభక్తిని చూపుటకును, దూరముగానున్నను తమ జనకులను మఱువ కుండుటకును ఎఱిఁగి యుండఁగా, వారు లోకము నందు తా మనుదినమును చూపుచుండెడికృతజ్ఞతను ప్రేమను భక్తిని

పరమోపకర్తయు, పరమేశ్వరుఁడును, పరమపితయు నయిన దేవుని యందుకనఁబఱుచుటకు బోధించినను తామెఱుఁగకుందురా ? ఎఱుఁగ కుందురు. కాఁబట్టి తెలిసినవారు సృష్టికర్తయొక్క మహిమలను మూఢుల కుపదేశించి వారిని మానసికారాధనమునకు పురికొల్పుచుండ వలయును.

ఇఁక మన మందఱమును ప్రయత్నము చేసి చిరకాలమునుండి మన దేశమునకు మితిమీఱిన హానినాపాదించుచు మూఢులతోడి పాటుగా పండితులను సహితము భగవంతునుండి మరలించి తమ యారాధనమునకు దింపి మూఢతుల్యులనుగా జేసిన విగ్రహములను మౌనముగా విడిచి, పరమేశ్వరుని దివ్యగుణాదులను తెలిసికొని నిజ మయినశ్రద్ధాభక్తులతో నాకరుణాళుని సేవింతముగాక ! ఆకరుణానిధి మూఢులను కూడ ప్రతిమార్చనమునుండి మరలించి శీఘ్రకాలము లోనే తనప్రక్క కాకర్షించుకొనునుగాక ! ఓకరుణాకరా ! ఓదీన శరణ్యా ! నాహృదయము ఎప్పుడును నీసేవనుండియు నీయాజ్ఞలనుండియు కొంచె మయినను తొలఁగకుండునట్లు చేసి, లోకుల దాక్షిణ్యము నిమిత్తమును లోకులవలనిభీతిచేతను నే నెప్పుడును ధర్మమార్గమును తొలఁగి చరింపక యెల్లపనులను నీకు ప్రీతికరముగానే చేయుచుండు నట్లు నాకు బుద్ధిని ధైర్యమును ప్రసాదింపుము. స్వార్థపరత్వమును నామనస్సునందు చొరనీయక పరోపకారబుద్ధిని నిలుపుము. నిన్ను సదా తండ్రినిగాను, నీకుటుంబమయిన మానవకోటిని సోదరతుల్యము గాను, భావించి ప్రేమించునట్లు కృపచేయుము.

# ఈశ్వరదత్తపుస్తకములు.

ఓ మిత్రులారా !

ఐహికాముష్మిక విషయములయందమోఘప్రమాణ మయి యీశ్వరదత్త మయిన గ్రంథ మేదియైనఁ గలదా, ఈశ్వరస్వభావ మునుబట్టి యట్టిగ్రంథ ముండుట సాధ్యమా, అన్నయంశ మనేకస్థలములయందు పలుమాఱు చర్చింపఁబడుచుండఁగా వినుచున్నాము. ఈశ్వరసద్భావమునే యొప్పుకొనని నాస్తికులతో నిది యీశ్వరదత్తమయినగ్రంథ మని వాదించుట కేవలోన్మాదమే యగునుగాన, ఈ విషయ మయి యీశ్వరసద్భావము నంగీకరించెడి యాస్తికులలో మాత్రమే వాదప్రతివాదములు జరుగుట కవకాశ మున్నది. ఈశ్వరదత్తమయినగ్రంథ మున్నదనెడివారు మనుష్యబుద్ధి భ్రమప్రమాదాదులతోఁ గూడిన దనియు, మోక్షసాధనములను పూర్ణముగా తెలిసికొనుటకు తన సహజజ్ఞానము చాల దనియు అందుచేత నీశ్వరోపదిష్ట మయినగ్రంథముండుట యత్యంతావశ్యకమనియు, అమోఘప్రమాణ మయినయట్టి యలౌకికగ్రంథమే యుండనిపక్షమున జనులు తమచిత్తమువచ్చినట్లు నానావిధముల ప్రవర్తించుచు స్వేచ్ఛావిహారులయి పాడగుదురనియు, కాఁబట్టి యీశ్వరునియొక్క పరమదయాళుత్వమునుబట్టి విచారింపఁగా నీశ్వరోపదిష్ట మయినవేద ముండుట పరమసాధ్య మనియు, అందుచేతనే యట్టి పరమప్రమాణ మయినవేదము గలదనియు, చెప్పుచున్నారు. ఈశ్వరదత్త మయిన గ్రంథ ముండ దనెడువారు యుక్తాయుక్తవివేకమును బొందుటకయి యిదిమంచి యిదిచెడ్డ యని తెలిసికొనుటకుఁ దగినబుద్ధినితప్ప వేఱు సాధనములను మనుష్యుల కీశ్వరుఁడు ప్రసాదించి యుండలే దనియు,

ప్రవిషయమునను సత్యజ్ఞానమును సంపాదించుటకయి లోకానుభవ ముతోఁగూడిన బుద్ధిమాత్రమే పరమసాధనముగా గానఁబడుచున్న దనియు, సర్వవిషయములయందును జ్ఞానాభివృద్ధి లోకములో బుద్ధియు లోకానుభవము మొదలైన వానివలననే కలుగునట్లేర్పఱిచి యీశ్వరుఁడు తానేవిషయమునందును ప్రత్యక్షసంబంధమును కలిగించుకొన కుండుటచే నెప్పుడో యొకప్పుడుమాత్ర మట్టి సంబంధమును కలిగించుకొని యెవ్వరికో వేదము ననుగ్రహించినాఁ డని చెప్పుట యుక్తియుక్తముగా నుండ లేదనియు, తమతమ బుద్ధ్యనుసారముగాఁ బ్రవర్తింపక యేకరీతిగాఁ బ్రవర్తించుట పరమప్రమాణ మని చెప్పెడు వేదము వలనను గలుగుచుండ లేదనియు, వేదప్రమాణము నంగీకరించినవారు సహితము సత్యాసత్యనిర్ణయమునకు బుద్ధి యొక్కటియే, యుత్కృష్ట సాధన మని యొప్పుకోవలసి వచ్చుననియు వాదించుచున్నారు. అప్పుడీయుభయవాదములయందును గల సారాసారములను విమర్శింపవలసి యున్నది. బహుమతములవారు భగవద్దత్తమయిన వేదము గలదని చెప్పుటయే కాని సర్వోత్కృష్ట ప్రమాణ మయిన యాదివ్యగ్రంథ మేది యని ప్రశ్న వేసినప్పుడు మాత్రము తమలో నైకమత్యములేక యొకరు చెప్పినవిధమున నొకరు చెప్పక హిందువులు వేద మనియు క్రైస్తవులు బైబిలనియు, మహమ్మదీయులు ఖొరా ననియు, పలువురు పలువిధములుగాఁ జెప్పుచున్నారు. ఆవలఁ గేవేదమును దానెఱుగక సత్యప్రియుఁడైనవాఁ డొకఁడు వచ్చి నిజమేదో దానిని గ్రహింపవలె నని త్వాసక్తుఁ డయి యడిగినప్పుడింద ఱిన్నివిధములుగా జెప్పిరేని, అతఁ డెవ్వరిమాట నమ్మవచ్చును? దేవుఁ డిచ్చిన సత్యవేద మేదియైన నొక్కటియే యుండవలెనుగాని యిన్ని యుండవు గదా? వీనిలో దేనిని నమ్మవలె నని యాతఁ డడిగినప్పుడు, ప్రతిమతస్థుఁడును తనదే సత్యవేద మని సంశయింపక దృఢముగాఁ జెప్పును.

ఇందఱును తమ దొక్కటియే సత్యవేద మనియు తక్కిన వన్నియు
మనుష్యకల్పితము లైన యసత్యవేదము లనియుఁ జెప్పుచున్నారే
మీదొక్కటియే సత్యవేదమని నమ్మి తక్కినవాని నన్నిటిని నిరాక
రించుట కేప్రబలహేతువు కలదని మరల నడిగినచో, తమపూర్వులు
తమ దొక్కటియే యీశ్వరకృత మనియు సత్యవేద మనియుఁ, జెప్పి
యున్నారు గనుక తమ దొక్కరిదే విశ్వసింపవలసినదని యేకసమా
ధానమునే కదా యెల్లవారును ప్రత్యేకప్రత్యేకముగాఁ జెప్పవత్తురు.
అప్పు డాతటస్థుఁడు వారి యుత్తరములతోఁ దృప్తిఁబొందక యెల్ల
వారును తమ పూర్వులమాటనే విశ్వసింపవలయునని చెప్పుచున్నారే
యిందొకరి పూర్వుల మాటను నిరాకరించి మఱియొకరి పూర్వుల
మాట నంగీకరించుటకు బలవత్తర మయిన హేతు వేది గలదని యిం
కొక ప్రశ్న మడిగిన పక్షమున, తాను వారిసంతతివాఁ డయిన యాధి
క్యమునుబట్టి తన పూర్వులమాటను మాత్రమే నమ్మవలయుననియో
తన వేదమునందు విశేష ముండుటచేత పరీక్షించి చూచి విమర్శ
మీఁద తనది సర్వోత్తమ మయినదని తెలుసు గనుక దానిని నమ్మ
వలయుననియో యుత్తరము చెప్పవలసి వచ్చును. విమర్శించి చూచి
సత్య మయినదని సిద్ధాంతపడిన దానినే నమ్మవలసిన దని యెప్పుడు
చెప్పుదురో యప్పుడు వేదముయొక్క సత్యమును నిర్ధారణము చేయు
టకు సహితము బుద్ధియే యుత్కృష్ట ప్రమాణమని సిద్ధాంత మగు
చున్నది. కాఁబట్టి వేదప్రమాణవాదులు సహితము సత్యాసత్యనిర్ణ
యమునకు బుద్ధి పరమప్రమాణమని యొప్పుకొనక తప్పదు. ఈశ్వరుఁ
డెప్పు డెవ్వరికి తనయాజ్ఞల నుపదేశించినను గ్రహించువారి మనస్సుల
కవిబోధపడునట్లే కదా చేయవలెను. అట్లుచేసినచో నాకాలమునందు
వానిని ప్రత్యక్షముగా గ్రహించువారికిమాత్రమే యవి యీశ్వరాజ్ఞా
రూపమయిన ప్రత్యక్ష వేదప్రమాణము లగునుగాని తక్కినవారి కవి

కేవల శబ్దప్రమాణమునకంటె నధికమయినవి కానేరవు. కాఁబట్టి సర్వశక్తుఁ డయినయీశ్వరుఁడే యెల్లవారల హృదయములకును తన యాజ్ఞలను బోధపఱుపఁ దలఁచుకొన్న పక్షమున, ఆయాజ్ఞల నెల్లవారల హృదయఫలకములయందును స్థిరముగా నుండునట్లు లిఖించును గాని యేకకాలమునందే యొక కొందఱికిమాత్రము ప్రత్యక్షముగాను గణనాతీతమయిన తక్కిన జనబాహుళ్యమున కంతకును చెప్పుడు మాటలుగాను నుండునట్లు చేయఁడు. కాఁబట్టి యీశ్వరుఁడే మానవకోటికి జ్ఞానోపదేశమును జేసెడుపక్షమున తనయుపదేశము నంతను వారి హృదయఫలకములయం దెన్నఁడును జెడని దివ్యాక్షరములతోనే కాని వేఱువిధముగా వ్రాసి యుండఁడనుట నిస్సందేహము. నే నిప్పుడు బుద్ధి యని చెప్పిన మనోగత మయిన సహజబోధ మొక్కటియే యట్టిదిగా నున్నది. సత్యాసత్యనిర్ణయసమర్థ మయి వలసినప్పు డెల్ల నెల్లవారికిని స్ఫురించుచుండెడిహృదయగత మయిన యీ దివ్యలిఖిత మొక్కటియే యీశ్వరదత్త మయినసత్యవేద మగునుగాని తదితరములు కానేరవు. ఇది సత్యవేద మగునా కాదా యని నిర్ణయము చేయుటకు సహితము మనబుద్ధి యెప్పుడు ప్రమాణ మగుచున్నదో యప్పుడే మనోగతమయిన యీ యాత్మవేద మే లిఖితవేదము లన్నిటికంటెను శ్రేష్ఠమయిన దనియు, దానిబోధకు వ్యతిరిక్తముగాఁ జెప్పెడు వేద మేదియు గ్రాహ్యము కానేర దనియు, విస్పష్ట మగుచున్నది. ఇప్పు డిందువలనఁ దేలిన పరమరహస్యము దేవుని స్వహస్తలిఖిత మని చెప్పఁదగిన యీ హృదయవేద మొక్కటియే యమోఘప్రమాణ మనియు, దీనిబోధన కనుకూలముగా నుండని బాహ్యవేదము లన్నియు నిరాకరింపఁబడవలసినవే యనియు అయి యున్నది. ఎట్లనఁగా పూర్వ మెప్పటిమాటయో విడిచిపెట్టి యిప్పుడే ప్రత్యక్షముగా నవతారరూపమునఁ గానఁబడి మహిమలను జూపుచుఁ దానే దేవుఁడ నని

తెలుపుచుఁగాని నేత్రగోచరుఁడుకాక యంతర్హితుఁడయి యుండి యశరీరవాక్కుతో మాటాడుచుఁగాని, మనలో నొక్కరియెదుట నైనను పలువురయెదుటనైనను "ఓ జనులారా! మీరు నిత్యమును దొంగతనము చేయుచుండుఁడు; అసత్యములు పలుకుచుండుఁడు; పరపీడనము చేయుచుండుఁడు; జారత్వము చేయుచుండుఁడు; భార్యలను పోషింపకుఁడు; జననీజనకులను గౌరవింపకుఁడు; దయాదాక్షిణ్యముల నవలంబింపకుఁడు; క్రూరత్వమును మానకుఁడు; ఇవియే వేదవాక్యములు; ఇవియే యీశ్వరుఁడ నయిన నా యాజ్ఞలు; ఇవియే మోక్షసాధనములు; ఇవియే యలంఘ్యధర్మములు" అని యెవ్వరైనఁ జెప్పినచో నవి యీశ్వరాజ్ఞారూపము లయిన వేదవాక్యములని మీలో మతిగలవా రెవరైన నమ్ముదురా? నిశ్చయముగా నమ్మరు. ఈశ్వరుఁడు తనమహిమలను జూపుచుఁ బ్రత్యక్షముగాఁ జెప్పుచున్నప్పు డేల నమ్మరు? అవి మన హృదయములయందు స్వాభావికముగా ముద్రింపఁబడియున్న సత్యములకు విరుద్ధముగా నున్నవనియే కదా నమ్మరు. ఆ చెప్పినమాటలను నమ్మకపోవుటయేకాక వానిని చెప్పినవానివిషయమునఁకూడ మన మెట్టియభిప్రాయమును గలవార మగుదుము? వాఁ డెవ్వఁడో తా నీశ్వరుఁడ ననువేషము వేసికొని మనలను మోసముచేయ వచ్చినరాక్షసుఁడో పిశాచమో యయి యుండునుగాని యీశ్వరుఁడయి యుండఁ డని మనము నిశ్చయముగా దలఁతుము, కాఁబట్టి యింకువలన నెన్నఁడో యెవ్వరికో దేవుఁడు చెప్పినాఁ డన్న వాక్యములను మాత్రమేకాక యిప్పుడు ప్రత్యక్షముగా మనకన్నుల యెదురఁ జెప్పిన వాక్యములనుసహితము మన మనస్సులయందు భగవంతునిచే విచిత్రముగా చిత్రింపఁబడి యున్న స్వభావసిద్ధము లయిన మూలసత్యములకు వ్యతిరిక్తముగా నున్నంతవఱకు విశ్వసింపరా దని నిశ్చితాభిప్రాయ మేర్పడుచున్నది. ఈరీతిగా మనబుద్ధియే సర్వమున

కును ప్రధాన మని యేర్పడుచున్నప్పుడు, ఆలోచనమీఁద మనయంత రాత్మ బోధించెడు సత్యములు మాత్రమే యీశ్వరకృతవేద మనియు, బాహ్యవేదము లనియు, సమర్థులగు మనుష్యులచే నాయాకాలాను గుణముగా రచియింపఁబడిన వనియు సిద్ధాంతము చేసికొనుట కేమి యాక్షేపణ గలదు ?

ఒక్కబుద్ధినే నమ్ముకొన్నపక్షమున బుద్ధ్యనుసారముగా నానా జనుల భిన్నాభిప్రాయములనుబట్టి భిన్నమతము లేర్పడు ననియు నమోఘప్రమాణమయిన వేద మొక్కటి యున్నపక్షమున సర్వత్ర యేకమతము వ్యాపించు ననియుఁ జెప్పుచున్నారుగదా ? అట్టిలాభ మీ లిఖితవేదమువలనఁ గలుగుచున్నదా యన్నయంశమును గొంత విచా రింతము. ఎల్లవారును భిన్నమతావలంబకు లయి భిన్నవేదముల ననుస రించుచు, తమ దొక్కటియే సత్యవేదమని తగవులాడుచున్నారుగాని మొట్టమొదట నిదే సత్యవేదమన్న యంశములోనే యైకమత్యము కుదిరినవారుగా నుండలేదు. ఈభిన్నవేదములసంగతిని విడిచిపెట్టి యొక్కవేదమును నమ్మినవారిలోనయిన భిన్నాభిప్రాయములు లేక మతవిషయములం దైకమత్య మున్నదా యని విచారింప, అదియుఁ గానరాదు. ఒక్క క్రైస్తవమతమును బుచ్చుకొని పరీక్షించినచో తన్మతావలంబు లందఱును బైబిలునే పరమప్రమాణ మయినసత్య వేద మని యంగీకరించువారైనను వారిలోఁ బరస్పరవిరుద్ధములయిన సిద్ధాంతములును, మతశాఖలును నెన్ని యేర్పడి యున్నవో యెల్ల రును సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఈకాలమునందు విద్యాధిక్యము వలన నంతఃకలహము లంతగా లేకపోయినను, పూర్వకాలమునందు మతాంతరులయిన మహమ్మదీయులతోఁ బోరాడి క్రైస్తవు లెదుటి వారియొక్కయుఁ దమవారియొక్కయు వేలకొలఁదిప్రాణములకు నష్ట మెట్లు కలిగించిరో యట్లే స్వమతములోని భిన్నశాఖలవారుసహితము

స్వల్పాంశములను గూర్చి తమలోఁ దమరు పరస్పరవివాదములు పెట్టుకొని ఘోరయుద్ధములు చేసి యెంతప్రజానాశనము కలిగించుకొన్నవియు చరిత్రములు ఘోషించుచున్నవి. కక్ష్యావేశముచేతను మత ద్వేషముచేతను పరస్పరసోదరభావమును వహింపవలసిన యేకమతావలంబకు లయిన వీ రొండొరులవిషయమున జరిగించిన క్రూరకృత్యములను దలఁచుకొన్న దేహ మిప్పటికిని కంప మెత్తక మానదు. అమోఘప్రమాణ మయినయొక్క వేదగ్రంథ మున్నను వీరిలో వీరి కది యైకమత్యము గలిగింపఁ గలిగినదా? అన్యోన్యవిరుద్ధము లయిన భిన్న సిద్ధాంతములను భిన్నశాఖలను పుట్టకుండ వారింపఁగలిగినదా? లేదని దృఢముగాఁ జెప్పవచ్చును. ఇందువలన లిఖితవేదమువలనఁ గలుగు నన్న యైకమత్యము దానివలనఁ గలుగుచుండ లేదనియే గదా వేదవాదులుసహిత మొప్పుకోవలసి వచ్చును. ఇతరమతములను దూరముగా నుంచి కొంతసేపు మనమతమును గూర్చియు మనవేదమును గూర్చియు విచారింతము. భరతఖండమునం దంతటను బూర్వకాలము నుండియు నొక్కవేదమునే నమ్ముచు వచ్చినవారయ్యును వారిలో నొక్కమత ముండక గాణాపత్యాది మతములు మితిమీఱి యున్నట్టును తత్తన్మతావలంబకులు పరస్పరద్వేషముతో నొండొరులతోఁ గలహించు చుండినట్టును శంకరవిజయాదు లగుగ్రంథము లనేకములు సహస్రముఖముల ఘోషించుచున్నవి. దీనినిబట్టి చూడఁగా బూర్వకాలమునందు సహితము మనవేదము తన్ను నమ్మినవారిలో నెల్ల నేక మతమును పరస్పరభ్రాతృభావమును స్థాపింప లేకపోయిన దనుట స్పష్టమేకదా ? మతమునుపేరు చెప్పి పూర్వకాలమునందు రాజులసాహాయ్యమున జరపించిన క్రూరకృత్యములను దలఁచుకొనఁగా దేహ మిప్పుడును జలదరించుచున్నది. నిర్దోషు లయి స్వమతాభిమానులయి యుండినబౌద్ధులు మొదలగు మతాంతరులను శంకరాచార్యాదు

లగు మనపూర్వులు మానుషస్వభావమును విడిచి రాతిగానుగలలోఁ బెట్టి యాడించిన దారుణరాక్షసకృత్యములను విన్నమాత్రముచేత దయాలేశము కలవారి శరీరము లిప్పుడును పులకరింపకుండునా? కడచినదానిని బోనిచ్చి మన దేశముయొక్క ప్రస్తుతస్థితిని విచారింతము. మనమందఱమును నొక్కవేదమునే నమ్మినవార మయినను మనలో నైకమత్యము లేక యద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము, అను మూఁడు ప్రధానమతములు వ్యాపించియున్నవి. అంతటితో నిలువక వీనిలో నొక్కొక్కమతమునం దనేకములైన శాఖోపశాఖ లేర్పడి యైకమత్యాభావమునకును పరస్పరద్వేషమునకును గారణము లయి యున్నవి. ఒక్క విశిష్టాద్వైతులలో రామానుజమతస్థు లనియు, రామానందులనియు, చైతన్యు లనియు, వాల్లభు లనియు, ఎన్నెన్నో శాఖలవా రున్నారు. మరల రామానుజులలో వడగళు లనియు తెంగళు లనియు ననేకోపశాఖలుగా భాగింపఁబడి యన్యోన్యకలహములతోను వివాదములతోను దూషణములతోను కాలముగడపుచున్నారు. వీరిలో వీరు మతద్వేషముచేత తగవులాడి ధర్మస్థాపనముల కెక్కినవ్యవహారములు లెక్కకు మిక్కిలిగా నున్నవి. ఈపయిని జెప్పిన మతములలోఁ జేరి నబ్రాహ్మణులలో సహిత మన్యోన్యమైత్రిమాట యటుండఁగా సంబంధబాంధవ్యములను తుదకు పంక్తిభోజనములను సహితము మానుకొని యాయా మతములవా రితరమతముల వారి ముఖావలోకనమువలననే పాపము వచ్చుననియు వారి హఠాద్దర్శనము సంభవించినను సచేలస్నానములను భూప్రదక్షిణములను జేయవలయు ననియు మతగ్రంథములలో వ్రాసియున్నారు. అనంతములుగా నున్న యిట్టి నిదర్శనములనుబట్టి చూడఁగా వేద మొక్కటినే నమ్మిన వారిలో గూడ లిఖితవేదమువలనఁ గలుగు నన్న ప్రయోజనములు కలుగుచున్నవా? ఒక్క వేదవాక్యమునకే మతాచా

ర్యులు, పరస్పరవిరుద్ధములయిన విపరీతార్థములను జేసి వివాదపడుచుండఁగా, సత్యమయినవేదార్థ మిదియని సిద్ధాంతము చేయుట యెట్లు సాధ్యమగును ? ఒక్క వేదమునే ప్రమాణముగాఁగొని యద్వైతులు జీవేశ్వరులకు భేదము లేదనియు, విశిష్టాద్వైతులు జీవుఁ డీశ్వరునకు లోఁబడినవాఁడై యీశ్వరానుగ్రహమువలన ముక్తి నొందుననియు, ద్వైతులు దుష్కృతజీవులకు ముక్తియే లేదనియు, సిద్ధాంతములు చేయుచుండఁగా సత్యకాములయిన వారేసిద్ధాంతమును విశ్వసింపవలసియుండును ? ప్రతిమతమువారును తమసిద్ధాంతమునకు వేదప్రమాణమునే యుదాహరింతురు; వేదార్థనిర్ణయమునకు ప్రామాణికములయిన నిఘంటువులను వ్యాకరణములనే యుదాహరింతురు. ఇట్టి సందిగ్ధసమయములయందు సత్యనిశ్చయము చేయుట కిం దేయర్థము యుక్తియుక్తముగా నున్నది, యేది గుణబాహుళ్యము కలదిగా నున్నది, యేది యెంతవఱకు గ్రాహ్యముగానున్నది, అనెడు బుద్ధివిచారము తప్ప వేఱుసాధనము కానరాదు. అమోఘప్రమాణమనుకొనెడి వేదమునందుఁ బరమవిశ్వాస ముంచినవారికి సహిత మర్థసందేహమును, అభిప్రాయభేదమును, గలిగినప్పుడు సిద్ధాంతనిర్ణయమునకు బుద్ధి యొకటియే గతియైన ట్లింకావలనఁ బరమార్థ మేర్పడుచున్నది. ఈశ్వరోపదేశము లనుకొనెడి యమోఘప్రమాణముల నంధప్రాయముగా విశ్వసించునప్పుడును సంశయార్థములయందు సిద్ధాంతము నేర్పఱుచుకొనుటకు బుద్ధియొక్కటియే యనివార్యముగాఁ గావలసియుండఁగా, సమస్తవిషయములయందును సత్యగ్రహణమునకు బుద్ధి నొక్కదానినే పరమప్రమాణమునుగాఁ జేసికొని దాని సాహాయ్యమునకయి మాత్రము పుస్తకముల నేల గ్రహించుచుండరాదు ? విరుద్ధార్థములను జేయుట కవకాశము కలవియు, సందేహాస్పదములును, అయిన పుస్తకములనే పరమప్రమాణములనుగా గ్రహించి, సత్యా

సత్యనిర్ణయ సమర్థమయి యెల్లవారికిని భగవంతునిచేఁ బ్రసాదింపఁబడిన యుత్కృష్టసాధనమయియున్న బుద్ధి నా పుస్తకముల నర్థము చేయుటకు సహాయపడుటకు మాత్రమే యేల యంగీకరింపవలెను ? ఇట్లడిగినచో మనుష్యబుద్ధి ప్రమాద సహితమయినదనియు, భగవద్దత్తమయిన వేద మొక్కటి మాత్రమే ప్రమాదరహితముగా నుండు ననియు, కాఁబట్టి మనబుద్ధికి విపరీతములుగాఁ దోఁచిన వానిని కూడ వేదవిహితములయిన వానిని భగవంతుని బుద్ధియొక్క యమోఘత్వమును నమ్మి యపరిహార్యములుగా నంగీకరింపవలయు ననియు, ఊరక చెప్పెదరు గాని యాగ్రంథము లీశ్వరదత్తములయిన వనుటకును విశ్వాసార్హములయిన నిదర్శనము లేవియుఁ జూపఁజాలరు. వారు చెప్పెడు నిదర్శనము లన్నియు రెండు విధములుగా నుండును. అందొకతరగతివి భగవదావేశముగలవారును భగవదంశసంభూతులును జూపి రన్న మహిమలుగా నున్నవి; రెండవ తరగతివి పూర్వము భగవదనుగ్రహమును బొందినవారు దీర్ఘదర్శులయి చెప్పిన యాగామిసంగతు లన్నియు సత్యము లగుచున్న వన్న యద్భుతచర్యలుగా నున్నవి. మన మొకదానియొక్క వాస్తవము నెఱుఁగుట దాని తత్త్వవిమర్శనము వలనగాని దానిని జెప్పినవారు చూపిన యింద్రజాలమహేంద్రజాలములవలనఁ గాదు. కొలిమిలో కరఁగుచున్న సీసము మంచినీళ్ళవలె త్రాగిన మహానుభావుఁడు చెప్పెనన్న హేతువుచేత కాకులన్నియు తెల్లనివియు కొంగలన్నియు నల్లనివియు కానేర్చునా? అట్టిమహిమలను నమ్మెద మన్నను, మనవా రట్టిమహిమలను దుష్టులకును శిష్టులకునుగూడఁ గలవని చెప్పియున్నారు. శ్రీమహావిష్ణువుయొక్క యవతారపురుషుఁడయిన శ్రీకృష్ణుల వారు గోవర్ధనగిరిని చిటికెనవ్రేలిమీఁద నిలుపుటయే గొప్పమహిమ యని మన మద్భుతపడుచుండఁగా, ఇటువంటిపర్వతసహస్రములను

వహించిన భూమండలము నంతను చాపచుట్టవలె చుట్టి మోసిన ఘోర రాక్షసుఁ డయిన హిరణ్యాక్షుని మహిమ యా దేవమహిమను సిగ్గు పఱుచుచున్నది. పుస్తకములయందు వర్ణింపఁబడిన యీమహిమ లన్నియు నేకాలమునం దయిన నిజముగా జరిగి యుండునా యన్న యంశమునుగూడ మన మిప్పుడు సందేహింపవలసి యున్నది. ఈ గ్రంథములు పుట్టినట్టియు మహిమలు చూపఁబడె నన్నట్టియు కాలము, చెప్పినదానినెల్లను విమర్శలేక నమ్మెడి సత్యకాలము. ఆకాలమునందలి యమాయకు లయినజనులు మూఢభక్తినిబట్టియు ప్రకృతిస్వభావ మును ధర్మములను చక్కఁగా నెఱుఁగకుండుటనుబట్టియు కొంచెము చదువుకొన్న వారేది చెప్పిన దానినెల్ల సత్యమని విశ్వసించుచుండెడి వారు. అంతలో మతవిషయములో మతాచార్యులు చెప్పిన దెల్ల వేదతుల్యమే యనియు గురువులను దేవసములనుగాఁ జూడవలయు ననియు వారు చెప్పినదానియం దవిశ్వాస ముంచుట యపచారమనియు బాల్యమునుండియు బోధతగిలియుండుటచేత పూర్వకాలపువారు మాత్రమే కాక విద్యాధికులయిన ఇప్పటికాలపువారు సహితము తక్కిన విషయములయం దెట్లున్నను మతవిషయములయందు ప్రత్యక్షవిరుద్ధములయిన సంగతులను సహితము మాఱుమాటాడక నమ్ముచుండుటను మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము. అంతేకాక యీ కాలమునందు సహిత మెక్కడనో జరిగిన యొకయల్పసంగతి కర్ణపరంపరనుండి రాఁగారాఁగా మాఱుచు వచ్చి క్రమక్రమముగా శాఖలతోను నుపశాఖలతోను పెఱిగి తుదకు క్రొత్తదగుచు వచ్చుటయు, తరువాత, వారు చూచి రనియు, వీరుచూచిరనియు నేమియు నెఱుఁగని గొప్పవారనేకులు ప్రత్యక్షసాక్షులుగాఁ గల్పింపఁబడు చుండుటయు, సామాన్యజనులా యద్భుతకల్పనలను సందేహపడక సత్యములుగా నమ్ముచుండుటయు, విమర్శకు లెవ్వరయిన శ్రమపడి శోధిం

పఁబూనినచో నాకాశమునంటిన వార్తామహావృక్షమంతయు కడపట మూఢతాకల్పితములయిన తన శాఖోపశాఖలను మహాద్భుతవృద్ధిని పోగొట్టుకొని సామాన్యమయిన చిన్న మొక్క యగుచుండుటయు మన మనేక విషయములలోఁ గనిపెట్టుచున్నాము. ఆవిరియంత్రములుగాని మంచిమార్గములుగాని తంత్రీవార్తలుగాని వృత్తాంతపత్రికలు గాని లేని యీకాలములో నాటవికుఁడొకఁడు కోఁతియొకటి పెద్దరాతి నెత్తి విసరివేయఁగాఁ జూచి కొంత పెంచి యాకథను తన మిత్రున కద్భుతకరముగాఁ జెప్పవచ్చును ఆ మిత్రుఁ డింకొకనితోఁ జెప్పునప్పుడా తాటికాయయంత రాయియు గుమ్మడికాయయంత కావచ్చును. ఈకథ యింకొకనివద్దకుఁ బోవునప్పటి కాగుమ్మడికాయయంతరాయియు చిన్నపర్వతమంత కావచ్చును. ఈరీతిగా మఱి కొందఱిచెవులు చేరునప్పటి కది నిజమయిన పర్వతమే కావచ్చును. రాయి పర్వతమంత యయినప్పుడు రాతితోఁగూడ కోఁతియు పెరుగక మానదు. ఈరీతిగా కోఁతియు రాయియు జనులనోళ్ళలో పడి పెరుగుచు రాఁగా, కట్టకడపట నా మర్కటము వెంట్రుకకు కోటికొండలను కట్టుకొని యెగురఁగల మహాహిమగలదయి దానిచరిత్రము సత్యమయిన మహాపురాణమే కావచ్చును. అప్పుడనేకులు కల్పితపురుషులును సత్యముగా నున్నవారును గూడ నా దివ్యమర్కటముయొక్క యమానుషచర్యలను జూచిన మహానుభావులయిన సాక్షులుగా మహాకవులచేఁ జేయబడుదు రనుటకు సందేహ ముండదు. తరువాతి కాలపువారి కాకథ విశ్వాసార్హమయిన పురాణమగుటకును సంశయ ముండదు. ఈకాలమందు మహిమలుగా పరిగణింపఁబడెడు కథలనేకము లీప్రకారముగా బయలుదేరినవని యే నాయభిప్రాయము. ఇప్పటికాలపు వారికిట్టి కథలయందలి నమ్మక మిప్పుడిప్పుడు క్రమముగాఁ దగుచున్నది.

కాఁబట్టి యీకాలమునందే యీ మహిమలు జరుగుచున్నట్టు చెప్పఁబడిన పక్షమున, ఇప్పటివారు విన్నంతమాత్రముననే వానిని నమ్మక స్థలమునుగూర్చియు కాలమును గూర్చియు మహాత్మునితో సంబంధించిన యనేకవిషయములను గూర్చియు నెన్నెన్నో ప్రశ్నలు వేసి చెప్పినవానిని నిరుత్తరుని జేయుటయేకాక సత్యమును శోధించి కల్పించిన కథలయందలి యసందర్భములను లోకమునకు వెల్లడించి సత్యము బయలు పడునట్లు చేయక మానరు. హిరణ్యాక్షుఁడు భూమిని చాపఁగాఁ జుట్టిన కథనే యిప్పటి విద్యార్థులకడ మనము చెప్పెదుపక్షమున, భూమిని చాపవలె చుట్టుట సాధ్య మగునా యనియు, భూమిని చంకక్రింద నిముడ్చుకోఁ గలిగినవాఁ డెంతపొడు గయినవాఁడుగా నుండవలెననియు, భూమికంటె నెన్నో మడుఁగులు పొడుగయినవాఁడు భూమిమీఁద నున్న యొకపట్టణములోని యొక యింట నెట్లిమిడె ననియు, ఎక్కడ నిలుచుండి భూమిని దేనిమీఁద పెట్టి చుట్టఁగలిగె ననియు, వేయిప్రశ్నలు వేసి వారు మనకథయొక్క యసందర్భమును అవిశ్వాసనీయతను ప్రకటనచేసి మనలను పిచ్చివారిని జేసి పంపక మానరు. క్రైస్తవవేదమునందుఁ జెప్పినట్లుగా నొక మహా పురుషుని భూమధ్యసముద్రములో తిమింగిల మొకటి మ్రింగివేసి, అతనిని తనగర్భకుహరములో మూఁడుదినము లుంచుకొని, తరువాత నాతనిని సముద్రతీరమునందు ప్రాణములతో విడిచినదని చెప్పెడు పక్షమున, ఇప్పటివారు ప్రకృతిశాస్త్రజ్ఞులను రప్పించి భూమధ్యసము ద్రమునందు తిమింగిలము లెప్పుడు నుండలేదనియు ఆసముద్రము యొక్క యుష్ణస్వభావమునుబట్టి శీతలప్రదేశములయం దుండఁదగిన తిమింగిలములందు వసించుట సాధ్యము కాదనియు, తిమింగిలము యొక్క కంఠద్వారము చిఱుచేపలుమాత్రము పట్టఁదగిన చిన్నరంధ్ర

మగుటచే మనుష్యుఁడు దాని కంఠములోనుండి కడుపులోనికి పోవుట యసాధ్యమనియు, చూపి యీసంగతి యసత్యమని స్థాపింపకుందురా ?

ఈశ్వరావేశముగల పూర్వకాలపు మహానుభావులు సూచించి రన్న భావికాలజ్ఞతయు విమర్శించి చూచినచో నీప్రకారముగానే యుండును. పూర్వకాలపు దీర్ఘదర్శులు సూచించినవియుఁ జెప్పినట్టుగా కాలాంతరమున జరిగినవియు నయిన యద్భుతకార్యము లేవియుఁ గాన రావు. అందులోఁ గొన్ని నిజముగా జరిగిన తరువాతనే వెనుకటివారు చెప్పినట్టు పౌరాణికులు వ్రాసినవియు నయి యుండవచ్చును. మఱి కొన్ని వెనుకటివారు వ్రాసిన వాక్యముల కనేకార్థములు తీయుట కవ కాశము కలుగఁగా, నేదో యొక యర్థమును ప్రస్తుతకాలమునందు జరిగిన యొక వృత్తాంతముతో సరిపెట్టి మనపూర్వుల త్రికాలజ్ఞతను స్థాపించిన రీతివియు నయి యుండవచ్చును. సర్వజ్ఞులయిన మనపూర్వులు కలియుగమున నయిదువేలసంవత్సరములు వచ్చునప్పటికి వర్ణసాంక ర్యము కలుగుననియు ధర్మము చెడుననియు వ్రాసియుండిరనియు, వారివాక్యము లిప్పుడు సత్యము లగుచున్నవనియు, మనవారనేకులు తొంటివారి దీర్ఘదర్శిత్వమునకు దృష్టాంతముగా నుదాహరించు చుండఁగా మనము పలుమాఱు వినుచున్నాము. "గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్" అన్నయార్యోక్తినిబట్టి యీనాని తలయూఁచిన నేమోకాని, సత్యమునుబట్టి విచారింపఁగా పూర్వకాలమునందే ధర్మ దేవత నాలుగుపాదములతో నడుచుచు వచ్చినందుకును, ఇప్పుడు కుంటుపడిపోయి యొంటికాలితోనే నడుచుచున్నందుకును, నాకు ప్రబల నిదర్శనము లేవియుఁ గానరావు. పురాణములనుబట్టి కృతయుగవర్తన మును విచారింపఁ బూనినపక్షమున, మనుష్యులమాట యటుండఁగా దేవతలలోనే వ్యభిచారదోషము లేనివారు కానరాకున్నారు. పూర్వము చంద్రుఁడు దేవగురుని విషయమునఁ బ్రవర్తించినట్టుగా గురుభార్యను

లేవఁదీసి యింట నుంచుకొని మగఁడు వచ్చి యడిగినప్పుడును విడువక తగవులాడువారును, పరులు ప్రార్థించి భార్యను మగని కిప్పించినమీఁదట పుట్టిన పుత్రునకయి పోరాడువారును, తగవులు తీర్చువారును, మనకాలమునందు బహిరంగముగాఁ గానరారు. ఎక్కడనైనఁ గొందఱున్నను వారిని రాజులు ద్రోహులనుగా నెంచి శిక్షించుచున్నారు. ఇటువంటివి చెప్పఁబూనినచో నెన్నియైన నున్నవి గాని గ్రంథబాహుళ్యభయముచేత నీవిషయమును విరమించెదను.

మనపూర్వులు చూపిరన్న మహిమలును దీర్ఘదర్శిత్వమును పరీక్షకు నిలుచునవి కావనియు విమర్శచేయక విశ్వసించిన వారికి మాత్రమే విశ్వాసార్హములుగా నుండునవనియుఁ జూపియున్నాను. అయినను మహిమలు మొదలయినవానినిగూర్చి గ్రంథములు వ్రాసిన పూర్వు లందఱును వంచకులనియు నసత్యవాదు లనియు నేను జెప్పను. ఆకాలస్వభావమునుబట్టి వా రసత్యములను సహితము సత్యము లనియే నమ్మియుండవచ్చును. ఆకాలపువారు సాధారణముగా నప్రత్యక్షమయిన సంగతులలో నసాధ్యచర్యలు చెప్పినను శంకింపక విశ్వసించుస్వభావము గలవారు; కాఁబట్టి గొప్పవా రుపదేశించెడు సద్ధర్మములనుబట్టి వారియెడలఁ గలిగిన గౌరవమువలన వారివిషయమయి మూర్ఖులేమహిమలను జెప్పుచు వచ్చినను నమ్ముచుండెడివారు. కథలను నమ్ముచు వానియం దాదరాతిశయము కలిగియుండెడి ప్రపంచముయొక్క యీబాల్యదశలో జనులు సత్యములకును కల్పనలకును, ప్రత్యక్షములకును భ్రమలకును, స్వభావసిద్ధములకును స్వభావవిరుద్ధములకును భేదము నంతగాఁ గనిపెట్టఁదగిన స్థితిలో నుండువారు కారు. కాఁబట్టి మన మిప్పుడు వారిని మోసగాండ్రని దూషింపక వారు చెప్పినమహిమలను విశ్వసించు విషయములో మాత్ర మత్యంత జాగరూకుల మయి యుండవలెను.

కములమూలముననే కదా మనపూర్వులు తాము కష్టపడి లోకానుభవముచేత సంవత్సరములకొలఁది కృషిచేసి కూర్చిన జ్ఞానధనమంతయు మన కశ్రమలభ్యమగునట్లుగా క్షణకాలములో మనకు కొల్లబెట్టఁ గలుగుచున్నారు? స్వర్ణరజతాదిరూపముల నున్న ధనముకంటె సహస్రగుణము లధికమూల్యమయిన జ్ఞానధనమును మతిమంతుఁ డెవ్వఁడైన నిరాకరింపఁ జూచునా? జ్ఞానధన మెందున్నను మన మవశ్యముగా గ్రహింపవలసినదే. వేదమునం దున్నను, వేమనశతకమునం దున్నను, స్మృతియం దున్నను, సుమతీ శతకమునం దున్నను, బైబిలునం దున్నను, ఖొరాను నం దున్నను, మఱియెందున్నను సత్యము మన కవశ్యాదరణీయముగా నుండవలెను. మన కెంతబుద్ధియున్నను లోకానుభవమును, పుస్తకసాహాయ్యమును లేక మన మభివృద్ధిపొంద నేరము. అయినను నేను జెప్పిన దంతయు భ్రమప్రమాదాదులతోఁ గూడిన మనుష్యులచేతఁ జేయఁబడిన పుస్తకము లమోఘప్రమాణములుగా నుండనేరవు. కనుక వానియం దున్న సత్యములనెల్ల గ్రహించుచు బుద్ధ్యనుభవాదులచేత నసత్యములని తేలినవానిని నిరాకరింపవలయునని మాత్రమే. సత్యనిర్ణయమునకొఱకు మనబుద్ధి నుపయోగింపక యొకపుస్తకము నమోఘప్రమాణముగా స్వీకరింతుమేని, మన మప్పు డాలోచనను పోఁగొట్టుకొని మూఢభక్తిని మూఢవిశ్వాసములను మూఢాచారములను బొందవలసినవార మగుదుము. కేవల పుస్తకప్రమాణము నవలంబింపక సత్యాసత్యవిచారమునందు మన యాలోచననుగూడ నుపయోగించుకొందుమేని, అప్పు డసత్యముల నెం దున్నను విడుచుచు సత్య మెం దున్నను గ్రహించుచు కేవల సత్యప్రియుల మయి జ్ఞానాభివృద్ధి బొందుచుందుము. కాఁబట్టి నీతిని గలిగించునట్టియు సత్యములను వెల్లడించునట్టియు నిజమయిన భక్తి

విశ్వాసములను వృద్ధిపఱుచునట్టియు సంగతు లెందున్నను మహాదర ముతో గ్రహించుట కయి మన మభ్యాసము చేసికోవలెను.

ఈలోకములో భగవంతుఁడు మన ప్రవర్తనమునుగూర్చి యే మియు మనకు ధర్మోపదేశమును జేయఁడా? ఏమియుఁ దెలియకుండ మనల నెల్ల కాలము నంధకారములోనే యుంచునా? యని యెవ్వర యిన నడుగవచ్చును. మీప్రశ్నల కుత్తరముగా గ్రహింపఁ దలఁ పుగొన్నవారి కెల్ల భగవంతుఁ డెప్పుడును విరామము లేకుండ నుప దేశించుచున్నాఁ డనియే నేను దృఢముగాఁ జెప్పగలను. ఈశ్వరుఁడు మన కనుగ్రహించినవేదములు రెండున్నవని చెప్పవచ్చును. అవి సమస్తకాలముల యందును సమస్తప్రదేశముల యందును నవిచ్ఛి న్నములుగా నుండును. అందొకటి ప్రపంచవేదము. ఈసృష్టివే దమే పుస్తకములన్నియుఁగలిసి చెప్పఁదగినదానికంటె శతగుణములధి కముగా భగవంతుని మహిమలను శక్తులను మంచితనమును దెలిసి కొనఁగోరు వారి కందఱికిని మాటలు లేకయేయుందఱికిని దెలిసెడిభాష తో సదా ఘోషించుచుండును. బ్రహ్మాండము మొదలుకొని య ణువు వఱకునుగల సృష్టిజాల మంతయు మీకు దేవుని మహత్వమును దయాళుత్వమును వెల్లడించుచుండలేదా? ఏవస్తువునుజూచిన, అది యీశ్వరుని మహత్త్వమును శక్తిని కరుణాళుత్వమును న్యాయమును బుద్ధిని ప్రేమను సహస్రముఖముల ఘోషింపకుండును? సృష్టివర్గ ములోని యేపదార్థమును విమర్శించినను, అది యొక యుద్గ్రంథమై పరిశీలించిన కొలఁదిని విశేషార్థమును బోధించుచుండును. అది బో ధించెడి భాష యెల్లదేశములవారికిని సమస్తకాలములవారికిని పండిత పామరసామాన్యముగా బోధపడెడు విచిత్రభాషయయియున్నది. సర్వస త్యములును సర్వమతసారములును పరీక్షించిచూచువారికి సృష్టివేదము నందే యిమిడియున్నది. ఈశ్వరుఁడుమనకు ప్రసాదించిన రెండవవేదము

మాంసమయములగు మన హృదయఫలకములయందే యాబాలవృద్ధముగా నందఱికిని విదితమగునట్లు దివ్యాక్షరములతో లిఖింపఁబడియున్నది. దానియం దిమిడియున్న సమస్త ధర్మములును మనమేకార్యమును జేయఁ బూనినప్పుడును మన ప్రయత్న మక్కఱలేకయే కన్నులఁ గట్టినట్లుండి హితోపదేశము చేయుచుండును. ఈశ్వరదత్తము లయిన యీ రెండువేదములే సమస్తసత్యములకును సమస్త ధర్మములకును సమస్త సుఖములకును మూలాధారములు. కాఁబట్టి మనమెల్ల విషయములయందును నివి యుపదేశించు సత్యములను నిరాకరింపక యాదరించుచు నిరంతరాభివృద్ధిని పొందుచుందుము గాక!

లిఖితవేదమువలన నైకమత్యము కలుగక మతభేదములును మతద్వేషములును సంభవించునని యాక్షేపించుచున్నారుగదా, వీరు చెప్పెడి హృదయస్థమయిన "యాత్మవేదమును" నమ్మి ప్రవర్తించునప్పుడు మాత్రము మనుష్యుల బుద్ధ్యనుసారముగా మఱిన్ని మతభేదము లేర్పడి మఱింత యైకమత్యము చెడి సర్వజనవిశ్వాసపాత్రము లయిన కట్టుబాట్లులేక లోకము మఱింత చెడిపోదా యని వీరడుగవచ్చును. హృదయగతమైన యీ సత్యవేదము ననుసరించునప్పుడట్టి వైమత్యములు కలుగుట కెంతమాత్రమును నవకాశముండదు. అప్పుడైకమత్యము చెడుటకు మాఱుగా బలపడి లోకము బాగుపడును. మన మనస్సులయందు రెండువిధములయిన జ్ఞానములున్నవి. అందొకవిధమైనవి యెప్పుడును మార్పును జెందక సదా యేకరీతిగా నుండునవి; రెండవ విధమైనవి కాలానుసారముగా యుక్తమయిన మార్పులను జెందుచు నభివృద్ధి కవకాశము కలిగించునవి. ఆలోచనవలనను విమర్శవలనను గలిగెడి యీ రెండవవిధమయిన జ్ఞానవిషయమున నభిప్రాయభేదము లుండవచ్చునుగాని, మనుష్యసామాన్యముయొక్క హృదయములయందెల్లను దేవుని దివ్యలిఖితములయియున్న మొదటి

విధమయిన "సత్యము పలుకవలెను. అసత్యము పలుకఁగూడదు; శమ దమ దయాదులను పూనవలెను; జారత్వ చోరత్వ మాత్సర్యాదులను మానవలెను." అను నివి యాదిగాఁగల మూలతత్త్వములు మాత్ర మెప్పుడును మాఱవు. మానవహృదయములనంటి సర్వకాల సర్వావస్థలయందును మాఱక నేకరీతిగా నుండెడి యీ ప్రాథమిక సత్యములనే శాస్త్రవేత్తలు సామాన్యజ్ఞాన మనియు సహజబోధ మనియు స్వాభావికతత్త్వ మనియు వివిధ నామములతో వ్యవహరించుచున్నారు. దేవుఁడు కలఁడనియు, ఆత్మ దేహనాశము వలన నశింపదనియు, మరణానంతరము పుణ్యపాపఫలముల ననుభవించెడు పరలోకము గలదనియు, మనకుఁ గలిగెడు జ్ఞానము స్వభావసిద్ధమయిన సహజబోధమే కాని యాలోచనచేతను విమర్శచేతను లోకానుభవము చేతను గలిగినది కాదు. ఈ సహజబోధమునకు వ్యతిరిక్తముగా దేవుఁడు లేఁడనియు, ఆత్మలేదనియు, పుణ్యపాపములు లేవనియు, కొందఱు మాటలతోఁ జెప్పవచ్చునుగాని మనస్సుమాత్రము వారిమాటలతో నేకీభవింపక యెప్పుడును పయి సత్యములను స్థాపించుటకయి లోపలపోరాడుచునే యుండును. అందుచేతనే కొందఱు మరణానంతరమున పుణ్యపాపఫలానుభవము లేదని పయికిఁ జెప్పుచునేయున్నను, అట్టివారు సహితము హృదయగత మయిన సహజబోధమును తుడిచివేయలేక దానికి లోఁబడి కొన్నిపనులు చేయవచ్చుననియు కొన్నిపనులు చేయఁగూడదనియు నమ్మి యాప్రకార మాచరించుచునే యుందురు. ఈ ప్రాథమికసత్యములు వారివారి యిచ్ఛాధీనములయి నానావిధములుగా నుండక సర్వజన సామాన్యములయి యేకవిధమయినవిగా నుండును. కాఁబట్టి యవి పండితులకును పామరులకును బాలురకును వృద్ధులకును వనవాసులకును గృహవాసులకును సర్వ మానవులకును సామాన్యధనమని చెప్పవచ్చును.

ఆత్మ నిత్యమనియు, పుణ్యపాపఫలముల నిచ్చెడు పరమేశ్వరుఁడు గలఁడనియు, మన కిప్పుడు కలిగియున్న సహజజ్ఞానము మనకు వేదమూలముననే కలిగినదనియు, వేదమే లేకపోయినయెడల మన మాముష్మికవిషయములయందు మూఢులమయి యుందుమనియు, కొందఱు సాధింపఁజూతురుకాని యీవేదవాదులవాదము సయుక్తికమయినది కాదు. చక్కఁగా నాలోచించి చూచినపక్షమున, వేదోత్పత్తికి పూర్వమునందే యీశ్వరసద్భావాదులయందు జనులకు నమ్మికయుండనియెడల వేదము లీశ్వరాజ్ఞారూపములని విశ్వసించుటయే యసాధ్యమని స్పష్టపడక మానదు. ఎట్లన- దేవుఁడున్న సంగతియే యావఱకు నిశ్చయముగా నమ్మనిపక్షమున, అని దేవుఁ డిచ్చిన పుస్తకము లని నమ్ముట యెట్లు సాధ్య మగును? దేవుఁడు పరమ కారుణికుఁ డనియు పరిశుద్ధుఁడనియు కళ్యాణగుణపరిపూర్ణుఁ డనియు నావఱకు నమ్మిక యుండనియెడల, అతఁడు తనవేదమునందుఁ జెప్పిన దానినెల్లఁ జెల్లించుననియు తదుక్తఫలములను గలుగఁజేయుననియు నమ్ముట యెట్లు సాధ్య మగును? అణుమాత్రమును సాధ్యము కాదు. కాఁబట్టి వేదోత్పత్తికిఁ బూర్వమునందును మనుష్యునకు భగవద్విషయకజ్ఞానము సహజముగా నున్నదని యొప్పుకోవలసి వచ్చును. ఈసహజజ్ఞానమే మతమునకు సుస్థిరమయినపునాదిగానుండును; విమర్శ మొదలయినవానివలనఁ గలిగెడు జ్ఞానములు వృద్ధియోగ్యమయిన మతసౌధమునకు విచిత్రము లయిన యుపరిభవనములుగా నేర్పడుచుండును. అందుచేత మనము బుద్ధిని బ్రసరింపఁజేసి పరిశోధన చేసిన కొలఁదిని క్రమక్రమాభివృద్ధిని జెందును. మతము పరిశుద్ధ మయి మహోన్నత మగుచు వచ్చును. విమర్శ యెప్పుడును సహజజ్ఞానము ననుసరించియే యుండునుగాన, విమర్శించి చేసినపని స్వాభావిక మతమునకు మెఱుఁగు దెచ్చుచుండును. కాని దాని కెప్పుడును విరుద్ధ మయినదిగా నుండదు.

సహజబోధము నాధారపఱచుకొని సత్యాసత్యవిచారము చేయుచు విమర్శించుచు వచ్చిన యెడల, మతము కాలానుగుణముగా నభివృద్ధి నొందుచుఁ బ్రకృతిశాస్త్రముల కెన్నఁడును ప్రతికూలముగా నుండ కుండును. దానిని విడిచి వేదప్రమాణమునే నమ్ముకొని యుండెడి పక్షమున, మతమునకును కాలానుగుణముగాఁ బెంపు చెందుచుండు ప్రకృతిశాస్త్రములకును విరోధమును కలహమును గలిగి శాస్త్రజ్ఞుల కెల్ల మతమునం దవిశ్వాసమును నగౌరవమును గలుగుటకుఁ గారణ మగును. మతమును బుద్ధికిని యుక్తికిని బాహ్యము కాకుండ నుంచుచు వచ్చెడుపక్షమున, ప్రకృతిశాస్త్రమునం దొక్కొక్క మూలతత్త్వమును కనుఁగొన్నకొలఁదిని మతమునం దీశ్వరునిమహిమ నొక్కొక్కదానిని కనుఁగొన్నట్లయి మతము పెంపు చెందు చుండును. దేవుని స్వహస్త లిఖితము లయిన ప్రకృతిశాస్త్రతత్త్వములకు మతసిద్ధాంతము లెప్పుడు వ్యతిరిక్తములుగా నుండునో యప్పుడు మత మడుగంటి క్రమక్రమ ముగా క్షీణింపక తప్పదు. కాఁబట్టి మన మంధప్రాయముగా మన పూర్వులు వేదవాక్యము లని చెప్పినవానినెల్ల నమ్మక సందేహము కలిగినప్పుడు విమర్శ చేయుచువత్తుమేని, మూఢాచారములను మూఢ విశ్వాసములను విడిచి సత్యమునుమాత్రమే గ్రహించుచుందుము. పుస్తకములకంటె మనకు సత్యమే యమూల్య మయినది. కాఁబట్టి సత్య మేపుస్తకమునందున్నను మనము దానిని గ్రహించుచుండ వలెను; సత్య మేపుస్తకమునందు లేకున్నను మనము దానిని పరిత్య జించుచుండవలెను. ఇది యే మన పురోభివృద్ధికి సాధన మయినపర మార్గము.

వృద్ధికి హేతువయిన విమర్శనజ్ఞానమునం దభిప్రాయభేదము లున్నను స్వాభావికమతసిద్ధాంతముల యం దభిప్రాయభేద ముండదని యీవఱకే నొక్కి చెప్పి యున్నాను. కొందఱుజనులుగాని కొన్ని

జాతులవారు గాని కొన్ని దేశములవారు గాని యల్పకాల మయినను చిరకాల మయినను దురాచారదుర్మతములకు లోఁబడి యస్వాభావిక సిద్ధాంతముల నవలంబింపవచ్చును గాని యట్టి యసత్యము లెంతకాలము ప్రబలములుగానున్నను నైసర్గికసత్యములు మాత్రము మానవహృదయ ములం దెన్నఁడును మొదలంట నశింప నేరవు. మనము బుద్ధిని విమర్శజ్ఞానమును ననుసరించి ప్రవర్తించుటవలన పుస్తకములయొక్క గాని గురువులయొక్కగాని మధ్యవర్తిత్వ మక్కఱలేక మన యీశ్వ రాజ్ఞలను ప్రత్యక్షముగా గ్రహించుచు, దేవాలయములయందును దూరదేశతీర్థములయందును గాక దేవునిని మన హృదయాంతరము నందే చూచుచుందుము. ఈ సత్యములను మనము నమ్మికొని ప్రవర్తిం చెడు పక్షమున, ప్రాపంచికగురువులు మనల నొకవేళ విడనాడినను లోకగురుఁ డయిన పరమేశ్వరుఁడుమాత్రము మనలను విడిచిపెట్టక యనిర్వచనీయ మయిన యాత్మానందము నిచ్చుచుండును. కాఁబట్టి మన హృదయగత మయిన సహజబోధమునందును ప్రకృతితత్త్వముల యందును మనకుఁ బరమవిశ్వాసము కలుగునట్లును సత్య మెందున్నను గ్రహించుచు నీశ్వరాజ్ఞానుసారముగా సన్మార్గమునఁ బ్రవర్తించు నట్లును సర్వకారుణ్యుఁడైన సర్వేశ్వరుఁడు మనకు దృఢచిత్తమును ప్రసాదించునుగాక !

# ఈశ్వరోపాసనము

మనకు ప్రభువయి సృష్టికర్తయైన యీశ్వరుఁడున్నాఁడన్న నమ్మక మెక్కడ నుండునో యక్కడనెల్ల నీశ్వరోపాసన ముండక తప్పదు. ఈ ప్రపంచమునందు మనుష్యులు సృజింపఁబడినది మొదలుకొని ప్రతిదేశమునందును ప్రతిజాతివారిలోను ఏదో యొకవిధమయిన యారాధన ముండుచు వచ్చినట్లు చరిత్రములు ఘోషించుచున్నవి. దీనినిబట్టి చూడఁగా తనకుఁ ప్రభువయి తన్ను శాసించువాఁడొక్కఁడు పయి నున్నాఁడను జ్ఞానము మనుష్యున కాదికాలము నుండియు స్వాభావికముగా నున్నట్లు కానఁబడుచున్నది. స్వభావమును మార్చుట యెప్పటికిని శక్యము కాదు. అందుచేతనే యడవులలో వసించెడు జ్ఞానశూన్యులయిన యనాగరికులు మొదలుకొని పురములలో వాసముచేసెడు జ్ఞానాధికులయిన నాగరికులవఱకును సమస్తజనులును తమతమ జ్ఞానతారతమ్యములనుబట్టి దేవుని తమకు సర్వోత్కృష్ట మని తోఁచినరీతిగా భావించి తదనుగుణములయిన గుణాదుల నాతని కారోపించి ఘనతపఱిచి పూజించి, గౌరవించి యాదినుండియు తమ తెలివికి తగినట్లుగా నారాధించుచున్నారు. గృహాదులను నిర్మింప నెఱుఁగని మోటుకాలములో మనుష్యుఁడు దేవుని నరణ్యమధ్యముననో పర్వతాగ్రమునందో యారాధించుచు వచ్చెను. గృహనిర్మాణాదులను నేర్చిన పిమ్మట మనుష్యుఁడు దేవాలయములను కట్టి యందు దేవుని నారాధింప మొదలుపెట్టెను. ఈశ్వరారాధన మెప్పుడారంభ మయినదో యెవ్వరును జెప్పలేరు గాని యది మనుష్యసృష్టితోనే యారంభమయి యనాదిగా నుండియున్నదని నిర్వివాదముగా

సాధింపవచ్చును. రాజులప్రభుత్వము లేర్పడి వారిని కొలువనారంభించుటకు ముందుసహితము మనుష్యులలో దేవతలను పూజించుట యున్నందున ననేకనిదర్శనములు కానఁబడుచున్నవి. కొంచెము నాగరికత గలిగి వ్రాత యేర్పడని కాలములో దేవతాస్తుతులు పద్యరూపముగా రచింపఁబడి పాడఁబడుచుండెను. మనలోని ఋగ్వేదములోని ఋక్కు లన్నియు నీప్రకారముగా నేర్పడినవే. ఇట్టి ఋక్కులు మొదలయినసూక్తములను పాడ నారంభించుటచేతనే సంగీత మారంభమయ్యెనని బుద్ధిమంతు లూహించుచున్నారు. సంతోషజనకమయిన యొక్క సంగీతమునకు మాత్రమే కాక యాదికాలమునందు దేశాభివృద్ధికర మయిన నాగరికత కంతకునుగూడ మతమే కారణ మయినట్టు తెలియవచ్చుచున్నది. పూర్వకాలమునం దారంభదశలో నేదేది మహిమకలదిగా కానఁబడుచుండెనో యదియెల్ల నీశ్వరస్వరూపముగా భావింపఁబడుచుండెను. అందుచేతనే మనపూర్వ ఋషులు సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని, వాయువు మొదలయినవానిని దేవతలనుగా భావించి వానినెల్లను ఋక్కులలో స్తుతించుచు వచ్చిరి. అటుతరువాత మఱికొంత జ్ఞానాధిక్యము కలిగినపిమ్మట నీశ్వరునకు సూర్యచంద్రులు నేత్రములుగాను, వాయువు లూర్పులుగాను, మహత్తరము లయిన యనేకపదార్థము లితరావయవములుగాను వర్ణించుచు వచ్చిరి. జ్ఞానాభివృద్ధి యయినకొలఁదిని జనులలో నీప్రకారముగా నీశ్వరవిషయకములయిన పూర్వాభిప్రాయములు మాఱిపోయి నూతనాభిప్రాయములేర్పడఁ జొచ్చినవి. నాగరికతయొక్కయు విద్యయొక్కయు నభివృద్ధితోఁగూడ జనులలో నీశ్వరమహిమలును వర్ధిల్లసాగినవి. మొట్టమొదట దేవతలుగానో దేవుని యవయవములుగానో యుండిన సూర్యాగ్నిచంద్రాదు లన్నియు విద్యాభివృద్ధియయిన యీ కాలములో

తమ దేవత్వమును పోఁగొట్టుకొని దేవుని మహిమలను వెల్ల డించెడు సృష్టపదార్థము లయిపోయినవి. మూఢదశలో జను లకు తమ్మును తమ గ్రామమును మాత్రము పాలించెడు గృహదేవ తగానో గ్రామదేవతగానో తోఁచెడి యీశ్వరుఁడు జ్ఞాన దశలో నిప్పుడు సమస్తలోకములను పాలించెడు సర్వేశ్వరుఁడయి యున్నాఁడు. సూర్యచంద్రాదులు తాము దేవతలుగా భావింపఁబడిన కాలముకంటెను ప్రకృతిశాస్త్రజ్ఞాన మధిక మయిన యీకాలమునం దధికమహత్త్వముకలవిగా తెలియఁబడి దేవత్వ మక్కఱలేకయే సూ సూర్యుఁడును, చంద్రుఁడును, భూమియు, ఆకాశమును, అగ్నియు, వాయువును, జలమును, వృక్షములును సమస్తపదార్థములును దేవ దూతలవలె దేవునిమహిమలను వాక్కులేకయే జనులహృదముల కెక్కునట్లు మఱింతవిశేషముగా బోధించుచున్నవి. ఒక్కసూర్య చంద్రాదులయందు మాత్రమే కాక ప్రకృతిశాస్త్రజ్ఞానమువలన మన మిప్పుడు స్థూలములును సూక్ష్మములు నైన సమస్త పదార్థముల యందును మనపూర్వులెప్పుడును చూడని మహిమలను కనిపెట్టి యీశ్వరశక్తి కద్భుతపడి యానందింపఁగలుగుచున్నాము. మునుపు వట్టిగాలిగాను, నీరుగాను, ఉండెడుపదార్థము లిప్పుడు తమలో నీశ్వరుఁ డమర్చియుంచిన క్రొత్తక్రొత్త యుపయోగములను క్రమముగా నొక్కొక్కటినే బయలఁబెట్టుచు యంత్రాదులను నడుపుచు మనసుఖ సంతోషాదులను వృద్ధిపఱచుటకును శ్రమలను తగ్గించుటకును సాధ నము లయి యీశ్వరుని యద్భుతమహిమను శక్తిని బుద్ధిని కరుణాళు త్వమును సదా ద్దేశమును సహస్రముఖముల ఘోషించుచున్నవి. ఈప్ర కారముగా భగవంతుని తెలిసికొనుటకు సాధనము లంతకంత కెక్కువ యయి యీశ్వరమహిమ లెక్కువగా వెల్లడి యయిన కొలఁ

దిని జను లెక్కువగా బ్రహ్మానందము ననుభవింపఁ గలుగుచున్నారు. తత్త్వవిచారము చేసినకొలఁదిని సర్వాంతర్యామి యైన యీతని మహిమ దరిలేని సాగరమువలె పెరుగుచున్నది. ఇట్లున్నను తెలివి యెక్కువయిన యీకాలములో కొంద ఱీశ్వరుని దూషింపను వచ్చును; కొంద ఱీశ్వరసద్భావమునే శంకించి హేతుకల్పనము చేయను వచ్చును; కొందఱు నాస్తికులు కాను వచ్చును; కాని జనసామాన్యము యొక్క హృదయక్షేత్రములనుండి స్వభావసిద్ధ మయిన యీశ్వర విశ్వాసబీజమును పెల్లగించివేయుటమాత్ర మెన్నటికిని సాధ్యముకాదు.

పూర్వకాలమునం దిప్పటికంటె జనులలో మూఢవిశ్వాసమును మూఢభక్తియు నెక్కువగా నున్నను, అది స్వప్రయోజనపరత్వముచే వచ్చిన దగుటచేత వారిభక్తి శ్రేష్ఠ మయినదని నేను చెప్పఁజాలను. అజ్ఞాన మెక్కువగానున్న కాలములో స్వప్రయోజనపరత్వమును భీతియు హెచ్చుగా నుండకతప్పవు. అజ్ఞానికిని జ్ఞానికిని గలభేదమంతయు 'స్వార్థపరత్వము' 'పరార్థపరత్వము' అను రెండుపదములలో నేవిస్తారము గానున్నదనిచెప్పవచ్చును. జనుఁడెంత స్వప్రయోజనపరుఁడుగానుండునో యంత యజ్ఞానియు, ఎంత పరార్థపరుఁడుగా నుండునో యంత జ్ఞానియు అగుచున్నాఁడు, కాఁబట్టిభయముచేతను స్వప్రయోజనపరత్వముచేతను గలిగిన యా కాలపు దేవతారాధన మంతగా పరిశుద్ధ మయినదిగా నుండనేరదు. ఆకాలమునందు మనుష్యున కెక్కడఁ జూచినను కష్టము లధికము కాఁగా, పాపములు మనస్సును బాధింపఁగా, శత్రువులు మాత్రమే కాక జలాగ్నిమారుతాద్యద్భుతపదార్థములుకూడ నష్టముల నాపాదించి మనస్సులకు వెఱఁగు కొల్పి భయపెట్టఁగా, భయముకలిగి యపాయమును తప్పించుకొనుటకు సాధనాంతరము లేక దేవుని కోప మును శాంతపఱచి యనుగ్రహమును సంపాదించుట కయి యీశ్వరా

రాధన మారంభ మయినది. ఆదికాలమునం దీశ్వరప్రార్థనముయొక్క యుద్దేశ మింతే. అందుచేత నప్పటి యారాధన మాడంబరము లయిన పూజలతోను, హోమములతోను, కానుకలతోను, బలులతోను, ఉత్సవములతోను, స్తోత్రపాఠములతోను మాత్రము నిండి యుండెను. ఈ హేతువుచేతనే యప్పటి ప్రార్థనలన్నియు తమ్మును తమవారిని దీర్ఘాయుష్మంతులనుగాను సుఖులనుగాను జేసి కాపాడుటకొఱకును, సంపదల నిచ్చుటకొఱకును, సంతానము నిచ్చుటకొఱకును, శత్రువులను నాశనము చేయుటకొఱకును, ఉద్దేశించి చేయఁబడినవిగా నుండినవే కాని మనశ్శుద్ధినిమిత్తమును, సత్ప్రవర్తనమునిమిత్తమును, పరోపకారమునిమిత్తమును అంతగా నుద్దేశింపఁబడియుండలేదు. మనయథర్వణవేదమునందు శత్రుసంహారాదుల నిమిత్తమయి యుద్దేశింపఁబడిన మంత్రము లనేకము లుండుటయే యిందుకు దృష్టాంతముగాఁ జెప్పవచ్చును.

ఇఁకను పూర్వకాలచరిత్రమును కట్టిపెట్టి మానవయోగ్యమయిన యీశ్వరోపాసనమును గూర్చి కొంత యోచింతము. ఈశ్వరోపాసనము స్తోత్రము, వందనము, ధ్యానము, అనుతాపము, ప్రార్థన మొదలయిన యనేకాంగములను కలదిగా నుండును. ఈశ్వరునియొక్క కళ్యాణగుణాదులను తలఁచుకొని మన భక్తిశ్రద్ధలను తెలుపుట స్తోత్రము. మనలను మనకుఁ గావలసిన సమస్తపదార్థములను సృజియించి మనకు నిత్యమును సమస్తసౌఖ్యములను గలుగఁ జేయుచున్న యీశ్వరుని యపారకరుణను మనస్సునందు నిలిపి మనకృతజ్ఞతను దెలుపుట వందనము. ఈశ్వరునియొక్క యనంతకళ్యాణగుణములను చింతించి, అతని సాన్నిధ్యమును జ్ఞాననేత్రముచే దర్శింప యత్నించుట ధ్యానము. ఈశ్వరవిషయమునను, ఈశ్వర కుటుంబమైన జనుల విష

యమునను, మనము చేసిన యపచారములను అపరాధములను తలంచుకొని మనసునొవ్వ పరితాపపడుట అనుతాపము. మనలను పాపకార్యములనుండి తొలఁగించుటకును, సత్కార్యములను జేయుటకయి ధైర్యము నిచ్చుటకును, ఆత్మశాంతిని పారిశుద్ధ్యమును ప్రసాదించుటకును, వినయపూర్వకముగా నీశ్వరుని వేఁడుట ప్రార్థన. ఈశ్వరోపాసనమునం దీయంగములన్నియు కాలానుగుణ్యముగాను రసోచితముగాను కొంచెముగానో, గొప్పగానో చేరియుండవలెను. ఇట్టియుపాసనముయొక్క ఫలము మన కీశ్వరునియందు నిశ్చలమైనభక్తి కుదిరి, ఈశ్వరుఁడుచేసిన మేలునకయి నిష్కపటమయిన కృతజ్ఞత దృఢపడి, ధ్యానముచే పరమేశ్వరసాన్నిధ్యానుభవము కలిగి, మనుష్యులు పాపబంధములనుండి విడివడి పరిశుద్ధములయి నిత్యానందము నొందుట. ఇట్టిఫల మొక్క మానసికారాధనమువలననేకాని విగ్రహారాధనాదులవలనఁ గలుగనేరదు. ప్రాణములేని దారుశిలామయవిగ్రహాదులను పూజించుచుండుటవలన బాలురకు బొమ్మలాటయందువలె నజ్ఞానులయిన ముదిబాలుర కొకవిధముగా కాలక్షేపమయినను, సర్వేశ్వరుని మానసికముగా నారాధించువారికివలె దానివలన సత్యాత్మప్రేమయు, నిజమయిన భక్తివిధేయతలును, నిర్మలానందమును కలుగవు అంతేకాక ప్రతిమార్చనము దేవునియనంతమహిమ నంతను పోఁగొట్టి వానిని సామాన్యమనుష్యునిస్థితికిఁ దెచ్చి జగదీశ్వరునకు బట్టలు లేవని వస్త్రములు సమర్పించునట్లును, తిండి లేదని ప్రసాదనివేదనము చేయునట్లును, భార్య కావలసిన ట్లేటేట కళ్యాణోత్సవము చేయునట్లును, భూతహింస కోరునట్లు జంతుబలు లిచ్చునట్లును చేయును. చేసినపాపములకయి పరితాపపడి దుఃఖించునప్పుడు కలిగెడు కన్నీటిధారలే జలాభిషేకములును, అపరిశుద్ధలయిన కోరికలను విస

చుటయే బలులును, సత్ప్రవర్తనము కలిగి యీశ్వరాజ్ఞాబద్ధుఁడయి యుండుటయే యుపహారసమర్పణమును, వినయముతోను ప్రేమతోను కృతజ్ఞతతోను పూర్ణభక్తిశ్రద్ధలను తెలుపుటయే పూజయును, ఆత్మల నీశ్వరార్పణముచేసి మనుష్యులను సోదరభావముతోఁ జూచుచు పరోపకారమునందు సుఖించుటయే యారాధనమును, అగునుగాని యితరవిధములయిన యర్చన లేవియు భగవత్ప్రీతికరము లయినవి కావు. కాఁబట్టి బుద్ధిమంతు లయినవారందఱును ప్రతిమార్చనమును మునుగా మాని యీశ్వరమహిమలను విగ్రహములయందుఁ గాక సృష్టియందుఁ జూడ యత్నింపవలెను. భగవన్మహిమలు సృష్టికర్త చేసిన సూర్యచంద్రాదిదివ్యపదార్థములవలనఁగాక మనుష్యుఁడు చేసిన విగ్రహాదులవలన వెల్లడి యగునా? పరమాత్ముఁడు స్వయముగాఁ జేసిన విచిత్రములయిన సూర్యచంద్రాదిగోళములయందును, అపార సాగరములోను, విశాలభూమండలముమీఁదను గల చేతనాచేతనము లయిన సమస్తవస్తుజాలమునందును, పరిశీలించినకొలఁదిని దేవుని మహిమ లనంతములై కానఁబడు చుండలేదా!

మన మీశ్వరుని యెడల నడుచుకోవలసిన ధర్మములను తెలుపునది మత మనఁబడును. లవణము లేనిదే యేవస్తువులకును రుచి యెట్లు రాదో యట్లే యుపాసన లేనిదే యేమతమునకును శోభ రాదు. ఉపాసనయే మతమున కెల్లను ప్రాణము; ఉపాసన లేనిమతము ప్రాణములేని బొందివంటిది. అట్లగుటవలన లోకములో నీశ్వరోపాసనము లేని మత ముండదు. ఉపాసనాపాశమే మనల నీశ్వరునితో బంధించునది; అట్టియుపాసనలేనిగృహము శూన్యగృహము; ఈశ్వరుని స్మరింపని హృదయము శూన్యహృదయము; ఈశ్వరోపాసనము చేయనియెడల మనజన్మము నిరర్థకము. ధర్మైకనిధియైన

యీశ్వరుని విడిచి మన మెట్లు ధార్మికుల మగుదుము? కళ్యాణగుణా కరుడయిన యీశ్వరుని విడిచి మన మెట్లు సాధువులము కాఁగ లము? నేటినుండి యైనను నిత్యమును మన మాతని నారాధించుచు భగవద్గుణానుభవము వలన నానందపారవశ్యము నొందుచు పవిత్ర మయిన నూతనజీవమును బొందఁ బ్రయత్నించెదము గాక!

మనము దుర్బలుల మనియు పరతంత్రుల మనియు కార్యసా ధనమునకు మన శక్తి యొక్కటియు చాల దనియే మన కనుభవ మగుటచేతనే, సమస్తవస్తువులును, సర్వజంతువులును, సర్వశక్తుఁడును, సర్వరక్షకుఁడును, సర్వకారుణ్యుఁడును, సర్వజ్ఞుఁడు నయిన యీశ్వరుని పాల నమునకు లోఁబడి యున్నవని మనము విశ్వసించుటచేతను, ప్రార్థన యావశ్యక మయినది. అందుచేతనే యెల్లవారును తాము కోరినకోరి కల నన్నిఁటిని పరమేశ్వరుఁడు ప్రసాదించునా యన్న విచారము లేక స్వభావముచేతనే యీశ్వరప్రార్థనను చేయుచున్నారు. మన జన్మ మునకును, స్థితికిని, సుఖమునకును, సంతోషమునకును, సమస్తమునకును, ఆధారుఁడయియున్నవానిని దినమున నొక్కసారియైనను తలఁచు కొనకుండుటకంటెను, కృతజ్ఞతను గౌరవయును తెలుపకుండుటకంటెను కృతఘ్నత మఱి యేముండును? ఎవ్వని యనుగ్రహము లేక మనము క్షణకాల మయినను సుఖించుటకు శక్తులము కాకుందుమో, ఎవ్వఁడు మనకు పుత్రవాత్సల్యముతో సుఖసంతోషములను కలుగఁ జేయుచున్నాఁడో, ఎవ్వఁడు మన ప్రాణమిత్రులకంటెను పరమ మిత్రుఁడయి మన యాప్తబంధువుల కంటెను పరమబంధువయి న్యాయప్రభులకంటెను నుత్తమప్రభువయి నిరంతరమును రక్షించుచు న్నాఁడో, అటువంటి తండ్రుల కెల్లను తండ్రియు ప్రభువుల కెల్లను ప్రభువును న్యాయదాతల కెల్లను న్యాయప్రదాతయు రక్షకుల కెల్లను

రక్షకుఁడును నయిన యీశ్వరునితో నుపాసనమూలమున దినమున కొక్క నిమిషమయినను సంబంధమును కలిగించుకొనకుండుటకంటె బుద్ధిహీనతయు దుర్మార్గమును మఱియే మున్నదును ? ఏమియు నుండదు. ఈశ్వరుఁ డున్నాఁడని మన మెప్పుడు నమ్మి మనకతఁడు ప్రభువని యెప్పుడు తలఁప నారంభింతుమో యప్పుడే యుపాసన యారంభ మగును. మనకు ప్రభువయి మనలను శాసించుటకును పాలించు టకును సుఖులనుగాఁ జేయుటకును సమర్థుఁడయిన వానియెడల మనము భక్తి నెట్లు కనఁబఱుపకుండఁగలము ? ఈశ్వరుని నమ్మిన తరు వాత భక్తితో నారాధింపకుండుట మానుషస్వభావమే కాదు. ఈశ్వరుని మహిమలను మన మెంత యెక్కువగా తెలిసికొందుమో యీశ్వరునియందు మన కంతభక్తి హెచ్చును. ఆయన సర్వశక్తుఁ డని తెలిసినతరువాత గౌరవము కలుగక మానదు. పరిశుద్ధుఁడని తెలి సిన తరువాత ప్రేమ కలుగకమానదు ; సర్వకారుణ్యుఁ డని తెలి సిన తరువాత కృతజ్ఞత కలుగక మానదు; సర్వరక్షకుఁడని తెలిసిన తరువాత విధేయత కలుగక మానదు. ఇవి యన్నియు మనకు సహజ ధర్మములు కాఁబట్టి యీశ్వరోపాసనము మనకు సహజకృత్యమే కాని యందు విరుద్ధమయిన దేదియు లేదు. మితజ్ఞుఁడు సర్వజ్ఞుని భక్తిపూర్వకముగా వేఁడుకొనుటకంటెను, అల్పశక్తుఁడు సర్వశక్తుని సవినయముగా శరణొందుట కంటెను, యుక్తమయినపని మఱియే మున్నదును ? మనల సృజించినవాఁడే మనలను బ్రతికించువాఁడును పాలించువాఁడునునయి యున్నప్పుడు మనలను పుట్టించినవానియెడల ప్రేమను మనలను రక్షించువానియెడల కృతజ్ఞతను మనలను పాలించు వానియెడల భక్తిని కనఁబఱిచి స్తుతించుటకంటెను న్యాయమయిన పని మఱియేముండును ? మేలుచేసినవారియెడల కృతజ్ఞతను ప్రేమను

గలవారమగునట్లుగా మనము సృజింపఁబడి యున్నందున, కృతజ్ఞతతో ప్రార్థించుట మనకు సహజగుణమయి యున్నది. ఈగుణమును మనము మనుష్యులమయి యున్నంతకాల మెట్లుమరల్చుకోఁగలము? ఈశ్వరుఁడు ప్రసాదించిన మితిమీఱిన సౌఖ్యముల ననుభవించుచునే యతనిని మఱచుటను, మనకుపకారియైన వారియెడల కృతజ్ఞతను భక్తిని విశ్వాసమును విడుచుటకును, మనము మనుష్యస్వభావమును త్యజించి మృగస్వభావమును భజించి పశుప్రాయులముగా మాఱవలెను. అట్టి యస్వాభావికధర్మము నవలంబించుటవలన మన మనస్సులకు నిరుత్సాహమును వ్యసనమును పరితాపమును దక్క మఱియేమి కలుగును? కాఁబట్టి మనకాయన చేసిన యనంతములైన మేళ్ళనిమిత్తమయి కృతజ్ఞత నెట్లు తెలుపకుండఁ యుండఁగలుగుదుము? అజ్ఞానులమై తనయాజ్ఞలను మనము నిత్యమును మీఱి పాపులమగుచున్నను మనలను విడువక పతితపావనుఁడైన యాకరుణానిధి మనకు సుఖసాధనములను పుత్రవాత్సల్యముతో ప్రసాదించుచునే యున్నాఁడు గదా! ఆయన యనుగ్రహము వలననే మనముధరించిన యీదేహములను, తినెడి యాహారమును, త్రాగెడినీరును, శ్వాసించెడు వాయువును, ఉత్సాహము కలిగించెడు తేజస్సును, సుఖదాయకములయిన సమస్తపదార్థములును కలిగినవి. ఎవ్వని కరుణ లేక మన యాత్మలును దేహములును క్షణకాలమయినను సుఖముగా నుండనేరవో యటువంటి దీనవత్సలుని దినమున కొకసారి యైనను కృతజ్ఞతతో తలచుకొనక మనమెట్లు సుఖపడఁగలము? సంసారయాత్రలో ప్రతిదినమును మనలనుజేరి బాధించెడు కష్టములను దుఃఖములను ధ్యానమూలమున మన మా ప్రణతార్తిహరుని చెంతఁజేరి యాతనిప్రాపు చెందక యెట్లు నిర్జింపఁ గలుగుదుము? కాఁబట్టి ప్రార్థ

నకు ముందు పరిశుద్ధచింత గలవారమయి ధ్యానముచే మన యీశ్వరుని మనహృదయపీఠమునం దధిష్ఠింపఁ జేసి యాతని సాన్నిధ్యమును దప్ప మన మన్యమును మఱచి మనతలఁపు లన్నియు నీశ్వరునియందే నిలుచునట్లు చేయవలెను.

అట్టిసమయమునం దాయన కళ్యాణగుణముల నన్నిఁటిని మన మనస్సులో నిలుపుకొని యాతనికిని మనకునుగల సంబంధమును దలంచుకొని మన మనస్సుల నాతనియందు లయింపఁజేసి యానందింపవలెను. ఇట్టి దొకటియే నిజమయినధ్యానము. పరిశుద్ధత, కరుణాళుత్వము మొదలయిన యీశ్వరగుణములను స్మరించుటచేత కొంతవఱకు మనకట్టి గుణములు పట్టువడి మనము పరిశుద్ధులమును దయగలవారమును అగుదుము. మనము తెలిసికోఁగలిగినంతవఱ కాయన కళ్యాణగుణముల నన్నింటిని మనస్సుచేతఁ జూచుచు ధ్యానించుటచేత మన కాతనియం దత్యంతప్రేమయు భక్తియు విశ్వాసమును కృతజ్ఞతయు విధేయతయుఁ గలుగును. ఆయనయొక్క సత్యాదులయిన గుణములను వేఱువేఱుగా స్మరించుట మన కాతనితోడి నూతన బంధుత్వమును కల్పించి నూతనప్రేమను పుట్టించి నూతనానందమును గలిగించి, మనకు పరిశుద్ధమయిన నూతనజీవనమును బ్రసాదించును. అందువలన మనకు మనశ్శాంతియు నపారానందమును గలుగును. కాఁబట్టి యీశ్వరునియొక్క సమస్తకళ్యాణగుణములను స్మరించుచుండుట కర్తవ్యము. అట్లు చేయక యాయనకారుణ్యమును బ్రసన్నతను మాత్రమే మనము తలఁచుచుందుమేని సద్వర్తన మక్కఱలేక యొక్కభక్తివలననే పాపపరిహారమునుపొంది ముక్తులమగుదుమని భావించి చెడుదుము ; ఆయన పరిశుద్ధతను న్యాయమును మాత్రమే తలంచుచుందుమేని ఈశ్వరుని ప్రేమతో సమీపించుటకు భయపడుచు

నాతనిని క్రూరముగా శిక్షించు దయాదాక్షిణ్యములులేని కఠినచిత్తునిగా భావించి భయభ్రాంతుల మగుదుము; ఆయనసర్వజ్ఞతను సర్వశక్త్యాదులను తలపకుందుమేని, ఆయన మహిమను పూర్ణముగా తెలిసికోలేక యీశ్వరుని నించుమించుగా మనతో సమానునిగా భావించి మూఢుల మగుదుము. కాఁబట్టి యిట్టి చెడుగులేవియు కలుగకుండుటకై యీశ్వరుని కల్యాణగుణానుభవమును మనము సాధ్యమయినంత పూర్ణముగా పొందుటకయి ప్రయత్నింపవలెను; అట్లు చేయనిచో మనము భగవన్మహిమను చక్కఁగా తెలిసికొని నిజమయిన లాభమును పొందుటకు శక్తులముగాక మూఢభక్తి కలవారమయి చెడిపోదుము. ఈశ్వరగుణములను స్మరించునప్పుడు మనఃపూర్తిగా తద్గుణానుభవమును పొందవలెనుగాని యది లేని వట్టిమాటలతో ప్రయోజనము లేదు. ఈశ్వరగుణానుభవము లేని కర్మలును, తంత్రములును, పూజలును, ఉత్సవములును, పరిహాసపాత్రములయి మూఢతాజనకము లగును. మూఢభక్తివలన సుగుణము లన్నియు హృదయకుహరము నుండి క్రమక్రమముగా తొలఁగి పోయి హృదయము నీతిశూన్యమగును. మనస్సీశ్వరునియందు లేక నోటితో భగవద్గుణాదులను స్మరించుట యర్థము తెలియనిమాటలను మంత్రములను పఠించుటవంటిదేకాని యంతకంటె ప్రయోజనకర మయినదికాదు. భగవంతుని సర్వశక్త్యాదులను దెలిసికొని యారాధించుట యాయనయెడల భయభక్తులకు పొందుటకుఁ గాని యూఱక యద్భుతపడుట కొఱకుఁగాదు; ఆయనను సర్వకారుణ్యునిగా నారాధించుట మన మాయనయెడ కృతజ్ఞతను ప్రేమను పొందుటకుఁగాని యాయన ప్రేమానిధియనియు కరుణాళుఁ డనియు తెలిసికొని సంతోషపడుటకొఱకుఁగాదు; ఆయనను పరిశుద్ధునిగా నారాధించుట ప్రవర్తనము చక్క

చేసికొని మనము పరిశుద్ధుల మగుటకుఁగాని యాయన పరిశుద్ధత కాశ్చర్యపడుటకొఱకుఁగాదు.

ఈశ్వరోపాసనమునుగూర్చి యింతవఱకును సామాన్యముగాఁ జెప్పియున్నాను. ఉపాసనలో ప్రధానాంగము ప్రార్థన. దానినిగూర్చి విశేషముగాఁ జెప్పవలసియున్నది; ప్రార్థన యనఁగా మన కున్నలోపములను తొలఁగించుటకుఁగాని కావలసిన వానిని ప్రసాదించుటకుఁ గాని వేఁడుకొనుట. ఈ ప్రపంచములో మన కనేకలోపములుండును. అనేకదుఃఖములు వచ్చును; అనేకప్రతిబంధములు కలుగును. వానినన్నిఁటిని మన కృషిచేత నివారించుకొనుటకు మనము శక్తులము గాము. అందుచేత మన మసహాయులమయి యున్నామనుట స్పష్టము. కాఁబట్టి యాత్మసంరక్షణార్థము మన మీశ్వరుని వేఁడుట యనివార్య మగుచున్నది. మంచికార్యములు చేయుటకు శక్తిని ధైర్యమును కలిగించు నిమిత్తము వేఁడుకొనవలయును; చెడుకార్యములమీఁది కేఁగెడి యింద్రియములను నిగ్రహించుటకయి సామర్థ్యమును కలిగించు నిమిత్తము వేఁడుకొనవలయును; మనము చేసిన పాపములను క్షమించి సుఖము కలిగించు నిమిత్తమయి వేఁడుకొనవలయును. ఈశ్వరుఁడు సమస్తపదార్థములను సృజించి సమస్తమును కాపాడువాఁడయినందునను, ఈశ్వరాజ్ఞకు భిన్నముగా నేకార్యమును జరుగనేరదనియు, ఆయన రక్షణమును కోరుటయు, ఆపదలయం దాయనను శరణు చొచ్చుటయు, సత్కార్యనిర్వాహణము నం దాయన సాయమును వేఁడుటయు సుఖకాలమునం దాయనను కృతజ్ఞతతో స్మరించుటయు, మనకు ప్రియులుగా నుండువారిని కాపాడ ప్రార్థించుటయు, మనుష్యునకు సహజగుణమయి యున్నది. మన హృదయములనుండి స్వాభావికముగా బయలువెడలి వచ్చెడు యనివార్యమయిన యిచ్చను మర

లించుకోలేని వార మయి విన్రములమయి మన కోరికలను దెలిపి మన మీశ్వరుని భక్తితో ప్రార్థింతుము. ఈ స్వాభావికగుణము మనలో నున్నదని స్థాపించుటకు వితర్క మక్కఱలేదు. మన ప్రార్థనవలన భగవంతుఁ డెంతవఱకు మనకోరికల నీడేర్చును, మనస్థితి నే ప్రకారముగా మార్చును, అన్నవిషయమును మాత్రము మనము కొంచె మాలోచింపవలయును. ప్రార్థన వ్యర్థము కాదని భక్తిపూర్వకముగా ప్రార్థించువారి కందఱికిని అనుభవసిద్ధమే. పయినిజెప్పినరీతి ప్రార్థనవలననే మన మీశ్వరసాన్నిధ్యమును పొంది, ఆయన యనుగ్రహమువలన జ్ఞానమును, ఆనందమును, ధైర్యమును, బలమును పొందుదుము. ప్రార్థనవలననే యజ్ఞానాంధకారబంధుర మయి పాపభూయిష్ట మయిన యీ ప్రపంచగుహనుండి బయలువెడలి మన యాత్మ మహోన్నత మయిన యీశ్వరసామీప్యమునకు పరుగెత్తి యనిర్వాచ్యము లయిన జ్ఞానానందములను పొంది యీశ్వరానుగ్రహము వలనఁ దనమాలిన్యమును విడిచి పరిశుద్ధము కాఁగలుగును. ప్రార్థనచేత మన మీశ్వరసాన్నిధ్యమును పొందినకాలఁదిని మనహృదయముల యందు జ్ఞానజ్యోతి ప్రజ్వరిల్లి యధికముగా ప్రకాశించుచు మనకు ధర్మాచరణమునం దధికోత్సాహమును ధైర్యమును స్థైర్యమును కలిగించుచుండును; ధ్యానాభావముచేత మన మీశ్వర సన్నిధానమునకు దూరుల మయినకాలఁదిని మనయాత్మ యజ్ఞానాంధకారములో మునిఁగి స్వప్రయోజనపరత్వమును పొందుచు పాపకార్యములకు భయపడకుండును. ఈ గుణము మనయాత్మలకు నైసర్గికము. వెలుతురు చొరనిప్రదేశము నందున్న మొక్క తెల్లబారి బలహీనమయి యెదుగక యుండి వెలుతురులో పెట్టఁబడఁగానే పచ్చనయి కోమలత్వమును పొంది యెదిగి బలపడ నారంభించునట్లు, యీశ్వరచింత యను వెలుతురు లేక యింద్రియ

సుఖములను బంధములలో తగులుకొని యజ్ఞానాంధకారమునఁ బడి యభివృద్ధిని పొందక కృశించుచుండెడి మన యాత్మయు ఈశ్వరసాన్నిధ్యమను వెలుతురులో చొరఁగానే పాపబంధములనుండి విముక్తినొంది బలపడి నిత్యానందమును పొందుట కర్హమయిన దగును. ప్రార్థన వలన మఱి యేలాభము లేకపోయినను మన కీయొక్క లాభము చాలదా ? మన మనస్సులను సన్మార్గమునందు ప్రవర్తించునట్లు చేయుమని ప్రార్థించుటచేతనే మనము నీతిమంతులమును పుణ్యాత్ములమును అగుట సంభవించును. అగ్నిహోత్ర సమీపమునకు పోయినవారికి చలి దీఱుట యెట్లు సహజమో ప్రార్థనచేత నీశ్వరసాన్నిధ్యమును పొందువారికి పాపచింతనలు తొలఁగుట యట్లే సహజగుణము. ఎవ్వరు పాపపరిహారము కొఱకును నిత్యానందము కొఱకును ప్రార్థింతురో వారు సుగుణసంపదను ఆత్మానందమును పొందుదురు. కాఁబట్టి మనము పరిశుద్ధుల మగుటకును సుఖుల మగుటకును ప్రార్థన తప్ప వేఱుసాధనము లేదు. హృదయపూర్వకముగాను, నిష్కపటముగాను భగవంతుని ప్రార్థించి చూచిన పక్షమున, ప్రార్థనచేసి లేవఁగానే తాను మునుపటి కంటె నెక్కువ పరిశుద్ధుఁడును, సంతోషము గలవాఁడును మనోబలము గలవాఁడును అయినట్టు ప్రతిమనుష్యుఁడును స్వానుభవముచేతనే కని పెట్టవచ్చును. ప్రార్థనవలనగలిగెడు హృదయానందము మొదలైనవి యనుభవైకవేద్యములే కాని యిట్టి వని చెప్పనలవి యైనవికావు. ప్రార్థనయొక్క విచిత్రశక్తి నేమని చెప్పవచ్చును ? అది బలహీనుని బలవంతుని గాను, భీరువును ధైర్యశాలినిగాను, నిరాశుని సాభిలాషుని గాను, దుర్మార్గుని సన్మార్గుని గాను, మూఢుని జ్ఞానిని గాను, మంత్రించినట్లు నిమిషములో మార్చివేయఁ గలుగును. ప్రార్థనవలన పరమేశ్వరునియొక్క పవిత్రసాన్నిధ్యము మనకు లభించిన పక్షమున

మన యాత్మ పారిశుద్ధ్యపారావారములో మునిఁగిపోయి తన స్వభావ దౌర్బల్యమును మాలిన్యమును విడిచి పరిశుద్ధమయి ప్రాపంచిక తుచ్ఛసుఖములను సరకుగొనక ధర్మాచరణమునం దసమానబలము కల దగును. మన మీశ్వరునియందు నిజమయిన స్వచ్ఛభక్తి కల వారమయి సర్వమునకు మన మాయన యనుగ్రహమునే నమ్ముకొని యాయన యాజ్ఞల నన్నిఁటిని చెల్లింపవలయునను దృఢనిశ్చయముతో మనఃపూర్తిగా ప్రార్థించినచోగాని, వేఁడుకొనుచు స్తోత్రపాఠములను చదువుచు మనసులో లేని పయిమాటలతో కన్నులు మూసికొని చేతులు పయికెత్తిచేసెడు కపట ప్రార్థనలవలన లేశమును ప్రయోజనములేదు. మనఃపూర్తిగా చేయని ప్రార్థన ప్రార్థన గాదు. అది నిష్ఫలమయిన కంఠశోష. నోటితో నుచ్చరించెడు నారంభప్రకారముగా నాచరింపవలెనన్న మనోనిశ్చయము లేక చిత్తము నొకచోటను మాటల నొకచోటను బెట్టి చిలుకపలుకులవలె వల్లించెడు ప్రార్థనలన్నియు గాలికి పోయినవియే కాని యీశ్వరుని సమీపింపనవి కానేరవు. అశ్రద్ధతో జాముసేపు చేసెడి ప్రార్థనకంటె శ్రద్ధాభక్తులతో చేసెడు ప్రార్థన క్షణకాల మయినను శ్రేష్ఠతరమయినదిగా నుండును. ఆత్మకృషియు శ్రద్ధయు ప్రతినియమములోను ప్రధానములు. కృషిలేక ఫలము లభింపదు. శక్తివంచన లేక కృషిచేయని వాని కీశ్వరుఁ డెప్పుడును ఫలము నియ్యఁడు. దేహపరిశ్రమమును జేయుచు సోమరితనమును పాఱఁదోలుట కయి పోరాడుటవలన శరీరమునకు బలమెట్లు హెచ్చునో, ఆ ప్రకారముగానే పాపమును పాఱఁదోలుట కయి శ్రమపడుచు పాపముతోఁ బోరాడుచు సోద్యోగమున కయి ప్రార్థించుటవలన ఆత్మకును బలము కలిగి భగవదనుగ్రహము వలన విజయమును సుఖమును పొందుటకు సమర్థమగును. మనయాత్మ

తన యావచ్ఛక్తిని పట్టుపడి పాపభంజనమునకయి సంపూర్ణప్రయత్నము చేయువఱకును నిజమయిన ప్రార్థన యారంభము కాదు. మన చిత్తములను పాపచింతలనుండి మరలింపుము అని మనము ప్రార్థించునప్పుడు మనము చేసినపాపకార్యముల నిమిత్తమయి నిజమయిన యనుతాపమును పొంది మనము ముందటిపాపముల నెన్నఁడును చేయకుండునట్లు దృఢనిశ్చయము చేసికొనవలెను. అట్టినిశ్చయమును కృషియు లేకయుండిన చేసినప్రార్థన లన్నియు నిష్ఫలములగును. మన దుర్బలచిత్తములచే మనము దురాశాదులను నివారింపలేకపోయినను వానిని పాఱఁద్రోలుటకయి దృఢమయిన ప్రయత్నము నయినను చేయుచుండవలెను. మనము ప్రార్థన నారంభించుటకు ముందు సర్వవ్యాపియును సర్వకారుణ్యుఁడును, సర్వశక్తుఁడును, పరిశుద్ధుఁడును, సుఖదాతయు, ధర్మస్వరూపుఁడును, ప్రేమనిధియు నయిన పరమేశ్వరుని నేరముచేసినవాఁడు న్యాయాధిపతిని చేరఁబోవునప్పటివలె భయభక్తులతోను వినమ్రతతోను గౌరవముతోను సమీపింపవలెను. సమీపించిన పిమ్మట కరుణానిధియు సుఖదాతయునైన తండ్రియొద్ద భయమునువిడిచి స్వేచ్ఛగా మన హృదయములో నున్నదంతయు దాఁచక తెలిపి క్షమింపు వేఁడుకొనవలెను. మన హృదయమునందలి నిజమయిన కోరికలను తప్పిదములను దుఃఖములను గౌరవమును ప్రేమను భక్తిని కృతజ్ఞతను మనసు విప్పి ధారాళముగా మన పరమపితతో చెప్పివేసినప్పుడే యది ఫలకారియైన యవ్యాజప్రార్థన యగును. మనుష్యులమయిన మనము గర్వమును దురభిమానమును గలవారమయి సర్వజ్ఞుఁడయిన భగవంతునిముందట మనపాపములను చెప్ప సాహసింపలేక ప్రార్థనచేయుచున్నట్లు నటించుచు కృత్రిమప్రార్థనలను మాత్రము చేయుచుండుటచేత, ఈశ్వరుఁడు మన సమీపములో నున్న

ప్పటికిని చూడలేక మనము దూరస్థులవలె నున్నాము. చిత్తశుద్ధిగల ప్రార్థనమూలమున నీశ్వరబల మాత్మకు గలుగని పక్షమున బహు విధములయిన పాపములు మొసళ్ళవలె వచ్చి దానిని మ్రింగివేయును; మన కీశ్వరుని ప్రాపు దొరకని యెడల నంతశ్శత్రువులు మనస్సును బంధించి దుర్బలము చేయును. కాఁబట్టి మనము నిజముగాఁ బాగు పడఁదలఁచుకొన్న పక్షమున, మనప్రార్థన హృదయపూర్వకమయిన దిగా నుండవలె నని మీకు మఱిమఱి విన్నవించుచున్నాను. హృద యశుద్ధి లేని చేతులుజోడించుట ప్రార్థనకాదు; కన్నులు మూసి కొనుట ప్రార్థనకాదు; ఆకాశమువంకచూచుట ప్రార్థన కాదు; స్తుతి పాఠములు చేయుట ప్రార్థనకాదు. చిత్తము నీశ్వరార్పణము చేయుట యొక్కటియే ప్రార్థన యగును. అప్పుడు మాత్రమే మనము ప్రార్థన చేత నీశ్వరసాన్నిధ్యమును పొంది యానందింపఁగలుగుదుము; అప్పుడు మాత్రమే యీశ్వరసాన్నిధ్యమువలన మనకు బలోత్సాహములు గలిగి మనలను సదా సన్మార్గమునుండి తొలఁగింప పాటుపడుచుండు కామక్రోధాది శత్రువర్గమును మనము జయించి లోఁబఱుచుకొన శక్తుల మగుదుము. ప్రార్థనమూలమున మన మీశ్వరునియందుఁ జేరి నిలువఁగానే పుణ్యకార్యములయందు మనకు విఘ్నము లాపాదించుచు ప్రతిఘటించుచుండెడు కోపాదులు భయపడి తమంతనే మనలను విడిచి దూరముగా తొలఁగిపోవును. స్వాభిమానము విడిచి మనము నిష్కపటముగా నీశ్వరుని జేర శంకించితిమా, పాపగ్రహములును కామాదిశత్రువర్గమును అసహాయులమయిన మనలను చుట్టుకొని మనయాత్మలను తప్పుదారుల కీడ్చుకొనిపోవును. హృదయవాసమునం దేమూల నైనను పాపశంకలకును మనము కొంచెము చోటిచ్చితిమా, అది మన హృదయము నీశ్వరసామీప్యమునకు పోనీక యడ్డుపడి

బంధించి వేయును. పాప మయినను మనహృదయమును విడువవలెను; లేదా మన హృదయ మయినను దేవుని విడువవలెను. అంతేకాని పాపలేశము మన హృదయభాగము నంటియుండఁగా దానిని గెంటివేయ నిజమయిన ప్రయత్నము లేక మనహృదయము సత్యమయిన ప్రార్థనను జేయుటకాని యీశ్వరుని సమీపించుటగాని సంభవింపనేరదు. కాఁబట్టి సోదరులారా! మనము నేటినుండి పాపలేశమునైనను పర్వతమువలె జూచి దానికి దూరముగా తొలఁగుచు నీశ్వరాజ్ఞాకైంకర్యములను చెల్లింప త్రికరణశుద్ధిగా పాటు పడుదము. ప్రార్థనయొక్క యుద్దేశ మంతయు మన మీశ్వరునియందు సంపూర్ణవిశ్వాస ముంచి సర్వవిషయములయందును మన మాతని యాజ్ఞాబద్ధులమయి వానిని చెల్లించుచు తదిచ్ఛానుసారముగా ప్రవర్తింప బాటుపడుటయే. ప్రార్థనవలని సంపూర్ణఫలము మన మనుభవింపగోరిన పక్షమున, మనహృదయఫలకముల యందాయన లిఖించిన యీశ్వరశాసనములను మీఁఱక నడుచుకొనుచు మన యాత్మలను దేహములను ఈశ్వరార్పణము చేయవలెను. ఆయనయెడల మనము చూపఁదగిన భక్తి యంతయు మన మాయనకు లోఁబడి పరమభృత్యులమయి యాయనవలె నగుటకయి పాటుపడుటయే. ఈ పాటువలన మన హృదయగృహమునందు సుజ్ఞానదీప మాఱక సర్వదా ప్రజ్వరిల్లుచు దానిని విమలముగా జేయును.

ఇఁక ప్రార్థనలవిషయమయి మనవారు కొందఱు చేసెడి యాక్షేపణములను కొంచెము విచారింతము. "సర్వజ్ఞుఁడగుటచేత మన మనోవృత్తులును, వాంఛలును, లోపములును సర్వమును పరమేశ్వరుఁడెఱుఁగనివి లేకయుండఁగా మన మాతనికి తెలుపవలసిన యావశ్యకమే మున్నది? మనము ప్రార్థింపకుండ సర్వకారుణ్యుఁడయిన యాతఁడు

మనవాంఛలను తీర్పఁడా? " అని కొందఱు ఆక్షేపించుచున్నారు. ఈ యాక్షేపణము పైకి సయుక్తికముగానే కానఁబడును. మనచిత్తవృత్తులు మంచివయినప్పు డతఁ డామోదించు ననియు, మనవాంఛలు మంచివియు పరిశుద్ధము లయినవియునయిన పక్షమున ప్రార్థన యక్కఱ లేకయే వాని నతఁడు ప్రసాదించు ననియు, మన హృదయములు పరిశుద్ధములుగా నుండక చేయు ప్రార్థనల నాతఁ డంగీకరించి ప్రసాదింపఁ డనియు వేడుకకొఱకు మాత్రము చేయు ప్రార్థనలవలన ప్రయోజనముండ దనియు, వారు చెప్పెడుమాటలను మనముసహిత మంగీకరింప వచ్చును. ఈమాటలు సత్యములగుటకు సందేహము లేదు. హృదయములో భక్తిలేని యారాధన మీశ్వరవంచన మగునేకాని యుపాసనము కానేరదు. అయినను మనముమాత్రము మనకోరికలను మనస్సులో పెట్టుకొని యూరకుండక పయికి సహితము చెప్పవలెను. అట్లుచేయుట చేతనే మనకు మనశ్శాంతియు తృప్తియు సంతోషమును కలుగును. అది స్వభావసిద్ధము. మనస్సులలో నున్న కష్టసుఖములను మన యిష్టులకు చెప్పివేయుట చేతనే దుఃఖశాంతియు సంతోషమును కలుగునట్లుగా దేవుఁ డేర్పఱచి యున్నాఁడు. అందుచేతనే మన కాప్తులై ప్రియులయి యున్నవారిలో నెల్లను ప్రియతముఁడైన యీశ్వరునకు మనసంతోషములను కోరికలను జెప్పి మనకృతజ్ఞతను దెలుపుట మనకు సహజగుణమై యున్నది. నిజమయిన భక్తిగలవాఁ డీశ్వరునకు తన వాంఛితములను దెలుపక యూరకుండనేరఁడు. అట్లు తెలుపుటవలననే మనస్సులో నీశ్వరభక్తి మరింత ప్రబలి యార్పరాని దావానలమువలె విశేషతేజస్సుతో ప్రజ్వరిల్లును. అందుచేత మనుష్యుఁడు నిశ్చలుఁడును పరిశుద్ధుఁడును అగును. ఈశ్వరభక్తివలన దయాసత్యాది కళ్యాణగుణములు మనస్సులో దృఢముగా నాటుకొని దినదినక్రమమున పరి

శుద్ధుఁడు కా నారంభించును; సత్కార్యానురాగమును పరలోక చింతయు దృఢపడును; నిరంతర ప్రార్థనవలన మనము పాపములో సులభముగా పడక జాగరూకులమయి యుందుము. పాపమునుండి తొలఁగింపుమని చేయు ప్రార్థనయే మన మా పాపమునకు దూరముగా తొలఁగునట్లు చేయును. అంతేకాక సంతతసంస్మరణమువలన మన మీశ్వరసాన్నిధ్యమును పొంది పాపశిక్షకుఁడయిన యీశ్వరుఁడు జ్ఞాననేత్రమున కగపడుచుండఁగా నాతని యెదుట పాపమును జేయుటకు తప్పక భయపడుదుము. మన కోరికల నీశ్వరుఁడు మనము తెలుపకయే గ్రహింపఁ గలిగినను, ఈశ్వరునకును మనకును గల సంబంధమునుబట్టి మనము తెలుపవలసిన యావశ్యకము కలుగుచున్నది. అంతేకాక మనము నిత్యమును సర్వేశ్వరుని ప్రార్థించుచుండుటవలన మనము మఱింత జాగ్రత్త గలవారమయి పాపకార్యములనుండి తొలఁగుచు పుణ్యకార్యములయం దాదరమును ధైర్యోత్సాహములును గలవారమగుదుము. నిత్యప్రార్థనము చేయువాఁడు ప్రార్థనచేయనివానికంటె కామాదిశత్రువర్గముయొక్క వలలో చిక్కకుండ నెక్కువ మెలఁకువ గలవాఁడయి యుండును. మనము దేనివిషయమున నైనను ప్రార్థించెదము పక్షమున దానిని తప్పించుకొనుటకుఁగాని పొందుటకుఁగాని బద్ధులమయి యుందుము. వెనుక చెప్పినట్లు మన మేపాపమునుండి యైనను కాపాడుమని ప్రార్థించుటయే మనల నా పాపమువంకఁ బోకుండ నిలుపుటకు శక్తి కలదగును. కాఁబట్టి మనుష్యుఁడు ప్రార్థనవలన పాపకార్యములనుండి విడివడకపోయిన పక్షమున, పాపకార్యము లాతనిని ప్రార్థననుండి విడివడునట్లు చేయును. పాపములనుండి తొలఁగింపుమని హృదయపూర్వకముగా ప్రార్థించుచుండుటయు పాపకార్యములను జేయుచుండుటయు రెండును నేకకాలమునందు పొసఁగవు.

రెంటిలో నేదైననొకటి విడువవలెను. పరిశుద్ధుఁడు కావలెనని ప్రార్థించుటచేత పరిశుద్ధుఁడయినను కావలెను, లేదా ప్రార్థన హృదయపూర్వకమయినది కానిపక్షమున పాపియైనను కావలెను. ప్రార్థన నిజమయినదియు నిష్కపటమయినదియు నయినయెడల భక్తివిశ్వాసముల వలన తన మనోనిశ్చయము బలపడి మనుష్యుఁడు దానిని సాధించుటకు తప్పక సమర్థుఁడగును.

ఈశ్వరుఁడచంచలుఁడు గనుగ మనుష్యుఁడెంత భక్తిపూర్వకముగా ప్రార్థించినను వాని నిమిత్తమయి నదుమ తనయేర్పాటులను మార్చునాయని మతిరొుక యాక్షేపణమును జేయుచురు. ఈశ్వరుఁడు నిశ్చలుఁడై నమాట నిశ్చయమే; మనము ప్రార్థించితి మని తన స్థిరమయిన యేర్పాటుల నెప్పుడును మార్చువాఁడును కాఁడు. అయినను మనము హృదయపూర్వకముగాను నమ్రతతోను మనశ్శుద్ధితోను ప్రార్థించినపక్షమున, ఆత్మసుఖములు కలుగునట్లును మనోదుఃఖములు తొలఁగునట్లును చేయుటకూడ నాతని స్థిరమయినయేర్పాటులలో నొకటియై యున్నది. ప్రార్థనమూలమున మన కీశ్వరునితోడి సంబంధము కుదిరిన పక్షమున ఆ సంబంధముచేత నీశ్వరునిలోనుండి యానందకళ్యాణ గుణామృత ప్రవాహము మెల్లమెల్లగా మనయాత్మలలో ప్రవేశించి వానిని శుద్ధపఱిచి నిర్మలగుణములు గలవానినిగాఁ జేయును. భగవంతుఁ డేర్పఱిచిన దివ్యమయిన యేర్పాటులనుబట్టి ఆధ్యాత్మిక సుఖాభివృద్ధుల నిమిత్తము ప్రార్థించుటయే పుణ్యకార్యములలో నీశ్వర సాహాయ్యమును సంపాదించుకొనుటకు నిజమయిన మార్గముగా నున్నది. ఇది సహజమయిన మార్గమేగాని దీనిలో వింతయైనది గాని యస్వాభావికమయినదిగాని యేదియు లేదు. కడుపులోనుండి పుట్టి భూపతనము కాఁగానే శిశువునకు సంరక్షణసుఖములఁ గలిగించుదయా

నమ్ముదుము మన యాత్మలకు కలిగింపకుండునా ? అనుదినప్రార్థన వలన దైవసాన్నిధ్యమును పొంది యాత్మాభివృద్ధిని పొంద నలవాటు పడిన వాని కీశ్వరుఁడు మనప్రార్థనల నాలించి మన కోరికలను సఫలము చేయునని స్వానుభవముచేతనే తెలియును. మన మీశ్వరుని కోరునది యంతయు నాధ్యాత్మికలోపములను పోఁగొట్టుటకును, ఆధ్యాత్మికసుఖములను మనోబలమును కలిగించుటకును అయి యుండవలెను. అంతే కాని మన మైహికములయిన శరీరసుఖములనిమిత్తమును, ధనమునిమిత్తమును; కీర్తినిమిత్తమును, ఇతరము లయిన ప్రాపంచిక లాభములనిమిత్తమును, ప్రార్థించినపక్షమున మన మనోరథము లెప్పుడును సాఫల్యము నొందవు. మన ప్రార్థన లెప్పుడును పరమాత్ముఁ డేర్పఱచిన స్థిరమైనవస్తుధర్మములను మార్పఁజాలవు. ఆరోగ్యధర్మముల ననుసరించుటవలననే కాని ప్రార్థనవలన దేహబలము రాదు; పాటుపడుటవలననేకాని ప్రార్థనవలన ధనము రాదు: సత్కార్యములను జేయుటవలననేకాని ప్రార్థనవలన కీర్తి రాదు; ఆయాపనులను సాధించుట కర్హములయిన కృత్యములవలననే కాని శుష్కప్రార్థనలవలన నిహలోకసంబంధములయిన యే యితరలాభములును రావు. ఇది తెలిసికొని బుద్ధిమంతు లయిన వారు సఫలములు కానేరని యట్టి యసాధ్యకార్యములనిమిత్తమై ప్రార్థింపక యాధ్యాత్మికజ్ఞానముకొఱకును, ఆధ్యాత్మికబలముకొఱకును, ఆధ్యాత్మిక పారిశుద్ధ్యముకొఱకును; ఆధ్యాత్మిక సుఖములకొఱకును మాత్రమే పరబ్రహ్మమును ప్రార్థింపవలెను. అంతేకాక మనము ప్రార్థించునప్పుడు "ఓయీశ్వరుఁడా ! నాయందు దయచూపుము; నన్ను రక్షింపుము; నాపాపములను క్షమింపుము" అని సామాన్యముగా నేవో యనిర్దిష్టములయిన కోరికలను కోరక, మన మేసత్కార్యఘటనమునందశ

క్తులమయి యాతని ప్రాపు నపేక్షింతుమో దానిని దయచేయు మనియు, మనకే లోప మున్నదని తెలిసికొని దానిని స్వశక్తిచేత వారింపలేమని నమ్ముదుమో దానినుండి రక్షింపు మనియు, మన మేపాపము చేసి పశ్చాత్తప్తులమయి తత్పరిహారమును గోరుదుమో దానిని వేర్కొని క్షమింపు మనియు, నిర్దేశించి ప్రార్థింపవలయును. లోకములో శిశు వాఁకలివేసినప్పుడు తల్లికడకేగి "అమ్మా! అన్నము పెట్టుము" అని యడుగునట్లును, రోగి వ్యాధిబాధితుఁడయి వైద్యుని యొద్దకుపోయి "అయ్యా! ఔషధ మిచ్చి నెప్పులు మాన్పుము" అని వేఁడునట్లును, దరిద్రుఁడు సంపన్నగృహస్థుని దాపు చేరి "మహా ప్రభూ! వస్త్రదానము చేయుము" అని ప్రార్థించునట్లును, ప్రతిమను ష్యుఁడును తనయాత్మ యాఁకలిగొని యున్నప్పుడును పాపరోగపీడిత మయి యున్నప్పుడును గుణదరిద్రతను పొందియున్నప్పుడును జగద్ర క్షకుఁడును భవరోగవైద్యుఁడును కళ్యాణగుణసంపన్నుఁడును నయిన పరమేశ్వరుని ఆధ్యాత్మికలోపములను తొలఁగింప వేఁడుకొనవల యును. ఈప్రకారముగానే పాపియైనవాఁడు తానుచేసిన పాపమును స్మరణకు తెచ్చుకొని పరితాపపడుచు నంతరాత్మచేయు మనోవ్యథ దుస్సహము కాఁగా భరింపలేక మనశ్శాంతి లేనప్పుడు మనశ్శాంతిని కలిగింపుమని వేఁడుకొనవలయును; లోకోపకారి యైనవాఁడు తానొక సత్కార్యమును చేయ తలపెట్టి యున్నిప్రక్కలను కష్టములు వచ్చి చుట్టుకొనఁగా నిరుత్సాహుఁడయి స్వశక్తిచేత వానిని తొలఁగించు కొనుటకు శక్తుఁడు కానప్పుడు కష్టములు తన్ను సత్కార్యములనుండి తొలఁగింపకుండఁ జేయుమని ప్రార్థింపవలయును; సత్యకామి యైన వాఁడు కామాదు లయిన యరిషడ్వర్గముకాని యంతకంటెను క్రూరము లయిన లోకాధికారి పిశాచములుగాని తన్ను చుట్టుకొని తప్పుదారి

కీడ్చి తనచే నసత్యము బలికింప నుద్యమించినప్పుడు వానిని తప్పిం చుకో సమర్థుఁడు కాక సన్మార్గముననే నడువ తనకు బలధైర్యము లను బ్రసాదింపు మనియు, ప్రాణములకంటెను సత్య మధికప్రియమయి నదిగాఁ జేయు మనియు వేఁడుకొన వలయును ; ధార్మికుఁడయిన వాఁడు పాపమును నిగ్రహించుటకుఁగాని ధర్మము నవలంబించు టకుఁ గాని తనంతట సంపూర్ణ శక్తుఁడుగాక మనోబలోత్సాహ ముల ననుగ్రహింపు మని ప్రార్థింపవలయును. ఈవిధముగా ప్రార్థింప వలసిన విషయములు సమయోచితముగా ననేక విధములుగా నుండును.

“శాశ్వతానంద సౌఖ్యములకు మనుష్యుఁడు భూతదయయును నీతివర్తనమును గలవాఁడయి పరుల కుపకారము చేయుచు పాప కార్యములు చేయక పరిశుద్ధుఁ డయియున్న చాలదా ? వేఱుగ ప్రార్థన మేలకావలయును ? దేవుఁడు స్తోత్రప్రియుఁడా ? తన్ను స్తోత్రము చేయు వారికే కాని మోక్షమియ్యఁడా ?” అని కొంద ఱందురు. ఆనంద సౌఖ్యముల కొఱకు మనుష్యునకు సద్వర్తనాదులు చాలునుగాని యీశ్వరప్రార్థన లేక పరిశుద్ధుఁ డగుటకును సంపూర్ణ నీతిమంతు డగుటకును పరోపకారపారీణుఁ డగుటకును మనుష్యున కెప్పుడును సాధ్యము కాదు. అంతేగాక ప్రార్థనము తన బాగుకొఱకే యుద్దేశింపఁ బడినదికాని యీశ్వరుని సంతోషపెట్టుటకొఱకు కాదుగనుక, ఈ యాక్షే పణ కిప్పు డింతకంటె నెక్కువ సమాధానము చెప్పవలసిన యావశ్య కత కానఁబడదు.

ఏకాంతప్రార్థన, కుటుంబప్రార్థన, సమాజప్రార్థన, అని ప్రార్థ నలు మూఁడువిధములుగాఁ జెప్పవచ్చును. మనుష్యుఁడు తా నొంట రిగా నీశ్వరుని గూర్చి చేయు ప్రార్థన మేకాంతప్రార్థన. ఏకాంత

ప్రార్థనను ప్రతిమనుష్యుఁడును ప్రతిదినమును తప్పక యొక్కసారియైనను జేయువలెను. ప్రాతఃకాలమును సాయంకాలమును ప్రార్థనకు ముఖ్యమయిన కాలములు. కొందఱు బుద్ధిమంతులు తమకు ప్రార్థనచేయుటకు తీఱికయే లేదని ప్రతిష్ఠగా చెప్పుచున్నారు. అట్టివారికి దేవుఁడిచ్చిన మంచిపదార్థముల నన్నిటిని దినమునకు మూఁడేసిసారులు గంటగంటసేపు కూరుచుండి పొట్టపండ భుజించుటకు కావలసినంత తీఱిక కలదు కాని వాని ననుగ్రహించిన యుపకర్తనొక్క నిముషకాలము స్మరించుటకు మాత్రము తీఱిక లేదఁట! ఇంతకంటె సిగ్గులచేటు వేఱు కలదా? కాఁబట్టి మీ రందఱును యిట్టిసాకల నెన్నఁడును చెప్పఁ బ్రయత్నింపక నిత్యమును తప్పక యీశ్వరప్రార్థనము చేయుచు మనుష్యనామమును ధరించుట కర్హులుగా నుండునట్లు ప్రవర్తింపుఁడు. ఈ యేకాంతప్రార్థనవలని లాభము లిదివఱకే విస్తారముగా చెప్పఁబడినందున నిచ్చట మరలఁ జెప్పుట యనావశ్యకము.

రెండవది కుటుంబప్రార్థన. భార్యయు భర్తయు బిడ్డలును బంధువులును చేరి యింట చేయునదియే కుటుంబప్రార్థన. ఈప్రార్థనవలన కుటుంబములో పరిశుద్ధతయు, ఐకమత్యమును, నెమ్మదియు, సుఖమును కలుగును; బాలురకు భక్తియు ప్రేమయు సుగుణములును కలుగును; కుటుంబములోని బంధువుల కన్యోన్య ప్రేమానుబంధము దృఢపడును; కుటుంబములోని దుష్టులు శాంతులు, బుద్ధిహీనులు తెలివిగలవారును, అగుదురు. వేయేల? ఇట్టి ప్రార్థనలవలన కుటుంబములో సుఖసంతోషాదులు ప్రబలి గృహము భూలోకస్వర్గమువలె నగును. మనలో కుటుంబప్రార్థనలు లేకపోవుటచేతనే భర్తది పరిశుద్ధాస్తికమతముగాను, భార్యది విగ్రహారాధకమతముగాను, తల్లిదండ్రులది మూఢ వేదాంతముగాను ఉండి, తల కొకదారి యయి

యేకకుటుంబములో కలుగవలసినంత యైకమత్యమును, పరస్పరానురాగమును, సౌఖ్యమును కలుగకున్నవి. కాఁబట్టి యీ యనర్థము తొలఁగునట్లుగా మీ రందఱును మీ మీ కుటుంబములలో కుటుంబ ప్రార్థనలు నెలకొల్పుట కయి ప్రయత్నింతు రని నమ్ముచున్నాను.

మూఁడవది మన మిప్పుడు చేసెడిరీతి సమాజ ప్రార్థనము. మనుష్యు లెప్పుడును పరస్పర సంబాధ సాహాయ్యముల వలననే సుఖపడ వలసిన వా రగుటచేత సంఘ ప్రార్థనయు నత్యంతావశ్యకమయినదే. అన్యోన్య సోదరభావమును, పరస్పరానురాగము మొదలయినవి జన సామాన్యములో వెలయుటకయి యప్పుడప్పు డందఱును సంఘీభవించి సర్వపిత యైన యీశ్వరునికి తమ కృతజ్ఞతను భక్తిని విధేయతను తెలుపు చుండవలెను; జన సామాన్యము యొక్క క్షేమము నిమిత్తమును కష్టనివారణము నిమిత్తమును ప్రార్థించు చుండవలెను. ఇట్టి ప్రార్థనలు తఱుచుగా చేయుచుండుట వలన జనసంఘములో నన్యోన్యద్వేషము పోయి యైకమత్యము పుట్టి పరోపకార గుణమును నన్యోన్య సాహాయ్యకరణమును కలుగును; భక్తి హెచ్చును; సద్గుణములు పట్టుబడును. జంతుజాలములో మనుష్యుఁ డొక్కఁడు మాత్రమే యీశ్వర ప్రార్థనము చేయ సమర్థుఁడయినందున నెల్లవారును పరమేశ్వరారాధనము చేయుచు, మానవ స్వభావమును నిలుపుకొనఁ బ్రయత్నింతు రని నమ్ముచున్నాను. ప్రార్థన లేనిచో మనుష్యుఁడు మృగతుల్యుఁ డగు ననుటకు సందేహము లేదు కాఁబట్టి మిమ్మందఱను పయిని జెప్పిన మూఁడు విధములయినప్రార్థనలను జేయు చుండుఁ డని వినయపూర్వకముగా వేఁడుచున్నాను. సర్వశుభంకరుఁడయిన యీశ్వరుఁడు మీ కట్టి బుద్ధిని పుట్టించునుగాక!

# ప్రార్థన.



ఓ భ్రాతృవరులారా!

మా ప్రార్థనసమాజముయొక్క సాంవత్సరికోత్సవమును జూచుట కయి యీ సాయంకాలము మీరందఱిక్కడకు వచ్చియున్నారు. మా సమాజముయొక్క యుద్దేశమేమో దాని పేరునుబట్టియే మీరు గ్రహింపవచ్చును. కాఁబట్టి మా సమాజముయొక్క ముఖ్యోద్దేశ మయిన ప్రార్థననుగురించి నేఁడు కొంచెము చెప్పవలసియున్నది. అవయవార్థమునుబట్టి చూడఁగా ప్రార్థన యనుటకు వేఁడుకొనుట యని యర్థమయినను, మీరిక్కడ ప్రార్థన యనఁగా పరమేశ్వరోపాసన మని గ్రహింపవలయును. ప్రపంచారంభము మొదలుకొని నేఁటివఱకును సమస్తదేశములలోను సమస్తజాతులవారిలోను తాము స్వతంత్రులము కామనియు పుణ్యపాపపరిశీలనముచేసి తమ్ము పాలించెడు ప్రభువొకఁడు పయినున్నాఁడనియు జ్ఞాన ముండి యుండుటచేత నేదో యొకవిధమయిన మతము తప్పక కలిగి యున్నది. ఈశ్వరారాధనములేని మత మెక్కడను లేదు గనుక, భగవత్ప్రార్థన సర్వమతములలోను సర్వజనసామాన్యమయి యున్నది. వీనినిబట్టి విచారింపఁగా మనుష్యకోటియొక్క సుఖసంతోషాదులకు ప్రార్థన యత్యంతావశ్యకమనియు ముఖ్యాధారమనియు స్పష్టమగుచున్నది.

ఈశ్వరోపాసనమునకు పూజ, కృతజ్ఞత, ప్రార్థన, ముఖ్యాంగములని చెప్పవచ్చును. నేనిక్కడఁ జెప్పెడు పూజ కేవల మానసికమేకాని పుష్పపత్రాదులతోఁ జేయు బాహ్యపూజ యెంతమాత్రమును గాదు. పూజ యనఁగా సర్వేశ్వరుని సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదుల కద్భుత

ప్రమోదములు పొందుచు, సర్వకారుణ్య పరిశుద్ధత్వాదు లయిన యనంతకళ్యాణగుణములను తలఁచి భక్తివిశ్వాసములతో స్తుతించి వందనములు చేయుట. కృతజ్ఞత యనఁగా సర్వదా మన సుఖసంతోషాదుల నిమిత్తమును ఈశ్వరుఁడు దయచేసియున్న లెక్కలేని సాధనములను దెలిసికొని యాతఁడు చేసిన మహోపకారమును మఱవక యాతనియం దత్యంతప్రేమను కనఁబఱుచుట. ప్రార్థన యనఁగా భగవదాజ్ఞను మీఱి మనము చేసిన యపచారములకయి మనస్తాపము నొంది వానిని క్షమించుటకును, ఆత్మోజ్జీవమునకయి కావలసిన శాంతిపారిశుద్ధ్యాదులను దయచేయుటకును, సన్మార్గమున కాకర్షించు ప్రబలతరములయిన కామక్రోధాదులబారిఁ బడకుండ సన్మార్గమున సంచరింప శక్తి నిచ్చుటకును, పరమేశ్వరుని హృదయపూర్వకముగా వేఁడుకొనుట. భగవదారాధనమున కిప్పుడు చెప్పిన వన్నియు నావశ్యకములే యయినను సమయానుగుణముగా నొకప్పు డొకయంగము హెచ్చయి మఱియొకప్పుడు మఱియొక యంగము హెచ్చుగావచ్చును. మన కాకస్మికముగా గొప్పమేలు లభించినప్పుడు ప్రేమయు కృతజ్ఞతయు ప్రజ్వరిల్లి స్తోత్రవందనములు హెచ్చుగావచ్చును; మన మేదయిన సత్కార్యమున నుపక్రమించిన సమయములందు ఘోరకష్టములన్నిప్రక్కలను వచ్చి చుట్టుకొని లోకులు మాల నాపద పెట్టఁగడఁగినప్పుడు మనశక్తి చాలక యీశ్వరసాహాయ్యము నిమిత్తము ప్రార్థన హెచ్చుకావచ్చును. ఈశ్వరారాధనము పరులు చూచి మెచ్చుటకయి చేసెడు బాహ్యవేషధారణమును, తంత్రమును గాక, కాలస్థితిని బట్టి సమయోచితప్రయోజనసిద్ధికయి హృదయపూర్వకముగాఁ జేసెడి యుపాసన గనుక, ఆ కాలమున కేది హెచ్చుగా నుండవలెనో యదనుగుణముగానే జరపవలెను. మన మిండ్లకడ ప్రతిదినమును

ప్రత్యేకముగాఁ జేసికొనెడు పరమేశ్వరారాధన మిప్పుడు చెప్పిన ప్రకారముగా నుండవలసినను, పలువురొక్కచోటఁ గూడి యీ ప్రకారముగా చేసెడు సమాజప్రార్థనమాత్రము సామాన్యముగా పయియంగములన్నిటితోడను నిండి యుండవలెను. ఇహపరలోకసుఖములకయి యీశ్వరప్రార్థన మత్యావశ్యక మని యించుమించుగా నెల్లవారు నొప్పుకొనుచున్నను, భగవత్ప్రార్థనవలనఁ బ్రయోజనము లేదని భావించువారుకూడ కొందఱిక్కాలమున నందందుఁ గానఁబడుచున్నారు. శరీరసుఖమునకయి కావలసిన యితరపదార్థములవలెనే యాత్మసుఖము నిమిత్తమయి ప్రార్థన యావశ్యక మని యెఱిఁగి యెల్లవారు నాచరించుచున్నప్పుడు, అట్టి సర్వజనానుభవసిద్ధమయిన సత్యమును స్థాపించుటకయి యుక్తులు చెప్పవలసినపని లేదు. గాని యీ సంశయాఘుర లాభము నిమిత్తమయి కొంచెము చెప్పవలసి యున్నది.

మనుష్యుఁడు తన సుఖమునకుఁ గావలసిన పదార్థముల నిమిత్తమయి పరాత్పరుని సాహాయ్య మపేక్షించువాఁడు గనుక ప్రార్థన యావశ్యక మయినది. కాఁబట్టి ప్రార్థన చేయుట మనుష్యకోటికి సహజగుణము. ఆఁకలి వేసినప్పుడు బిడ్డ పాలనిమిత్తమయి తల్లిని వేఁడుకొనును; అన్నాతురుఁడైన దరిద్రుఁడు తన కన్నము పెట్టగల ధనికుని గృహమునకుఁ బోయి వేఁడుకొనును; రోగార్తుఁడు వ్యాధిబాధ తొలఁగింపఁగల వైద్యుని యొద్దకుఁ బోయి వేఁడుకొనును. ఈ ప్రకారముగా బాలురు మొదలుకొని వృద్ధులవఱకును తమ పోషణము నిమిత్తమును సంరక్షణము నిమిత్తమును విపన్నివారణము నిమిత్తమును తత్తత్కార్యములను చేయఁగలవారిని చేరి ప్రార్థింతురు. పోషణరక్షణాదులు లేక శరీర మెట్లు సుఖస్థితియం దుండనేరదో యట్లే యాత్మయు పోషణరక్షణాదులు లేక సుఖస్థితియం దుండఁజాలదు. దేహ

సంబంధములయిన లోపములు తటస్థించి నప్పుడు తల్లోపములను వారింపఁ గలవారిని వెదకుచుఁ బోయి ప్రార్థించులాగుననే మనుష్యుఁడాత్మసంబంధములయిన లోపములు సంభవించినప్పు డా లోపములను దీర్చి సుఖము ప్రసాదింపఁ గలిగిన యీశ్వరుని నిజస్వభావముచేతనే ప్రార్థించును. జ్ఞానశరీరపోషణమున కావశ్యకములయిన సత్యశాంత్యాదులకు లోపము తటస్థించి నప్పుడు తత్సంపాదనమునకయి గుణసంపత్ప్రదాతయైన యీశ్వరునే వేఁడుకోవలెను; పాపరోగముల బాధచేత నాత్మరక్షణము కావలసి వచ్చినప్పుడు భవరోగవైద్యుఁ డయిన యీశ్వరునే వేఁడుకొనవలెను; అనివార్యము లయిన యింద్రియముల యుద్రేకముచేత చిత్తదౌర్బల్యము కలిగి సుఖాభావము సంప్రాప్తము కాఁబోవు నప్పుడు సుఖసంధాయకుఁ డయిన యీశ్వరునే వేఁడుకొనవలెను. ఈ చెప్పిన దృష్టాంతముల వలన భగవత్ప్రార్థన యావశ్యక మనియు స్వాభావికమనియు నేర్పడుచున్నది. సమస్తమునకును మన కెవ్వఁ డాధారభూతుఁడుగ నున్నాఁడో, ఎవ్వని యనుగ్రహము లేక మన మొక్క నిముషమయిన సుఖపడుటకు శక్తులము కామో, ఎవ్వడు ప్రతిదినమును మన మనుభవించునట్టియు మనకు ప్రియమయి నట్టియు మన మనుగడను సుఖవంతముగాఁ జేయునట్టియు సమస్తపదార్థములను సాధనములను దయచేసెనో, అట్టి పరమదయాళుఁడును పరిశుద్ధుఁడును ప్రేమైకనిధియు నైన యా యీశ్వరుని సంపూర్ణభక్తితోను కృతజ్ఞతతోను దినమునకొకసారి రెండు నిమిషము లయినను స్మరింపక, ప్రార్థింపక, తెలిసిన వాఁ డెవ్వఁ డూరకుండఁగలుగును?

అప్రయత్నముగా కాలోచితమైన ప్రార్థన స్వభావముచేతనే కలుగునని యేర్పడినను, అట్టి ప్రార్థనవలననే ఫలము గలుగదనియు,

అర్ధనిమీలిత నేత్రములతో నాకాశమువంకఁ జూచుచు చేతులు జోడించి ఈశ్వరనామము లోలోపల గొణిగినంతమాత్రముచేత నీశ్వరుఁడు ముక్తినియ్యఁడనియు, ఈ బాహ్యాచరణము లేమియు లేకపోయినను భూతదయ గలిగి కామక్రోధాదులకు లోఁబడక శాంతత వహించి బీదలను సాధులను గాపాడుచు నిత్యసత్యవ్రతమును బూని పరోపకారదీక్ష వహించి పాపముల పొంతఁ బోవక న్యాయముగా ప్రవర్తించు వారిని ధర్మస్వరూపుఁడయిన యీశ్వరుఁడు శాశ్వత సుఖమునుండి తొలగింపఁడనియు, ఈశ్వరాజ్ఞారూప మయిన సత్ప్రవర్తనము ముక్తికి సాధనము గాని యీశ్వరుని ముఖస్తుతులు చేయుట కాదనియు, కొందఱు బుద్ధిమంతులు చెప్పుదురు. యుక్త ప్రవర్తనము లేని భగవన్నామసంస్మరణము పుణ్యమునకు హేతువు కాకపోయినను, భగవద్భక్తి లేనిదే సంపూర్ణ మయిన సన్మార్గవర్తన మెప్పటికిని లభింపనేరదు. నీతివర్తనమునందు భగవంతుని ప్రాపు నమ్ముకొనక స్వశక్తినే నమ్ముకొనువారికి నానాముఖముల కష్టము లును విఘ్నములును సంప్రాప్తములయి దుష్టుల వలనను పామరుల వలనను బాధలు సంభవించి రాజోపద్రవము కలిగినప్పుడు చలింపక నిలిచి ధర్మమార్గమును వదలకుండుటకు ధైర్య మెక్కడనుండి వచ్చును? ఒకవేళ లేని ధైర్యమును కొంతకాలము తెచ్చుకొన్నను మనస్సుఖ మును నుత్సాహము నెట్లు కలుగును? కాఁబట్టి సమస్తవిషయముల యందును భగవంతుని ప్రాపునే నమ్ముకొని భగవత్ప్రార్థనము చేయుచు సమస్తమును భగవత్ప్రీతి కొఱకే చేయునివాఁడు సదా సంపూర్ణనీతిమంతుఁ డయి యుండనేరఁడు. ఆపదలు రాకున్నంత వఱకు మాత్రము నీతిమార్గమున నడచిన నడువవచ్చును. ఇఁక సమ స్తమునకును భగవంతుని ప్రాపునే నమ్ముకొని యీశ్వరప్రార్థన

మునే విసువకుండెడివాఁడో నిరంతర ధ్యానము వలన భగవత్సా న్నిధ్యమును పొంది యానందపరవశుఁడయి తన్నావఱకాశ్రయించి యున్న దుఃఖములను, కష్టములను, దుశ్చింతలను మఱచి, ఆత్మపారి శుద్ధ్యమును పొంది, ఏ కార్యమునందును తన సహజ దౌర్బల్యమును గానక యొక్కెడలేసి, యుత్సాహమును ధైర్యమును సాహసమును కనఁబఱిచి, కష్టజాలములయందు సహిత మపరిమిత సుఖసంతోషము లను పొందును. ప్రభువుల కెల్లను ప్రభువయిన యా సర్వశక్తుని యా శ్రయబలముచేత లోకములోని యే ప్రతిబంధకమును విఘ్నమును లక్ష్య పెట్టక సత్కార్యాచరణమునందు నిర్భయముగా ప్రవర్తించును. కాఁబట్టి యీశ్వరప్రార్థన వలననే సమస్తగుణములును కలుగును; ఈశ్వరప్రార్థన వలన దుర్బలులకు బలమువచ్చును; ఈశ్వరప్రార్థన వలన భీరులు ధీరులగుదురు; ఈశ్వరప్రార్థన వలన నిరాశులయిన వారి కాశ గలుగును; ఈశ్వరప్రార్థన వలన మూఢులు వివేకు లగుదురు; ఈశ్వరప్రార్థన వలన దుష్టులు సద్వర్తను లగుదురు. అదిగాక దుర్భ రములయిన కష్టములు వచ్చి బాధించు నప్పుడు వానిని తొలఁగించు కొనుటకును, ఇంద్రియము లుద్రేకించి హృదయమును బలవంత ముగా పాపకార్యముల కీడ్చు నప్పుడు తప్పించుకొనుటకును, కేవల మనుష్యశక్తి చాలదు. ప్రార్థనమూలమున నమూల్యమయిన యీ శ్వరసాహాయ్యము నావశ్యకముగా పొందవలెను. దైవసాహాయ్య మును పొందుటకు భక్తిపూర్వకమయిన ప్రార్థన తప్ప సాధనాంత రములేదు. భగవత్సామీప్య సాన్నిధ్యములను గలిగించుకొని, మన కష్టసుఖములను విన్నవించుకొని అభయప్రదానమును బలమును పొంది, ఆత్మశాంతిని పొందుటకు ప్రార్థన యొక్కటియే యమోఘ మార్గము. మనము చిత్తశుద్ధితో ప్రార్థించినయెడల, ప్రార్థనుండి

లేవఁగానే యాతోన్మోజ్జీవనముగలిగి మనకు క్రొత్తబలమును ధైర్యమును సంతోషమును పరిశుద్ధతయు కలుగును. మనుష్యుఁడీ లోకములో పొందఁదగిన యుత్కృష్టానందమంతయు మన కొక్క ప్రార్థనమూలము ననే లభించును. సత్ప్రవర్తనము లేనిపక్షమున కేవల బాహ్యమైన పరమేశ్వరప్రార్థనవలన ఫలమేమియు లేదని నాకును దృఢమైన నమ్మిక మున్నది. నడత మంచిదికాక భగవంతుని గుఱించి యూరక నోటితో చెప్పుమాటలు గాలి కెగిరిపోవును. అట్టి ప్రార్థనలు కీచుపిట్టలును యంత్రములునుచేయు ధ్వనులకంటె నధికప్రయోజనకరము లయినవి కావు. హృదయపూర్వకముగాచేయని బాహ్యపూజలవలన వృథాయాసమేకాని ఫలలేశ మయినను కలుగదు. కాని మనఃపూర్తిగా చేయుప్రార్థనలుమాత్ర మెప్పుడును నిష్ఫలములు కానేరవు. భక్తిపూర్వకములయిన యట్టి ప్రార్థన లాలించి యీశ్వరుఁడు తగిన ఫలము నియ్యక మానఁడు. నిష్కపటమయిన ప్రార్థనయును దుష్టచింతయు నొక్కమనస్సులో చిరకాల మేకముగా నుండనేరవు. ఆ రెంటిలో నేదో యొక్కటిమాత్రమే మనస్సునందు కాపురము చేయును. చేసెడు ప్రార్థన హృదయపూర్వకమయినదే యయిన పక్షమున దుశ్చింత మనస్సులో నిలువలేక క్రమక్రమముగా క్షీణించి పాఱిపోవలెను. ప్రార్థన హృదయపూర్వక మయినది కానప్పుడుమాత్రమే దుష్టవర్తనము మనస్సును విడిచిపెట్టకుండును. కాఁబట్టి పైకి సభలలో ప్రార్థనలు చేయువాఁ డెవ్వఁడయిన క్రమక్రమముగా తన చెడునడతను విడువకుండెడుపక్షమున్న, అట్టివాఁడు నిజమయిన భక్తుఁడు కాఁడనియు, వాని యారాధనము కపటనాటకమే కాని త్రికరణశుద్ధియయిన యుపాసనకాదనియు, వాఁడు పామరులను స్వార్థపరుఁడయి భ్రమియింపఁజేయు పరమవంచకుఁ డనియు మీరు సులభముగా తెలిసికోవచ్చును. మనము హృదయ

పూర్వకముగాజేసెడు ప్రార్థనలు మన మేపాపముచేత పీడింపఁబడు చుందుమో యా పాపనివారణార్థమును, మన మేప్రయోజనమును గోరి యుందుమో దాని లాభమునిమిత్తమును అయియుండవలెను గాని సామాన్యముగా "మమ్ము పాపములనుండి విముక్తులను జేయుము" "మ మ్మాపదలనుండి తొలఁగింపుము" "మాకు సద్గుణములను ప్రసాదింపుము" అని మాత్రము ప్రార్థించుటవలన నంతగా ప్రయోజన ముండదు. మన మసత్యము పలికిన యెడల నసత్యమునుండి కాపాడు మనియే వేఁడుకోవలెను; చౌర్యము చేసినయెడల ముందు చోరత్వము నందు బుద్ధి తగులకుండునట్లు చేయవలయు ననియే ప్రార్థింపవలెను. కామమును మరల్చుకోలేకపోయిన పక్షమున కామనివారణసామర్థ్య మును దయచేయవలయు ననియే ప్రార్థింపవలయును. అసత్య మాడుట చేత హృదయతాపము నొందుచు ముం దసత్యము జిహ్వాగ్రము నకు రాకుండఁ జేయవలయు నని హృదయపూర్వకముగా ప్రార్థించువాఁ డసత్యమునుండి మరలకుండునా? దొంగతనము చేయుటచేత మనో వేదన పొందుచు ముందు పరులసొత్తుమీఁదికి తన మనస్సును పోకుండఁ జేయవలెనని మనసార ప్రార్థించువాఁడు మరల దొంగతనము చేయు టకు చేయి చాపఁగలుగునా? వ్యభిచారదుఃఖముచేత మనస్తాపము నొందుచు తన మనస్సు పరాంగనలమీఁదికి పోకుండఁ జేయుమని నిష్కపటముగా ప్రార్థించువాఁడు మరల పరకాంత పొందాసింపఁ గలఁడా? కాఁబట్టి యెప్పుడును లేనిపోని కోరికలు కోరక మనయం దేలోపము కనఁబడునో దాని నివృత్తియే వేఁడుకొనవలయును.

మనము కోరెడు కోరికలనెల్ల నిచ్చుటకు భగవంతుఁడు చంచ లుఁడు కాఁడనియు, తన శాసనములను మన ప్రార్థనలనుబట్టి నడుమ నడుమ మార్చుచుండునా యనియు, కొంద రాక్షేపింతురు. భగవంతుఁ

డెంతమాత్రమును చంచలుఁడు కాఁడు; ఒక్కరి నిమిత్తమయి తాను చేసిన శాసనములను మార్చువాఁడును, కాఁడు. మనము వేసవికాలములో వాన లిమ్మని ప్రార్థించినను శీతకాలములో వేఁడిమి నిమ్మని ప్రార్థించినను ధనమునుగాని స్త్రీలనుగాని సంపదలనుగాని కీర్తినిగాని యితరభోగములనుగాని యిమ్మని ప్రార్థించినను, మనము కోరినందు చేత నిచ్చువాఁడు కాఁడు. అట్టివి వచ్చుటవలన మనకు సుఖమును కలుగక పోవచ్చును. అట్టి యిహలోకసంపదలు సంప్రాప్త మయినప్పుడు మనము సంపన్నాంధులమయి యీశ్వరుని మఱచి తుచ్ఛసుఖముల నిమిత్తమయి దుశ్చేష్టల మరగి కడపట పరలోకహానియుఁ దెచ్చుకో వచ్చును. కాఁబట్టి యట్టి నష్టకరములయిన కోరికల నతఁ డెప్పుడును ఫలింపఁజేయఁడు. మన మాతనిని కోరవలసిన కోరికలు మనస్సులను పాపకార్యములనుండి మరలింపవలసిన దనియు, సత్కార్యములయందాసక్తములయి యుండునట్లు చేయవలసిన దనియు, భగవదాజ్ఞలను చెల్లించుటకయి ధైర్యసాహసములను సుఖశాంత్యాదులను ననుగ్రహింపవలసిన దనియు, ఈ మొదలైన యాముష్మికసంబంధములైనవయి యుండవలెను. అప్పుడవి యీశ్వరుఁడు మనకు తప్పక ప్రసాదించును. అట్లు చేయుటవలన భగవచ్ఛాసనము మాఱవలసిన పని లేదు. అట్టి విషయములలో హృదయపూర్వకముగా తన్ను ప్రార్థించు వారి కవి లభించి యాత్మశాంతి, పారిశుద్ధ్యము మొదలయినవి కలుగవలె ననియే భగవంతుని శాసనము. ఒక్కజ్యోతినుండి మనము దూరముగా పోయినకొలఁదిని వెలుతు రంతకంతకు తగ్గుచు వచ్చి యాజ్యోతిని సమీపించుకొలఁదిని వెలుతురు హెచ్చుచు వచ్చులాగుననే జ్ఞానజ్యోతియైన యీశ్వరుని ప్రార్థనల మూలమున మనము సమీపించిన కొలఁదిని పాపాంధకారము దూరముగా తొలఁగుచుండునట్లును,

భక్తిహీనతమూలమున నీశ్వరునికి దూరముగా తొలఁగు కొలఁదిని పాపాంధకారము మనల చుట్టుకొని కన్ను గానకుండుట తటస్థించు నట్లును, ఈశ్వరుఁడు మొట్టమొదటనే శాసించి యున్నాఁడు.

మన కేమికావలయునో యీశ్వరునికి తెలియనే తెలియును గదా, మరల ప్రార్థింపవలసిన పని యేమున్న దని కొంద రాక్షేపణ చేయుదురు. భగవంతుఁడు మన కోరికలను ప్రసాదించుట పరిశుద్ధ చింతతో మన మడిగినందుకుఁ గాని మనకు లోపములున్నందు నిమిత్తమయికాదు. కపటము లేకుండ మన మనోగతములను తెలుపుట చేతకూడ దుఃఖశాంతియు సుఖాతిశయమును కలుగవలెనని కూడ భగవంతుని శాసనములలో నొకశాసనముగా నున్నది. అందుచేతనే మనకు దుఃఖము కలిగినప్పుడు ప్రేమాస్పదులయిన మిత్రులతోఁ జెప్పుటచేత సగము దుఃఖము తీఱును; మనకు శుభము కలిగినప్పుడు వారితోఁ జెప్పుటచేత మన సంతోషము ద్విగుణ మగును. కాఁబట్టి మనకుఁ గావలసినవాని నన్నిఁటిని భగవంతుఁడు తెలిసినవాఁడే యయినను మన దుఃఖశాంతినిమిత్తమును సంతోషాభివృద్ధి నిమిత్తమును మన ప్రార్థన లత్యావశ్యకములు. అదిగాక మన మొకవిషయమయి ప్రార్థించుచు సదా దానిని తలఁచుకొనుచుండెడి పక్షమున దాని విషయమై మనము మఱింత జాగరూకులమై యుందుము; కాఁబట్టి బొత్తిగా ప్రార్థనచేయని వానికంటె ప్రార్థనలు చేయు భక్తిహీనుఁడును కొంత యధికలాభము పొందును.

లోకములో భగవదారాధనము మూఁడువిధములుగా నుండును. అందొకటి యెవరి యింటివద్ద వారు రహస్యముగా చేయు ప్రత్యేకప్రార్థన. దాని విషయమయి యివఱకు కొంత చెప్పియున్నాను. రెండవది భార్యలు పుత్రులు సేవకులు మొదలయిన వారందఱును

జేరి గృహమునఁ జేయు కుటుంబ ప్రార్థన. ఈ ప్రార్థనవలన కుటుంబములోని వారికెల్ల నైకమత్యమును నెమ్మదియు, బిడ్డలకు పెద్దలయందు భక్తియు, నమ్రతయు, పరోపకారచింతయు మొదలయిన బహుసుగుణములబ్బును. సంసారదుఃఖములు కానరాక సుఖముకలుగును. మూఁడవది యిటువంటి సమాజప్రార్థన మనుష్యుఁడు సమస్తవిషయములలోను పరస్పరసాహాయ్యమువలననే సుఖపడుననుట యెల్లవారు నెఱిగిన విషయమే. అలాగుననే యీశ్వరారాధన విషయమునఁ గూడ సంఘీభవించి చేసిన ప్రార్థనవలన సమస్తలాభములును కలుగును. ఐకమత్యముపుట్టును. ఈప్రకారముగా సమాజప్రార్థనలు లేని జాతులవారంతకంతకు మూఢులై క్రూరవర్తనులై నాగరికుల దూషణకు పాత్రులై నీతిమాలినవా రగుదురు.

ఈశ్వరారాధనమువలన పైని చెప్పినవిగాక ముఖ్యముగా కలిగెడు మఱియొక లాభము పరమేశ్వరుని తఱుచుగా స్మరించుచుండుటచేత నాతనియందును తద్గుణములయందును ప్రీతియును గౌరవమును కలిగి మన మాయన గుణముల నవలంబించుటకు ప్రయత్నించి బాగుపడుట. కాఁబట్టి యెల్లవారును నే నిప్పుడు చెప్పిన మూఁడువిధముల ప్రార్థనలును మన దేశమున వర్థిల్లునట్లు చేయుదురుగాక !



# మానుషధర్మము.

భ్రాతృజనులారా!

ఈలోకములో నిప్పుడెంత జ్ఞానాభివృద్ధి యగుచున్నను, మనుష్యుఁడు బాహ్యప్రపంచమునుగూర్చి తెలిసికొన్నంత యాత్మవిషయమునుగూర్చి తెలిసికొని యుండలేఁడు. ఆత్మ యున్నదని తెలియనివాఁడు లోకములో నెవ్వఁడునులేఁడు గాని, ఆయాత్మయొక్క ధర్మము లిట్టివని దృఢముగా నెఱిఁగినవారు మాత్రము మిక్కిలి తక్కువగా కానఁబడుచున్నారు. మానుషరూపమును ధరించినవానికెల్లను తన్నుగూర్చి తానెఱుఁగుట ప్రథమకర్తవ్యము. తానెట్టివాఁడో తాను తెలిసికోలేకపోయినప్పుడు బాహ్యపదార్థములను వేయింటిని గూర్చి తెలిసికొన్న ప్రయోజనమేమి? ఇట్లు చెప్పుటచేత పదార్థజ్ఞాన మనావశ్యకమని నాయభిప్రాయ మెంతమాత్రమును కాదు. అది కావలసినంత యుండవలసినదే కాని యాత్మజ్ఞానమును విడిచి యితరపదార్థతత్త్వమును మాత్ర మెఱుఁగఁగోరుట శ్లాఘ్యమయిన పని కానేరదు. మనుష్యులు జలధర్మమును దెలిసికొని, నీటియావిరివలన నోడలను బండ్లను వాయువేగమున నడుపుటయేకాక వస్త్రనిర్మాణాదుల కుపయోగించు వివిధయంత్రములచేఁ బనిచేయింప నేర్చుకొన్నారు; వాయుగుణమును దెలిసికొని, గాలిబలముచేత నీటిని క్రిందినుండి మీఁదికెక్కించుటయేకాక వాయుపథమున విమానములు నడుపుటకు నేర్చుకొన్నారు; తేజోమహిమను దెలిసికొని, చమురులేనిదీపములను వెలిఁగించుటయేకాక మనోవేగమున దూరవార్తలను బంపుటకు నేర్చుకొన్నారు; పృథివీతత్త్వమును దెలిసికొని, మృత్తుతో విచిత్రపాత్రా

ముల నిర్మించుటయేకాక భూమినుండి మనుష్యసుఖసాధనములయిన నానావిధసస్యఫలాదులను బొందనేర్చుకొన్నారు. ఈప్రకారముగా భూమిమీఁదనున్న వస్తుసముదాయమును గూర్చి మాత్రమే కాక యాకాశమున సంచారముచేయు గ్రహతారకాదుల గమనాదులను గూర్చి సహితము తెలిసికొని, దారిలేని మహాసముద్రమధ్యమున దారి తప్పకుండ నావలను నడప నేర్చుకొన్నారు. ఈరీతిగా బహువస్తుతత్త్వములను దెలిసికొని మనుష్యులు బహువిధలాభములను పొందుచున్నారు. కాఁబట్టి బాహ్యప్రపంచవిషయమున మనుష్యుఁడు సంపాదించిన జ్ఞాన మింతింతయని చెప్ప నలవికాదు. ఈవఱకు సంపాదించిన దానితో తృప్తినొందక యనేకులింకను బహువిషయములయందు జ్ఞానాభివృద్ధిని గూర్చుటకు నిరంతరకృషి చేయుచున్నారు. అయినను మనుష్యులలో ఆత్మవిషయమునకంటె నన్యవిషయములయందు కృషి విస్తారముగా పొడకట్టుచున్నది. వీనినన్నిటినిబట్టి విచారింపఁగా మనుష్యునకుఁ దెలిసినదానిలోనెల్లను దన్నుఁగూర్చి తెలిసికొన్నదే మిక్కిలి తక్కువగాఁ గానఁబడుచున్నది.

నీరు మెట్టకనుండి పల్లమునకుఁ బాఱుచున్నది; అగ్నిజ్వాలలు పయికి లేచుచున్నవి; బీజమునుండి మొలకయెత్తి చెట్టు పెరిగి పూవులనో ఫలములనో యిచ్చి నశించుచున్నది. సూర్యకిరణములు సముద్రములనుండి జలము నాకర్షించి వర్షరూపమున దానిని మరల భూమికిఁ బంపుచున్నవి; సూర్యచంద్రులు తమగతిచేత సంవత్సరములు, ఋతువులు, మాసములు, దినములు మొదలయిన కాలభేదములను గలిగించుచున్నారు; గుఱ్ఱములు మహాజవసంపన్నములయి పరుగెత్తుచున్నవి; తాఁబేళ్ళు మందగమనముతో ప్రాఁకుచున్నవి; చేపలు నీటిలోమునిఁగి యాడులాడుచున్నవి; పక్షు లాకాశమున నెగురుచున్నవి. ఈవిధముగా

చరాచరములయిన సమస్తపదార్థములును తమకు నియతములయి యున్న ధర్మములను మీఱక చరించుచున్నవి. స్వభావముచే నీరు పల్లమునుండి మెట్టకెక్కదు; వెలగచెట్టున గుమ్మడికాయలు కాయవు; ఏనుఁగులు పిల్లిపిల్లలను బెట్టవు; పులుగులు గడ్డితినవు; గోవులు మాంసభక్షణము చేయవు; సూర్యుఁడు మూఁడుదినముల కొకసారి యస్తమింపఁడు; చంద్రుఁడు దినమునకు మూఁడుసారు లుదయింపఁడు. వస్తుధర్మములనుబట్టి పరీక్షించిచూడఁగా సృష్టిలో నణువు మొదలుకొని బ్రహ్మాండమువఱకునుగల ప్రతిపదార్థమును నేదోయొక ప్రయోజనముద్దేశించి తన కేర్పఱుపఁబడిన నియమమునకు లోఁబడి వర్తించునట్లు కానఁబడుచున్నది గాని యనిర్దిష్టముగా విచ్చలవిడిగా వర్తించుచున్నట్టు కానరాదు. ఇట్లు సృష్టిలోని సమస్తవస్తువులను, ప్రతిపదార్థములనను ఏదోయొక ప్రయోజనము నుద్దేశించి తదనుగుణముగా చేసిన పరమేశ్వరుఁ డొక్క మనుష్యునిమాత్రము నిర్దిష్టప్రయోజనము లేక పనికిమాలిన నిరర్థకజంతువునుగా సృజించియుండఁడు. కాఁబట్టి యిప్పుడు మనుష్యుఁ డేయుద్దేశముతో సృజింపఁబడినాఁడన్న యంశము విచారింపవలెను. మనుష్యునకు పశుపక్ష్యాది జంతుసామాన్యమయిన స్థూలదేహ మొక్కటియు, ఆధ్యాత్మికమయిన జ్ఞానదేహ మొక్కటియు, రెండు కానఁబడుచున్నవి. స్థూలదేహము తక్కిన జంతువుల దేహములకంటె విశేష భిన్నమయినది కానందున, దేహధర్మము లన్నియు మృగధర్మములుగానే యుండును. అందుచేత మనుష్యుఁ డింద్రియమూలమునఁ బొందఁగలుగు సౌఖ్యము లించుమించుగా మృగాదుల సౌఖ్యములతో సమానమయినవిగానే యుండును. అయినను మనుష్యునకున్న యాధిక్యమంతయు జ్ఞానదేహమయిన యాత్మను గలిగియుండుట. ఇఁక మనుష్యునకుఁగల యాత్మ

తత్త్వమెట్టిదో విచారింపవలెను. అది నిరవయవమయినదియు నిరాకారమయినదియుఁ గనుక నాశనరహితమయినది; అది స్వప్రకాశమయినది గనుక జ్ఞానాత్మకమయినది; కరుణాది గుణవిశిష్టమయినది గనుక కారుణ్యామయమయినది. ఇట్టి గుణములుగల యాత్మ సృష్టిలోని మఱి యేపదార్థమునందును గానఁబడదు. ఈశ్వరుఁ డొక్కఁడు మాత్రమే యిట్లాత్మస్వరూపుఁడయి యున్నాఁడు. సృష్టిపదార్థములనుబట్టియు మన యాత్మతత్త్వమునుబట్టియు సృష్టికర్తయైన యీశ్వరుని గుణములను పరిశీలింపఁగా మనుష్యబుద్ధిచేతఁ దెలిసికోఁదగి యున్నంతవఱకు మనుష్యాత్మలయందుఁగల లక్షణములే యీశ్వరుని యందును గానవచ్చుచున్నవి. కాఁబట్టియే మనుష్యుఁడు స్థూలసూక్ష్మశరీరధారణమునుబట్టి సగము మృగమనియు సగము దేవుఁడనియు చెప్పఁబడుచున్నాఁడు. మాంసశరీరములో మృగత్వమును, జ్ఞానశరీరములో దేవత్వమును కలవనుటకు సందేహములేదు. మనయాత్మలు పరమాత్మునితో సమానమయిన గుణములు కలవేయయినను, జీవాత్మకును పరమాత్మకును విశేష తారతమ్యము గలదు. పరమాత్ముఁడు సర్వజ్ఞుఁడు; జీవాత్ముఁడు మితజ్ఞుఁడు; పరమాత్ముఁడు సర్వశక్తుఁడు; జీవాత్ముఁడు పరిమితశక్తుఁడు; పరమాత్ముఁడు సమస్తకళ్యాణగుణ పరిపూర్ణుఁడు; జీవాత్ముఁడు సమస్తసద్గుణాంకురవిశిష్టుఁడు. అగ్నిహోత్రమునకు తాపమును, పర్వతములకు కాఠిన్యమును ధర్మములయినట్లే మనయాత్మలకు జ్ఞానము నీతియును ధర్మములు. అగ్నిహోత్రము తాపమును విడుచుట యెట్లు అసహజగుణమో మనయాత్మలు నీతిని విడుచుటయు అట్లే యసహజగుణము. నీతిని గలిగియుండుట మానవాత్మకు స్వాభావికము; అదిలేకుండుట యస్వాభావికము. మామిడి పండునకు మధురరసాదులను గలిగి రమ్యముగానుండుట స్వాభావి

కము; పుష్పిపట్టి చెడి వికారముగా నుండుట యస్వాభావికము; దేహమునకు బలారోగ్యములు కలిగియుండుట స్వాభావికము; రోగాదులచే దుర్బలమయి పాడగుట యస్వాభావికము. ఈప్రకారముగానే యాత్మకును నీతిజ్ఞానాదులచే నానందమనుభవించుట స్వాభావికము; పాపాజ్ఞానాదులచే సంతోషముచెడి బాధపడుట యస్వాభావికము. ప్రతిమనుష్యుఁడును మొట్టమొదట దేహమునకు రోగములు రాకుండ కాపాడుకొనవలసినట్లే యాత్మను పాపరోగములంటకుండునట్లు కాపాడుకొనుచు రావలెను; అటుతరువాత ప్రమాదాదికము వలన శరీరమును వ్యాధి యాశ్రయించినప్పుడు మందువేసి రోగమును మాన్పి యారోగ్యదశను పొందఁబ్రయత్నించుట యెట్లు ధర్మమో యట్లె యాత్మను పాపరోగమాశ్రయించి దుఃఖపెట్టుచున్నప్పు డనుతాపౌషధముచేత దానిని స్వస్థపఱిచి మరల సుఖస్థితికిఁ దెచ్చుటకయి ప్రయత్నించుటయుఁ బరమధర్మము. వేఁడిమిని విడిచిన బొగ్గెట్లగ్నిపాత్రమని పిలువఁబడఁదగదో యట్లే మనుష్యుఁడును నీతిని విడిచినతరువాత మనుష్యుఁడని పిలువఁబడఁ దగఁడు. నీతియే మనుష్యలక్షణము; నీతియే మనుష్యునకు పరమధర్మము; నీతిబంధమే మనుష్యుని కీశ్వరునితోడి వీడని చుట్టఱికమును గూర్చుచున్నది. నీతివర్తనముచేత నీశ్వరసామీప్యమును బొంది నిత్యానందమును బొందుటయే మనుష్యజీవనమువలని పరమప్రయోజనము. కాఁబట్టి ప్రతిమనుష్యుఁడును నీతిమార్గమునఁ బరమేశ్వరుని జేరి యానందింపఁ గలుగుటకయి సర్వవిధములఁ బ్రయత్నింపవలెను. ఒక్క యీ నీతిగుణమువలననే మనుష్యుఁడు పవిత్రుఁడయి యీశ్వరునికి పుత్రుఁడగుటయేకాక యీశ్వరకుటుంబమయిన సమస్త మానవకోటిని భ్రాతలనుగాఁ జేసికొనుచున్నాఁడు. నీతిమహిమను

బట్టియే మనుష్యపదమెంతో పవిత్రమయి గౌరవనీయమయిన దగుచున్నది.

పర్వతమునకు కాఠిన్య మెట్లు సహజగుణమో మనుష్యునకు నీతి యట్లే సహజగుణమయినను, ఈరెండు సహజధర్మములకును కొంత వ్యత్యాసమున్నది. మనుష్యుఁడు పర్వతమువలెఁగాక స్వతంత్రుఁడయి కొంతవఱకు స్వేచ్ఛగాఁ బ్రవర్తింపఁదగినవాఁడు. విషయ సుఖములు మనుష్యునకును మృగమునకును సామాన్యములనియు దేహసంబంధమువలన మనుష్యునిలో మృగధర్మముకూడఁ గొంత యున్నదనియు నీవఱకే చెప్పియున్నాను. మృగధర్మము మనుష్య ధర్మమునకంటె భిన్నమగుటచేత, అవి రెండును ఒకచోటఁ జేరినప్పుడు పరస్పరవిరోధము సంభవింపక తప్పదు. అయినను మనుష్యుఁడు స్వేచ్ఛావివేకములనుబట్టి, మృగధర్మమునకును మనుష్య ధర్మమునకును విరోధము పొసఁగినప్పుడు మృగధర్మము నడఁచి లోఁబఱుచుకొని తన యిచ్ఛానుసారముగా మెలఁగునట్లుచేసి దానివలని లాభమును పొందుచుండవలెను. జీవాత్మకు జ్ఞానాంకురములును నీతి బీజములును గలవనియు వానిని వృద్ధిచేసికోవలయుననియుఁ గూడ నీవఱకే సూచించియున్నాను. జ్ఞానాదులు హీనదశలో నున్నప్పుడు పశుధర్మములని చెప్పఁబడిన మాంసగుణములు ప్రబలములయినవిగా నుండును. ఆకాలమునందు మనుష్యున కీశ్వరవిజ్ఞానమును తదనుగుణమయినదిగానే యుండును. ప్రపంచముయొక్క యారంభ దశలో జ్ఞానాభివృద్ధి విశేషముగా కలుగనప్పుడు దేహబల మధికముగా నున్నవాఁడెవ్వఁడో వాఁడు గొప్పవాఁడుగాను నాయకుఁడుగాను అంగీకరింపఁబడి గౌరవింపఁబడుచు వచ్చెను. ఆకాలమునందు జనులు తాము భయపడి గౌరవించు నరుని గుణములనుబట్టి భగవం

తుని సర్వశక్తునిగాను, మేఘవాహనమెక్కి పిడుగులను బఱపి శత్రువులను నాశనము చేయువానినిగాను, భావించి భయముతో బలులు మొదలయినవానిని సమర్పించి యారాధించుచుండ వచ్చిరి. తరువాత జనులలో జ్ఞాన మభివృద్ధియైన కొలఁదిని దేహబలమునందు గౌరవము తగ్గి కాయబలముగలవానికంటె బుద్ధిబలముగలవాఁ డధికుఁడయ్యెను. దేహబలము గలవానిని బలహీనులయినను పదిమంది జేరి గెలువఁ గలుగుటయు, దేహబలము గలవారు వేయిమంది చేరి యైనను జ్ఞానబలము గలవాని యుపాయములముందు నిలువలేకుండుటయు చూచి యద్భుతపడి, జనులు కేవల దేహబలము గలవానిని విడిచి వస్తుతత్త్వమును దెలిసి ఆలోచన గలిగి, ఉపాయశాలియైన బుద్ధిమంతునిఁ దమకు నాయకునిగాఁ జేసికొని గౌరవింపసాగిరి. లోకానుభవ మెక్కువయయి జ్ఞానాభివృద్ధి కలిగినకొలఁదిని జనులు సృష్టిలోని ప్రతివస్తువులోను దేవుని బుద్ధిబలము కనిపెట్టి దేవుని సర్వశక్తునిగా మాత్రమే కాక సర్వజ్ఞునిగాఁగూడ భావించి యద్భుతప్రమోదములతోను భయముతోను నర్చించుచుండిరి. జ్ఞానాభివృద్ధి యధికమయి మనుష్యతత్త్వము చక్కఁగా తెలియ నారంభించిన తరువాత జనులు దేహబలము కలవానికంటెను జ్ఞానబలము కలవానికంటెను నీతిబలము గలవాని నెక్కువగా గౌరవించి, ఎవ్వఁడు సత్యము తప్పకుండునో యెవ్వఁడు ఋజుమార్గమున ప్రవర్తించునో యెవ్వఁడు పరోపకారపారీణుఁడగునో యట్టివానిని ప్రేమించి దేవాంశకలవానినిగా భావింప మొదలుపెట్టిరి. అప్పుడు మనుష్యు లీశ్వరవిషయమున గూడ నభిప్రాయములు మాఱినందున, దేవుని సర్వశక్తునిగాను సర్వజ్ఞునిగాను మాత్రమేకాక సత్యస్వరూపునిగాను సర్వకారుణ్యునిగాను గూడ భావించి ప్రేమించి, యద్భుతభయభక్తులతోఁ బూజింప నారం

భించిరి ఈప్రకారముగా మనుష్యుని యభిప్రాయములోను మతము లోను నభివృద్ధి కలుగుచున్నను, నీతివిషయమున నింకను దగినంత దృఢనిశ్చయము కలుగలేదు. కొందఱు మతవిషయమున మార్పులు కలుగుచుండరాదని వాదింపఁ జూతురుగాని మనుష్యునితో సంబం ధించిన సమస్తవిషయములయందును నభివృద్ధి కలుగుచుండఁగా నాత్మోజ్జీవనమున కాధారమయిన మతవిషయమునం దేల యభి వృద్ధి కలుగరాదందురో యూహించుటకు శక్యముకాకున్నది. ఆత్మ తత్త్వ మధికముగాఁ దెలిసిన తరువాత మునుపటివలె నీశ్వరుఁడు భయమునకు హేతువయినవాఁడుగాక ప్రేమాస్పదుఁడయి కారుణ్య గుణమునుబట్టి దరిఁజేరవలసిన తండ్రి యయినాఁడు. ఇంకను జ్ఞానాభి వృద్ధి యైనకొలఁదిని దేవుని కళ్యాణగుణము లింకను క్రొత్తవి యేవి బయలఁబడునో యెవ్వరెఱుఁగుదురు ? అందువలన మనకెట్టి యధికా త్మానందము కలుగునో యెవ్వరూహింపగలరు ? ఏవిషయమునం దభివృద్ధికి భంగము కల్పించినను మనకనేకనష్టములు కలుగును. అందులో ముఖ్యముగా మతమను పేరుపెట్టి యాత్మాభివృద్ధికి భంగము కలిగించెదు పక్షమున, కలిగెడు యనర్థ మింతంత యని చెప్పనలవికాదు. ఒకవేళ మానుషధర్మమునకే భంగముకలుగ వచ్చును. కాఁబట్టి యెల్లవారును దా మాత్మాభివృద్ధికి విఘ్నము కలి గించుమార్గమును గొంచెమయినను తలపెట్టకుందురుగాక ! జ్ఞానము నందును నీతియందును వృద్ధిలేకపోవుటయే మానుషధర్మమునకు భంగము కలుగుట. ఆత్మ మార్పులేక యెల్లకాలము నేకరీతిగా నుండు స్వభావము కలదికాదు—జ్ఞానాధిక్యాదులచేత దేవత్వమునైనను సమీపించుచుండును; లేదా తదభావాదులవలన మృగత్వము నయి నను సమీపించుచుండును. కాబట్టి వివేకియైనవాఁ డప్రమత్తుఁ

డయి యాత్మను మృగత్వమును సమీపింపనియ్యక జ్ఞానాభివృద్ధిచే నీశ్వరుని సమీపింపఁ జేయుటకే సర్వదా పాటుపడుచుండవలెను. ఈశ్వరుని సమీపించుట కనుకూలమగునట్లుగా నిహలోకయాత్ర నడుపుచు నాతనిని పొందయత్నించుట మనుష్యునకు బరమార్థము. పాపవిమోచనమును బొంది సద్వర్తనముచే నీశ్వరునిబొంది యానందింపఁ గలుగుటయే ముక్తి—అనఁగా పాపమునుండియు మృగత్వమునుండియు విముక్తులమయి నిత్యానందమును బొందుటయే ముక్తి. ఆత్మగుణముల నన్నిఁటిని వృద్ధిచేసికొనుటయే ముక్తిమార్గము. అన్ని శక్తులను సమానముగా పెంపుచెందించుట వృద్ధి కాని యొకదానికి నష్టము కలుగునట్లుగా మఱియొకటి పెరుగుట వృద్ధి కాదు. శరీర విషయమయిన వృద్ధిని ముందుగా జూడుఁడు. దేహముయొక్క సమస్తావయవములును సమానముగాను బలప్రదముగాను పెరుగుట వృద్ధి యగునుగాని యొక్క తలగాని పొట్టగాని కాలుగాని బలియుట వృద్ధికాదు; అట్లొక్క యవయవము మాత్రమే పెరిగినచో దయ్యావు తలయనియు, బానకడుపనియు, బోదకాలనియు పేరులుపెట్టి దానిని వ్యాధిమూలముగా నెంతురు; బలములేక యుబ్బురోగము నందువలె దేహమంతయు బలియుటయు వృద్ధి కానేరదు. కాఁబట్టి యీవిధముగానే యాత్మవిషయమున జ్ఞానమును, నీతియును, ప్రేమాదులును, ఈశ్వరభక్తియును, సమానముగా వృద్ధినొందవలెను. ఇట్టి యభివృద్ధిని, పాపపరిహారమును బొంది నిత్యానందమునకయి ప్రయత్నించుట యెల్లవారికిని సహజగుణము. జ్ఞానాభావాదులచేతను తత్త్వవిచారము లేకపోవుటచేతను మనుష్యులు తప్పుదారులు త్రొక్కుచున్నను, నిత్యానందపదవి నిమిత్తమయి కృషిచేయవలెనన్న యభిలాషమాత్ర మనివార్యమయి పామరుఁడు మొదలుకొని పండితుని

వఱకును గల ప్రతిమనుష్యుని హృదయము నందును దృఢముగా నాటు కొనియున్నది. ఈ నిత్యపదవి నిమిత్తమే మూఢులుపవాసములుచేసియు తీర్థసేవలుచేసియు, నిప్పులుత్రొక్కియు, శూలములు గ్రుచ్చుకొనియు బాధపడుచున్నారు; జ్ఞానుల మనుకొను సన్యాసులు ప్రేమాస్పదులయిన భార్యాపుత్రాదులను ధనవస్తువాహనములను తక్కిన సమస్తప్రాపంచికసుఖములను త్యజించుచున్నారు; మోఁగు లెండలలో మాడియు, పంచాగ్నిమధ్యమున వసించియు, కాళ్ళును చేతులును శుష్కింపఁ జేసియు, ఆకలములు తిని యేకాకులయి తిరిగియు, శ్రమపడు చున్నారు. మోక్షాపేక్ష యెల్లవారికిని దుర్వారముగానున్నను తత్త్వ విచారము చేయక యంధపరంపరగా వర్తించుచుండుటవలనఁ బలువురు సత్యమైన మార్గమును దెలిసికోలేక భ్రమపడి తిరుగుచున్నారు. మనలను మోక్షమునకుఁ గొనిపోయెడు రాజమార్గము పయినజెప్పిన రీతిగా జ్ఞానాదులను వృద్ధిపఱచుకొని, యీశ్వరునియందు సంపూర్ణ విశ్వాసము గలవారమయి మనకీశ్వరుఁడు విధించి యున్న ప్రకారముగా మనలోపల వెలుఁగు జ్ఞానజ్యోతి ననుసరించి మనయంతరాత్మ బోధించు నీతిమార్గమున వర్తించుట యొక్కటియే. కాఁబట్టి యెల్లప్పుడును నీతిమార్గముననే నడచుచుండుట మనకు విధి; ఎన్నినష్టముల కయిన సహించి నీతిమార్గానుసరణమనెడి యీశ్వరాజ్ఞను నిర్వహించుట కెల్లరమును బద్ధులమయి యున్నాము. ఆత్మాభివృద్ధినిబట్టి యీ కర్తవ్యతాబుద్ధి మనుష్యులలో బలపడును.

ఆత్మాభివృద్ధి యైనకొలఁదిని జీవుఁ డీశ్వరునితోడి బంధుత్వమును దృఢపఱచుకొని యాతని సామీప్యమును బొంది నిత్యసేవ వలన నీశ్వరసాంగత్యసుఖము ననుభవించుచుఁ బాపదూరుఁడయి నిత్యానందపదవి నొందఁగలుగును. ఈశ్వరుఁడు సకలకళ్యాణగుణ

సాగరుఁడు; జీవాత్మలు నీతిరసప్రవాహములు. నదులు సముద్రమును జేరఁబోవునట్లుగానే మన యాత్మలును పరమేశ్వరుని జేర సంతత యాత్ర చేయుచుండవలెను. ఆత్మధర్మమయిన నీతియం దభివృద్ధిని బొంది పురోయాత్ర చేసినకొలఁదిని మనయాత్మ లీశ్వరుని సమీపించు చున్నవని చెప్పుదురు. నీతియం దభివృద్ధి నొందుటయే మనుష్యుని లోని దేవాంశమును వృద్ధినొందించుట. కాఁబట్టి మనుష్యనామమును ధరించినవాఁడెల్లను తా నొకదినమునకంటె నొకదినము మఱింత పరిశుద్ధుఁడగుచు తనయందలి దేవాంశమును వృద్ధినొందించుటకు పాటుపడుచుండవలెను. మనుష్యుఁడు తానేవృత్తి నవలంబించినను, ఏపనిచేయుచున్నను, నీతిమార్గమును విడువక పవిత్రమయిన మనుష్య నామమునకు తానర్హుఁడగునట్లుగా ప్రవర్తింపవలెను. మనుష్యుఁడను పేరులోనే యెంతగౌరవమున్నది! అది రాజనామముకన్నను, శాస్త్రి నామముకన్నను, గౌరవావహమయిన యే యితర నామముకన్నను, మిక్కిలి యుత్కృష్టమైనది. రాజ్యాధికారముచేత నొకఁడు రాజ య్యును నీతి లేకపోవుటచేత పశువు కావచ్చును; విద్యావైభవము చేత నొకఁడు శాస్త్రియయ్యును నీతిలేకపోవుటచేత మృగము కావచ్చును. ఇహలోకవైభవము లేవి లేకపోయినను మానుషధర్మ మును విడువక చరించినవాఁడొక్కఁడే యీశ్వరదృష్టికి గొప్పవాఁ డును, తదనుగ్రహపాత్రుఁడును అగును గాని మానుషధర్మమును మీఱుటచేత మనుష్యనామమున కపాత్రుఁడైన రాజును, శాస్త్రియు, గారు. నీతి మానుషలక్షణమనియు, నీతిలేమి పశులక్షణమనియు, దృఢముగా తెలిసికొని మన మెప్పుడును నీతిపాశమునకు బద్ధులమై ప్రవర్తింపవలెను; నీతిపాశమే యీలోకములో మనుష్యులను బరస్ప రమును గూర్చెడి యనుబంధము, ఈ యనుబంధమే మిక్కిలి పావన

మైనదియు, భూమిలోఁగల సమస్తగుణబంధములలోను స్థిరమయిన దియు అయియున్నది. నీతిపాశముతుబట్టియే జను లన్యోన్యభ్రాత లయి యేకమగుచున్నారు; ఈ బంధము విడిపోయెనా జనులైక మత్యములేక చెదరి పరస్పరశత్రు లగుచున్నారు. 'నీతి' యని నే నిక్కడ నొక్క చిన్నపదమును జెప్పుచున్నను దానిలో నెంతో యర్థ మిమిడియున్నది; ఆచిన్నపదములో సత్యము, కారుణ్యము, క్షమ, పరోపకారము, మొదలైన గుణములనేకములు చేరియున్నవి. వానిని వివరించుట కిప్పుడవకాశము లేదు. వానిలో నొక్కొక్కదానిని గూర్చి ప్రత్యేకముగా నెంతెంతో చెప్పవలసియున్నది. నీతిబలము ముందు ప్రపంచములోని యనావశ్యకములైన భేదములన్నియు గాలికి దూదిపింజె లెగిరిపోవునట్లు చెల్లాచెదరగును. నీతిమంతుఁ డెవఁడో వాఁడే సర్వోత్కృష్టుఁడగుటచేత, నీతిబలమునుబట్టి యధమ జాతివాఁడును పూజనీయుఁడగును. నీతిరతియొక్కటియే మనకీశ్వరుఁ డనుగ్రహించిన శ్రేయస్సులలో నెల్ల మహోన్నతమయినది. ధర్మ రతియు, యుక్తాయుక్తములను దెలిసికొని యుక్తము నాచరించు మతియు, భగవదాజ్ఞారూపమున హృదయములో నంతరాత్మ చేయు బోధమును, పుణ్యాచరణసామర్థ్యమును, — ఇవి మనుష్యునకుఁగల గుణరత్నములు. లోకములో వీనికన్న నున్నతగుణము లేవియు లేవు. దేవతలయందుసహిత మింతకంటె మహత్తరమయినది వేఱేదియు లేదు. ఈగుణములు పూర్ణముగా నున్నప్పుడు దేవతలకును మనుష్యు లకును భేదము లేకయేపోవును. అప్పుడు భూలోకమే స్వర్గలోక మగును; మనుష్యులే దేవతలగుదురు. ఈగుణములను వృద్ధిపొందించు కొనుకొలఁదిని మనుష్యుఁడు దేవత్వమును సమీపించుచుండును. నీతి మార్గము ననుసరించి ప్రవర్తించుపక్షమునఁ బ్రతిమానవుఁడును నిరం

తరాభివృద్ధియు నిరతిశయానందమును బొందఁగలుగును. నీతివర్తనము స్వర్గమార్గము; నీతిరాహిత్యము నరకమార్గము. ఎప్పుడు మనస్సులలో యుక్తాయుక్తజ్ఞాన ముద్భవిల్లి యుక్తమార్గమున నడువవలయుననియు, అయుక్తమార్గమున నడువఁగూడదనియు మనయంతరాత్మ బోధింప మొదలుపెట్టెనదో యప్పటినుండియు నీతిమార్గమును మీఱి చరింప కుండుటకు మన మీశ్వరునకు బద్ధులమై యున్నాము. మన మనస్సులలో నుదయించి భాసిల్లుచున్న యీ యుక్తాయుక్తవివేకజ్ఞానమే యీశ్వరుఁడు మన కనుగ్రహించిన సత్యవేదము. తక్కిన వేదము లన్నియు దీని ననుసరించి బుద్ధిమంతులచేఁ గాలానుగుణముగా వ్రాయఁబడినవే. హృదయఫలకమునం దీశ్వరలిఖితమైయున్న యీనీతి బోధమే మన కీశ్వరునితోడి చుట్టఱికమును నెఱపి మనల నాతని నిత్యానందసామ్రాజ్యమును చూఱగొనునట్లు చేయును. ఈ జ్ఞానోదయమే స్థిరముగా మనల నీశ్వరగుణబద్ధులను జేయును. ఈజ్ఞాన ప్రకాశముచేత ధర్మరతి యెవ్వని హృదయమునందు దృఢముగా నాటుకొనునో వాఁడా దినమునుండియు ప్రపంచమునందలి యెవ్వరి చేతను మరల్పరాని యొకపాశమునకు బద్ధుఁడయి, ఈశ్వరునితోడ విడిపోని నూతనబంధుత్వమును పొంది, తనహృదయములో దివ్యాక్షరములతో లిఖింపఁబడియున్న యీశ్వరాజ్ఞ కొక్కదాసికే లోఁబడి, అంతరాత్మ బోధించు శాసనముల ననుసరించుటయే శాశ్వతానందమునకు మూలమని నమ్మి, లోకములోని దేది యెట్లయినను సమస్త విషయములయందును తనయంతరాత్మను తన్మూలమున పరమేశ్వరుని సంతోషపెట్టుటకే ప్రవర్తించుచుండును. ఈ యంతరాత్మ బోధించు బోధమే శాశ్వతానందమహావృక్షమునకు బీజము. ప్రతి విషయమునందును దానిని తప్పక యనుసరించుచు వచ్చిన ఫలమున,

మనము కృతార్థులమయి దినదినాభివృద్ధినొంది సత్యపదవి నొందుదుము; దానిఘోషమును పెడచెవిని బెట్టి తద్వాక్యముల ననాదరణము చేసినపక్షమున, మనము దుఃఖభాజనులమై యీశ్వరానుగ్రహమునకు దూరుల మగుదుము. ఆత్మావబోధమునుబట్టి యీశ్వరానుగ్రహమువలన న్యాయవర్తనము నెవ్వరు పొందఁ గలుగుదురో వారెల్ల ప్రేమానుబంధముచేత బద్ధులయి పరస్పర సోదరస్నేహము గలవారగుదురు. ఈసోదర వాత్సల్యమునకు నీతిరతి యొక్కటియే కారణముగాని లౌకికాధికారమును ధనసంపదయు సత్కులప్రసూనత్వమును గారణములు గావు. ఇహలోకసంపద లెల్లను గలిగియున్నను నీతిబాహ్యుఁ డగుటవలన మనుష్యుఁడు ధర్మదృష్టికి పశుప్రాయుఁడయి యీశ్వరసాంగత్యమున కనర్హుఁడు కావచ్చును. ఇహలోకసంపద లేవియు లేకపోయినను నీతిమంతుఁడగుటవలన మనుష్యుఁడు దేవతుల్యుఁడయి యీశ్వరసాంగత్యమున కర్హుఁడు కావచ్చును. కాఁబట్టి మోక్షానందపదవికిని ఐహికౌన్నత్యమునకును సంబంధమేదియు లేదు. మన మొకవేళ వారిపేరుల నయినను వినకపోయినను నిజమయిన నీతిమంతు లీలోకమునందు విస్తారముగా బీదవారిలోనే యుండవచ్చును. మిక్కిలి దుర్లంఘ్యములైన వ్యామోహములకు లోఁబడనివారును, దుస్సాధ్యములయిన ధర్మకార్యములను పూనికతో నిర్వహించినవారును, ఎటువంటి యాపదలు వచ్చినను వెనుకతీయక యొక్క యీశ్వరుని ప్రాపునే నమ్ముకొని తదాజ్ఞానుసరణమే నిత్యకృత్యముగా ప్రవర్తించినవారును, దుస్తరములైన పాపసముద్రముల నీఁది యతికష్టపడి దుష్టుల బాధలను సహించి పరిశుద్ధమయిన జీవయాత్రను చేసినవారును బీదవారిలోనే యుండవచ్చును. ఈశ్వరునిదృష్టియందిట్టివారు మాత్రమే నిజమైన గొప్పవారు. గొప్పతన మెప్పుడును నీతి

బలములోను, భగవదాజ్ఞానుసరణములోను, కష్టములను ధైర్యముతో సహించుటలోను, ఇంద్రియనిగ్రహములోను, ఉండును గాని ధనికత్వ దరిద్రత్వములలో నుండదు. కండక్రొవ్వువలన నింద్రియములుద్రేకించి దుర్మార్గమున కాకర్షించునప్పుడు వాని యుద్రేకమును ధర్మపాశములచే నణఁచి పోరాడి వానిని యుక్తమార్గమునకుఁ ద్రిప్పి యాధ్యాత్మికబోధమువలన నింద్రియవర్గమును నిగ్రహించి తనయధీనములో నుంచుకొనుటకయి పాటుపడుట మనుష్యధర్మము. ఇంద్రియబద్ధుఁడయి యింద్రియసుఖములకు దాసుఁడుగాక యింద్రియనిగ్రహము చేయఁగలిగిన పురుషుఁడే నిజమయిన పౌరుషము గలవాఁడు. ఇంద్రియనిగ్రహము చేసి మంచిమార్గముల నడువలేని పుణ్యభీరుఁడు మీసములు మొదలయిన సమస్తపురుషచిహ్నములను గలవాఁడైనను పౌరుషహీనుఁడే. పాపముతోడి పోరాటమువలనను, కష్టములకును బాధలకును చలింపక నీతిపథమున నిలుచుటవలనను మాత్రమే మనుష్యుఁ డధికుఁడగును. కష్టములును, నిర్బంధములును వచ్చినపుడు ధర్మమార్గమును తొలఁగనివాఁడొకఁడే మహానుభావుఁడు; అతఁడొక్కఁడే మానుషధర్మముగలవాఁడు. పాతకభూతములతో పోరాడి గెలువఁ గలిగినప్పుడే యాత్మ కనిర్వాచ్యమైన, యనుభవైకవేద్యమయిన యానందము కలుగును. ఈశ్వర మహిమను భూమియందు భాసిల్ల జేయుటకయి పాపపిశాచములతో వీరభటునివలె నిరంతరయుద్ధము చేయుచుండు వానికే యీశ్వరుఁ డెప్పుడును సహాయుఁడయి జయమును గలిగించుచుండును. ధర్మ మెక్కడ నుండునో యీశ్వరుఁ డక్కడనుండును; ఈశ్వరుఁ డెక్కడనుండునో జయమక్కడఁ గలుగును. కాఁబట్టి లోకములో ధర్మబలముతో సమానమయిన బలము వేఱొకటి లేదు. ఈశ్వరుఁడు మంచికార్యముల కెప్పు

డును త్రోడుపడుచుండుట సత్యమే యయినను, అతని సాహాయ్యమును పొందుటకు మన మర్హులమని చూపుటకై పిఱికికండలేని వీరభటులవలె నసహాయశూరులమయి నిలిచి మనము పాపములను పెనుభూతములపయి ధ్వజమెత్తి వానిని నిర్మూలనము చేయుటకయి యెల్లప్పుడును నడుముకట్టుకొని నిర్భయముగా ముందుకు నడుచుచుండవలెను; అప్పుడు పాపభూతావిష్టులయియున్న వారివలనను దీర్ఘకాల దురాచారపిశాచావేశపరవశులయియున్న వారివలనను, మూర్ఖతారాక్షసప్రేరితులయిన వారివలనను మన కనేకవిధములయిన కష్టములు రావచ్చును. గాయములు లేని పోరాట మెక్కడను గలుగదు; గాయములకు వెనుకతీసెడు వీరభటత్వమును గలుగదు. క్షణభంగురములయిన యిహలోకసంపదల నిమిత్తము పోరాడునప్పుడే వీరుఁడైనవాఁడు శరీరమును విడువఁ దెగింపవలసియుండఁగా, పారలౌకికశాశ్వతానందపదవికై పెనఁగులాడెడు సత్కార్యశూరుఁడు విడువగూడని దీలోకములోని దేదియుండును? కష్టము లన్నిప్రక్కలను వచ్చి చుట్టుకొన్నప్పుడును, బంధుమిత్రాదులు సహితము ప్రతిపక్షులయి ద్వేషించి మహాధైర్యశాలికి సహితము భయమును నిరాశయు కలుగునట్లుగా బాధించుచున్నప్పుడును, మన దుర్బలత్వమును దెలిసికొని యీశ్వరసాహాయ్యమును వేఁడి తత్సామీప్యమువలన నూతన బలోత్సాహములను బొంది పాపబలనిర్మూలనమునకయి యమానుష ధైర్యమును జూపవలెను. అట్లు చేసినప్పుడే మనుష్యుని గొప్పతనము వెల్లడి యగును. ఘటనాఘటనసమర్థుఁడయిన యీశ్వరుని ప్రాపువలన ధర్మశూరుల వజ్రహృదయములనుండి ప్రతిపక్షులు ప్రయోగించు వ్యాఘాతశిలల తాకుడువలన నార్పరాని యుత్సాహాగ్ని యుదయించి పురాణములయందు వర్ణింపబడిన బ్రహ్మాస్త్రమువలె నమోఘ వైరి

విజయకారణము కావచ్చును. ఇట్లుత్సాహవాక్యములు పలుకునప్పు డుపదేశమునం దిది యంతయు మనోహరముగా నేయున్నది గాని యను ష్ఠానసాధ్యమగునా ? యని కొందఱి హృదయములయందు సందేహము గలుగవచ్చును. అయినను నేనిప్పుడు చెప్పినదంతయు భగవచ్ఛక్తి యందు సంపూర్ణవిశ్వాసముగల ధర్మశూరులకుఁ బరమసాధ్యమే కాని యిందసాధ్యమేదియు లేదు. ఇట్టి సర్వజన శ్లాఘనీయమయిన పవిత్రచరిత్రముగల మహాత్ముల మహిమలను మనము పూర్వచరిత్ర ములయందుఁ జదివియున్నాము. సత్యము నిమిత్తమై సర్వకష్టముల కును లోనయి సమయము వచ్చినప్పుడు తమప్రాణములను సహితము తృణప్రాయముగా విడిచిన కీర్తికాయు లనేకులు చిరకాలము క్రిందటనే స్వర్గస్థులయ్యును నేఁటివఱకును మృతజీవులయి మన హృదయనివాస మును విడువక సమస్తసత్కార్యాచరణములందును మనకపరిమితో త్సాహసాహసములను కలిగించుచున్నారు. అట్టివారి చరిత్రములను పూర్ణముగా వివరింపవలసినదేకాని యట్టిపని కిది సమయముకాక పోవుటచేత దానినింకొకసారికి విడిచిపెట్టి యిప్పుడు సత్కార్యాచరణ మున కావశ్యకములయిన మనోధర్మములనుగూర్చి కొంచెము చెప్పెదను.

ఒక్క సత్కార్యమును పూని నిర్వహించుటకయి మనుష్యునకు మొట్టమొదట మనోనిశ్చయ మొక్కటి యుండవలెను. మనోనిశ్చ యము లేకపోయినపక్షమున, మనుష్యుఁ డెంతటి శక్తిసంపన్నుఁడయి నను దుర్బలుఁడయి యేకార్యమును పూనుటకును సమర్థుఁడుకాక పోవును. మనోనిశ్చయము కలుగుటకయి యాత్మగౌరవ మావశ్య కము. ఆత్మగౌరవమనఁగా తనశక్తియందు తనకు విశ్వాసముంచుట. ప్రతిమనుష్యునకును తాను శక్తిమంతుఁడననియు బుద్ధిమంతుఁడననియు

కొంచెముగానో గొప్పగానో మనస్సులో గర్వముండవచ్చునుగాని తా నొకపని చేయవలసివచ్చినప్పుడు మాత్రము కష్టములు వచ్చునేని వాని కప్పుడా యహంకారము నిలువదు. ఇట్టి పనికిమాలిన యహంభావమాత్మ గౌరవము కాదు. తన సదభిప్రాయములతో నితరు లేకీభవింపనప్పు డును, తనపూనిక కితరులు విఘ్నము లాచరించుచున్నప్పుడును, తన కార్యమువలనఁ గష్టములు వచ్చునప్పుడును, నిరుత్సాహుఁడుగాక తనయాలోచనయందు విశ్వాసమును దనశక్తియందు గురుత్వమును గలిగియుండుట యాత్మగౌరవము. మనతో నేకీభవింపనంతమాత్ర ముచేత ననాదరముచేయక యితరుల యభిప్రాయములయం దుచిత గౌరవముంచుట మనకు ధర్మమే యయినను, మన యభిప్రాయములు సరియైనవని మనము దృఢముగా నమ్మియున్నప్పుడు మాత్ర మితరుల మాటల నాదరించి మనపూనికను విడువఁగూడదు. తనకొక దృఢనిశ్చ యములేక యితరుల యభిప్రాయములనే నమ్మియుండువాఁడు తా నేపనియందును స్వతంత్రుఁడుగాక మహావాయుపథమునఁబడిన కాకి యాకువలె గాలి విసరిన దెసలకెల్లను దూలుచు స్వగౌరవమును లేనివాఁడగును. అట్టివాఁ డల్పకార్యమును సహితము స్వతంత్రముగా నిర్వహించుటకు శక్తుఁడుగాక వఱదకు గొట్టుకొని పోవుపుడకవలె నిటునటు నూగులాడుచు నొకత్రెన్నునఁ బోవక యాచారప్రవాహ మీఁదీవల్లెలను జనుచు వ్యర్థుఁడగును. కాఁబట్టి కార్యశూరునకు దృఢనిశ్చయ మావశ్యకము. గ్రహణశక్తియు సాధనసంపత్తియుఁ గావలసినంతయున్నను దృఢనిశ్చయము లేకపోవుటవలన ననేకుల యందు వాక్శూరతయేకాని కార్యశూరత కానరాకున్నది. కార్య భీరుత పురుషలక్షణము కాదు; కాఁబట్టి సత్కార్యాచరణపౌరుషము గలవాఁ డితరు లేమనుకొందురోయన్న సందేహమును విడిచి ధైర్య

సాహసములను బూని తాను దృఢముగా నమ్మినదాని ననుష్ఠించుటకు బద్ధకంకణుఁడు కావలెను. ఉపదేశమునకంటె ననుష్ఠాన మెంతో శ్రేష్ఠమయినది. మనదేశమునందు శుష్కోపదేష్టలు నక్షత్రము లంతమంది యున్నను, అనుష్ఠానసమయమునం దా నక్షత్రము లంత మందియు దివానక్షత్రములంతిమంది యగుచున్నారు. మనదేశమునం దిప్పు డుపదేష్టలకంటె ముఖ్యముగా ననుష్ఠాతలు కావలసియున్నారు. వేయిమాటలు చెప్పుటకన్న నొక్కకార్యమునుజేసి చూపినయెడల జనులకు వారియందెంతో యధికగౌరవము కలుగును; క్రియావంతు లయినప్పుడు మాత్రమే జనులు వారి ననుసరింపఁజూతురు. పుస్తకములయందు మంచివారి చరిత్రములను జదివినప్పుడును, మంచియుపన్యాసములను విన్నప్పుడును, కొంతవఱకెల్లవారికిని సత్కార్యములు చేయవలెనన్న యభిలాష కలుగవచ్చును గాని యీయభిలాషము సత్ప్రవర్తనమును కన్నులార చూచినప్పుడున్నంత బలిష్ఠముగాను కార్యకరముగాను మఱియొకప్పుడుండదు. ఒకవేళ నితరులు తన్ననుసరింపకపోయినను, తాను సత్యమని యెఱిఁగినదాని ననుష్ఠించుట మనుష్యునకు ధర్మము. తానాలోచించి శ్రమపడి కనుఁగొన్న సత్యమును దాననుష్ఠించి ఫలమును బొందకపోయినయెడల దానివలనఁ బ్రయోజనమేమి? తనసత్యము తనకే పనికిరానియెడల నితరులకేమి పనికివచ్చును? తనప్రవర్తనమును తాను సంస్కరించుకోలేనిపక్షమున లోకము నేమిసంస్కరింపఁ గలుగును? లోకమును సంస్కరింపఁబూనుటకు ముందుగా సంస్కారము తనతో నారంభము కావలెను. ఒక్కఁడు తనప్రవర్తనమును జక్కఁజేసికొన్నను లోకములోని దుష్టవర్తనుల సంఖ్యలో నొక్కటి తక్కువగును. ఈప్రకారముగాఁ బ్రతిమనుష్యుఁడును తననడతను దిద్దుకొనుటకుఁ బ్రయత్నించినపక్ష

మున, కొంతకాలములోనే లోకమంతయు చక్కపడవచ్చును. అట్లు కష్టపడి తనవర్తనమును బాగుజేసికొనఁజూడక ప్రతిమనుష్యుఁడును దాను పయినుండి సులభముగా లోకమును సంస్కరింపవలెనని యాలోచించుచుండుటవలన మనదేశమునం దేవిషయమునను సంస్కారము సాగకున్నది. కష్టపడి పనిచేసినచో సంస్కారము జరుగునుగాని మంత్రములవలన జరగదు. అజ్ఞానాంధకారముచేత మార్గము దుర్గమమయియున్నప్పుడు ధర్మాచరణధైర్యము గలవా రెవ్వరయినను ముందుగావచ్చి కష్టపడి మార్గమును ఛేదించి దారిచూపి పని చేయవలెను. తెలియనివారికి తెలిసినవారు దారిచూపుట మానవ ధర్మము. తెలియనివారు చూపెడు తప్పుదారినే తెలిసినవారు పోవుట యధర్మము. కాఁబట్టి యజ్ఞానములోఁ బోరాడి మనము మూఢులకు త్రోవచూపి వారు మనత్రోవ ననుసరించునట్లు చేయవలెనుగాని మూఢులను సంతోషపెట్టుటకొఱకు మనమే వారిదారి ననుసరించుట నీతికాదు. మూఢులను కూడఁగట్టుకొని రావలెనని నీతిమాలి మూఢమార్గమునఁ దెలిసియు విపరీతముగాఁ బ్రవర్తించుచు వచ్చినపక్షమున, క్రమక్రమముగా మనము నిజముగానే మూఢులమయి యెన్నటికిని కడతేరనివార మగుదుము; సంస్కార మెన్నటికిని జరగదు. కాఁబట్టి యింకను కాలమురాలేదని యూరకుండక యెల్ల వారును యథాశక్తిని లోకమునకు మేలుచేయుటయందుఁ బ్రవర్తింపవలెను. కాలమురాలేదనుట నీతిభీరులవచనముగాని కార్యశూరు లనవలసిన మాటకాదు. విడువక కృషిచేయుచు వచ్చినచో కాలము తనంతనే వచ్చును. కృషిచేయక యెల్లవారును కాలము యొక్క రాకకే వేచియుండెడుపక్షమున కాలమెప్పటికిని రానేరదు. ఎంతోకాలముక్రిందటనే లోకాభివృద్ధి నిమిత్తమయి యెంతో కష్ట

పడి పరోపకారపరాయణులయిన మహానుభావు లనేకు లెన్నెన్నో ఘనకార్యములను నిర్వహించియున్నారు. ధర్మశూరులైన యామహాత్ములకు వెనుకనే కాలమువచ్చినను ధర్మభీరులయినవారి కింకను కాలము రాకున్నది. అట్టివారియొద్ద కెన్నటికిని రాదు. దృఢనిశ్చయమునకు కాలముసహిత మెప్పుడును లోఁబడియే యుండునుగాన దృఢనిశ్చయముగలవాఁ డెట్టికార్యమునైనను ఎప్పుడైనను సాధింపఁగలుగును. దృఢచిత్తునకు తన చింత పరిశుద్ధమయి యీశ్వరునకు ప్రీతికరమయినప్పు డితరుల యభిప్రాయముతోఁగాని మెప్పుతోఁగాని పని యుండదు. తనకు సత్కార్యాచరణమునందు దృఢచిత్తములేక యితరుల నాలోచన యడుగఁబోయినప్పు డనేకు లనేకవిధములుగాఁ జెప్పుదురు. వారిలోఁ గొందఱామోదింతురు; కొందఱు పరిహసింతురు; కొందఱు భూషింతురు; కొందఱు దూషింతురు. అట్టిసమయమునం దట్టివానిచిత్తము స్థైర్యమును విడిచి గాలిలోనిదీపమువలె నల్లలాడుచుఁ బనికిమాలినదగును. కాఁబట్టి బుద్ధిమంతుఁడైనవాఁడు ముందుగానే చక్కగా నాలోచించుకొని తాను తలపెట్టిన పనియొక్క యుద్దేశము మంచిదయినపక్షమున, నడుమ నెన్నికష్టములు వచ్చినను తాను పూనినపనిని విడువక కొనసాగించుటకు దృఢనిశ్చయము చేసికొనవలెను. అట్టిదృఢనిశ్చయమే కార్యసిద్ధికి మూలము; దృఢనిశ్చయముగలవాఁడు తనకు సాధనకలాపము లేకపోయినను, విఘ్నములు వచ్చినను, జడియక యెప్పుడును కార్యసాధనమునందే దృష్టి యుంచును. లోకములోఁ గొందఱు తమకు ధనమును, బలమును, బుద్ధియు, అధికారమును, పాండిత్యమును, ఉండియున్నయెడలఁ దామెంతో లోకోపకారమును చేయఁగలుగుదుమని చెప్పుదురు. ఇవి యన్నియు నున్నను మనోనిశ్చయము లేకపోవుటచేత నేమియుఁజేయని

వారిని, ఇంచేమియు లేకపోయినను మనోనిశ్చయ మొక్కటి యుండు టచేత ననేకసత్కార్యములను జేయఁగలిగినవారిని, మన మెందఱినో కనియు వినియు నున్నాము. కాఁబట్టి కార్యసాఫల్యమునకు మనోనిశ్చయము ప్రథమసాధనము.

ఎంతటి మనోనిశ్చయమున్నను లోకహితార్థముగా నూతన కార్యమును పూని క్రొత్తత్రోవను ద్రొక్కువారికి కష్టములు రాక మానవు. అప్పుడు మనోనిశ్చయమునకు తోడు ధైర్యమును రెండవ సాధనముగా వహింపవలెను. ధైర్యముగలవాని కాకష్టములే కార్య నిర్వాహణమునకు ప్రోత్సాహకరములును విజయదాయకములును అగును. ఈశ్వరప్రీతికయి యొకసద్ధర్మమును బ్రతిష్ఠింపఁ బాటుపడు వారికి వచ్చెడుకష్టము లనేకములుగా నుండును. మన మెవ్వరిక్షేమము నిమిత్తమయి సత్కార్యదీక్షను వహింతుమో వారే మనకు ద్వేషు లయి కార్యవిఘాతమునకుఁ బ్రయత్నింతురు. లోకోపకార మొక్క టియే మన కర్తవ్యకృత్యము; లోకులు దానికర్హులయినను గాకపోయి నను, ప్రపంచము దానినంగీకరించినను అంగీకరింపకపోయినను కూడ లోకమునకు మేలు చేయఁగడఁగుట మానవరూపమును ధరించిన మన కుత్తమధర్మము. అట్టిపని భగవంతుని కెప్పుడును తృప్తికర ముగా నుండును; అందువలన మనయంతరాత్మయు సంతోషించును. ఆత్మానందమున కీశ్వరుని మెప్పు కావలసినదే కాని లోకముయొక్క యంగీకారముతోఁగాని మెప్పుతోఁగాని పనిలేదు. లోకమునకు మనము చేయఁబూనిన యుపకారమునకు మనము జనులవలన ప్రత్యు పకారమునుగాని కృతజ్ఞతనుగాని శ్లాఘననుగాని యపేక్షింపక ఫలనిరపేక్షముగా పరమేశ్వరప్రీతికయి యది ధర్మమనుబుద్ధితో చేయవలెను. ఇతరుల యనుగ్రహమును మెప్పును సత్కార్యత్యాగము

నకు ప్రతిఫలములు కానేరవు. గనుక మనము వానిని సరకుగొనక కష్టములను సహించి ధైర్యముతో నిలువవలయును. ఇటువంటి సమయములయందు మనకావలకు తోడ్పాటుగానున్న మిత్రులు సహితము మనలను చేయివిడుతురు; బంధుజనులు పరిత్యజింతురు; సహాయులు దూరముగా తొలఁగుదురు. లోకమంతయు మనలను విడిచినను విడువనిమ్ము. ఎవ్వరు మనలను విడిచినను మనము ధైర్యమును మాత్రము విడువక ధర్మబలమును నమ్మికొని యసహాయశూరులమయి ప్రవర్తింపవలెను. ఇతరుల సాహాయ్యమును బొందకయే మన మొక ఘనకార్యమును నిర్వహించినయెడల మనకది మఱింత ప్రతిష్ఠావహము. లోకమంతయు మనలను నిరోధించినను, లోకేశ్వరుఁడు మనకు ప్రాపై యుండఁగా మనము భయపడవలసినపని లేదు.

ఒకానొకప్పుడు బంధుజనులు మొదలయినవారు తీయని మాటలు చెప్పియు, బోధించియు, ప్రేమను నటించియు, కన్నీరు నించియు, ప్రార్థించియు మనలను సత్కార్యములనుండి మరలింపఁ జూతురు. మనయందును, సత్యమునందును, ధర్మమునందును గౌరవము లేనివారిపయిని మనమేల గౌరవముంచవలెను ? మనయంతరాత్మ సంతోషమును వారు చూడనప్పుడు వారి సంతోషమును మనమేల చూడవలెను ? మన యంతరాత్మయు భగవంతుఁడును మంచిపని యనిచెప్పి సంతోషించుచుండఁగా, ఈశ్వరునియందును మానవ ప్రకృతియందును గౌరవములేని స్వార్థపరులు సంతోషింపకపోయిన యెడల మనకేమిలోపము ? ధర్మాచరణవ్యవసాయమునందు కార్య సాఫల్యమైనప్పుడు కలుగుసంతోషముతో సమానమయిన సంతోషము లోకములో మఱియొకటి యుండునా ? మనకదియొక్కటి చాలదా ? కాఁబట్టి సత్కార్యములనుండి మనలను మరలించి యాత్మ

నందసుఖములకు భంగము కలిగింపఁ జూచువారి మంచిమాటలను చక్కెరమెత్తిన విషఘుటికలనుగా భావించి దూరముగా పరిహరింప వలయును.

మంచిమాటలు పనిచేయనప్పుడు వారు మనలను దూషించి బెదిరింప నారంభింతురు. అట్టి దూషణములకును మనము భయపడఁ గూడదు. వారు మనలను మాటలచేత తిరస్కరించు చున్నప్పుడు ప్రతిదూషణమునకు దిగక పూనిన యుద్యమమును విడువక మనము వారిని కార్యముచేత తిరస్కరింపవలెను. మనము కొంతకాలము వారిదూషణములకును వారు మనకుంచెడు పతిత, నాస్తికాది బిరుద నామములకును వారు చేసెడు పరిహాసములకును సహించి నిలిచి ధైర్యముతో పనిచేయుచు వచ్చినపక్షమున, కడపట వారే విసుగు చెంది తమ పరిహాసములు మనమీఁద వ్యర్థమయినవని సిగ్గుపడి యెగ తాళిచేయ మానుకొందురు. తమ పరిహాసములను లక్ష్యపెట్టక పోవుట వలన వారొకవేళ మనలను మొండివారని భావించినను భావింప నిండు. అందువలన మనము గర్వపడవలసిన దేకాని యెంతమాత్రి మును సిగ్గుపడవలసిన పనిలేదు.

మన ప్రతిపక్షులు కొన్ని సమయములయందు దూషణముల తోను, పరిహాసములతోను, తిట్లతోను తృప్తినొందక దౌర్జన్యమును జూపి మనక నేకవిధములయిన బాధలను జేయుదురు. ఒకసత్కార్య మును సాధింపఁ దలంపుగొన్నవాఁడు దానివలన వచ్చెడు సత్ఫలము లకువలెనే దుష్ఫలములకును తలయొగ్గవలెను; ఎన్ని కష్టములు వచ్చి నను వెనుకంజవేయక ముందడుగిడుచుండవలెను. ఆపదలు వచ్చి నప్పుడు జడిసి పౌరుషము విడిచి లోఁబడుటకంటె నవమానకరము మఱియొకటిలేదు. సత్కార్యాచరణమునందే పౌరుషము లేకపోయి

నప్పుడిఁక మానవుని పౌరుషమేటికి ? కాల్పనా ? పురుషనామమును ధరించినవానికి ప్రతిపక్షు లెక్కువయయి కష్టము లాపాదించుచున్న ప్పుడే వారిని సాధింపవలెనన్న యావేశముచేతను రోషముచేతను సత్కార్యాచరణమునందు ధైర్య మెక్కువ కావలెను. ఝంఝా మారుతమువలన మిణుకు మిణుకు మను దీపము లారిపోయినను దావాగ్ని ప్రజ్వరిల్లునట్లుగా ప్రతిపక్షుల దౌష్ట్యమారుతములవలనను మహాత్ముల హృదయములయం దార్పరాని యుత్సాహదావాగ్ని ప్రజ్వ రిల్లి దుస్సహమయి విఘ్నమృగములను భస్మముచేయును. తగినకష్టము లేక లోకములో నెంతటి చిన్నపనియు నెఱవేఱదు. ప్రతికార్యమును కష్టమువలననే సఫలముకావలెనని భగవదుద్దేశము. నడుచునప్పుడు పడు నని శిశువును తల్లి తొట్లలోనే బంధించి యుంచిన పక్షమున వాఁడెదిగి నప్పుడు నడువ నసమర్థుఁడగును. సానఁబెట్టిన మణివలెను, అఱుగఁ దీసిన గంధపుచెక్కవలెను, పురుషుఁడును కష్టములచేతను నలుగుడుల చేతను మాత్రమె వన్నెయు వాసియుఁ గాంచును. ఫలగౌరవమును బట్టి కష్టములు సహితము హెచ్చుచుండును. సత్కార్యములచేత లోకమున కనంతఫలములను కలుగఁజేయ యత్నించువాఁడు ప్రాణము విడువవలసినంత కష్టమువచ్చినను సంతోషముతో శిరసావహింప వలెను. ఎప్పుడయినను విడువవలసిన దేహమును హాయిగా లోకోప కారకార్యమునందు విడువక, సత్కార్యమును త్యజించి దీర్ఘవేదన ననుభవించుచు రోగములచే విడుచు నిమిత్త ముత్తమపురుషుఁడు దాచుకొనఁగోరునా ? కోరఁడు. దృఢచిత్తుని హృదయమెప్పుడును తాను పూనిన కార్యమునకు దుశ్ఛేద్యములయిన యినపగొలుసులతో బంధిం పఁబడియుండును గాన మృత్యుదేవత యొక్కతె తప్ప నితరు లా బంధము నెవ్వరును విడఁగొట్టఁజాలరు.

కార్యసాఫల్యమునకు నిరంతరకృషి మఱియొక సాధనము. విడువక పట్టుదలతోఁ బనిచేయుచు వచ్చినపక్షమునఁ గాలక్రమమున నెటువంటి దుస్సాధ్యములును సుసాధ్యము లగును. నీరువంటి మృదు పదార్థము పడఁగా పడఁగా రాతివంటి కఠినపదార్థము సహితము కరుగు చుండఁగా నిరంతరకృషిచేత మనుష్యులు లోఁబడుట యేమి యాశ్చర్యము ? మన మెంతకృషిచేసినను కొన్ని సమయములయందు కార్యము విఫలము కావచ్చును. అందుచేత నిరుత్సాహమును పొందక కార్య మొకసారి విఫలమయిన పక్షమున మరల సఫలమగువఱకును మఱింత పూనికతోఁ బనిచేయవలెను. కార్యసాఫల్యమయినను మనము గర్వపడి దానితో సంతుష్టిపొంది యూరకుండక దేహములో ప్రాణమున్నంతవఱకు నొకటితరువాత నొకటిగా సదా సత్కార్యాచరణమునకే పూనుచుండవలెను. సత్కార్యములకయి కృషిచేయుట మాత్రమే మనధర్మముకాని వాని సాఫల్యవైఫల్యములు మనచేతిలోనివికావు. కార్యసాఫల్యమయినను కాకపోయిననుగూడ విడువక యీశ్వరముఖమును జూచి మనశరీరప్రాణముల నీశ్వరార్పణముఁ జేసి మనకృషి మనము చేయుచుండవలెను. అప్పుడు మనుష్యులు మనలను దూరముచేసి విడిచినను, ఈశ్వరుఁడు దాపునకుఁజేర్చి కాపాడును.

మనకు సహాయసంపద లేదనియు నొంటిగాండ్ర మేమిచేయఁ గలమనియు నిరుత్సాహపడవలసినపనియు లేదు. ఈశ్వరుని ప్రాపున్నప్పుడితరుల తోడ్పాటు లేకున్న లోపమేమి ? అంతేకాక లోకములో ప్రతిమహత్తరపదార్థమును మొట్టమొదట చిన్నవస్తువునుండియే యారంభమగుచున్నది. నూఱులకొలఁది జనులకు నీడనిచ్చి శ్రమమడఁచు గొప్పమఱ్ఱిచెట్టు నలకంతబీజమునుండియే బయలుదేఱును. ఎన్నోదేశములలోఁ బ్రవహించుచు లక్షలకొలఁది జనులకు స్నానపానములకు జల

మిచ్చి సస్యాదులను ఫలింపఁజేయు మన యీ గోదావరీనదియు మొట్ట మొదట నాసికాత్రయంబకముకడ నొకచిన్న యూటలోనుండి పుట్టినదే. కాఁబట్టి మన మల్పసంఖ్యగలవారమని ధైర్యమును విడువక యీశ్వర బలమును జూచుకొని సత్కార్యాచరణమునకు సాహసింపవలెను. సకల సత్కార్యములయందును మన కీశ్వరుఁడు తోడ్పడునుగాక !

# విద్యాధికుల ధర్మములు.



By

K. VEERESA LINGAM

# విద్యార్థికుల ధర్మములు

సామాజికులారా! మిత్రులారా!

మూడు దినములనుండి మనమీ మందిరమునందు మన సమాజముయొక్క సంవత్సరోత్సవమును జరుపుచున్నాము. ఈ సంవత్సరముతో పదునేనేండ్లు గడపి షోడశవర్షప్రాయము నొంది మనసమాజ మిప్పుడు తన యౌవనదశారంభమును సూచించుచున్నది. బాల్యదశ జాటుటచేత మన సమాజమునకిఁక స్వకృత్యమును ధైర్యముతో నిర్వహింపవలసినకాలము వచ్చినదని నేను నమ్ముచున్నాను. నానమ్మకమును బలపఱిచెడు సూచనలును నామనస్సున కిప్పుడు కొన్ని పొడకట్టుచున్నవి. ఆరంభదశ మొదలుకొని మన సమాజము నిర్వహింపఁగలిగిన ఘనకార్య మిదియని నేను జెప్పలేకపోయినను జన్మదినమునుండియు సమాజముయొక్క యునికినే యుపేక్షచేసి యూరకుండిన మన పురజనులనేకు లిప్పుడు ముచికుందునివలె చిరకాలనిద్రనుండి యాకస్మికముగా లేచి మనమీఁద ధ్వజమెత్తి మన ప్రయత్నములకు విఘాతములు చేయు బాటుపడ నారంభించుట చూడఁగా మన సమాజ మితరు లుపేక్షచేసి యూరకుండవలసినంత దుర్బలమయినది కాదని పూర్వాచారపరాయణులయిన మన పురజనులకుఁ జూపి యొక ఘనకార్యమును జేయఁగలిగినదని భావించుచున్నాను. ఇప్పుడు యుద్ధ మారంభమయినందున భగవదాజ్ఞను శిరసావహించి మన సామాజికు లిఁక నెట్టి పౌరుషముతో దురాచారపిశాచములతోఁ బోరాడుదురో, యెంతవఱకు విజయమునొంది యీశ్వరమతమును దేశమునందు వ్యాపింపఁజేయుదురో చూడవలసి యున్నది. యుద్ధమే

యారంభముకానిపక్షమున భక్తివిశ్వాసములతో నీశ్వరసేవయందుఁ దమప్రాణముల నర్పించి పోరాడు వీరభటులెవ్వరో యీశ్వరద్రోహులయి పాటిపోయి యసత్యపిశాచముల వాతఁబడు పిఱికిపంద లెవ్వరో తెలియరాదుగదా! ఇంతవఱకును మనమీఁదికి రాక యూరకున్న ప్రతిపక్షు లింతచొరవతో మనపయికి దండువెడలుటకు వారి కిప్పుడేమి బలము దొరకెనని కొందఱు సందేహపడవచ్చును. మునుపీవంక నుండువారు సహితము భయపడి తమ్మనుసరింపఁగా నధిక సంఖ్యతో మనమీఁద దాడివెడలుటకు మన ప్రతిపక్షుల కిప్పుడితర బలము లేకపోలేదు. వారికిప్పుడు మనుష్యబలము మాత్రమే కాక తమ్మిప్పు డాశ్రయించియున్న తమపాలిటి భాగ్యదేవతయొక్క బలము కూడ సమకూడినది. సృష్ట్యాదినుండియు ప్రపంచములోని వివిధజాతుల వారిచేతను గల్పింపఁబడిన సమస్తదేవతలకంటెను బలాధికురాలయి గణనాతీత జనపరంపరచే నారాధింపఁబడుచున్న మహాదేవత యొకటి వారికి బ్రాపయి నిలిచి సకలవిధముల తోడుపడుచున్నప్పుడు వారు మనమీఁద దండెత్త సాహసింపక యేల వెనుకతీయుదురు? వారి దేవతతో సమానమయిన చుఱుకుఁదనము గలది నా బుద్ధికి మఱేమియు గోచరముకాలేదు; దాని కెప్పుడును బడలికయే లేదు. అటువంటి విచిత్రశక్తిగల యపూర్వదేవత మనలను గెలుచుటకయి వారి కెన్నో విద్యల ననుగ్రహించి యున్నది; ఎన్నో యద్భుతసాధనములను బ్రసాదించియున్నది; ఎన్నో యపూర్వదర్శనములను తనంతనే కరుణించి యున్నది. తన శక్తిచేత దేవుని రాజ్యమునే యాక్రమించుకొనఁగలుగుదునని గర్వించుచున్న యీ మహాదేవతయొక్క మహిమలను వేయినోళ్ళవాఁడును వర్ణింపఁజాలఁడు. ఆమె యేకకాలమునందే వివిధస్థలములయందున్న తనభక్తులకెల్లఁ బ్రత్యక్షమగు, యెల్లవారి

మనస్సులను పూని, ఎల్లవారికిని క్రొత్తక్రొత్తశిక్షలను సమయము నకుఁ దగిన ట్లపరిమితముగా ప్రసాదించుచున్నది. ఇంతటి భక్తసుల భురాలయిన సుప్రసిద్ధ దేవతయొక్క పేరేమో తెలిసికోవలెనని మీలోఁ గొందఱికి వేడుకకలుగవచ్చును. అందఱి నోళ్ళలో నుండెడి యీ పేరెల్లవారు నెఱిఁగియుండవలసినదే యయినను సమయమున కొకవేళ స్మరణకు రాకపోవచ్చునని నేనే చెప్పుచున్నాను. మడతురీ మహామంత్రమునువలె శ్రద్ధతో వినుఁడు. ఆ మహాదేవియొక్క దివ్య నామము "మూఢత్వదేవత." ఇఁక నా దేవత మనమీఁదఁ బ్రయో గించుటకయి తనభక్తుల కనుగ్రహించిన వరలాభములపేళ్ళు కొన్ని వినుఁడు. ఆమె వారికి నేర్పిన పద్యాలు పరిహాసములు, దూషణములు; మిథ్యాదోషారోపణములు మొదలయినవి; వారి కనుగ్రహించిన విజయసాధనములు బెదరింపులు, బహిష్కారయత్నములు, దుర్బోధలు మొదలయినవి; వారికి ప్రసాదించిన యపూర్వదర్శనములు తెలుపు నలుపుగాను సత్య మసత్యముగాను పుణ్యము పాపముగాను దోఁచెడి విపరీతరూపములు మొదలయినవి ప్రతిపక్షులు మనమీఁదఁ బ్రయో గించెడు సాధనకలాపముయొక్క స్వభావమిప్పుడు కొంత తెలిసినది కదా? ఇఁక మనము సత్యకవచమును దొడిగికొని ధర్మఖడ్గమును చేతధరించి సత్కార్యాచరణశూరులమయి యీశ్వరపక్షమున నిలిచి యుద్ధమునకు సంసిద్ధులము కావలెను. సకలజన వశ్యతగల యీ మూ ఢత్వదేవతయొక్క చర్యల స్వభావమునుగూడ కొంచెము వినుఁడు. ఆ దేవతయొక్క పని యెప్పుడును సత్యమును, సర్వేశ్వరుని మూల పట్టించి యా స్థానమున మూఢవిశ్వాసమును, ప్రతిమలను నెలకొల్పుట; మానసికధ్యానమును మాన్పి తావళములను త్రిప్పించుట; అను తాపమును రూపుమాపి పాపపరిహారార్థమని బూడిదను

పూయించుట; జ్ఞానతేజస్సును బోఁద్రోలి పట్టపగలు దీపములు వెట్టించుట; భక్తియుక్తమయిన యీశ్వర సామీప్యానుభవము తొలఁగించి ధూపములను విగ్రహపూజలను శ్రీపాదతీర్థములను పుచ్చుకొల్పుట; వ్యాధిబాధితులకును వికలాంగులకును రక్షణశాలలను మాన్పించి మనుష్యనిర్మిత శిలాదారు దేవతలకు గృహములు కట్టించుట; తెలిసిన స్వభాషతో వేఁడ నియ్యక తెలియని భాషాపదములను నోట వల్లన వేయించుట లోనయినవి. ఆ దేవతకు ప్రీతికరములయినపను లిటువంటి వనంతిములుగా నున్నవి. అవియన్నియు నెవ్వరు వల్లింపఁగలరు? ఇటువంటి యమోఘసాధనసంపత్తియు విచిత్రకృత్యములునుగల దేవతచే నడపఁబడు భక్తాగ్రేసరులు మనము హృదయపూర్వకముగా తెలిసిన తేటమాటలతో జేయు ప్రార్థనలను నిరర్థకములని దూషించి యర్థము తెలియని "పునంతు మాం బ్రాహ్మణ పాదపాంసవః" ఇత్యాది దేవభాషావాక్యపఠనమే సార్థకమని యెట్లు భాషింపకుండఁ గలుగుదురు? సచ్చిదానందస్వరూపుఁ డయిన పరమాత్మని ధ్యానింపవలయు నన్న యుపదేశము కాసిమాట యని పరిహసించి మూఁడుపేటలు వేసిన త్రాటిని మెడలో వేసి "ఓం భూర్భువస్సువః" యనుటయే బ్రహ్మోపదేశమని యెట్లు సంతోషింపకుండఁ గలుగుదురు? మనలను భక్తిహీనులనియు నాస్తికులనియు దూషించుచు మనమీఁద దండయాత్ర వెడలెడు పరమభాగవతోత్తములలో నూట తొంబదితొమ్మిదిపాళ్ళిట్టి మహానుభావులే. ఈ మహానుభావులే దేవతలమీఁదను భక్తిలేని యాస్తికశిఖామణు లయినను పామరులను వంచించుటకయి కుంకుమబొట్లను విభూతిపెండెకట్లను ముఖమున ధరించి శాక్తేయులవలె జుట్లు విరియఁబోసికొని వీరశైవులవలె సివము లాడుచు, మూఢతా దేవియొక్క యగ్రసేనకు

నాయకు లయి ముందుగా మనమీఁద జైత్రయాత్ర వెడలుదురు. ఈ కపటనాటకు లుత్సవసమయములయందు తమ వాకిట మద్దెళ్ళతోను తాళములతోను మహాధ్వనితో భక్తులు దేవునిముందు హరినామస్మరణ చేయుచున్నను పట్టపగ లావంక తొంగిచూడ నొల్లక భోగముదాని పాటగాని, 'భోగము'దన్న మాటగాని చెవిని బడినతోడనే వీధులవెంట మేళములముం దూరేగుటకు మహాభక్తితో నర్థరాత్రములయందు సహితము బయలువెడలుదురు. ఇట్టివీరు హిందూమతోద్ధారకులయిన నాయకులంట! వీరిమాటలు మహర్షి మతములంట! ఓమహర్షి సత్తములారా? ప్రాజ్ఞశిఖామణు లయిన మీరివ్వ డుండిన యెడల మీమతము లివి కావనియు. మానసికారాధనమే మీమత మనియు ఈవంచకులముందు సహస్రముఖముల ఘోషించి యుందురు గదా? ఓమహానుభావులారా! మరల సజీవులయి లేచి వచ్చి మనుష్యులతో మాటాడఁగల మహిమ మీయొద్దనున్న పక్షమున తత్క్షణమే విజయముచేసి మీరెప్పుడును తెలియనిభాషతో నేవో వల్లించి ప్రార్థన యనుకో లేదనియు, కాలానుగుణము లయిన మార్పులను జేసికొని యభివృద్ధినొందుచు వచ్చితి మనియు వీరికి బోధింపరాదా? పాపమునకు పరితాపపడి హృదయపూర్వకముగా ప్రేమను గనఁబఱుచుటయే యారాధన కాని తెలియనిపదము లేవేవో పలికి గంటలు వాయించి ప్రసాదములు గైకొనుట యారాధన కాదని తెలియఁ జెప్పరాదా? సర్వవ్యాపియైన దేవుని విడిచి లోహవిగ్రహములను దర్శించుట కయి యూరూరఁ దిరుగుట మీమతము కాదని యుపదేశింపరాదా? మిమ్ము జేసిన దేవునిసేవ మాని మీరు చేసిన బొమ్మల కొలువు చేయుట మీయభిమతము కాదని బుద్ధి చెప్పరాదా? "మీ రేమిచేయవేఁడుచున్నారో మీరెఱుఁగరు; మీ రేమిపలుకుచున్నారో

మీరు గ్రహింపలేరు. ఇదా ప్రార్థన ?" అని పరిహాసింపరాదా ?

ఇవియన్నియు లోకమును బాగుచేయవలెనన్న వెఱ్ఱియాశతో పలవరించుచున్న నా వ్యర్థము లయిన కోరికలు. మన మొట్టలాలించి పూర్వమహర్షు లొకవేళ శ్రమపడి లోకానుగ్రహార్థముగా నిక్కడకు విజయంచేసి పయినిజెప్పిన రీతిని దమ యార్షమతసారమును మేఘ గంభీర భాషణములతో ఘోషించినను, దురాచార పిశాచావేశు లయి మూఢత్వదేవతకు ముఖ్యభక్తులయియున్న పండితమ్మన్యు లా స త్యములను చెవి యొగ్గి విననైనను విందురా ? వినరు. ముమ్మాటి కిని వినరు. ఓ ఋషివర్యులారా ! మీరు శ్రమపడి వచ్చిన ప్రయో జనము లేదు. ఇక్కడ సత్యగ్రహణాదర మెవ్వరికిని లేదు. మీ కాల మునందు సత్యమన్న మధురవాక్కు మీ చెవుల కెంత ప్రియతమ ముగా నుండునో యీ కాలమునందు మీ సంతతివారయిన యీ భరత ఖండవాసులకు సత్యమన్న పేరంత వెగటుగానున్నది. ఈ కాలములో సఖ్యమును సత్యాదరమును నశిపడవు. ఆరంభమయిన యుద్ధము జరిగి తీఱవలెను. ఇప్పుడు సత్యమున కసత్యముతోను, వివేకమున కవివేకము తోను, జ్ఞానజ్యోతి కజ్ఞానాంధకారముతోను పోరాటము పడినది. పశ్చిమఖండపండితులు మన దేశముమీఁద విడిచిన ప్రకృతిశాస్త్ర శస్త్రలవలన కలిగిన క్రొత్తయూహా లభినవపటుత్వముతో నానాముఖ ముల వ్యాపించి ముదిసియున్న ప్రాఁతయూహాలను పీఠములనుండి కద లింపఁ జూచుచున్నవి; నూతన సదాచారమహామంత్రములు పురాతన దురాచారభూతములను తఱిమివేయఁజూచుచున్నవి; నవీనజ్ఞానసూర్యో దయము ప్రాచీన మూఢవిశ్వాస తమస్సులను పాఱద్రోలఁజూచు చున్నది. చిరకాలమునుండి మన హృదయములలో పాతుకొని యుండి మనమీఁద రాజ్యముచేయ మరఁగియున్న మూఢత్వదేవత

తన యధికారము విడువ నొల్లక తెంపరితనమున సుజ్ఞానభానునితో బోరాడఁదలఁచి తనభక్తులనందఱిని తోడుపడఁ బిలుచుచున్నది. చిర కాలస్నేహము వలనను మూఢత్వమునకు మూలబల మయిన దురా చారభూతములయొక్కయు దురభిమాన పిశాచముల యొక్కయు ప్రేరణమువలనను సుస్థిరప్రభు భక్తి గలవారై దురాలోచన లేని బహుసంఖ్యాకు లయిన జను లందఱును మూఢత్వదేవతయొక్క పక్ష మవలంబించి తత్సంరక్షణపరాయణులయి మూఁకగా ప్రతిఘటించి నిలిచియున్నారు. సత్యప్రియత్వమువలన దురభిమానమును విడిచి సదాచారగ్రహణదీక్షవహించిన కొందఱుమాత్ర మజ్ఞానాంధకార మును బారఁద్రోలవలయు నన్న యుత్సాహముతో విమర్శఖడ్గమును ధరించి వీరభటులవలె సుజ్ఞానభానునిపక్ష మవలంబించి పోరాడుటకు బయలువెడలు చున్నారు. ఇట్లు వివేకమునకును సువివేకమునకును దుర్జ్ఞానమునకును సుజ్ఞానమునకును జరుగుచున్న యీ యుద్ధముచేత దేశమున కంతకును సంక్షోభము కలుగుచున్నప్పు డేదో యొకపక్ష మునఁ జేరక యూరకుండుట యెవ్వరికిని శక్యము కాదు. వివేకు లందఱును క్రమక్రమముగా సత్యపక్షమునఁ జేరుదు రనుటకు సందే హము లేదు. యుద్ధముయొక్క పర్యవసాన మెట్లగునో యన్న సందేహ మంతకుముందే లేదు. కాలపరిమితి మాత్రము నిర్ణయించుట సాధ్య ము కాదు కాని తుద కజ్ఞాన మోటుపడి సుజ్ఞానమునకు విజయము కలుగుట నిశ్చయము. అజ్ఞానాంధకారము లోకమునం దంతట నెంత దట్టముగా వ్యాపించియున్నను సుజ్ఞానభానుఁడు బయలువెడలి తన తీక్ష్ణకిరణములను బఱపినప్పుడు క్రమక్రమముగా తొలఁగి మూలలను గుహలలోను దాగి యడఁగుటకు సందేహ ముండదు. జ్ఞానపావకుని ప్రతాపముచేత మూఢత్వదేవత యమోఘసాధనములని సంతోషించు

చున్న కల్లలనెడు వేయించుల యినుపకత్తులన్నియు నీరుగా కరఁగి పోవును; అవిమర్శలనెడు గదలన్నియు భస్మము లగును.

ఇంతవఱకును మన ప్రతిపక్షుల బలమును సాధనసామగ్రియు వారుచేసెడు యుద్ధక్రమమును వర్ణించితిగాని యిట్టి సమయమునందు మనమెట్లు ప్రవర్తింపవలయునో మన ధర్మము లేవో వివరించి యుండలేదు. కాఁబట్టి యిప్పుడు సామాన్యముగా విద్యాధికు లందఱి యొక్కయు ముఖ్యముగా మన సామాజికులయొక్కయు ముఖ్యాచరణీయములయిన ధర్మములనుగూర్చి కొంచెము సంభాషించెదను. మన సామాజికులలోను మన యుపన్యాసములను ప్రసంగములను విను వారిలోను విశేషభాగము విద్యార్థులని మన ప్రతిపక్షు లొక యాక్షేపణను బలుకుచున్నారు. అదియొక గొప్ప యాక్షేపణముగా భావించుకొని మనపక్షము దుర్బలమయినదని వారు పొంగుచున్నను, విద్యార్థు లధికముగాఁ జేరుచుండుటవలననే మనపక్షము సబలమయి, భావిశుభసూచకముగా నున్నదని నేను సంతోషించుచున్నాను. మన దేశము తన భావిక్షేమాభివృద్ధుల నిమిత్తమయి యిప్పుడు పిన్నలుగా నుండి ముందు పెద్దలు కాఁబోవుచున్న విద్యార్థుల కొఱకే యెంతో యాశతో నెదురుచూచుచున్నది. ఈ ప్రపంచ నాటకమునం దిప్పటి పెద్దలు వినిపించుచున్న కథ యించుమించుగా ముగియవచ్చినది. వారీవఱకందఱును వినిపించుచువచ్చిన పురాణకథాశేషమునే వృద్ధవాక్యములతోఁ గొంతకాలము వినిపించి కథాశేషులయ్యెదరు. ఈప్రపంచ నాటకరంగమునందు మహాసామర్థ్యముతో క్రొత్తయాట లాడి హృదయరంజకముగా నూతనకథను వినిపించి సర్వజనులకు సంతోషమును గలిగింపవలసినవారు లేఁబ్రాయములో నున్న యిప్పటి విద్యార్థులే. వీరు తమకథను జక్కగా నేర్చుకొని సర్వజనహృదయాహ్లాద

కరముగాఁ బ్రయోగించిన పక్షమున రాఁబోవు విద్యార్థులును వీరి మార్గము నవలంబించి నీతి ప్రధానమయిన కథను మఱింత వృద్ధిపఱిచి దేశక్షేమలాభములకొఱకు ధైర్యోత్సాహసామర్థ్యములతో సర్వత్ర ప్రయోగించుచు వచ్చుటచేత మనదేశ మచిరకాలములోనే భూతల స్వర్గమయి సుఖసంతోషనిలయము కావచ్చును. మనదేశ మెప్పుడయి నను విద్యార్థుల మూలముననే వృద్ధికి రావలసియున్నది. అందుచేత మనదేశము స్వాభివృద్ధికయి విద్యార్థుల కృషినే నిరీక్షించుచున్నది. దురాచారదూషితములుకాని నిర్మల మనస్సులుగల విద్యార్థులు గాక, సంవత్సరశతములనుండి పరంపరగా వచ్చుచున్న దురాచారవాసనల చేత యుక్తాయుక్తవివేకచింతను విడనాడి, కఠినమనస్కులయియున్న మన తండ్రులును, తాతలును, ముత్తాతలును, ముత్తవలును తమ చిన్న నాటి యలవాటులను మఱచి మన యూహలను బోధవలను క్రొత్తగా నిప్పుడు నేర్చుకొని, తను ప్రాఁతయూహలను పూర్వాభిప్రాయములను మార్చుకొని దేశాభివృద్ధికయి పాటుపడుట సంభవించునా? వారు తా మభివృద్ధి పొందవలసినట్టియు నిప్పటి యూహలనుబట్టి యితరుల నభివృద్ధి చేయవలసినట్టియు కాలము దాటిపోయినది. వారిని నూతన మార్గములకు ద్రిప్పుటకయి మనము చేయు కృషి సహితము సఫలము కానేరదు. వారిని వారియూహలకును వారికర్మలకును వారివిశ్వాస ములకును వారిపూర్వాచారములకును విడిచిపెట్టి బాగుపడుటకుఁ గావలసినంత యాశయు నవకాశము నున్న చిన్నవారిని మంచిమార్గ మునకుఁ దెచ్చుటకయి మన శక్తియుక్తుల నుపయోగింపవలెను.

మనము జనసామాన్యమునకంటె విద్యాధికుల మగుటచేత వారిస్థితిని బాగుపఱుచుటకయి కృషిచేయవలసిన భార మొకటి మనమీఁద పడుచున్నది. విద్య యెక్కువయిన కొలఁదిని విద్యాధిక్య

ముతో వచ్చు కార్యభారములను సహితము మనము వహించి నిర్వహించుచు రావలెను. మనము విద్యాలాభమును మాత్రము పొంది యందు వలన మనమీఁదబడిన భారమును భరింపనొల్లని పక్షమున ధర్మమును తప్పినవార మగుదుము. మృగమునకును మనుష్యునకునుగల భేదము స్వార్థపరత్వమును విడుచుటతో నారంభమగును. విద్యాగంధము లేక కేవల స్వప్రయోజనపరుఁడుగా నుండువాఁడు మృగప్రాయుఁ డనఁ బడును. అట్టి మృగప్రాయుఁడయిన స్వకార్య ధురంధరుఁడు జ్ఞాన సౌధముయొక్క యడుగుభాగమునైనను జేరలేక యంధకారబంధురమయిన పాతాళగుహాయం దున్నవాఁడగును. వెలుతురు లేక చీఁకటిలో నున్నవానికి తన దేహమొక్కటి తక్క వేఱేదియు తోఁప కుండుట వింతకాదుగదా? వాఁడు కొంచెము పయికివచ్చి జ్ఞాన సౌధముయొక్క యడుగుభాగమును జేరి వెలుతురులోఁ బ్రవేశింపఁ గానే వానికి గోడలనడుమనున్న భాగమును దానిలోనున్న వారును గానఁబడుదురు. ఈప్రకారముగా మృగప్రాయుఁడు గాఢాంధకారము నుండి వెలువడి తనమృగత్వమును గొంతవిడిచి కొంచెము మానవత్వమును బొంది నాగరికుఁడయి జ్ఞానజ్యోతియొక్క తేజస్సును దర్శింప నారంభింపఁగానే: స్వార్థపరత్వమును గొంచెము విడిచి తన యింటనుండు భార్యాపుత్రాదులను బంధువులను బ్రేమించి వారి క్షేమము నిమిత్తమయికూడ పాటుపడువాఁ డగును. అతఁడే యింకొక మెట్టెక్కి యాపయిని మఱియొక్క మెట్టెక్కి క్రమక్రమముగా జ్ఞానసౌధముయొక్క యుపరిభాగమునకుఁ బోయి నలుప్రక్కల దృష్టి వ్యాపింపఁ జేసినకాలఁదిని క్రిందనున్నప్పుడు నాలుగుగోడలమధ్య నున్నదితప్ప మఱియేదియుఁ జూడలేనివాఁ డంతకంతకు చుట్టును నున్నయిండ్లను గ్రామములను దేశములను వరుసగాఁ జూడ నారం

భించి స్వప్రయోజనపరత్వచింత యంతకంతకు తగ్గుచు రాఁగా క్రమ క్రమముగా తనవారి యిండ్లనియు తన యూరనియు తన దేశమనియు నభిమాన మేర్పఱచుకొని తన ప్రేమను వానియిూఁదికి సహితము వ్యాపింపఁజేసి సమయము వచ్చినప్పుడు వానికిని తోడుపడుచువచ్చును. ఇట్లు దేశాభిమాన మెప్పు డేర్పడునో యప్పుడే దేశక్షేమము చేయ వలెనన్న బుద్ధియు పుట్టి దినదినక్రమమున ప్రేమానుబంధము దృఢ పడును. ఆ మనుష్యుఁడే జ్ఞానముయొక్క యున్నతపదవిని బొంది పిట్ట వలె నుపరిభాగమున కెగసి పయినుండి క్రిందికి చూడఁగలిగిన పక్ష మున, అప్పు డాతని దృష్టికి తనయూరును తనదేశమును మాత్రమేకాక చుట్టునుగల యితర దేశములును గోచరములగును. ఇట్లు పయి కెగసిన కొలదిని వస్తువులు కానఁబడెడు రీతిలోఁగూడ నొకవిశేషము కలదు. ఉపరిభాగమున కెగసిన కొలఁదిని తన యిల్లు తకతకు చిన్నదగుచు వచ్చి మిక్కిలి పయికిఁబోయి లోకమునంతను జూచునప్పుడు తన యి ల్లామధ్య నదృశ్యమగును. ఈప్రకారముగానే జ్ఞానముయొక్క మహో న్నతదశకు పొందిన వాని దృష్టిపథమునం దెప్పుడును లోకక్షేమ మంతయు నుండును గాని తనవారియొక్క క్షేమముమాత్రము ప్రత్యేక ముగా నుండదు. దీనినిబట్టి విచారింపఁగా జ్ఞానికి ముఖ్యలక్షణము స్వప్రయోజనపరత్వమును పూర్ణముగా విడిచిపెట్టి లోకప్రయోజనము నిమిత్తమయి చూచుచుండుట యని స్పష్టమగుచున్నది. జ్ఞానమే మనుష్యలక్షణ మగుటచే నటువంటి లక్షణముగలవాఁడే నిజముగా మనుష్యుఁడని పిలువఁబడుట కర్హుఁడయినవాఁడు. కాఁబట్టి యెల్ల వారును స్వప్రయోజనపరత్వమును విడిచి పరోపకారపరాయణులయి మనుష్యనామమునకు పూర్ణముగా నర్హులగునట్లు ప్రవర్తించుటయే పరమార్థముగా భావించుకొని తమకృషి యంతయు నందు నిమిత్తమే

యుపయోగింపవలెను. ఇట్టిస్థితిని బొంద ప్రయత్నించుట మనుష్యజన్మ
మెత్తినవానికెల్లను పరమధర్మమే యయినను, అది యందఱికిని
సాధ్యము కాకపోవచ్చును. ఎవ్వఁడును పూర్ణముగా నొకవేళ సాధింప
లేకపోయినను పరోపకారము నిమిత్తముయి నిరంతరకృషిని జేయు
చుండువాఁడు చాలవఱకు పొందవచ్చుననుట కావంతయు సందేహము
లేదు.

ఇఁకను బరోపకార మనఁగా నెట్టిది, దానిని చేయు క్రమ
మెట్టిది, దానికయి ప్రయత్నించుటలో మన మాచరింపవలసిన ధర్మము
లేవి, అను నంశములను గొంచెము విచారింపవలెను. జనసామాన్య
మునకు క్షేమాభివృద్ధులు కలిగించుటయే పరోపకార మగుటచేత
దానినిగుఱించి చర్చింపవలసిన పనిలేదు. ఇఁకను దానిని చేయు మార్గ
ములనుగూర్చి కొంచె మాలోచింపవలసియున్నది. ఈ మార్గములను
ప్రతిమనుష్యుఁడును విద్యార్థిదశలో నున్నప్పటినుండియు నేర్చుకొని
మొదటినుండియు తదనుష్ఠానమున కర్హుఁడగుటకు కృషిచేయుచుండ
వలెను. కొంద ఱనుకొనునట్లు పాఠశాలలో పాఠములు వల్లించుట
మాత్రమే విద్యార్థి ధర్మముకాదు. ముందు తన యిహలోకయాత్రకును
సుఖమునకును దానిమూలమున దేశక్షేమాచరణమునకును తానర్హుఁ
డగుటకు నేర్చుకొనుటయు విద్యార్థి ధర్మమే. ఈ యవస్థయే లోకము
నకుఁ దాను ముందుపయుక్తుఁడగుటకు నేర్చుకోవలసిన యుక్తకాల
మగుటచేత విద్యార్థి యిప్పుడే సద్వర్తనమును కార్యభారమునకుఁ
దగిన నిజమయిన పౌరుషమునుగూడ నభ్యసింపవలెను. దేహబలము
గలవారిమీఁద విద్యాబలము గలవారే లోకములో నధికారము
చెల్లింపవలసినవారయి యుండుటచేత వారెప్పుడయినను మూఢ
జనులకు నాయకులుగా నేర్పడి వారిని మంచిమార్గమున నడిపి దేశాభి

వృద్ధి చేయవలసినవారేకాని పామరుల మెప్పును స్తుతులను గోరి తమ విద్యకును బుద్ధికిని అవమానము కలుగునట్లుగా వారిచే నడుపఁబడ వలసినవారు కాఁగూడదు.

దేశాభివృద్ధికయి యాచరింపవలసిన ధర్మము లనేకవిధము లయి యున్నవి. ఈ దేశాభివృద్ధి మొట్టమొదట తనతో నారంభము కావలెను. అటుపిమ్మట తన కుటుంబమునకును తన గ్రామమునకును తన దేశమునకును క్రమముగా లోకమంతకును వ్యాపింపవలెను. మన యభివృద్ధికయి మొట్టమొదట నీశ్వరభక్తియు, సత్యానురక్తియు, ధర్మపరత్వమును, దుష్కర్మవిముఖత్వమును గల వారమయి మన యిహలోకయాత్రను పరిశుద్ధముగాను సుఖప్రదముగాను జేసికొని మనల నీశ్వరుఁ డీలోకమునుండి యే నిమిషమున తొలఁగింప నుద్దేశించినను శాశ్వతానందమును పొందుట కర్హులముగా నుండునట్లు సదా ప్రవర్తించుచుండవలయును. మనలను సన్మార్గము నుండి తొలఁగించుటకై యింద్రియసుఖవాంఛాదులను లుబ్ధులు సుఖాభాసబీజములను జవిచూపి వేటగాఁడు నూకలుచల్లి పిట్టల నాకర్షించునట్లుగా మన హృదయఖగముల నాకర్షించుచుండును. ఇట్లు విషయసుఖములు మనలను ధర్మపథమునుండి యాకర్షించినప్పుడు వలలోఁబడితిమేని పాపకిరాతబృందములు మనలను బట్టుకొని బాధించి సకలాకృత్యములకును లోఁబఱుచును. కాఁబట్టి మనజీవనమును పరిశుద్ధమయిన దానినిగాఁ గాపాడుకొనుటకయి మన మెల్లప్పుడును పాపములనెడు శత్రువులతోఁ బోరాడుచుండి వానిని మన హృదయదుర్గములను జేరనీయక తఱుముచుండవలయును. బాహ్యశత్రువులతోఁ బోరాడుటకంటె నంతశ్శత్రువులయిన పాపములతోఁ బోరాడి వానిని నిర్జింపఁగలుగుటయే మన కెక్కువ పౌరుషము. ఈ పాపశత్రువులను

పూర్ణముగా జయించి పాఱఁదోలఁగలుగుట యీశ్వర సాహాయ్యము లేక మన యల్పశక్తులకు సాధ్యము కాదు. ఈశ్వర సాహాయ్యమును బొందుటకై యీశ్వరారాధనము కావలెను. ఈశ్వరునియందు పూర్ణమయిన ప్రేమను విశ్వాసమును ఉంచి పాపశత్రువులనుండి కాపాడి యాత్మసుఖము ననుగ్రహింప నీశ్వరుని హృదయపూర్వకముగా ప్రార్థించుచు, ఈశ్వరాజ్ఞలను మీఱినందుకై పశ్చాత్తాపపడుచు, సర్వకార్యములయందును నాతని చిత్తవృత్తి ననుసరించి వర్తించుచుండుటయే యీశ్వరారాధనము. ఈ యీశ్వరారాధనమును మఱచి యాత్మశక్తిని నమ్ముకొని కొంచెమేమఱియుండిన పక్షమున, పాపపిశాచము దొంగవలె మన హృదయసదనమునందుఁ బ్రవేశించి యక్కడనుండి యీశ్వరభక్తిధనము నపహరించి మనలను దుఃఖములపాలు చేయును. కాఁబట్టి పాపతస్కరుఁడు మన మనోవీధియందుఁ బ్రవేశింపఁగానే తెలిసికొని పరితాపపడి యీశ్వరుని ప్రార్థించి పాపమును బాఱఁదోలుటకై పిలిచి సేవించిన పక్షమున మన మనస్సులు మరల నిర్మలము లగును. ఈశ్వరు నారాధింపవలసిన యీధర్మమే మతధర్మ మనఁబడును. ఇదియే ధర్మము లన్నిటిలోను బ్రధాన ధర్మము; సమస్తసుఖప్రదాయకము. పాపమే మూలనయిన హృదయములోఁ బ్రవేశించి దాగియున్నదేమో యని యాత్మశోధనము చేయుచు నిత్యము నీశ్వరారాధనముచేయుచు మన వర్తనమును పరిశుద్ధమయిన దానినిగాఁ జేసికొనుచుండుటయేకాక మన బంధుమిత్రాదులనుగూడఁ బరిశుద్ధులనుగాను జ్ఞానులనుగాను సుఖపడువారినిగాను జేయుచుండుట మనకు రెండవ ధర్మము.

ఇట్లన్యోన్య సుఖము నిమిత్తమయి పరస్పరసాహాయ్యము చేసికొను మనుష్యుల గుంపంతయుఁ జేరి కుల మనఁబడును. కుల మను

శబ్దమునకు సమూహమని యర్థము. పరస్పర సుఖము నిమిత్తమయి జను లొండొరులతోఁ జేసికొనవలసిన ధర్మములు కులధర్మము లనఁ బడును. ఇతరులను సుఖులనుగాఁ జేయుటకుఁ దగిన బుద్ధియు శక్తియు మనలో నీశ్వరుఁ డిమిడ్చి యుండుటచేతనే మనుష్యుఁడు మృగాదుల కంటె నధికుఁ డగుచున్నాఁడు; ఈబుద్ధిని, శక్తిని, లోకముయొక్క క్షేమాభివృద్ధుల నిమిత్త మెంతయెక్కువగా నుపయోగించిన మనుష్యుని కంతయెక్కువ ఘనత వచ్చును. ఈలోకములో సమస్తసుఖములును సమస్తక్షేమములును మతముయొక్క పరిశుద్ధత ననుసరించి యే యుండును గాన మనము జనసంఘముయొక్క క్షేమము నిమిత్తమయి చేయవలసిన మొదటి యుపకారము మతమును సాధ్యమయినంత పరిశుద్ధమయిన దానినిగా జేయుఁ బ్రయత్నించుట. ఈ ప్రయత్నములో మూఢజనులవలన ననేక కష్టములు సంభవించును. లోకములో నేపనియు కష్టపడక నెఱవేఱదు గనుక, మనము కులాచారసంస్కరణమునందును కష్టములను సహించి స్వప్రయోజనపరత్వమును త్యజించి యీశ్వరప్రీతి కరముగా పనిచేయవలెను. దేశాభివృద్ధి యెప్పుడును తమక్షేమమున కంటె లోకక్షేమమే యెక్కువగా భావించి తమ ప్రాణములను శక్తులను సంపదలను దేశమునకు ధారపోసెడు పుణ్యపురుషులచేతనే యగుచు వచ్చినది గాని యేదేశమునందును స్వప్రయోజనపరులచేతను కుక్షింభరులచేతను స్వకుటుంబపోషణ ధనార్జనపరాయణతాధురంధరుల చేతను కాలేదు. కేవల కుక్షింభరుల మయినపక్షమున మనకు మృగాదులకంటె నాధిక్యమేదియు లేదు; మనకు ధనార్జనమే ముఖ్యకర్తవ్యము కాదు. మనము లోకములో నెంత ధనమార్జించినను, అల్పకాలోపయుక్తమయినదేకాని యది స్థిరమయినది కానేరదు. మనము కష్టపడి సంపాదించిన గృహములును, ధనమును మనతోరాక యెప్పటి

చోటనే యుండి కొన్ని సమయములయందు మన మరణానంతరమున బంధుపుత్రాదులకు కలహకారణములు సహితమగును. మనము న్యాయముగా నార్జించిన ధనమే మృత్యుదేవత మనకు ధనరక్షణభారమును తప్పించిన తరువాత మాంసముకొఱకు వేచియున్న గ్రద్దలవలె తాము కష్టపడి గడించుకొనక యితరు లార్జించిన దాని నపహరింప వేచియుండు బంధువులకు కలహకారణమును దుఃఖకారణము నగుచున్నప్పు డాధన మన్యాయార్జిత మగునేని చెప్పవలసిన పని యేమున్నది? అప్పు డది దానిని పొందువారికే కాక గడించిన వానికిని దుఃఖహేతువగును. కాఁబట్టి మనల నెప్పుడో యొకప్పుడు విడిచి పోవునట్టియు దుఃఖకర మగునట్టియు ధనమును కావలసినదానికంటె నధికముగా సంపాదించి కూడఁబెట్టుటకు యత్నింపక మరణానంతరమున సహితము మనలను విడువక తోడుపడి సుఖమిచ్చెడు సత్యధర్మరూపమయిన సుస్థిరధనమును ఆర్జించుటకయి మనుష్యుఁ డధికకృషి చేయవలెను. ఇతరులకు మనము చేయవలసిన రెండవ యుపకారము దుర్నీతిదురాచారములను తొలఁగించి వారిని నీతిమంతులనుగాఁ జేయుట. సత్యవర్తనము గలిగి యితరులను వంచింపక పరస్త్రీ పరధనాదుల కాశపడక న్యాయమార్గమున సంచరించుట నీతి యనఁబడును. నీతిని విడిచిన మత ముండ నేరదు గనుక, ఇదియు మతధర్మమే యయినను కాలమహిమచేత మనదేశమునం దిప్పుడు సద్వర్తనము లేని శ్రీచూర్ణరుద్రాక్షాది ధారణమే మతముగా మాఱినందున దీనిని మతమునకంటె వేఱుగాఁ జెప్పవలసివచ్చినది. జనసామాన్యముయొక్క క్షేమసంతోషములకు పరిశుద్ధమయిన యీశ్వరోపాసన మెట్లావశ్యకమో యట్లే నీతివర్తనము నావశ్యకమయిన దగుటచేత దానిని స్థాపించుటకుఁగూడ మనము విశేషప్రయాసము పడవలసి యున్నది. కొందఱు మనదేశములో

మతము పేరు చెప్పియే నీతిబాహ్యములయిన దుష్కృత్యము లనేక ములుచేసి చేయించి హృదయమునుండి దయాగుణమును తొలఁగించి కొంతవఱకు మనుష్యస్వభావమునే రూపుమాపుచున్నారు. దేవుఁ డందఱియందును సమానదయ గలవాఁడయి మనకిచ్చిన మృదు హృదయములనే వారికిని ప్రసాదించినప్పుడు మతధర్మములలో నిట్టి వ్యత్యాస మేలకలుగవలెనని యాలోచింపఁగా, వారు దేవుఁ డనుగ్ర హించిన స్వాభావిక మతమును విడిచి మనుష్యకల్పితము లయిన యస్వాభావికమతముల నవలంబించుటవలన నీయనర్థమంతయు పొసఁ గినదని స్పష్టపడుచున్నది. మతముతో చేరియున్నను, చేరియుండక పోయినను సమస్తవిధములయిన దుర్నీతులను తొలఁగించుట దేశక్షేమ మున కత్యావశ్యకము. కాఁబట్టి విద్యార్థికులయిన వారందఱును నీతి మత విషయముల రెంటియందునుగల దోషముల నితరులకుఁ జూపి వానిని వారు దిద్దుకొనునట్లు చేయవలెను. జనులు తమ దోషములను దిద్దుకోలేక పోవుటకుఁ గల యొక గొప్పకారణము దురభిమానము. తానే గొప్పవాఁడననియు తనకు తెలియనిదేదియు లేదనియు జనుఁ డెప్పుడు దురభిమానమును పూననారంభించునో యప్పటినుండియు నతఁడు స్వలోపములను దిద్దుకొని యభివృద్ధిని పొందుట కవకాశము లేనివాఁడయి చెడుట కారంభించును. ఈ దురభిమానము జనులందఱి లోను వ్యాపించిన పక్షమున దేశముయొక్క దుర్గతి వేఱుగఁ జెప్పవల సినదే లేదు. సమస్తవిషయములయందును మనపూర్వులు సర్వజ్ఞు లనియు వారికిఁ దెలియని దితరుల కేదియు తెలియదనియు మన మితరదేశస్థులవలన నేర్చుకొనవలసిన దేదియు లేదనియు మనవారిలో నొక దురభిమానము బలిసియున్నది. ఈ దురతిశయమే మనవారిని తమదోషములను విమర్శించి తెలిసికొననీయకయు నితరుల గుణాంశము

లను గ్రహింపనీయకయు దేశము నంతకంతకు చెఱుపుచున్నది. జను లకు నాయకులయి నడప నపేక్షగలవారు కొందఱు తమవారి తప్పు లను జూపి దిద్దింపఁజూడక తుచ్ఛమయిన జనుల మెప్పున కాశపడి సర్వవిషయములయందును మనపూర్వులు పరిపూర్ణులని బోధించి స్తుతించి జనులలో దురభిమానమును దురతిశయమును బలియునట్లు చేసి తామేమో దేశాభిమానులయినట్లు నటించుచున్నారు. దేశాభి మానమెప్పుడును జనుల లోపములను జూపి వానిని తొలఁగింపఁ బాటుపడుటలో నుండును గాని నీచమయిన పామరజనానురాగము నపేక్షించి వారిదోషములను గుణములని భూషించి దేశమభివృద్ధి పొందకుండ చెడఁగొట్టుటలో నుండదు. ఈ యపూర్వదేశాభిమానులు క్షణభంగురమయిన మూఢజనానురాగము నిమిత్తము వారి మూఢ విశ్వాసములను మూఢాచారములను భూషించుటయేకాక వారితోఁ గలిసి వానిని సంస్కరింపఁగోరువారి నెల్ల బరిహసించుటలో నఖండ పాండిత్యమును జూపుచున్నారు. ఇట్లుచేయుట దేశాభిమానలక్షణము కాదు. నిజమయిన దేశాభిమాని యెప్పుడును పరోపకారచింతయు ధర్మచింతయుఁ గలవాఁడయి తనవారి లోపములను పాపములను నిర్భయముగా విప్పి చూపును. ఇట్లు చూపుటవలన దురభిమానులు దూషించి ద్వేషించుటయు, కపటదేశాభిమానులు పరిహసించుటయు సంభవించును. అయినను దేశాభిమానమాననీయుఁడు దేశక్షేమ మునే మనస్సునందుంచుకొని యట్టి దౌర్జన్యములకెల్ల తలయొగ్గి స్వకర్త వ్యమును ధైర్యముతో నిర్వహించుచు రావలెను. ఇట్లు చేయక విద్యాధికులు తమ వివేకమును పాతిపెట్టి జనులకు నాయకులుకావలెనన్న దురాశచేత స్తోత్రప్రియులయి విద్యావిహీనుల మూఢవిశ్వాసములను శ్లాఘించుచు వారిచే మంచివారనిపించుకొనుటకయి వారివలె మాటా

డుచు వారివలె వర్తించెదు పక్షమున నచిరకాలములోనే తాము మూఢులయి మూఢులకు నాయకులగుటకు మారుగా మూఢులకు దాసులయి మూఢులను నడుపుచున్నామన్న భ్రమతో మూఢులచే నడుపఁబడువారయి విద్యాధికులన్న పేరున కపాత్రులగుదురు. ఇట్లగుట యెంత సిగ్గులచేటు! విద్యాధికులమాట యటుండఁగా స్వగౌరవమునందు దృష్టిగల విద్యార్థులు సహితము తామభ్యసించుచున్న విద్యకును బుద్ధికిని నపఖ్యాతి కలుగునట్లుగా నిటువంటి యపాత్రపుఁ బనికి లోఁబడఁ జూతురా? ధర్మశూరులయి తాము సత్యమని న్యాయమని నమ్మిన రీతిగాఁ బ్రవర్తించుచుఁ దాము నమ్మినట్లుగా నితరులకు నిశ్శంకముగా బోధింపక మూఢుల మెప్పునకయి మూఢవిశ్వాసములను దురాచారదోషములను శ్లాఘింపఁ జూతురా? పామరజనవిరోధమునకు భయపడి సత్కార్యపక్షమున నిలిచి సత్కార్యాచరణధైర్యము చూపలేని మగవా రెన్నఁడయిన నాయకులగుదురా? జనద్వేషమునకును, పరిహాసములకును, బాధలకును వెనుకదీయక పామరులయొక్కయు, ధర్మభీరులయొక్కయు దురభిప్రాయమును గణనచేయక యితరుల తోడు లేకపోయినను భయపడక యసహాయశూరులయి యప్రియమయినను సత్యమార్గమును జూపు ధైర్యముగల పౌరుషభూషితులే కడపట నాయకులగుదురు. అట్టివారు మొదట కొంతకాలము దూషింపఁబడువారయినను తరువాత చిరకాలము భూషింపఁబడువారగుదురు. గుణాగుణగ్రహణము చాలని పామరుల మెప్పుతో మన కేమిప్రయోజనము? మన పనినిజూచి తెలిసినవారు మెచ్చుకొన్నప్పటివలె నవివేకులు మెచ్చుకొన్నప్పుడు సంతోషము కలుగునా? అనభిజ్ఞులు వేయిమంది మెచ్చుకొనుటకంటె నభిజ్ఞుడయినవా డొక్కఁడు మెచ్చుకొనుట శ్రేష్ఠతరము కాదా? కాఁబట్టి

మనకెప్పుడును బుద్ధిమంతులయొక్కయు మంచివారియొక్కయు మెప్పు మాత్రమే యపేక్షణీయము. జనులలో విశేషసంఖ్యాకు లెప్పుడును విమర్శలేని మూఢశిరోమణులుగా నుందురు గాన వారి మెప్పెప్పుడును కోరఁదగినదే కాదు. కాఁబట్టి మంచివారందఱికంటె నెక్కువ మంచి వాఁడును బుద్ధిమంతు లందఱికంటె నధిక బుద్ధిమంతుఁడును వివేకు లందఱికంటె ఘనవివేకియు నయిన యొక్క యీశ్వరుని మెప్పునకయి మాత్రమే మనము చూడవలెను. అతని మెప్పొకటియే శాశ్వత మైనది; తక్కిన మెప్పులన్నియు నెండమావులవంటివి. కాఁబట్టి యెవ్వరేవిధమున దూషించినను పాటిగాఁ బట్టక మతవిషయము నందును కులాచార విషయములందును నీతి విషయములందును జనులమెప్పు కోరక యీశ్వరప్రీతిని మాత్రమే కోరి సర్వాపదలను నోర్చి దేశక్షేమమునకయి పాటుపడవలెను.

మనము జనులకుఁ జేయవలసిన యింకొక యుపకారము కుల స్త్రీలలోను సామాన్యజనులలోను విద్యాభివృద్ధి చేయుట. మనమెంత తెలివిగలవార మయినను మన భార్యలను మన పొరుగువారిని మనతో సమానముగా తెలివిగల వారినిగాఁ జేయక వారిని మూఢత్వములో నుంచిన పక్షమున మనము విద్యాలాభమువలన సంతోషమును పూర్ణ ముగా పొందలేకపోవుట యేకాక వారి మూఢత్వమునుబట్టి మన మనేక కష్టములం పడవలసినవార మగుదుము. జనులకును స్త్రీలకును సద్విద్య చెప్పించిన పక్షమున ననేక దురాచారములను వారే తొలగించుకొని దేశక్షేమమునకు తోడుపడుదురు. అనేక కష్టములను మఱపించి హృద యము నానందపరవశముగాఁ జేసి మన కాంతలను దేవతాకాంతలను గాను మనగృహములను భూలోకస్వర్గములనుగాను మార్చెడి యద్భుత శక్తిగల గానవిద్యను కులాంగనలకు నేర్పి కుటుంబములు సంతోష

స్థానము లగునట్లు చేయుటయే కాక, అస్పృశ్యోపమానమయిన యీ సద్విద్యను పండువంటి సంసారములను పాడుచేయుటకు కంకణము కట్టుకొన్నట్టియు, పాతకములలో నెల్లను ఘోరపాతకమయిన జారత్వమును కువిద్యనుగాం జేకొనుటచే మానవజాతికంతకును దీఱని యవమానము తెచ్చుచున్నట్టియు వేశ్యలను పేరుగల పెనుభూతముల చేతులలోనుండి విడిపించుటకయి ప్రయత్నించుట దేశాభిమానలేశము గలవారి కంద తీక్కని ముఖ్యకర్తవ్యము. స్త్రీలకు నీతివిద్య మొదలగునవి యావశ్యకములని ప్రత్యేకముగాం జెప్పవలసిన పనిలేదు. తల్లియయి బిడ్డలకు విద్యాబుద్ధులు నేర్పవలసినదియు గృహమునకు రాణియై కుటుంబపరిపాలనము చేయవలసినదియు గృహపత్నియే యగుటచేతం దన సద్వర్తనమును జూచి బిడ్డలు సద్వర్తనము నేర్చుకొని వర్తించునట్లు చేయుటకును మూఢపూజలను విడిచి లోకేశ్వరారాధనము చేయుచు సమస్త సద్విషయములయందును విద్యాధికుఁడయిన భర్తతో నేకీభవించి లోకోపకార కార్యములయందెల్ల నాతనికి నిజమైన సహధర్మచారిణిగా నుండునట్లు చేయుటకును గావలసినంత విద్యను సంసారమును సంసారమునుగాం జేసికొని సుఖంపఁగోరు ప్రతిపురుషుఁడును గృహిణికి తప్పక చెప్పింపవలెను. పురుషునకు భార్య యర్ధశరీరమగుట సర్వజనాదరణీయమైన సిద్ధాంతమగుటచేత భార్య విద్యాగంధములేని మూఢురాలగునేని యీ యర్ధశరీరము పక్షవాతపీడితమయినట్లు కదలక మూఢత్వభారముచే సదా క్రిందికి దిగలాగుచుండుటనుబట్టి చదువుకొన్నభర్త సంసారసముద్రములో సుఖముగా తేలలేక యజ్ఞానాంధకారములో విచారజలావర్తమునందుఁ బడి తలక్రిందుగా మునిఁగి పోవును; అట్లుగాక భార్య జ్ఞానవాసనగల విద్యావంతురాలగునేని యీ యర్ధశరీర మారోగ్యతేజితమయినట్లు కరలాఘవము చూపి

వివేకప్లవముచే సదా వయికి తేల్చుచుండుటను బట్టి చనువుకొన్న భర్త సంసారసాగరములో సుఖముగా నీదుచు జ్ఞానతేజస్సులో నానంద ద్వీపమును జేరి తరించును. కాఁబట్టి విద్యాధికు లయినవారు తమ భార్యలకును తోడఁబుట్టినపడుచులకును కూఁతులకును సద్విద్యను జెప్పించి తమతో సమానవివేకము గలవారినిగాఁ జేయుటకయి సర్వ ప్రయత్నములను జేయవలెను. అజ్ఞానాంధకారమునఁ బడి జ్ఞానతేజో దర్శనము లేక పుట్టుగ్రుడ్డివలె నున్న మనదేశపు కులాంగనల కన్నులు తెఱపి విద్యాదీపముచేత వారికి పదార్థవిజ్ఞానము కలుగఁజేసి యనను భూతపూర్వమయిన నూతనసుఖమును లభింపఁజేయుటకయి కృషి చేయుట పురుషనామధారుని కెల్లను బరమధర్మము. ప్రతి విద్యాధికునికి స్త్రీవిద్యాభివృద్ధిని జేయుట యెంతధర్మమో జనసంఘమునకు విద్యాభి వృద్ధి చేయుటయు నంతధర్మమే. విశేషసంఖ్యాకు లెల్లయెడల నజ్ఞా నాంధకారములోఁ గన్నుగానక యంధులవలె తడవులాడుచు కష్ట పడుచుండఁగా వారిమధ్య నల్పసంఖ్యాకు లక్కడక్కడఁ గన్నుతెఱచి జ్ఞానదీపముచే వారిదురవస్థను జూడఁగలిగియు దయతో వారిగతి బాగుచేతఁ జూడక స్వసుఖమును జూచుకొనుచుండుట మానవధర్మ మగునా? జనభాహుళ్యము జ్ఞానమునం దభివృద్ధిని బొందినగాని దేశ మభివృద్ధి పొందనేరదు. అందఱును మూఢులయి కొందఱు మాత్రము వివేకులగుటచేత మూఢజనపరివృతులయిన విద్యాధికుల కును సంసర్గదోషమువలన బహుకష్టములు కలుగును. కాఁబట్టి విద్యా ధికులు తాముపొందిన విద్యాలాభమును జనసామాన్యమునకును గలి గించుటకయి శ్రమపడవలెను.

రాజ్యాంగవిషయములయిన స్వాతంత్ర్యములనుగూర్చి ప్రజ లకు తెలివిగలిగించుటయు జనులకొక యుపకారమే. పూర్వోక్తము

లయిన మత, నీతి, కుల, జ్ఞాన విషయములు నాలిగింటియందును పని చేయువా రిప్పు డంతగా మనదేశమునందుఁ గానఁబడక పోయినను రాజ్యాంగవిషయములయందు ప్రసంగించుటకుమాత్ర మనేకవక్తలు బయలు దేఱుచున్నారు. మతసంస్కారాదులలో బయలుదేఱక రాజ్యాంగ విషయములలోమాత్ర మింతమంది దేశాభిమానులు బయలు దేఱుటకు కారణమేమని కొందఱడుగవచ్చును. రాజ్యాంగవిషయ ములయందు శ్రమపడవలసిన యక్కఱ లేకయే సులభముగా ప్రసిద్ధి వచ్చుటయు, స్వప్రయోజనపరత్వమును, గొంతవఱకీ సాహసమునకుఁ గారణములని తోఁచుచున్నది. కొంచెము చదువుకొన్నవాఁడెల్లను తాను ప్రభువయి స్థానికప్రభుత్వము చేయుట కర్హుఁడ నయినా నను కొని తనకు జనపరిపాలకత్వము లభింపవచ్చునన్న యాశతో పని చేయుచుండవచ్చును. అయినను రాజ్యాంగవిషయములయందు సహితము స్వప్రయోజనపరులు చేయు కృషివలన నిజమయిన స్వాతంత్ర్యములును లాభములును కలుగనేరవు. మనము ముందుగా నీతియందు వృద్ధిపొందినంగాని రాజ్యాంగస్వాతంత్ర్యములను పొందుట కర్హులము కాఁజాలము. నీతివృద్ధికి మతాభివృద్ధి కావలెను. మన మతసత్యము లనేకములు దేశభాషలలో లేక జనసామాన్య దురవగాహమయిన సంస్కృతభాషలోనుండి జనసంఘమున కందని ద్రాక్షపండ్లయి స్వార్థపరులైన మతాచార్యుల పిడికిళ్ళలోనుండి విపరీత ప్రయోజనముకలవయి శిష్యహృత్తాపహారులుగాక విత్తాపహారులు మాత్రమయి యున్న గురువులకు జీవనాధారము లగుచున్నవి. రాజ్యాంగస్వాతంత్ర్యముల నిమిత్తమయి యత్నించుటకంటె ముందుగా మన కులాచారాదులను సంస్కరించుకొని తత్స్వాతంత్ర్యములను పొందుటకయి కృషి చేయవలెను. ఇంటి గాఢాంధకారమును తొలఁగించుకోలేని

వాఁడు బయట వెలుతురు నెట్లు వ్యాపింపఁజేయగలుగును ? మన భార్యలు విద్యాదీపములేక యవిద్యాంధకారములో మునిఁగియుండఁగాను, మనబాలురు మంచినీతియు మతమును లేక చెడుత్రోవలు త్రొక్కుచుండఁగాను మన వితంతుపుత్రికలు మన యనాదరముచేత ననాథలయి యావజ్జీవము సుఖహీనలయి బాధపడుచుండఁగాను స్వగృహమును బాగుచేసుకోలేని మనము దేశము నెట్లు బాగుచేయగలుగుదుము ? మన భార్యాపుత్రబంధువర్గమును ప్రేమించి మంచి స్థితికిఁ దీసికొనిరాలేని మనము లోకము నెట్లు మంచిదశకుఁ దీసికొని రానేర్తుము ? మన మిప్పటి భార్యలతోఁగూడి బహిరంగముగా భోజనము చేయుటకు సాహసింపలేము; కుటుంబమునంతను మునుముంచుకొని కలిసి యేకేశ్వరుని ప్రార్థనచేయుజాలేము; అతిబాల్యవివాహములను మానలేము; ఇతర దురాచారములను విడువలేము. ఇట్టి యల్పాంశములలో మనము బాగుపడి మనకుటుంబమును బాగుపఱుచుకోలేని మనము లోకము నేమి యుద్ధరింపఁ గలుగుదుము ? బాహ్యరోగములచే దేహములు కృశించుచున్నప్పుడు ఖేదపడి మందులు వేయించుకొనుచున్నట్లే పాపరోగములచే మనయాత్మలు కృశించుచున్నప్పుడు దుఃఖపడి తన్నివారణార్థమయి యీశ్వరప్రేమామృతౌషధము నేల పానముచేయఁ బ్రయత్నింపరాదు ? పొలములలో పయిరుపెట్టి తోఁటలువేసి ఫలానుభవము నుపేక్షించునట్లు బీడుపడియున్న మన హృదయక్షేత్రములను బాగుచేసికొని భక్తిసస్యములను పుణ్యఫలవృక్షములను వృద్ధిపొందించి పాపకంటకములను పెల్లగించి యేల శాశ్వతములయిన సత్ఫలములను బొంది సుఖింపఁ బాలుపడరాదు ? ఈపనులకన్నిటికిని బ్రతిబంధములు మనము సత్యములని ధర్మములని నమ్మిన వాని ననుష్ఠించుటకు ధైర్యము పూనలేకపోవుట మనము

వట్టి బోధనలు చేయుటకంటె బోధించిన ధర్మముల ననుష్ఠించి చూపుట మన కధికకర్తవ్యము. అనుష్ఠానము లేకపోయిన పక్షమున మన యుపదేశము లన్నియు నున్మత్తప్రలాపములవంటివయి నిష్ఫల మగును. స్వప్రయోజనపరత్వమువలనను, మాంద్యమువలనను, ఉపేక్షవలనను, భయమువలనను మనకు ధర్మమయిన పనిని చేయుటకు మనము వెనుక తీసిన పక్షమున మన మొక్కరమే చెడుటకాక కపటవర్తనులను జేసి మన సంతతివారికి సహితము చెఱుపు చేసినవార మగుదుము. మన మనోనిశ్చయప్రకారముగా నడుచుకొన్నయెడల మన కీలోకములో మూఢులవలనఁ గొన్ని కష్టములు రావచ్చును. వచ్చిననేమి? రానిండు. మనకు దేశాభిమాన మున్నపక్షమునను, సత్యాదర మున్నపక్షమునను, ఈశ్వరభక్తి యున్నపక్షమునను, కష్టములకు వెఱచి మన మణుమాత్రమును సత్కార్యమునుండి మరల రాదు. కార్యసాఫల్యము నకయి మన మెప్పుడును కష్టములతో పెనఁగులాడుచునే యుండవలెను. అదియే దేవుని యేర్పాటు. ఆ కష్టములతోడి పోరాటమువలననే మనము మనోదార్ఢ్యమును బొంది కార్యదక్షుల మగుదుము. మన సత్కార్యాచరణమువలన మన కిక్కడ కష్టములే కలుగుచున్నను లోకమున కయినను మేలు కలుగక పోదు; మన సద్వర్తనమును జూచి యనేకులు మంచినడత నేర్చుకొని సుఖపడకపోరు. అందుచేత మనము మృతుల మయినను, మనకార్యముల మూలమున భూమిమీఁద నెప్పుడును జీవించి యున్నవారమే యగుదుము. కాఁబట్టి మిత్రులారా! మీ యుపేక్షను మాంద్యమును విడిచి యిఁకనైన సత్కార్యములకు దీక్ష వహింపుఁడు; మాటలు చాలించి శీఘ్రముగా కార్యములకు పూనుఁడు. ధర్మచింతయు నీశ్వరభక్తియు లేకపోవుటచేత నాచరణములేక యుపన్యాసములును సభ

లును వ్యర్థములగుచున్నవి. కాఁబట్టి ధర్మచింతను, ఈశ్వరభక్తిని గలవారమయి పరిశుద్ధజీవనములను బొంది మృగస్థితినుండి దేవస్థితికి లేవఁ బ్రయత్నింతము. మనకిట్టి పనులకు ధైర్యసాహసములను గలిగింప సర్వాభీష్టఫలప్రదాతయైన పరమేశ్వరుని త్రికరణశుద్ధిగా వేఁడుకొందము.

# జీవితముయొక్క పరమార్థము
# దానిని పొందు మార్గము

ఓ భ్రాతృబృందములారా!

మన సమాజముయొక్క యీ పదునాఱవ సంవత్సరోత్సవ సమయమున మనవారి కోరికప్రకారముగా మనుష్యజీవితమునకు పరమార్థమేదో దానిని పొందు మార్గ మెట్టిదో నా శక్తికొలఁదిని కొంత చెప్పఁబోవుచున్నాను. నేను చెప్పఁబోవు దానిని దత్తావధానులరయి యాలకించి యీ మహావిషయమునుగూర్చి మీ మనస్సులలోఁ గొంచె మాలోచింపుఁడు. ఏ వస్తు వే ప్రయోజనము నుద్దేశించి చేయఁబడినదో తెలిసికొనవలె నన్నపక్షమున, ముందుగా మన మా వస్తుతత్త్వమును విమర్శింపవలెను. ఆయా వస్తువుల యవయవనిర్మాణక్రమమును, వానికి గల శక్తులను, వాని గుణస్వభావములను మనము విమర్శించి తెలిసికొన్నప్పు డేయే వస్తు వేయే ప్రయోజనముల నుద్దేశించి చేయఁబడినదో గ్రహింపఁగలుగుదుము. ఈ ప్రకారముగానే మనుష్యుఁ డేయే ప్రయోజనముల నుద్దేశించి సృజింపఁబడెనో, అందు పరమార్థ మేదో, దానిని సాధించుసాధనము లేవో తెలిసికోఁ గోరిన యెడల మనము మనుష్యప్రకృతినిగూర్చి చక్కఁగా విచారింపవలెను. జడపదార్థములయొక్కయు మనుష్యేతరజంతువులయొక్కయు నిర్మాణము సుబోధముగాను, అవి యేకరీతి ప్రకృతిధర్మములకే యెప్పుడును తప్పక లోఁబడునవిగాను ఉన్నందున వానివలని ప్రయోజనములను నిర్ధారణముచేయుట మిగుల సులభముగా నుండును. మనుష్యప్రకృతి యట్టి సుగమమయినది గాక మిక్కిలి దురవగాహమయినందున దాని పరమార్థమును నిర్ణయించుట యధిక ప్రయాసకరముగా నుండును.

నిపుణముగా పరిశీలించిచూడఁగా మనుష్యప్రకృతియందు భిన్న గుణములుగల రెండు ప్రత్యేకతత్త్వములు కానఁబడుచున్నవి. అం దొకటి సర్వజంతుసామాన్యమైన భౌతికతత్త్వము; రెండవది మనుష్యైకవిశేషమైన జ్ఞానతత్త్వము. ఈ రెంటిలో మొదటిదానిని శరీరమనియు, రెండవదానిని ఆత్మయనియు మనవారు చెప్పుదురు. సాకారమయిన యీ మొదటిదానిని స్థూలశరీరమనియు నిరాకారమైన ఈ రెండవదానిని సూక్ష్మశరీరమనియు వ్యవహరించుటకూడఁ గలదు. ఈ రెండుతత్త్వములును పయికిఁ జూచుటకు పరస్పరవిరుద్ధములయినవిగా కనఁబడును. అంతేకాక మనుష్యుఁ డితరజంతువులవలె నియతములైన ధర్మములకు లోఁబడి యెప్పుడు నేకరీతిగా నడుచువాఁడుగాక స్వేచ్ఛానుసారముగా సంచరించు స్వాతంత్ర్యముకలవాఁడుగా నున్నాఁడు. అతఁడు బాహ్యవస్తుప్రేరణముచేతనే నడపఁబడువాఁడు గాక తద్వ్యతిరిక్తముగా తన మనస్సు వచ్చినట్లెల్లను నడువఁగల వాఁ డగుటచేత, అతఁ డవలంబించు వ్యాపారములు నిరతిశయసంఖ్యాకములుగా నుండును; అతఁడు పూనుకార్యము లెన్నివిధములనో యసంగతములుగాను చంచలములుగాను నుండును; అతఁడు కోరుకోరిక లనంతములుగాను, చేయుప్రయత్నము లపరిమితములుగాను నుండును. ఈ విషయములయందు మార్పులేక యెప్పుడు నేకరీతిగా వర్తించుచుండు మృగములకును సదా కాంక్షలతోను భయములతోను యోచనలతోను ప్రయత్నములతోను కొట్టుకొనుచుండు మనుష్యులకును గలభేదమును విచారించినచో మహాస్తిమితకాంతరము కానఁబడును.

ఇట్టి వివిధావస్థలు గల మనుష్యజీవితముయొక్క పరమార్థమును మన మిప్పుడు నిశ్చయింపవలసియున్నది. లోకములోని యేపదార్థము

యొక్క ప్రయోజనమును దెలిసికొనవలెనన్నను దాని స్వభావమునుబట్టియే కాని వేఱుమార్గమునఁ గాదు. వివిధవస్తుధర్మములనుబట్టి రాళ్ళవలని ప్రయోజనము గృహనిర్మాణాదుల కుపయోగపడుట యనియు, లోహములవలని ప్రయోజనము పాత్రములు మొదలయినవానిని చేయుట కనుకూలపడుట యనియు, మల్లికాదిలతలవలని ప్రయోజనము పుష్పముల నిచ్చుట యనియు, పనసాదివృక్షములవలని ప్రయోజనము ఫలముల నొసఁగుట యనియు, వృషభాశ్వాదులవలని ప్రయోజనము భారమును వహించుట యనియు, మనము తెలిసికొనుచున్నాము. ఈ ప్రకారముగానే మనుష్యజీవితముయొక్క పరమార్థమును మనము మనుష్యస్వభావమునుబట్టియే నిర్ధారణచేయవలెను. ఇట్టి నిర్ణయమును జేయుటకు మన పట్టణములోని వారినిబట్టియే విమర్శింప నారంభింపవచ్చును. ఏ వీధిని జూచినను జనులు నానావిధవ్యాపారములయందు వర్తిల్లుచున్నారు. కొందఱితరస్థలములనుండి బండ్లమీఁదను పడవలమీఁదను వచ్చిన సరకుల నంగళ్ళకు మోయుచుందురు; కొందఱు అంగళ్ళనుండి యిక్కడిసరకుల నితరస్థలములకుఁ బంపుటకయి పడవలు మొదలయిన వానివద్దకుఁ గొనిపోవుచుందురు; కొందఱు ఆహారవస్తువులను వస్త్రాదులను విక్రయించుచుందురు; కొందఱు కూరగాయలు మొదలయిన వానిని కొనుచుందురు; కొందఱు పెట్టెలు బల్లలు మొదలయినవి చేయుచుందురు; కొందఱు అక్కడక్కడ గృహములను కట్టుట, నూతులు త్రవ్వుట మొదలయినపనులు చేయుచుందురు; మఱికొందఱు అచ్చటచ్చట వస్త్రములు నేయుట కుండలు చేయుట లోహపాత్రములు నిర్మించుట మొదలయిన వివిధకర్మములు చేయుచుందురు. ఊరుదాఁటి కొంతదూరము పోయిన పక్షమున పలువురు పొలములు దున్ని పైరులు పెట్టుట, యిటికెలు మొదలయిన గృహోపకరణములు

చేయుట మొదలయిన పనులయందు కాలము పుచ్చుచుందురు. ఈ వ్యాపారము లన్నిటినిబట్టి చూడఁగా మొట్టమొదట మనుష్యుఁడు తన పొట్ట పోసికొనునిమిత్తమును చలి మొదలగువాని బాధనుండి తప్పించుకొని శరీరమును కాపాడుకొనునిమిత్తమును సృజింపఁబడినట్లు తోఁచవచ్చును. వీథుల కిరుప్రక్కలనుండెడి యిండ్లన్నియు చలిగాలి నుండియు నెండనుండియు వాననుండియు శరీరములను రక్షించుట కుపయోగపడును; ఆహారపదార్థములు క్షుద్బాధనుండి శరీరములను గాపాడుట కుపయోగపడును; వస్త్రములు శీతోష్ణములనుండి శరీరమును కాపాడుట కుపయోగపడును. ఈ ప్రకారముగా దేనిని జూచినను మనకది దేహసంరక్షణార్థమో దేహసౌఖ్యార్థమో దేహాలంకారార్థమో యుద్దేశింపఁబడినట్లు కానఁబడును. పృథివ్యాపస్తేజోవాయురూపమయిన బాహ్యప్రపంచముతోడి యనివార్యసంబంధమును గలదయి, మన్నువలనను నీటివలనను నిప్పువలనను గాలివలనను బాధ నొందఁదగిన శరీరము మనుష్యున కుండియుండుటచేత దానిని సంరక్షించుకొని సుఖపడుట మనుష్యధర్మమగుటకు సందేహములేదు. అయినను మనుష్యుఁడు దేహసంరక్షణము చేసికొనుచు నింద్రియసుఖముల ననుభవించుచున్నంత మాత్రముచేత చరితార్థుఁడగునా? యన్న యంశము మన మాలోచింపవలెను. మనుష్యుఁడు శరీరసౌఖ్యము నిమిత్తము చేసికొనెడు సమస్తవ్యాపారములలోను మృగాదులయందుఁ గానఁబడని విశేష మొక్కటి కానఁబడుచున్నది. దేహము కాపాడుకొనుటకయి పాటుపడుట మృగమునకును మనుష్యునికిని సామాన్యధర్మము. పడెడుపాటులో నెల్ల నాలోచన యొక్కటి మనుష్యునకు విశేషము. ఈ యాలోచన యొక్కటి లేకపోయినపక్షమున దేహసంరక్షణవిషయమున మృగమునకంటె మనుష్యునియం దాధిక్య మేదియు

లేదు. ఒకవిధమునఁ జూడఁగా మనుష్యుఁడే మృగమునకంటె హీనుఁడని చెప్పవచ్చును. ఒక్కపూట భోజనమునకయి మనుష్యుఁ డెన్ని విధములనో పాటుపడి చెమటయూడ్చి పనిచేసి పాకము చేసికొనవలెను. మృగమున కింత యాయాసముతోఁ బనిలేదు. ఒకపశువు కొంచెము దూరము నడువఁగానే భూమిమీఁద విస్తరి వేసి వడ్డించి యాహారమును సిద్ధపఱిచియుంచినట్లుగా పచ్చికబయిళ్లు కానఁబడును. ఈ విధముగానే యింద్రియసౌఖ్యముతో సంబంధించినంతవఱకు ప్రతి విషయములోను మృగాదులకంటె మనుష్యుఁడే యెక్కువ కష్టపడవలసియుండును. ఇట్లున్నను మృగాదులకంటె మనుష్యున కాధిక్యము తెచ్చినది యాతనికున్న యాలోచన. ప్రతికార్యములోను మనుష్యుఁడాలోచనను బుద్ధిని జూపవలసి యున్నది. ఈ బుద్ధిబలముచేతనే మనుష్యుఁడు తన దేహసౌఖ్యము నిమిత్తమయి వస్తుతత్త్వములను శోధించి యంత్రములను కనిపెట్టి యినుమును నీటిమీఁద తేలించి యోడలతో సముద్రములు దాఁటియు, నీళ్లను నిప్పుచే కాఁగించి యావిరిచే వాయువేగమున బండ్లులాగుట, వస్త్రాదికము నేయుట, మొదలయిన పనులు చేయించియు, మెఱుపుల నాకాశమునుండి యాకర్షించి యినుపతీగలలోఁ బెట్టి మనోవేగమున వానిచేత దూరదేశములకు వార్తలను పంపియు, దుస్సాధ్యములయిన కార్యములను సాధించి తన యసమానసామర్థ్యమును లోకమునకుఁ జూపుచున్నాఁడు. ఇట్టి బుద్ధిసంపద మనుష్యుని కొకనికేఁ దక్క మఱి యే యితరజంతువునకును లేదు. మనుష్యేతరజంతువునకు దేనికిని లేని యీ బుద్ధివిశేషము సర్వజంతుసామాన్యమయిన దేహాభరణమున కుపయోగించు సాధనములను గనిపెట్టునిమిత్తమే మనుష్యున కియ్యఁబడినదా, లేక దానివలన సాధింపఁ దగిన యాధిక్యము మఱి యేదియైనను నున్నదా? యన్న

యంశమును మనము కొంచెము విచారింపవలసి యున్నది. నిత్యమయి నిరంతరాభివృద్ధిని బొందఁదగిన యాత్మ యనిత్యమును క్షణభంగురమైన శరీరనిమిత్తమే చేయఁబడిన దనుట మందబుద్ధికి సహితము వింతగా తోఁచకమానదు. మన బుద్ధిని దేహసుఖమున కుపయోగించు పనులకొఱకు నుపయోగించుచున్నను, ఆ పనులలోఁగూడ నొకవిశేషము పొడకట్టుచున్నది. శరీరసౌఖ్యమున కనుకూలించునన్న యుద్దేశముతో బుద్ధినుపయోగించి పనిచేసినప్పు డొకవేళ కార్యసాఫల్యము కాకపోయినను, ఆలోచనవలనను తత్కాలమున లభించెడు జ్ఞానమువలనను మనస్సున కానందము కలుగుచున్నది. కార్యసాఫల్యమువలనఁ గలిగెడి యల్పసంతోషమునకంటె జ్ఞానలాభమువలనఁ గలిగెడి యానందమత్యధికముగా నున్నది. దేహసౌఖ్యమునకావలయు పనులలో సులభమార్గములను కనిపెట్టుటనిమిత్తమే మొట్టమొదట మన మాలోచించినను, ఆ యాలోచనవలనను తదనుసారమైన శోధనవలనను ప్రారంభమున నుద్దేశింపఁబడిన పనితో బొత్తిగా సంబంధములేని క్రొత్తక్రొత్త సత్యములు బయలఁబడి తత్కర్తకు హృదయానందమును గలిగించుటయే కాక యాసత్యములే తరువాత శాస్త్రములయి లోకమునకు మహోపకారమును సంతతసంతోషమును గలిగించుచున్నవి. ఒక్కొక్కపని నిమిత్త మొక్కొక్కవస్తువును శోధించునప్పుడు దాని ధర్మములను కనుఁగొనుటయే కాక దాని కితరవస్తువులతోఁ గల సంబంధమును, ఒక్కొక్కజాతి వస్తుకోటికి సామాన్యమైన విశేషధర్మములను, సర్వవస్తుసామాన్యములైన ధర్మములను మనుష్యుఁడు కనిపెట్టుటకు సమర్థుఁడగును. ఆరంభదశలో పూనిన కార్యాంశమెట్లున్నను నడుమ కనిపెట్టఁబడిన యవాంతరవిషయములవలననే లోకమున కుపకారమును మనస్సున కాహ్లాదమును కలుగుచుండును.

అందుచేతనే బుద్ధిమంతు లగువా రనేకులు జనసౌఖ్యదాయకమైన వేలుపనిని దేని నుద్దేశింపకయే వస్తుధర్మపరిశీలనమునే పనిగాఁ జేసికొని యా పని నిమిత్తమయి యెండకు వానకు నోర్చి యాఁకలియు దప్పియు సరకుగొనక శరీరకష్టమునకును, ధననష్టమునకును సహించి యపాయకరములైన యరణ్యములను సముద్రములను జొచ్చి యా పని నిమిత్తమే దేహసౌఖ్యములను దేహములను యావనమును ధారపోయుచున్నారు. ఒకఁడు జంతుస్వభావలక్షణములను గనిపెట్టవలెనని భార్యాపుత్రులను గృహములను విడిచి మనుష్యసంచారములేని మహారణ్యమును దూఱి క్రూరమృగమధ్యమున కష్టజీవనము చేయుచున్నాఁడు. ఒకఁడు ద్వీపాంతరములను కనిపెట్టవలెనని దారిలేని మహాసముద్రములమీఁదఁ బోయి ప్రచండవాయువులకును సంతతతీవ్రధారాపాతమునకును సంచలింపక గాలిలోని దీపమువలె నల్లలనాడుచుండెడి యోడలో మహాజలమధ్యమున ప్రాణముల కాశింపక యాత్ర చేయుచున్నాఁడు. ఒకఁడు తేజోవాయుశక్తులను పరీక్షింపవలెనని దుర్గమములైన పర్వతాగ్రముల కెగఁ బ్రాఁకి యందు చలువలు గ్రమ్మించి దేహములు కంపమొందించెడు మంచులో మహావాయుపథమున కాలము గడపుచున్నాఁడు. ఒకఁడు భూగర్భమును శోధింపవలెనని పాతాళలోకమంటునట్లుగా గోతులు త్రవ్వి భూమియొక్క పొరలను నడుమనడుమఁ గానఁబడెడు జంతుకంకాళములను నిరూపణచేయుచు నధోభాగమున నంధకారబంధురముగానుండి కొలుములవలె దుస్సహతాపమును గలిగించెడి యగాధబిలములలో ప్రొద్దుపుచ్చుచున్నాఁడు. ఒకఁడు నదుల జన్మస్థానములు మొదలయినవి కనుఁగొనవలెనని మరుభూములలోను వాలుకామయస్థలములలోను బడినడిచి బహుప్రయాసముతో

దేశసంచారము చేయుచున్నాఁడు. ఒకఁడు గ్రహనక్షత్రాదులగతులు నిరూపింపవలెనని రాత్రులు నిద్రమాని కొంత లెక్కించుచు దూరదేశముల కరిగియు నాకాశమండలి గోళగోటులను సంశోధించుచున్నాఁడు. ఈరీతిగా శరీరాయాసమునకును ప్రాణాపాయమునకును భయపడక పనిచేసిన బుద్ధిమంతుల బుద్ధిబలమువలననే మనకిప్పుడు జంతుశాస్త్రములు, జలశాస్త్రములు, తేజోవాయుశాస్త్రములు, పృథ్వీతత్త్వశాస్త్రములు, భూగోళశాస్త్రములు, ఖగోళశాస్త్రములు మొదలయిన నానావిధప్రకృతిశాస్త్రము లుద్భవిల్లి జనపరంపర కానందలాభములను గలుగఁజేయుచున్నవి. వీని నన్నిఁటినిబట్టి చూడఁగా శరీరసౌఖ్యమునకంటె మనస్సౌఖ్యమే యధికమైన దనియు, మనస్సౌఖ్యమునకు భంగము కలుగనున్నప్పుడు శరీరసౌఖ్యమును పాటింపకుండుట మానుషధర్మమనియు స్పష్టమగుచున్నది. పైని వివరించిన భౌతిక పదార్థధర్మములను దెలిపెడు శాస్త్రములు గాక మనస్సున కానందమును వినోదమును గలిగించెడు కావ్యనాటకాదులును తర్కవ్యాకరణాది శాస్త్రములును మనోబలకల్పితములయి యున్నవి. ఒక్క రసికపురుషుఁడు యావజ్జీవమును పొందఁగలిగిన యింద్రియసుఖము నంతను కలిపినను మంచిబుద్ధిమంతునిచేఁ గల్పింపఁబడిన కావ్యము నొక్కదానిని వినుటవలన నొక్కదినమునఁ గలుగు సంతోషముతో సరిరాదు. అధికసుఖము నిమిత్తమయి యల్పసుఖమును విడుచుట బుద్ధిమంతుని లక్షణమగుట యెల్లవారును నెఱిఁగిన యంశమే యగుటచేత, దేహసుఖమునకంటె మానసికసుఖ ముత్కృష్టమయినదని నే నిక్కడ పెంచి చెప్పవలసిన యావశ్యకము లేదు. ఇంకొకసంగతి వినుఁడు. మనము పొలములనుండి మనపురవీథులకు మరలవచ్చి నడుచునప్పుడు మనుష్యబుద్ధివికాసమున కుత్తేజకము లైన పారిశ్రామికవస్తు [illegible]

కక్కడక్కడ నేత్రగోచరము లగును. కొంచె మాలోచించి చూచిన పొలములలో దున్నుకొనువారును వీధులలో మూటలు మోయు వారును జనులచే గౌరవింపఁబడకుండుటయు పాఠశాలలలోఁ జదివి శాస్త్రపరీక్షలయందు మెప్పొందినవారు వారికంటె సహస్రగుణము లధికముగా గౌరవింపఁబడుచుండుటయు నెల్లవారికి స్ఫురింపకమా నదు. ఈ యొక్కయాంశమే దేహమునకంటె మనస్సు ప్రధానమ యినదనియు దేహసౌఖ్యమునకంటె మానసికసౌఖ్య మధికాదరణీయ మయినదనియు స్థాపించుటకుఁ జాలియున్నది.

క్షణభంగురమైన శరీరమునకంటె నిత్యమయిన మనస్సుత్కృష్ట మయినదని తెలిసికొన్నపిమ్మట, వివిధములయిన మానసికధర్మము లనుగూర్చి యించుక విచారింపవలసియున్నది. ఈమానసికధర్మము లనే యాధ్యాత్మికధర్మములని సామాన్యముగా వ్యవహరింతురు. ఈ పైని జెప్పఁబడినది యాధ్యాత్మిక ధర్మములలో నొకటియైన జ్ఞానము. ఇదియే సత్యము. సత్యమనగా వస్తుధర్మముల నున్నవి యున్నట్టుగా గ్రహించుట. ఈసత్యమును కనుఁగొను నిమిత్తమే ప్రకృతి శాస్త్రజ్ఞులు లోకములోని సమస్తసౌఖ్యములను విడిచి, నానాకష్ట ములకు లోనయి ప్రాణములకు సహిత మాశపడక తమ జీవిత ములను తత్త్వశోధనమున కర్పించియున్నారు. అట్టివారికి సత్యమే పరమదైవతము. వారు వస్తుశోధనము చేసినకొలఁదిని ప్రతివస్తు వునందును మొట్టమొదట ప్రాతఃకాల సూర్యకిరణములవలె వారి జ్ఞానదృష్టికి సత్య మణుమాత్రముగా కానఁబడి యంతకంత కధిక ముగా ప్రజ్వరిల్లి వారి కపరిమితానందమును గలిగింపఁ జొచ్చెను. సమస్త వస్తువులయందును సూర్యకిరణములవలెఁ దోఁచి శోభిల్లు చున్న నూతనసత్యములను జూడఁగా చూడఁగా సర్వత్ర వ్యాపించి

యున్న యీ సత్యకిరణ ప్రసారమునకు మూలకారణమై కోటిసూర్య ప్రభాభాసమానమైన పరమసత్యజ్యోతి కొందఱి దృష్టులను మిఱుమిట్లు గొలిపి ప్రపంచమును మఱచునట్లు చేసెను. ఇట్లు శోధన చేసిన వారిలో ననేకులు బాహ్యప్రపంచమునందు మాత్రమేకాక తమ మనస్సులయందును సత్యజ్యోతి దేదీప్యమానముగా వెలుఁగుచుండఁ జూచిరి. అందుచేతనే కొందఱు ప్రత్యేకముగా మనోధర్మములను పరిశీలించుటలోనే కాలమునంతను గడపి వివిధములైన యాధ్యాత్మికశాస్త్రములను జేసిరి. ఈపరిశీలనలోఁ గొందఱి మనోనేత్రములకు తమలోపలనున్న జ్ఞానతేజస్సుయొక్క మహిమచేత బాహ్యప్రపంచమే తోఁచకపోఁగా, అట్టివారు ప్రపంచము మిథ్యయనియు మనఃకల్పితమనియు మాయయనియు భ్రమయనియు నంతట నిండియున్న జ్ఞానరూపమయిన పదార్థమొక్కటియే సత్యమనియు సాధింపఁ జూచిరి. ఇట్టివారు కొందఱు సర్వత్ర వ్యాపించియున్న జ్ఞానశక్తిని తమలోపల నిమిడియుండి నిరంతరాభివృద్ధి నొందఁదగిన జ్ఞానశక్తినిజూచి భ్రమించి యీరెండుశక్తులు నొక్కటియే యనియు తామే బ్రహ్మలనియు భావింపఁజొచ్చిరి. తాము సర్వజ్ఞులు కాకపోయినను బాహ్యప్రపంచము మిథ్య కాకపోయినను, మానసికశక్తులముందఱ భౌతికశక్తులు పర్వతములో పరమాణువంత యయినను కావని స్పష్టపడుచున్నది. మనలోపలను వెలుపలను వ్యాపించియున్న సత్యమహిమలను నిపుణముగా పరిశీలించిన ధీమంతులు కొందఱీ రెండుశక్తులు నెంతయధికముగా నున్నను పరిమితములే యన్నసత్యమును కనుఁగొని యవి పరతంత్రస్వభావము కలవగుట భావించి పరిమితమునుండి యపరిమితము నూహచేసి దానికిఁగారణభూతమయిన పరిపూర్ణజ్ఞానస్వరూపమయిన పరబ్రహ్మమును వేఱుగా

దెలిసికొని సేవించి ఆనందింపఁ జొచ్చిరి. మనకు లోఁబడి మనసౌఖ్యమున కనుకూలపడుచు మనకు సేవకప్రాయములుగానున్న పృథివ్యాపస్తేజోవాయువులు సహితము కొన్నిసమయములయందు మన కపఁగ సివియు ప్రతికూలము లయినవియు నయి మీకును మాకును శాసకుఁడై సర్వాత్మకుఁ డయియున్న పరమాత్ముఁడొకఁడు పయినున్నాఁడని సహస్రముఖముల ఘోషించుచుండును. మన వంటయింటనుండి యాహారపదార్థములను పక్వము చేసెడి యగ్నిహోత్రమే యొకానొకప్పుడు తీవ్రజాలలతో లేచి యాగార్పశక్యముకాక మనగృహములను వస్త్రములను దేహములను గూడ భస్మము చేయుచున్నది. మనచెమ్మట లార్చెడు మలయమారుతమే యొకానొకప్పుడు తీవ్రప్రభంజనముగా మాఱి మనగృహములను సస్యములను క్షణకాలములో నేలమట్టము చేయుచున్నది. వానలను బంపి మనపైరులను పండించెడు మేఘమే యొకానొకప్పు డతివృష్టిని పిడుగులను బంపి మన దేహములకును గేహములకును వినాశము కలిగించుచున్నది. అట్టిసమయములయందిట్టివి మనుష్యహృదయములలో భీతిని బుట్టించి యీశ్వరుని మహిమలను వెల్లడింపకుండునా? గాలివానలును తుపానులును మెఱుములును సుడిగాడ్పులును భూకంపములును వహ్నిపర్వతనిస్సరణములును మనస్సుల కాశ్చర్యమును భీతిని బురికొల్పి సృష్టికర్తయొక్క శక్తిమహిమలను వెల్లడింపనిపక్షమున లోకములోనివి మఱియేవి వెల్లడించును?

మానసికశక్తులలో నింకొకటి కారుణ్యము. దీనినే కొందఱను రాగ మనియు ప్రేమయనియు వివిధనామములతోఁ బిలుతురు. ఈ దయాగుణము మనుష్యున కలంకారభూతమైనది. మనము వీధులలో నడుచునపుడు డేయింటికిఁ బోయి చూచినను కారుణ్యము స్పష్టముగా కానఁ

బడును. ఒక యింటనుండువారు పరస్పరానురాగముకలవారయి యొం డొరులకు మేలు చేసికొనుచుందురు. వృద్ధులయిన తల్లిదండ్రులను తన యులు స్వకష్టములకు సహించి భక్తితో పూజించి వారికి సమస్తోప చారములను జేయుచున్నారు. దృఢగాత్రులు నిద్రమాని శరీరాయాస పడి వ్యాధిగ్రస్తులకు మందుమాకులిచ్చి కరుణతో సంరక్షణచేయు చున్నారు. జననీజనకులు తాము సమస్తకష్టములను పడి తమకడు పైనఁ గట్టుకొని బిడ్డల కేలోపమును గలుగకుండ ప్రేమతో వారిని కాపాడుచున్నారు. ఇంటనున్నవారు దయచూపునది యొక్క కుటుం బములోనివారికి మాత్రమే కాదు. కొన్నిసమయములందు గృహస్థు లభ్యాగతులను బంధువులను బీదలను బిలిచి తమయింట భోజనములు పెట్టి యాదరించుచున్నారు. ఒక్క గృహస్థుల గృహములలో మాత్రమే కాక వీధులయందు నడుచునప్పుడు మన కీదయాగుణముయొక్క చిహ్నము లక్కడక్కడఁ గానవచ్చుచునేయుండును. సత్రములు చలిపందిరులు, వైద్యశాలలు మొదలయిన సర్వజనోపయుక్తధర్మనిల యములు మనుష్యునిలోఁగల యీదయాగుణమును చాటుచున్నవి. మన గృహములయందలి గోవులు మొదలయినవి తమదూడలను పాలిచ్చి ప్రేమతోఁ గాపాడుచుండుట చూడఁగా, దయాగుణము పశుపక్ష్యాదులలోను సర్వపదార్థములలోనుగూడఁ గానఁబడుచున్నది. సృష్టియందంతటను వ్యాపించియున్నది సత్యము మాత్రమేకాక కారు ణ్యముకూడ నని యెల్లవారు నెఱుఁగవచ్చును. ఈకారుణ్యము మన మనోగుణములలో నొకటియై యున్నది. మనుష్యులలోను పశుపక్ష్యా దులలోనుగల దయాగుణము పరిమితమయినదిగాఁ గానఁబడుచున్నది. అందులో మనుష్యులకుఁగల దయాగుణ మంతకంత కధికము కాఁదగినది గా నున్నది. సృష్టిలోని యీ పరిమితదయాగుణమునుబట్టి మనుష్యుఁడు

సృష్టికర్తయొక్క యపరిమిత దయాగుణము నూహించి కనుఁగొనుచున్నాఁడు. అపరిమిత సత్యతేజస్సునుబట్టి యీశ్వరుఁడు సత్యస్వరూపుఁడనియు సర్వజ్ఞుఁడనియుఁ జెప్పఁబడునట్లే యీయపరిమిత దయాగుణమునుబట్టి దయాస్వరూపుఁడనియు సర్వకారుణ్యుఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు.

మన మానసికగుణములలో మఱియొకటి న్యాయము. దీనినే నీతి యందురు. ఈగుణము మనుష్యునకుఁగల గుణములలోనెల్ల సర్వోత్కృష్టమయిన దగుటచేత దీనిఁ గుణరాజమని చెప్పవచ్చును. పరదారధనాదులను గోరక వంచనముమాని సమస్తవ్యవహారములలోను పరులయెడ ఋజువుగా ప్రవర్తించుటయే న్యాయగుణము; ఇదియే మనప్రవర్తనకు మార్గదర్శకము. దీనిని మీఱి నడుచుట పాపము; దీని ననుసరించుటయే పుణ్యము. న్యాయమైనమార్గమును మీఱి నడువఁబూనునప్పుడెల్ల మనయంతరాత్మ యది పాపమని బోధించుచుండును. ఇట్లు పుణ్యపాపములనుగూర్చి మనయంతరాత్మచేయు బోధనమే మనవృత్తమును నడిపెడి యీశ్వరశాసనము. హృదయఫలకమునందు లిఖింపఁబడియున్న యీశ్వరశాసనరూపమయిన యీవాక్యముల నతిక్రమించువాఁడు పాపాత్ముఁడై యాత్మదుఃఖములపాలగును. మానసికధర్మములలో నిది యొక్కటియైనను మనుష్యుని పవిత్రమైన మనుష్యనామధారణమునకర్హునిగాఁజేయు ప్రధానధర్మమయినందున ముఖ్యముగా నిదియే ధర్మమని చెప్పఁబడును. మనుష్యనామమునకు యోగ్యుఁడగువానికెల్ల నీతి యవశ్యముగా నుండవలెను. నీతిలేనివాఁడు మృగప్రాయుఁడు; మనుష్యనామధారణమునకనర్హుఁడు. ఇది చేయవలెను; ఇది చేయరాదు; అని బోధించెడు శాసనమొకటి మన హృదయములోనున్నందున, ఆశాసనమును మీఱి

నడుచువా రెల్ల శిక్షార్హులని యేర్పడుచున్నది. మనము చేయు కార్యములయందు మన మొక శాసనమునకు బద్ధులమయి, మనము చేసెడిపనులకు మన ముత్తరవాదుల మెప్పుడగుదుమో, అప్పుడు మనలను శిక్షించి యేలువాఁ డొకఁడుండక తీరదు. కాఁబట్టి మనలను నీతిమార్గమున నడువ నియమించిన యామహానుభావుఁడు ధర్మస్వరూపుఁ డయిన పరమేశ్వరుఁడు. ఈనీతిగుణమునను వహించినవారయి ప్రపంచ సుఖములన్నియు పోయినను నీతిమార్గము నణుమాత్రమును తొలఁగక వర్తించువారినే జను లెల్లకాలమును ప్రేమచూపి గౌరవింతురు. సత్యము నిమిత్తమును ధర్మము నిమిత్తమును సకలకష్టములకు లోనయి శరీరమును సహితము విడువసాహసించిన మహాపురుషులనే మనము శ్లాఘింతుము గాని ధర్మము తప్పి శరీరమును పోషించుకొన్నవారిని మనము మెచ్చుకోము. ఎప్పుడో లోకాంతరగతులయిన హరిశ్చంద్రుఁడు మొదలయిన వారిమీఁద మన మిప్పటికిని ప్రేమ చూపుచు వారు పడిన కష్టములను విన్నప్పుడని మనకు వచ్చినట్టుగా పరితపించుచుండుటకుఁ గల కారణము భగవంతుఁడు మానవహృదయములో స్థిరముగా స్థాపించిన ధర్మాభిరతిగాక మరియేమగును? ఇట్టి స్వాభావికమయిన ప్రేమము మనకు నిజమైన పురుషులమీఁదనేకాక పురాణములలోను నాటకములలోను గల పుణ్యాత్ములయిన కల్పితపురుషుల మీఁదను గలుగును. ఈన్యాయగుణము మనుష్యకోటిలో నెల్లను గల దనుట కెంతటి మృగప్రాయుఁడయినను తనకు ప్రేమాస్పదుఁడయిన పుత్రుఁడు దొంగతనము చేసినప్పుడును వానిని శిక్షింపఁజూచుట నిదర్శనముగా నున్నది. మనము వెనుకఁ జెప్పినరీతిని పట్టణములో నడుచునప్పుడును మనుష్యుని నీతిగుణమును సూచించు చిహ్నములు పెక్కులు కానఁబడును. మన కందందుఁ గానవచ్చెడు రక్షకభటులయొక్కయు

దండవిధాయకులయొక్కయు సభలును, న్యాయసభలును, చెఱసాలలు మొదలయినవియు ప్రజలను ధర్మమార్గమున నడిపించుటకొఱకును ధర్మము తప్పినప్పుడు శిక్షించుటకొఱకును నేర్పడినవేకదా ?

మనము పట్టణవీథులలో సంచరించునపుడు కంటికిఁ గానఁబడెడి వస్తువులనుండియే మనుష్యునికిఁగల మానసికగుణము నింకొక దానిని తెలిసికొనవచ్చును. పట్టణములోని కొన్నిప్రదేశములకు పోయిన పక్షమున మనకు నానామతస్థుల దేవాలయములు దృష్టిగోచరములగును. ఈశ్వరారాధనము నిమిత్తమయి జను లాదేవాలయములకు భక్తితో గుంపులుగుంపులుగా పోవుచుండుటయు మనము చూడవచ్చును. ప్రతి మనుష్యుని హృదయమునందును తాను పరతంత్రుఁడ ననియు, తానుజేయు కార్యములకు ఫలములనిచ్చు నిత్యపురుషుఁ డొకఁడు పైనిగలఁ డనియు, తానాతని నారాధించినచో శాశ్వతసుఖమును పొందవలెననియు, తానాతని ప్రీతినిమిత్తమే సమస్తకార్యములను జేయవలయుననియు, దృఢవిశ్వాస మొకటి స్వాభావికముగా నున్నది. ఈవిశ్వాసములోనే తనయాత్మ దేహముతో నశించునది గాక శాశ్వతముగానుండి మరణానంతరమునను పుణ్యపాపఫలముల ననుభవించుచుండు నన్న సత్య మిమిడియున్నది. ఈశ్వరుని నారాధింపవలయు నన్న యిచ్ఛ మనుష్యుని కనివార్యముగా నున్నది. దేవుని నారాధింపకపోయినపక్షమున మనుష్యునికి హృదయశాంతి గలుగదు. కాఁబట్టి యీశ్వరభక్తిపరాయణత్వము మనుష్యునికిఁగల మానసికగుణములలో నాలవది. పూర్వోక్తములయిన మూడు గుణములను బట్టి గలిగిన దగుటచే దీనిని నాలవదానినిగాఁ జెప్పవలసివచ్చినను, అన్నిటియొక్క సత్ఫలమగుటచేత నిదియే ప్రధానమైనదిగా పరిగణింపఁ బడవలసినది. తక్కినగుణములకు వన్నెతెచ్చి వానిని శోభిల్ల జేసెడి యద్భుత సామర్థ్య మీ భక్తిరతిలో నున్నది. జీవాత్మకుగల యీ

నాలుగు గుణములను పరస్పరానుకూలముగా వృద్ధినొందించి యానందించుటయే మనుష్యజీవితముయొక్క పరమార్థము. ఈనాలుగుగుణములును సమానముగా వృద్ధినొందక యందుఁ గొన్నిమాత్రమే వృద్ధి పొందినయెడల నది నిజమయిన యభివృద్ధికాదు. మన శరీరమునకు కరచరణాదు లెట్లంగములో మనయాత్మకు జ్ఞానాదులట్లే యంగములు. సర్వావయవములును యథాప్రమాణముగా పెరిగి యారోగ్యదశయందున్నప్పుడే దేహ మభివృద్ధి పొందినదని చెప్పవచ్చును; గాని యందుఁ గొన్ని యవయవములు మాత్రము పెరిగినప్పుడు వృద్ధి యని చెప్పఁదగదు. ఒక్కయవయవముమాత్రము పెరిగినప్పు డది రోగమని భావింపవలెను. ఒక్కకాలుగాని పొట్టగాని పెరిగినప్పుడు బోదకాలనియు మహోదరమనియు చికిత్సలు చేయించుచుండుట యెల్లవారు నెఱుఁగుదురుగదా? ఈయంగములలో నుత్తమమైన యంగము పెరిగినను, అదియు రోగసూచకమేకాని బలహేతువు గాదు. అంగములలోనెల్ల నుత్తమాంగమైన తల పెరిగినప్పుడును, సర్వేంద్రియములలోను ప్రధానమైన కన్ను పెరిగినప్పుడును, మఱింత శ్రద్ధతో చికిత్స చేయించుచుండుట యెల్లవారికి ననుభవగోచరమైన విషయమే. ఈప్రకారముగానే మానసికగుణములన్నియు పరస్పరానుగుణముగా పెరిగినప్పుడే యాత్మాభివృద్ధి యగును గాని యెంత యుత్తమమైనదైన నితరగుణములకు ప్రతికూలముగా నొక్కగుణము పెరుగుట యాత్మాభివృద్ధి కాదు. కొందఱు పూర్ణమయిన భక్త్యావేశము కలవారయ్యును తదితరగుణములను పాటింపకపోవుటచేత నీశ్వరుని పేరనే యనేక క్రూరకృత్యములను జేయుచు మనుష్యులని చెప్పఁబడుటకే యనర్హులగుచున్నారు. జ్ఞానమునందును కారుణ్యమునందును, నీతియందును, భక్తియందును సమానముగా వృద్ధినొందుటయే నిజమైన మానసికవృద్ధి. అట్టివృద్ధిని బొంది నిత్యానం

దమును బొందుటయే మనుష్యునికిఁ బరమార్థము. దీనిని బొందుట కొఱకే మనుష్యరూపమును ధరించిన వారందఱును నిరంతరకృషి చేయుచుండవలెను. మనుష్యుఁడు సమస్తవిషయములలోను మితజ్ఞుఁడగుటచేతను భ్రమప్రమాదాదులు మనుష్యునికి సహజగుణము లగుటచేతను మనుష్యుఁ డెప్పుడును పరిపూర్ణుఁడు కానేరఁడు. కృషి చేసిన కొలఁదిని వృద్ధిపొందుస్వభావము గలవాఁడగుటచేత సమస్తవిషయములయందును వృద్ధికిఁ బ్రయత్నించుచు బాటుపడి సాధ్యమయినంత యధికానందమును బొందుచుండుట మనుష్యునకుఁ బరమధర్మము. ఇదియే మనుష్యునకుఁ బరమార్థము.

ఇప్పుడు మనుష్యజీవితమున కేదిపరమార్థమో కొంతవఱకుఁ జెప్పితిని గాన నేనిఁక దానిని పొందు మార్గమునుగూర్చికూడ కొంత చెప్పెదను. ఉత్తరోత్తరాభివృద్ధిని సదా కలిగించుచు మనుష్యుని పరిపూర్ణస్థితికిఁ గొనిపోయి నిత్యానందమును గలిగించి పరమార్థమును సమకూర్చునది పరిశుద్ధాస్తికమతము. అట్టి పరమార్థమును కలిగింపక యేవిషయమందైనను మానసికాభివృద్ధికి భంగము కలిగించెడు పక్షమున, ఆమతము పరిశుద్ధమయినది కాదు. మతమనఁగా జీవాత్మకు పరమాత్మతోడి సాంగత్యమును కలిగించి తన్మూలమున నిరంతరాభివృద్ధిని నిత్యానందమును సమకూర్చునది. మనుష్యునికి స్వాభావికముగా జ్ఞానమును, కారుణ్యమును, నీతియు, భక్తియు, పరిమితములుగా నుండి సంతతాభివృద్ధిని పొందఁదగినవిగా నున్నవి. ఈగుణములీశ్వరునియందువలె పరిపూర్ణదశను పొందకలేకపోయినను, వాని యభివృద్ధికి పరిమితిమాత్రము కానరాదు. ఈశ్వరుఁడు పరిపూర్ణజ్ఞానకారుణ్యధర్మస్వరూపుఁడు. పూర్ణజ్ఞానకారుణ్యధర్మము లీశ్వరగుణము లగుటచే, ఈగుణములతో సంబంధించినంతవఱకు మనుష్యుఁడు దేవస్వభావము కలవాఁడుగా నున్నాఁడు. ఈగుణములలో నభివృద్ధిని

పొందిన కొలఁదిని మనుష్యుఁడు దేవత్వము సమీపించుచుండును. దీనినే వేదాంతులు సామీప్యముక్తియని చెప్పుదురు. ముక్తి యనఁగా జీవాత్మ పాపసంబంధమునుండి విముక్తమయి యీశ్వరసామీప్యముచే సుస్థిరానందము పొందుట. పుణ్యమార్గ మెప్పుడును జీవాత్మను భగవత్సాన్నిధ్యమునకుఁ గొనిపోవును; పాపమార్గ మెప్పుడును జీవాత్మను భగవత్సాన్నిధ్యమునుండి దూరముగా తొలఁగించును. జ్ఞానాదులు మనుష్యుని పుణ్యమార్గమున నడిపించి యానందమును గలిగించును; అజ్ఞానాదులు మనుష్యుని పాపమార్గమున కీడ్చి దుఃఖమును కలిగించును. జ్ఞానాదులు దేవునికిని మనకును సామాన్యగుణములయినందున దేవధర్మములును, కరచరణాదులు మృగములకును మనకును సామాన్యము లయినందున మృగధర్మములును కూడ మనయందున్నవి. జ్ఞానాదు లయిన దేవగుణములను బట్టియే మనకు మనుష్యత్వము సిద్ధించినది. మృగము లెప్పుడును మనుష్యునికి లోఁబడి యతని సౌఖ్యమునిమిత్త మతఁడు నియమించినట్లు సేవ చేయవలసిన వగుటచేత, శరీరావయవము లయి మృగస్వభావము గల యింద్రియములను మనము లోఁబఱుచుకొని యాత్మాభివృద్ధి కుపయోగపడునట్లు చేయవలెను. అట్లు చేయుటనే యింద్రియనిగ్రహ మనఁబడును. ఆరంభదశలో నింద్రియములను యథేష్టముగా పోనీయక స్వాధీన పఱుచుకొన్న పక్షమున, తరువాత నవి యెప్పుడును తిరుగఁబడక మనకు విధేయములయి యాధ్యాత్మికసుఖమున కనుకూలముగా పనిచేయుచుండును. రౌతు కళ్ళెమును బిగించి గుఱ్ఱమును తనయిష్టప్రకారముగా నడిపింపక విచ్చలవిడిగా దాని యిచ్చవచ్చినట్లు నడవనిచ్చిన పక్షమున గమ్యస్థానమును చేరి సుఖింపక ముండ్లలోను బురదలోను పడి కష్టపడునట్లు మనుష్యుఁ డింద్రియవర్గమును తనబుద్ధిబలముచేత మరలింపక స్వతంత్రముగా నడవనిచ్చిన పక్షమున పాపపంకము

లోను విపత్కంటకములలోను తగులుకొని దుఃఖపడవలసినవాఁడగును. ఇంద్రియము లుద్రేకించి లోఁబడక మనుష్యుని తప్పుదారి కీడ్వ గమకించుచున్నప్పుడు వానిని నిగ్రహింపఁగల సామర్థ్యమును పరిశుద్ధమత మెప్పుడును మనుష్యుని కనుగ్రహించుచుండును. ఇంద్రియములను చెడుదారులఁ బోనీయక మరలించి మంచిపనుల కుపయోగపడునట్లు చేయుటయే మతధర్మమును మానవధర్మమును నగును గాని యింద్రియవ్యాపారములను పూర్ణముగా వినాశము చేయఁజూచుట కాదు.

మనుష్యుని సుఖసంతోషములకు జ్ఞానమును నీతియు ముఖ్యసాధనము లయియున్నవి. జ్ఞానమును నీతియు నన్నపదములు చిన్నవిగా నున్నను వానిలోఁగల భేదములును ధర్మములును నపారముగా నున్నవి. ఆభేదముల నెల్ల వివరింపఁబూనుట యిచ్చట నాపని కాదు. యుక్తాయుక్తములను స్వరూపస్వభావములను దెలిసికొనుట కుపయోగపడునది జ్ఞానము; తెలిసికొన్నప్రకారముగా నడిచి యనుభవించుట కుపయోగపడునది నీతి. జ్ఞానమహిమను జూచి భ్రమపడి కొందఱు జ్ఞానమే ముక్తిదాయకమని చెప్పుచున్నను, అనుష్ఠానము లేని కేవల జ్ఞానము ముక్తిప్రదము కానేరదు. బెల్లము తియ్యగా నుండునని తెలిసికొన్నంతమాత్రమున, బెల్లము తిన్న ఫలము కలుగనేరదు. నామమాత్రస్మరణముచేత బెల్లము తిన్నవారికిఁ గల సంతోషము కలుగక బెల్లము తియ్యనిదని తెలిసికొన్నందువలననే యొకవిధమైన యల్పసంతోషము లభింపవచ్చు. నట్లే కేవలజ్ఞానమాత్రమునఁ గొంతసంతోషము కలుగవచ్చును గాని ప్రవర్తన కనుకూలపడని జ్ఞానము శ్లాఘనీయము కాదు. కొన్నిమతముల వా రీశ్వరునియొక్క సత్యజ్ఞానస్వరూపములను మాత్రమే మనస్సునందుంచుకొని ధర్మ

స్వరూపమునందు లక్ష్య ముంచకపోవుటచేత బ్రహ్మానందమున కీశ్వరగుణానుభవమును భగన్నామ సంకీర్తనమును చాలుననుకొని ప్రవర్తనమును ముఖ్యముగా విచారింపకున్నారు. అట్టివా రెన్నఁడును మనుష్యునకు పరమార్థమయిన పూర్ణసుఖమును పొందఁజాలరు. జ్ఞానమెట్లో నీతియు నట్లే మనుష్యునకు స్వభావధర్మము; రెంటిలోను జ్ఞానమునకంటె నీతి శ్రేష్ఠతరము. ఒక్క స్వవిషయమునందైనను భావము నతిక్రమించువారు నిక్కమయిన సంతోషము ననుభవింప నేరరు. మన సంతోషమంతయు స్వభావము ననుసరించి వర్తించుట లోనే యున్నది. అందుచేతనే పూర్వోక్తమయిన సిద్ధాంతము ననుసరించి వర్తిలువారు పైకి భక్తాగ్రేసరులవలె నటించుచున్నను నీతిమాలిన వారయి భక్తి విరహితులయి సజ్జన గర్హితులయి యిహమునకును పరమునకును దూరులగుచున్నారు. అట్టివారు మాటలనుబట్టి యాస్తికులయినను చేష్టలనుబట్టి నాస్తికులే. మన ప్రవర్తనమును బాగుచేయుటకు సమర్థము కానట్టి మతము మతమే కాదు. అట్టిమతము వలన లోకమునకు ప్రయోజనలేశమయినను లేదు. పయిని వివరించిన రీతి భక్తులు భగవన్నామోచ్చారణము వలనను భగవన్నామసంకీర్తనమువలనను తమపాపములు తొలఁగునని భ్రమపడి పాపకార్యములకు భయపడకపోయినను "రామరామ" యని "శివశివ" యని సదా స్మరించుచు కీర్తనలు పాడుచు తాము చరితార్థుల మయితి మనుకొందురు. అట్టివారి భ్రమ వట్టిదుర్భ్రమ. ధర్మస్వరూపుఁడయిన యీశ్వరుఁ డెప్పుడును మన స్తోత్రపాఠములను పూజలను జూచి మన కనుగ్రహమును జూపఁడు; మన వర్తనమును జూచి మన మెంత చక్కఁగా నడుచుకొన్న నంత యధికసంతోషము నిచ్చును. పాపపరిహారమునకు పశ్చాత్తాపమును మరల నట్టిపాపమునకుఁ బోరక పరిశుద్ధ

మార్గమున వర్తించుచుండుటయు సాధనములుగాని యవి లేని వట్టి పొడిమాటలు గావు. ఆచరణము లేని శుష్కక్రియములు వదురుట మతముయొక్క యుద్దేశము గాదు. మతముయొక్క యుద్దేశ మంతయు మనస్సు నున్నతస్థితికిఁ దెచ్చి పరిశుద్ధపఱిచి తన్మూలమున నానందాభివృద్ధి కలిగించుట. స్వభావగుణములయందు వృద్ధి పొందినప్పుడే మనస్సున్నతస్థితికి వచ్చును. నీతిమార్గమున నడుచుట మనుష్యస్వభావగుణము; నీతిమార్గాభిముఖుఁడయి పాపమును హృదయమునుండియు వర్తనమునుండియు పాఱఁదోలి పరిశుద్ధతతో ముందు కీశ్వరునివంక నడుచుచున్నప్పుడే మనుష్యుఁడు నిర్మలమైన యానందము పొందును. అప్పు డంతరాత్మ నూతనజీవము నొంది యీశ్వరునియం దానందించును. యీశ్వరునియందు భక్తి యున్నను లేకపోయినను స్వభావమగుటచేత లోపల నంతరాత్మ నీతిమార్గమును బోధించుచునే యుండును గాని యీశ్వరునితోడ్పాటు లేనప్పుడది యింద్రియోద్రేకము నడఁచి స్వతంత్రముగా మనుష్యుని నీతిమార్గమున నడిపింపఁగల శక్తి లేనిదయి మృతప్రాయముగా నుండును; సన్మతమూలమున దాని కీశ్వరసాహాయ్యము కలుగఁగానే దుర్బలమయి యున్న యంతరాత్మ లేచి నూతనజీవమును బలోత్సాహములను పొంది పాపమును తృణప్రాయముగా హృదయాంతరాళము నుండి గెంటి వేయుటకు సమర్థమగును. అంతరాత్మ తాను పాపమునకు సమీపమున నుండుటచే నీశ్వరునకు దూరమయి హంసతూలికాతల్పమునందు సుఖించుచున్నప్పటికంటెను పాపమునకు దూరమునం దుండుటచే నీశ్వరసాన్నిధ్యమునొంది యగ్నిహోత్ర మధ్యమునం దున్నప్పుడైన నధికసంతోషము పొందును. ఈశ్వరసాన్నిధ్యము లభింపనప్పు డింద్రియమృగములు సాహసముచేసి మీఁదఁబడి మెల్లమెల్లగా నంతరాత్మను మ్రింగివేయును. సన్మత మెప్పుడును సర్వశక్తి

సంపన్నుఁడయి సమస్తకళ్యాణగుణపరిపూర్ణుఁడయిన యీశ్వరుఁడు సంపూర్ణతేజముతో సదా హృదయకుహరమునం దంతరాత్మసమీపమున ప్రకాశించుచుండునట్లు చేయును. ఆ స్వప్రకాశుని వెలుఁగుచేత నప్పు డంతరాత్మ సమస్తమును సత్యదృష్టితోఁ జూచుచు సర్వకార్యములయందును మంచిదారిని జూచి నడిచి సానందించుటకు శక్త మగును. అట్టివెలుఁగు చెంతనున్నప్పుడు దాని నుపయోగించుకొని లాభమును పొందక త్రిప్పువడి యావెలుఁగువంకనే యెప్పుడును జూచుచు నిలుచున్నపక్షమున దుస్సహమయిన యావెలుఁగుచేత కన్నులు మిఱుమిట్లుగొన మొదటనున్న యానందమును పోఁగొట్టుకొని యంతరాత్మ యేపనిని చేయుటకును శక్తిలేనిదయి ఫలమును పొందలేని దగును. కాఁబట్టి యెప్పుడును జ్ఞాననేత్రముచేత నీశ్వరుని వీక్షించుచుండుటయే మతముయొక్క ప్రయోజన మనుకొనుటయు భ్రాంతిమూలకమే. వెలుఁగుల కెల్లను వెలుఁగైన యీశ్వరుని సాక్షాత్కారముచేత సమస్తకార్యములను తత్ప్రీతికరముగాఁ జేయుచు సమస్తవిషయములలోను వృద్ధినొంది సానందించు మార్గమును జూపుటయే మతము చేసెడు మహోపకారము. మన యింద్రియవ్యాపారములను స్వభావగుణములను సర్వమును విడిచి యొక్కదానినే చింతించుచుండుటవలన మనుష్యునకు నిజమైన యానందము కలుగదు. భక్త్యావేశముచేతఁ గొంతకాల మనిర్వాచ్యమైన సంతోషము కలిగినను విరామము లేకపోయినపక్షమున క్రమక్రమముగా సంతోష మొండొకవిధముగా పరిణమించి మనుష్యస్వభావమును సహితము చెడఁగొట్టును. అతిభక్తిచేతఁ గొందఱు మతి చలించినవారయి జడులవలె నగుదురు. ఈ హేతువుచేతనే పూర్వులు వ్రాసిన గ్రంథములలోఁ గొన్నిచోట్ల జ్ఞాను లనఁగా నీశ్వరసాక్షాత్కారముగల యోగు లున్మత్తులవలె నుందురని చెప్పబడి యున్నది. నిత్యానందము నిమిత్తమయి నిసర్గసుఖములను

గుణములను విడువవలయునని సత్యమత మెప్పుడు నుపదేశింపదు. ఈ సత్య మెఱుంగనివారు కొందఱు మతావేశముచేత దుర్భ్రమలం బడి భార్యాపుత్రాదిబంధువర్గములను విడిచి సన్యసించుచున్నారు; కొందఱు మనుష్యసాంగత్యమును విడనాడి మృగముల మైత్రి పొంది యరణ్యావాసము చేయుచున్నారు; కొందఱు బలప్రదమయిన యాహారమును వర్జించి శరీరములను శుష్కింపం జేయుచున్నారు; మఱియు నిట్టివే యనాలోచితకార్యముల ననేకు లనేకవిధములం జేయుచున్నారు. ఇట్టివారందఱును మానవస్వభావమును భగవత్స్వభావమును గూడ గుర్తెఱుంగనివారు. మతావేశముచేత మనుష్యులకు ముఖ్యమైన యాలోచనను విడుచుటవలన నిట్టి యనర్థములు పొసంగుచున్నవి. జ్ఞానహీనులగుటచే ననేకులకు మానసికారాధనమే లేదు. అట్టివారికొక మతమును చెప్పుటకే యవకాశము లేకపోయినను, వారికున్న మతమంతయు వ్యర్థములైన కర్మలు చేయుటయు నర్థములేని మాటలు నోట నుచ్చరించుటయు తమ సొత్తును మతాచార్యుల కర్పించుటయు నై యున్నది. ఇట్టివారికి మతము వలన మనుష్యునకు స్వాభావికములైన యేవిషయములయందును వృద్ధి కలుగక గురువులకు మాత్రము జీవిక యేర్పడుచున్నది. జనుల మూఢవిశ్వాసమువలననే లాభము పొంది కుటుంబభరణము చేసికొన మరఁగిన మహానుభావులు వారి యాత్మోజ్జీవనమునకయి లేశమయినను కృషి చేయక గురువులైన తమ్ము దైవములనుగా భావించి తాముపదేశించిన కర్మ లాచరించుటవలననే వారు ముక్తులగుదురని బోధింతురు.

ఇట్టివారు మాత్రమే కాక మఱికొందఱు బుద్ధిమంతులుకూడ తాము చిన్నప్పటినుండియు నమ్మిన మతబోధనలకు విరుద్ధముగా నున్న సత్యములను ద్వేషించుచున్నారు. సత్యమును ద్వేషించుట సత్యస్వరూపుఁడైన యీశ్వరుని ద్వేషించుటయే. మతమునకు లౌకికసత్యముతో పనిలేదఁట! ఆహా! ఏమి యీబుద్ధివైపరీత్యము! సూర్యచంద్ర

గ్రహణములకు శాస్త్రప్రకారముగా చంద్రబింబ భూచ్ఛాయలు కార ణములయి, మతప్రకారముగా రాహుకేతువులు కారణములగునా? సత్యము కానిది మత మగునా? సమస్త ప్రకృతిశాస్త్రములును భగ వన్మహిమలను భగవత్సత్యములను ఘోషించుచున్నవి. ఈశ్వరుని యందు సంపూర్ణ భక్తి గల వారికందఱికిని నవి యత్యాదరణీయములు. మతవిషయమునఁ బూర్వులు చెప్పినవాని కిట్టి సత్యములు విరుద్ధముగా నున్న పక్షమున, వానిని సంస్కరించుకొని మతమును బాగుపఱచుకో వలెను. మనుష్యునితో సంబంధించిన ప్రతివిషయమునందు నభివృద్ధి సహజధర్మముగా నుండఁగా, మనుష్యుని నిత్యానందపదవికి మార్గము చూపు దీక్షవహించిన మతమునం దభివృద్ధి కూడదనుట నయుక్తముగా నుండునా? ఈశ్వరభక్తి లేశము గలవానికెల్లను సత్యగ్రహణము పరమ వ్రతముగా నుండవలెను. సత్యమెక్కడనున్నను పరమాదరణీయ మైనదే. కొన్నిసమయములయందు మతమును నిరాకరింపఁ జొచ్చినందున, సత్య ప్రియులయిన వారనేకులు మతమునుండి విముఖు లగుచున్నారు. పరి శుద్ధమతాభినివేశము గల ప్రతిమనుష్యుఁడును తా నావఱకు సత్యమని నమ్మిన దసత్యమని తెలిసిన యెడల దానిని వెంటనే విడిచి దురభి మానమువాసి నిష్పాక్షికబుద్ధితో సత్యము నంగీకరింపవలెను. ఇట్టి సత్యాదరము వహించి శోధించిన కొలఁదిని భగవన్నిర్మితములైన సమస్తవస్తువులును ప్రతిదినమును క్రొత్త క్రొత్తసత్యములను బయలఁ బెట్టుచు భగవంతునియొక్క క్రొత్తక్రొత్త మహిమలను ప్రకాశింపఁ జేయుచు మనయాత్మల నపారానందసాగరమునందు తేల్చుచుండును. ఈ సత్యాదర మొకటి లేకపోవుటవలన మహావిద్వాంసులును బుద్ధిసంప న్నులును తమసిద్ధాంతము స్థాపనము కావలెనన్న దురభిమానముచేత యుక్త్యాభాసములను కల్పించి సత్యము నడఁచి తమ కుత్సితసిద్ధాంతము లను స్థాపించి లోకమును తప్పుదారిని పట్టించి మితిమీఱిన నష్టమును

గలిగించి యున్నారు. పరిశుద్ధమత మెప్పుడును సర్వవిషయములయందును సత్యమును ప్రోత్సాహపఱిచి సర్వదా లోకము జ్ఞానాదులయందు వృద్ధిపొందుచుండునట్లు చేసి, జనులు తమస్వభావమునుబట్టి పొందఁదగినంత సౌఖ్యమును సర్వవిషయములయందు బొందునట్లు చేయవలెను. అట్లు చేసెడి మతము ప్రతిమానవహృదయమునందును పరమేశ్వరుని సహజనిష్కళంకస్వరూపముతో నిలిపి, నిరంతరాభివృద్ధిని నిరంతరానందమును గలిగించును. మనకంటె నధికుఁడైన మానవునితో సాంగత్యము చేయుటవలనఁ గూడ మన మాతని సద్గుణముల నభ్యసించి మన ప్రవర్తనమును చక్కజేసికోఁ గలుగుదుము గదా? అట్టిస్థితిలో మనుష్యునియందువలె కళంక లేశమయినను లేని సత్యస్వరూపుని సాంగత్యమును మనయాత్మకుఁ గలిగించుకొన్నప్పుడు మనము సత్యాదరము గలవారమయి సత్యమునందెట్లు వృద్ధి పొందకుండఁ గలుగుదుము? దయాస్వరూపుని సాంగత్యమును మనయాత్మకుఁ గలిగించుకొన్నప్పుడు దయారతి గలవారమయి దయయందెట్లు వృద్ధి పొందకుండఁ గలుగుదుము? ధర్మస్వరూపుని సాంగత్యమును మనయాత్మకుఁ గలిగించుకొన్నప్పుడు ధర్మపరాయణులమయి ధర్మమునందెట్లు వృద్ధిపొందకుండఁ గలుగుదుము? సర్వజ్ఞుఁడును సర్వశక్తుఁడును దయాస్వరూపుఁడును సత్యస్వరూపుఁడును ధర్మస్వరూపుఁడును నయినపురుషుఁడేకదా యీశ్వరుఁడు? ఈశ్వరుని సర్వశక్తిత్వమును సర్వజ్ఞత్వమును సర్వవ్యాపకత్వమును మనకు భయప్రమోదాద్భుతములను బుట్టింపఁగా సర్వకారుణ్యాదిగుణములు భక్తిని పురికొల్పఁగా, మన మీశ్వరునికిఁ బరమభక్తులమయి మనకుఁ గల సర్వగుణములయందును వృద్ధిపొంది నిత్యానందపదవిని గాంచ శక్తులము గాకుందుమా? మనము సత్యము నెప్పుడు గౌరవముతో నుపాసింతుమో యప్పుడు సత్యము మన మనస్సులయందావేశించి ప్రజ్వరిల్లక మానదు. సత్యాదిసమస్తకళ్యాణగుణపరిపూర్ణుఁడయిన యీశ్వరుని మన

నెప్పుడు భక్తితో నుపాసింతుమో యప్పు డాపరమపురుషుని కళ్యాణ గుణములు మనమనస్సు నావేశించి యందలి సత్యప్రియత్వాదులకు నూతనజీవము కలిగించి ప్రజ్వరిల్లఁ జేయకుండునా? అవి యన్నియు ప్రజ్వరిల్లి యున్నతస్థితినిపొంది సంపూర్ణానందదాయకము లగుటయే కదా మనజీవితమునకు పరమార్థము? ఓసత్యస్వరూపుఁడవైన యీశ్వరుఁడా! చిరకాలాభ్యస్తము లయిన దురాచారములను విడిచి మాహృదయములు సత్యగ్రహణపరాయణము లగునట్లు చేయుము. ఓ భక్తవత్సలా! చంచలములయిన మాచిత్తము లింద్రియసుఖముల నాశించి తప్పుదారులు పట్టనియ్యక నీధ్యానము మఱఁగి సదా సన్మార్గమున సంచరించునట్లు చేసి నీయందలి నిశ్చలభక్తిని విడువకుండునట్లు చేయుము. ఓ సర్వకారుణ్యా! దుర్బలములైన మా యుల్లములను స్వార్థపరత్వమునందు మునుఁగనీయక పరోపకారకార్యములయందు వర్తిల్లునట్లు చేయుము.



# వైరాగ్యము

భ్రాతృవరులారా! నేఁడు వైరాగ్యమునుగూర్చి మీ ముందఱఁ గొంచెము చెప్పఁబోవుచున్నాను. కొంచెముగానో గొప్పగానో వైరాగ్యమును బోధింపని మతము ప్రపంచములో నేదియు లేదు. ఇతరదేశములకంటె మన దేశములోను మన దేశములోఁగల ప్రతి మతమునందును వైరాగ్యబోధ మత్యధికముగాఁ జేయఁబడుచున్నది. మనుష్యుఁడైన వానికెల్లను వైరాగ్య మావశ్యక మనుటకు సందేహములేదు. కొంచెమయినను వైరాగ్యము లేనివాఁడు పవిత్రమైన మనుష్యనామమును ధరించుటకే యర్హుఁడుకాఁడు. అయినను మన దేశమునం దిప్పుడు వైరాగ్యము విపరీతార్థమునం దుపయోగింపఁబడుచుండుటచేతను విపరీతముగా నాచరింపఁబడుచుండుటచేతను వైరాగ్యమనఁగా నేమో యది యెంతవఱకు కావశ్యకమో యిప్పుడు సయుక్తికముగాఁ గొంత విచారింపవలసి యున్నది. సయుక్తిక మన్నమాట చెవిని బడినప్పుడనే మనలోని ప్రమాణవాదు లనేకులు తోఁకత్రొక్కిన త్రాఁచులవలె లేచి మనకు శాస్త్రము ప్రమాణముకాని యుక్తి ప్రమాణము కాదనియు, మనుష్యబుద్ధి భ్రమప్రమాదసహిత మయినందున దానియందు విశ్వాస ముంచక శాస్త్రవిశ్వాసము కలవారము కావలయుననియు చెప్పవచ్చును. అట్టివారి మాటలు చెవుల కనేకులకు చక్కఁగానే వినఁబడవచ్చును. అయినను వారి నొక్కప్రశ్న మడుగవలసియున్నది. మనుష్యబుద్ధి భ్రమ ప్రమాద సహితమయినదని మొట్టమొదట వారి కెట్లు తెలియవచ్చినది? స్వబుద్ధిచేతనే కదా? స్వబుద్ధిని కొంచెమునేపు దూరముగా నుండనిచ్చిన పక్షమున వారికి

మయి పదార్థతత్త్వసంశోధనమునం దసమర్థమయి సదా చీఁకటిలోఁ దడవులాడుచుండదా? బుద్ధిని విడిచిన లోకవ్యవహార మొక్కనిమిషము నడుచునా?

ఇట్లన్నచో నెల్లవిషయములలోను బుద్ధి యప్రమాణమని యెవ్వరు ననఁజాలరనియు; లౌక్యవాక్యముల సత్యాసత్యనిర్ధారణము నిమిత్తమయి బుద్ధి నవశ్యప్రమాణమునుగా నంగీకరింపవలసినదే యయినను భగవంతుఁడు సర్వజ్ఞుఁ డగుటచేత నలౌకికమైన యట్టి యీశ్వరవాక్యమును ఖండించుటకు మాత్రము మన పరిమితబుద్ధి ప్రమాణము కాఁజాలదనియు, కొందఱు బుద్ధిమంతులందురు. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁ డగుటకును మనుష్యుఁడు మితజ్ఞుఁ డగుటకును సందేహము లేదు. అందుచేత నీశ్వరబుద్ధికిని మనుష్యబుద్ధికిని పర్వతమునకును బరమాణువునకును గలదానికంటెను నెక్కువ యంతరము కలదనుటకును సందేహము లేదు. ఎంత యల్పమయిన దయినను మనుష్యబుద్ధి సత్యదర్శనార్థమయి యీశ్వరునిచేఁ బ్రసాదింపఁబడిన వెలుతురే కదా? అట్లగుటచే నిజమయిన యీశ్వరవాక్యమునకును బుద్ధికిని విరోధ మెప్పుడును బొసఁగనేరదు. ఈశ్వరవాక్య మెప్పుడును చక్కఁగా నాలోచించినమీఁదట యుక్తియుక్తము కాకపోదు. ఎంత యాలోచించినను గూడ యుక్తియుక్తముగాఁ గనఁబడక యీశ్వరుఁడు ప్రసాదించియున్న బుద్ధిజన్యజ్ఞానమునకు సదా విరుద్ధముగానే తోఁచిన పక్షమున నట్టి వాక్య మీశ్వరకర్తృత్వము నారోపించి మనుష్యునిచేఁ గల్పింపఁబడినదయి యుండును గాని నిజమయిన యీశ్వరవాక్యము కానేరదు. ఈశ్వరహృదయమును దెలిసికొన నపేక్షించువారి కందఱికిని బరమేశ్వరుఁడు తనజ్ఞానమును సృష్టిమూలమున వెదచల్లుచున్నాఁడు. సృష్టి తెలిపెడు సత్యములను లిఖం

చుచు వచ్చినచో నా పుస్తకములు పర్యాలోచమానము లగును. ఇట్లు మహాసముద్రమువలె నీశ్వరుని జ్ఞానతేజస్సు సృష్టియందంతటను నిండి యున్నను, మనుష్యులు తమతమ బుద్ధిపరిమాణమును బట్టి యందుఁ గొంతభాగమునే గ్రహింపఁగలుగుదురు. మనుష్యబుద్ధి స్వచ్ఛముగా నుండకపోయిన పక్షమున నట్లు గ్రహింపఁబడిన సత్యములయందు భ్రమప్రమాదజనితములయిన మాలిన్యములు చేరుచుండును. మనుష్య బుద్ధి నిర్మలమగుచు వచ్చినకొలఁది పూర్వము చేరిన కాలుష్యములు క్రమక్రమముగా నశించి నూతన సత్యములు చేరి జ్ఞాన మంతకంతకు స్వచ్ఛమగుచుండును. సృష్టియందు నింపఁబడియున్న జ్ఞానసుధారసము ద్రాంబుబిందుపానమును దనశక్తికొలఁదిని జేయుచున్నకొలఁదిని మనుష్య బుద్ధి జ్ఞానాహారముచే నభివృద్ధిఁబొంది యీశ్వరసామీప్యము నొందు చుండును. సృష్టినుండి నిరంతరమును బ్రవహించుచున్న జ్ఞానతేజస్స్వీ కారమును జేయనొల్లక యీశ్వరుఁడు తనహృదయమునందుంచి యున్న జ్ఞానతేజస్సు నుపయోగించుకొనని పక్షమున మనుష్యుఁ డజ్ఞా నాంధుఁడయి తన సమీపమున నున్న యీశ్వరు నణుమాత్రమును జూడక సత్యమునకు దూరములయిన దుస్స్వప్నములలోను మిథ్యా భూతములలోను బడి కొట్టుకొనుచు బాధపడుచుండువాఁ డగును. కాఁబట్టి యీశ్వరజ్ఞానమును బొందుటకు బుద్ధియు సృష్టియు నీరెండు మాత్రమే మహాసాధనములు. ఈరెండుసాధనములను గొని సంశో ధించినమీఁదటఁ బ్రత్యక్షవిరుద్ధముగాఁ గనఁబడిన పక్షమున, అలౌకిక మనుపేర పరంపరగా వచ్చుచున్న యెట్టివాక్యమునైనను నిశ్చయ ముగా దేవుఁడు దయచేసి యున్న యీ నేత్రద్వయమునకు నసంగ తముగా నున్నంతవఱకు నిరాకరింపవలయును. అట్లు నిరాకరింపని యెడల నసత్యమునకును సత్యమునకును గల భేదభావమే హృదయము

నుండి తొలఁగిపోయి మనస్సు సమస్తాభాసములకును భ్రమలకును నివాసస్థాన మగును; అప్పుడు మంచిచెడ్డలను వేఱుపాటు చేయు విభాగజ్ఞాన మడుగంటి హృదయమునందు జడత వ్యాపించి యెంతవిరుద్ధ మయినయసంగతియు వింతగాఁ దోఁచకుండును. ఈశ్వరుఁ డనుగ్రహించిన బుద్ధిసంపద ననుభవింపనొల్లని ప్రబుద్ధున కింతకంటె మంచి ఫలమేమికలుగును? సత్యాసత్యనిర్ణయమునకు మనుష్యబుద్ధి ప్రమాణమనిచూపుటకే ట్లింతదూరము చెప్పవలసివచ్చినది. ఇంతటితో నీ విషయమును విడిచి యింకఁ గార్యాంశమునకు వత్తము.

వైరాగ్యమను పదమున కనురాగము లేకుండుట యని యర్థము. దేనియం దనురాగము లేకుండుట? విషయసుఖములయందు. విషయసుఖము లనఁగా మృగములకును మనకును సామాన్యము లైన యింద్రియసుఖములు. ఇంద్రియసుఖములలో మృగములకు లేనివియుఁ గొన్ని మనకుఁగలవు. ఇంద్రియసుఖ పరిత్యాగమే వైరాగ్య మనఁబడును. ఈ యింద్రియములను మనవారు శత్రువులనుగా గణించుచుండుటచేత నింద్రియసుఖ త్యాగమునకు సాధారణముగా నింద్రియనిగ్రహ మనియు నరివర్గవిజయ మనియు వాడుచుందురు. ఇంద్రియనిగ్రహమును జేసినవాఁడు జితేంద్రియుఁ డనఁబడును. ఇంద్రియనిగ్రహ మనఁగా నేమి, ఇంద్రియముల నెంతవఱకు నిగ్రహింపవలెను. అన్న యంశములకు వత్తము. ఇంద్రియనిగ్రహ మనఁగా నింద్రియములను లోఁబఱచుకొని యవి మనయాజ్ఞ నుల్లంఘింపక వర్తించునట్లు చేయుట. ఐహికాముష్మికసుఖముల కెంతవఱకుఁ గావలసియుండును. ఈ యింద్రియము లెప్పుడును మనయాత్మలను పాపమున కీడ్చుచుండు ననియు, అందుచేత నింద్రియసుఖములనన్నిఁటిని బూర్ణముగా త్యజించుటయే పరమార్థ మనియు, కొందఱు భావించుచున్నారు. ఈభావన

చేతనే యీ దేశమునందలి మతకర్తలనేకు లింద్రియనిగ్రహము చేయవలెనని చెప్పుచు, నింద్రియసుఖవాంఛ పుట్టకుండ వానిని హతము చేయవలెనని విధించియున్నారు. అట్టివారి మతమును బట్టి చూడఁగా మన కింద్రియములతోనే పనిలేదనియు, ఇంద్రియసుఖము లెంతమాత్రము ననుభవింపఁదగినవి కావనియు, పర్యవసానము తేలుచున్నది. నిజము విచారింపఁగా మతమునకుఁగాని ధర్మమునకుఁగాని యింద్రియసుఖములను బూర్ణముగాఁ బరిత్యజింపవలసిన పనిలేదు. ఆత్మానందమునకును నీతికిని భంగముగా నుండనంతవఱ కెల్లవారును విషయసుఖములను మితముగా ననుభవింపవచ్చును. అందువలన నిహలోకహానియుఁ బరలోకహానియుఁ గలుగవు. ఇంద్రియములే నిష్ప్రయోజనము లయిన పక్షమున మన కీశ్వరుఁడు వానిని ప్రసాదించకయే యుండి యుండును. ఈశ్వరుఁడు మన కింద్రియములను ప్రసాదించి యుండుటచేతనే వానివలనను బ్రయోజనము కలదనియు, వానివలనఁ గలుగవలసిన న్యాయమైన లాభమును మన మనుభవింపవలె ననుట యీశ్వరోద్దేశమనియు, విస్పష్టమగుచున్నది. మన శరీరమునం దేయవయవమును పనిలేక కృశించుటకయి చేయఁబడలేదు. సమస్తావయవములును బరస్పరానుకూలముగా నారోగ్యదశయం దుండి పని చేయుచున్నప్పుడే యవి యానందదాయకములును సుఖప్రదములును నగును. వానిలో నేయవయవ మారోగ్యము చెడి కృశించినను దానివలన సౌఖ్యము కలుగకపోవుటయే కాక తన్మూలమున నితరావయవములకును నసౌఖ్యము కలుగును. ఈప్రకారముగానే యాత్మగుణములలో నేదియుఁగూడ నిష్ప్రయోజనముగా నశించుటకయి చేయఁబడి యుండలేదు. సమస్తగుణములవలనను బ్రయోజనము గలదు. పరమేశ్వరుఁడు మనకుఁ బ్రసాదించిన సమస్తసాధన

ములను సమస్తశక్తులను సాధ్యమయినంత మంచి యుపయోగమునకుఁ దెచ్చుకొనుట మనకుఁ బరమధర్మము. వానివలనఁ గలుగవలసిన ప్రయోజనములను బొందఁజూడక వాని నుపేక్షించుట యీశ్వరాజ్ఞాధిక్కారరూపమైన యపచారమని చెప్పవచ్చును. తగినయుపయోగమునకుఁ దెచ్చుకొనక యింద్రియములను వానిగుణములను నిర్మూలముచేయుట యస్వాభావికమును ననర్థదాయకము నగుటచేత మనలో నిప్పుడు యోగులును సన్యాసులును ధర్మములని యాచరించెడు పనులు పెక్కు లాచరణీయములు కావని వేఱుగఁ జెప్పవలసిన యావశ్యకము లేదు. యోగులు కొందఱు చేతులును వ్రేళ్ళును మీఁదుకెత్తి నిరర్థకములుగ బిఱ్ఱబిగియునట్లును గోళ్ళుపెరిగి యంగిరములు తిరిగి చెడిపోవునట్లును జేయుదురు. ఇట్లుచేయుట సత్ప్రయోజనముకొఱకు హస్తములను వ్రేళ్ళను జేసిన యీశ్వరునకు సమ్మతముగా నుండునా? తాను జేసిన మహోపయుక్తమయిన సాధనము వ్యర్థమగుచుండఁగాఁ జూచుట కెవ్వరి కిష్టముండును? ఈ యోగులు కొందఱు గృహములను వదలి యరణ్యములలో వాసము చేయుదురు. సన్యాసులును భార్యాపుత్రులను విడిచి యూరూరఁదిరిగి భిక్షాటనము చేయుదురు. ఈపనులు స్వభావవిరుద్ధములు. మనుష్యుఁడు సంఘములోనుండియే వృద్ధిఁబొందఁదగినవాఁడు. సంఘమును విడిచెనా మనుష్యుఁడు శీఘ్రకాలములోనే మృగప్రాయుఁడగును. ఏకాకిగా నుండి వృద్ధిఁబొందుట మనుష్యస్వభావము గాదు. మనుష్యున కాహారమును వాయువు నెంత యావశ్యకమో యితరజనసాంగత్య మంత యావశ్యకము. మనుష్యముఖమును జూడనీక యొకమనుష్యుని గొనిపోయి చిన్నప్పటినుండియు నరణ్యములో మృగములతోఁ బెరుగనిచ్చిన పక్షమున నట్టివాఁ డేవిషయమునందును బహుమృగములకంటె

నధికుఁడు కాఁజాలఁడు; కొన్ని విషయములయందుఁ బెక్కుమృగములతో సమానుఁడు కానేరఁడు. అభివృద్ధికి స్వయంకృషి యావశ్యకమే యయినను, తనకంటె నధికులయిన వారితోడి సహవాస మా స్వయంకృషికి తోడుపడినంగాని యభివృద్ధి కలుగదు. పదిమందిలో మెలఁగువాఁడు సహితము తనకంటె నధికులైనవారితోడి సాంగత్యము లేనివాఁడయినయెడల నాలోచనయు వృద్ధియు లేక యహంభావము గలవాఁడయి చెడును. అదిగాక మనుష్యుని మనుష్యనామమున కర్హునిగాఁ జేయు గుణముల కెల్లను ప్రేమానుబంధ మలంకారమయినది. దైవగుణమని చెప్పఁదగిన యీప్రేమగుణము సంసారములోనుండి యుపయోగించుకొనుచున్నప్పుడుగాని వర్ధిల్లదు. భార్యను భర్తను, తల్లిని బిడ్డను, అన్నను చెల్లెలిని, పొరుగువారిని మిత్రులను, ఒక్కటిగాఁ జేర్చి యన్యోన్యసుఖదాయకులనుగాఁ జేయునది యీ ప్రేమానుబంధమే. ఇది యొక్కటి లేకపోయెనేని, సంసారమును భూతలస్వర్గముగాఁ జేసి యమృతతుల్యములయిన సౌహార్దఫలముల ననుభవింపఁజేయు బంధము లేక లోకములో నాపన్నరక్షణము లేక మనుష్యుఁడు నిర్దయుఁడయి ఘాతుకమృగతుల్యుఁ డగును. అరణ్యములకుఁ బోయి వసించినను మనుష్యున కేదో సాంగత్య ముండవలెను. మనుష్యులను విడిచి యరణ్యములకుఁ బోయిన ఋషులనేకులు మృగములను బెంచి తత్సంగమునఁ గాలక్షేపము చేయుచుండినట్లు పురాణములు ఘోషించుచున్నవి. అట్టి మహానుభావులకు మనుష్యసాంగత్యము తొలఁగి మృగసాంగత్యభాగ్యము లభించుచున్నది. అరణ్యావాసము చేసినంతమాత్రముచేత నింద్రియనిగ్రహము కలుగుననియుఁ జెప్పటకు వీలులేదు. స్త్రీ లొంటిగాఁ దారసించినప్పు డింద్రియనిగ్రహము చేయలేకపోయినందుకు వ్యాస విశ్వామిత్ర పరాశరాములగు మహాను

భావులను పెక్కండ్రను దృష్టాంతము చెప్పవచ్చును. ఇంద్రియము లను జంపివేయవలెనని యెన్ని శాస్త్రములు బోధించినను, అది యస్వాభావిక మగుటచేత సకలజనవిశ్వాసపాత్రమయి సర్వత్ర వ్యాపింపనేరదు. ఈ సిద్ధాంతమే జనులలోనెల్ల నిజముగా వ్యాపించిన పక్షమున, ప్రపంచ మంతయుఁ జిరకాలము క్రిందటనే నశించి యుండును.

ఇంద్రియములను జూర్ణముగాఁ జంపివేయుట ధర్మము కాని పక్షమున, ఇంద్రియముల నేవిషయమున నెంతవఱకు జయింపవలెనని శంక కలుగును. మనుష్యునిలో మృగగుణములును దేవగుణములును రెండు చేరియున్నవని చెప్పుచున్నారు. మృగమునకును మనుష్యునకును సామాన్యములయిన కామాదులు, మృగగుణములు; మనుష్యునకిని దేవునికిని సామాన్యములయిన దయాదులు దేవగుణములు. ఈ రెంటిలో మొదటి వధమగుణములు, రెండవవి యుత్తమగుణములు. ఈ రెంటిలో నధమగుణముల నుత్తమగుణములకు సదా లోఁబడుచుండు నట్లు చేయవలెనుగాని యుత్తమగుణముల నధమగుణములకు లోఁబడున ట్లెప్పుడును జేయఁగూడదు. అధమగుణముల నుత్తమగుణములకు లోఁబఱుచుచు వచ్చినపక్షమున మనుష్యుఁ డంతకంతకు దేవతుల్యుఁ డగుచుండును. అట్లుచేయక యధమగుణములకే యుత్తమగుణము లను లోఁబఱుచుచు వచ్చినపక్షమున మనుష్యుఁ డంతకంతకు మృగతుల్యుఁ డగుచుండును. ఉత్తమగుణముల కధమగుణములను లోఁబఱుచుటయే నిజమయిన యింద్రియనిగ్రహము. ఇంద్రియనిగ్రహము చేయుటచే నింద్రియములు బుద్ధికి లోనయి పనిచేయుచు మనుష్యుని దేవత్వమునకుఁ గొనిపోవుటకుఁ దోడుపడును. ఇంద్రియ ములను మనపూర్వులు గుఱ్ఱములతోఁ బోల్చి యాత్మను రౌతునుగాఁ

జెప్పియున్నారు. నేర్పరియయిన రౌతు గమ్యస్థానము చేరి సుఖపడఁ దలఁచినప్పుడు కళ్లెమును బిగించి గుఱ్ఱమును దాను బోఁదలఁచు కొన్న మార్గమున నడపవలెను. అట్లు చేయలేక దుర్బలుఁడైన పురుషుఁడు గుఱ్ఱములాడ్చిన తెరువున నెల్లఁ దాను బోవుచున్న యెడల వాని నది ముంపులోనికిని డొంకలలోనికిని నీడ్చి గమ్యస్థానమును జేర్పక తప్పుదారిని బట్టించి కష్టములపాలు చేయును. ఈవిధముగానే వివేకియగుపురుషుఁ డింద్రియములనెడు గుఱ్ఱములను బుద్ధియనెడు కళ్ళెముచే బిగియఁబట్టి యీశ్వరాజ్ఞానుసారముగాఁ దాను బోవలసిన యుత్తమ స్థానమునకు వాని సాహాయ్యమునఁ బోయి కృతార్థుఁడు కావలెను. అట్లుచేయక యింద్రియము లీడ్చిన దారినెల్ల నడుచుచుఁ గేవల విషయ సుఖలోలుఁడయి ప్రమత్తుఁడయి యున్న పురుషుఁ డింద్రియములను జయించుటకు మారుగాఁ దానే యింద్రియములచేత జయింపఁ బడి యింద్రియజితుఁ డనఁబడును. తా నాసక్తిచేత గుఱ్ఱములను తిన్నని దారిని నడపఁ జేయఁగాక మూఁదరికీడ్చి గుఱ్ఱములు తన్నుఁ ద్రిప్పి ప్రోవ కీడ్చుచున్న కోపముచేత గుఱ్ఱములను జంపిన రౌతువలెనే యింద్రియములు తన్నుఁ దప్పుదారిని బట్టించు నన్న భీతిచేత వానిని జంపఁ బూనుకొన్నవాఁడును నిష్ప్రయోజకుఁడును నీశ్వరాజ్ఞోల్లంఘియు నగును.

మనుష్యగుణములలోఁ గొన్ని యధమములు అయినవనియుఁ గొన్ని యుత్తమములు అయినవనియుఁ బయిని జెప్పియున్నాము. అట్లు చెప్పఁగానే మన కన్నిటిలో నేవి యధమగుణములు, ఏవి యుత్తమ గుణములు, వాని యుత్తమత్వాధమత్వము లెట్లు నిర్ణయింపవచ్చును, అన్న యాలోచన పుట్టక పోదు. కేవల స్వప్రయోజనమును గూర్చిన వన్నియు నధమగుణములు; పరప్రయోజనమును గూర్చినవి యుత్తమ

గుణములు. అధమగుణములలో నాహార సంభోగవాంఛా క్రోధాదులు మృగ మనుష్య సామాన్యములు; ధనతృష్ణ, అధికారవాంఛ మొదలయినవి కేవల మనుష్యసంబంధ మయినవి. సత్యము కారుణ్యము మొదలయినవి యుత్తమగుణములు. సత్యాద్యుత్తమగుణములకు భంగము రాకుండునట్లు మితముగా నాహారాద్యధమభోగముల నెల్ల ననుభవింపవచ్చును గాని వానిలో నేనిని పూర్ణముగా విడువనక్కఱ లేదు. న్యాయముగా ధన మార్జించి భోగములను మితముగా ననుభవింప వచ్చును; ఇతరులకు ద్రోహముచేయక ధర్మమార్గమున నధికారము సంపాదించి సుఖింపవచ్చును. అంతేకాని యసత్యములాడి ధనార్జనము చేయరాదు; స్వామిద్రోహముచేసి యధికారము సంపాదింపరాదు. ఈ ద్వివిధగుణములలో నధమములయిన కామక్రోధాదులు స్వపక్షపాతముతోఁ గూడినవయి ఫలాపేక్షములగుచు సదా స్వలాభమును స్వకీర్తిని స్వసుఖమును గోరుచుండును; ఉత్తమములయిన సత్యకారుణ్యాదులు ఫలనిరపేక్షములయి సార్వత్రికములయి యితరుల స్వాతంత్ర్యములను సౌఖ్యములను మన్నించుచు స్వసుఖలాభములకు భంగకరములుగా నున్నప్పుడును ధర్మానుసరింపవలెనని బోధించుచుండును. ఈ రెంటిలో నుత్తమగుణములకంటె నధమగుణములే బలవత్తరములయి మనుష్యులను దాసులనుగాఁ జేసికొని యెక్కువగా నడచుచుండ వచ్చును. అయినను వానియొప్పు లధికారహీనములయి, యాజ్ఞారూపమునఁ బలుకుచుండు నుత్తమగుణముల స్వరమునకంటె భిన్నమయినవిగా నుండును. మనుష్యులను బద్ధులనుగాఁ జేసెడు యధికారగౌరవ మింద్రియసుఖవాంఛలయందు లేదు. అవి తాము మనోరథసిద్ధిని బడసి విజయగర్వము నొందియున్నప్పుడును ధర్మస్వరూపమయిన యంతరాత్మచేఁ జీవాట్లు తినుచు

సిగ్గుచేఁ దలవంచుకొనవలసినవిగా నుండును. ఇట్టి యధికారతార తమ్యమును బట్టి విషయవాంఛ లధమగుణములుగాను, ధర్మాను లుత్తమగుణములుగాను, బరిగణింపఁబడుచున్నవి. ఈ ద్వివిధగుణముల స్వభావమును దెలిసికొని వివేకియైనవాఁడు స్వప్రయోజనపరత్వము నణఁగఁద్రొక్కి ధర్మచింతను దన హృదయసింహాసనమునం దధిష్ఠింపఁ జేయుటకయి సదా ప్రయత్నించుచుండవలెను. అట్లుండుటయే యీశ్వర ప్రీతికరము. కాఁబట్టి నిశ్చలమయిన యీశ్వరభక్తి గల యుత్తమపురుషుఁడు క్రూరమరణమునకైనను తల యొగ్గును గాని ధర్మమును విడువఁజాలఁడు. అట్టిభక్తుని ధర్మమార్గమునుండి తొలఁగించుటకుఁ బ్రపంచములోని దేనియు సమర్థములుగావు. ఇట్లు స్వార్థపరత్వమునకంటెఁ బరార్థపరత్వము నధికముగా నెంచి నడుచుచుండుటయే యింద్రియనిగ్రహము. ఇట్టి యింద్రియనిగ్రహమును కొందఱు మహానుభావులు సులభముగాఁ జేయఁగలిగినను, ఎంతో కష్టముమీఁదగాని పలువురు చేయఁజాలరు. అయినను బ్రతిపురుషుని హృదయమునందును కొంచెముగానో గొప్పగానో యింద్రియవర్గమునకును ధర్మమునకును పోరాటమమాత్రము జరగికపోదు. ఇట్లు పరస్పరవిరుద్ధములయిన రెండుగుణములకు నెల్లవారి మనస్సులలోను పోరాటము జరుగుచుండుటచేతను బట్టి యింద్రియముల స్వభావమును గూర్చి వానిని జయించు మార్గమును గూర్చి కొంచెము ముచ్చటింపవలయును.

ఇంద్రియము లంధములయి ముందుచూపు లేనివిగా నున్నవి. తమకు విషయమైన పదార్థ మెదుటఁబడఁగానే యవి యుద్రేకించి దానివలన మేలుకలుగునా కీడుకలుగునా యనువిచారమును జేయక దాని ననుభవింపఁ జూచుచుండును. తినఁదగిన మంచిపదార్థ మెదుటఁ బొడకట్టినప్పుడు దానిని మ్రింగవలె నన్న యాశయేకాని యారోగ్య

ప్రదమైన వానిని మాత్రము తిని యనారోగ్యకరమైన వానిని విడువ
వలెనన్న బుద్ధి పుట్టదు. ధనతృష్ణ కలిగినప్పుడు ఏమార్గముననైన ధనార్జ
నము చేసి కూడఁబెట్టవలెనన్న చింతయేకాని న్యాయమార్గముననే
సంపాదింపవలెననియు దానభోగములకు వలసినంతయే చేర్పవలె
ననియు బుద్ధి పుట్టదు. చూచినవస్తువునెల్లఁ దెమ్మని బాధించు శిశు
వులవలెనే యింద్రియములును తమకు గోచరమగు వానినెల్ల ననుభ
వింపఁ జూచుచుండును గనుక బుద్ధిమంతుఁడగువాఁడు వానికోరికల
నెల్లఁ దీర్పఁజూడక యందువలన లోకమునకును తనకును మేలు
కలుగునో కీడుకలుగునో విచారించి లాభకరమయినప్పుడుమాత్రమే
వానియభీష్టమును దీర్చుచు వానిని దమయాజ్ఞలో నుంచుకొనుచుండ
వలెను. ఇంద్రియములయందింకొక్క స్వభావము గలదు. పురుషుఁ
డింద్రియలోలుఁడయి వానికోరికను దీర్చినకొలఁదిని వానికి తృష్ణ
యధికమగుచుండును. వానికిఁ గొంతకాలము చనవిచ్చిన తరువాత
మరల వానిని లోఁబఱుచుకొనుట కష్టము. మృగములు కేవలకామాం
ధులకైనను మేరగలదుగాని మనుష్యులయాశకు మేర యుండదు.
అందుచేత నమితమయిన యింద్రియసుఖములలో మునింగినవారు
మరలఁ బైకి తేలలేక మృగములకంటెను హీనమైన యవస్థనొంది
యధోగతు లగుదురు. అట్టి దురవస్థ కలుగకుండుటకయి బుద్ధిమంతు
లగువారు మొదటినుండియు జాగరూకత గలవారయి యింద్రియములు
పైకిలేచి జ్ఞానదేహము నణఁగఁద్రొక్కకుండ సదా నీతిదేవతను బైకి
లేవనెత్తుచు నింద్రియమృగములను దలనెత్తనీక నిగ్రహించుచుండ
వలెను. యుక్తసమయములో బుద్ధిబలముచేత నిగ్రహింపక పోయిన
పక్షమున దినదినక్రమమున బలపడి యింద్రియములు మనకు దుస్సా
ధ్యము లగును. ధనము కూడఁబెట్ట మరిగిన వానికి వార్ధక్యము వచ్చి

నప్పుడును ధనాశ తగ్గక స్వప్నావస్థయందును నదే పలవరింతగా నుండును. ముఖము ముడుతలుపడియు, పండ్లు కదలఁబాఱియు, శరీరము శుష్కించి కంపమొందియు, కన్నులు మసకలు క్రమ్మియు, సమస్తావయవములకును ముసలితనము వచ్చుచున్నను ధనాశకు మాత్ర మంతకంతకు పడుచుతనము వచ్చుచున్నదని భర్తృహరి చెప్పిన వాక్యము కొంతవఱకు సత్యమేకాని కేవల వర్ణనాంశము కాదు. ఇట్టి ధనాశ లోనుగాఁగల యింద్రియవాంఛాప్రాబల్యము హెచ్చిన కొలఁదిని నొకటి తరువాత నొకటిగా నుత్తమగుణములన్నియు మాపు మాసి పోవును. హృదయమునందంతటను విషయసుఖవాంఛలే క్రమ్ముకొన్నప్పుడు సత్యము ధర్మము దానము కారుణ్యము మొదలయినవాని కెక్కడ నవకాశ ముండును? కాఁబట్టి మనుష్యునకు దేవత్వమును దెచ్చెడి యుత్తమగుణములను పాఱఁద్రోలనెంచు నింద్రియముల నెల్లప్పుడును మన యాజ్ఞలో నుంచి నిగ్రహించుచుండవలెను. ఇంద్రియముల కిట్టి యసామాన్యశక్తి యున్నదన్నప్పుడు సత్త్వాదులను పాఱఁద్రోలునంతటి బలమును వాని కీశ్వరుఁ డేల యియ్యవలెనని కొందఱడుగవచ్చును. ఇంద్రియవర్గమున కటువంటి శక్తిని కలిగించుట మనుష్యుని కీర్తిగౌరవములను పెంపొందించుటకే కాని మఱి యొకందునకుఁ గాదు. ఎంత బలవంతుఁడయిన శత్రువును జయింపఁ గలిగిన, మనుష్యున కంత కీర్తికరము. మనము లోకములో నెవ్వరిని గొప్పవారినిగా నెంచి గౌరవింతుము? అధికముగా తిన్నవానిని, అమిత స్త్రీలోలుఁడయిన వానిని, అత్యంత ధనార్జనాపరుని కాదు. సత్యము నిమిత్తము సమస్తసుఖములను విడిచినవానిని, కష్టములకోర్చి లోకమున కుపకారము చేసినవానిని, ధర్మము నిమిత్తమయి తృణప్రాయముగా ప్రాణముల నిచ్చినవానిని, ఇంద్రియనిగ్రహము చేసిన

యిటువంటి మహాత్ములనే యెల్లవారును గీర్తించి గౌరవింతురు. ఎవ్వరి మాటయో కాక మనమాటయే మనము విచారించుకొందము. మనకు మరణ మాసన్న మయినప్పు డింద్రియవిజితులమయి మన మతిభోగపరాయణుల మగుటను స్త్రీలోలుర మగుటను పరులను వంచించి ధన మార్జించుటను గొప్పవారి దయకయి కల్లలాడుటను దలచుకొని సంతోషింతుమా? ఇంద్రియనిగ్రహమును జేసి శుద్ధచరిత్రుల మగుటను సత్యసంధుల మగుటను బరోపకారపారీణుల మగుటను ధర్మము నిమిత్తమై కష్టములను సహించుటను దలచి సంతోషింతుమా? సత్యము నిమిత్తమును ధర్మము నిమిత్తమును లోకము నిమిత్తమును శరీరసంపదలను ధారపోసినవాడెవ్వడును చరమావస్థయందు దాను జేసిన యాసత్కృత్యములకయి వగచువాడుండునని నేననుకొనను.

ఇంద్రియనిగ్రహము చేయుట యనగా నీశ్వరాజ్ఞారూపమయిన ధర్మము నిమిత్తము స్వప్రయోజనమును విడచుటయే కదా? స్వప్రయోజనము విడుచుట యనగా ధర్మము నిమిత్తమును సత్యము నిమిత్తమును లోకము నిమిత్తమును స్వసుఖమును విడిచి బాధలకోర్చుట. ఊరక బాధలకోర్చుట గొప్పతనము కానేరదు. దుష్టులు సహితము తమ దుష్కార్యములను జేయుటలో ననేకవిధముల బాధల నొందుదురు. ఈశ్వర ప్రీతికరముగా లోకముయొక్క మేలునిమిత్తమయి స్వప్రయోజనమును సుఖమును త్యజించి బాధలకు సహించుటలోనే గొప్పతన మంతయు నుండును. అట్లు చేయుటయే నిజమైన వైరాగ్యము; అదియే యింద్రియనిగ్రహము. మనస్సులో నీతిబలమును ధర్మబలమును గలిగి యుండినగాని యింద్రియనిగ్రహము చేయుట శక్యముకాదు. ఈశ్వరునియందు దృఢవిశ్వాసమును భక్తియు నుండినంగాని నీతిబలమును ధర్మబలమును గలుగవు. ఈ రెండుబలము

లును గలుగునేని దైవబలము వానితోడనే యుండును. దైవబలము కలిగినందునకు గుఱుతు ధర్మాదుల నిమిత్తమయి కష్టములకును బాధలకును నిందలకును సహించి యింద్రియములను గెలువఁగలుగుట. ఇంద్రియములను గెలుచుట యనఁగా నతిమానుషమయిన శక్తిని జూపుట యనియే యర్థము. మనకు ధర్మస్థాపనమునందు దోడుపడెడి యతిమానుషమయిన శక్తి లోపల యీశ్వరబలమేకాని వేఱుకాదు. భక్తిపరునకుఁ గాని నిక్కమయిన యీశ్వరబలము కలుగదు. లోకము నిమిత్తమును సత్యము నిమిత్తమును ధర్మము నిమిత్తమును ప్రాణముల నైన నియ్యఁగలుగుటయే నిజమైన భక్తి. కార్యరూపమునయిన యిటువంటి భక్తిలేక యానందబాష్పములతోను భగవన్నామస్మరణములతోను శీతలవాక్యములతోను మాత్రము తెలిపెడి నటనము భక్తి కాదు. కామము, క్రోధము, గర్వము, మొదలైన యింద్రియవ్యాపారముల నడఁచివేసి, శాంతి, వినయము, కారుణ్యము మొదలైన యుత్తమ గుణములను ధరించి, యెన్నికష్టములు వచ్చినను లోకము నిమిత్తము సహించి ఫలాపేక్ష లేక యీశ్వరప్రీతికరముగాఁ బరోపకారమును జేయుచుండుటయే నిర్మలమయిన భక్తి. శాంతివినయాదు లుత్తమ గుణములే యైనను శక్తిగలిగియుండియు ధర్మము నిమిత్తము వానిని బూనుట శ్లాఘాపాత్రమగును గాని యశక్తతచేత బూనుట శ్లాఘార్హము కాదు. కొందఱు శరీరదౌర్బల్యముచేతను భయముచేతను శాంతాత్ములు కావచ్చును. కొందఱు పరాధికారప్రాబల్యముచేతను ఫలాపేక్షచేతను వినయము చూపవచ్చును అట్టివారు గౌరవార్హులు కారు. తన శత్రువున కపకారముచేయ శక్తుఁడయియుండియు కోపకారణము కలిగినప్పు డింద్రియోద్రేకము నడఁచి శాంతి చూపువాఁడు గౌరవార్హుడు; ధనబలాదులచేత దానధికుఁడనని యెఱిఁగియుండియు

గర్వము దోఁచినప్పుడు దానిని నిగ్రహించి యెదుటివాఁడు తన సోదర తుల్యుఁ డని యెంచి వినయము చూపువాఁడు గౌరవార్హుఁడు. గౌరవార్హత యంతయు నింద్రియనిగ్రహములో నుండునుగాని మఱి దేనిలోను లేదు. అపకారము నొందియు ద్వేషమునఁ బెంచి యుపకారము చేయువాఁడును, ఇతరుల యన్యాయమువలన బాధనొందియు ప్రతికారచింత నడఁగఁ ద్రొక్కి న్యాయముచూపువాఁడును, కోపకారణము కలిగియు నాగ్రహమును నిగ్రహించి శాంతత వహించువాఁడును, నీతినిమిత్తమయి సమస్తేంద్రియసుఖములను విడనాడువాఁడును, ఇంద్రియనిగ్రహము చేసినవారు. అంతేకాని మనుష్యైకయోగ్యము లయిన భార్యాపుత్రబంధుమిత్రాది సంగములను వదలివేసి, గుణాలంకారమయిన ప్రేమానుబంధము తెగఁగోసి, మృగనివాసార్హము లయిన శాకలములు మేసి, యరణ్యవాసము చేయఁగడఁగుట మనోనాశముగాని యింద్రియనిగ్రహము కాదు. అట్టిది భగవత్ప్రీతికరమును గానేరదు. మనుష్యుల కీశ్వరుఁ డనుగ్రహించిన సద్గుణములును సార్థములుగాఁ బరిత్యాజ్యములు కావు. శరీరావయవము లన్నియు యనారోగ్యస్థితియందుండి క్రమముగాఁ దమవ్యాపారములను నిర్వహించుచున్నంతవఱకే దేహమున కంతకు సౌందర్యమును బలమును గలిగించునట్లు మనోగుణములన్నియు యథాయోగ్యస్థితియందుండి క్రమముగాఁ దమకృత్యములను నిర్వహించుచున్నంతవఱకే యాత్మకు సౌందర్యమును బలమును గలిగించును. ఏ యవయవ మంతమాత్రము చెడినను, శరీరసౌందర్యము మాత్రమే కాక యితరావయవముల బలము సహితము తగ్గుటను యెల్లవారికి ననుభవవేద్యము. ఈప్రకారముగానే యే మనోగుణ మంతమాత్రము చెడినను, నాత్మసౌందర్యము మాత్రమేకాక యితరగుణములబలము సహితము తగ్గిపోవును.

ఇట్లు చెడెడి యవయవముగాని గుణముగాని యుత్తమ మయినది గాక యధమ మయినదే యయినను గూడ తక్కినవాని యోగ్యతను జెఱుపక పోదు. కన్ను మొదలయినవి చెడక పెదవి యింత మొత్త పడినను మొగముయొక్క యందము పాడగును గదా? దీనినిబట్టి యింద్రియములను యుక్తస్థితియందుంచి వానిని యుక్తవ్యాపారముల యందు నడుపుటయే కర్తవ్యముగాని వానిలో దేని నెంతమాత్రము రూపు చెఱుపుటయుఁ గర్తవ్యము కాదని యెల్లవారును సులభముగాఁ దెలిసికొన వచ్చును. ఇంద్రియవర్గముయొక్క యుక్తవ్యాపారము ధర్మానుసారముగాఁ బనిచేయుట యని యీవఱకే చెప్పియున్నాను. తనయందును తన కుటుంబమునందును తన బంధుబృందమునందును తన మిత్రవర్గమునందును మాత్రమే చూపెడిది కాక భేదభావము లేక తనకు సోదర తుల్యులయిన యెల్లమానవులయెడలను జూపెడి న్యాయము కారుణ్యము మొదలయిన యుదారగుణపుంజమే ధర్మమగును. కామ క్రోధాదులయిన యాంతరశత్రువులను నిగ్రహింపక యిట్టి యుదార గుణము సాధ్యముకాదు. ఇంద్రియనిగ్రహముచే నిట్టి యుదారగుణము కలుగఁగానే ధర్మము వర్ధిల్లి యది లోకముయొక్క క్షేమాభివృద్ధులకు హేతువగును. ఇట్లుగాక భార్యలుబిడ్డలు బంధులు మిత్రులు నన్న పక్షపాతమునఁ గొందఱియెడలను మాత్రమే కారుణ్యాదులను జూపి యితరులయెడ నుపేక్షను జూపినచో నప్పుడింద్రియనిగ్రహము లేక ధర్మమునకు భంగముకలిగి లోకక్షేమాభివృద్ధులకు నిరోధము సంభవించును. అప్పుడు మనము కొన్నిసమయములయందు మనకు ప్రేమాస్పదు లయినవారు తప్పుచేసినను శిక్షింపఁజాలము; నింద్యమైన పని చేసినను మెచ్చుకొందుము; స్వలాభమునకయి యితరులకు హానిచేసినను ఉపేక్ష చేయుదుము. కాఁబట్టి మనయాప్తులయెడ జూపినను,

పరులయెడఁ జూపినను దయ మొదలగువాని నీశ్వర ప్రీతికరముగా ధర్మచింతతోను వైరాగ్యబుద్ధితోను జూపుచుండుటకయి యభ్యాసము చేయవలెను. అట్టి వైరాగ్యము కొంచెము శ్రమచేసినచో సర్వజనులకును సాధ్యమైనదే. ఇటువంటి వైరాగ్యము బొత్తిగాలేని మతము మతముగాదు; అది లేనిభక్తుఁడు భక్తుఁడును గాఁడు. తన ప్రవర్తనను బాగుపఱచుకొనుటకుఁ బనికిరాని పక్షమున నట్టి మతమునఁ బ్రయోజనము లేదు. దేవాలయమునను పురాణశ్రవణ సమయమునను కన్నులనుండి యానందబాష్పములు కార్చుచు స్వకృత్యములయం దింద్రియనిగ్రహము నించుకయుఁ జేయలేక లోకోపకారచింత నణుమాత్రమును బూనక భక్తిహీనునివలెనే ప్రవర్తించుచుండిన పక్షమున నట్టివాఁ డాత్మవంచకుఁడును దైవవంచకుఁడును పరవంచకుఁడును నగునుగాని భక్తనామమున కర్హుఁడు కాఁడు. అట్టివాఁడు బెల్లముయొక్క మాధుర్యమును వర్ణించినప్పు డెల్ల నోట నూటలు మ్రింగెడు వానివంటివాఁడగును గాని యనుభవించెడు వానివంటివాఁడు కాఁడు. సద్వర్తనము లేక యీశ్వరగుణకథన సమయమునందు మాత్ర మానందబాష్పములు విడుచు వేషధారిని భక్తుఁడనుట నిశ్చయముగా మతమునకగౌరవము తెచ్చుటయే. భక్తిలేశముగలవానికిఁ గొంచెమయిన వైరాగ్యమును సద్వర్తనమును గలుగక మానవు. నిజమైన వైరాగ్యము కలవాఁడు, ధర్మమార్గమునుండి తొలఁగించుట కయి యితరులు తన్నెంత బాధింతురో యెంత గర్హింతురో యంత యుత్సాహముతోను సంతుష్టబుద్ధితోను ధర్మమార్గము నవలంబించియుండును; మనుష్యులు తనయెడలఁ గ్రూరులయినను కృతఘ్నులయినను కూడ లోకోపకారకార్యములను విడువకుండును. ఇట్టి వైరాగ్యమును భగవద్భక్తి కలవారయి కొంచెము శ్రమచేసినచో నెల్లవారు సాధ

రణమునఁ జూపవచ్చునని పయిని జెప్పియున్నాను. కాఁబట్టి ఓ మిత్ర వరులారా! మనమందఱమును నిజమైన యీశ్వరభక్తి కలవారమయి వైరాగ్య మవలంబించి మన సహోదరప్రాయమైన జనసామాన్యము యొక్క క్షేమాభివృద్ధుల నిమిత్తమయి శక్తివంచన లేక పాటుపడఁ బ్రయత్నింతము. ఈ మహాకార్యనిర్వాహణమునందు మనకు మనోబల మును ధైర్యమును దయచేసి యీశ్వరుఁడు నిత్యసహాయుఁ డగునుగాక!



# విద్యాధురీణుల యార్హకృత్యములు.



By

**K. VEERESALINGAM**

# విద్యాధురీణుల యర్హకృత్యములు

లోకములోని సమస్తపదార్థములకును వృద్ధి నైసర్గికమయి యున్నది. ప్రతివస్తువును చిన్నదిగా పుట్టి క్రమక్రమముగా పెద్దది యగుచున్నది. అయినను సాకారమయిన భౌతికవస్తువుయొక్క వృద్ధికిని, నిరాకారమయిన యాత్మయొక్క వృద్ధికిని భేదము కలదు. భౌతికపదార్థాభివృద్ధికి పరిమితి యున్నది; ఆత్మాభివృద్ధికి పరిమితి లేదు. అందుచేత శరీరమువలెఁగాక యాత్మ శాశ్వతముగా వృద్ధి నొందుచుండఁ దగినది. మనుష్యుఁడు శరీరమును మాత్రమే కాక యాత్మనుగూడఁ గలవాఁడగుటచేత నతఁడు నిరంతరాభివృద్ధిని బొందుచుండఁ దగినవాఁడు. కాఁబట్టి మనుష్యుని కొకకాలమునందు వృద్ధి సంపూర్ణమయిన దనియు, అటుపైని వృద్ధినొందవలసిన యావశ్యకము లేదనియు, చెప్పుట స్వభావవిరుద్ధము. అట్లయ్యును మనదేశములో రెండుతెగలవారిప్పుడు మనపూర్వు లెంతో కాలముక్రిందటనే సర్వజ్ఞులయి పరిపూర్ణదశను బొందిరనియు, ఆధ్యాత్మికవిషయమున నంతకంటె నధిక జ్ఞానము కలుగఁజాలదనియు చెప్పుచున్నారు. అందొకతెగవారు సామాన్యముగా దివ్యజ్ఞానసమాజికులు; రెండవతెగవారు పూర్వాచారప్రియులు. ఈ యిరుదెఱఁగులవారి బోధనవలనను మనదేశమున కింక నభివృద్ధి యసాధ్యమన్న పర్యవసానము తేలుచున్నది. దేశాభివృద్ధికి భంగకరమయిన వీరి సిద్ధాంతమునుగూర్చి యించుక విమర్శ చేయవలసి యున్నది.

వృద్ధి యనఁగా నానావస్తువుయొక్క యుపయోగమునకుఁ దగినటుగా సమసావయవములును బరస్పరానుకూలముగా పెరుగుట.

అట్లు సమానముగా పెరుగక యొకభాగము వర్ధిల్లుచు నొకభాగము శుష్కించుచు వచ్చినచో నది నిజమైనవృద్ధిగాక రోగ మగును. ఒక వృక్షముయొక్క యొకశాఖ నసలెత్తి పెరుగుచు నింకొకశాఖ మాడి యెండి వాడఁబారినచో నది యావృక్షముయొక్క రోగసూచకమయిన యస్వాభావికస్థితిని దెలుపును. అటువలెనే మానవదేహముయొక్క సమస్తావయవములును పరస్పరానుకూలముగా నెదుగక యొకకాలు సన్నగిల్లి యొకకాలు లావయినను. మేను చిక్కి తల బలిసినను, అది సహజమైన వృద్ధిగాక రోగసూచక మగును. భౌతికవస్తువిషయమునం దెట్లో యట్లే యాధ్యాత్మికవిషయమునందును మన యాత్మ యన్యోన్యానుకూలముగా సమస్తగుణములలోను సమస్తశక్తులలోను పెంపొందకుండ వృద్ధియగుచుగాని యొకదానికి భంగకరముగా నొకటి యతిశయించుట వృద్ధి కాదు. మన యాత్మకుఁ గల జ్ఞానము, శక్తి, కారుణ్యము మొదలైన గుణములలో శక్తి గలిగి తెలివి హ్రసించినను కారుణ్య మతిశయించినను సత్యమైన వృద్ధి కాదు. ఈగుణము లన్నియు నొకదాని కొకటి సహకారులుగా వర్ధిల్లక యితరేతర విరుద్ధముగా నొకటి యెక్కువగాను వేఱొకటి తక్కువగాను వృద్ధిఁబొందినచో మనము శుభప్రదమయిన వృద్ధిని బొందినవారము కానేరము. వృక్షాదులగు భౌతికవస్తువు లభివృద్ధికి వానివాని యుపయోగములనుబట్టి పరిమితి యుండుటయే కాక యేకజాతిలోని యొక కాలపువానికంటెఁ దరువాతి కాలపువానియం దాధిక్యమేమియు లేక యుండును. వెనుకటికాలపు వృక్షములిచ్చినరీతి పుష్పఫలాదులనే వాని సంతతి వృక్షములును తరములవరుస నిచ్చుచుండును; వెనుకటికాలపు పక్షులు కట్టిన గూళ్లవంటి గూళ్లనే వానిసంతతి పక్షులును తరములవరుసను గట్టుచుండును. అంతేగాని వానియందు క్రొత్తమార్పేదియు నుండదు.

మనుష్యాత్మ కృషిచేయుచు వచ్చినచో నిరంతరాభివృద్ధి నొందు చుండుటయేకాక యొకతరమువానికంటె నొకతరమువా రంతకంతకు క్రమక్రమముగా నభివృద్ధి నొందుచుందురు. ఆదికాలమునందు దిగంబరులై గుహాలలో వసించినవారి సంతతివారు కొంతకాలమునకు మృగాజినాదులు ధరించి తాము నిర్మించుకొన్న కుటీరములలో వసింతురు; వారిసంతతివారు కాలక్రమమున చీనిచీనాంబర ధారులయి దివ్యసౌధములలో వాసము చేయుదురు. ఇట్లు కాలక్రమమున వృద్ధి నొందుచుండుట మనుష్యజాతికి స్వాభావికము; వృద్ధి నొందకుండుట యస్వాభావికము. భూమిమీఁదఁ గల జంతుజాలములలో నెల్లను మనుష్యుఁడు శ్రేష్ఠుఁడు. అతని శ్రేష్ఠతకు ముఖ్యకారణము నిరంతరాభివృద్ధిని బొందుచుండు స్వభావము కలుగుటయే. ఈయభివృద్ధి యన్యోన్య సాహాయ్యముచేతఁ గాని కలుగనేరదు. అన్యోన్య సాహాయ్యము నపేక్షింపని కాకయె యుండెడు పక్షమున మనుష్యుఁడు బహువిషయములలో మృగములకంటె నధికుఁడు కాఁజాలఁడు. కాఁబట్టి మనుష్యాభివృద్ధికిఁ బరార్థపరత్వ మత్యంతావశ్యకము. బొత్తిగా పరోపకారచింత లేని కేవల స్వార్థపరుఁడు మనుష్య నామమునకే యర్హుఁడు కాఁడు. మనుష్యునకును మృగాదులకును గల ముఖ్య భేదములలో నిది యొకటి. మృగాదులు తమ ప్రయోజనమును మాత్రమే చూచుకొనునవి; మనుష్యుఁడు స్వప్రయోజనమును మాత్రమే గాక పరుల బాగును గూడఁ జూడవలసినవాఁడు. మనుష్యుఁడు స్వలాభమునకంటెఁ బరప్రయోజనమును నెంత యెక్కువగా జూచుకొనుచుండునో యంత యధికుఁ డగుచుండును; పరప్రయోజనమునకంటె స్వలాభము నెంత యెక్కువగాఁ జూచుకొనుచుండునో యంత యధముఁ డగు చుండును. ఈ పరార్థపరత్వమునే దేశోపకారము మొదలైన బహు

నామములతో వ్యవహరింతురు. ఈ పరోపకారశీలతయే మనుష్యున కలంకారము. కాఁబట్టి మనుష్యనామమున కర్హులు కాఁగోరినవా రందఱును లోకముయొక్క దుఃఖమును తమ దుఃఖమునుగాను లోకముయొక్క సుఖమును తమ సుఖమునుగాను భావించుకొని సంఘముయొక్క లోపములను తగ్గించుటకును క్షేమము వృద్ధిపొందించుటకును శక్తివంచన లేక పాటుపడుచుండవలెను. సంఘము వృద్ధిపొందినఁ దామును వృద్ధి నొందుదురు; సంఘము క్షీణదశ నొందినఁ దామును క్షీణదశ నొందుదురు. సకలావయవములును నారోగ్యదశయం దుండనప్పు డేయవయవమునకును, నెంత మంచిదశలో నున్న దానికిని, సంపూర్ణ సౌఖ్యము గలుగకుండునట్లే సంఘము మంచిస్థితిలో లేనప్పు డేమనుష్యుఁడును దానెంత విద్యావిత్తసంపన్నుఁడయినను సంపూర్ణ సౌఖ్యము ననుభవింపఁజాలఁడు. అందుచేత వివేకియగు ప్రతిపురుషునకును సంఘాభివృద్ధికయి సర్వప్రయత్నములను చేయుచుండుట పరమ కర్తవ్యము. సంఘవృద్ధికయి కష్టములకోర్చి పనిచేయనివాఁ డెంత విద్యాబుద్ధులు గలవాఁడయినను సంఘముయొక్క దుస్థితిచేతఁ దానును గొంత దుస్థితిని బొందకతీఱదు. సంఘమును దనస్థితికిఁ దెచ్చుటకయి కృషిచేయుచు సంఘముతోడిపాటుగా నభివృద్ధినైనను బొందవలెను; సంఘస్థితికిఁ దాను దిగుచు సంఘముతోడిపాటుగా క్షీణదశనైనను బొందవలెను; అంతేగాని సంఘములోనుండి సంఘాభివృద్ధికయి పనిచేయక తటస్థుఁడైయుండి సుఖస్థితి నొందుట సాధ్యముకాదు. కాఁబట్టి వివేకి యగువాఁడు తోడివారికి లేక తనకు సుఖాభివృద్ధులు కలుగవనియు, మానవుఁడయినందున భ్రాతృతుల్యులగు తోడివారి సుఖాభివృద్ధులకయి తాను జేయవలసిన కార్యములు కలవనియు తెలిసికొని తనధర్మములను పారమార్థికబుద్ధితో నిర్వ

హించు చుండవలయును. లోకములో తృణము మొదలుకొని పర్వ
తము వఱకును, చీమ మొదలుకొని యేనుఁగు వఱకును, గల ప్రతివస్తు
వును నేదో యుపయోగము నిమిత్తము చేయఁబడినదే కాని నిష్ప్రయో
జనమయిన దొక్కటియు లేదు. పనికిమాలిన గడ్డిపఱకలు సహితము
లోకమున కుపయోగపడుచుండఁగా నుత్కృష్టజన్మముగల మనుష్యుఁడు
నిరుపయుక్తుఁడుగా సృజింపఁబడఁ డనుట స్పష్టము. మనుష్యుఁడు
లోకములో సృజింపఁబడుటయే యతఁడు లోకోపయోగము నిమిత్తము
చేయఁబడె నన్న సత్యము సహస్రముఖముల ఘోషించు చున్నది.
లోకములో వస్తు వెంత గుణాధిక్యము గలదై న నంత యుపయోగా
ధిక్యము కలదయి యుండును. మనుష్యుఁడు సమస్తజంతువులకంటె
గుణాధికుఁడై నందున లోకమున కన్ని జంతువులకంటె నెక్కువ ప్రయో
జనపడవలెను. విద్యావిహీనునికంటె విద్యాలంకారభూషితుఁడు గుణా
ధికుఁడనుటకు సందేహము లేదు గదా. కాఁబట్టి విద్యాధిక్యముతోడనే
కార్యభారాధిక్యమును మనుష్యునిమీఁదఁ బడును. విద్యాధికులవలననే
మనదేశము వృద్ధికి రావలెను. తన యభివృద్ధికయి మనదేశము
విద్యాధికుల కృపనే యత్యంతము ప్రతీక్షించు చున్నది. మాతృభూమి
కాశాభంగము కలిగింపక విద్యాసంపన్నులు సార్థకజన్ము లగుదురు
గాక !

దేశాభివృద్ధికై విద్యాధికు లాచరింపవలసిన ధర్మములను వివ
రించుటకుఁ బూర్వము ధర్మాచరణమునకు ప్రతిబంధకములుగా నిప్పటి
విద్యావంతులలో వ్యాపించుచున్న ముఖ్యలోపములను గూర్చి కొంచెము
చెప్పవలసి యున్నది. మన దేశమునం దిప్పు డింగ్లీషు చదువుకొన్న
వారిలో క్రియాశూన్యులైన శుష్కవేదాంతు లంతకంత కెక్కు
వగుచున్నారు. దేశాభివృద్ధి కావలె నన్న పక్షమున నిట్టివారి సంఖ్య

యీ హంతనుబట్టి యధికారుల కప్పగింపఁ జూచును గాని యెంతటి పరమ వేదాంతవేత్తయు,

శ్లో॥ య ఏవం వేత్తి హంతారం య శ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాఽయం హంతి న హన్యతే.

“దేహి చంపువాఁడనియు చంపఁబడువాఁడనియు తలఁచు వారుభయులును మూఢులు. దేహి యొకరిచే చంపువాఁడును ఒకనిచేఁ జంపఁబడువాఁడును గాఁడు” అని శ్రీకృష్ణులవారు గీతలలో నానతిచ్చినారని చూపినను నమ్మి యూరకుండఁడు. వ్యవహారములం దెవ్వరికిని సర్వము బ్రహ్మ మన్న నమ్మకము కలుగకపోయినను, ఈసిద్ధాంత వ్యాపనమువలన లోకమునకు నష్టము కలుగకపోదు. తనే దేవుఁడే ననుకొనువారు పాపములకు భయపడవలసిన పని యుండదు; నేను జేసిన దానికెల్ల నే నీశ్వరుని కుత్తరవాది ననుకొనువారు మాత్రమే పాపమున కవశ్యముగా భయపడవలసి యుండును. వేదాంతము చెప్పు బోధన యంతయు మనుష్యుఁ డహంభావమును వదలి నేనను జ్ఞానమును నశింపచేసికొని యహంకర్తృత్వమును విడిచి పరమాత్మలోఁ గలిసిపోఁ బ్రయత్నింపవలెనని; మనుష్యుఁ డీశ్వరుని కంటె భిన్నుఁడన్న సిద్ధాంతము చేయు బోధనము తనపనులకుఁ దాను కర్తయనియు నుత్తరవాది యనియు నమ్మి యహంకర్తృత్వమును విడువక నిరంతరాభివృద్ధి నొందుచు ఘనుఁడుగాఁ బ్రయత్నింపవలెనని; కాఁబట్టి వేదాంతసిద్ధాంతవిశ్వాసమువలన నీతిరతియు పరోపకారచింతయు నాత్మగౌరవమును దేశాభిమానమును దుర్బలము లగును; మనుష్యుఁడు తనపనులకుఁ దాను కర్తయనియు నీశ్వరుని కుత్తరవాది యనియుఁ జెలుపు సిద్ధాంతవిశ్వాసమువలన నీతిరతియు పరోపకారచింతయు నాత్మగౌరవమును దేశాభిమానమును ప్రబలము లగును.

తన పనులకుఁ దాను కర్తను గానన్న నమ్మకము గలిగినచో నీతివర్తమునకును పరోపకారమునకును ప్రోత్సాహ మెట్లు కలుగును? ఒం డొరుల నేకముగా బంధించి, సౌభ్రాత్రమును పెంచి, సుఖసంతోషము లను వృద్ధిపొందించి, భూమిని స్వర్గతుల్యముగా మార్చునవి నీతిపాశ మును ప్రేమపాశమును గాక లోకములో మఱి యేవున్నవి? ఈరెండు పాశములును శిథిలములయిన యెడల నిజమయిన దేశాభిమాన మెక్కడనుండును? దేశాభివృద్ధి యెక్కడ నుండును? దేశాభివృద్ధి కలుగుటకయి యహాంకర్తృత్వవిశ్వాస మావశ్యకము. అహాంకర్తృత్వ విశ్వాస మెప్పుడుండునో యప్పు డాత్మాభివృద్ధిప్రయత్న ముండును; ఆత్మాభివృద్ధిప్రయత్న మున్నప్పు డాత్మగౌరవ ముండును; ఆత్మ గౌరవ మున్నప్పుడు తనస్వాతంత్ర్యముల నెఱిఁగి ప్రూసకత్తో వానిని గాపాడుకొనఁ బ్రయత్నించును; తన స్వాతంత్ర్యములను గౌరవించి కాపాడుకొన నేర్చినవాఁడు పరుల స్వాతంత్ర్యముల మన్నించ నెఱుఁ గును. ఇట్లన్యుల స్వాతంత్ర్యములను మన్నించుట సద్ధర్మము; అదియే నీతి; అదియే సోదరభావము. అన్యోన్యసోదరభావమే సంఘాభివృద్ధికి మూలము; అన్యోన్యసోదరభావము లేక ధర్మరతి యుండదు. ధర్మరతి కలుగుటకు ఫలము పరులు దూషించినను భూషించినను లక్ష్యము చేయక తాను సత్యమనియు న్యాయమనియు నమ్మినదానిని స్థైర్య ముతోఁ జేయుట. ఇట్టి ధర్మరతియు స్థిరచిత్తతయు మనలో చదువు కొన్నవారిలో నిప్పుడు కొఱవడియున్నవి. ఈ యుత్తమగుణములను మనవారు మనకు ప్రభువులుగానున్న యింగ్లీషువారిని జూచి నేర్చుకో వలసియున్నది. మన యిప్పటి చదువరులు మన పరిపాలకుల సుగుణ ములకంటె దుర్గుణముల నెక్కువగా నేర్చుకొనుచున్నారు. పశ్చా ర్త్యాచరణమునందలి స్థిరచిత్తతను నేర్చుకొన్నవారికంటె మద్యపాన

మును నేర్చుకొన్న విద్యావంతు లధికముగాఁ గానవచ్చుచున్నారు; మూఢాచారములను విడువ నేర్చుకొన్న వారికంటె సీమపోగచుట్టలను బహిరంగముగా కాల్ప నేర్చుకొన్న పండితు లెక్కువగుచున్నారు. ఇప్పటి చదువుకొన్నవారిలో వెంట్రుకలను కత్తిరించుకొనుట, కుళ్ళాయిలు ధరించుకొనుట లోనయిన బాహ్యవేషములయందు మార్పులు కావలసినన్ని కనఁబడుచున్నను, వానికిఁ దగినట్టు మనుష్యుల కలంకారములయిన సద్గుణ సద్వర్తనములయం దభివృద్ధి యొక్కడనో కాని కానరాకున్నది. మనదేశము వృద్ధికివచ్చుట పురుషభూషణములయిన సత్కార్యశూరత్వాది గుణసంపదలవలనఁ గాని యవి లేని కేవల బాహ్యవేషధారణము వలనఁ గాదు.

మన చదువుకొన్నవారిలోఁ గనఁబడుచున్న యింకొక లోపము సత్యగ్రహణాదరము తగినంత లేకపోవుట. ఈ సత్యగ్రహణపరాయణత్వాభావమున కొకకారణము పూర్వాచార పూర్వవ్యవస్థలయం దతిగౌరవ ముంచుట. పూర్వపు సదాచారములను సద్వ్యవస్థలను గైకొనుట మనకు ధర్మమే యయినను యుక్తాయుక్తవిచారము లేక పూర్వపువానినెల్ల నవలంబింపవలయు ననుట చదువుకొన్న బుద్ధిమంతుల లక్షణముకాదు. ఆలోచనలేక పూర్వపుదానినెల్ల గ్రహించుచు వచ్చినచో మనకు సత్యగ్రహణాదరము తగ్గిపోవుటయే కాక యభివృద్ధికిని భంగము కలుగును. పూర్వకాలము మంచిదని భావించుచుండుట యాలోచలేని పామరులలో నేకాలమునందును నున్నదే యయినను, ఒకకాలమునకంటె నొకకాలమునందుఁ గ్రమక్రమముగా వృద్ధి కలుగుచుండుట స్వాభావికమని యెఱిఁగిన వివేకులలో నట్టి యభిప్రాయ ముండుట శ్లాఘ్యము కాదు. పూర్వపువారు కష్టపడి జ్ఞానధనము నార్జించిన బుద్ధిమంతులే యయినను వారెంతో శ్రమ

పడి కూర్చిన జ్ఞానధన మంతయు ననాయాసముగాఁ దరువాతి తరము వారి పాలగుచు వచ్చుటచేతను వారువారు తమ యల్పబుద్ధులతోడనే తరముల వెంబడిని గొంతగొంత జ్ఞానధనము నప్పుడప్పుడు సమ కూర్చి పూర్వపుదానికిఁ జేర్చుచు వచ్చుటచేతను బూర్వపు వారికంటె తరువాతి వా రధిక లోకానుభవశాలురయి దీర్ఘకాయుల భుజముల మీఁద నెక్కిన వామనులును నెక్కువ పొడవైనట్లు జ్ఞానోన్నతులగుట నైసర్గికము. అట్లయ్యును జనులలో సర్వసాధారణముగా పూర్వ కాలము మంచిదని యభిప్రాయము కలుగుటకు పూర్తిగా కారణము లేక పోలేదు. దూరపుకొండలు నునుపన్న సామెత యందఱు నెఱిఁగి నదేకదా. దగ్గఱకుఁ బోయి చూచువఱకును లోపములు గానరాక దూరదేశములు స్వదేశముకంటె నుత్కృష్టములైనవని తోఁచు చున్నట్లే యిప్పటి లోపములు తెలియుటచే పామరులదృష్టి కెప్పు డును పూర్వకాలములు మంచివిగాఁ గనఁబడుచుండును. పూర్వ కాలమునందలి సామాన్యజనుల కష్టములను దెలిసికొనుట కిప్పు డాధా రము లంతగా లేకపోవుటచేతను, పుస్తకములలో గొప్పవారి గుణ మహిమలే సాధారణముగా వర్ణింపఁబడుటచేతను, పామరులు గత కాలమే మంచిదని భావించుట వింతగాదు. అయినను పూర్వపుగ్రంథ ములనుబట్టి విచారించినచో బహువిషయములు శ్లాఘ్యములైనవి కానవచ్చుచున్నప్పటికిని గొన్నివిషయములు మన మిప్పుడు చూచి గర్వపడవలసినవిగా లేవు. పూర్వకాలమునందందఱును విశుద్ధ చరిత్రు లుగానుండి రనుమాట కల్ల. దేవతలలో సహితము పేరుగలవారిలో వ్యభిచరింపనివారిని వ్రేలుమడచిచెప్పుట కష్టము. ఇంద్రియనిగ్రహము చేసినవారన్న వనవాసులయిన మహర్షులలో సహితము స్త్రీ కాశించి నప్పుడు తన శుద్ధచరిత్రమును గాపాడుకొన్నవాఁ డొక్కఁడనో కాని

కానఁబడఁడు. దేవతలకు గురువయిన బృహస్పతి యంతటి బుద్ధిమంతుని యవస్థ చూడుఁడు. ఈ కాలమునందును తారలును చంద్రులును పలువురు గలరు. కాని కులకాంతను లేవఁదీసికొనివచ్చి బ్రహ్మ దిగి వచ్చి వేఁడినను విడువక తగవులాడువారును, దయదలచి విడిచిన తరు వాత సంతానము కలిగినప్పుడు వచ్చి పుత్రుఁడు తనకు రావలెనని భర్తతో తగవుపెట్టెడు జారులును, భార్య నింటిమగనికిని, బిడ్డను అంతుమగనికిని యిప్పించి తగవుతీర్చెడు న్యాయకర్తలును, యీపాడు కలికాలమునందుఁ గానరారు. బృహస్పతి సహితము తన సహోదర భార్యను కామించిన బుద్ధిమంతుఁడే కాని సామాన్యుఁడు కాఁడు. పూర్వకాలమునందలి సంతానక్రమమును జూడుఁడు. అప్పటి ధర్మ శాస్త్రములలో ద్వాదశ విధ పుత్రు లంగీకరింపఁబడి యున్నారు. అం దొకఁడు మగని యనుమతివిూఁదనో మగఁడు గతించిన పిమ్మట బంధు వు . యనుమతివిూఁదనో పరపురుషునివలనఁ బుట్టిన క్షేత్రజుఁడు; ఇం కొకఁడు కన్య పెండ్లియాడక ముందే స్వసామర్థ్యమువలనఁ గన్న కానీనుఁడు; మఱియొకఁడు పెండ్లినాటికే భార్య గర్భవతియై తరు వాతఁ గన్న సహోఢజుఁడు; వేఱొకఁడు మగని యొఱుకలేకయే భార్య స్వశక్తిచేతఁ గన్న గూఢోత్పన్నుఁడు. ఇట్టి పుత్రులందఱును కలి ముది రిన యీ కాలమునఁ బనికిరాకున్నారు. ఇప్పటివారి కన్యాయములని తోఁచెడి ధర్మముల ననేకములను మన ధర్మశాస్త్రములనుండి చూప వచ్చును. వాని నటుండనిండు. పూర్వకాలమునందు కల్లలు మొద లయిన పాపకార్యములు తక్కువగా నుండెననుటలోఁ గొంతసత్యము లేకపోలేదు. ఇతరులను మోసపుచ్చి వారి ధనాదుల నపహరించుట కొఱకేకదా తఱుచుగా కల్లలాడుదురు. ఎల్లవారును దిగంబరులో కౌపీనధారులో యయియుండి యాకలములు భక్షించువారయి

యుండినప్పుడు కల్లలాడి పొందు లాభ మేముండును? కాఁబట్టి సొత్తం తగానులేని యీకాలమునందు, సొత్తధికముగా నున్న కాలమున కంటె దొంగతనములు బొంకులును తక్కువగానే యుండును. నాగరికత హెచ్చి సుఖసాధనము లెక్కువయినకొలఁది చౌర్యాదులును మాయోపాయములును మున్ను లేనివి క్రొత్త వేర్పడుననుటకు సందేహము లేదు. వ్రాతయెఱుఁగని కాలములో నుండెడు తప్పుపత్రములు వ్రాఁత వచ్చిన తరువాత రావా? ఏవో కొన్ని కష్టములు రావచ్చునన్న హేతువుచేత బుద్ధిమంతు లగువా రెవ్వరైన సుఖసాధనములను బరిత్యజించి యనాగరికులు కాఁజూతురా? వచ్చెడి కష్టము లస్వాభావికములయి దుష్టులవలన మాత్రము కలిగెడివగుటచేతను, కలిగెడిలాభములు స్వాభావికములయి యందఱుచే ననుభవింపఁదగిన వగుటచేతను బుద్ధిమంతులగువార లెల్లప్పుడును సుఖసాధనములను హెచ్చించి దేశాభివృద్ధి చేయుచు వానివలని కష్టములను సాధ్యమైనంతవఱకు తగ్గించు సదుపాయముల నాలోచించుచుందురు. పూర్వకాలపువారి నాళ్లు తక్కువనియు నిప్పటి మనవారాస్థితిని బొంకులు క్లైబ్యమనియు ఘోషించుచుఁ బూర్వకాలమహిమను సహస్రముఖముల భూషించెడి వా యిప్పటి చదువుకొన్నవారెవ్వరు తమ సుఖస్థితిని విడిచి పూర్వస్థితిని బొందఁజూతురు? ఎవ్వరు దివ్యభవనములను దివ్యాంబరాభరణములను పంచభక్ష్యపరమాన్నములను వదలి, గుహాలలోను పర్ణశాలలలోను వసించుచు, దిగంబరులును కౌపీనధారులును నయి, కందమూలపర్ణభక్షణము చేయుచు జోగులవలె వనవాసము చేయఁజూతురు? దివ్యజ్ఞానులు మొదలైనవారు హేతుకల్పనముచేసి తమ ప్రౌఢిమను జూపి యెంతశ్లాఘించినను పూర్వపుస్థితి మరల వచ్చుట యెప్పటికిని సాధ్యముకాదు. పూర్వమున నెప్పటికిఁ బూర్వమో యెప్పటి యాచా

రముల నవలంబింపవలెనో యెట్లు నిర్ణయింపవచ్చును? మనకంటెఁ బూర్వులు రామకృష్ణాది దేవతలను విగ్రహరూపమున మనవలెనే యర్చించుచుండిరి; వారికంటెఁ బూర్వులు యజ్ఞాదికర్మలలో మునిఁగి యుండిరి; వారికంటెఁ బూర్వులు రామకృష్ణాదిదేవతల నామములైన నెఱుఁగక యగ్ని వాయు సూర్యాది భూతముల నారాధించుచుండిరి. మనకంటెఁ బూర్వులు బాల్యవివాహముల నవలంబించి వితంతు వివాహములను లేకుండఁ జేసిరి. వారిపూర్వులు బాల్యవివాహములను నెల కొల్పి చచ్చిన భర్తలదేహములతో బ్రతికియున్న భార్యలను గాల్పఁ బూనిరి; వారిపూర్వులు బాల్యవివాహము లెట్టివో యెఱుఁగక వితంతు వివాహముల నంగీకరించుచుండిరి. ఇప్పటివా రాదియం దెట్టి యాచారముండెనో విచారింపక యిప్పు డేయాచారమున్నదో దానినే పూర్వాచారమని చెప్పి దేవతలనువలె సేవించుచున్నారు. ఈ యనర్థ మంతయు నవిచారమూలమున సంభవించుచున్నది. ఏది మంచిదో యేది చెడ్డదో విచారించి మంచిదాని నవలంబించుచుండెడు పక్షమున దురాచారములు తొలఁగి సదాచారములు ప్రబలును; విచారణలేక యాచరించుచుండెడి పక్షమున సదాచారములు నశించి దురాచారములు ప్రబలి వృద్ధికి భంగము సంభవించును. ఏదేశమందును పామరు లెప్పుడును విచారించి కార్యములను జేయువారు గాక పూర్వాచారమునుబట్టి పదిమంది పోయిన త్రోవను బోవువారుగా నుందురు. వారికిఁ బూర్వాచారము పరమదైవతము.—అనాగరికదశయందు పూర్వులవా రవలంబించిన పనులన్నియు వారికి పూజనీయములును పవిత్రములు నగును. వస్త్రనిర్మాణము చేతకానప్పుడు ధరించిన దిగంబరవేషములును, క్షురకర్మ చేతకానప్పుడు పెంచిన గోళ్ళును వెంట్రుకలును, కీటకబాధను తప్పించుకొనుటకయి పూసికొనిన బూడిదయు, వారికి గౌరవపాత్రము లగును.

అందుచేత మూఢులలో నూటికి వేయిటికి నొక్కొక్కఁడు మతోన్మాదముచే నట్టివేషము వేయుచుండుటయు తక్కినవా రట్టివారిని మహాత్ములని గౌరవించుచుండుటయు నిప్పటికిని దటస్థించుచున్నది; పామరులలో నిట్టి విశ్వాసముండుట వింతగాదు. చదువుకొన్నవారిలో నట్టి నమ్మిక యుండుట మొదటివింత; విద్యాధికులు విభూతి ధారణాదులకు నూతన హేతుకల్పనము చేసి వాని మహిమలను స్థాపింపఁజూచుట వింతపై వింత. తామిప్పుడు చదువుకొన్న నూతన శాస్త్రముల సాహాయ్యమువలనను బుద్ధిబలమువలనను నూతన హేతువులను కల్పించి పెనఁగులాడుచుండుటచేత దేశాభివృద్ధికి నిరోధము కలుగుటయే కాక విద్యాధికులకు సత్యగ్రహణాదరమును కుంటుపడును. కాఁబట్టి విద్యాధికులు సత్యగ్రహణపరాయణులయి సత్యమెంతన్న నంగీకరించుటకును, అసత్య మెంతన్న నిరాకరించుటకును, సత్యము కొనిపోయినదారినే నడుచుటకును దృఢనిశ్చయము చేసికొనవలెను. అట్టి దృఢనిశ్చయము దేశాభివృద్ధి కత్యావశ్యకము.

మన చదువుకొన్నవారిలోఁ గానఁబడుచున్న యింకొక లోపము నిజమైన దేశాభిమానము లేక పోవుట. నిజమైన దేశాభిమానికి లక్షణము దేశమునందలి సమస్తజనులమీఁదను ప్రేమాధిక్యము కలిగి సమస్తవిషయములలోను దేశము వృద్ధినొందుటకుఁ దగిన ప్రయత్నము చేయుట. దేశాభివృద్ధికి జనులలోఁ గల లోపములను సంస్కరించుటయు నితరులలోఁ గల గుణములను గ్రహించుటయు నావశ్యకములు. ఈ రెండుపనులును జరుగక దేశమెప్పుడును వృద్ధినొందదు. చదువుకొన్నవారిలో ననేకు లిప్పుడీసత్యములకు దృష్టియుంచక పూర్వాచారములను పొగడుటయే దేశాభిమానమని యెంచి మనవారిలోఁ

గల దురాచారములు సహితము సదాచారములని స్తోత్రపాఠములు చేసి జనులలో గర్వమును వృద్ధిపఱుచుచు, యితరదేశములవారి సదాచారములు సహితము దురాచారములని దోషారోపణము చేసి జనులలో ద్వేషమును బురికొల్పుచు, దేశాభివృద్ధికి ప్రతిబంధకు లగుచున్నారు. జనులవలన మెప్పొందుటకయి స్తుతిపాఠములు చేయువారు దేశమునకు శత్రువులును దురభిమానులును గాని నిజమైన యభిమానులును మిత్రులును గారు. తమపూర్వులును తామును లోకములో నెల్లవారికంటె నధికులమన్న గర్వము జనసంఘములో వ్యాపించి స్థిరపడిన పక్షమున దేశము బాగుపడదు. కాఁబట్టి దేశాభిమానలేశముగల ప్రతిపురుషుఁడును సమస్తమును బట్టువలె పొగడెడు పాఠకవృత్తి నవలంబింపక యే యే విషయములందు లోపములు గలవో వానినెల్ల విప్పిచూపి, దేహారోగ్యవిషయమునం దైనను, వాణిజ్య విషయమునం దైనను, కృషివిషయమునం దైనను, రాజ్యాంగ విషయములయం దైనను, నీతివిషయమునం దైనను, మతవిషయమునం దైనను, కులాచారవిషయమునం దైనను, మఱి యేవిషయమునం దైనను వృద్ధినొందుటకుఁ దగిన మార్గములను జనులకు జంకులేక దెలిపి నిర్భయముగా పని చేయవలెను. అట్లు పనిచేయువారే జనులకు నిజమైన నాయకులయి కాలక్రమమున జనులను నడుపుటకును దేశాభివృద్ధి చేయుటకును శక్తు లగుదురు. ఇట్టి పరిశుద్ధచింతతోఁ బనిచేయక స్వప్రయోజనము నపేక్షించియు ప్రజానురంజనమును గోరియు మూఢజనుల యిష్టానుసారముగా వర్తించువారు కొంతకాలము పేరొందినను తామనుకొనునట్లు జనులను నడుపువారు గాక మూఢజనులచేతనే నడుపఁబడువారయి వారి యజ్ఞానమునకు దాసులయి దేశాభివృద్ధికి విఘ్నము కలిగించు కుక్షింభరు లగుదురు. మూఢులను దన మార్గము

నకుఁ ద్రిప్ప సాహసింపఁజాలక తాను మూఢమార్గమునఁ దిరిగి మెప్పొందువాఁడు తాను నేర్చిన విద్యకును వివేకమునకును నవమానము దెచ్చినవాఁ డగును. కాఁబట్టి విద్యావివేకసహితుఁడైన ప్రతి పురుషుఁడును ప్రజలమెప్పుకొఱకు పూనెడు కపటదేశాభిమానమును మాని దేశముయొక్క యభివృద్ధికొఱకుఁ గావలసిన నిర్వ్యాజ దేశాభిమానమును పూనవలయును.

చదువుకొన్నవారిలోఁ దఱుచుగాఁ గనఁబడుచున్న యింకొక లోపము క్రియావంతు లంతగా లేకపోవుట. విద్యాధురీణులలో వాక్శూరులు లెక్క కెక్కువగా నెల్లయెడలను గానఁబడుచున్నను కార్యశూరులెక్కడనో నూటికి కోటికి నొక్కఁడుగాని కానఁబడకున్నారు. అనేకస్థలములలో విద్యావంతులనేకులు వాక్శూరత చూపవలసి వచ్చినప్పుడు సభాభవనములలో మేఘగంభీరభాషణములతో నానావిషయములనుగూర్చి వ్యాఘ్రములవలె బొబ్బరించుచు వాగ్ధారా ప్రవాహమును నిర్గళముగాఁ బఱపినను, కార్యశూరత చూపవలసి వచ్చినప్పుడు నివాసభవనములలో ముసలమ్మలముందట నోరు లేవక తాము ధర్మమని నమ్మినదాని ననుష్ఠింప వలసిన పురుషలక్షణమగు ధీరతను విడనాడి యాఁడువారిని శరణొందఁ దగిన పోటుబంట్లగుచున్నారు. ధర్మమార్గమున నడుచుటకుఁ జాలినంత పౌరుషములేని వాక్శూరులలోఁ గొందఱు తమ యాశక్తతను గప్పిపుచ్చుటకో, తమ యద్భుత యుక్తికల్పనాసామర్థ్యమును లోకమునకుఁ జూపి ప్రసిద్ధులగుటకో, మనలో పూర్వమున్నవన్నియు మంచివే యనియు వానిలో వేనిని మార్పవలసిన యావశ్యకము లేదనియు వాదించుచు స్వవాదోపబలార్థముగా శాస్త్రములను శరణొందుచున్నారు. ఎన్నఁడో నూఱుల కొలఁది సంవత్సరముల క్రిందట నప్పటివారిస్థితి కనుకూలముగాఁ జేయఁ

బడిన విధులే యెల్లకాలమును స్థితిభేదములేక యెల్లవారికిని వనుష్ఠే యములని చదువుకొన్నవారు వాదించుట యత్యద్భుతముగా నున్నది. అద్భుతములు కెప్పుడును కొఱఁత యుండదు. ఈ యద్భుతమునకు గారణమైన రహస్యమొకటి యున్నదని కొందఱు భావించుచు న్నారు. ఆ రహస్యమేది యందురేమో? కష్టములకు భయపడుట కంటె వేఱేదియు లేదు. కష్టములు లేక యే సత్కార్యమును నెఱ వేఱదు. కష్టములు లేక దేశాభిమానమే యుండదు. గాయములకు వెఱచి మూలదాగి యుండు రణశూరుఁడెందును నుండఁడు. ప్రజా క్షేమమును వృద్ధిని గోరెడు నిక్కమైన కార్యశూరుఁ డెట్టి ప్రయాసము నైనను గణింపక యోర్చి పాటుపడవలెను. శుద్ధహృదయముతో నిరం తరకృషి చేయు ధీరునకు కష్టములే యుత్సాహజనకములయి కార్య సాఫల్యమున కనుకూలసాధనము లగును. కార్యశూరత లేని యధీరుని మనస్సునకు లేనికష్టములును పెక్కులు పొడకట్టును. అతనికి దారి పొడుగునను వ్యాఘ్రములవలె కష్టము లడుగడుగునకును గనుపట్టు చుండును. అతఁడు శ్రమపడి తన బుద్ధిబలమును వినియోగించి యెన్ని కష్టములను గల్పింపఁగలిగినను, అవి దుర్లంఘ్యములని చూపుట కెన్ని యుపాయములు పన్నఁగలిగినను వానిలో నొక్కకష్టమునైనను నివరించుటకు శక్తుఁడుగాక తుద కేమియుఁ జేయలేనివాఁడగును. తానది యర్హాకృత్యమని యెఱిఁగియు జను లేమనుకొందురో యని సంశయించు బుద్ధిమంతుఁ డెప్పుడు నేపనియుఁ జేయఁడు. అట్లు చేయక పోవుటకుఁ గారణము దృఢచిత్తము లేకపోవుటగాని కార్యగౌరవము తెలియకపోవుట కాదు. మొదటినుండియు దృఢచిత్తత నభ్యాసము చేయనివా రెంత తెలిసినవారును, ధీశాలులు నయినను లక్షయుపాయ ములను జెప్పఁగలుగుదురు గాని యొక్క కార్యమును పూని నిర్వహింపఁ

జాలరు. కొందఱికి సదుద్దేశములే యుండినను అభ్యాసము లేమిచే నవి కార్యకారులు కావు. సత్కార్యాచరణమునందలి యుత్సాహమును స్థైర్యమునుగూడ బాల్యమునందే యభ్యాసము చేయవలెను; అవి మొదట నుపేక్షింపఁబడినచో నాకాలము దాటిన తరువాత పట్టుపడవు. కాఁబట్టి దేశాభిమానులు విద్యార్థులుగా నున్న కాలము నుండియు స్వసుఖమును కుటుంబసుఖమును జూచుకొనుచుండునట్లే లోకసుఖమునుగూడ నొకకంటఁ జూచుకొనుచుండుట కభ్యాసము జేయవలెను. ఇట్టి యభ్యాసము చేయని విద్యావంతులలో నభివృద్ధికి విరోధులుగా నుండెడువారిని గొందఱిని విడిచినచో పలువురు తాము దుష్కార్యములలోఁ బ్రవేశింపక పోయినను సత్కార్యములలో నడుగిడక, బుద్ధిపూర్వకముగా వెనుకకుఁగాని ముందుకుఁగాని పోక, జనాభిప్రాయమను గాలి వీచువంక కెల్లను దిరుగుచు, సత్కార్యాదరముగాని కార్యోత్సాహముగాని లేనివారయి లోకమునకు నిష్ప్రయోజకులగుదురు; మఱికొందఱు అంతకంటె నధికబుద్ధిమంతులయి తా మేకార్యమును జేయక పోయినను, సంస్కారప్రియు లైనట్లు నటించి చేయువారి నాక్షేపించుచు చేసిన పనులలో వంకలు పెట్టుచు తమమనస్సులకు తృప్తిగా పరిహసించి సంతోషించుచుందురు. ఇట్టివారూరక కార్యనిరతుల నగతాళి చేయుటకంటె వారు తప్పుదారిని బట్టినచోఁ దాము మంచిదారినిబట్టి చూపినను, చూపలేనిచో పరిహాసమును గట్టిపెట్టి మౌనమును వహించినను, యెంతో సముచితముగా నుండును. ఇతరవిషయములలో కార్యశూరులు విశేషముగా లేక పోయినను, రాజ్యాంగవిషయములలో ననేకులుండి పనిచేయుచున్నారే యని కొందఱనవచ్చును. కష్టములేని కార్యములలోఁ బనిచేయుట యంత గొప్పకాదు. రాజ్యాంగవిషయమునఁ జేయుపని కష్టము

వచ్చువారెవ్వరు నుండరు; అట్టి పనికిఁ బూనినవారి నందఱును శ్లాఘింతురు. ఇతరవిషయములలో కృషిచేయక యొక్క రాజ్యాంగవిషయమున మాత్రము కృషిచేయుట నిజమయిన దేశాభిమానము గాదు. మూఢులుగా నున్నవారికి రాజ్యాంగస్వాతంత్ర్యముల నిచ్చుటవలనఁ బ్రయోజనము లేదు; ఇచ్చినను వారు వానివలని లాభములను బూర్ణముగా ననుభవింపఁజాలరు. జనులయొక్క తెలివిని నీతిని ననుసరించి ప్రభుత్వపద్ధతి భేదించి యుండవలెను. ప్రజలకు మంచిప్రభుత్వమును సంపూర్ణ స్వాతంత్ర్యములను గలిగింపవలె నన్నచో, చదువుకొన్న కొందఱి స్థితిని మాత్రముగాక జనసామాన్యముయొక్క స్థితిని జ్ఞానమునందును నీతియందును వృద్ధిపొందింపవలెను. అట్లు చేయుటయే దేశాభిమానము. ఇతరవిషయములలో ప్రజాభివృద్ధికయి ప్రయత్నింపక రాజ్యాంగ విషయములలో మాత్రము కృషి చేయుచుండుటచే స్వప్రయోజనపరత్వముచేతనే యట్లు చేయుచున్నారని యనేకులు మనలోని చదువుకొన్నవారిపై నింద మోపుచున్నారు. తమ కడుపునఁ బుట్టిన బిడ్డలకు యుక్తవయస్సు వచ్చిన తరువాత భర్తలను భార్యలను వరించుకొను స్వాతంత్ర్యము నియ్యక వారిపై నిరంకుశాధికారమును చెల్లింపఁజూచువారు, రాజ్యాంగవిషయమున మాకు సర్వ స్వాతంత్ర్యముల నిండని విదేశీయులైన ప్రభువుల నడిగిన నెవ్వరు మెత్తురు? తమకుటుంబములోని స్త్రీలకు వారి స్వాతంత్ర్యములను విద్యను నొసఁగి వెనుకదీయువారు, మాకు జనప్రతినిధిపాలనము పెట్టి మమ్ముఁ బ్రతినిధులనుగాఁ బెట్టుఁడన్న నెవ్వరు శ్లాఘింతురు? అన్యోన్యసోదరభావము లేక మానవకోటిలో కొందఱు కొందఱిని పశువులకంటె హీనముగాఁ జూచి యవమానించుచున్నప్పుడు పయి తరగతుల వారికి కొందఱికి కొన్ని స్వాతంత్ర్యములు వచ్చినంతమాత్రముచేత

జనసామాన్యమునకు క్షేమసౌఖ్యము లెట్లు కలుగును? బురదలో పొరలివచ్చిన పన్నపోతు రాచుకొనిపోయినను మైలపడితి మని భావించుకొనక తోడిమానవుఁడైన మాలవాఁడు వీధిలో దూరముగాఁ బోయినను మైలపడితి మనుకొనువారును పుల్లెలు మేసివచ్చిన యావు విస్తరిలో మూతిపెట్టినను విడిచిపెట్టక శూద్రుఁడు కంటఁబడిన మాత్రమున నన్నమును విడిచి లేచిపోవువారును తాము స్వాతంత్ర్యములను పొందినప్పుడు హీనజాతులయెడ సౌభ్రాత్రము నెట్లు చూపఁగలుగుదురు! కాఁబట్టి స్వార్థపరులుగాక దేశక్షేమము నిమిత్తమే పాటుపడు విద్యాధౌరేయులు రాజ్యాంగవిషయములలో వలెనే తక్కిన సమస్తవిషయములలోను యథాశక్తిని ప్రజలయభివృద్ధికై యిపనిచేయవలెను. ఇట్లు కార్యశూరు లగుటకయి దేశాభిమాన మాననీయులగు విద్యాధౌరేయులు తమ క్షేమముకంటె దేశక్షేమము నెక్కువగాఁ జూచుకొనుచు కావలసి వచ్చిన యెడల దేశాభివృద్ధి నిమిత్తమయి తమ దేహములను శక్తులను సంపదలను ప్రాణములను ధారపోయవలెను. నిజమైన దేశాభివృద్ధి కెన్నఁడు పత్రమున నెప్పుడయిన స్వార్థపరులు గాని యిట్టి పుణ్యపురుషులవలననే కలుగును గాని స్వప్రయోజనపరులవలనను, ధనార్జనపరాయణులవలనను గలుగదు. కాఁబట్టి విద్యాధికులు కార్యశూరులుగాని తమపైని బడిన నిందను పరుషవాక్యములచేతఁగాక కార్యములచేత తొలఁగించుకొని దేశాభివృద్ధికరములైన కార్యములలో కీర్తిమంతు లగుదురుగాక!

మనలోని విద్యావంతులలోఁగల లోపములను నాకు తోఁచిన వానిని గొన్నిటిని జెప్పితిని. ఇఁక వారు చేయవలసిన యర్హకృత్యములనుగూర్చి ముచ్చటింపవలసి యున్నది. దేశక్షేమమునకయి విద్యాధికులు చేయవలసిన కార్యములు మితిమీఱి యున్నందున వానినన్నిటిని

వివరించుట శక్యము కాదు. వానిలో గొన్నిటిని మాత్ర మిందు పేర్కొని మిగిలినవానిని విడిచిపెట్టెదను.

౧. వ్యవసాయవిషయము—మన దేశములోని జనులలో విశేష భాగము వ్యవసాయమువలననే జీవనము చేయుచున్నారుగదా? అట్టివారు విద్యాగంధము లేనివారగుటచేత కృషిశాస్త్రజ్ఞానము లేనివారయి భూమివలన తగినంత ఫలమును బొందజాలకున్నారు. వ్యవసాయము చేయుట తనుగౌరవమునకు లోపమన్న పిచ్చి యభిప్రాయమును విడిచి విద్యాధికులయిన వారిలో గొందఱు తాము కృషిశాస్త్రము నభ్యసించి స్వయముగా కృషిచేయుట కారంభించి తాము లాభమును బొంది తమనిదర్శనమువలన కాపులు లాభము నొందునట్లు చేయవలెను.

౨. శిల్పాదికర్మలు — కేవల వ్యవసాయములవలననే దేశమెన్నడును భాగ్యసంపన్నము కాజాలదు. దేశము భాగ్యసంపన్నము కావలెనన్నచో శిల్పాదికర్మలు వృద్ధిబొందవలెను. మూఢుల చేతులలో నున్న యీ పనులు వృద్ధినొందనేరవు. శిల్పాదులయందును కర్మాగారములలో విద్యాధికులు ప్రవేశింపవలెను. దేశమాతకు దారిద్ర్యదశ వచ్చుచున్నదని వృత్తాంతపత్రికలలో వ్రాయుటచేతను, రాజకీయమహాసభలలో బ్రసంగించి పొద్దు పోసికొనుటచేతను, [illegible]ంది యూరపఖండపు విద్యాధికులలో తగినంతమంది అమెరికాఖండమునకును, యూరపుఖండమునకును బోయి యక్కడి కర్మశాలలలో యంత్రనిర్మాణాదులను నేర్చుకొనివచ్చి యంత్రములను స్థాపించి కాగితములు, పంచదార, లోహములు, అద్దములు, వస్త్రములు, బొమ్మబట్టలు, సబ్బు, నిప్పుపుల్లలు, మొదలైనవి యీదేశమునందే చేయునట్లు చేసి దేశాభిమానమును జూపవలెను.

3. ఆరోగ్యధర్మములు— పల్లెలయందు మాత్రమే కాక పట్టణములయందును బహుజను లారోగ్యధర్మముల నెఱుఁగనివారయి యనేకవ్యాధుల పాలగుచున్నా రనుట యెల్లరు నెఱిఁగినవిషయమే కదా? విద్యాధికులు కొందఱు దేశభాషలలో సులభశైలితో నారోగ్యధర్మములను బోధించు పుస్తకములను రచించియు, ఇరుగుపొరుగుల వారి కారోగ్యధర్మముల యావశ్యకమును దెలిపియు, తాము పోయిన స్థలములలో నెల్ల నావిషయమున నుపన్యాసములు చేసియు, లోకోపకారము చేయవచ్చును.

4. నీతివృద్ధి— జను లెంత తెలివిగలవారయినను నీతిమంతు లయినంగాని దేశము మంచిస్థితికి రాదు. మన దేశమునం దిప్పుడు నీతికంటె జాతికట్టుపాటు లెక్కువవిగా భావింపఁబడుచున్నవి. ఒక బ్రాహ్మణుఁడు నరహత్య చేసినను జాతిభ్రష్టుఁడుగాక, పరిశుద్ధుఁడయిన శూద్రునియింట భోజనము చేసిన మాత్రమున వర్ణబాహ్యుఁడగుచున్నాఁడు. ఈ జాతికట్టుబాటు లైకమత్యాభావమునకును, నీతిరాహిత్యమునకును, కృషివాణిజ్యాదికర్మల హైన్యమునకును, కారణము లగుచున్నవి. బొంబాయిరాజధానిలోని యొక్క బ్రాహ్మణవర్ణములోనే ౧౮౮ శాఖాభేదము లున్నవఁట. నష్టకరమైనట్టియు ననావశ్యకము లయినట్టియు నిట్టిభేదములను రూపుమాపుటకై చదువుకొన్నవారు కృషిచేయవచ్చును; రాజకీయోద్యోగులలోఁ గల లంచములను తగ్గించుటకయి పనిచేయవచ్చును; మనలోఁగల మోటుహాస్యములను మాన్పుటకయి యత్నింపవచ్చును. మనలోని పట్టపరీక్షయందు కృతార్థులయినవారు సహితము కొందఱు మోటుహాస్యములను విరసములైన మాటలను బలుకుచుండుట చింతాకరముగా నున్నది. హేయాతిహేయమయిన వ్యభిచారమునే కుల

వృత్తిగాఁ జేకొన్న వేశ్యలను వివాహాది శుభకార్యములయందు రప్పించి వారిచేత బూతుపాటలను పాడించెడు దురాచారమును పోఁగొట్టుట కయి కృషిచేయవచ్చును. పట్టపరీక్షాసిద్ధులే కొన్నిచోట్ల భోగము మేళములను ప్రోత్సాహపఱచుచుండుట శోచనీయముగా నున్నది. విద్యాధికులయిన కొందఱు మహానుభావులు స్త్రీలలో తప్పయిన వ్యభిచారము పురుషులలో తప్పు కానట్టు తామే కన్నెఱికములు చేసి కొనియు, వేశ్యలనుంచుకొనియు, తమ విద్యకును వివేకమునకును నగుబాట్లు తెచ్చుచున్నారు. తోడివిద్యాధికు లట్టి సిగ్గుమాలిన వారిని గౌరవింపక తమ యనిష్టమును బహిరంగముగాఁ జూపవలెను.

౫. అతిబాల్యవివాహములు :—అతిబాల్య వివాహములవలన విద్యాభంగము కలుగుటయు దుర్బలులయి రోగిష్ఠులయిన బిడ్డలు పుట్టుటయు మొదలయిన యనేకానర్థములు కలుగుచున్నవనుట యెవ్వరు నెఱుఁగని విషయము కాదు! అనర్థదాయకమయిన యీ దురాచారమును మాన్పుటకొఱకేగాక వివాహమునందలి దుర్వ్యయములను మాన్పుటకొఱకును ప్రతివిద్యాధికుఁడును కృషిచేయవలెను.

౬. వితంతువివాహములు :—మనదేశములో వితంతువివాహములను మాన్పుటవలనఁ గలుగుచున్న గూఢవ్యభిచారము శిశుహత్యలు మొదలైన పాపములమాట యటుండనిచ్చి నోరెఱుఁగని పసితనములో నెవ్వనికో యిచ్చి పెండ్లిచేసి యా బాలభర్త యుక్తవయస్సు రాకమునుపే చచ్చినను నిర్దోషురాలయిన యా బాలికను మరల వివాహము చేసికొనకుండ నిర్బంధించి యావజ్జీవమును బెట్టెడు కడగండ్లను దలఁచుకొన్న పగవాని మనస్సయినను కరఁగక మానదు. భరతఖండమున కంతకు నవమానమయిన యీ క్రూరదురాచారమును మాన్పుటకయి కరుణాలేశము గలవాని కెల్లను కర్తవ్యము.

ముతు మాన్పుటకయి ప్రయత్నించినప్పుడు బానిసలు తమస్థితిని మాన్పుటకయి యెవ్వరితోనైనను మొఱపెట్టుకొన్నారా? లేదు. లేక పోయినను తమ స్వాతంత్ర్యముల నెఱుఁగక తమస్థితితో తృప్తినొంది యున్న వారిజ్ఞానహీనతకు పరితాపపడి యతఁ డాఫ్రికాఖండములోని బానిసలస్థితిని బాగుచేయుటకయి తన ధనమును శక్తిని ధారపోసిన వాఁడు. పరోపకారు లన్యదేశములవారి హీనస్థితిని బాగుచేయుటకయి యంత శ్రమపడినప్పుడు మనకుటుంబములలోని స్త్రీలస్థితిని బాగు చేయుటకయి ప్రయత్నించుట విద్యాధికులకు ధర్మముకాదా?

ఇఁక మనపట్టణమునందలి విద్యాధికులకు రెండుమాటలు చెప్పి యీ విషయమును ముగించెదను. మనపట్టణ మితరపట్టణములకంటె నధికనాగరికత గలదనియు నిందుండు విద్యాధికులు దేశాభివృద్ధి నిమిత్త మయి పనిచేయువారనియు కొంత పేరు వచ్చినది. పూర్వ మొకప్పుడు సాంఘికదురాచార నివారణ నిమిత్తమయి పనిచేయుచుండినవారికి వారి యభిప్రాయములను వెల్లడించుటకే చోటు దొరకుటకు దుర్ఘటమయి నందున, అట్టి కొఱతను నివారింపఁ బూని విద్యాధికులవలన దేశము నకు క్షేమము కలుగునన్న పూర్ణవిశ్వాసముతో నే నీమందిరమును గట్టించితిని గాని చదువుకొన్నవారి బంతులాటలు మొదలయిన వానికి తావు లేదన్న తలఁపుతోఁ గాదు. దేహారోగ్యమున కత్యావశ్యకము లయిన బంతులాటలు మొదలయిన వానికిక్కడ యథేచ్ఛముగా జరు పుచు విద్యాధికులు నెల కొకసారియైన దేశాభివృద్ధి కనుకూలము లయిన యుపన్యాసములు జరిపి నాకానందము కలుగఁజేసి యీ పట్టణ మున కిదివఱకు వచ్చిన పేరు నిలిపి దేశాభిమానులన్నకీర్తిని బొంద ప్రయ త్నింతురని వేఁడుచున్నాను. కార్యభారమును సమర్థులరుఁయి విద్యా

ధికులయిన యూరావఁపురుషుల కొప్పగించి నాపనినుండి విశ్రాంతి పొందఁ బోవుచున్న నా ప్రార్థనను ఇచ్చటి విద్యార్థులు మిత్రభావముతో మన్నింతురుగాక !



# వర్ణము.

ఓ భ్రాతృవరులారా!

నేఁటి సాయంకాలమున వర్ణభేదమునుగూర్చి కొంత చెప్పఁబోవుచున్నాను. సావధానచిత్తులరయి వినుఁడు. ఈ వర్ణభేద మాదినుండియు నున్నదా, ఎప్పు డోవచ్చి నేఁటి రీతిగానుండుచు వచ్చినది, దీనివలన దేశమునకు లాభము కలుగుచున్నదా నష్టము కలుగుచున్నదా, అన్న యంశములను మన మిప్పుడు విచారింపవలసి యున్నది. ఈ వర్ణభేదము నైసర్గికముగాక వ్యావహారిక మగుటచే నడుమ నెప్పుడో వచ్చియుండక తీరదు. వేదములలో నెల్ల నాదిమ మగు ఋగ్వేదమును బట్టి చూడఁగా మనపూర్వులయిన యార్యులు మొట్టమొదట పంజాబు దేశమునందు ప్రవేశించినట్లును, వారిలో వర్ణభేదము లేనట్లును, కనఁబడుచున్నది. ఆకాలమునం దార్యులును, అనార్యులును, అన్న భేదము తప్ప వేఱొకభేద మున్నట్టు కానఁబడదు. క్రొత్తగా వచ్చి ఫలవంతములయిన సింధునదీ ప్రదేశముల నాక్రమించుకొన్న మన పూర్వు లార్యులు. ఆర్యులన్న శబ్దమునకు పూజ్యులని యర్థము. నూతనముగా వచ్చి దేశము నాక్రమించుకొన్న మనపూర్వు లధిక నాగరికత గలవారగుటచేతను, అనాగరికులయిన దేశవాసులను జయించి వారిచే సేవింపఁబడు చుండుటచేతను, మనపూర్వుల కార్యులన్న పేరు సార్థక మయినది. క్రొత్తగా వచ్చి యితరుల వశమున నున్న ప్రదేశమును బలవంతముగా నాక్రమించుకొనఁ జూచువారికిని పూర్వకాలమునుండియు తమయనుభవములో నున్నప్రదేశములను విడువవలసినవారికిని పోరాటము జరుగుట స్వభావమగుటచేత నాకాలమునందు బలాధికులయిన యార్యులకును దుర్బలులయిన యనార్యుల

కును తఱుచుగా యుద్ధములు జరుగుచువచ్చెను. ఆ యుద్ధములలో నధికనాగరికులును ప్రబలసాధనసంపన్నులు నయిన యార్యులు జయముగొంది యనార్యుల గ్రామపట్టణములను పాడుచేసియు దాసులనుగాఁ జేసికొనియు క్రమక్రమముగా వారి నివాసస్థానము లయిన భూములనెల్ల నాక్రమించుకొనిరి. అనార్యులు బహుకాలముగా యుద్ధముచేసి యార్యులను గెలువలేక పోయినను గొప్పసమూహములు గాను యందు దేమఱుపాటున వచ్చి పైఁబడియు గొప్ప సమూహములుగా రాత్రి వేళ దొంగతనముగా వచ్చి యెదిరించియు నార్యుల ధనప్రాణములకు హానిని గలిగించుచువచ్చిరి. ఆర్యు లనార్యులను సాధారణముగా దస్యులని పిలుచుచుండిరి. దస్యు లన్న పదమునకు శత్రువులనియు దొంగలనియు నర్థము. ఋగ్వేదమునందు నార్యులు తమకు శత్రువు లయిన దస్యులను నశింపఁజేయవలసినదని తమ యిష్టదైవములయిన యింద్రాదులను ప్రార్థించిన ఋక్కు లనేకములు గలవు. ఈ దస్యులను నార్యు లప్పుడప్పుడు పిశాచులనియు రాక్షసులనియు వ్యవహరించు చుండుట కలదు. ఆ కాలమునం దుండిన వర్ణభేద మిట్టిదియు నిదే. వర్ణమన్న పదమునకు రంగని యర్థము. ఆర్యులు తెల్లనివర్ణము గల వారుగాను, అనార్యులు నల్లనివర్ణము గలవారుగాను, ఉండుటచేత రెండు తెగలవారికిని గలభేదమునకు వర్ణమని పేరువచ్చినది. ఇప్పుడు వర్ణ, జాతి, కులశబ్దము లించుమించుగా పర్యాయపదములుగా వ్యవ హరింపఁబడుచున్నను పూర్వకాలమునందు బ్రాహ్మణాదిభేదమును తెలుపుటకయి వర్ణశబ్ద మొక్కటిమాత్రమే వాడఁబడుచు వచ్చినది. జాతిశబ్దమునకు పుట్టుక యనియు, కులశబ్దమునకు సంఘమనియు, అర్థములు. బ్రాహ్మణాదివర్ణభేదము ఋగ్వేదములో నొక్క పురుష సూక్తమునందు మాత్రము పేర్కొనఁబడియున్నది. ఈ పురుషసూ

క్తము ఋగ్వేదముయొక్క పదవమండలములోని తొంబదవసూక్తము. ఇది శుక్లయజుర్వేద వాజసనేయసంహిత (౩౦-౧ ౧౬) లోను, కృష్ణయజుర్వేదారణ్యకము (చిత్తి) లోను, అథర్వవేదము (౧-౯-౬) లోను కూడ కొంచెమార్పులతోఁ గానఁబడుచున్నది. ఋగ్వేదములో నున్న ప్రకారముగా ఆ పురుషసూక్తభాగము నిందుదాహరించుచున్నాను—

౧. సహస్రశీర్షా పురుషః । సహస్రాక్షః సహస్రపాత్
స భూమిం విశ్వతో వృత్వా । అత్యతిష్ఠ ద్దశాంగుళమ్.

* * * *

౬. యత్పురుషేణ హవిషా । దేవా యజ్ఞ మతన్వత ।
వసంతో అస్యాసీ దాజ్యం । గ్రీష్మ ఇధ్మ శ్శర ద్ధవిః ॥

* * * *

౧౧. యత్పురుషం వ్యదధుః । కతిధా వ్యకల్పయన్ ।
ముఖం కిమస్య కౌ బాహూ । కా వూరూ పాదావుచ్యేతే॥

౧౨. బ్రాహ్మణోऽస్య ముఖమాసీత్ । బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః । పద్భ్యాం శూద్రో అజాయత॥

* * * *

ఈ పురుషసూక్తమునే మనవారిప్పుడు బ్రహ్మమునకు రూపమున్నదని చెప్పి తమ్మాలమున విగ్రహారాధనము కరణీయమని సాధించుటకును, బ్రహ్మముయొక్క ముఖాదికములనుండి బ్రాహ్మణాదులు పుట్టిరని చెప్పి వర్ణభేదము నైసర్గికమని సాధనములకును ఆధారముగాఁ జేసికొనుచున్నారు. ఇయినిజెప్పిన విరాట్పురుషరూప మాలంకారికముగాని వాస్తవము కాదనియు, ఆ మానసికపురుషుని ముఖాదికముగా బ్రాహ్మణాదు లుత్ప్రేక్షింపఁబడిరనియు, కొంచె మాలోచించిన వారికి స్పష్టము కాకపోదు. ఇందలి మొదటి ఋక్కునందు,

"ఆ పురుషుఁడు వేయిశిరస్సులు గలవాఁడు; వేయి
కన్నులు గలవాఁడు; వేయిపాదములు గలవాఁడు;
భూమి నంతట నావరించి పదియంగుళములు మించి నిలుచును."

అని చెప్పఁబడి యున్నది. ఈ శ్రుత్యర్థ మీశ్వరునకు సరిగా వేయిశిరస్సులు మొదలయిన వున్నవని చెప్పుటకాదనియు, అతఁడు వేయి (అనంతములైన) శిరస్సు లున్నట్లు సమస్తమును జూచువాఁడనియు, వేయి (అనంతములైన) పాదము లున్నట్లంతటను మెలఁగువాఁడనియు, అతఁడు ప్రపంచమంతటను నిండియుండి దానిపయినిగూడ వ్యాపించి యుండువాఁడనియు తాత్పర్య మగుచు, జ్ఞానలేశము గలవారు సహితము సులభముగా నూహించి తెలిసికోవచ్చును. అట్లుగాక విరాట్పురుషుఁడు నిజముగానే వేయితలలును వేయికన్నులును గలవాఁడని చెప్పెడుపక్షమున, వేయిశిరస్సు లున్నప్పుడు వేయినేత్రము లుండుట యసంగతమనియు తలయొకటికి రెండేసికన్నుల చొప్పున రెండువేలకన్ను లుండవలయుననియు బాలురుసహిత మాక్షేపించుట కవకాశము కలుగునుగదా? కాఁబట్టి మన మీ శ్రుతికి లాక్షణికార్థమును గ్రహింపవలెను గాని ముఖ్యార్థమును గ్రహింపఁగూడదు. మఱియు నిందుదాహరింపఁబడిన యీ ఋక్కును,—

"పురుషుఁ డను హవిస్సుతో దేవతలు యజ్ఞముచేసి
నప్పుడు దానికి వసంతఋతువు నేయియు, గ్రీష్మఋతువు
సమిధయు, శరదృతువు హవిస్సును నయ్యెను."

అని చెప్పఁబడి యున్నది. ఈ ఋక్కునుబట్టి గూడ నిందుఁ జెప్పఁబడిన యజ్ఞమును హోమద్రవ్యములును కేవలమానసికములని విస్పష్టమగుచున్నది. అట్లుగాక యిది నిజమయిన యజ్ఞమే యనెడు పక్షమున, కాలస్వరూపములయిన వసంతగ్రీష్మశరదృతువులు నేయియు చితుకులును మెతుకులు నగుట యున్మత్తప్రలాపములగును. కాఁబట్టి యీ

శ్రుతికి మనము వాచ్యార్థమును గైకొనక లాక్షణికార్థమునే గ్రహింప వలయును. ఇఁక ప్రస్తుతవిచారణీయములైన కడపటి ఋక్కులకు వత్తము. ఇందు పదునొకండవ ఋక్కునందు;

"(దేవతలు) పురుషుని కల్పించినప్పు డన్నివిధములుగా కల్పించిరి? అతనికి ముఖ మేది? బాహువు లేవి? ఊరువు లేవి? పాదము లేవి? (అని) పలుకఁబడుచున్నవి."

అని చెప్పఁబడినది. ఈ ప్రశ్నల కుత్తరముగా పండ్రెండవ ఋక్కునందు,

"అతనికి బ్రాహ్మణుఁడు ముఖమయ్యెను; రాజన్యుఁడు భుజములుగాఁ జేయఁబడెను; వైశ్యుఁ డతని యూరువులయ్యెను; శూద్రుఁడు పాదములవలన కలిగెను."

అని చెప్పఁబడి యున్నది. ఇందలి భాషాభేదము మొదలయిన వానిని బట్టి వేదవేదార్థములను నిపుణముగా పరిశీలించినవా రీపురుషసూక్తము ఋగ్వేదములోని పురాతనసూక్తములకంటె చిరకాలమునకు తరువాత చేయఁబడినదని సహేతుకముగా నిర్ణయించియున్నారు. పురుషసూక్తము చేయఁబడిన కాలమునకు బ్రాహ్మణాదివర్ణభేద మేర్పడినది. జను లధికనాగరికులయిన కొలఁదిని వృత్తిభేదములును జ్ఞానభేదములును గలిగి తారతమ్యభావ మేర్పడుట నైసర్గికము. ఆ కాలమునందు విద్యాధికులయి బ్రహ్మవిచారము చేయుచు మతబోధచేయువారు బ్రాహ్మణు లనియు, యుద్ధములుచేసి ప్రజాసంరక్షణము చేయువారు రాజన్యులనియు; కృషివాణిజ్యాదికర్మలుచేయు సామాన్యజనులు వైశ్యులనియు, వీరివద్ద సేవకులుగా నుండువారు శూద్రులనియు, వ్యావహారికనామములను గలవారయి యుండిరి. అయినను బ్రాహ్మణ్యాది వ్యవహార మప్పు డిప్పటివలె పుట్టుకనుబట్టిగాక వృత్తిని

బట్టియు తెలివినిబట్టియు గుణములనుబట్టియుఁ గలుగుచుండెను. అందు చేతనే శూద్రుఁడు బ్రాహ్మణుఁ డగుటయు బ్రాహ్మణుఁడు శూద్రుఁ డగుటయు కూడ నప్పుడు సాధారణముగా కలుగుచుండెను. వీరిలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు మాత్రమే యార్యులనియు, శూద్రులు జితులయి వారికి దాసులయిన యాదిమదేశవాసులనియు కొందఱు చెప్పుచున్నారు. భిల్లులు నాగులు కోగులు మొదలగు వారును నీచ జాతులవారయిన శూద్రులును మాత్రమే యాదిమనివాసులు గాని, కొందఱు శూద్రు లార్యులకంటె ముందుగా నీదేశమునకు వచ్చిన తజ్జాతిలోనివారే యనియు కొంద ఱభిప్రాయపడుచున్నారు. పూర్వోక్త మయిన పంద్రెండవఋక్కు స్వాభావికములయిన యీ భేదములనే చెప్పుచున్నది. కాని కొందఱనుకొనునట్లు బ్రాహ్మణులు నిజముగా బ్రహ్మయొక్క ముఖమునుండియు రాజులు భుజములనుండియు వైశ్యులు తొడలనుండియు శూద్రులు పాదములనుండియు పుట్టిరని ప్రతిపాదింపదు. పదునొకండవ ఋక్కులోని ప్రశ్నలను విచారించి యీ ఋక్కుయొక్క ప్రతిపదార్థమును విమర్శించిన పక్షమున మంద బుద్ధికి సహితమిందు తెలుపఁబడిన దాలంకారికమని తోఁచకపోదు.

ప్రతిపదార్థము.

అస్య-ఈ విరాట్పురుషునకు, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు,
ముఖమ్-ముఖము, ఆసీత్-అయ్యెను; రాజన్యః-క్షత్రియుఁడు,
బాహూ-భుజములుగా, కృతః-చేయఁబడెను;
అస్య-ఈ విరాట్టునకు, ఊరూ=తొడలు, యత్-ఏదియో,
తత్-అది, వైశ్యః=కోమటి; పద్భ్యాం=పాదములవలన,
శూద్రః=శూద్రుఁడు, అజాయత=పుట్టెను."

పాదములవలన శూద్రుఁడు పుట్టెనన్న వాక్యమునుబట్టి పయివారంద ఱును తత్తదవయవములనుండి పుట్టిరని చెప్పి సాధింపఁజాలుదురు గాని

పయిప్రశ్నలకును వాని కుత్తరములయిన వాక్యములకును విరుద్ధముగా నుండుటనుబట్టియు, యీ యందు వర్ణింపఁబడిన పురుషయజ్ఞాదికమగు సర్వమును కేవల మానసికమగుటచేత నవయవకల్పనము చేయుట యసందర్భమగుటనుబట్టియు, ఈ యర్థ మెంతమాత్రమును పొసఁగ నేరదు. ప్రపంచాత్మకుండయిన విరాట్పురుషునకు జ్ఞానాధికులయిన బ్రాహ్మణులు జ్ఞానప్రకటనమున కాధారమయిన నోరువంటివారనియు, భుజబలసంపన్నులయిన క్షత్రియులు శౌర్యసంపద కాధారమయిన బాహువులవంటివారనియు, తిరిగి కృషివాణిజ్యాదులు నిర్వహింపవలసిన వైశ్యులు పిక్కబలముచే తిరుగుట కాధారమయిన తొడలవంటివారనియు, సేవకులుగా నుండెడు శూద్రులు సకలాంగములలో నీచములుగా నెంచఁబడు పాదములవంటివారనియు చెప్పిన దృష్టాంత మెంతయు మనోహరమయి సయుక్తికమయినదిగా నున్నది. ఆ కాలమునందీ బ్రాహ్మణాదిపదము లిప్పుడు వ్రాయువానిని లేఖకుఁ డన్నట్లును దంపులోఁ గొలువున్న వానిని భటుఁడన్నట్లును వ్యాపారికనామములుగానే యుండెననుటకు సందేహము లేదు. అయినను తరువాత స్మృతులను పురాణములను రచించినవారు బ్రాహ్మణాదులు బ్రహ్మయొక్క ముఖాదులనుండియే పుట్టిరని స్థాపించుటకు కొన్ని శ్లోకములను చెప్పిరి. కాని వారివాక్యము లన్యోన్యవిరుద్ధములుగా నున్నవి. మనుస్మృతి పుట్టిన కాలమునకే బ్రాహ్మణుల యాధిక్యము స్థిరపడి కొంతవఱకు జన్మమునుబట్టియే వర్ణభేదము కలుగుచువచ్చినది. మనువు తన స్మృతియందు వర్ణోత్పత్తిక్రమమును వివరించుచు ప్రథమాధ్యాయములో ముప్పదియొకటవశ్లోకమునందు మొదట,

శ్లో॥ లోకానాం తు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః।
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం చ నిరవర్తయత్।

లోకముల వృద్ధినిమిత్తము ముఖమునుండియు బాహువులనుండియు నూరువులనుండియు పాదములనుండియు బ్రాహ్మణుని క్షత్రియుని వైశ్యుని శూద్రుని సృజించెనని చెప్పి తరువాత ముప్పదినాల్గవ శ్లోకమునందు,-

శ్లో॥ అహం ప్రజాస్సిసృక్షుస్తు తపస్తప్త్వా సుదుశ్చరమ్।
పతీన్ ప్రజానామసృజం మహర్షీ నాదితో దశ॥

బ్రహ్మ తాను ప్రజలను సృజించుటకయి దుశ్చరమయిన తపస్సు చేసి మొదట ప్రజాపతులయిన పదుగురు మహర్షులను జేసినట్లు చెప్పియున్నాఁడు. ఈ ప్రజాపతులు సర్వసృష్టిని జేసిరి. బ్రాహ్మణాదివర్ణలు మొదటఁ జెప్పినట్లు బ్రహ్మయొక్క ముఖాదికమునుండి పుట్టిరా? తరువాతఁ జెప్పినట్లు ప్రజాపతులవలనఁ బుట్టిరా? మనుజ మనుష్యాది శబ్దములు ప్రజలు వీరిరువురివలనను గాక మనువువలనఁ గలిగినట్లు సూచన చేయుచున్నవి. పురాణములలో మనుష్యులు మనువువలనఁ బుట్టిరనియు చెప్పఁబడియున్నది. వానికి విరోధముగా శ్రీమద్రామాయణమునం దీక్రిందిశ్లోకమున,-

శ్లో॥ మను ర్మనుష్యాన్ జనయత్ కాశ్యపస్య మహాత్మనః।
బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాన్ చ మనుజర్షభ॥

కశ్యపుని భార్యయైన మనువను నామె బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులయిన సమస్తమనుష్యులను సృజించెనని చెప్పఁబడి యున్నది. పురుషసూక్తమునకు పూర్వోక్తమయిన లాక్షణికార్థమును జెప్పక పోయినపక్షమున పురాణవాక్యములన్నియు వ్యర్థములగును. వర్ణశబ్దార్థమునుబట్టి దేహచ్ఛాయలనుబట్టియో వర్ణభేదములు కలిగినవని కొన్నిపురాణములలోఁ జెప్పఁబడియున్నది. మహాభారతములోని శాంతిపర్వములో,—

శ్లో॥ బ్రాహ్మణానాం సితో వర్ణః క్షత్రియాణాం చ లోహితః।
వైశ్యానాం పీతకో వర్ణః శూద్రాణాం అసిత స్తథా॥

అని బ్రాహ్మణులకు తెల్లవర్ణము, క్షత్రియుల కెఱ్ఱవర్ణము, వైశ్యులకు పచ్చవర్ణము, శూద్రులకు నల్లవర్ణము, అని చెప్పఁబడినది. ఈ వర్ణభేదములు కల్పితములుగాని సత్యములుగావు. బ్రాహ్మణులలో నల్లనివారుండుటయు, శూద్రాదులలో తెల్లనివారుండుటయు, మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము. ఈ యంశమునకు నే నుత్తరము చెప్పఁగానుండుటకంటె వజ్రసూచికోపనిషత్తులోని దానినిం దుదాహరించుట యుక్తమని యెంచి యట్లు చేయుచున్నాను.—

"బ్రాహ్మణః శ్వేతవర్ణః। క్షత్రియో రక్తవర్ణః। వైశ్యః పీతవర్ణః శూద్రః కృష్ణవర్ణః। ఇతి నియమాభావాత్ ... తస్మాన్న దేహో బ్రాహ్మణ ఇతి."

బ్రాహ్మణుఁడు తెల్లనివాఁడు, క్షత్రియుఁ డెఱ్ఱనివాఁడు, వైశ్యుఁడు పచ్చనివాఁడు, శూద్రుఁడు నల్లనివాఁడు, అను నియమము లేకపోవుట వలన దేహమునుబట్టి బ్రాహ్మణత్వము రాలేదని పై వాక్యమున కర్థము. ఈ యుపనిషత్తే బ్రాహ్మణత్వము పుట్టుకచేత సహితము రాలేదని యీ క్రిందివాక్యములలోఁ జెప్పుచున్నది:—

"తర్హి జాతి ర్బ్రాహ్మణ ఇతి చే త్తన్న, తత్ర జాత్యంతరే ష్వనేకజాతిసంభవాత్ మహర్షయో బహవ స్సంతి ... ...
వ్యాసః కైవర్తకన్యాయాం... వసిష్ఠ ఊర్వశ్యాం... అగస్త్యః కలశే జాత ఇతి శ్రుతత్వాత్"

వ్యాసుఁడు బెస్తదానియందును వసిష్ఠుఁడు ఊర్వశియందును అగస్త్యుఁడు కుండయందును బుట్టినట్లు వినవచ్చుచుండుటవలన నొక్కజాతిలోనే యనేకజాతిసంభవులైన మహర్షులనేకు లుండుటను బట్టి జాతి

వలననే బ్రాహ్మణత్వము కలుగదని దీని తాత్పర్యము. ఈ ప్రకారము గానే యనేకపురాణములలో వారువారు చేయు కర్మలవలననే కాని జాతిమాత్రముచేత బ్రాహ్మణత్వము రాదని చెప్పఁబడి యున్నది.

శ్లో॥ హారిణీగర్భసంభూతో ఋశ్యశృంగో మహామునిః।
శ్వపాకీగర్భసంభూతో పితా వ్యాసస్య సత్తమః॥
గణికాగర్భసంభూతో వసిష్ఠ శ్చ మహామునిః।
తపసా బ్రాహ్మణో జాతః సంస్కార స్తత్ర కారణమ్॥

"మహామునియైన ఋశ్యశృంగుఁడు లేడికడుపునఁ బుట్టియు, వ్యాసుని తండ్రి మాలదానికిఁ బుట్టియు, వసిష్ఠమహాముని వేశ్యకుఁ బుట్టియు, తపస్సుచేత బ్రాహ్మణులైరనియు దీనికి కారణము సంస్కార" మనియు భవిష్యత్పురాణమును,

శ్లో॥ జాతో వ్యాసస్తు కైవర్త్యా శ్వపాక్యా స్తు పరాశరః।
బహవోన్యేపి విప్రత్వం ప్రాప్తాయే పూర్వ మద్విజాః॥

"వ్యాసుఁడు పల్లెదానివలనను, పరాశరుఁడు మాలదానివలనను బుట్టిరి; పూర్వము ద్విజులు కానివారనేకులు బ్రాహ్మణత్వముఁ బొందిరి" అని భారతారణ్యపర్వమును జెప్పుచున్నవి.

ఈ వాక్యములనుబట్టి చూడఁగా పూర్వకాలమునందు కేవల జన్మముచేతఁ గాక బ్రాహ్మణేతరులును, గుణములచేతను పనులచేతను బ్రాహ్మణులగుచు వచ్చిరనుట కరతలామలక మగుచున్నది.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః॥

అని భగవద్గీతలయందు గుణకర్మవిభాగమువలననే కృష్ణుఁడు తాను చాతుర్వర్ణ్యమును సృజించినట్లు చెప్పఁబడియున్నది. బ్రాహ్మణుల కను కూలముగాను, శూద్రులకు ప్రతికూలముగాను, ధర్మముల నేర్పఱిచిన మనువుగారు తన స్మృతియందు,—

శ్లో॥ శూద్రో బ్రాహ్మణతా మేతి బ్రాహ్మణ శ్చైతి శూద్రతాం।
క్షత్రియా జ్జాత మేవం తు విద్యా ద్వైశ్యా త్తథైవ చ॥

శూద్రుఁడు బ్రాహ్మణత్వమును పొందును; బ్రాహ్మణుఁడు శూద్రత్వము పొందును; క్షత్రియస్త్రీవలనను వైశ్యస్త్రీవలనను పుట్టినవారు నట్లే యగుదు" రని శూద్రాదివర్ణములవారు బ్రాహ్మణులు కావచ్చునని యంగీకరించి యున్నారు.

శ్లో॥ న విశేషో౽స్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్।
బ్రహ్మణా పూర్వసృష్టం హి కర్మభి ర్వర్ణతాం గతమ్॥

అని శ్రీమహాభారత శాంతిపర్వమున ౧౮౮ అధ్యాయమునందు "వర్ణములలో విశేష మేదియు లేదు; ఈ జగత్తంతయు పూర్వకాలమునందు బ్రహ్మమయముగానే చేయఁబడి కర్మలచేత వర్ణత్వమును పొందినది." అని చెప్పబడియున్నది. ఈ ప్రకారముగానే వాయుపురాణముయొక్క యెనిమిదవ అధ్యాయమునందును కృతయుగములో వర్ణభేదము లేదని చెప్పఁబడినది. వర్ణభేదములను పాటించెడి యీ పురాణమువలనను పూర్వకాలమునందు తమవర్ణ సద్గుణములవలననే వచ్చుచుండినట్లును, మంచినడత లేనివాఁడు బ్రాహ్మణునకుఁ బుట్టినను శూద్రుఁ డగుచుండి నట్లును, మంచినడత గలవాఁడు శూద్రునికిఁ బుట్టినను బ్రాహ్మణుఁ డగు చుండినట్లును స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. ఈ యంశమున కింక బలముగా పురాణములనుండి కొన్నివాక్యము లిం దుదాహరించు చున్నాను:—

శ్లో॥ ఏభి స్తు కర్మభి ర్దేవి శుభై రాచరితై స్తథా।
శూద్రో బ్రాహ్మణతాం యాతి వైశ్యః క్షత్రియతాం వ్రజేత్॥

* * * *

న యోని ర్నాపి సంస్కారో న శ్రుతం న చ సంతతిః।
కారణాని ద్విజత్వస్య వృత్త మేవ తు కారణమ్॥

సర్వోఽయం బ్రాహ్మణో లోకే వృత్తేన చ విధీయతే ।
వృత్తే స్థితస్తు శూద్రోఽపి బ్రాహ్మణత్వం నియచ్ఛతి ॥

అని భారతానుశాసనికపర్వాంతర్గతమైన యుమామహేశ్వరసంవాదము నందు "ఇటువంటి మంచిపనులు చేయుటచేత శూద్రుడు బ్రాహ్మణత్వమును పొందును; వైశ్యుడు క్షత్రియత్వమును పొందును.....పుట్టుక, సంస్కారము (ఉపనయనాదులు), వేదాధ్యయనము, సంతతి, ద్విజత్వమునకు కారణములు కావు; మంచినడత యొక్కటియే కారణము. లోకములో బ్రాహ్మణత్వమంతయు సద్వృత్తిచేతనే కలుగును: సద్వృత్తి యందున్న శూద్రుడును బ్రాహ్మణత్వము పొందును." అని చెప్పబడి యున్నది.

శ్లో॥ న కులేన న జాత్యా వా క్రియాభి ర్బ్రాహ్మణో భవేత్ ।
చండాలోఽపి హి వృత్తస్థో బ్రాహ్మణః స యుధిష్ఠిర ॥
ఏకవర్ణ మిదం పూర్వం విశ్వ మాసీ ద్యుధిష్ఠిర ।
కర్మక్రియావిశేషేణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్ ॥
సర్వే వై యోనిజా మర్త్యాః సర్వే మూత్రపురీషిణః ।
ఏకేంద్రియేంద్రియార్థశ్చ తస్మా చ్ఛీలగుణై ర్ద్విజః ॥
శూద్రోఽపి శీలసంపన్నో గుణవాన్ బ్రాహ్మణో భవేత్ ।
బ్రాహ్మణోఽపి క్రియాహీనః శూద్రా త్ప్రత్యవరో భవేత్ ।

* * * *

న జాతి ర్దృశ్యతే రాజన్ గుణాః కల్యాణకారకాః ।
జీవితం యస్య ధర్మార్థం పరార్థం యస్య జీవితమ్॥

అని శ్రీమహాభారతారణ్యపర్వములో నొకచోట యుధిష్ఠిరునకూర్చి వైశంపాయనుడు "కులముచేతను పుట్టుకచేతను గాదు; కార్యములు చేతనే బ్రాహ్మణు డగును. ఓ యుధిష్ఠిరా! మంచినడవడి గలవాడు

చండాలుఁడైనను వాఁడే బ్రాహ్మణుఁడు; ఓ యుధిష్ఠిరా! ఈ ప్రపంచమేకవర్ణములోనే నిండియుండెను. కర్మక్రియావిశేషముచేత చాతుర్వర్ణ్యము ప్రతిష్ఠింపఁబడినది. నరులందఱును యోనినుండి పుట్టినవారు; అందఱును మూత్రపురీషములు గలవారు; ఏకవిధమైన యింద్రియములును వానిప్రయోజనములును గలవారు; కాఁబట్టి సదాచారసద్గుణములచేత ద్విజుఁ డగును. శూద్రుఁడయినను సదాచారసంపన్నుఁడును గుణవంతుఁడు నగువాఁడు బ్రాహ్మణుఁడగును; బ్రాహ్మణుఁడైనను క్రియాహీనుఁడు శూద్రునికంటెను తక్కువవాఁడగును... ఓ రాజా! జాతియుం దేశము లేదు; గుణములే కళ్యాణదాయకములు. ఎవని జీవితము ధర్మార్థమును పరోపకారార్థము నగునో (వాఁడే బ్రాహ్మణుఁడు.)" అని చెప్పఁబడియున్నది. ఈ మహారణ్యపర్వములోనే మఱియొకచోట నహుషప్రశ్నల కుత్తరముగా యుధిష్ఠిరుఁడు ,-

శ్లో॥ సత్యం దానం క్షమా శీల మానృశంస్యం తపో ఘృణా।
దృశ్యంతే యత్ర నాగేంద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః॥
శూద్రే తు యద్భవే ల్లక్ష్మ ద్విజే తచ్చ న విద్యతే।
నవై శూద్రో భవే చ్ఛూద్రో బ్రాహ్మణో న చ బ్రాహ్మణః॥
యత్రైత ల్లక్ష్యతే సర్ప వృత్తం స బ్రాహ్మణః స్మృతః।
యత్రైత న్న భవే త్సర్ప తం శూద్ర మితి నిర్దిశేత్॥

"ఓ నాగేంద్రా! సత్యము, దానము, క్షమ, శీలము, అహింస, తపము, కరుణ, యెక్కడఁ గనఁబడునో వాఁడే బ్రాహ్మణుఁడుగా నెంచఁబడును. ఇవి శూద్రునియందుండి బ్రాహ్మణునియందు లేకపోయినపక్షమున ఆ శూద్రుఁడు శూద్రుఁడు కాఁడు; ఆ బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడును గాఁడు. ఈ గుణము లెవనియందుండునో వాఁడు బ్రాహ్మణుఁడుగా నెంచఁబడును; ఎవనియందు లేవో వాఁడు శూద్రుఁడని నిర్దేశింప

వలెను." అని చెప్పఁబడి యున్నది. ఆ పర్వమునందే నేటొకచోట యక్షుఁడు ధర్మరాజును,—

శ్లో॥ రాజన్ కులేన వృత్తేన స్వాధ్యాయేన శ్రుతేన వా।
బ్రాహ్మణ్యం కేన భవతి ప్రబ్రూ హ్యేతత్సునిశ్చితమ్॥

"ఓ రాజా! కులముచేతనా? వృత్తముచేతనా? స్వాధ్యాయము చేతనా? శ్రుతముచేతనా? బ్రాహ్మణత్వము దేనిచేతఁ గలుగును? ఇది సునిశ్చితముగాఁ జెప్పుము." అని యడుగఁగా, ధర్మరాజు—

శ్లో॥ శృణు యక్ష కులం తాత న స్వాధ్యాయో న చ శ్రుతమ్।
కారణం వా ద్విజత్వే చ వృత్తమేవ న సంశయః॥

"ఓ యక్షా! వినుము. కులమును స్వాధ్యాయమును శ్రుతమును బ్రాహ్మణత్వమునకుఁ గారణముగాదు; నిస్సంశయముగా మంచినడత యొక్కటియే కారణము" అని యుత్తరము చెప్పి యున్నాఁడు. శ్రీమద్భాగవత సప్తమస్కంధమునందు,—

శ్లో॥ శమో దమ స్తప శ్శౌచం సంతోషః క్షాంతి రార్జవమ్।
జ్ఞానం దయా చ్యుతాత్మత్వం సత్యం చ బ్రహ్మలక్షణమ్॥
శౌర్యం వీర్యం ధృతి స్తేజ స్త్యాగ ఆత్మజయః క్షమా।
బ్రహ్మణ్యతా ప్రసాదశ్చ రక్షా చ క్షత్ర లక్షణమ్॥
దేవగుర్వచ్యుతే భక్తి స్త్రివర్గ పరిపోషణం।
ఆస్తిక్య ముద్యమో నిత్యం నైపుణ్యం వైశ్యలక్షణమ్॥
శూద్రస్య సన్నతి శ్శౌచం సేవా స్వామి న్యమాయయా।
అమంత్రయజ్ఞో హ్యస్తేయం సత్యం గోవిప్రరక్షణమ్॥
యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభివ్యంజకం।
యదన్యత్రాపి దృశ్యేత తత్తేనైవ వినిర్దిశేత్॥

"శమము, దమము, తపస్సు, శౌచము, సంతోషము, క్షాంతి, ఆర్జవము, జ్ఞానము, దయ, స్వార్థపరత్వము విడుచుట, సత్యము, బ్రాహ్మణ

లక్షణములు. శౌర్యము, వీరత్వము, ధృతి, ప్రతాపము, త్యాగము, ఆత్మజయము, క్షమ, బ్రహ్మణ్యత, ప్రసాదము, రక్షణము క్షత్రియ లక్షణములు. దేవ గురు విష్ణుభక్తి, త్రివర్గపోషణము, ఆస్తిక్యము, నిత్యోద్యమము, నైపుణ్యము వైశ్యలక్షణములు. వినయము, శౌచము, మాయలేక స్వామిని కొలుచుట, అమంత్రకముగా కర్మలు చేయుట, చౌర్య రాహిత్యము, సత్యము, గోవిప్రరక్షణము శూద్రలక్షణములు. ఎవని కేలక్షణము చెప్పబడినదో యదియే వర్ణాభివ్యంజకము; ఈ లక్షణము వితరుల యందుఁ గనఁబడిన పక్షమున వానిచేతనే (వర్ణమును) నిర్దేశింపవలెను." అని చెప్పఁబడి యున్నది.

"అధర్మ చర్యయా పూర్వో వర్ణో జఘన్యజఘన్యవర్ణ
మాపద్యతే జాతిపరివృత్తౌ । ధర్మచర్యయా జఘన్యోవర్ణః
పూర్వపూర్వవర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ."

"అధర్మ చర్యచేత సద్వర్ణమువాఁడు జాతిపరివృత్తమందు తక్కువ తెగయైన వర్ణమును పొందును; ధర్మచర్యచేత హీనవర్ణమువాఁడు జాతి పరివృత్తమందు పూర్వ పూర్వ వర్ణమును పొందును." అని యాపస్తంబ ధర్మసూత్రముల యందును,

శ్లో॥ శూద్రయోనౌ హి జాతస్య సద్గుణా నుపతిష్ఠతః।
వైశ్యత్వం లభతే బ్రహ్మన్ క్షత్రియత్వం తథైవచ॥
ఆర్జవే వర్తమానస్య బ్రాహ్మణ్య మభిజాయతే।

"శూద్రయోనియందుఁ బుట్టినవాఁడు సద్గుణములు పట్టుపడుటవలన వైశ్యత్వమును, అదే ప్రకారముగా క్షత్రియత్వమును పొందును; ఋజుమార్గమునఁ బ్రవర్తించువానికి బ్రాహ్మణ్యము సహితము కలుగును" అని భారతారణ్య పర్వమునందును, సద్గుణములు కలవాఁడయి ధర్మమార్గమున నడచు శూద్రునికిని బ్రాహ్మణత్వము వచ్చునని చెప్పఁబడి యున్నది. ఈ ప్రమాణవచనములనుబట్టి చూడఁగా బ్రాహ్మణత్వము

నకు సద్గుణములు ప్రధానములనియు గుణవంతుఁడు శూద్రుడయినను బ్రాహ్మణుఁడు కావచ్చు ననియు స్పష్ట మగుచున్నది.

ఇఁక బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులగుచు వచ్చినందుకుఁ గూడ కొన్ని దృష్టాంతములను మన ప్రమాణ గ్రంథములనుండి చూపెదను. క్షత్రియావంశజాతుఁడయిన విశ్వామిత్రుఁడు బ్రాహ్మణుఁడయి యనేక బ్రాహ్మణగోత్రములకు మూలపురుషుఁడగుటయు, అతఁ డనేక వేద మంత్రములకు ఋషియయి బ్రాహ్మణులకు ప్రధానమంత్రమయిన గాయత్రికి కర్తయగుటయు, సుప్రసిద్ధమే కదా ?

శ్లో॥ తతో బ్రాహ్మణతాం జాతో విశ్వామిత్రో మహాతపః।
క్షత్రియః సోప్యథ తథా బ్రహ్మవంశస్య కారకః॥

"మహాతపస్వియైన విశ్వామిత్రుఁడను క్షత్రియుఁ డప్పుడు బ్రాహ్మణత్వ మును పొందెను; అతఁడు తరువాత బ్రాహ్మణవంశమునకు కర్త యయ్యెను." అని భారతానుశాసనిక పర్వమునందుఁ జెప్పఁబడి యున్నది. దీనిని బట్టి క్షత్రియుఁడయిన విశ్వామిత్రుఁ డొక్కఁడు మాత్రమేకాక యాతని సంతతివారు సహితము బ్రాహ్మణులయినట్టు తేలుచున్నది.

శ్లో॥ యథాగతం మహారాజ ముక్త్వా విష మివోరగః।
భృగో ర్వచనమాత్రేణ స చ బ్రహ్మర్షితాం గతః॥
వీతహవ్యో మహారాజ బ్రహ్మవాదిత్వ మేవ చ।
తస్య గృత్సమదః పుత్రో రూపేణేంద్ర ఇవాపరః॥

* * * *

యత్ర గృత్సమదో రాజన్ బ్రాహ్మణైః స్స మహీయతే।
స బ్రహ్మచారీ విప్రర్షిః శ్రీమాన్ గృత్సమదో భవత్॥

"పాము విషమును విడిచిపెట్టునట్లుగా భృగుని వచనమాత్రముచేత వీతహవ్యుఁడు బ్రహ్మర్షిత్వమును బ్రాహ్మవాదిత్వమును బొందెను. రూప

మున నింద్రుని వంటివాఁడయిన యతని పుత్రుఁడు గృత్సమదుఁడు బ్రాహ్మణులతోనుండి బ్రహ్మచారియు, బ్రహ్మర్షియు నయ్యెను" అని యను శాసనిక పర్వమునం దున్నది. దీనినిబట్టి భృగుమహర్షియొక్క వచన మాత్రమున వీతహవ్యుఁడను క్షత్రియుఁడు బ్రాహ్మణుఁడగుటయేకాక యాతని పుత్రుఁడగు గృత్సమదుఁడు కూడ బ్రాహ్మణుఁడయినట్లు స్పష్ట మగుచున్నది.

"ముద్గలా చ్చ మౌద్గల్యాః క్షత్రోపేతా ద్విజాతయో బభూవుః" ముద్గలుని వలన మౌద్గల్య గోత్రులయిన క్షత్రియవంశ బ్రాహ్మణులు కలిగిరని విష్ణుపురాణమునందుఁ జెప్పఁబడినది.

శ్లో॥ పుత్రః ప్రతిరథస్యాసీత్ కణ్వ స్సముభవ న్నృపః।
మేధాతిథి స్సుత స్తస్య యస్మాత్ కణ్వో భవే ద్ద్విజః॥

"ప్రతిరథుని కొడుకు కణ్వుఁడను రాజు; అతనికొడుకు మేధాతిథి; అతని వలన కణ్వుఁడను బ్రాహ్మణుఁడు పుట్టెను." అని హరివంశమునందు క్షత్రియునకు పుట్టినవాఁడు బ్రాహ్మణుఁ డయిన ట్లున్నది.

"గర్గా చ్ఛినిః తతో గార్గ్యాః శైన్యాః క్షత్రోపేతా ద్విజాతయో బభూవుః॥ మహావీర్యా దురుక్షయో నామ పుత్రోభూత్. తస్య త్రయ్యారుణపుష్కరిణౌ కపిలశ్చ పుత్రత్రయ మభూత్. తచ్చ త్రిత య మపి పశ్చా ద్విప్రతా ముపజగామ. బృహత్క్షత్రస్య సుహోత్రః సుహోత్రాత్ హస్తీ—య ఇదం హస్తినాపుర మారోపయా మాస—అజమీఢ ద్విమీఢ పురుమీఢా స్త్రయో హస్తిన స్తనయాః అజమీఢా త్కణ్వః కణ్వాత్ మేధాతిథిః తతః కాణ్వా యనా ద్విజాః"

గర్గుని వలన శిని, అతని వలన గార్గ్యులును శైన్యులును నను క్షత్రియ వంశ్యులయిన బ్రాహ్మణులును గలిగిరి. మహావీర్యునికొడుకు ఉరుక్ష యుఁడు; అతనికి త్రయ్యారుణుఁడు, పుష్కరిణుఁడు, కపిలుఁడు, అని

ముగ్గురు పుత్రులు; తరువాత వారు ముగ్గురును విప్రత్వమును పొందిరి. బృహత్క్షత్రుని పుత్రుఁడు సుహోత్రుఁడు; సుహోత్రుని పుత్రుఁడు హస్తి; ఇతఁడే హస్తినాపురమును కట్టించెను. అజమీఢుఁడు, ద్విమీఢుఁడు, పురుమీఢుఁడు, అని హస్తికి ముగ్గురుకొడుకులు; అజమీఢునివలన కణ్వుఁడును, కణ్వునివలన మేధాతిథియు, అతనివలన కాణ్వాయనులను బ్రాహ్మణులును గలిగిరి." అని విష్ణుపురాణమునందు శిబి యను క్షత్రియుని సంతతివారును, ఉరుక్షయుఁడను క్షత్రియునియొక్క ముగ్గురు కొడుకులును, మేధాతిథి యను క్షత్రియునియొక్క కొడుకైన కణ్వుని వంశమువారును, బ్రాహ్మణులయినట్లు చెప్పఁబడియున్నది. ఇట్లు బ్రాహ్మణులయిన క్షత్రియుల నామములు పురాణములయందు దపరిమితముగాఁ జెప్పఁబడియున్నవి. ఇట్లు బ్రాహ్మణులగుచు వచ్చినవారు క్షత్రియులు మాత్రమే కాదు,—

శ్లో॥ నాభాగారిష్టపుత్రౌ ద్వౌ వైశ్యౌ బ్రాహ్మణతాం గతౌ॥

"నాభాగుఁడును, అరిష్టుఁడును, అను వైశ్యపుత్రు లిద్దఱును బ్రాహ్మణత్వమును పొందిరి." అని హరివంశమునందున్నది. ఇంతవఱకును జెప్పిన దానిని బట్టి బ్రాహ్మణేతరులయిన ద్విజులు బ్రాహ్మణులగుచు వచ్చినట్లు తెలిసికొనఁదగియున్నది. ఇఁక ద్విజేతరులు బ్రాహ్మణులయినందుకుఁ గొన్ని నిదర్శనములను జూపెదను.

శ్లో॥ అబ్రహ్మణ్యే తదా దేశే కైవర్తాన్ ప్రేక్ష్య భార్గవః ।
..................యజ్ఞసూత్ర మకల్పయత్॥
స్థాపయిత్వా స్వకీయే సక్షేత్రే విప్రాన్ ప్రకల్పితాన్ ।
జామదగ్న్య స్తథోవాచ సుప్రీతే నాంతరాత్మనా॥

"అప్పుడు పరశురాముఁ డాదేశమందు బ్రాహ్మణులు లేకపోఁగా బెస్తలను జూచి వారికి యజ్ఞోపవీతము వేసెను. వారిని బ్రాహ్మణులను

జేసి తనదేశమునందు నిలిపి జామదగ్న్యుఁడు బ్రహ్మప్రాంతరంగుఁడయి పలికెను." అని స్కాంద పురాణములోని సహ్యాద్రిఖండమునందు పరశురాముఁడు శూద్రులలో నీచులయిన బెస్తలకు జన్నిదములు వేసి వారిని బ్రాహ్మణులను జేసినట్లు చెప్పఁబడియున్నది. ఇట్లు శూద్రాదులు బ్రాహ్మణులయినట్లు పురాణములయందు మాత్రమేకాక వేదములయందును జెప్పఁబడియున్నది. ఋగ్వేద సంహిత పుట్టిన కాలములో వర్ణవిభాగము లేకపోయినను బ్రాహ్మణములు పుట్టినకాలమునకు బ్రాహ్మణాదివర్ణభేద మేర్పడి కొంతవఱకు బలపడినది. పూర్వోక్తమయిన పురుషసూక్త మించుమించుగా బ్రాహ్మణములు పుట్టినకాలములోనే పుట్టినదని యనేకులు తలఁచుచున్నారు. ఋగ్వేదములోని యైతరేయ బ్రాహ్మణమునందు,-

ఋషయో వై సరస్వత్యాం సత్రమాసత। తే కవష మైలూషం సోమా దనయన్। దాస్యాః పుత్రః కితవో బ్రాహ్మణః కథం నో మధ్యే దీక్షిష్టేతి? తం బహిర్ధన్వో దవహన్న్ అత్రైనం పిపాసా హన్తు సరస్వత్యా। ఉదకం మా పాదితి। స బహిర్ధన్వో దూళ్హః పిపాసయా విత్త ఏతదపోనప్త్రీయ మపశ్యత్। ప్ర దేవత్రా బ్రహ్మణే గాతురేత్వితి। తేనాపాం ప్రియం ధామోపాగచ్ఛ త్తమాపోనుదాయం స్తం సరస్వతీ సమన్తం పర్యధావ త్తస్మాద్ధాప్యేతర్హి పరిసార మిత్యాచక్షతే। య దేనం సరస్వతీ సమన్తం పరిససార తే వా ఋషయో బ్రువన్విదుర్వా ఇమం దేవా ఉపేమం హ్వయామహా ఇతి। తథేతి తముపాహ్వయన్త। తముపహూయై తదపోనప్త్రీయ మకుర్వత। ప్ర దేవత్రా బ్రహ్మణే గాతురేత్వితి। తేనాపాం ప్రియంధామ ముపాగచ్ఛ న్నుప దేవానాం పాపాం ప్రియంధామ గచ్ఛత్యుప దేవానాం జయతి పరమంలోకం య ఏవం వేద యశ్చైనం విద్వానేతదపోనప్త్రీయం కురుతే॥

"సరస్వతీనది వద్ద ఋషులు సత్రయాగ మారంభించిరి, వారు ఐలూషుం డయిన కవషుని దాసీపుత్రుండును కితవుండును అబ్రాహ్మణుండు నయిన వీండెట్లు మామధ్య దీక్షితుండగునని సోమమునం జేరనీయక వాండు నీరుత్రాగక పిపాసచేత చావవలెనని సరస్వతీనది పొంతనుండి వానిని తఱిమివేసిరి. వాండడవిలో పిపాసార్తుండయి యుండి ప్రదేవత్రా బ్రహ్మ ణేత్యాది జలమంత్రము నుకని, జలము గల ప్రియస్థానమునకు పోంగా జలము వానిని సమీపించి సరస్వతి వానిచుట్టును ప్రవహింపంగా ఋషులు దేవతలే యనుగ్రహించినందున మనము వానిని పిలుతమని వానిని పిలుచుకొనివచ్చి, తామును ప్రదేవేత్యాది జలమంత్రమును పఠించి, అందుచేత నుదకము యొక్క ప్రియధామమును పొందిరి. దీనిని తెలిసికొని జలస్తోత్రము చేయువాండు జలప్రియధామమును పొంది, జల దేవతల లోకమును జయించును." అని యైతరేయబ్రాహ్మణముయొక్క ద్వితీయకాండిక పందొమ్మిదవ ఖండమునందు ఋషులు దాసీపుత్రుం డయిన కవషుండు దమలోం జేర్చుకొని వానితో మంత్రకరణము చేసి నట్లు చెప్పంబడి యున్నది. ఈ ప్రకారముగానే ఛాందోగ్యోపనిషత్తు నందు తండ్రి యెవ్వరో తెలియని సంకరునికూడ ఋషులు బ్రాహ్మణు నిగాం జేకొన్నట్లు చెప్పంబడి యున్నది.

సత్యకామో హ జాబాలో జబాలాం మాతరమామంత్రయాం
చక్రే బ్రహ్మచర్యం భవతి వివత్స్యామి కిం గోత్రో న్వహమ స్మీతి ౧
సా హైన మువాచ నాహమేతద్వేద తాత యద్గోత్ర స్త్వమసి।
బహ్వహం చరన్తీ పరిచారిణీ యౌవనే త్వా మలభే సా హామే
తన్న వేదయ ద్గోత్రి స్త్వమసి । జబాలా తు నామాహ మస్మిసత్య
కామో నామ త్వమసి ససత్యకామ ఏవ జాబాలో బ్రవీథా ఇతి. ౨
సహ హారిద్రుమతం గౌతమ మేత్యోవాచ బ్రహ్మచర్యం భగవతి
వత్స్య మ్యుపేయాం భగవ న్తమితి.

తంహోవాచకింగోత్రోను సోమ్యాసీతిసహోవాచ నాహమేత
ద్వేద భోయద్గోత్రో హమస్మ్యపృచ్ఛంమాతరంసామాప్రత్య
బ్రవీద్బహ్వహం చరన్తీపరిచారిణీయౌవనేత్వామలభేసాహమేతన్న
వేదయద్గోత్ర స్త్వమసి । జబాలాతునామాహమస్మి సత్యకామో
నామత్వమసీతి సోஉహం సత్యకామో జాబాలోஉస్మి భో ఇతి. ౪
తంహోవాచనైతదబ్రాహ్మణో వివక్తుమర్హతి । సమిధం సోమ్యా
హరోపత్వా నేష్యేన సత్యాదగా ఇతితముపనీయ కృశానా మ
బలానాం చతుశ్శతా గా నిరాకృత్యోవాచేమాః సోమ్యాను
సంవ్రజేతి । తా అభిప్రస్థాపయ న్నువాచ నాసహస్రేణా
వర్తేయేతి సహవర్షగణం ప్రోవాసతా యదా సహస్రం సముపేదుః॥

"జబాలకొడుకైన సత్యకాముఁడు తల్లియైన జబాలను బిలిచి నేను బ్రహ్మచర్యము చేయఁబోవుచున్నాను గనుక నాగోత్రమేదో చెప్పుమని యడిగెను :—'నాయనా! నీగోత్రమేమో నాకు తెలియదు. యౌవనమునందు పరిచారిణినయి పలువురతో తిరిగితిని. నీగోత్రమేదో నేనెఱుగను. నాపేరు జబాల, నీపేరు సత్యకాముఁడు; జబాల పుత్రుఁడనైన సత్యకాముఁడనని (ఆచార్యునితో) చెప్పు' అని తల్లి చెప్పెను. హారిద్రుమంతుని కొడుకైన గౌతముని యొద్దకుఁ బోయి దేవరవారికడ బ్రహ్మచర్యమును చేయఁగోరి వచ్చినాఁడనని యతఁడు చెప్పెను. నీగోత్రమేమని గౌతముఁడడిగెను. 'అయ్యా! నాగోత్రమేమో నాకు తెలియదు. నాతల్లి నడుగఁగా నామె యౌవనమునందు నేననేకులకు పరిచారిణినయి తిరిగి నిన్నుఁ గన్నదానను. నీగోత్రమేదో నాకును తెలియదు. నాపేరు జబాల; నీపేరు సత్యకాముఁడు' అని చెప్పెను. నేను జాబాలుఁడను; సత్యకాముఁడను—అని యతఁడు చెప్పెను. 'ఇది బ్రాహ్మణుఁడు కాని వాఁడు చెప్పఁజాలఁడు. సత్యము తప్పనివాఁడవు గనుక నీవు సమిధను

తీసికొని యిటు రమ్ము' అని (యాచార్యుఁడు) ఉపనయనముచేసి, చిక్కి బలహీనములయిన నన్నూరుగోవులనిచ్చి, 'ఓసౌమ్యా! వీనిని వెంటఁ గొనిపొమ్ము' అని చెప్పెను. అతఁడు బయలుదేఱుచు 'ఇవి వేయియగు వఱకును రాను' అని సహస్రసంఖ్య వృద్ధియగువఱకును బహుసంవత్సరములు ప్రవాసము చేసెను.' అని ఛాందోగ్యోపనిషత్తులోని చతుర్థ ప్రపాఠక చతుర్థఖండమునఁ జెప్పఁబడినది. దీనినిబట్టి చూడఁగా పూర్వకాలమున సత్యమునందత్యంతగౌరవ ముండినట్లును, సత్యము పలుకువాఁడు జాతిచేత నెట్టివాఁడయినను బ్రాహ్మణుఁడుగా నంగీకరింపఁబడుచుండినట్లును దృష్టపడుచున్నది. ఇంతవఱకును జూపినదానివలన కొంతకాల మార్యులలో వర్ణవిభాగమే లేదనియు, వర్ణభేద మేర్పడిన తరువాత సహితము గుణసంపదనుబట్టియు జ్ఞానసంపదనుబట్టియు క్షత్రియ వైశ్య శూద్రులు మాత్రమేకాక జారజులు మొదలయినవారుకూడ బ్రాహ్మణులుగా నంగీకరింపఁబడుచు వచ్చిరనియు, తెలియవచ్చుచున్నది గదా? బ్రాహ్మణు లన్యవర్ణములోని కన్యలను వివాహమాడుచు వచ్చినట్లును, అట్టివివాహములు విధివిహితములయినట్లును శ్రుతిస్మృతులు బహుముఖముల ఘోషించుచున్నవి. ఈవిషయమున ను ప్రమాణవచనము లుదాహరించుట మానివేసి, శూద్రకన్యను బ్రాహ్మణుఁడు స్వీకరించినట్లును శూద్రుఁడు వేదాధ్యయనము చేసినట్లును జూపెడి యొక్క శ్రుతివాక్యమునుమాత్రము చెప్పి తరువాత భోజన ప్రతిభోజనాములను గూర్చిన ధర్మశాస్త్రవచనములను గొన్నిటి నుదాహరించెదను.

తదుహ జానశ్రుతిః పౌత్రాయణః షట్ఛతాని గవాం నిష్క మశ్వ
తరీరథం తదాదాయ ప్రతిచక్ర మేతం హ్యాభ్యువాద. ౧
రైక్వే మానిషట్ఛతాని గవామయం నిష్కోఽయ మశ్వతరీరథోనుమ
ఏతాంభగవో దేవతాగ్ంశాధి యాందేవతాముపాస్స ఇతి ౨

తము హ పరః ప్రత్యువాచాహ హారేత్వా శూద్ర తవైవ సహ గోభి
రస్త్వితి తదు హ పునరేవ జానశ్రుతిః పౌత్రాయణః సహస్రం
గవాం నిష్క మశ్వతరీరథం దుహితరం తదాదాయ ప్రతిచక్రమే. ౩
తగ్ంహాభ్యువాద రైక్వేదగ్ంసహస్రంగవామయంనిష్కోయమశ్వతరీరథ
మియంజాయాయంగ్రామో యస్మిన్నాస్సేన్వేవ మా భగవశ్శాధీతి
తస్యాహ ముఖముపోద్గృహ్ణన్నువాచాజహారేమాః శూద్రానేనైవ
ముఖేనాలాపయిష్యథా ఇతి తే హైతే రైక్వపర్ణా నామ మహావృ
షేషు యత్రాస్మా ఉవాస తస్మై హోవాచ. ౫

"అప్పుడు పౌత్రాయణుఁడగు జానశ్రుతి యాఱు నూఱు గోవులను ధనమును రెండు కంచరగాడిదలను బండిని గొనిపోయి యతనిని గూర్చి యిట్లనియెను. ౧

"ఓ రైక్వా! ఈ యాఱునూఱు గోవులను, ఈ ధనమును, కంచరగాడిదలను, రథమును గైకొని మీరుపాసించు దేవతను నాకుపదేశింపుఁడు. ౨

'ఓ శూద్రా! ఈ హారమును గోవులను నీయొద్దనే యుంచుకొమ్ము' అని యతఁడుత్తరము చెప్పెను. అప్పుడు పౌత్రాయణుఁడైన జానశ్రుతి వేయిగోవులను ధనమును కంచరగాడిదలను రథమును తనపుత్రికను దీసికొని మరల నతనివద్దకు వచ్చెను. ౩

(జానశ్రుతి) యిట్లనియెను—'ఓ రైక్వా! ఈ సహస్రగోవులను నిష్కములను కంచరగాడిదలను పూన్చినబండిని ఈభార్యను కాపురముండు గ్రామమును గైకొని నాకుపదేశింపుము. ౪

ఆమెను కానుకగా నిచ్చిన కారణమును తెలిసికొని యతఁడిట్లనియెను—'ఓ శూద్రా! ఈమె మూలమున నీవు విద్యోపదేశమున కర్హుఁడ వయినావు—అని దేశమునందు రైక్వపర్ణమనఁబడిన యాగ్రామమునందు వానికి జ్ఞానోపదేశము చేసెను.' ౫

అని ఛాందోగ్యోపనిషత్తు చతుర్థప్రపాఠకములోని ద్వితీయ ఖండమునందు జానశ్రుతి యను శూద్రుఁడు రైక్వుఁడను బ్రాహ్మణుని యొద్ద కాఱునూఱుగోవులు తీసికొనిపోయి తనకు విద్యోపదేశము చేయుమని వేఁడగాఁ నతఁడు నిరాకరించినందున మరల వేయిగోవులను తనకొమార్తెను దీసికొనిపోయి సమర్పింపఁగా నాబ్రాహ్మణుఁ డాచిన్న దానిని భార్యనుగా స్వీకరించి వానికి బ్రహ్మవిద్యోపదేశము చేసినట్లు కంఠోక్తిగా చెప్పఁబడి యున్నది. హీనజాతులవా రగ్రజాతులవారు కావచ్చినందుకును బ్రాహ్మణులు హీనజాతిస్త్రీలను పరిణయముకావచ్చి నందుకును, కొన్నిదృష్టాంతములు చూపఁబడినందున నింక భోజనాదికమునుగూర్చి కూడ కొన్ని స్మృతివాక్యము లుదాహరింపఁబడవలసి యున్నవి.

"శ్లో॥ ధర్మేణాన్యోన్యభోజ్యాన్నా ద్విజాస్తు విదితాన్వయాః"

అని వ్యాససంహిత మూఁడవ యధ్యాయమున నొండొరుల వంశమును దెలిసిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లొకరియన్నము నొకరు తినఁదగినవారని చెప్పఁబడినది. ద్విజులలో నన్యోన్యభోజన మిది కలియుగమున నిషేధింపఁబడినదని యెవ్వరైనఁ జెప్పవత్తురేమో! కలియుగమునకు పరమప్రమాణమయిన పరాశర స్మృతి యీవిషయమున నేమి విధించుచున్నదో చూడుఁడు,—

శ్లో॥ క్షత్రియశ్చాపి వైశ్యశ్చ క్రియావంతౌ శుచివ్రతౌ ।
తద్గృహేషు ద్విజైర్భోజ్యం హవ్యకవ్యేషు నిత్యశః ॥ ౧౨
ఘృతం క్షీరం తథా తైలం భక్ష్యం స్నేహేన పాచితమ్ ।
గత్వా నదీతటే విప్రో భుంజీయా చ్ఛూద్రభోజనమ్ ॥ ౧౩

"క్షత్రియుఁడుగాని వైశ్యుఁడుగాని క్రియావంతులై శుచివ్రతులైన పక్షమున వారిగృహములయందు నిత్యమును హవ్యకవ్యములయందు

ద్విజులు భోజనము చేయవచ్చును. నేతిని, పాలను, తైలమును, చము రుతో వండిన భక్ష్యములను, నదియొడ్డునకుఁబోయి విప్రుఁడు శూద్ర భోజనమును చేయవచ్చును" అని పరాశరస్మృతి యేకాదశాధ్యాయమున బ్రాహ్మణుఁడు శుచిగానుండు క్షత్రియుని యింటను వైశ్యుని యింటను దేవకార్యములయందును పితృకార్యములయందును భోజనము చేయ వచ్చునని చెప్పుటయే శాక ప్రమాణాదులలో నదీతీరమునందు శూద్ర భోజనము చేయవచ్చునని విధించుచున్నది. నదీతీరమునందు సమస్త శూద్రులభోజనమును స్వీకరింపవచ్చునని యిందుఁ జెప్పఁబడినను, ఇతరస్థలములయందు ద్విజులు కొందఱు శూద్రుల భోజనమునుమా త్రమే భుజింపవచ్చునని స్మృతులు చెప్పుచున్నవి.

శ్లో॥ మార్జాల నకులౌ హత్వా శ్వానం మండూక మేవచ।
శ్వగోధోలూక కాకాంచ శూద్రహత్యావ్రతం చరేత్॥

అని యేకాదశాధ్యాయమునందు శూద్రుని జంపినందునకయి పిల్లిని ముంగిసి కప్పను బల్లిని జంపినందుకు విధించిన ప్రాయశ్చిత్తమునే విధించి నట్టియు,—

శ్లో॥ సహాసన మభిప్రేప్సు రుత్కృష్టస్యాపకృష్టజః।
కట్యాం కృతాంకో నిర్వాస్యః స్ఫించం వా స్యావకర్తయేత్॥

అని యష్టమాధ్యాయమునందు బ్రాహ్మణునితో సహాసనమును గోరు శూద్రునికి తుంటిమీఁద వాతవేసికాని పిఱ్ఱలు కోసిగాని వెడలఁగొట్టుట శిక్షగా విధింప ననుగ్రహించినట్టియు మనువుకూడ భోజనవిషయమున,—

శ్లో॥ ఆర్ధికః కులమిత్రంచ గోపాలో దాసనాపితౌ।
ఏతే శూద్రేషు భోజ్యాన్నా యశ్చాత్మానం నివేదయేత్॥

అని చతుర్థాధ్యాయమునందు వ్యవసాయము చేయువారును, కుల మిత్రులును, గొల్లలును, దాసులును, మంగలులును, (సేవకు)

తమ్మర్పించుకొనువారును అయిన శూద్రులలోపల బ్రాహ్మణుఁడు భోజనము చేయవచ్చునని చెప్పియున్నాఁడు. ఈప్రకారముగానే,—

శ్లో॥ నాపితాన్వయ మిత్రార్ధ సీరిణో దాసగోపకాః।
శూద్రాణా మప్యమీషాన్తు భుక్త్వాన్నం నైవదూష్యతి॥

శూద్రులయినను మంగలి, కులమిత్రుఁడు, కృషికుఁడు, దాసుఁడు, గొల్లవాఁడు, వీరియన్నము తినుట (బ్రాహ్మణునకు) దూష్యము కాదని వ్యాససంహితయందును,—

శ్లో॥ శూద్రేషు దాసగోపాల కులమిత్రార్ధ సీరిణో!
భోజ్యాన్నా నాపితశ్చైవ యశ్చాత్మానం నివేదయేత్॥

శూద్రులలో దాసుఁడు, గోపాలుఁడు, కులమిత్రుఁడు, కృషీవలుఁడు, మంగలి, ఆత్మార్పణము చేయువాఁడు, వీరిచేత భోజనము చేయవచ్చునని యాజ్ఞవల్క్యస్మృతియందును జెప్పఁబడి యున్నది. ఇవిమాత్రమే కాక కలియుగమునకయి యేర్పడిన పరాశరస్మృతియు నేకాదశాధ్యాయమునందు,

శ్లో॥ దాసనాపిత గోపాల కులమిత్రార్ధ సీరిణః।
ఏతే శూద్రేషు భోజ్యాన్నం యశ్చాత్మానం నివేదయేత్॥

దాసుడు, మంగలి, గొల్లవాఁడు, కులమిత్రుఁడు, కృషీవలుఁడు, తన్నర్పించుకొన్నవాఁడు, శూద్రులలో వీరి యన్నమును బ్రాహ్మణుఁడు భుజింపఁదగునని విధించుచున్నది. కాఁబట్టి ధర్మశాస్త్రములు బ్రాహ్మణుఁడు సామాన్యముగా శూద్రుని యింట భోజనము చేయుట కనుమతి యిచ్చుచున్నవి. అయినను మనపూర్వులు శుచిగా నుండువారితోను పాపాత్ములతోను గలిసి భోజనముచేయఁగూడదని కొన్ని నిషేధములను జెప్పియున్నారు.

శ్లో॥ మత్తక్రుద్ధాతురాణాంచ నభుంజీత కదాచన।
కేశకీటావపన్నం చ పదాస్పృష్టం చ కామతః॥ ౨౦౭

భ్రూణఘ్నావేక్షితం చైవ సంస్పృష్టం చాప్యుదక్యయా ।
పతత్రిణావలీఢం చ శునా సంస్పృష్టమేవ చ॥ ౨౦౮
గవాచాన్నముపఘ్రాతం ఘుష్టాన్నంచ విశేషతః ।
గణాన్నం గణికాన్నం చ విదుషాం చ జుగుప్సితమ్॥ ౨౦౯
అభిశస్తస్య షండస్య పుంశ్చల్యా దాంభికస్యచ ।
శుక్తం పర్యుషితంచైవ శూద్రస్యోచ్ఛిష్టమేవచ॥ ౨౧౧
పిశునానృతినోశ్చాన్నం క్రతువిక్రయిణస్తథా ।
శైలూషతున్నవాయాన్నం కృతఘ్నస్యాన్నమేవచ॥ ౨౧౪

“మత్తునియొక్కయు, క్రుద్ధునియొక్కయు, రోగియొక్కయు, వెంట్రుకలకు పేనుబట్టినవానియొక్కయు అన్నమును, కాలితో త్రొక్కిన యన్నమును, ఎప్పుడును తినఁగూడదు. భ్రూణహత్య చేసినవానిచేత చూడఁబడినదియు, ముట్టుదానిచే తాఁకఁబడినదియు, పక్షి వాలినదియు, కుక్క ముట్టుకొన్నదియు, అగు (అన్నము తినఁగూడదు.) గోవుమూరి చూచినయన్నమును, అమ్మినయన్నమును, మూఁకయన్నమును, భోగముదానియన్నమును, తెలిసినవారిచే నేవగింపఁబడును. శిక్షితునియొక్కయు, షండునియొక్కయు, జారిణియొక్కయు, దాంభికునియొక్కయు, పాసినట్టియు, పులిసినట్టియు, (అన్నము తినఁగూడదు.) కొండెములు చెప్పువానియొక్కయు, కల్లలాడువానియొక్కయు, క్రతువిక్రయము చేయువానియొక్కయు, నటునియొక్కయు, కుట్టుపనివానియొక్కయు, కృతఘ్నునియొక్కయు, (అన్నము తినరాదు.) అని మనుస్మృతియొక్క చతుర్థాధ్యాయమునందు చెప్పఁబడినది. దీనినిబట్టి యాలోచింపఁగా మనపూర్వులు శుచిగా నుండనివారితోను గుణహీనులతోను గలిసి భుజింపరాదని నిషేధించినట్లు కనఁబడుచున్నది గాని జాతిమాత్రముచేత, శుచియైన గుణవంతుని యింట భోజనము చేయరాదని నిషేధించినట్లు కనఁబడదు. అంతేకాక కొన్నిస్మృతులలో,—

శ్లో॥ పరపాక నివృత్తస్య పరపాకరతస్య చ।
అపచస్య చ భుక్త్వాన్నం ద్విజశ్చాంద్రాయణం చరేత్॥
అపచస్య చ యద్దానం దాతుశ్చాస్య కుతఃఫలమ్।
దాతా ప్రతిగ్రహీతా చ ద్వౌ తౌ నిరయగామినౌ॥

"పరుల కన్నము పెట్టనివానియొక్కయు, పరులయన్నమునే తినువాని యొక్కయు, ఇతరులకు దానముచేయక యనుభవించువాని యొక్కయు అన్నముతిన్న ద్విజుఁడు చాంద్రాయణము చరింపవలెను. అన్యులకు దానము చేయనివానికి దానము చేయుటవలన దాత కేమిఫల మున్నది? అట్టిదాతయు ప్రతిగ్రహీతయు నిరువురునుగూడ నరకము నకుఁ బోదురు." అని గుణహీనుఁడయిన బ్రాహ్మణునితోఁ గలిసి భుజించుటయు నిషేధింపఁబడినది. ధర్మశాస్త్ర మిట్లున్నను మనలో నున్న యాచారమిప్పుడు విపరీతముగా నున్నది.

ఇంతటితో శాస్త్రప్రమాణములను దూరముగానుంచి యిప్పు డున్నరీతిగా వర్ణభేదములవలనఁ గలుగు లాభనష్టములనుగూర్చి కొంత విచారించితిమి. వర్ణభేదమువలన ననేకలాభము లున్నవని మనవా రనేకులు చెప్పి సంతోషించుచున్నారు. ఆ లాభములనుగూర్చి ముం దుగాఁ గొంత విమర్శింతము.

ఈ దేశమునం దొక్కొక్కవర్ణము వా రొక్కొక్కవృత్తి నవలం బింప వలయునని నియమ ముండుటవలన ప్రత్యేకముగా ప్రతివృత్తిని జేయువారు కొందఱు తప్పక యుందురనియు అందుచేత నేవృత్తికిని భంగముకలుగక యే పని చేయించుకొనవలయునన్నను కావలసినంత మంది పనివాండ్రు దొరకుదురనియు, కులవృత్తులు వంశక్రమా గతము లగుటచేత తండ్రి చేసినపనినే చిన్నప్పటినుండియు చూచుచు నభ్యసించుచుండు కుమారుఁ డాపనియందు నిపుణుఁడగుట సంభ వించు చున్నదనియు, తన్మూలమున శిల్పాదు లభివృద్ధి యగుటకు

కారణమగుననియు అనేకుల యభిప్రాయము. ఈ యభిప్రాయము కొంతవఱకు సరియైనదనుటకు సందేహము లేదు. తండ్రి చేసినపనినే కొడుకును జేయుచుండుటవలనఁ గొన్నివిషయములలో శిల్పాదులు కొంతయభివృద్ధి చెందుచున్నను, ఆ యా జాతులవా రాయా వృత్తులనే యవలంబించి యుండవలెనన్న నిర్బంధముండుటచేత నాయాపనుల యందు విశేషాభిరుచిగలవా రాయా పనులయందుఁ బ్రవేశింప వలను పడక సామాన్యముగా శిల్పాదులవృద్ధికి భంగము కలుగుచు, అవి యీ దేశమునందు పొందవలసినంత యభివృద్ధిని పొందఁజాలకున్నవి. ఎట్లనఁగా—చిత్రకారునికొడుకే చిత్తరువు వ్రాయవలె ననియు, స్వర్ణకారునికొడుకే నగలు చేయవలె ననియు నియమ ముండుటను బట్టి చిత్రకారునికుమారుఁడు బంగారపుపనియం దభిరుచిగలవాఁడయి చిత్రములు వ్రాయుటయందు ప్రవీణత లేనివాఁడయినను, స్వర్ణకారుని కుమారుఁడు చిత్తరువు వ్రాతయం దభిరుచి గలవాఁడయి యాభరణ ములు చేయుటయందు నిపుణత లేనివాఁడయినను, వాఁడు తన కిష్టమయిన దభిరుచి గలదో యాపనియందుఁ బ్రవేశించి తనబుద్ధి మహిమ నంతనుజూపి వన్నెకెక్కుట కవకాశము లేనివాఁడయి యిష్టములేని కులవృత్తితోనే బాధపడవలసినవాఁ డగుచున్నాఁడు. ఈ హేతువుచేతనే కొంతకాలముక్రిందట మన దేశమునందలి శిల్పములు చుట్టుపట్టుల నున్న యితర దేశములకంటె నున్నతస్థితికి వచ్చినను క్రమ క్రమముగా నంతకంత కభివృద్ధి గాంచక యా స్థితిలోనే నిలిచిపోయి యిప్పుడు నాగరికాగ్రగణ్యులయిన దేశములవారి శిల్పములతో తుల తూగఁజాలకున్నవి. మన దేశమునందు శిల్పాదులు సంపూర్ణ దశకు రాలేకపోవుట కిం కొక కారణముకూడ కనఁబడుచున్నది. ఏ వృత్తియం దును విద్యాధికులు ప్రవేశించినంగాని యావృత్తి దినదినాభివృద్ధి చెంది మహోన్నతదశకు రానేరదు. మన దేశమునందిప్పుడు శిల్పాది

వృత్తుల నవలంబించి యున్నవారు విద్యావిహీను లగుటచేత వారు తమ తండ్రితాతలు చేసినట్టుగా పనిచేయవలసినవారే కాని యిప్పటి ప్రకృతిశాస్త్రములయొక్క సాహాయ్యముచేతను యంత్రశక్తిచేతను బుద్ధిబలముచేతను నూతనమార్గములను కనిపెట్టి తమవృత్తుల నున్నత దశకు తేసమర్థులు కాకున్నారు. ఈయవస్థమునకును ముఖ్యకారణము వర్ణభేదముగానే తోఁచుచున్నది. మనదేశమునం దిప్పుడున్న వర్ణాచారములనుబట్టి కొన్నివర్ణములవారు తామే విద్యావంతులు గుత్తగొనుటయు తక్కినవర్ణములవారు నీచకర్మకులగుటయు సముద్రమును దాఁటి దేశాంతరములకుఁబోయి యేవర్ణమువారును పరదేశముల శిల్పాదులను నేర్చుకొని రాకుండుటయు తటస్థించుచున్నది. కాఁబట్టి యీహేతువులను బట్టి వర్ణభేదమువలననే పనివాండ్రు దొరకుట, శిల్పాభివృద్ధి నొందుట మొదలయిన లాభములు కలుగుచున్నవని చెప్పరాదు. ఏపని నైనను చేయుచుకొనువా రెక్కడనుండి యేపనిని నేర్చుకొన్న వారికి ప్రోత్సాహము కలుగునప్పుడు లాభకరమైన యాపనినే యనేకు లభ్యసించుట తటస్థించి కావలసినంతమంది పనివాండ్రు దొరుకుచునే యుందురు. ఇప్పటివలె స్వర్ణకారులేకాని యితరులు బంగారుపని చేయఁగూడదన్న నియమము లేకపోవుట తటస్థించి దేశమునందు బహుసంఖ్యాకులు స్వర్ణాభరణములతో తమశరీరముల నలంకరించుకొనువారయినపక్షమున, అనేకు లల్పలాభప్రదములయిన యితరవృత్తులను మాని యధికలాభకరమైన స్వర్ణకారవృత్తియందు ప్రవేశింతురనుటకు సందేహముండదు. ఇట్లు చేయుటవలన తక్కువలాభము వచ్చెడు పనులయందు తక్కువమంది ప్రవేశించుటచేత వారికి సుఖజీవనము జరుగుటయు, నెక్కువ లాభము వచ్చెడుపనులయం దెక్కువమంది ప్రవేశించుటచేత తగినందఱు పనివాండ్రు దొరకుటయు కలుగుచున్నది. ఇట్లుగాక యీ వర్ణమువారే యీ పని చేయవలెనన్న నిర్బంధముండుటచేత

కొన్ని సమయములయందు కొన్ని పనులు చేయించుకొనువారి సంఖ్య కంటె చేసెడువారి సంఖ్య యెక్కువయయి యనేకులకు పనిదొరకక జీవనాధారము లేకపోవుటయు, కొన్ని సమయములయందు కొన్ని పనులు చేయించుకొనువారిసంఖ్యకంటె చేసెడువారిసంఖ్య తక్కువ యయి యనేకులకు పనివాండ్రుదొరకక యధికవ్యయము చేయవలసి వచ్చుటయు సంభవించుచున్నది.

వర్ణభేదమువలనఁ గలిగెడి యింకొకలాభము సంఖ్య తక్కువగుటచేత నొక్కొక్క వర్ణమువారిలో నధికైకమత్యమును, పరస్పరానురాగాతిశయమును, అన్యోన్యసాహాయ్య సంపదయు నుండుటయని చెప్పుచున్నారు. ఇవి యన్నియు నిజముగాఁ గలిగెడుపక్షమున వర్ణభేదమువలనఁ గొన్నిలాభములున్నవని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. అయినను లోకానుభవమునుబట్టి చూడఁగా వర్ణభేదమువలన మనదేశమునందు విపరీతగుణములు పొడకట్టుచున్నవి. వర్ణభేదమువలన ననేక వర్ణములవారిలోఁ గొన్నివిషయములయందుఁ గొంత యైకమత్యమున్నను ముఖ్యాంశములయందది యంతగాఁ గానరాదు. సుఖకాలములయందు పండుగులకును వివాహాది శుభకార్యములకును విందులారగించుటకయి కావలసినంతమంది బంధువులు చేరుదురు. కాని కష్టకాలములయందుమాత్రము తోడుపడుటకయి యీబంధువులలో నొక్కరును గానరారు. ఈ దురాచారము ముఖ్యముగా బ్రాహ్మణులలో నధికముగా నున్నది. ఈ దేశమునందలి స్మార్తబ్రాహ్మణులలో రోగాదికము వచ్చినప్పుడు చూడవచ్చి భోజనములు చేయుటకును ఉత్క్రమణ గోదానాదులను చేయించుటకును చుట్టములకు కొదవలేకపోయినను, ప్రాణములు పోయినతరువాత శవము నింటినుండి శ్మశానభూమికిఁ గొనిపోవలసిన పని వచ్చినప్పుడు మాత్ర మొక్కరును గానఁబడరు. భార్యాపుత్రాదులు దుఃఖసముద్రములో మునిఁగియుండి తోడుపడువారు లేక

కూటికి శవములను మోచు పుణ్యపురుషు లడిగినంత మొత్తమునిచ్చి మృతకళేబరమును ప్రేతభూమికి తరలించునప్పుడు కులమువారందఱును దూరమునకుఁ దొలఁగినను, దహనసంస్కారమునపిమ్మట గోదానములను భూదానములను హిరణ్యదానములను సాలగ్రామదానములను గ్రహించుటకయి యెక్కడ లేనివారును గృహముచుట్టును గుంపులు గుంపులుగాఁ జేరుదురు ఈమహానుభావులు కొన్నిసమయములయందు మగఁడు పోయి యేడ్చుచున్న యనాథయువతులను మఱింత యేడిపించి బహిష్కారములు చేసెదమని బెదరించి నగలు మొదలయినవాని నమ్మించియు ఋణములు చేయించియు వారిచేత సంతర్పణములు చేయించి తాము హాయిగా పిండివంటలతో విందారగించి, యాభాగ్యహీనురాండ్రను కూటికిపేదలను జేయుదురు. ఈవర్ణభేదమువలన నెవ్వరికో యొకానొకరికి కలిగెడు లాభములకన్న పలువురకు కలిగెడు నష్టములే యధికముగా నున్నవి.

వర్ణభేద ముండుటవలన కులమువారి భీతిచేత జనులు విచ్చలవిడిగా చెడుదారులఁబడి తిరుగక నీతిమార్గమున సంచరింతురని కొందఱందురు. అయినను లోకములో నిది మన యనుభవమునకు ప్రత్యక్షవిరుద్ధముగా నున్నది. వర్ణభేదమువలన నీతి వర్ధిల్లుటకు మాఱుగా గణనాతీతము లయిన కులనిబంధనలు ప్రబలి నీతిని నామమాత్రావశిష్టము చేయుచున్నవి. ఈవిషయమును ముందు కొంతవివరముగా వ్రాసెదను.

వర్ణభేదమువలన శుచిత్వము పెద్దలయెడల వినయవిధేయతలును గలుగునని చెప్పుదురు. బ్రాహ్మణాదివర్ణములవారు తమ గేహములను దేహములను శుచిగా నుంచుకొనుట వాస్తవమే. కాని యాశుచిత్వమును పూర్ణముగా వర్ణభేదమున కారోపించుట మాత్రము న్యాయముకాదు. వర్ణాచారములవలనను మూఢవిశ్వాసములవలనను

ననేకవిషయములయందు శుచిత్వమునకు మారుగా నశుచిత్వమే వ్యాపించుచున్నది. స్నానముచేసి శరీరమును నిర్మలముగా నుంచుకొనుటయు శుభ్రవస్త్రములను ధరించుటయు దేహారోగ్యధర్మములలో ప్రధానములైనను బ్రాహ్మణులలోని పురుషులును ముఖ్యముగా స్త్రీలును నిర్మలజలమును విచారింపక మూఢాచారప్రభావముచేత పుణ్యమని చెప్పి బురదనీటిలో మునిఁగి తడిబట్టలు కట్టుకొనియు, మైలబట్టలని పిలువవలసినవానికి మడిబట్టలని పేరువెట్టి కలుషజలములో ముంచి యారవేసినట్టి బట్టలనుగాని, వారమున కొక్కసారైన నుతుకని దుర్గంధసహితములైన పట్టుబట్టలనుగాని ధరించియు, శరీరారోగ్యమును చెరుచుకొనుచున్నారు. ఈ ప్రకారముగానే స్త్రీలు పూర్వకాలమున మట్టినేలపైని చేటికలు లేవకుండుటకయి పూయఁబడుచువచ్చిన గోమయమును పవిత్రమయినదని శుద్ధినిమిత్తమయి యిప్పటి గచ్చునేలలను సహితము పయోగించి గృహముల పారిశుద్ధ్యమునకు భంగము కలిగించుచున్నారు. పెద్దవారు చెప్పినదానినెల్ల వినయవిధేయతలతో గ్రహించి కులాచారములకు బద్ధులయి దాస్యము చేయుచుండుట మనలో నున్నది గాని స్వతంత్రముగా నాలోచించి కార్యనిశ్చయమును జేసికొనవలసిన పురుషధర్మమును జంపెడి యీవిధేయత యంతగా శ్లాఘ్యమైనదియు నపేక్షణీయమైనదియుం గాదు.

ఇప్పుడున్న ప్రకారముగా వర్ణభేదమువలనం గొన్నివర్ణములవారి కల్పలాభము కలుగుచున్నను, మొత్తముమీఁద దేశమునకు గణనాతీతములైన నష్టములు సంభవించుచున్నవి. ఈ నష్టములలో మొట్టమొదటిది జనులలోగల పరస్పరద్వేషము. ఈ దేశమునం దిప్పుడు బ్రాహ్మణాదులైన నాలుగువర్ణములు మాత్రమే కాక ప్రతివర్ణములోను లెక్కకెక్కుడైన యంతర్భాగము లున్నవి. ఈ దేశమునందలి వర్ణభేదములనుగూర్చి చేసిన పుస్తకములో నొకరించుమించుగా బ్రాహ్మణు

లలోఁగల తెగలపేరులు రెండువేలు చెప్పియున్నారు. ఈ తెగలవారు తాము బ్రాహ్మణేతరులకంటె నెక్కువవారమని గర్వపడుచుండుటయే కాక యెవరికివారు తమలోఁగూడ తామే యెక్కువవారమని తగవులాడుచు పరులను ద్వేషించుచు దూషించుచు సంబంధబాంధవ్యములను భోజనప్రతిభోజనములను మాని, జనులలో నైకమత్య మసాధ్యమగునట్లు చేయుచున్నారు. ఈ తెగలవారిలో నొకని కధికారముబ్బినప్పుడు పరులలో సాధ్యమయినంతవఱకు తన తెగవారినే చేర్చుటకును తక్కిన తెగలవారిని చేరనీయకుండుటకును సర్వవిధములచేతను బ్రయత్నము చేయుచుండును. వీరీద్వేషమును సమస్తవిషయములయందును జూపించి కొన్నిసమయములయం దల్పాంశములనుబట్టి తగవులాడుచు నొండొరులను గర్భశత్రువులనుగాఁ జూచుకొనుచుందురు. ఈ జాతిద్వేష మగ్రవర్ణమువారయిన బ్రాహ్మణులు మొదలుకొని యధమవర్ణమువారయిన చండాలురవఱకును వ్యాపించి యున్నది. ఎంతటి నీచవర్ణమువాఁడయినను తన జాతివారిలోని తెగలలో తానధికుఁడననియు తన కధిక స్వాతంత్ర్యములు కలవనియు శుష్కకలహములు పెట్టుకొని పనికిమాలిన విషయములలో వివాదపడుచుండును. ఒకమండలమందు జరుగుచుండిన జాతరలో నొకమాదిగవాఁడు సిగలో నెఱ్ఱపువ్వులు పెట్టుకొని వచ్చినందున మాదిగలట్టిపువ్వులు ధరింపఁగూడదని తగవుపెట్టి మాలలు ముష్టికఱ్ఱలుధరించి యుద్ధమునకు సంసిద్ధులు కాఁగా రాజభటులెంతో కష్టముమీఁద తలలుబద్దలుకొట్టుకొని రక్తప్రవాహములను కట్టింపకుండ వారిని వారించి పోగనంపిరి. అనంతములయిన యీ వర్ణభేదములు చాలనట్టుగా మనవారు కుడిచేతి యెడమచేతి జాతిభేదము నొకదానిని పెట్టుకొని తమలో తాము తగవులాడువారును కొన్నిసమయములయందు తమలోఁగల యన్యోన్యవైరమును మఱచి యొక్కతెగ

వారందఱు నొక్కటియయి రెండవతెగవారిని బాధించుటకయి యసూయాగ్రస్తులయి వీరావేశమును వహించి మితిమీఱిన చెఱుపును కలిగించుచున్నారు. ఎడమచేతివారి ననమానపఱచుటకయి కుడిచేతివారందఱు నేకమయి తమ మానవస్వభావమును మఱచి కాట్లకుక్కలవలె కయ్యమునకు కాలుద్రవ్వుచు చెప్పరాని క్రూరకృత్యముల కొడిగట్టుట యనేకులు చూచియుందురు. స్వర్ణకారులు తమ యింటిగోడలకు వెల్ల వేసికొనిరనియు, పల్లెవాండ్రు వివాహాదిదినములలో పల్లకి యెక్కిరనియు, కొంతకాలముక్రిందట బృందావనపురమునందును నీలపల్లెయందును కుడిచేతివారెడమచేతివారిమీఁద ధ్వజమెత్తి నానావిధామాంగళ్యములను జేసియుండుట మీలో ననేకులు కనియువినియు నుందురుగదా? మనుష్యులకును మనుష్యులకును వేఱుపాటు కలుగఁజేసి యెదుటివారు తమగోడకు వెల్లవేసికొన్నను చూచి సహింపలేనంత ఘోరరాక్షసత్వమును మనుష్యులకుఁ దెచ్చిపెట్టినది యీ వర్ణపిశాచమే కదా? ఈ పిశాచ మిట్లు పండితులు మొదలుకొని పామరులవఱకును గల సమస్తజనుల హృదయములలోను నెలవుకొని నిరంకుశాధికారమును చెల్లించుచుండఁగా మన దేశ మెట్లు పురోభివృద్ధికి రాఁగలదు? తమ యాచారములలో దేశక్షేమకరములయిన చిన్నమార్పులను సహితము చేసికొన సాహసింపలేని పరమభీరువులయి యున్న హిందూమహాజనులు క్రూరవర్ణాచారపిశాచప్రేరణముచేత నకార్యకరణమునందెక్కడలేని ధైర్యమును వహించి ప్రాణములకు తెగించి పోరాడుట మహాద్భుతముగా నున్నది.

ఈ వర్ణభేదము మనదేశమునకు కలిగించిన గొప్పనష్టములలో నొకటి దయాదాక్షిణ్యములను, నీతిని హృదయములనుండి పాఱఁదోలి మనుష్యులను మృగములనుగాను క్రూరరాక్షసులనుగాను మార్చుట. మనదేశమునం దిప్పుడు నీతి యనునొంటి దానిస్థానమున జాతికట్టు

పాటులే పరమాదరణీయము లయినవి. ఒకఁ డగ్నిసాక్షికముగా వివాహమాడిన కులాంగనను విడిచి బహిరంగముగా వారాంగన నుంచుకొన్నను రహస్యముగా పరులసంసారములు పాడుచేయుచున్నను, అట్టివాఁడు మొగమున విభూతిరేఖలు ధరించి బిళ్ళగోచి పెట్టి స్నానము చేసియో చేయకయో జుట్టుచివర ముడివైచుకొనువాఁడైన పక్షమున జాతిబాహ్యుఁడు గాక నిష్ఠాగరిష్ఠుఁడును సదాచారసంపన్నుఁడును నగు చున్నాఁడు. చౌర్యముచేసియో నరహత్యచేసియో చెఱసాలలోఁ బడి తప్పించుకొని వచ్చినవాఁడు కులమునకు వెలిగాక పంక్తిభోజన మునకు అనర్హుఁడుగాక, దాహాతిశయముచేత సచ్ఛూద్రునిచేత మంచి నీళ్ళు గిన్నెడు త్రాగినవాఁడు కులభ్రష్టుఁడును నపాంక్తేయుఁడు నగు చున్నాఁడు. ఓహో! ఈ వర్ణపిశాచముయొక్క ప్రభావము నేమన వచ్చును! గర్భపాతములను శిశుహత్యలను చేసిన క్రూరాత్ములు పతితులుగాక తన కడుపునఁబుట్టిన బాలవితంతువులకు విధ్యుక్తముగా వివాహము చేసిన కరుణార్ద్రహృదయులు పతితులగుచున్నారు! కల్లు త్రాగి లేదని కల్లలాడి యిల్లాలిని విడనాడి యిల్లును తల్లి పెంచిన మేనును గుల్లచేసికొని ముత్తులయిండ్లకు నిత్యయాత్రలు చేయుచు భక్తవేషము వేయు వంచకులగ్రపంక్తి కర్హులయి విద్యాలాభము నిమిత్తమును స్వదేశక్షేమము నిమిత్తమును ద్వీపాంతరయాత్రలు చేయు ఋజుమార్గులు పంక్తిభోజనమున కనర్హులగుచున్నారు. ఏమి పాపము పండినదోకాని మనదేశమునం దిప్పుడు నీతిమార్గమును కోలుఁగొని సద్వర్తనము యోగ్యమయినదిగా పరిగణింపఁబడక నీతిమాలిన బాహ్యనటనము యోగ్యమయినదిగా భావింపఁబడు నంతటి వైపరీత్యము సంభవించినది. కల్లల కొడిగట్టి కూటసాక్ష్యములు పలికి దుర్దానములు పట్టి పొట్టపోసికొను కుక్షింభరాధములు తమ దుశ్చరిత్ర

మునకు సిగ్గుపడుటకు మాఱుగా స్వార్థాంధులయి యణుమాత్రమును ధర్మమార్గము నతిక్రమింపక కష్టార్జితధనముతో జీవనముచేయు బ్రాహ్మణేతరులకంటెను జాతిమాత్రముచేతనే తా మధికుల మయితి మని గర్వపడుచు వారి గాలి సోఁకినను తాము మైలపడుదుమని భావించుచున్నారు. ఇట్టి దుర్గర్వముచేత మనుష్యలక్షణములైన దయాదాక్షిణ్యాదులును నీతియు మనవారి హృదయావాసములనుండి పాఱిపోఁగా వానిస్థానమున రాక్షసగుణములైన నిర్దయత్వాదులును దుర్నీతియు హృదయకుహరములయందు ప్రవేశించి యథేచ్ఛముగా రాజ్యము చేయుచున్నవి. అగ్రజాతివారమని గర్వపడు ఛాందసులు తమ కన్నులయెదుట చెట్టువిఱిగి శూద్రునిమీఁద పడినను పయికిఁదీయక దయాశూన్యులయి, తాఁకినచోఁ దమకు మైల సోఁకునని దూరముగా తొలఁగుచున్నారు. ప్రయాణమధ్యమున మండువేసవికాలములో దారిప్రక్కను తక్కువకులమువాఁడు వడగొట్టి పడి ప్రాణములు విడుచుచున్నను వానినంటినఁ దా నశుచి నగుదునని భయపడి యావానిని బోయెడు వేదజడుఁడగు బ్రాహ్మణోత్తముఁడు తనచెంబులోని నీటిబొట్టొక్కటియైనను వానినోటఁ బోయు పాపమునఁబోవఁడు. ఈ హేతువుచేతనే యాత్రలు సేవింపఁబోవు బీదలనేకులు వ్యాధిగ్రస్తులయి పుణ్యక్షేత్రములకుఁ బోవు దారులలో వీధిప్రక్కలనుబడి చూచుదిక్కులేక స్వదేశజనులనడుమనే కుక్కలవలెఁ జచ్చుచున్నారు. అట్టివారొక్క వేదమునే నమ్మి యొక్క మతమునే యవలంబించి యొకదేవతనే యారాధించువారైనను వా రేవర్ణమువారో తెలియని దోషముచేత వారికెవ్వరును తోడుపడరు. స్వదేశస్థులు మార్గమధ్యమున రోగపీడితులయి దిక్కుమాలి చచ్చుచున్నప్పుడు తోడిమానవులు చూచి తోడుపడక యుపేక్షించుటకంటె నవమానకరమైన క్రూరకృత్యము మఱి యేముండును? వర్ణపిశాచముయొక్క ప్రేరణముచేతఁ గాక

పోయినయెడల మానవజన్మమెత్తిన వాఁడెవ్వఁడు నిసర్గదయాగుణమును విడిచి యిట్టి కటికిమనసు పూనఁగలఁడు? ఈ వర్ణపిశాచావేశముచేత మనుష్యులు తోడిమానవులను మృగములకంటెను నీచముగాఁ జూచుచు తాముంచువలన నధికుల మైతిమని విఱ్ఱవీఁగుచున్నారు. నిర్మలనీతిచేత పవిత్రములుగాని యీ మహానుభావుల హేయకాయములు తోడిమానవుల స్పర్శనమువలననేకాక దర్శనమువలనఁ గూడ నపవిత్రము లగునఁట! బురదలో పొరలివచ్చిన మహిషము కాయశుద్ధిచేసినను స్నానముచేయక భుజించు భూదేవోత్తముఁడు వైశ్యుని చేయి సోఁకినమాత్రమున తినుచున్న యన్నము విడిచి లేచిపోవుచున్నాఁడు. కుక్కగాని గాడిదగాని యెదుటనుండి చూచుచున్నను లేవక భక్షించెడు వైశ్వదేవపరుఁడు తోడిమానవుఁడైన శూద్రుఁడు దూరమున కంటఁబడినను ముందఱివిస్తరి విడిచి శపించుచు లేచిపోవుచున్నాఁడు. మనదేశమునం దనేకు లిట్టి యకృత్యములచేతనే తాము భూదేవతలయి దేవతలకు దేవతలమని మఱి యుద్ఘోషించుచున్నారు. ఓ వర్ణభూతమా! నీ వెంత చక్కగా మావారిమతి చెఱిచితివి! నీ కెంత మొండిబలమో కాని సుజ్ఞానసూత్రశరములును నిన్నొక్క పట్టున పాఱఁద్రోలఁ జాలకున్నవి. దయాగుణము దేవత్వసూచకము. నిర్దయత రాక్షసత్వసూచకము. నిజమైన దేవత్వము నపేక్షించు వారం దఱును దయాగుణమును పూని తోడిమానవులను సోదరభావముతోఁ జూచుచు నితరులు సుఖించునప్పుడే తాము సుఖించునట్లు నేర్చుకొనవలెను. ఈ నిజమైన దేవత్వము నపేక్షించు వివేకము లేకప వులచేతనే వర్ణపిశాచావిష్టులు ప్రజాక్షేమకరములైన మంచిమాటలను నిరోధించు రాక్షసత్వమును వహించుచున్నారు. వివేకియై బ్రాహ్మణుఁ డొకఁడు తాను గన్న ప్రియపుత్రిక సుఖ మపేక్షించి భర్తతో కాపురము చేయఁదగిన యుక్తవయస్సు వచ్చిన పిమ్మట

వివాహము చేసికొని సంకల్పింపఁగానే వర్ణపిశాచము నోరు తెఱచుకొని పరుగెత్తుకొనివచ్చి 'నీ పుత్రికకు ప్రాయమురాని పసితనములోనే పెండ్లి చేయనియెడల మ్రింగివేసెద' నని బెదరించుచున్నది. ఆ భూదేవుఁడు భయపడి పండ్లురాని పసికూనకే పెండ్లిచేసి విందులు పెట్టి వర్ణభూతమును సంతోషపెట్టి తన యల్లుని నా భూతము పొట్టఁబెట్టుకొన్న తరువాత మరల కొంతధైర్య మవలంబించి తన ముద్దులబిడ్డ యొక్క వైధవ్యదుఃఖమును మాన్పుటకుఁ గొంచెము ప్రయత్నము చేయఁగానే, మొదట వివాహము చేయించి భర్తను మ్రింగిన వర్ణభూతమే మరల వచ్చి తొంటికంటెను విస్తృతముగా నోరు తెఱచి యఱచుచు 'నీ బిడ్డకు మరలఁ బెండ్లిచేసితివా నిన్ను బహిష్కారదంతము లతో కొఱికి తినెద' నని మరల వెఱపించు చున్నది. ఇట్టి ఘోరకృత్యములు చేసెడు పెనుభూతము మఱి యే యకృత్యము చేయ సంకోచించును? నాఁటిపై గోల్పోయి యేడ్చుచున్న యనాథకాంతను మగని శవముతో కట్టిపెట్టి కాల్చుమని బోధించెడు వర్ణభూతము వింతతువును నీ సగిలుచున్న నాకు సంతర్పణము చేయుమని నిర్బంధింప కుండునా? జ్ఞానులయి యాశ్వాసేవ చేయఁ గోరు పురుషులనే తనకు దక్షిణలిచ్చి, నిగ్రహములను గొలుచుచు, జ్ఞానమును సంపాదింపఁ గలవని పక్షమున నిగ్రహించెదనని ప్రతిజ్ఞ చూపెడు వర్ణభూతము, విద్య నేర్చిన యజ్ఞానాంధకారము మునిఁగి యుండవలసినదని స్త్రీలను బాధించుటకు సందేహించునా? ఈ వాదుపిశాచము వయసువచ్చిన కన్నెలను వయసు వచ్చిన వరుఁ కిత్తుమనువారిని మ్రింగెద ననుచున్నను, వయసురాని కన్నెలను వయసుజారిన ముదిపెండ్లికొడుకులకు వివాహమిషమున బలిపెట్టు పెద్దలను తన దీర్ఘబాహువులతో నాలింగనము చేసికొని వారి వలన సంభావనల నొందుచున్నది. అనాథయైన పసిబాలికను వివా

హాము చేయుదుమను వారిని విఱుచుకొని తినఁజూచుచున్నను ఉన్న భార్యను దుఃఖపెట్టి పెక్కుభార్యలకు మంగళసూత్రములు కట్టి వెల యాండ్రపాదములు పట్టు దిట్టలయెడ సౌభ్రాత్రము నెఱపి వారివలన సమ్మానము నొందుచున్నది. జరిగినఁగాని విఱుగుట తెలస్థింపదు గాన నిజవినాశముకొఱకే యీ రాక్షసకృత్యము లిట్లు వర్ధిల్లుచుండి యుండవచ్చును.

ఈ వర్ణపిశాచ మీదౌర్జన్యములతో తృప్తినొంది యుండక చెలరేగి జనులయొక్క దేహబలాభివృద్ధిని జ్ఞానబలాభివృద్ధిని దేశముయొక్క ధనాభివృద్ధిని శిల్పాదిసకలకలాభివృద్ధిని కూడ తనపొట్టను బెట్టుకొనుచున్నది. ఈ పిశాచముయొక్క యుపదేశమువలన నడుచుచున్న గ్రామ్యకర్మలలో పెక్కుటియైన శిశువివాహములనుగూర్చి యీవఱకే కొంచెము సూచన చేసి యున్నానుగదా! ఈ యపాత్రవివాహములవలన పిల్లలుగా నుండి యాడుకొనుచుండవలసిన కాలములోనే పిల్లలు తల్లులయి దుర్బలులగుట సంభవమగుచున్నది. పిల్లలు తల్లులయ్యెడు వింతదేశములో పిల్లవాండ్రు తండ్రులగుట యాశ్చర్యము కాదుగదా? ఇతరదేశములలో సంసారదుఃఖమెఱుఁగక హాయిగా చదువుకొనుచుండెడి యిరువదియేండ్లబాలురు వర్ణభూతపరిపాలితమయియున్న యీ దేశములో ముగ్గురుబిడ్డలతండ్రులయి పుత్రశోకాది సంసారదుఃఖముల పాలయి చదువు మానవలసినవారగుచున్నారు. బాలురకును బాలలకును పుట్టిన బిడ్డలు స్వభావముచేతనే దుర్బలులగుచుండఁగా, ఆ పయిని బాలమాతలాటలుమరిగి యుపేక్షచేయుటచేతను పెంచుటకు చేతఁగాక చెడఁగొట్టుటచేతను వారు మఱింత బలహీనులగుచున్నారు. భూదేవతలు ప్రధానదేవతనుగా బూజించెడి యీ వర్ణాపమృత్యుదేవతయొక్క సంపూర్ణకటాక్షము మన దేశముమీఁద చిరకాలము ప్రసరించిన పక్షమున

ముందు మన సంతతివారు పురాణములయం దభివర్ణింపఁబడిన యంగుష్ఠమాత్రశరీరులయిన వాలఖిల్యులో, కలిప్రభావప్రస్తావనయందు వర్ణింపఁబడిన నేలములగచెట్లకు నిచ్చెనలువేయు మహోన్నతపురుషులోయయి యిప్పటివారు పురాణకర్తల కారోపించెదరు సర్వజ్ఞత్వమును సత్యము చేయక మానరు. మనవారియొక్క దుర్బలస్థితి కీబాల్యవివాహపీడ యొక్కటి చాలునట్లుగా హేయకార్యములను కల్పించుటలో విసుగుచెందని వర్ణభూతము ప్రతివర్ణములోను గణనాతీతములైన యంతర్భాగములను సృష్టించి యిచ్చి పుచ్చుకొనఁదగు బంధుచక్రముయొక్క వృత్తమంతకంతకు చిన్నది యగునట్లు చేయుచున్నది. దగ్గఱబంధువులలోనే తఱుచుగా వివాహకార్యములు చేయుచుండుట వలనఁ గలిగెడు శిశువులు బలహీనులగుటయే కాక యల్పాయుష్కులును రోగిష్ఠులు నగుదురని వైద్యశాస్త్రజ్ఞులు మొఱ్ఱపెట్టుచున్నారు. అయినను వర్ణభూతముయొక్క మహాఘోషముముందఱ వారి మొఱ్ఱయెవ్వరికిని చెవి సోఁకకున్నది. కన్యావిక్రయము, వృద్ధవివాహము మొదలయిన యనర్థము లనేకము లీదురాచారవిషలతయొక్కయు, బాల్యవివాహకంటకవృక్షముయొక్కయు దుష్ఫలములే. ఇట్లు వర్ణభూతము జనులయొక్క దేహబలమును చెడఁగొట్టుటయేకాక జ్ఞానబలమునుకూడ చెడఁగొట్టుచున్నది. లోకములో నేదేశమునందు జూచినను జ్ఞానము మనుష్యలక్షణముగా పరిగణింపఁబడుచున్నది. ఇఁక మనదేశమునందో యీశ్వరుఁడు జ్ఞానాభివృద్ధిని బొందుఁడని బోధించుచుండఁగా, వర్ణభూతము జ్ఞానమును విడిచి మూఢులుకండని బోధించుచున్నది. వేదము శూద్రులును విన్నభ్యసింపవచ్చునని చెప్పుచుండఁగా, వర్ణపిశాచము వేదాక్షరములు విన్న శూద్రునిచెవిలో సీసము కాచిపోయుమని చెప్పుచున్నది. ఏమి యీ సాహసము!

ఎవ్వరో కొందరే కాని దేవునిఁ దెలిసికొని యానందించుటకు దేవుని బిడ్డలందఱు సమర్థులు కారఁట! స్వప్రయోజనపరులైన కొందఱు సర్వజనులను మూఢత్వమున ముంచి, దేవతారాధనమును మాని తమ్మారాధించుటయే పరమార్థమని బోధించుటచేత పరులను చెఱిచి తాము పాడగుచున్నారు. ఒరులను జెఱుపఁదలఁచుకొన్నవాఁడెప్పుడును తాను బాగుపడఁడు. తమ పాదధూళి శిరమునఁ దాల్చుటయే పరమార్థమని యితరులకు సదా బోధించుచుంటచేత వారికదియే విద్యయయి సత్యవిద్యలన్నియు మూలఁబడినవి. అందుచేత పర్వతములకును నదులకును బిడ్డలు పుట్టుట వారికి గొప్పసత్యము. కల్లుసముద్రములును నేతిసముద్రములును వారి భూగోళశాస్త్రము. సూర్యచంద్రులను పెద్దపాము మ్రింగుట వారి ఖగోళశాస్త్రము. స్వకాయకష్టము విడిచి యిట్టి సత్యములు బోధించి జీవించుట వారి కులవృత్తి. ఇట్టి జ్ఞానవంతులు తామే సర్వజ్ఞుల మనుకొని యున్న నాలుగుశాస్త్రములను తామే యభ్యసించి యితరులను చదువనియ్యక పూర్వోక్తసత్యములను ప్రవచించియే యాత్మభరణము చేసికొనుటచేత వారికి నిజమయిన జ్ఞానమును సంపాదించుటకుఁగాని వృద్ధిపొందించుటకుఁగాని జనులలో వ్యాపింపఁజేయుటకుఁగాని యావశ్యకము లేకపోయినది. అందుచేత క్రొత్తవిద్యలు రాకపోఁగా క్రమక్రమముగా నున్నవిద్యలుసహితము నశించి, వారి కితరుల వంచించుటయే కులవిద్యలయినవి. ఈ కారణమునుబట్టి మనదేశమునందు భూజనులకు మాత్రమే కాక భూదేవతలకుఁగూడ జ్ఞానవృద్ధి లేక మూఢత్వము సంప్రాప్తమయినది. మన దేశముయొక్క బీదతనమునకుఁగూడ కొంతవఱకీవర్ణభూతమే కారణము. ఈ భూతము చెమటయూడ్చి కష్టపడి స్వాతంత్రజీవనముచేయుట హేయమనియు, పాటుపడక మానము విడిచి పరు

లను యాచించి పేరతిండితిని బ్రతుకుట యుపాదేయమనియు, విప
రీతోపదేశము చేసి మనవారిలో ననేకులను సోమరిరాజులను జేసి
నది. అందుచేత కాయపుష్టి గలిగి పాటుపడి స్వాతంత్ర్యజీవనము చేయుచు
గతిలేనివారిని పోషించుచు దేశమును భాగ్యసంపన్నముగాఁ జేయ
శక్తిగల దృఢగాత్రులు సహితము శరీరకష్టపడుట యవమానకరముగాను
తిరిపెమెత్తుట గౌరవావహముగాను భావించుచు, భక్తులమనియు
బ్రాహ్మణులమనియు సన్యాసులమనియు తీర్థవాసులమనియు గుళ్ళు
కట్టించెదమనియు చలిపందిళ్ళు పెట్టించెదమనియు పితృకా
ర్యములనియు దైవకార్యములనియు నానావిధమాయవేషములు
వేసి సర్వాసత్యములకు లోనయి సకలనైచ్యములకు తలయొగ్గి
సోమరిరాములయి పరులను వంచించి కుటుంబభరణము చేసి
కొనుచు దేశమును దరిద్రతావాసముచేయుచున్నారు. పాటుపడవల
సినవారు పాటుపడక సాపాటురాములయి పరుల పెట్టుపోఁతల కాశించి
పగటిదొంగలవలె పాటుపడువారి సొమ్ము సదా కొల్లగొనుచున్నప్పుడు
దేశ మెట్లు దరిద్రదశకు రాకుండును? మనదేశమునకు బీదదశ
కింకొకటికూడ ముఖ్యకారణముగానున్నది. అది తండ్రియవలంబించిన
వృత్తియే కొడుకును పూనవలయుననియు, వాణిజ్యములకయి సము
ద్రయానము చేసి యన్యదేశములకుఁ బోఁగూడదనియు జాతి
భూతము నిర్బంధించి బాధించుటయే. తండ్రి పూనిన వృత్తినే
కొడుకవలంబించుచుండుటచేత మనదేశమునందు శిల్పాదికళలు మొట్ట
మొదట కొంతవఱకభివృద్ధినొందినను, శిల్పులు మొదలగువారు
సాధారణముగా చదువెఱుఁగని మూఢులగుటచేత దినదినాభి
వృద్ధినొందక యంతటితో నిలిచి యెదుగుబొదుగులు లేక తొంటి
కాలమునం దున్నట్లే యిప్పుడు నున్నవి. అందుచేత విద్యాధికులయి

యంత్రసాహాయ్యమునఁ బనిచేయు నన్యదేశస్థులతో సరిపోఁగ లేక మనశిల్పులు క్రమక్రమముగా కూటికిపేద లగుచున్నారు. ఎవ్వని కేవృత్తియం దభిరుచియున్నదో వాఁడావృత్తి నవలంబింపక రుచిలేని తనతండ్రి పనినే యాచరించుచుండుటవలన శిల్పాదికళల యభివృద్ధికి భంగముకలుగును. వాణిజ్యమునందు లక్ష్మి వాసముచేయునని మన పెద్దలే చెప్పియున్నారు. మనవా రితరదేశములకుఁ బోయి యచ్చటి వారితో వ్యాపారము చేయుటకు వలనుపడనందున వాణిజ్యాభావము చేత మనదేశము తాను లక్ష్మికి నివాసము కాఁజాలక యామె యక్కగారైన పెద్దమ్మవారికి నివాసమగుచున్నది. దేశక్షేమమో, మనవారిని మీరు సముద్రయానముచేసి కళలయందు వృద్ధిఁబొంది యితరదేశములవారితో వాణిజ్యము విరివిగా సాగించి ధనమార్జింపుఁ డనుచున్నది; వర్ణాచారమో మనవారిని మీరు సముద్రయానము మాని కూపకూర్మములవలె నిల్లుకదలక మ్లేచ్ఛసంబంధము నడఁచి కళలు విడిచి తన్నారాధించుచు ధనార్జనము వర్జింపుఁడనుచున్నది. ఇందేయుపదేశము భజింపఁదగినదో యేయుపదేశము త్యజింపఁదగినదో నిర్ణయించుటకు బుద్ధిమంతు లర్హులు. వర్ణభేదమువలన మన దేశమునకుఁ గలుగుచున్న యనర్థముల నన్నిటిని వివరించుట యీ చిన్న యుపన్యాసము పని కానందున, ఆ పనిని బుద్ధిమంతులకు విడిచి మఱి కొన్ని వాక్యములతో నిప్పటి కీయుపన్యాసమును ముగించుచున్నాను.

ఎంతటి దురాచారమైనను లోకములో నొకసారిగా నశింపదు. దురాచారమని తెలిసినపిమ్మటకూడ జనులు వంశపరంపరగా వచ్చుచున్న యాచారము నొకపట్టున విడువఁజాలరు. కాఁబట్టి దేశక్షేమమును గోరువారందఱును వేగిరపడక యోర్పుతో పనిచేసి ప్రజల హృదయక్షేత్రములలో వేరూని దృఢముగా నాటుకొనియున్న

దురాచారవిషవృక్షములను మెల్లమెల్లగా పెల్లగించుటకు ప్రయత్నము చేయవలెను. దురాచారవృక్ష మెంతబలముగా పెరిగినను వివేకపరశువుయొక్క దెబ్బలచేత మొదలునఱికిన తరువాత తునకకు కూలక మానదు. వర్ణపిశాచ మిప్పుడు మనవారిని దృఢముష్టితోఁ బట్టుకొని వివేకముచెఱిచి మంచిని చెడ్డగాను చెడ్డను మంచిగాను తోఁపించుచున్నది. ఆ పిశాచావేశము వదల్చి మనవారికి సుజ్ఞానము కలిగించుటకయి విద్యామంత్రబీజముల నెల్లయెడల వెదచల్లుచుండవలయును. ఉపన్యాసముల నిచ్చియు పుస్తకములను ప్రకటించియు వర్ణభూతము మనదేశమున కావహించుచున్న యనర్థములన్నియు జనులకు వెల్లడి యగునట్లు చేయవలయును. విద్యాధికు లొక్కొక్క వర్ణములోఁ గల యంతర్భాగముల నన్నిటి నేకముచేయుటకయి ప్రయత్నించుచు విభిన్నశాఖలవారితో సంబంధబాంధవ్యములను భోజనప్రతిభోజనములను జేయుచు నితరులకు దారిచూపుటకై సర్వవిధముల పాటుపడవలయును. విద్యాధికులైనవారు తాము శిల్పాదికళలను నేర్చుకొని వాణిజ్యాదులయందుఁ బ్రవేశించి మూఢశిరోమణులకు భయపడక దేశక్షేమము నిమిత్తమయి ద్వీపాంతరయాత్రలు చేయుచు మరలి వచ్చిన తరువాత ప్రాయశ్చిత్తములకు తలయొగ్గక తమ ధైర్యమును చూపుచుండవలెను. పూర్వాచారములకు విరుద్ధమైన యే మంచిపనికి పూనినను జనులును మతాచార్యులును ద్వేషించి బాధింపక మానరు. ఈ బాధలకు సహించి సుఖాంతగలుగుటకు మనోధైర్యమును భగవద్భక్తియు నవశ్యముగా కావలెను. ఈశ్వరునియెడల దృఢభక్తి లేని పక్షమున ధర్మమునే నమ్ముకొని జనవిరుద్ధముగా సత్కార్యాచరణమునకుఁ బూని నిర్వహించుట సాధ్యముకాదు. కాఁబట్టి సర్వధర్మములకును మూలమైన మతమును పరిశుద్ధపఱిచి తా నీశ్వరునియం దవ్యాజ

మైన విశ్వాసమును కుదుర్చుకొనుటకై దేశాభిమానియైన ప్రతిపురుషుఁడును నిరంతరకృషి చేయవలెను. ఈశ్వరవిశ్వాసము లేనివాఁడేసత్కార్యమును చిరకాలము శ్రమలకోర్చి పూనికతో నిర్వహింపఁజాలఁడు. కాఁబట్టి మనము సర్వసత్కార్యములు నీశ్వరాజ్ఞలని నమ్మి జనుల నిగ్రహానుగ్రహములను పాటింపక యీశ్వరప్రీతికయి యాతని నమ్మిన బంట్లమయి స్వకృత్యమును నిర్వహింపవలయును. మనకట్టి సంపూర్ణ నిశ్చలభక్తియు సత్కార్యానురక్తియు ధర్మాచరణశక్తియు ప్రసాదించుటకై ధర్మస్వరూపుఁడైన యీశ్వరుని మనఃపూర్తిగా ప్రార్థించుచున్నాను.



# హిందూమతములు.



వివేకమహితులగు విహితులారా!

మనము కన్నులార నొక యుత్తమాశ్వమును జూచుచున్నప్పు డది గాడిద యని గాని, కర్ణకఠోరమయిన శబ్దమును వినుచున్నప్పు డది శ్రావ్యనాదమని కాని, యీ రీతిగానే మన మేయింద్రియముచేత నయినను గ్రహించుదానికి విరుద్ధముగా నన్యులెవ్వరైనఁ జెప్పుదు రేని మనము వారి మాటల నెంతమాత్రమును విశ్వసింపఁజాలము; ఇట్లు మన యింద్రియముల ద్వారమున నవ్యవహితముగాఁ గలుగు జ్ఞానము ప్రత్యక్షమనఁబడును, కాఁబట్టి ప్రత్యక్షమునకు విరుద్ధముగా నుండుదానిని దేనినిగాని మనము నమ్మరాదు. లోకములో ప్రత్యక్ష జనిత జ్ఞానమే సర్వోత్తమమయిన దయినను, అన్ని విషయములలోను స్వానుభవముచేతనే నిజమును గనుఁగొనఁ బూనుట యొక్క మనుష్యున కసాధ్యము గనుకను కొన్ని విషయములలో సహేతుకములయిన యూహలచేతనే సత్యమును దెలిసికొనుట సాధ్యమగును గనుకను ప్రత్యక్షమునకు విరుద్ధముగా నుండనంతవఱకు ననుమానప్రమాణమును గూడ నంగీకరింపవలసియున్నది. ఒకఁడు తన జీవితకాలమునంతను ధారపోసి విమర్శించినను స్వానుభవముచేతను యుక్తిచేతను సమస్త విషయములయందును యథార్థజ్ఞానమును సంపాదింపఁగలుగుట సంభవింపనేరదు గనుకను, వెనుకటివారు చర్చచేసి తెలిసికొన్నవిషయములనే మరల సాధించుటకయి ప్రయాసపడి కాలమును వ్యర్థముగాఁ బోఁగొట్టుచుండుటవలన నభివృద్ధి కవకాశము కలుగకపోవును గనుకను, ప్రత్యక్షానుమానములకు విరోధముగా నుండనివఱకావిషయములలో విశేషపరిశ్రమ చేసియున్నవారి నడిగి తెలిసికొనిగాని వారు వ్రాసి

యుంచిన పుస్తకములను జదివిగాని జ్ఞానసంపాదనముచేయుట యత్యం తావశ్యకముగా నున్నది. ఈ కడపట జెప్పినది శబ్దప్రమాణ మనంబడును. జ్ఞానాభివృద్ధి నపేక్షించినయెడల నితరవిషయములయందు దేప్రకారముగా శబ్దప్రమాణ మావశ్యకమగునో యదే ప్రకారముగా మతవిషయమునందును జిరకాలము కృషిచేసి యనుభవశాలులయి ప్రసిద్ధికన్న బుద్ధిమంతులు చేసియున్న పుస్తకసాహాయ్య మవశ్యముగాం గావలసియుండును. అయినను తక్కినవిషయములయందువలెనే యీ విషయమునందును మన యనుభవమునకుం గాని యుక్తికిం గాని పొసంగి యున్నంతవఱకే శబ్దప్రమాణమును గ్రహింపవలసియుండును. ఏ విషయమునందును పలుపురుసమర్థులు వ్రాసిన పలుపుస్తకములను జదివి వారివారి యభిప్రాయములను చక్కఁగా శోధించినంగాని యెవ్వనికో యొక్క గ్రంథమును జదివినంతమాత్రమున యథార్థజ్ఞాన మలవడదు. కనుక మతవిషయమునందును యదార్థమును కనుగొనుటకు యభిప్రాయభేదములుగల యాయా మతకర్తలు వ్రాసిన గ్రంథములను సావధానముగాం జదివి పరిశీలింపవలయును. ఇప్పుడున్న మతములలో హిందూ క్రైస్తవ మహమ్మదీయమతములు ప్రధానములయినవిగా నున్నవి; ఇందులో ప్రతిమతము వారికిని వేఱువేఱుగ వేదము లున్నవి. ఇతరమతములనుగూర్చి తెలిసికొనుటకు ముందు హిందువుల మయిన మనము మన హిందూమతమునుగూర్చి కొంతవఱకైనను తెలిసికొనుట యావశ్యకము. మన మతగ్రంథములలో నెల్ల ముఖ్యమయినదియు హిందువు లంగీకరించే పరమప్రమాణమని చెప్పంబడునదియు వేదము; ఇది మిక్కిలి పురాతనము; దీనియందు ఋగ్యజుస్సామాథర్వణములని నాలుగుభాగములు గలవు. వానిలో పాదనియమముగలిగి ఛందోబద్ధములయి యుండు మంత్రములు ఋక్కులు;

కేవల వచనరూపముగా నుండునవి యజుస్సులు; గానయోగ్యము లగునవి సామములు. మంత్రార్థములను మంత్రములచేత సాధింపఁ దగిన కర్మలను గూర్చిన విధులను దెలుపు వేదభాగములు బ్రాహ్మణము లనఁబడును. ప్రతివిషయమునందును చర్చించినకొలఁదిని జ్ఞానాభివృద్ధి యగుచుండుట సహజము కావుననే యొకవిషయమునుగూర్చి మొదట వ్రాసిన గ్రంథములకంటెఁ బరిశీలనమీఁద తరువాత వ్రాసిన గ్రంథములు శ్రేష్ఠతరములుగా నుండును. మన దేశస్థు లారంభదశయందు వాయువు మొదలగు భూతములను, సూర్యబింబాది మహత్తరపదార్థములను నారాధించుకాలమునఁ బుట్టినవి గనుకనే మన వేదములయొక్క పూర్వభాగమునందు వాయ్వాది భూతస్తుతులును వానినధిష్ఠించియుండు ననుకొన్న దేవతల తృప్తికయి చేయవలసిన యాగకర్మలును మాత్రము ప్రతిపాదింపఁబడి యున్నవి; మనదేశమునందుఁ గ్రమక్రమముగా నాగరికత ప్రబలఁజొచ్చి తత్త్వవిచార మారంభమయిన తరువాత పుట్టిన వేదముయొక్క యుత్తరభాగములయందు విశేషముగాఁ బరబ్రహ్మను గూర్చియు జీవాత్మ పరమాత్మలకుఁ గల పరస్పరసంబంధమును గూర్చియు చర్చింపఁబడియున్నది. బ్రహ్మప్రతిపాదకములయిన యీ వేదాంతగ్రంథముల కుపనిషత్తులని పేరు. వీనిలోఁ గర్మవలనఁ బ్రయోజనము లేదనియు తత్త్వవిచారమే మోక్షసాధనమనియు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. తరువాత మన శాస్త్రకర్తలందఱును కర్మప్రతిపాదకములయిన వేదభాగములను నిరాకరించి బ్రహ్మజ్ఞానబోధకములయిన యుపనిషద్భాగములనే యాధారపఱుచుకొని తమ శాస్త్రములను వ్రాయుటయే యాకాలములోనే కర్మకాండ మంతగా నాదరింపఁబడక జ్ఞానకాండముమాత్రమే గౌరవింపఁబడుచు వచ్చె ననుటకుఁ జాలినంత ప్రబలనిదర్శనముగా నున్నది. ఉపనిషత్తుల

నాధారపఱుచుకొని కపిలుఁడు చేసిన సాంఖ్యశాస్త్రమును, కణాదుఁ డొనర్చిన వైశేషికశాస్త్రమును, గౌతముఁడు రచియించిన న్యాయ శాస్త్రమును, పతంజలికృతమయిన యోగశాస్త్రమును, జైమిని కృతమయిన మీమాంసా శాస్త్రమును, వ్యాసరచితమయిన వేదాంతశాస్త్రమును, షడ్దర్శనములు కాని షట్ఛాస్త్రములని కాని చెప్పఁబడును. ఈ శాస్త్రము లాఱును కొన్ని విషయములలో నేకీభా వముకలవిగా నున్నను, ముఖ్యములయిన బహువిషయములలోఁ బరస్పరవిరోధము కలవిగానే యున్నవి. శాస్త్రములను గావించిన మన పూర్వపురుషులు భగవద్దత్తములయిన ప్రపంచవేదమును, ఆత్మ వేదమును బొత్తిగా పాటింపక, అనఁగా ప్రత్యక్షానుమానప్రమాణ ముల నొకమూలఁ బడవైచి, యధమప్రమాణమయిన శబ్దమునే పరమప్రమాణముగాఁ జేకొని, దానికిఁ దమ మనసు వచ్చినట్లెల్లను కల్పితార్థములను గల్పించి తమ సిద్ధాంతమును స్థాపించుటకయి హేతు కల్పనముచేసి సత్యమునందు దృష్టిలేక తమ పక్షమునే సాధింపఁబూను కొనుటచే నొక్క వేదము నాధారము చేసికొని వ్రాసిన దానిలోనే యిట్టిన్ని భిన్నమతము లుత్పన్నము లగుటకుఁ గారణమయ్యెను. ఇందే దియో యొక్కటియే యుపనిషన్మతమయి యుండవచ్చును గాని యాఱును కానేరవు; ఈ యాఱునుగాక యుపనిషన్మతము మఱి యొకటియైనం గావచ్చును. ఈ యాఱుసిద్ధాంతములయందునుగూడఁ గొన్నిగుణములును గొన్ని దోషములును నుండియుండుటచేత నిందొ కటి యబద్ధమనికాని యొకటి నిబద్ధమనికాని నిర్ధారణము చేయు టకు వీలులేదు. ఈ చెప్పిన షణ్మతములవారునుగూడ ఆత్మనిత్య మనియు, ఇంద్రియగోచరములగు వస్తువులకు మూలాధారములయిన యణువులు నిత్యములనియు, ఆత్మకు దేహసంబంధ మున్నప్పుడు

మాత్రము జ్ఞానాదిశక్తు లుండుననియు, శరీరముతోఁ జేరుటవలన నాత్మకు బంధముకలిగి శుభాశుభకర్మలఫలము ననుభవింపవలసి వచ్చుననియు, పుణ్యపాపఫలానుభవము స్వర్గనరకములయందలి సుఖ దుఃఖములతోఁ దీఱక నీళ్ళు పోయినతరువాత కుండనంటియుండు పాచి వలె నిలిచియుండుననియుఁ దాని ననుభవించుటకై జీవుఁడు మరల మరల జన్మము లెత్తవలసి యుండుననియు, అన్నివిధములైన కర్మ లును జీవునకు బంధహేతువులై జన్మపరంపరను గలిగించును గనుక మోక్షము నపేక్షించువాఁడు శుభాశుభకర్మములను గోసి కాంచనము నందును కాష్ఠమునందును, పుత్రునియందును శత్రునియందును సమ బుద్ధి గలిగి దేని నంటించుకొనక మెలఁగవలయు ననియు, చెప్పు చున్నారు. మనలోని యన్నిమతములవారును పూర్వోత్తరజన్మముల నంగీకరించి యదృష్టమని యొకదానిని చెప్పుచుండుటచే నెల్లవారును పూర్వజన్మకర్మవశమున నగుఁ గావలసిన యోగమున్నఁ దనంతట నదియే యగునని ప్రతికార్యమునకు నదృష్టమునే నమ్ముకొని యే సత్కార్య నిర్వాహణము కొఱకును శ్రద్ధ పుచ్చుకొని పాటుపడక యుపేక్షాపరు లయి కాలమును వ్యర్థముగాఁ బోఁగొట్టుచు నభివృద్ధి లేక పామరు లయి పాడగుచున్నారు. మనకుఁ బూర్వజన్మ మున్నయెడల వెనుకటి పుట్టువునందుఁ జేసిన సంగతులలో నొక్కటియైన నేల యీజన్మమున స్మరణమునకు రాకపోవునని యాలోచింపరు. అయిన నీవిషయమును గూర్చి యింకొకసారి ముచ్చటింపఁదలఁచి యుండుటచేతను, ప్రస్తు తము చెప్పఁదలఁచుకొన్నవిషయముతో నిది యంతగా సంబంధించినది కాకపోవుటచేతను, దీని నిప్పటికి విడిచిపెట్టుచున్నాను. ఈ యాఱు మతములలోను విస్తారముగా నిప్పుడు వ్యవహారములో నున్నది వ్యాససిద్ధమైన వేదాంతమత మొక్కటియే. కాఁబట్టి తక్కినమతముల

స్వాహాకథనమును సంగ్రహముగాఁ జెప్పి పిదప దానిని కొంత వివరించెదను. పేరునకు భిన్నములుగాఁ గనఁబడినను సాంఖ్యయోగమతముల సిద్ధాంతము లించుమించుగా నొక్కటిగానే యుండును. ఈ యుభయమతములవారును ప్రకృతి స్వతంత్రమయిన దనియు, అదియే జగత్కారణమనియు, ఆత్మ వేఱైనను దానికి ప్రకృతితోడి యనాది బంధము కలిగియున్నదనియు, ప్రకృతిపరిణామమే బుద్ధియనియు దాని కర్తృత్వ మాత్మయం దారోపింపఁబడునదనియు, బుద్ధి యింద్రియముల ద్వారమునఁ బరిణమించుటనే తెలివియనియు, పురుషునకును ప్రకృతికిని భేదమున్నను వివేకము కలుగుటవలన సంసారము నశించి మోక్షము వచ్చుననియుఁ జెప్పుదురు. వీరిలో సాంఖ్యమతము వారీశ్వరు డున్నాఁ డని యొప్పుకొనరు; యోగమతము వారీశ్వరుని యునికి నొప్పుకొందురు గాని యాతని ప్రాముఖ్యము నొప్పుకొనరు. గనుక, అనుష్ఠానమునం దీ రెండుమతములకును భేదమంతగాఁ గనఁబడదు. ఇదిగాక యోగమతమునకు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులను అష్టాంగములు గలవు. ఇందులో ప్రాణాయామమువలనఁ జిరకాలజీవనమును నాంతరదృష్టిచేత బ్రహ్మైక్యమును గలుగునను భ్రమపడి యోగులు రేచక, పూరక, కుంభకములను నానాప్రకారములచేతను నూపిరి బిగఁబట్టి వృథాభ్యాసమును సలుపుచు కాలమును వ్యర్థపుచ్చుచున్నారు. ఇప్పుడు యోగమతము నవలంబించువారు యోగశాస్త్రమునఁ జెప్పఁబడని వివిధకష్టములకులోనై చేతులు మీఁదికెత్తి నిరుపయుక్తముగ నట్టగా నెండఁగట్టుచు గోళ్ళను మిక్కిలి పెంచి వేళ్ళను వ్యర్థపఱుచుచు తాము మహానుభావులైనట్టు మూఢులకు భ్రమకలుగఁజేయుచున్నారు. ఇఁక న్యాయశాస్త్రమును, వైశేషికశాస్త్రమునుగూడ

నొకరీతిగానే యుండును. కాఁబట్టి వైశేషికశాస్త్రము న్యాయశాస్త్రముయొక్క భాగముగా జెప్పుటయే యుచితముగాఁ గనఁబడుచున్నది. న్యాయశాస్త్రమునందు విస్తారభాగము తర్కమును గూర్చినదయి యుండును గనుక మనపండితులు సాధారణముగా దాని నభ్యసింతురు; ఈ న్యాయవైశేషికశాస్త్రములు రెండును పదార్థములను గూర్చి, యుక్తివాదరీతులనుగూర్చియు ముచ్చటించును. గౌతమసూత్రములయం దొక చోట నీశ్వరనామ ముదాహరింపఁబడినను, ప్రపంచ మీశ్వర నిర్మితమనికాని చరాచరములయిన సమస్తపదార్థములను నమపువాఁ డీశ్వరుఁడనిగాని యెచ్చటను జెప్పఁబడి యుండలేదు; వేదము సత్యమఁమాత్రము ప్రతిపాదింపఁబడి యున్నది. కాణాదసూత్రములయందెచ్చటను నీశ్వరనామమే యుచ్చరింపఁబడలేదు; వేద ప్రమాణ మంగీకరింపఁబడినది. ఈ యుభయమతములయందును ప్రపంచ మణుసంయోగమువలనఁ గలిగినదనియు, ఆ యణువులు సృష్టింపఁబడనివయి నిత్యములయి యదృష్టవశమున సంయోగమును బొందినవనియు, జీవులుకూడ నపరిమితములును నిత్యములు ననియు, జీవుఁడు దేహమున కధిష్ఠాతయనియు, జీవుడు వేదోక్త కర్మములవలన నాత్యంతిక దుఃఖనివృత్తి చేసికొని పిమ్మట సుఖముగాని దుఃఖముగాని పొందకుండు స్థితియే ముక్తియనియుఁ జెప్పఁబడి యున్నది. ఈ ముక్తి రాళ్లు మొదలైన యచేతనపదార్థముల కిప్పు డున్నస్థితికంటె మేలయినదికాదు. కాఁబట్టి దీని నితరమతములవారు పాషాణముక్తి యని యాక్షేపింతురు. అయినను న్యాయశాస్త్ర వ్యాఖ్యాతలును తరువాత న్యాయవైశేషికమతవిషయమున గ్రంథములు వ్రాసినవారును పరమేశ్వరునియునికి నొప్పుకొని జగత్తులకుఁ బరమాణువు లుపాదానకారణములనియు, నీశ్వరుఁడు నిమిత్తకారణ

మనియు, జగము సావయవముగాన నది యొకరిచే సృష్టింపఁబడవలయు ననియు, అట్లు సృజించినవాఁడు కర్మవశుఁడయి పరిమితజ్ఞానముగల జీవులకంటె విలక్షణుఁడయి సర్వశక్త్యాదులు గలవాఁడని యనుమానము చేతఁ దెలిసికోఁబడుచున్నాఁడనియు చెప్పుదురు. గాని ముక్తివిషయ మున మాత్రము గౌతమకణాదులతోడనే యేకీభవింతురు. జైమిని ప్రణీతమయిన మీమాంసాశాస్త్రము నొకమతముగాఁ జెప్పుటకే యవకాశము కనఁబడదు. వ్యాసవిరచితమయిన వేదాంతశాస్త్రమునకుఁ గూడ మీమాంసయను వ్యవహారము గలదు. గాన దీనిని పూర్వమీ మాంస యని కాని కర్మమీమాంస యని కాని చెప్పుదురు. దీనియందు తత్త్వవిచారమే లేదు; ఈశ్వరుఁడున్నాఁడా లేఁడా యను సంశయమె క్కడను గానఁబడదు. అందు బ్రాహ్మణములచేతను మంత్రములచేతను జెప్పఁబడిన కర్మలనుగూర్చి విశేషముగా వ్రాయఁబడి వాని యాథావివ రణము చేయఁబడియున్నది. ఈ మీమాంసాశాస్త్రము వేదవిహిత కర్మ చేయుటయే పరమార్థమనియు, శబ్దము నిత్యమనియు, దాని యందు మహత్త్వము గలదనియు బోధించుచున్నది. ఈ మతములోఁ జేరిన భాట్టులు వేదవిహితములయిన యజ్ఞాదికర్మలను ఫలాపేక్షలేక చేయుచో కర్మసంబంధవృత్తిపూర్వక మోక్షము గలుగుననియు, వేదమంత్రమే దేవతగాని ఫలమునిచ్చు చేతనుఁడగు దేవుఁడు ప్రత్యే కముగా లేఁడనియుకూడఁ జెప్పుచున్నారు. ఇప్పు డావలదయిన వేదాంతశాస్త్రము సంగతి విచారింతము; ఇదియే యుత్తరమీమాంస యనియు బ్రహ్మసూత్రము లనియు వ్యవహరింపఁబడును. దీనికి శంక రుఁడును, రామానుజుఁడును, మధ్వుఁడును ప్రత్యేకప్రత్యేకముగా మూఁడు భాష్యములను జేసి వరుసగా నద్వైత విశిష్టాద్వైత ద్వైత మత ములను స్థాపించియున్నారు. ఇందేదియైన నొక్కటియే వ్యాసమత

మయి యుండవలయును గాని మూఁడును గానేరవని యెల్లవారును సులభముగా నూహించి తెలిసికోవచ్చును. అయిన నిందిదియే వ్యాస మతమని నిశ్చయింప వలనుపడదు. త్రిమతభాష్యకారులును వ్యాస సూత్రముల ననుసరించియే భాష్యములను వ్రాసియున్నారు. గాన ప్రతిమతమువారును గొంతవఱకు వ్యాసమతము నవలంబించువారు గాను గొంతవఱకు నిరాకరించువారుగాను గూడ నుండవచ్చును. అది యెట్లయినను త్రిమతములలోను నద్వైతము మిక్కిలి పురాతన మైనదగుటచేతను జనబాహుళ్యముచే ననుసరింపఁబడుచున్న దగుట చేతను, ముందుగా నద్వైతమతమును గూర్చి కొంతముచ్చటించెదను.

సాంఖ్యయోగశాస్త్రములయందు ప్రపంచము ప్రకృతివలనఁ గలిగిన దనియు, న్యాయవైశేషికశాస్త్రములయందు జగత్తు కేవ లాణుసంయోగమువలననే కలిగినదనియు, వేదాంతశాస్త్రమునందు ప్రపంచ మసత్తే యనియుఁ జెప్పఁబడియున్నది. అదియందు వేదాంత శాస్త్రమున బ్రహ్మమొక్కటియే యున్నదనియు. అది సత్యమును, జ్ఞానానందాత్మకమును. నిర్వికారమును, నిరవయవమును, నిత్యమును, నిర్దోషమును, సర్వవ్యాపకము ననియు జగత్తు పారమార్థికముగా సత్యము కాకపోయినను వ్యావహారికముగా సత్యమే యనియుఁ జెప్పఁ బడియున్నది. అటుతరువాతివారు ప్రత్యక్షముగా కనఁబడుచున్న జగత్తు నసత్యమని చెప్పుటకుఁగాని యీ యపవిత్రమయిన జగత్తు పరిశుద్ధమయిన బ్రహ్మమునుండి పుట్టినదని చెప్పుటకుఁగాని తోఁచక మధ్య నవిద్య యను మాయ నొకదానిని సృష్టించి బ్రహ్మ మును దానికి లోఁబఱిచినారు; అట్టి యవిద్య మిథ్యాభూత మయిన దనియు, జడమును, సవికారమును, సావయవమును, సాంతము ననియు ననాదియనియు, దాని కాచ్ఛాదకశక్తియు, విక్షేపకశక్తియు,

నని రెండుశక్తులుగలవనియు, జీవులన్నియు బ్రహ్మమే యయినను అవిద్యయొక్క యాచ్ఛాదకశక్తిచే స్వస్వరూపమును మఱచి విక్షేపకశక్తిచేత రూపభేదమున్నట్టు భ్రాంతిపొందుననియు, తత్త్వమసీత్యాది శ్రుతివాక్యజన్యజ్ఞానమువలన నవిద్య నివర్తించి స్వతస్సిద్ధజ్ఞానము మరల నుదయించుటయే మోక్షమనియు శంకరాచార్యులవారి మతము. అద్వైతులు పరబ్రహ్మము నొప్పుకొన్నవారయినను బ్రహ్మము తనకంటె వేఱయినది కాదందురు. గనుక భగవంతుని యాజ్ఞకు లోఁబడి యాతని నుపాసించుట పొసఁగనేరదు గనుక భగవంతుఁడు లేఁడను నాస్తికులకును వీరికిని నంతగా భేదము కనఁబడదనియు, వీరును ప్రచ్ఛన్నబౌద్ధులే యనియు నితరమతములవారు వీరిని పలువిధముల నాక్షేపించియున్నారు. ఈ యద్వైతులలో సంక్షేపకమతమువారు సూర్యుఁడు ఘటతటాకాదులయందుఁ బ్రతిఫలించునట్లే పరబ్రహ్మమును దేహముల యంతఃకరణములయందుఁ బ్రతిఫలించుననియు, ఘటాదులయందు పెక్కు సూర్యబింబములవలె నగపడునట్లుగానే యంతఃకరణములయందు బ్రహ్మము పెక్కురూపములుగా దోఁచుననియు ఆకాశమునందలి సూర్యబింబమునకును ఘటాదులయందలి ప్రతిబింబములకును భేదము లేనట్లే బ్రహ్మమునకును దేహములయందలి జీవులకును నభేదమనియు చెప్పుచున్నారు. ఘటాదులయందు సూర్యబింబము ప్రతిఫలించునట్లే దేహములయందు బ్రహ్మము ప్రతిఫలించుననుపక్షమున, ఘటాదులయందు సూర్యబింబ మేప్రకారముగా లేదో యదే ప్రకారముగా దేహములయం దాత్మలు లేకపోవచ్చుననియు, అవి ఛాయవలె మిథ్యాభూతములగునేని వానికి జ్ఞానముగాని తత్త్వవిచారముగాని లోకవ్యాపారముగాని యెట్లు సంభవించుననియు పూర్వపక్షులడుగుదురు. అద్వైతమతాంతర్గతములగు యాదవ

భాస్కరమతములయందు శంకరమతమునందు కంటెఁ గొన్నివిషయములయందు భేదమున్నను మెట్టుమీఁద నన్నియు జీవేశ్వరులకు భేదము లేదనుటలో నేకీభవించుచునే యుండును. జీవేశ్వరులకు భేదము లేనిపక్షమున నేకకాలముననే యొకఁడు సుఖ మనుభవించుటయు నొకఁడు దుఃఖ మనుభవించుటయు నెట్లు పొసఁగుననియు, అట్టి సుఖదుఃఖములు దేహసంబంధమువలనఁ గలుగు ననునెడల దేహమును విడిచినతరువాత నద్వైతసిద్ధాంతప్రకార మొక్కఁడు ముక్తుఁడగునయు మఱియొక్కఁడు కాకపోవుటయు నెట్లు సంభవించుననియు యితరమతములవారు చేయు నాక్షేపణములన్నియు నన్నిశాఖలకును సమానముగానే పట్టును.

అద్వైతమతమునకు తరువాత ముఖ్యముగా వ్యాపకముగానున్నది విశిష్టాద్వైతమతము. ఈ మతాచార్యులగు రామానుజాచార్యులవారు వ్యాసుని వేదాంతశాస్త్రమునకు తామును తమ మతానుసారియయిన భాష్యమును వ్రాసి జీవునకును నీశ్వరునకుగల గుణములే యుండును గాని పరమాత్మకు లోఁబడియుండుననియు, ఆ యీశ్వరుఁడే విష్ణువనియు, అతనికి దివ్యమంగళవిగ్రహము కలదనియు, మోక్షస్థానము వైకుంఠమనియు స్థాపించియున్నారు. శైవవిశిష్టాద్వైతము నిదే ప్రకారముగా నుండును గాని యీ మతమువారు శివుఁడే పరతత్త్వమనియు మోక్షస్థానము కైలాసమనియు జెప్పుదురు. ఈ మతభాష్యకర్త నీలకంఠాచార్యుఁడు.

వేదాంతశాస్త్రమునకు మధ్వాచార్యులవారుకూడ నొకభాష్యమును జేసి ద్వైతమతమును స్థాపించియున్నారు. ఈ మతమువారును జీవేశ్వరులకు భేద మొప్పుకొని, ఈశ్వరుఁడు విష్ణువనియు, జీవులు పరస్పరవిలక్షణములయిన వనియు, ఈశ్వరునకు రూపము కలదనియు,

జీవులును పరలోకమునందుఁగూడ పూర్వరూపతుల్యమయిన రూపముతోనే పరమపదము పొందుదురనియు చెప్పుదురు. వ్యాసమతము ననుసరించి పుట్టిన యీ మూడుమతములును త్రిమతము లనఁబడును. అద్వైతమునందు జీవేశ్వరుల కభేదమని సాధించుట యెంతకష్టమో, విశిష్టాద్వైతమతమునం దీశ్వరునకు రూపమును, భార్య మొదలగు వారును గలరని సాధించుటయు, ద్వైతమతమునందు జీవులకుఁగూడ మరణానంతరమునఁ బూర్వదేహసదృశదేహములు గలవని సాధించుటయు నంత కష్టముగానే యుండును.

ప్రత్యక్షానుమానప్రమాణములను వదలివేసి యొక్క శబ్దప్రమాణముచేతనే దైవస్వరూపాదులను స్వేచ్ఛానుసారముగా సాధింపఁ దలంచుకొన్నందుననే మతవిషయములందు నిటువంటి విపరీతాభిప్రాయములు కలుగునని యీవఱకే చెప్పియున్నాను గదా? తక్కిన సమస్తవిషయములయందును స్వానుభవమును బుద్ధిని మన మెట్లుపయోగింతుమో మతవిషయములయందుఁగూడ నిజమును గనుఁగొనుటకయి మన యనుభవమును బుద్ధిని తప్పక యుపయోగింపవలెను. మిత్రులారా! మీరెప్పుడును బ్రహ్మల మగుదుమని కలలోను భ్రమింపఁబోకుఁడు. పరబ్రహ్మమునకును మనకును గల తారతమ్యము పర్వతమునకును పరమాణువునకును గల యంతరమునకన్నను కోటిరెట్లు హెచ్చయినదిగా నుండును. అతఁడు సర్వజ్ఞుఁడు; మనము మన వెనుకనుండియే యొరులు వెక్కిరించుచున్నను తెలిసికోఁజాలనివారము. అతఁడు సర్వశక్తుఁడు; మనము మనకుఁ గావలసిన వస్తువులనే సంపాదించుకోలేక యశక్తులముగా నున్నాము. మనకు యథార్థమయిన జ్ఞానమును కరుణించి సత్ప్రవర్తనము గలవారినిగాఁ జేసి రక్షించుటకు భగవంతుని ప్రాపుదక్క మనకు

వేఱాధార మేదియు లేదు. అశక్తులమయిన మనకు వలెనే సర్వశక్తుఁడై యీశ్వరుఁడును పనిచేయుటకు కరచరణాద్యవయవములు కావలయుననియు, మనవలెనే యీశ్వరుఁడును భార్యాసంగమాది తుచ్ఛసుఖముల కాశపడుననియు భ్రమింపక, అతఁడు నిరాకారుఁడనియు నిర్వికారుఁడనియు నానందస్వరూపుఁడనియుఁ దెలిసికొని, నిశ్చలభక్తిచే నిరంతరము నాకరుణాస్వరూపుని నుపాసింప యత్నింపుఁడీ. ఓ సర్వకారుణ్యా! ఓ భక్తవత్సలా! భక్తులమయిన మా ప్రార్థన లాలించి, మా హృదయము లెల్లప్పుడును నీధ్యానమునందే తగిలియుండునట్లును సచ్ఛాస్త్రాచరణమునందే యాసక్తములయి యుండునట్లును జేయుము. ఓ జీవజనపోషకా! దీనులమయిన మమ్ము నీయందను జేర్చి పాపులమగుటచే నిన్నుఁ జేరుటకు భయపడుచున్న మా జడుపు దీర్చి యభయ మిచ్చి రక్షింపుము.



# స్వయంకృషి



By

**K. VEERESALINGAM**

45

# స్వయంకృషి

మనము లోకములో సస్యముల విషయమునఁగాని ఫలవృక్షముల విషయమునఁగాని కృషిచేయుటవలనఁ గలుగవలసిన ప్రయోజన మంతయు సస్యాదులు చక్కఁగా పెరిగి ఫలము నిచ్చుట యయియున్నది. ఆ ప్రకారముగానే మనము స్వవిషయమునఁ గృషి చేయవలెనన్నను, మన మభివృద్ధి చెంది లోకమున కుపయోగపడునట్లు చేయవలెననియే కాని వేఱుకాదు. మొట్టమొదట స్వతస్సిద్ధముగా పెరిగెడి స్వభావము దానియందున్నచో కాని, ఏ వస్తువునుగాని మనము పెంచుటకు శక్తులము కానేరము. మన మొక వృక్షమును దోహదము చేసి పెంచఁగలము గాని యొక యెండుమోడు నెప్పుడును పెంచుటకు శక్తులము కాము. ఆ రీతినే మనము స్వయంకృషి చేయవలయునన్నచో మన యీశ్వరుఁడు ప్రసాదించియున్న నానాంకురాదుల నభివృద్ధి పఱుచుకోవలయు ననుటయే కాని స్వభావముచేత మనకు లేనివానిని క్రొత్తగా తెచ్చిపెట్టుకోవలయుననుట కాదు. అయినను సస్యాదుల యభివృద్ధికిని మనయభివృద్ధికిని మిక్కిలి వ్యత్యాసమున్నది. వానికివలె మనకు పాంచభౌతికమైన శరీరమొక్కటియే కాక తద్విలక్షణమైన యాత్మకూడ నుండియున్నది. మనకుఁగల జ్ఞానాదిశక్తులు ప్రత్యేకముగా నాత్మతోడనే సంబంధించినవి. ఈ జ్ఞానాది శక్తులచేతనే మనము వృక్షాది జడపదార్థములనుండియే కాక పశుపక్ష్యాది సమస్తేతర జంతువులనుండియు భేదపడియెదము. మనుష్యుఁడు సృష్టిలోని పదార్థములలో నెల్లను శ్రేష్ఠుఁడనుట నిర్వివాదాంశము; ఆ శ్రేష్ఠత్వమునకుఁ గారణము జ్ఞానసంపద కలిమియేయనియు సర్వానుభవసిద్ధమయిన రాద్ధాంతాంశమే. పశుపక్షివృక్షాదులకును మనకును

సామాన్యమయిన భౌతికదేహ మాహారముచేతనే పెరుగఁదగినది; అట్టిదేహము నొక్కదానినే పెంచుకొనుటవలన వానికంటె మన కాధిక్య మెంతమాత్రమును గలుగఁబోదు. మనము జ్ఞానదేహము నెంతయభివృద్ధి పొందించుకొన్న మనకంత యాధిక్యము కలుగును. కాఁబట్టి యిప్పుడు నేను చెప్పఁబోయెడు స్వయంకృషియంతయు ముఖ్యముగా నాత్మాభివృద్ధితోడ సంబంధించినదిగానే యుండును. స్వయంకృషి చేసి యభివృద్ధి పొందుటవలనఁ గలుగవలసిన ఫలము సుఖానుభవము. మృగాదులు తాత్కాలికానుభవమునుమాత్రమే చూచుకొనును గాని ముందుసంగతి విచారించుకోవలయునను జ్ఞానము వానికెంతమాత్రమును లేదు. ఒక గోవునకు విస్తారముగా గడ్డి వేసితిమేని, అది తనకప్పుడు కావలసినంత తిని, తక్కిన దానిని త్రొక్కి పేడవేసి పాడుచేయునే కాని తినఁగా మిగిలిన దానిని మఱునాటి దినమునకు భద్రపఱుచుకొనుటకై లేశమును బ్రయత్నింపదు. మనుష్యుఁ డొక్కఁడే యిప్పటి సుఖమును మాత్రమే కాక భావికాలమునందలి సుఖమును గూడ దృష్టియం దుంచుకొని దానిని కాపాడుకొనుటకయి ముందుగానే తగిన సదుపాయములను విచారించువాఁడు. కాఁబట్టి లోకములో బుద్ధిమంతుఁడైన వాఁడెప్పుడును తాత్కాలికతుచ్ఛసుఖములయందే తగిలియుండక యిప్పటి యల్పసుఖములను గొన్నిటిని మానుకొనియైనను ముందు రాఁబోయెడు గొప్పసుఖమునకై పాటుపడుచుండును. ముందుసంగతిని బొత్తిగా విచారింపక యీ కాలపు చిఱుసుఖములతోడనే తృప్తినొంది యుండువాఁడు మూఢుఁ డనఁబడును; అట్టివానికిని మృగాదులకును జ్ఞానసంపదయందు విశేషభేద ముండదు. అల్పసుఖములను పాటింపక యధికసుఖమునకై శ్రద్ధ వహించుట బుద్ధిమంతుల లక్షణమని సూచించి యున్నానుగదా? ఇప్పుడు లోకములోని వారందఱును ధనలాభ మపేక్షించియో, ఇంద్రియసుఖము

లను గోరియో, ప్రఖ్యాతి కాసించియో, ధర్మబుద్ధి గలిగి పరలోక మును కాంక్షించియో తమ కాలమును గడుపుచుందురు. ధన మెప్పు డును మన సుఖమున కనుకూలమయిన పదార్థములను సంపాదించుకొ నుటయం దుపయోగపడునే కాని ప్రత్యేకముగా సుఖసాధనము కాదు. కాఁబట్టి మన సుఖభోగాదుల కక్కఱకు వచ్చునంతవఱకే ధనము ప్రయోజనకరమగును. ఈ సంగతిని విచారింపక కొందఱు మూఢా త్ములు ధనాశచేత నేలాగునో దానిని సంపాదించి పెట్టెలలోనో మఱివేఱుచోటనో దానిని భద్రపఱచి, తా మనుభవింపకయు నితరు లకు పెట్టకయు దరిద్రులతో సమానముగా కష్టజీవనమును చేయు చుందురు. అట్టివారిసంగతి నిక్కడ విడిచిపెట్టి భోగత్యాగముల నిమి త్తము ధనమును సంపాదింపఁ బ్రయత్నించువారిమాటే యిక్కడ విచారింతము. ధనార్జనముతప్ప వేఱుచింత లేని వారెప్పుడును కొన్ని యక్రమములకు లోఁబడక విశేషవిత్తమును పోగుచేయఁజాలరు. అట్టివారి నొంటిగా నున్నప్పుడును పూర్వము చేసిన కార్యములు తలం పునఁ బొడిన ప్పుడును అంతరాత్మ బాధించుచుండును గనుక వారు నిజమయిన సుఖము ననుభవింపఁజాలరు; ఒకానొకప్పుడు ధనాశచేత చెడుపనులకు లోనయినను ధనము లభింపక మనస్తాపము సంభవింప వచ్చును; ఫలకాలము వచ్చునప్పటికి సంపాదించిన ధనమునకు ఱెక్కలువచ్చి మనయొద్దనుండి యెగిరిపోయి దొంగలపాలో యితరుల పాలో కానైనను కావచ్చును; లేదా యనుభవించుకాలము వచ్చు నప్పటికి మధ్య నాకస్మికముగా మృత్యుదేవత యడ్డమువచ్చి మన ధనమునకును మనకును నెడఁబాటు కలిగించి మనల నీ లోకము నుండి యెగవెత్తుకొని పోవచ్చును. కాఁబట్టి చక్కఁగా విమర్శించి చూడఁగా ధనమువలనఁ గలిగెడి సౌఖ్యము నిక్కలి యస్థిర మయిన దనియు నల్పమయిన దనియుఁ దేటపడుచున్నది. అందుచేత

బుద్ధిమంతుఁడయినవాఁడు ధనార్జనమే పరమప్రయోజన మని నమ్మి కొని యందునిమిత్తమే తన యమూల్యమైన జీవితకాలమును ధార పోయుట యుక్తమయిన పనికాదు. ఈ ప్రకారముగానే కేవలము నింద్రియసుఖములనిత్తమే కాలము పుచ్చుటయు నుచితకార్యముగా గనఁబడదు. ఇంద్రియసుఖములు మృగాదులకును మనకును సామా న్యములే యనియు, మనుష్యుల మగుటచేత మన కావశ్యకములుగా నేర్పడిన ధర్మములను పాటింపక విషయసుఖములయందే యాసక్తుల మయి యున్నచో మృగాదులకన్న మన కెక్కువ మేలిమి రానేర దనియు ఈ వఱకే చెప్పియున్నాను. ఆ యల్పసుఖమయినను చిరకాల ముండునని నమ్ముటకయిన వీలులేదు. ప్రతిదినమును సూర్యుఁ డుద యించి యస్తమించులోపల లక్షలకొలఁది జనులు మృతినొందు చుందురు. ఎప్పుడో యే నిమిషముననో మనమును ప్రపంచములోని సర్వము విడిచిపెట్టి లోకాంతరగతులము కావలసినవారమే యగు దుము; మన శక్తియంతయు వినియోగపఱిచి యింద్రియసుఖసాధన ములకయి పాటుపడి వానిని సంపాదించుకొనువఱకు వానికిని మనకును వినియోగము కలిగి సుఖమునకు మాఱుగా బహుతరముగా దుఃఖము సంభవించుచుండుటయు తటస్థించుచున్నది; ఒకవేళ నప్పటికి సుఖము గానే కనఁబడినను కొన్నివిషయములలో నా సుఖమంతయు కడపట దుఃఖముగానే పరిణమించుటయుఁ గలదు. ఇప్పు డీదేశములో నతి భోజనము, అతిపానము, అతిసంభోగము, ఇంద్రియసుఖములలో నెల్లను సర్వసాధారణములయి యున్నవి. ఈ యతిభోజనము యాచ్ఞావృత్తి వలననే జీవనముచేయు బ్రాహ్మణులలో నధికముగాఁ గనఁబడు చున్నది; వారు యాచ్ఞావృత్తి యెంతమాత్రమును హేయమయిన దని తలఁపకపోవుటయే కాక మీఁదుమిక్కిలి యా వృత్తియే మిక్కిలి గౌరవావహమయిన దని యెంచి సంతోషమును పొందుదురు; ఒక్క

పూట తిండికయి గ్రామము విడిచి పొరుగూళ్ళకు సహితము పోవు దురు; వారు కడుపే కైలాసమని యెంచుకొని లోకములో జన్మిం చుట యెల్లను తిండికొఱకే యని వేఱుచింత లేక యుందురు; సంతర్ప ణములును సమారాధనలును జరుగునప్పుడు మనము కొంచెము శ్రమ చేసి యా మార్గమున వెళ్ళుదుమేని, అతిభోజనము చేసి యాయాప పడుచు నడవలేక నడుచువారిని, నేయియు భక్ష్యములును నధికముగా భుజించి కడుపునొప్పిచేత వీధియరుగులమీఁద పడి పొరలు వారిని మన మనేకులను చూతుము. అప్పటి వారిస్థితిని జూచినప్పుడు మృగముల స్థితియైనను అంతకంటె కొంత మేలయినదే యని తోచవచ్చును. ఏ మృగముగాని మితము తప్పి తిని బాధపడుచుండఁగా మన మెప్పు డును జూచియుండలేదు. భోజన మొక్కటియే పరమార్థ మనుకొను వారికిఁ గల యితరకష్టములును మృగాదులకు లేవు. కష్టపడ నక్కఱ లేకయే విస్తళ్ళు వేసి వడ్డించి యుంచినట్టుగా భగవంతుఁడు మృగాదుల కాహారము నెల్లయెడల నమర్చియున్నాఁడు; ఒకయావు గడప దాటి వెళ్ళినచో పాకము చేసికోవలసిన శ్రమతో పనిలేక మేయుటకుఁ గావ లసినంత పచ్చిక సిద్ధముగా నుండును. బీదలగు బ్రాహ్మణుల స్థితి యిట్లుండఁగా ధనికులయిన నానాజాతులవారిలోను పలువిధములయిన రోగముల కాకరములయిన మధురాహారాదుల నతిమాత్రముగా భుజించి నిజమయిన సౌఖ్యమునకు దూరులయియుండుటయు ప్రబలియే యున్నది. అతిభోజనమునకంటెను సహస్రగుణముల నష్టము నాపా దించుచు నంతకంతకు సురాపానము మనదేశములో మిక్కిలి వ్యాపించు చున్నది. ఈ క్రైస్తవప్రభుత్వము మన దేశమునకు రానప్పుడీ విషయ మున మనదేశము తక్కినదేశములకంటె మిక్కిలి మంచిదశయందే యుండి యున్న దనుటకు సందేహములేదు. అప్పుడు మనపూర్వులు పల్లెల యందుసహిత మిా కాలమందు వినఁబడు ద్రాక్షాసవాదుల పేరునైనను

విని యుండరు; మనపెద్దలు సురాపానము మహాపాతకముగా నేర్పఱచి పానమూర్ఖులతో సహవాసము చేసినవారిని సహితము మహాపాతకుల లోనే గణించుచు వచ్చినందున త్రాగుఁబోతుతన మాకాలములో మిక్కిలి తక్కువగానుండెను. ఈ హూణప్రభుత్వము మనదేశమున వ్యాపించిన తరువాత ఈ దేశపు సారాయములుమాత్రమే కాక యిచ్చటి వారల కడుపులను పవిత్రము చేయుటకయి వివిధనామములు ధరించిన యన్యదేశీయసారాయములు సహితము నెలకు నాలుగుసారులు ఓడల కొలఁది బుడ్లతో పంపఁబడుచున్నవి. ఏ దేశమునందుఁగాని సాధారణ ముగా జరుగు నేరములలో సగముపాలు త్రాగుఁబోతులవలనఁ జేయఁ బడినవిగానే యుండును. సమస్తదోషములకును కుదురయిన యీ వ్యా పారమును దొరతనమువారే ప్రోత్సాహపఱుచుచుండుట చూడ నెంతయు వింతగానున్నది. నేరములు జరిగిన తరువాత దోషులను పట్టి శిక్షించుటకంటె నేరముల యుత్పత్తికారణమును కనుఁగొని దానిని వారింపఁ బూనుకొనుట దొరతనమువారికి ముఖ్యకర్తవ్యము. తమకు విధియైన కృత్యమును చేయక యుపేక్షించుచున్నారు కనుక, మన దేశస్థులందఱును జేరి యీ వ్యాపారము సమస్తజనులలోనుకూడ వ్యాపించి మిక్కిలి ముదురక మునుపే ప్రభుత్వమువారికి సంఘవిజ్ఞాప నలను బంపి త్రాగుఁబోతుతనమును నిర్మూలించుటకయి తగిన ప్రయ త్నము చేయవలయును. మఱియు మన ధర్మశాస్త్రములే పురుషుఁడు బహుభార్యలను జేసికొనుట కనుజ్ఞ నిచ్చుచున్నవి. అయినను, అందు వలనఁ గలిగెడి నష్టము సంస్థానాధిపతులలో కొందఱికేగాని జన సామాన్యమున కంతగాఁ గలుగుచుండలేదు. ఏమి కాలధర్మదోష ముననో కాని చిరకాలమునుండి మనదేశములో వ్యభిచారమునకయి ప్రత్యేకముగా నేర్పడి భోగస్త్రీలను పేరుగల యొకజాతిస్త్రీలు పరంప రగా వచ్చుచున్నారు. అట్టివారికి నిరుత్సాహమును కలిగించుటకు

మాఱుగా కొంచెము ధనముగల మనవారు పలువురు వేశ్యల నుంచుకొనుటచేతనే ప్రతిష్ఠను వహించుచున్నారు. వేశ్యల నుంచుకొన్నవారికి పూర్వకాలములయందు రాజస్థానములలో గౌరవము లేకపోవుటంజేసి యిప్పుడెవ్వరో నీచులు తప్ప నలుగురిలోను తలయెత్తుకొని తిరుగఁదలఁచిన వారెవ్వరును వ్యభిచరించి తిరుగుటకు సాహసింప కుండిరి. ఇప్పటి రాజకీయమువా రాంతరంగికప్రవర్తనవిషయమున తాము సంబంధమును కలిగించుకొనకుండుటంజేసి, యీయడ్డముకూడ నిప్పు డూడి యెల్లవారును స్వేచ్ఛముగా భోగస్త్రీలతోడి సాంగత్యమును కలిగించుకొనుచున్నారు. బిళ్ళగోచిని పెట్టుకొందుట తప్పుగా నెంచుచున్నను, కులమువారిప్పుడు వ్యభిచారమును తప్పుగా నెంచుటయే మానివేసినారు. కాఁబట్టి కులమువారీ దురాచారమును మాన్పించుటకయి ప్రయత్నము చేయరని వేఱుగ చెప్పనక్కఱయే లేదు. ఈ మూఁడువిధములయిన సుఖములును మనశరీరమునకే సంబంధించినవగుటచేతను, అందుచేత నివి మనము పూర్ణముగా పొందినను మృగాదులకు కలుగు సుఖమునకంటె నెక్కువవి కానేరవు గనుకను, ఈభోగములయందు మృగాదులకు లేని రోగాదికములగు బాధలు కొన్ని మనకెక్కువ యుండును గనుకను, ఆకష్టములతోఁ గూడిన సుఖమయినను శాశ్వతముగా నుండునది కాదు గనుకను, తెలిసినవారెవ్వరును నిమిషభంగురములయిన యీ తుచ్ఛసుఖములకే యాశపడి యుండరు. ధనమువలనను, వైషయికభోగములవలనను గలిగెడిసుఖమును క్షణభంగుర మయినదిగానే యుండును. ఈసత్యమును తెలిసికోలేక పలువురు పేరుకొఱకు తమధనమునంతను పాడుచేసికొందురు. వివాహాదులయందు భూరిదక్షిణలక్రింద తమధనమును పాడుచేసికొని పలువురు కూటిపేదలగుటయు నీప్రసిద్ధి కాశపడియే. ఈకీర్తి యొకనియొద్ద వ్యర్థపఱుచుటకు ధన మెంతకాలముండునో

యంతకాలముమాత్రమే యుండును. ధనదానమును చేయుచున్నంత సేపును దాతలవిషయమయిన స్తోత్రపాఠము లాకాశమంటును; ఆధనదానము మట్టుపడినతోడనే స్తుతిపాఠములును మట్టుపడును. కాఁబట్టి పరుల పొగడ్తవలనఁ గలుగు సుఖమును చిరకాలముండునది కాదు. కాఁబట్టి ప్రాజ్ఞుఁడు పయినిజెప్పిన సుఖములలో దేనిని నమ్ముకొని యుండక, శాశ్వతసుఖము లభించుమార్గమును గనుఁగొని దానిని సంపాదించుటకయి సర్వప్రయత్నములును జేయును. శాశ్వతసుఖము లభించుమార్గము ధర్మాచరణ మొక్కటి తప్ప మఱియేదియు లేదు. ధర్మమార్గమునఁ జరించుచున్నచో మనమనస్సాక్షి సదా మెచ్చుకొనుచు నిజమయిన యానందము నిచ్చుచుండును. ఈలోకములో మనము పూర్ణముగా నూఱేండ్లు బ్రదికినను, ముందుముందుండెడి యపరిమిత కాలమునుబట్టి విచారింపఁగా నిది పర్వతములో పరమాణువంతభాగ మయిన నుండదు. కాఁబట్టి యెల్లవారును నీలోకములో నెల్లకాలమును దుఃఖముకలిగినను దానికయిన నోర్చుకొని, అపరిగణనీయ మయిన భావికాలములో నెల్ల శాశ్వతసుఖము నిచ్చుటకు సమర్థమయిన ధర్మమార్గముననే సుఖము పొందుటకు ప్రయత్నపడవలయును. ఇట్లు చెప్పుటచేత ధర్మమార్గమున వర్తించుటచేత నిహలోకసుఖము కలుగదనియు, పరలోకసుఖము నపేక్షించి యిహలోకసౌఖ్యముల నెల్లను మానుకోవలయుననియు నాయభిప్రాయము కాదు. ధర్మమార్గప్రవర్తనమువలన నిజమయిన సౌఖ్య మీలోకమునందును గలుగును; ఈ లోకమునందలి దేహసంబంధములయిన సౌఖ్యములన్నియు ననుభవింపఁ దగినవే. కాని పరలోకసుఖమునకు భంగము కలిగించువఱకు నీలోకసుఖములను త్యజించి, ఇక్కడ నెన్నియాపదలు వచ్చినను వాని నెల్లను సహించి ధర్మమార్గముననే సంచరింపవలనని నామతము.

నే సీదినమునఁ జెప్పఁ బూనుకొన్న స్వయంకృషి యీపరలోక సుఖమునకు భంగము రాకుండ ననుభవింపవలసిన సమ స్తసుఖసాధనములను గూర్చినదై యుండును. పశుపక్ష్యాదులకు లేనికినిలేని యుక్తాయు క్త వివేకము మనకు కలిగియుండుటచేతనే యీధర్మమార్గప్రవర్తనము మనకు విధిగా నేర్పడినది గనుక, ఇదియే నిజముగా మానుషధర్మమునకు సంబంధించినదని చెప్పవలసియున్నది. మన కీశ్వరుఁడు జ్ఞానమును ప్రసాదించి యున్నను, దాని నంతకంత కభివృద్ధి పొందఁదగిన దానిసిగానే చేసియున్నాఁడు. కాని యొక్కసారిగానే పరిపూర్ణత్వమును పొందియుండునట్లు చేసి యుండలేదు. మన కీశ్వరుఁడు దయచేసియున్న సాధనకలాపములో నేదియు మనకృషిలేక యభివృద్ధి నొందునది లేదు. కాఁబట్టి జ్ఞానాభివృద్ధికిని మనకృషి యావశ్యకము. యుక్తాయుక్తవిచారమునుజేసి కర్తవ్యమును గనిపెట్టుటకొఱకే జ్ఞానము సాధనమగుటచేత, కార్యాకార్యనిశ్చయముచేసి యుక్తమార్గమునసే నడువ తలంపుగలిగినవా రందఱును జ్ఞానాభివృద్ధికై సర్వప్రయత్నములు చేయవలెను. అన్యసాహాయ్య మక్కఱలేక మనుష్యుఁ డేవిషయమునందును పూర్ణముగా పని సాగింపనేరఁడు. అలాగుననే జ్ఞానసంపాదనమునందుఁగూడ మనుష్యున కితరసాహాయ్యము తప్పక కావలసియుండును. జ్ఞానాభివృద్ధికి తోడుపడు ముఖ్యసాధనము విద్యయనఁబడును. తనకంటె పూర్వులు వ్రాసియుంచిన పుస్తకములను జదువుటవలనను, తనకంటె నధికబుద్ధిమంతులయిన వారితో సహవాసము చేసి తనకు తెలియనివిషయములను వారినడిగి తెలిసికొనుటవలనను సాధారణముగా జ్ఞానాభివృద్ధి యగును. ఇట్టి సాహాయ్యమక్కఱలేక స్వానుభవమువలననే జ్ఞానాభివృద్ధిని చేసికొనువాఁడు కోటికెక్కడనో యొక్కఁ డుండవచ్చినను సామాన్యముగా పయి తోడుపాటువలననే జనులు జ్ఞానాధికులగుదురు. కాఁబట్టి యెల్లవారికిని జ్ఞానాభివృద్ధిచేసి

కొనుటకై పుస్తకములును గురువులును కావలసివచ్చును. అయినను పుస్తకములన్నియు యథార్థమునే బోధించునవిగా నుండవు. గురువులందఱును శిష్యుల మేలుకొఱకే పాటుపడువారయియు నుండరు. కాఁబట్టి మంచిపుస్తకములనే యభ్యసించుటకును, ఉత్తములయిన గురువులనే యాశ్రయించుటకును జాగ్రత్తపడవలయును. పుస్తకములయొక్కయు గురువులయొక్కయు నుపయోగము మనలను జ్ఞానవంతులనుగాఁ జేయుటకును, బహువిషయములయందు మన యాలోచనను జొప్పించి సాధకబాధకములను విచారించి కార్యనిర్ణయము చేయ సమర్థులనుగాఁ జేయుటకును, గాని మనయాలోచనను పోఁగొట్టి వానియం దున్నదెల్ల నంధప్రాయముగా విశ్వసించునట్టు చేయుటకుఁగాదు. మనకు మునుపున్న జ్ఞానమునుగూడఁ బోఁగొట్టుటకు సాధనములగునేని, అట్టిపుస్తకములును గురువులును లేకుండుట మంచిది. కాఁబట్టి నిజమైన జ్ఞానమును సంపాదించవలెనని యున్న పక్షమున, పుస్తకమునందున్న యంశములనుగాని గురువు చెప్పిన వాక్యములనుగాని సందేహముకలిగినప్పుడు నిష్పాక్షికబుద్ధితో మఱి మఱి విమర్శించి తనబుద్ధి కవి సత్యములుగావని దృఢముగా తోఁచునేని యెవ్వరు వ్యతిరేకముగాఁ జెప్పినను తన మనస్సునకు స్థిరమని సిద్ధాంతమయిన ప్రకారముగానే ప్రవర్తింపవలయును. పూర్వము పుస్తకములను రచించినవారును గురువులును మిక్కిలి బుద్ధిమంతులే యయినను మనుష్యులగుటచే వారికిఁగూడ భ్రమప్రమాదాదులు సహజములే గనుక, వారును కొన్నివిషయములయందు పొఱపడి యుండవచ్చును. ఏదో యొకవిషయమునందు వారిప్రమాదమును మనము సంస్కరించినంతమాత్రమున వారిగౌరవమున కేహానియు కలుగదు; అది తరువాతివారు జ్ఞానాభివృద్ధిని పొందుటకును సాధనమగును. అంతియే కాక స్వప్రయోజనపరులయి తమలాభము

నిమిత్తమయి యసత్యములను బుద్ధిపూర్వకముగానే తమ పుస్తకములనిండ నెక్కించిన మహానుభావులును పలువు రుండియున్నారు. అట్టి స్వప్రయోజనపరులయిన పండితనామధారకులవలననే మనకు విశేషనష్టము కలుగును గాని మూఢజనులవలన నంతగా గలుగదు. ప్రతిదేశమునందును మతగురువులు స్వప్రయోజనపరులై వేదోక్తములని వేదబాహ్యములయిన సంగతులను పుస్తకములలో వ్రాసియు శిష్యులకు బోధించియు జనులను మోసముచేసి తాము లాభమును పొందుచుండుట సర్వసాధారణముగా జరుగుచునే యున్నది. అయినను గొన్ని దేశములలో విద్యాభివృద్ధియయి జనులలో నాగరికత యధికమైనకొలఁదిని మతగ్రంథములు దేశభాషలలో భాషాంతరీకరింపఁబడి వారిమోసములు మూలఁబడినవి. మనదేశములో సాధారణముగా తక్కువజాతులవారు విద్యాగంధమెఱుఁగక మూఢులుగానే యట్లె యుండుటవలనను, మతగ్రంథములు దేశభాషలలో భాషాంతరీకరింపఁబడక యుండుటవలనను, మతగురువుల మోసమీ దేశములో నిరర్గళముగా సాగుచున్నది. ఈయుపద్రవమును నివారించి దేశమునకు క్షేమము గలిగింపఁగోరు దేశాభిమానులగు మహాపురుషులందఱును జనులలో విద్యాభివృద్ధియగునట్లు చేయుటకును, మతగ్రంథములను తెనిఁగించుటకును, స్వలాభమునకయి గురుపరంపరలోనివారు వ్రాసికొన్న పుస్తకములయందలి దోషములను లోకమునకు వెల్లడిపఱిచి జనులకన్నులు తెఱచుటకును, సర్వవిధముల పాటుపడవలయును. అంతకంటె మనము లోకమునకుజేయు గొప్పయుపకారము మఱియొకటిలేదు. తమ్ము పూజించుటయు, తమకు ధనమిచ్చుటయు, తప్ప ముక్తికి వేఱుసాధనములు లేవని వ్రాసి ధనాకర్షణోపాయముగా శ్రుతిస్మృత్యుక్తములుకాని పెక్కునోములను వ్రతములను కల్పించి తదనుగుణములైన కల్పములతో నిండియున్న పుస్తకము

లను చేసినవారిని మనమెందఱిని జూచుచున్నాము కాము? వాని యందు వారిని వారిజాతివారిని పూజించిననే పుణ్యమువచ్చునని బోధించుటతప్ప నిజమయిన భగవద్భక్తిని నీతిని యుక్తప్రవర్తనను బోధించువాక్యము లెక్కడనైనను గనుపట్టునా? అట్టి పుస్తకము లెంతశీఘ్రముగా నశించిన మనదేశమున కంతక్షేమము కలుగును. ప్రతిదేశములోను తెలిసినవారు మాత్రమే గురువులుగా నుండుట యాచారముగానున్నది. మనదేశమున మాత్రము పూర్వము తమ వృద్ధపరంపరలోనివారి కెవ్వరికో వారివృద్ధపరంపరలోనివారొకరు గురువులుగా నుండిరను హేతువుచేత వారివంశమునందు పుట్టిన పరమ శుంఠలు సహితము శిష్యపరంపరలోఁ జేరిన పండితులకుఁగూడ గురువు లగుట తటస్థించుచున్నది. గురుశుశ్రూషవలననే కాని ఫలసిద్ధిలేదని మనవారు చక్కఁగా మనసులకు నాటించి యుండుటచేత, శిష్యవృత్తాపహారు లగుట కొంతమాత్రమును చేతఁగాక శిష్యవిత్తాపహారులు మాత్రమే యయియున్న యీమహాగురువులపాదములు కడిగి నెత్తి మీఁద జల్లుకొనుచు పాదతీర్థమును లోపలికి పుచ్చుకొనుచు వారు చెప్పిన వాక్యములెల్ల వేదవాక్యములని భావించి యాదరించుచు జనులు తమధనమును వారికి కొల్లపెట్టుచుందురు. ఈహేతువుచేత మనదేశ మున కితరదేశములలో లేని నష్టములుకూడ నీగురుపరంపరవలనఁ గలుగుచున్నవి. ఈగురువేషధారులు తమయింటనున్న స్థావరజంగమ స్వత్వము తోడిపాటుగా తమశిష్యగణమునుగూడ భాగములు వేసి పంచుకొనుచు జ్ఞానమునందుఁగూడ వారిని తత్తుల్యులనుగానే చేసి ధనాపహరణము చేయుచుందురు. ఈవిధమైన వృత్తిచేతనే జీవనము చేయువారు మఱియొకవిధముగా బోధించి సత్యమును వెల్లడి చేసినచో తమవృత్తికే భంగము కలుగును గనుక వారు సర్వవిధముల నీయాచారమునే కాపాడుచు తమకు వ్యతిరిక్తముగా సత్యము బోధింపఁ

జూచువారిని నాస్తికులనియు, బౌద్ధులనియు, మతదూషకులనియు పేరును పెట్టి దూషించుచు పామరులను భ్రమింపఁజేయుచుందురు. కష్టార్జితవిత్తమువలన జీవనము చేయఁదగిన న్యాయమయిన వృత్తి యేదియు లేక పరులను మోసపుచ్చి వారు సంపాదించుకొన్నదాని మూలముననే జీవనము చేయవలసినవా రీదేశములో నసంఖ్యముగా నున్నారనుట యెల్లవారికిని తెలిసిన విషయమే. అట్టివారిసంఖ్య క్షీణించువఱకును మనదేశము మంచిస్థితికి రానేరదు; పరులను యాచించి జీవనము చేయుటకంటె హేయమయినవృత్తి లోకములో మఱియొకటి లేదనియు, శరీరప్రయాసపడి న్యాయార్జితమైన ధనముతో కుటుంబసంరక్షణము చేసికొనెడి యేయధమవృత్తియైనను యాచ్ఞావృత్తికంటె వేయిరెట్లు మేలయినదనియు, వారిమనసులలో నాటించి కొంతవఱకైనను వారినావృత్తినుండి విముఖులను జేసినంగాని దేశాభివృద్ధికయి పాటుపడువారి ప్రయత్నములు సహితము నిరంతరాయముగా సాగనేరవు. ఇట్లు చెప్పుటచేత గురువు లక్కఱలేదనియు, చదువక్కఱలేదనియు, నాయభిప్రాయ మెంతమాత్రమును గాదు. తనకంటె బుద్ధిశాలులును విద్యాధికులును నయిన వారితో సహవాసము చేయుచుండిననేకాని మనుష్యుఁ డెప్పుడును జ్ఞానాభివృద్ధిని కాంచనేరఁడు; అట్టిమహనీయులతోడి సహవాసమునకన్నను జ్ఞానాభివృద్ధికి మంచిపుస్తకములు పరమప్రయోజనకరములు. గొప్పవారితోడి సాంగత్యమువలనను, సద్గ్రంథపఠనమువలనను మనకుఁ గలుగవలసిన ప్రయోజనము మనలో శోధనయును తత్త్వవిమర్శనమును వృద్ధియయి మనముకూడ గొప్పవార మగుటయే. అట్లుగాక గురువులశుశ్రూష మనలను స్వతంత్రులనుగాను సత్కార్యాచరణమునందు ధైర్యవంతులనుగాను జేయక మనలను వారికి దాసులనుగా మాత్రముచేసి స్థావరపదార్థములనువలె వారాడించినట్లెల్ల నాడు

చుండునట్లు చేయునేని, అట్టిగురువులు లేకపోవుటయే మిక్కిలి యుత్తమ పక్షము; మనము చదివెడి పుస్తకములు మనలను జ్ఞానవంతులనుగాను సత్ప్రవర్తనము గలవారినిగాను జేయక యొకతెగవారిచేతులలో పని ముట్లవంటి వారినిగాఁ జేయునేని, అట్టిగ్రంథములను చదువకపోవుటయే బహుశ్రేయస్కరము. విద్య సత్యమును దెలుపుటకును యోగ్యులనుగాఁ జేయుటకును సాధనమయినదేకాని స్వాంతప్రయోజనము కలది కాదని యీవఱకే సూచనగాఁ జెప్పియున్నాను. మనవారీసత్యమును మఱచిపోయి ప్రవర్తనమును విచారింపక విద్యనే పూజించుచున్నారు. అందుచేతనే మనదేశమున కనేకములయిన చెడుగులు మూడుటకుఁ గారణమయినది. మనవారు నడత మంచిది కాకపోయినను దానిని పాటింపక వ్యాకరణమునో మఱి యేయితరశాస్త్రమునో యభ్యసించినాఁడన్న హేతువుచేత నాతనిని నతిగౌరవము చేయుచు నాతని మాటలనన్నింటిని వేదాక్షరములనువలె విశ్వసింతురు. ఎన్ని శాస్త్రములను జదివినను నీతివర్తన ముండదేని, అట్టివాఁడు మానవ రూపముననున్న ఘోరరాక్షసుఁడుకాని యంతకంటె నేవిధమునను అధికుఁడు కానేరఁడు. రాక్షసులు విద్యయందును, బుద్ధియందును, బలమునందును, దేవతలకంటె నధికులేయైనను వారు గర్హ్యులగుటకును దేవతలు పూజ్యులగుటకును గారణము రాక్షసుల దుర్గుణములును దేవతలసద్గుణములును తప్ప మఱి యేదిగలదు? కాఁబట్టి యెప్పుడును యుక్తప్రవర్తన మహనీయమైనదిగాని యది లేని వట్టివిద్య కాదు. అదిగాక పండ్రెండుసంవత్సరములు వ్యాకరణశాస్త్రమునుగాని తర్కశాస్త్రమునుగాని గుడ్డిపాఠముగా మొదటినుండి చివరవఱకును చదువుటవలనఁగాని, అర్థమెఱుఁగక వేదమును నోటిపాటగా వల్లెవేయుట వలనఁగాని కావ్యాలంకారనాటకముల నభ్యసించి నృత్తగీతాదుల యందు సమర్థులగుటవలనఁగాని యెవ్వరును జనులకు జ్ఞానోపదేశ

మును జేసి వారిని నడుపుట కర్తలుకారు. గుడ్డిపాఠముగా చదివిన చదువంతయు వ్యర్థమయినదే కాని ప్రయోజనకరమయినది కాదు. అర్థయుక్తముగాఁ జదివిన నీతిశాస్త్రములును తత్త్వశాస్త్రములును మాత్రమే పురుషులను . జ్ఞానోపదేశకర్తలనుగాఁ జేయ సమర్థములగును తక్కిన శాస్త్రములు సహిత మాయావిషయముల యందు పరమప్రయోజనకరములే యయినను, జనులకు పరమార్థమును బోధించి వారి ప్రవర్తనమును చక్కఁజేయుటకు మాత్రము పనికిరావు. కాఁబట్టి మన ప్రయత్నమంతయు దేశభాషలో నీతిగ్రంథములను ప్రకృతిశాస్త్రములను భగవద్భక్తిప్రతిపాదక పుస్తకములను సులభశైలిని రచియించి యెల్లవారికిని సుబోధములుగాఁ జేయుటయయి యుండవలెను. విద్య జ్ఞానమును పుట్టించును; ఆ జ్ఞానము యోగ్యముగా ప్రవర్తింపజేయుటకు అనుకూలపడవలయును. అంతేకాని యూరకే యిది మంచిదని తెలిసికొనుటవలన నేమియు ప్రయోజనములేదు. తెలిసినందుకు తప్పక తత్ప్రకారముగా నడవవలయును. కాఁబట్టి మన కృషి యాత్మకుఁగల గుణములలో నొకటియైన తెలివిని వృద్ధిపఱుచుకొనుటలో మాత్రమే కాక నీతిగుణమును ప్రేమాదులగువానిని గూడ సమానముగా నభివృద్ధిపొందించుటలో వినియోగపడవలెను. శరీరావయవములవలెనే యాత్మగుణములును పరస్పరము సమానముగా వృద్ధిపొందిననే సుఖదాయకములగును గాని యొకటి పెరిగి యొకటి తఱిగినచో సుఖప్రదములు కానేరవు. ఒక్కతలగాని, కడుపుగాని, కాలుగాని యొక్కటి పెద్దదయి తక్కిన యవయవములు పెరుగకపోయినచో శరీరమున కెంత యసౌఖ్యము కలుగునో యెల్లవారికిని తెలిసియే యుండును. ఆ ప్రకారముగానే తెలివిమాత్రము వృద్ధినొంది నీతిలేకపోయినప్పుడుగాని నీతిగలిగి తెలివిలేకపోయినప్పుడుగాని, ఈ రెండును గలిగి భగవద్భక్తి లేనప్పుడుగాని, ఆత్మకు నిజమయిన సుఖముకలుగఁ

జాలదు. కాఁబట్టి యన్నిగుణములును సమానముగా పెరుగునట్లు చేయుటకయి మనము కృషిచేయవలెను. అప్పుడే సత్యమయిన సుఖము కలుగును. ఎల్లవారును శాశ్వతసుఖమునే కాంక్షింతురు. ఆశాశ్వతసుఖము మనకుఁగల సమస్తగుణములను శక్తులను సమానముగా వృద్ధిపఱుచుకొని భగవదాజ్ఞానుసారముగా నడుచుకొనుట వలనఁ గలుగును. భగవదనుగ్రహమును గోరి యాతని తృప్తికయి మనము విధాయకకృత్యములను చేయుచువచ్చినచో మన కెప్పుడును నసంతుష్టియు నసౌఖ్యమును గలుగవు. పయివారు లక్షమంది మనలను ద్వేషించుచున్నను మనయంతరాత్మ మనలను సంతోషపెట్టుచుండును. మనయానందము మనమనస్సులో నున్నది గాని బాహ్యప్రపంచమునందు లేదు. మనలను పయివారు కోటిమంది భూషించుచున్నను దుష్కార్యమును జేసితిరని లోపల నంతరాత్మ దూషించుచున్నయెడల మన కెంతమాత్రమును సౌఖ్యము లేదు. కాఁబట్టి మనము నేర్చుకొను విద్య యింతవారమయితిమిగదా యను మనస్సంతోషముకొఱకుఁ గాని, ఆధిక్యముకొఱకుఁ గాని, లాభముకొఱకుఁ గాని అయియుండక మనప్రవర్తనమును తిన్నపఱుచుకొనుటకొఱకును పరోపకారము నిమిత్తమును నయి యుండవలెను. అప్పుడా మనస్సంతోషాదులు తమయంతఁ దామే వచ్చును. మనవిద్యయొక్క ఫలము కామక్రోధాదులను నిగ్రహించి సత్యశౌచపరోపకారాదిగుణములను పయికిఁ దీయుటయే. అట్లుచేయుటచే యింద్రియనిగ్రహ మనఁబడును. కామాదులగు నరివర్గమునకును, సుగుణములకు స్థానమయిన యంతరాత్మకును ప్రతికార్యమునందును లోపల సదా యుద్ధము జరుగుచుండును. ఒక చక్కని సుందరిని చూచినతోడనే కామగుణముద్రేకించి దానిని గవయఁ జూచుచుండును; అప్పు డంతరాత్మ యడ్డువచ్చి పరకాంత కాసించుట దోషమని బోధించి వారింపఁ

జూచుచుండును. ఆపోరాటములో నొకవేళ కామమే విజయమునొంది యా సుందరి పొందు లభించినను అది దొంగవలె నొకమూల నొదిగియుండి యెవ్వరేమనుకొందురో యని సిగ్గు పడుచుండవలసి నదే కాని నలుగురిలోను చెప్పుకొని నిర్భయముగా తల యెత్తుకొని తిరుగ వలనుపడదు; అంతరాత్మయే విజయము నొంది యా కానిపనిని మాన్పింపఁ గలిగెనా మనసునకు తృప్తియు సంతోషమును లోకమువలన మెప్పును కూడఁ గలుగును. కాఁబట్టి బుద్ధిమంతుఁడగువాఁడు మొదటినుండియు నింద్రియములను బుద్ధికి లోఁబడునట్లు చేసి యంతరాత్మ చెప్పినట్లు నడుచుకొనుట కలవాటు చేసికొనవలయును. అట్లు చేసినప్పుడే విద్య సార్థకమగును. మఱి యును మనము సత్యమును గ్రహింపవలెనను నుద్దేశ్యముతోనే సదా విద్య నభ్యసింపవలయును. సత్యమును కనుఁగొనవలెనను నాసక్తి లేక తనసామర్థ్యమును గనఁబఱచి ప్రఖ్యాతి గాంచవలెనను నాశ తో పనిచేయుటచేత గొప్ప బుద్ధిమంతులు సహితము విపరీతసిద్ధాంత ముల నేర్పరిచి తాము మోసపోవుటయేకాక జనులను సహితము భ్రమింపఁజేసి వారిని తప్పుమార్గమునఁ బెట్టి నడిపించుచు వచ్చు చున్నారు. కాఁబట్టి మనయుద్దేశ మెల్లవిధముల సత్యమును గ్రహిం చుటకే యయి యుండవలయును. సత్యమును గ్రహింపవలయునను దృఢనిశ్చయము కలవారయి యెల్లవారును తమకున్న మనోగుణ ముల నన్నిటిని వృద్ధిచేసికొనుటకయి కృషిచేయవలెను. జనుల ముఖ లక్షణములయందును కంఠస్వరమునందును పరస్పర భేదమున్నను కర్ణనాసికాద్యవయవములును నుచ్చారణ క్రమమును సామాన్యముగా నున్నట్టే మనుష్యుల బుద్ధియందును పరస్పర భేదమున్నను సామాన్య గుణములు సహితము పెక్కులు గలవు. ఆ యా మనుష్యు లాయావృ త్తులకు పనికివచ్చుటకయి బుద్ధియందును వాంఛలయందును భేదమవ

శ్యముగా నుండవలసినదే. కొందఱు గణితాది శాస్త్రములయందు బుద్ధి వ్యాపించువారుగాను కొందఱు గానవిద్యాదులయందు ప్రవేశించు బుద్ధిగలవారుగాను కొందఱు శిల్పములయం దాసక్తికలవారుగాను కొందఱు వస్త్రాదినిర్మాణమునందు తమశక్తిని గనఁబఱుప వాంఛగలవారుగాను నానావిధముల నుందురు. వాని వాని యభిరుచినిబట్టి ఆయావృత్తులకుఁదగిన విద్య నేర్పవలసినదే కాని యంతటితో మాత్రము తృప్తినొంది యూరకుండక యందఱకును సామాన్యముగానుండు గుణములను వృద్ధిపఱుపఁజాలిన విద్యను గూడ తప్పక నేర్పవలయును. అట్టి విద్య యన్నివృత్తులకును గూడ నావశ్యకమే. ఒకఁడు రాజైనను, కాపైనను, వాణిజ్యము చేయుచున్నను, కృషి చేయుచున్నను, మట్టికుండలు చేయుచున్నను, బంగారునగలు చేయుచున్నను, చిత్రములు వ్రాయుచున్నను, గోడలకు మట్టిపూత పెట్టుచున్నను, లోకములోఁగల మరి యేవృత్తియందున్నను, తనవారియందు ప్రేమయు పరోపకారచింతయు భగవంతునియెడల భక్తియు యుక్తప్రవర్తనమును కలిగి యుండవలసినదే. అట్లున్నంతవఱకే జనుఁ డేవృత్తియందున్నను ప్రకాశించును. కాఁబట్టి వృత్తులకుఁ గావలసిన విద్యకంటెను ఈ కడపటఁ జెప్పినవానిని వృద్ధిపఱుచువిద్యయే ప్రతిమనుష్యునకు నవశ్యసంపాద్యము. నీతి మొదలగునవి లేకపోయినయెడల నెంత తెలివిగలవాఁ డేవృత్తియందున్నను గౌరవింపఁబడఁడు; వృత్తులకుఁ గావలసినవిద్య వాందఱికి రాకపోవచ్చునుగాని యుక్తాయుక్తవివేకమును పుట్టించువఱకుఁ జాలినవిద్య కృషి చేసినయెడల మనుష్యమాత్రున కెవ్వరికిని రాకపోదు. నీతి మొదలయినవి యున్నయెడల మనుష్యుఁ డేవృత్తియం దున్నను గౌరవింపఁబడును. అది తెలియక యీదేశములో నల్పవిద్యను నేర్చినవారు సాధారణముగా తమవృత్తులు నీచము లయినవని భ్రమించి నాలుగుతరములు

రాఁగానే తమ తొంటివృత్తులయందుఁ బ్రవేశింపనొల్లక యధమ వృత్తియైన సేవకవృత్తి కాశపడి రాజకీయోద్యోగములకయి తమ శక్తినంతను ధారపోసి కష్టపడుచున్నారు. లోకములో న్యాయ మయిన వృత్తులన్నియు గౌరవావహము లయినవేకాని యందొక్క టియు గౌరవహీనతను దెచ్చునదిలేదు. ఎంత మంచివృత్తియందైనను మూఢులును నీతిమాలినవారును ప్రవేశించినపక్షమున నది హీన మయిన దగును; ఎంత నీచముగా చూడఁబడు వృత్తియందైనను చదువుకొన్నవారును నీతిమంతులును ప్రవేశించినప్పుడే దానికి గౌరవము వచ్చును. కాఁబట్టి మనదేశములో చదువుకొన్నవారు వివిధవృత్తులయందుఁ బ్రవేశించి వానికి గౌరవమును తెచ్చి యీవఱకు జనులలోఁగల దురభిప్రాయమును పోఁగొట్టవలయును. వృత్తులు క్రమపడినంగాని దేశమెన్నటికిని భాగ్యసంపన్నము కాఁజాలదు. చదువుకొన్నవారు వృత్తులయందుఁ బ్రవేశించినచో మంచిసాధనము లను కనిపెట్టి పనిని సులభపఱుచుటయేకాక విస్తారలాభకరముగా కూడ చేయవచ్చును. వృత్తులు కొన్ని యిప్పుడు నీచములుగా కనఁ బడుచుండుట చదువుకొన్నవారందు ప్రవేశింపకపోవుటచేతనే కాని వేఱుకారణముచేత కాదు. తెలివిగలవాఁడు, నీతిమంతుఁడయి యే వృత్తియందున్నను గౌరవమునకు లోపమురాదని దృఢముగా మనసునందు నమ్మి సమస్తవృత్తులను మంచిదశకు తెచ్చుటకు ప్రయ త్నించుచు నీతి మొదలయిన యాత్మశక్తులనన్నిటిని వృద్ధిపఱచుటకై తగినంతకృషి చేయుచుండవలెను. మనదేశమునందు వృత్తులు మిక్కిలి హీనదశయందుండుటచేతనే మనకు సామాన్యముగా కావలసినవస్తు వులు సహితము నితరదేశములనుండివచ్చి మనసొమ్మంతయు నితరదేశ ములపాలయి మనదేశ మంతకంతకు బీదస్థితికి రావలసినంతగతి పట్టినది. మనదేశమునం దుపయోగపడెడు కత్తులు మొదలగునవి యితరదేశ

ములనుండియే వచ్చుచున్నవి; కట్టుకొను బట్టలు బహుతరముగా పరదేశములనుండియే వచ్చుచున్నవి; వ్రాసికొనుకాగితములన్నియు నన్యదేశములనుండియే వచ్చుచున్నవి. చదువుకొన్నవారును ధనికులును వృత్తులను వృద్ధిపఱుచుటకయి తగినంతకృషిచేసి యీదేశమునందే ఆయా పనులకు తగినయంత్రములను స్థాపింపఁజేసి పని సాగించినఁగాని లేనియెడల కొంతకాలములోనే మనదేశములోఁగల ధనమంతయు నన్యదేశముల పాలయి పోవుననుటకు సందేహము లేదు. అన్నివృత్తులయందును ప్రవేశించి వానిని వృద్ధిపఱుచుటకు చాలినంతమంది చదువుకొన్నవారు బయలుదేఱుటకయి జనసామాన్యమునకు విద్య చెప్పింప సాధ్యమయినంత ప్రయత్నము చేయవలయును. జనసామాన్యమునకు విద్యాభివృద్ధియైనఁగాని దేశముయొక్క స్థితి బాగుపడదు. పనిచేసి జీవనముచేయు తరగతులవారికి చదువుకొనుటకయి తీఱుబడి యుండదని కొందఱు చెప్పుదురు. అది కొంతవఱకు నిజమేకాని చదువుకోవలెనని యాసక్తియున్నచో నవకాశ ముండకపోదు. అట్టివారల యుపయోగమునకయి రాత్రులయందు విద్యచెప్పు పాఠశాలలను స్థాపింపవలయును. అట్లన్నచో పగలెల్లను పనిచేసి వచ్చినవారికి కొంచెమయినను విశ్రాంతిలేక రాత్రులుకూడ చదువుకొనవలెనన్నచో మిక్కిలి భారముగా నుండునని కొంద ఱాక్షేపింపవచ్చును. పగలు పనిచేసి వచ్చిన వారికి మంచిపుస్తకములను జదువుటయే యొకవిధమయిన విశ్రాంతిగ నేర్పడి సంతోషకరముగాను శ్రమనివారకముగానుకూడ నుండును. చదువుకోవలెనని బుద్ధియున్నచో నితరసమయములయందు సహితము కావలసినంత యవకాశమును కలుగఁజేసికోవచ్చును. పుస్తకములు, ఉపాధ్యాయులు, ఇతరసాధనములును కావలసినన్ని యుండియు ధనికులపిల్లలు లోకభాషనైనను పూర్ణముగా నభ్యసింపలేకపోవుటయు, అట్టిసాధనము లేవియు లేకపోయినను పని

వాండ్రబిడ్డలు సహితము కొందఱు విద్యాభిరుచిగలవారై కొంచెము తీఱిక చేసికొని చదివి స్వయంకృషిచేత బహుభాషలయందు పండితు లయి గొప్పవారగుటయు, ఇతర దేశ చరిత్రములనుబట్టి మనము తెలిసి కొని యున్నాము. మఱియును విద్యవలన జనసామాన్యముయొక్క స్థితి బాగుపడువఱకును మనస్థితియు బాగుపడనేరదు. వారు మూర్ఖులుగానే యున్నయెడల వారు మనము చేయఁబూనుకొన్న దేశక్షేమకరకార్య ములకును మన మాచరింపఁబూను సత్కార్యములకును ప్రతిబంధము లను గల్పించుచు దేశాభివృద్ధికిని మన యభివృద్ధికినిగూడ భంగము కలిగింతురు. అనేకులు విద్యావంతులయి విదేశములకు వెళ్ళి సామ యికపరీక్ష నిచ్చి గొప్పయుద్యోగములం బ్రవేశించి దేశమునకు మేలు చేయవలె నను తలంపు గలవారయ్యు మూఢులయిన కులమువారు తమ్ము బహిష్కరింతురని భయపడి యేమియు చేయనేరక యూర కుండఁగా మనము చూచుచున్నాముకామా? ఎంతమంది వివాహా దులయందలి యతివ్యయమును మానుకొనఁ దలఁచియు మూఢు లయిన సామాన్యజనుల దూషణములకు వెఱచి మాన్యములో మడులో తాకట్టు పెట్టుకొని సోమరిపోతులను మేపుటకయి వందల కొలఁది రూప్యముల వెచ్చపెట్టవలసినవా రగుచున్నారు? అతిబాల్య వివాహము దూష్యమని యెఱిఁగియు దానిని వారింప నెంతో యిష్ట ముండియు జనుల మౌర్ఖ్యమువలన వారల మరలింప శక్యముగాక కులమునుండి తొలఁగింతురేమో యను భీతిచేత నెందఱు తమ కొమా ర్తెలకు సహితము బాల్యములోనే వివాహము చేయవలసినవా రగు చున్నారు? స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమని స్పష్టముగా తెలిసియుండియు దాని నుద్ధరించుట లోకోపకారమని దృఢముగా నమ్మియు తా మట్టిపనియందుఁ బ్రవేశింప నత్యంతాభిలాష కలిగి యుండియు, ఆ పేరుచెప్పిన పులులవలె కఱవవచ్చు మూర్ఖజనుల బెద

రింపులకు భయపడి యెంతమంది తమ గర్భవాసమునఁ బుట్టి పతులను పోఁగొట్టుకొని దురదృష్టవంతురాండ్రయియున్న పసిబాలికలకు సహితము వివాహము చేయఁజాలక యావజ్జీవమును వారిని దుస్సహదుఃఖము పాలుచేసి కన్నకడుపు దహించుకొనిపోవ తాముకూడ తీరని వ్యధ ననుభవింపవలసిన వారగుచున్నారు? తెలియని జనుల యపహాస్యములకు జడిసి యెందఱు తాను దేహసంరక్షణార్థ మనుకూలమైన వస్త్రములను ధరించుకొనుటకును పాదరక్షలను తొడుగుకొనుటకును సందేహపడుచున్నారు? కాఁబట్టి మొట్టమొదట జనసామాన్యమునకు విద్యచేర్పించు సహాయమును జూడవలెను. సామాన్యజనులు మాత్రమే కాక మన యభివృద్ధి కడ్డమువచ్చువారు మఱియొక తెగవారుకూడఁ గలరు? మూర్ఖురాండ్రయిన మన స్త్రీలుగూడ మనము చేయఁ బూనిన ప్రతిసత్కార్యమునకును ప్రతిబంధకారిణులుగా నుండుట స్వానుభవమువలన మనకందఱకును దెలిసియే యున్నది. వారు సదా మనస్సులో నుండి పోరుచుండుటచేత వారి కిష్టములేని పనిచేసి యింట నెమ్మదితో నుండుట దుర్ఘటము. మూర్ఖపుపట్టు పట్టి నిష్కారణముగా ప్రాణత్యాగమునకు సహితము సిద్ధపడు భార్యలను తల్లులను తమమార్గమునకు త్రిప్పఁజాలక వారికిజడిసి యెంతమంది తెలిసినవారు తాముకూడ మూర్ఖులవలె ప్రవర్తింపవలసిన వారగుచున్నారు కారు? ఎంతమంది సభలలో దేశాభివృద్ధికరములైన పనులను జేయుటనుగూర్చి ప్రసంగించుటలో సింహములవలె నుండియు పనికిమాలిన యాఁడువారికి భయపడి యింటికి వచ్చినప్పుడవే యాచరణముమాట యటుండఁగా సభలలో చేసిన యుపన్యాసాంశములను బిగ్గరగా పలుకనైనను సాహసింపలేక పిల్లులవలె నొదిగియుండవలసినవా రగుచున్నారు? సామాన్యజనుల ప్రతిబంధమునకంటెను మనకు స్త్రీలదే గొప్పప్రతిబంధము. కాఁబట్టి స్త్రీలకు విద్యచెప్పించుట యెల్లవారికిని ప్రథమకర్తవ్యము.

మనము నిజముగా నభివృద్ధి చెంద నపేక్షించినచో సాధ్యమయినన్ని బాలికాపాఠశాలలను రాత్రిపాఠశాలలను బెట్టించి స్త్రీలను సామాన్యజనులను విద్యగలవారినిగాఁ జేయవలయును. పాఠశాలలున్నను జ్ఞానాభివృద్ధి కనుకూలమయిన పుస్తకములు లేకపోయినయెడల మన ప్రయత్నము కొనసాగదు. గనుక మనలో శక్తికలవా రందఱును దేశభాషలలో సులభశైలిని గ్రంథములను రచియించుటకు వెంటనే పూనవలయును. స్త్రీలలోను సామాన్యజనులలోను చదువుకోకుండ తెలివిగలవారును సత్కార్యమునకు తోడుపడువారును లేరా యని కొందఱడుగవచ్చును. అట్టివా రక్కడక్కడ నొకానొక రుండవచ్చును గాని జనసామాన్యముమీఁద విద్యలేక జ్ఞానవంతులు గుణవంతులు నగుట సంభవింపనేరదు. గనులలో దొరకెడురత్నమువలెనే వికాసము నొందెడుబుద్ధి స్వాభావికముగానే పలువురకున్నను విద్యచే మెఱుఁగుపెట్టినంగాని దాని ప్రకాశమంతయు వెల్లడియయి లోకమున కుపయోగపడదు. విద్యాభివృద్ధి యగుట యొక్క పుస్తకములమూలముననే గాక వినోదకరములును నీతిబోధకములును జ్ఞానజనకములు నైన విషయములను సమయోచితముగా వ్రాయు వార్తాపత్రికలమూలమున కూడ విస్తారముగా నగును. గనుక, అట్టి దేశభాషావృత్తాంతపత్రికలకు గూడ తగినంత ప్రోత్సాహమును కలిగింపవలయును. మిత్రులారా! ఈ పయినిచెప్పిన సంగతులను మీ మనసులయం దుంచుకొని మీమీ చేతనయిన విషయములలో పనిచేసి దేశాభివృద్ధికయి పాటుపడుఁడు. ఈ ఘనకార్యము మనమందఱముఁ గలిసి పనిచేసినం గాని యొక్కనివల్ల నెఱవేఱునది కాదు. రేపటిదినము మనది కాదు. కనుక వెంటనే పనికి పూని భూమిమీఁద మనజన్మములను సార్థకపఱుచుకొనుటకయి యెల్లవారమును బ్రయత్నింతము. కొందఱింకను కాలము రాలేదు రాలేదని యేమియు లోకోపకారము చేయఁజాలక తమ

కాలమును వ్యర్థపుచ్చుచున్నారు. ప్రారంభింపక యూకాశముపంక చూచుచు నూరకున్నచో కాల మెప్పుడును రానేరదు. పనికి పూని చేయ నారంభించినచో కాలము తనంతనే వచ్చును; రాకున్నచో మనము కాలమును బలవంతముగా నీడ్చుకొనియైనను రావచ్చును. మఱికొందఱు పని కారంభించి విఘ్నములకు జడిసి పూనినకార్యమును నడుమ విడిచిపెట్టుచున్నారు. మనము తొందరపడిన కార్యము లేదు. గింజ నాటినతోడనే యది వృక్షమయి కాయలు కాయదు. ఒక్క నారి కేళఫలమును భూమిలో నాటిన పక్షమున దానిఫలముల ననుభవించుట కయి పదిసంవత్సరములైనను కాచుకొని యుండి యీలోపల చెట్టును బ్రతికించుటకయి నమస్తకష్టములను పడుచుండవలయును. అటువంటి యత్యల్పఫలము విషయమునసే యింతకాలము కనిపెట్టుకొని యుండ వలసి యుండఁగా లోకమునకంతకు ననంతములయిన ఫలములనిచ్చు నుత్కృష్టవిషయములలో నేఁడు కాలేదే రేపు కాలేదే యని తొందర పడి పూనిన కార్యమును నడుమను విడిచిపెట్టిన మనము హాస్యాస్పదు లము కామా? తొందరపడక కార్యగౌరవమునుబట్టి ఫలానుభవమున కయి తగినంతకాల మోర్పుతో కనిపెట్టుకొని యుండి కృషి చేయుచుండ వలెను. మొదట మనప్రయత్నము విఫలమైనచో మనకార్యము సఫల మగువఱకును మానక మరల మరల ప్రయత్నము చేయుచుండవలెను. ఒకవేళ మనము దానిని ముగింపలేకపోతిమా మనతరువాతివారు ముగించెదరు; మనము కట్టిన యిండ్లును, తోఁటలలో నాటినవృక్షముల ఫలములును తఱుచుగా మనసంతతివారి కుపయోగపడునట్లే మనము నాటిన సత్కార్యబీజములును తరువాత మొలకయెత్తి యాకులు వేసి కొమ్మలు హెచ్చి మహావృక్షమయి దేశమంతటను వ్యాపించి యమూ ల్యములయిన ఫలములనిచ్చుచు లోకమున కంతకును సుఖము నియ్య వచ్చును. విత్తనము నాటితిమని యైన మనకు తృప్తికలుగును. ఎంతటి

సత్కార్యమున కయినను పలువురు ప్రతిపక్షు లేర్పడుటచే విరోధము లును, ప్రతిబంధములును, విఘ్నములును రావచ్చును. అటువంటి వాని వలన మన మెప్పుడును నిరుత్సాహులము కాఁగూడదు; అవియే యిట్టి సమయములలో మనలను ధైర్యశాలులనుగాను సుస్థిరులనుగాను జేయుటకయి తోడుపడు సాధనము లగునట్లుగా చేసికొనవలయును. అటువంటి సమయములలో ప్రతిబంధముల నన్నిటి నెదిరించి దృఢముగా నిలిచి మన కార్యమును సాధించుకొనఁగలిగినంగాని మనము నిజముగా గొప్పవారమును సత్కార్యనిరతులమును గానేరము. కష్టములు వచ్చి నప్పుడే యుపయోగపడని ధైర్యము మఱి యెప్పటి కుపయోగించును? ఇట్టి ధైర్యము కలిగియుండుటచేతనే శక్తిమంతులు చేయలేని కార్యముల ననేకములను శక్తిహీనులు పూనికతో సాధించియున్నారు; అది లేకపోవుటచే సమర్థులుసహిత మత్యల్పకార్యములను సాధింపలేక యున్నారు. సత్కార్యములు చేయవలెనని బుద్ధి యున్నమాత్రమున కేవలము ప్రయోజనము లేదు. కార్యమును సాధించుటకై మొట్టమొదట మనము ప్రయత్నము చేసెడియెడల కార్యమును సాధింపఁగలమను నమ్మకమును నుత్సాహము నుండవలెను; తరువాత సరిగా పనియందు ప్రవేశించి పూనికగలిగి పాటుపడవలెను; అటుపిమ్మట నెన్నివిఘ్నములు వచ్చినను వెనుకతీయక యీశ్వరముఖమును జూచి ధైర్యముతో ప్రయత్నమును మానకుండవలెను. మనలను ఘనకార్యములను నిర్వహించుటకు శక్తులనుగాఁ జేయునది యొక్క యీశ్వరభక్తియే; అది లేనిచో విశేషశక్తిమంతులును కార్యనిర్వాహణమునందు దుర్బలు లగుచున్నారు. మనము లోకోపకారకమయిన యొక క్రొత్తపనికి పూనుకొనఁగానే బహుజనులు మనకు ప్రతిపక్షులుగా నేర్పడి మితిమీఱిన విఘ్నముల నాపాదించి బాధించుచున్నప్పుడును లోకమునకు వెఱచి మిత్రులుసహితము మనలను విడనాడినప్పుడును మనకు ధైర్యసాహస

ముల నొసఁగుటకును మనల నుత్సాహపఱుచుటకును భగవంతుని ప్రాపుగాక మఱియేమికలుగును? రాజాధిరాజులకెల్లను ప్రభువయి నిగ్రహానుగ్రహసమర్థుఁడయిన పరమేశ్వరుఁడు మన హృదయసింహా సనము నధిష్ఠించియుండి చేసిన సత్కార్యమును మెచ్చి శాశ్వతసుఖ మిచ్చెదనని యంతరాత్మద్వారమునఁ బలికి ప్రోత్సాహపఱుచుచు మనకు సహాయుఁడయి యుండఁగా, దుర్బలులయిన మానవాధములు కోటి మంది ప్రతిఘటించి నిలిచినను వారి తుచ్ఛమయిన కోపమునకు జడిసి వెనుకతీయుదుమా? సర్వాంతర్యామియైన యీశ్వరుఁడు చెంతనుండి చూచుచుండఁగా మనకు విధియైన కృత్యమును చేయక మూఢుల యను గ్రహమునకాశపడి యూరకుండ నెట్లు సాహసింపఁగలము? మనము భగవంతునిప్రాపునే నమ్ముకొని కార్యభారము నాతనిమీఁదవేసి పని సాగించుచో సత్కార్యాచరణమునందు ప్రోత్సాహమును ధైర్యమును, అకార్యకరణమునందు నిరుత్సాహమును, భయమును కలిగించి కాపాడి మన కతఁడే నిత్యానందము నిచ్చును.



# సకాయకష్టకర్మలు.



By

K. VEERESA LINGAM

# సకాయకష్టకర్మలు

వివేకనిధులారా !

మన దేశములోని కర్మోపజీవుల వృత్తులనుగూర్చి ప్రత్యేకముగాఁ జెప్పఁబూనినచో ననేకోపన్యాసములు కావలసి యున్నను వాని కన్నిఁటికిని పీఠికగా నుపయోగించునట్లుగా నిప్పుడు సామాన్యముగా నాకుఁ దోఁచిన యంశములను గొన్నిఁటిని జెప్పుచున్నాను. పూర్వకాలమునందు శిల్పములచేతను, కళలచేతను మిక్కిలి ప్రసిద్ధికెక్కి సమస్తదేశములవారి గౌరవమునకును పాత్రమయి యుండిన మన హిందూదేశ మిప్పుడు శిల్పాదులయందు మిక్కిలి హీనదశను పొంది కేవల పరిహాసాస్పదముగా నుండకపోయినను బహుదేశముల వారి యనాదరణ కర్హమయి యున్న సంగతి యించుక ప్రపంచ జ్ఞానముగల వారి కందఱికిని దెలిసియున్న విషయమే గనుక దీనిని స్థాపించుటకయి నేనిక్కడ నిదర్శనపూర్వకముగా పెంచి చెప్పవలసిన యక్కఱ లేదు. ఈ దేశమునందలి శిల్పాదివృత్తులు నానాటికి క్షీణదశకు వచ్చుచుండుటచేతనే మన ముపయోగించుకొనుచు వచ్చు వస్తువులలో మూఁడువాళ్ళు సాధారణముగా నన్యదేశములయందుఁ జేయఁబడి యిక్కడకు పంపఁబడినవిగా నున్నవి. అందుచేతనే యించుమించుగా మనము కట్టుకొను వస్త్రములును, బట్టలు కుట్టుట కుపయోగపడు సూదులు దారములును, మనము వేసికొను గుడ్డగొడుగులును, వ్రాసికొను కాగితములును, పనిచేయించుకొనెడు కత్తులును, గృహములకు వేయించుకొనెడు తాళములును, మఱియు గృహకృత్యముల కుపయోగించు వస్తువులనేకములును పరదేశమునుండి వచ్చువినగా

నున్నవి. ఇట్లుండుటచేత క్రమక్రమముగా మనదేశమందలి ధన మంతయు నన్యదేశముల పాలయి పూర్వకాలమందు నిరుపమానధన సంపన్నమని ప్రఖ్యాతికెక్కి, ధనాశాపాశబద్ధులయిన విదేశరాజుల హృదయముల నాకర్షించుచుండిన యీదేశమున కింత కింతకు బీద స్థితి పట్టవలసిన గతి సంభవముచున్నది. మగ్గములు మూలపడి నందున సాలెవాండ్రు విలువబట్టలు నేసిన చేతులతో మట్టిగోడలు పెట్టవలసినవారగుచున్నారు; కమ్మరులు కత్తులుచేసిన హస్తములతో కట్టెలు కొట్టవలసినవారగుచున్నారు. మనదేశపుస్థితి యభివృద్ధినొందక యిదేప్రకారముగా నుండెడుపక్షమున, నికకొంతకాలములో దారిద్ర్య దేవత వచ్చి మనదేశములోనే స్థిరవాస మేర్పఱుచుకొనుటకు సందేహ ములేదు. అట్టి దౌర్భాగ్యదశ మనదేశమునకు పట్టకుండఁ జేయవలెనని కోరెడుపక్షమున మనదేశమందలి వృత్తులవివరమును తెలిసికొని, వాని యిప్పటిస్థితికిఁగల కారణములను కనిపెట్టి, ముందు వానియభివృద్ధికి తగిన మార్గముల నాలోచించి, తగిన కృషిచేయుట దేశాభిమానము గలవారి కందఱికి నవశ్యకృత్యము. కాయకష్టము నపేక్షించెడు పనులు అద్దములు, కుండలు మొదలయిన మట్టిపనులును, నగలు, పాత్ర సామగ్రి, గునపములు మొదలయిన లోహపుపనులును, గుళ్ళు గోపురములు, విగ్రహములు, మొదలయిన రాతిపనులును, బల్లలు, పెట్టెలు, మొదలయిన కఱ్ఱపనులును, వస్త్రములు, కొమ్ముపెట్టెలు, రత్నకంబళములు మొదలయిన చేతిపనులును, మనదేశమునందనే కములు గలవు. ఇట్టి శరీరప్రయాసముతో చేరిన పనులు వృద్ధిపొంది ననే దేశ మభివృద్ధిచెంది జనులు బుద్ధియందును ప్రవర్తనమునందును మేలిమిచెంది బాగుపడుదురు గాని యితరవ్యాపారములవలన బాగు పడనేరరు. ఈ లోకములో కష్టపడినంగాని ఫలమేవిషయమునందును

లభింపదు. పలువురు కష్టపడినంగాని మనము కడుపునిండ భోజనము చేసి జీవించుటకైనను శక్తులము కాము. చెమట యూడ్చి కష్టపడి పనిచేయువాఁడు దేహారోగ్యము కలవాఁడయి సుఖజీవనము చేయుటకు శక్తుఁడగుటయే కాక సాధారణముగా యుక్తప్రవర్తనము కలవాఁడు సహితమగును. కొన్ని సమయములయందు వాణిజ్యము వలన నధికధనలాభము కలిగినను, అది జూదమువంటిదే యగును గాని దేహపరిశ్రమమును విశేషముగా కోరెడు సేద్యము, శిల్పములు మొదలయిన వానితో సమాన మెన్నటికిని కాదు. బహుకారణముల చేత నోడవ్యాపారము లోనుగాఁగల వర్తకవ్యాపారములయందు లాభమునకు మాఱుగా బహుతరముగా నష్టమే కలుగుచుండ వచ్చును. అంతేకాక వాణిజ్యకర్మమునందు సామాన్యముగా పోటీ బయలుదేఱి తోడివారియం దసూయయు ద్వేషమును పుట్టుటయే కాక యబద్ధము లాడుటకును పరులను మోసముచేయుటకును నవకాశమును ప్రోత్సాహమును గలుగును. ఇట్లు చెప్పుటవలన వాణిజ్యము కూడదని కాని వర్తకులందఱును మోసగాండ్రని కాని నా యభిప్రాయము కాదు. వర్తకులలో సత్యసంధులయి న్యాయమార్గము నతిక్రమింపక ఋజువుగా ప్రవర్తించువారును పలువురున్నారు. ఎంత దూరదేశమునం దుత్పన్నములయ్యెడు వస్తువులయినను పెరటి పంటయయి యందఱికి లభించి సౌఖ్యాభివృద్ధిని కలుగఁజేయుటకును వాణిజ్యమే సాధనభూతముగా నున్నది; ధూమనౌకలును ధూమశకటములును గలిగి సముద్రమధ్యమునందుండు ద్వీపాంతరములు సహితము నదులలోని చేరువలంకలవలెను దూరదేశములుసహితము పొరుగూళ్ళవలెను సులభగమ్యములుగానున్న యీ కాలములో నెల్ల దేశములయందును జేసెడు వివిధవస్తువు లొక్కచోట లభించు సదుపాయము

లుండుటయేకాక వాణిజ్యధర్మమునుబట్టి తిరుగుచుగా దూరదేశము లకు రాకపోకలు చేసి వివిధదేశములవారి యాచారవ్యవహారములను గుణదోషములను గుర్తెఱిగి నాగరికతయందు వృద్ధిపొందుటకు కావ లసినన్ని యవకాశము లుండియున్నవి. అయినను మనవారు చిర కాలాగత మయియున్న జాత్యనుబంధముచేత కట్టుపడి స్వేచ్ఛావిహా రమునకు శక్తులు కాకపోవుటవలన వాణిజ్యమువలన మన దేశమునకు కలుగవలసినంత లాభము కలుగకున్నది. అట్లయ్యును జనుల యభివృద్ధి కిని లాభమునకును కొంతవఱకు తోడుపడును గనుక వాణిజ్యముకూడ నవశ్యముగా నుండవలసిన దనియే నా యభిప్రాయము. కాని నే నిప్పుడు మీ మనస్సులయందు నాటింపదలంచినది వర్తకవ్యాపారమునకంటె శిల్పాదులయందు సుగుణము లధికముగా నున్నవనియు మంచికడపడికకు పురికొల్పు శక్తి కలదనియు, నాదుచేత కాయకష్టముతో చేరిన పనుల ననాదరముచేయక వృద్ధిపఱుచుట దేశముయొక్క యోగక్షేమముల కత్యంతాపేక్షణీయమనియు స్పష్టపఱుచుట తప్ప మఱియొకటి కాదు. పూర్వోక్తములయిన శిల్పాదివృత్తులయందు తక్కిన పనులకంటె శరీర ప్రయాస మెక్కువ పడవలసియుండును గనుక కర్మోపజీవులకు కష్టములకు సహించు మేలిగుణమును, పూనికతో పనిచేయు నుత్సా హమును, పనిని కడముట్ట నిర్వహించు మనోదార్ఢ్యమును, స్వభావ సిద్ధముగానే కలుగును. ఈ ప్రకారముగా కష్టపడి పనిచేయవలసిన యావశ్యకములేని వ్యాపారములయందున్నవారికి తమ మనస్సుయొక్క సంపూర్ణశక్తి తెలియుటయు, మనోదార్ఢ్యమును, కష్టముల కోర్చుకొను శక్తియు, పూనిక కలుగుటయు సంభవింపనేరవు. శరీరకష్టము నపే క్షించెడు పనులయందు దేహాయాస మనివార్యమే యయినను, ఆ యా యాసమునుబట్టియే మనము పెనిచెప్పిన సహనాదిగుణములను

వహించుటకు శక్తుల మగుచున్నాము. ఆ యాయాసమువలననే మనము భూమిని ఫలవంతమునుగాఁ జేసియు, దారులోహాదివస్తువులను మన కుపయుక్తములయిన వివిధరూపములకు మార్చియు, నానావిధసుఖములను భోగములను ననుభవించుటకు శక్తులమగుచున్నాము. కాఁబట్టి మనము శరీరప్రయాసము నెన్నఁడును తిరస్కరింపరాదు. తాము కష్టపడి యెట్టుఁగక యనాయాసముగా నితరులను జేరి జీవించువారు నిజమయిన సుఖము నెప్పుడు ననుభవింపఁజాలరు; పనిలేక యూరక సోమరితనమున కాలముపుచ్చుటకంటె నాయాసకరమును దుఃఖప్రదమును లోకమున మఱి యేదియు లేదు. కాఁబట్టి తమ జీవనమునకయి పరుల కాశపడి యుండక యెల్లవారును నేదోయొక విధమున పాటుపడి గౌరవముతో జీవనముచేయుటకయి ప్రయత్నింపవలయును.

మన మింతవఱకును పనియొక్క యుపయోగమునుగుఱించి ప్రసంగించితిమి గనుక, ఇఁక మన దేశమునందు శిల్పాదివృత్తులు హీనదశయందుండి లాభకరములుగా నుండకపోవుటకు కారణము లేవో తెలిసికొని యా లోపములను వారించి యభివృద్ధిపఱుచుటకు తగినసాధనముల నాలోచింతము. మన దేశములో కృష్యాదు లభివృద్ధిచెందకపోవుటకు కారణము లనేకములు కలవు. కాని వానిలో ముఖ్యములయిన వానిని మాత్రమే యిచ్చట ముచ్చటింతము. వీనిలో మొదటి కారణ మేపనిలో నెవరి కభిరుచిగలదో వారాపనులయందు ప్రవేశించి పనిచేయకుండుట. చిత్రములు వ్రాయుటయందే ప్రవీణతగలవానిని బట్టలు నేయుటయందును బట్టలు నేయుటయందే నేర్పుగలవానిని చిత్తరువులు వ్రాయుటయందును, నియమించి నిర్బంధముగా పనిచేయించినచో నేపనియు తిన్నగాజరగక రెండును హీనదశయం

దుండునవుట బాలురకు సహితము తెలియునుగదా? మన దేశమునం దాయా వర్ణములవారే యాయాపనులను చేయవలయు ననెడి నిర్బంధ ముండుటవలన నొకకమ్మరి దంతపుపనియం దెంత యభిలాషమును నేర్పును గలవాఁడయినను దానిని మాని కుండలనే చేయుచుండ వలెను; ఒకస్వర్ణకారుఁడు వస్త్రములను రత్నకంబళములను నేయుట యం దెంత యభిరుచియు బుద్ధియుఁ గలవాఁడయినను వానిని వదలి సుత్తితో వెండిబంగారములనే సాగఁగొట్టుచుండవలెను; ఒకచాకలి వస్త్రముల కంచులద్ది రంగులువేయుటయం దెంత ప్రవీణుఁడయినను దాని జోలికిపోక మయిలబట్టలనే యుతుకుచుండవలయును; ఒకమంగలి చిత్రములు వ్రాయుటయం దెంత ప్రజ్ఞగలవాఁడయినను దానిపేరు తలపెట్టక బోడితలలనే గొఱుగుచుండవలయును; ఒకయీడిగెవాఁడు బంగారుపుపనియం దెంత సమర్థుఁడయినను దానివంకఁ బోక తాటి కల్లే గీఁచుకొనుచుండవలయును. అనావశ్యకమైన యిన్ని జాతిభేదముల చేత పనివాండ్రు స్వేచ్ఛగా తమ బుద్ధి ప్రవేశించిన పనియందు ప్రవేశించి తమసామర్థ్యమును కౌశలమును కనఁబఱుచుటకు వలను పడక తమ కిష్టములేని పనులయందే విధిలేక యావజ్జీవమును గడుప వలసినవా రగుచున్నారు. అందుచేతనే యీ హిందూదేశమునందు శిల్పాదివృత్తు లెప్పుడు నుండవలసినంత మంచిస్థితియం దుండకున్నవి. సాధారణముగా విగ్రహారాధన మధికముగాఁగల దేశములయందు ప్రతిమలు చెక్కుటయు దేవాలయనిర్మాణమును మహోన్నతదశయం దుండవలసియుండును. ఈజిప్టుదేశమునం దున్న మిన్నందుగోపురము లను వానిమీఁది పనిని చూచినవారు మానుషశక్తి యంతటి పరి పూర్ణతను పొందునాయని యద్భుతరసాక్రాంతులు కాకమానరు. విగ్రహారాధన మత్యంతప్రబలముగానున్న యీ దేశమునం దటువంటి

యాశ్చర్యజనకములయిన విచిత్రవిగ్రహములును నిరుపమానదేవాలయములును విశేషముగా లేకపోవుటకుఁగాఁడ జాతిభేదముల యధిక సంఖ్యయే కారణముగానున్నది. ఈ జాతిభేదములవలన నిష్ప్రయోజకులయిన సోమరిపోతులు సహితము జన్మప్రభావమువలన తామెక్కువవార మని గర్వించి గుణశక్తిసంపన్నులయిన యితరులను గౌరవింపక పరాభవించుటయు, లోకోపకారధురీణులయిన యుత్తమపురుషులు సహితము గుణశీలసామర్థ్యాదులచేత నసమానులయియుండియు జన్మదోషమువలన తలయెత్తి పలుకలేక యెక్కువవారమని మదించి తిరిగెడి యధములచే నవమానపఱుపఁబడి యర్హపదమును పొందక దురుత్సాహులగుటయు, అందుచేత పరస్పరద్వేష ముదయించి యైకమత్యము లేక దేశము చెడిపోవుటయు సంభవించుచున్నది. ఇప్పుడు చెప్పినరీతి జాతిభేదములు లేకపోయినను ధనపాండిత్యాధికారతారతమ్యములనుబట్టి కొందఱెక్కువవారును కొందఱు తక్కువవారు ననెడి భేద మెప్పుడు నుండును గాని యిప్పటివలె నయోగ్యులు తామధికులమని గర్వించుటయు యోగ్యులు హీనులుగా గణింపఁబడి లాఘవము పొందుటయు నంతగా సంభవింపవు. జాతిభేదమును గూర్చిన విచార మిక్కడ ననావశ్యకమగుటచేత నా యంశము నింతట విడిచిపెట్టి యెవ్వరేజాతియందున్నను తామేదో యొక్కవృత్తినే యవలంబించి యామరణాంతమును దినములు పుచ్చక తీఱదను దుర్భ్రమ పడక, తమ కేవృత్తియం దభిరుచి గలదో దేనిమీఁద తమ బుద్ధి చక్కఁగా వ్యాపించునో దేనిని తాము జనరంజకముగా నిర్వహింప శక్తులగుదురో యా వృత్తినే యెల్లవారు ననుసరింప ప్రయత్నింప వలయుననియు, అట్లుచేసిననే కాని చేతిపనులు వృద్ధిచెంది లాభకరములుగా నుండవనియు, వారట్లు చేయునట్లు ప్రోత్సాహపఱుచుట

దేశాభివృద్ధి నపేక్షించు మనకందఱకు ధర్మమనియు నొక్కి చెప్పుచున్నాను.

మనదేశములో శిల్పాదుల హైన్యస్థితికిఁ గాలానుగుణముగా కావలసిన మార్పులను చేసికొనక పూర్వాచారమును బట్టి యెప్పుడు నేకరీతిగా గుడ్డియెద్దు జొన్నచేలో పడినట్లు పనిచేయుచుండుట రెండవకారణమని చెప్పవచ్చును. మనదేశములో నిప్పుడు పనిచేయుచున్న రీతి పూర్వకాలమునకు సరిపడినదై యున్నను నానావిధముల నభివృద్ధి చెందుచున్న యీకాలమున కంతమాత్రమును తగియుండదు. బాల్యమున తొడుగుకొనెడు పాదరక్షలా కాలమున కొంతో యనుకూలముగా నుండినను బాలుఁడు పెద్దవాఁడై పాద మెదిగిన తరువాతకూడ నట్టి జోడునే తొడుగుకొనవలయు నన్నచో నది యుపయోగింపక పోవుట యేకాక కాలికి నష్టమునుకూడ కలిగించును. అదేప్రకారముగా ప్రపంచము యొక్క బాల్యస్థితియం దత్యంతోపయుక్తములుగా నున్న వానినే కాలానుసారమైన మార్పును చేసికొనక యిప్పటి వృద్ధిదశయందుకూడ నుపయోగింపవలెనన్నచో నష్టము కలుగక యేప్రకారము లాభకరముగా నగును? అయోమార్గములమీఁద వాయువేగమున ధూమశకటములు చౌకగా సరకులను గొనిపోవుచుండఁగా నాచేరువను మోటుబండ్లమీఁద మందగమనమున ప్రియముగా వస్తువులను గొనిపోవ ప్రయత్నించుచో వృథాప్రయాసముగాక లాభమెట్లు కలుగనేర్చును? ఆవిరియంత్రములతో దినమునకు వస్త్రశతములను నేసి యల్పమూల్యమునకు విక్రయించుచుండగా పూర్వకాలపు మగ్గముల మీఁద మూఁడుదినములకొక బట్టను దింపి యెక్కువవెల కమ్మఁజూపినచో లాభమేరీతిని కలుగును? కాబట్టి వృత్తులు నిజముగా లాభకరములుగాఁ జేయవలె నన్నచో నీకాలమునకు తగిన పనిముట్లను

సంపాదించి యితరసాధనముల నన్నిటిని కాలానుసారముగా మార్చుకొని నేర్పుతో పనిచేయవలయును. ఇప్పటి యంత్రములు మొదలయినవి విశేషవిత్తసాధ్యములును మన పనివాండ్రు ధనహీనులు నైనందున నట్టిపని యెట్లు పొసఁగునని యెల్లవారికిని స్థూలముగా తోఁచ వచ్చును. ఈయాక్షేపణ కొంతవఱకు ప్రబలమయినదే కాని ప్రతి క్రియ లేనిది కాదు. ఒక్కఁడు ప్రత్యేకముగాఁ జేయఁబూవినచో నెల్లపనులును నసాధ్యములుగానే కనఁబడును. ఆపనులే పదిమంది యేకీభవించి చేసెడిచో సులభసాధ్యములగుట యెల్లవారికిని నను భవసిద్ధమయి యున్నది. ఈలోకములో నెటువంటి దుస్సాధ్యములను నిమిషములో సుసాధ్యములనుగాఁ జేసెడి యద్భుతశక్తి యొకటి సంఘీ భావమునందున్నది. స్వప్రయోజనపరులయి యెవరిమట్టుకు వారు వేఱుపడక సంఘీభవించి యైకమత్యముతో పనిచేసినచో లోకములో సాధింపరాని కార్యములు బహుస్వల్పముగా నుండును. కాఁబట్టి శత కోటి సంఖ్యల జనులున్న యీదేశములో వేలకొలఁది జనులు కాకపోయి నను నూఱులకొలఁదియైనను సంఘములుగాఁజేసి కావలసినంత ధన మును చేర్చి కావలసిన పనిముట్లను యంత్రాది సాధనములను సులభ ముగాఁ దెప్పించవచ్చును. ఈపని సంఘీభవించి చేయవలసినదేకాని యొక్కఁడనో లక్షాధికారులకు తప్ప సాధారణముగా నొంటరిగా చేయుట శక్యముకాదు. కాఁబట్టి మనదేశమున నిప్పుడడుగంటి యున్న కళలను శిల్పములను పునరుద్ధారణముచేసి దేశమును భాగ్య సంపన్నము చేయు తలంపుగల దేశాభిమానమాననీయులు మనవారిలో నైకమత్యము పుట్టించి, సంఘీభవించుటవలని యనంతములైన లాభ ములను తెలిపి, యీదేశమున వస్త్రాదుల నిప్పటి యంత్రాదిసాహా య్యమునఁ జేయునట్లు చేయవలయును. కాలానుగుణములైన మార్పు

లను పొందక యెప్పుడు నేదేశమును బాగుపడదని మీరు దృఢముగా నమ్మి దానికై తగినంతకృషి చేయుదురని మీకు మఱిమఱి తెలుపుచున్నాను.

ఈ హిందూదేశమున శిల్పాదులు వృద్ధిపొందక నీచదశయం దుండుటకు మూఁడవకారణ మాయావృత్తు లవలంబించినవారు విద్యావిహీనులుగా నుండుట. ఏపనినిగాని చక్కఁగా నాలోచించి చేయనిచో, ఆపని క్రమముగా నెఱవేఱదని యెల్లవారికిని తెలియును. ఒకపని విషయమయి యాలోచించుటకు మొట్టమొదట వాని కార్యావస్తు ధర్మములు తెలియవలెను. అట్లు తెలియనిపక్షమున వాఁడావిషయము నందు తనబుద్ధిని జొప్పించి పూర్ణముగా నాలోచించి చేసెను గని నంతకంతకు వృద్ధిపఱచుటకును తదనుగుణముగా క్రొత్తక్రొత్తపనిముట్లను బుద్ధిబలమున కనిపెట్టి నిర్మించుటకును శక్తుఁడు కాఁజాలఁడు. ఇందుకు నిదర్శనముగా కృషిచేయువాఁడు తన భూమిని సదా ఫలవంతముగాఁ జేసికొని యెక్కువలాభమును పొందదలఁచినయెడల వాఁడు మట్టిలో నుండు మూలపదార్థముల స్వభావమును, వానిలో నేవి యేపైరుకు ముఖ్యములో, యేపైరుతరువాత నేపైరు పెట్టినచో భూమి సారము చెడకుండ ఫలము నిచ్చుచుండునో, భూమి నిస్సారమయినచో ససారముగాఁ జేయుటకయి యెప్పు డెటువంటి యెరువు కట్టవలయునో, కాలువల నేప్రకారముగా త్రవ్వి నీరెట్లు ప్రవహింపఁజేయవలయునో, నాగేళ్లు మొదలయిన సాధనముల నేప్రకారముగా బాగుచేసి యుపయోగింపవలయునో, పొలములు దున్ను పశువుల నే ప్రకారముగా మేపవలయునో, వానికి రోగములువచ్చినప్పు డేప్రకారముగా నేమేమి చికిత్సలు చేయవలయునో, తెలిసికొనవలసి యుండును. అట్లు తెలిసికొని శాస్త్రానుసారముగా సేద్యముచేసి, పిత్రాచారమును బట్టియే

యెప్పుడు నేకరీతిగా వ్యవసాయము చేయువానికంటె ద్విగుణముగాను త్రిగుణముగాను ఫలముఁ బొందవలె నన్నవాఁడు రసవాదశాస్త్రము, పశువైద్యశాస్త్రము, వ్యవసాయశాస్త్రము, మొదలయినవాని నెన్నిటినో నేర్చుకొనవలయును. కాలువలు త్రవ్వి నీరు నడుపువారు జలము యొక్క ధర్మములను తెలియుటకయి జలశాస్త్రమును జలయంత్రశాస్త్రమును నభ్యసింపవలయును. అద్దములు మొదలయిన వానిని జేయువారు తాము చేసెడిపనిని క్రమక్రమముగా నభివృద్ధిచేయ నపేక్షించినపక్షమున తదనుగుణములయిన జడపదార్థధర్మములను బోధించెడు ప్రకృతిశాస్త్రముల నవశ్యముగా గ్రహింపవలెను. ఇట్లేవృత్తినభివృద్ధి పొందించి తగిన ప్రతిఫలము నిచ్చుదానినిగాఁ జేయవలె నన్నను దానితో సంబంధించిన విషయములను తగినంతవఱకుఁ జదివి దాని యభివృద్ధికయి యాలోచించుచు మునుపున్న లోపములను దిద్ది కావలసిన మార్పులను జేయుచు క్రొత్తపనిముట్లను కల్పించుచు పాటుపడక తప్పదు. ఇటువంటిపని విద్యాగంధములేని మూఢశిరోమణుల చేత కానేరదు. ఇట్లని వ్యవసాయము మొదలయినవి చేయువారందఱును ప్రకృతివిషయమునందును సంపూర్ణపాండిత్యము పొందవలెనని నేనిప్పుడు చెప్పవచ్చినవాఁడనుకాను. తాను చేసెడుపనిని సామర్థ్యముతోను సంపూర్ణోపయోగముగాను నిర్వహింపఁగోరినయెడల నట్టి పనితో సంబంధించిన జ్ఞాన మవశ్యముగా నుండవలయును గనుక కులవృత్తికి తగిన చదువు పనివాండ్రకు తప్పక చెప్పింపవలెనని మాత్రము నాతాత్పర్యము. శాస్త్రమునం దేశాఖ నభ్యసింపవలె నన్నను ముందుగా కొంతవఱకు భాషాజ్ఞానమును కలిగియుండవలసినదే గనుక, సమస్తవృత్తులవారికిని ప్రతిగ్రామమునందును పాఠశాలలుంపించి వారి నందఱుఁ జదివించుట యుక్తము. ఇప్పుడు కులవృత్తులు

చేయువారందఱు చదువక్కఱలేకుండ తమతమ వ్యాపారములను చక్కఁబెట్టుకొనుచుండలేదా? పొలములు దున్నువారికి చదువ నవకాశముండునా? అని మనవారు కొందఱనవచ్చును. ఈవృత్తుల నెదుగుబొదుగులు లేక యిప్పటిరీతిగానే యుంచి శీఘ్రకాలములోనె దారిద్ర్యదేవతకు పట్టాభిషేకముచేసి మనదేశమును సమర్పింప నిశ్చయించుకొన్నయెడల పనివాండ్రకు చదువక్కఱయుండదు; గాని వారి నావేశించియున్న మూర్ఖతాపిశాచమును పాఱఁదోలి వృత్తుల నభివృద్ధినొందించి దేశమును భాగ్యలక్ష్మికి నివాసస్థానముగాఁ జేయ నుద్యమించి నప్పుడు మాత్రము వారికి విద్యఁజెప్పించి యభివృద్ధిమార్గము నాలోచించుటకు తగిన శక్తిని గలిగింపక తప్పదు. ఇఁక వారికిఁ జదువు నేర్చుకొనుట కవకాశముండునా యను విషయములో తమకు నావశ్యకమని తెలిసికొని వారు విద్యయందు శ్రద్ధగలవారయినచో నవకాశము కావలసినంత దొరకును. బుద్ధి కుదిరినచో నవకాశమెన్నటికిని దొరకకమానదు. పాఠశాలయందు మాత్రమే కాక యింటఁగూడ పాఠములు చెప్పుటకు నొక పెద్ద ఉపాధ్యాయు లుండ చదువుటకు కావలసినన్ని పుస్తకములుండి యితరసాహాయ్యము లనేకము లుండినను శ్రద్ధయొక్కటి లేకపోవుటచే ధనికుల బిడ్డలలో కొందఱికి కొక్క విద్యయు రాకపోవుటయు నయిసాధనకలాపములో నొక్కటియు లేకపోయినను శ్రద్ధ యొక్కటిమాత్ర ముండుటచే బీదబిడ్డలు కొందఱు విద్య లనేకము లల్పకాలములో గ్రహింపఁగలుగుటయు, పలువు రెఱిఁగియుండవచ్చును. కాఁబట్టి యవకాశ ముండదనుమాటను దూరముగా నుంచి వృత్తులను మంచిస్థితికిఁ దీసికొని రాఁగోరెడు మనము పనివాండ్రకెల్లను విద్యయందు శ్రద్ధాభక్తులు కుదురునట్లు చేయుటకును, చదువునందు బుద్ధిగలవారి నిమిత్త

మయి పాఠశాలలను స్థాపించునట్లు చేయుటకును, శక్తివంచనలేక సమస్తప్రయత్నములు చేయవలయును. వీరికి పగటిపూట చదువు చెప్పెడి చిన్నపాఠశాలలు మాత్రమేకాక పగలు పనిచేసి వచ్చు వారి కుపయోగపడునట్లుగా తగినన్ని రాత్రిపాఠశాలలుకూడ స్థాపింపవల యును. ఈవిషయమున సీవఆకే దొరతనమువారును స్థలనిధిసంఘ ములవారును నగరపారిశుద్ధ్యవిచారణ సంఘమువారును శ్రద్ధపుచ్చుకొని కొంత పనిచేసియున్నారు. అయినను జనులతోడ్పాటులేక ప్రభుత్వము వారిప్రయత్నములు పూర్ణముగా కొనసాగఁజాలవు గనుక దొరతనము వారు పనిచేయుచున్నారని యుపేక్షచేయక జనసామాన్యముయొక్క వృద్ధికయి సాధ్యమైనంత పని చేయుట మనకుకూడ పరమధర్మమే.

ఈప్రకారముగా మనదేశమున వృత్తులుత్కృష్టదశను పొందక పోవుటకుఁ గల కారణము లనేకములున్నను వానినన్నిటిని వివరించుట కిప్పు డవకాశముచాలక యింకొక్క యంశమునుమాత్రము చెప్పి ముగించుచున్నాను. ఈదేశమునందు చదువుకొన్నవారు తాము వృత్తులయందు ప్రవేశించుట తమగౌరవమునకు హానికరమని దురాభ్రాంతి నొంది వృత్తులపొంత పోవొల్లకుండుటగూడ వృత్తుల నికృష్టదశ కొక ముఖ్యకారణముగానున్నది. నాలుగుముక్కలు చదివిన తోడనే తామేమో మహావిద్వాంసుల మయితిమనియు తమపాండిత్య మున కిది తాతముత్తాత లాచరించిన వృత్తి ననుసరించుట గౌరవ లోపమనియు దురభిప్రాయపడి మనవారనేకులు తమదుష్పాండి త్యముచేత నెందుకుం బనికిరాక చెడిపోవుచున్నారు. ఇందుకు దృష్టాంత ముగా నాచిన్నతనములో నొకమంగలి రాజమహేంద్రవర రాజకీయ పాఠశాలలో నాలవతరగతివఱకును జదివి చాలించి, తనకులానుగత మయినవృత్తి నవలంబించుట లాఘవాస్పదమని తన యల్పవిద్యా

ప్రభావముచేత నిశ్చయించుకొని, యుద్యోగమున కాశపడి యెల్లవారి నాశ్రయించి న్యాయమార్గమున సుఖజీవనము చేయుటకు చాలిన ధనమును వేఱువిధమున సంపాదించుకోలేక దారిద్ర్యభూతముయొక్క ప్రేరణముచేత చౌర్యమునందు ప్రవేశించి, కడపట చెఱసాలయందు పడి చెడి చిక్కులుపడఁగా నేను ప్రత్యక్షముగా చూచియున్నాను. ఇటువంటి యల్పవిద్యావంతులయిన మహాపండితులు తాము రాజకీయోద్యోగములకే యర్హులమనియు, ఇతరవృత్తులేవియు తమగౌరవమునకు తగనివనియు, తామెంత కష్టపడియైనను రాజకీయకార్యస్థానములయందు కొలువుకుదిరి తమయావజ్జీవమును దాసికి ధారపోయవలయుననియు, దృఢనిశ్చయులై లోపల పొట్టకు కూడులేకపోయినను పయికి బొట్టులును బట్టలును సవరించుకొని సంవత్సరముల కొలఁది జీతబత్తెములు లేక కార్యస్థానములవెంట నూఱాఱుఁదిరిగి వెట్టికి పనిచేయుచు, నైచ్యమునకు వెనుకతీయక యుద్యోగస్థుల యిండ్లచుట్టును దిరిగి బుజములు పడిపోవ వారిపిల్లలనుమోచి సంశ్రయించుచు, పేరులేని చిన్నయుద్యోగస్థులు సహితము వెట్టిపనిలో తప్పులెన్నిపెట్టు చీవాట్లే తమకు లాభముగా తమ జన్మములను సార్థకపఱుచుకొనుచుందురు. ఒక్క యల్పవిద్యావంతులకేకాక బహుపరీక్షలం గృతార్థులయిన వారికిని, రాజసేవకే యాశపడి తిరుగుచుండుటవలన నించుమించుగా నిటువంటిగతియే సంప్రాప్తమగుచున్నది. రాజకీయోద్యోగముల సంఖ్యకంటె పరీక్షలం గృతార్థులగువారి సంఖ్య యత్యధిక మగుచున్నందున కొందఱికేకాని యందఱికిని పనులు దొరకనేరవు. ఒక్కపనికయి గోతిదరినక్కలవలె ననేకులు నోరు తెఱచుకొని కనిపెట్టుకొని యుండుటచేత నిప్పు డుద్యోగగౌరవమే చెడిపోయినది. రెండురూపాయల జీతమిచ్చినచో నలుగురు పరీక్షాసిద్ధులు దొరకు

చున్నారుగాని యెనిమిదిరూపాయలు జీతమిచ్చినను తిన్నని వంట బ్రాహ్మణుఁడు దొరకుట దుర్లభముగా నున్నది. ఈప్రకారముగాఁ జదువుకొన్నవారందఱును రాజసేవకొఱకే కాచుకొని యున్నయెడల మోసపోయి తుదకెందునకుం బనికిరానివా రగుదురు. స్వాతంత్ర్యము లేక పోవుటచేత సేవకవృత్తి తక్కిన వృత్తులన్నిటికంటె మిక్కిలి యధమమయినది. కాఁబట్టి చదువుకొన్నవారు తప్పక వృత్తులన్నిటి యందును ప్రవేశించి పనిచేయవలసిన కాలము వచ్చినది. అట్లు ప్రవేశించుటచేత వారు తాము లాభమునుపొంది సుఖజీవనము చేయుటకు శక్తులగుట యేకాక వృత్తులను మంచిస్థితికి తెచ్చి దేశమునకు క్షేమము చేసినవారగుదురు. విద్యాధికులు ప్రవేశించినయెడల నన్ని వృత్తులును గౌరవావహములే యగునుగాని గౌరవమునకు భంగము తెచ్చెడి వృత్తి యేదియు నుండదు. ఇంతవఱకును చదువుకొన్నవారెవ్వరును ప్రవేశింపక పోవుటవలన కొన్నివృత్తులు నీచములుగా తలంపఁబడుచున్నవేకాని నీచములగుటకు వృత్తులు చేసిన పాపమేదియు లేదు. ఎప్పుడును వృత్తులయందు ప్రవేశించినవారినిబట్టి వృత్తులకు గౌరవము రావలయునేకాని వృత్తులనుబట్టి ప్రవేశించినవారికి గౌరవము రాఁబోదు. పురుషునకు నిజముగా గౌరవము తెచ్చునవి సత్యమును శాంతమును యుక్తప్రవర్తనమును విద్యయుఁ గాని ధనసంపాదనమునకయి యవలంబించిన వృత్తులు కావు. ఇప్పుడు సర్వోత్కృష్టమయినదని యెంచఁబడెడు వృత్తియందైనను నీతిమాలినవారును మూఢులును ప్రవేశించి పనిచేయఁజొచ్చినచో దాని గొప్పతనమంతయు మూఁడు దినములలో మూలపట్టి మిక్కిలి నీచమయినదగును. ఇప్పుడు మిక్కిలి నికృష్టమయినదని తలంపఁబడెడు వృత్తియందయినను చదువుకొన్నవారును యుక్తప్రవర్తనము గలవారును ప్రవేశించి పని సాగించు

చున్నచో నిమిషములో దాని కెక్కుడలేని గౌరవమును వచ్చి సర్వజన సమాదరణీయ మగును. మనలోని చదువుకొన్నవా రీసత్యమును మనసునందు దృఢపఱుచుకొని కొందఱు ముందుగా తాము మార్గప్రదర్శకులయి జనులలోఁగల దురభిప్రాయమును దొలగించి వృత్తులను క్రమపఱచి దేశమును ధనసంపన్నము చేయుటకయి ప్రయత్నింతురని దృఢముగా నమ్ముచున్నాను. అట్లు ప్రవేశించినవారు మంచిసాధనములను కనిపెట్టి పనిని సులభపఱచి తావిత్తాఢ్యులయి మొత్తముమీఁద దేశమునకంతకును లాభము కలుఁగఁజేయు శక్తులగుదు రనుటకు సందేహముండదు. చదువుకొన్నవారు వృత్తుల నవలంబించి యుండుటచేత యూరపుఖండమునందు దినదినము నేప్రకారముగా క్రొత్తసాధనములు కనిపెట్టఁబడి పని సులభపడుచున్నదో యెఱిఁగినవారి కీసంగతి వింతగా కనఁబడదు. మన దేశమునం దిప్పుడున్న యుపకరణములలో లోపము లేమి యున్నవనియు వానిని బాగుపఱుపవలసిన యావశ్యకమేమున్నదనియు కొందఱు భావింపవచ్చును గాని వారియూహ యెంతమాత్రమును సరియైనది కాదు. లోకములో మనుష్యుఁడుచేసిన కార్యములన్నియు నంతకంత కభివృద్ధి పొందఁదగినవిగా నుండును. ఈదినమున పూర్ణముగా నున్నట్లు కనఁబడునవి రేపటిదినము మరల నాలోచించినచో వానియందు కొన్నిలోపములగపడి మరల మార్పఁదగినవిగా కనఁబడుచుండును; కొన్నివస్తువులయందు లోప మొక్కసారిగా కనఁబడక పోయినను వానిని సులభముగా చేసెడు సాధనములయందు లోపములగపడి యభివృద్ధికి తగినవిగా నుండును. ఈ ప్రకారముగా నాలోచించిన కొలఁదిని పూర్వపువారెప్పుడును నెఱుఁగని క్రొత్తవస్తువులను నిర్మించువిధమును కనిపెట్టుటకును వానిని మేలిమి చెందించుటకును వానిని చేయుసాధనముల

బాగుపడుచుటకును నావశ్యక మగపడును. దేశము నాగరికతయం దును సుఖభోగాదులయందును వృద్ధిపొందుట కిదేమార్గము. చదువు కొన్నవారు శిల్పాదివృత్తులయందు ప్రవేశించి కొన్ని సంవత్సరములు పూనికతో పనిచేయు భాగ్యము మనదేశమునకు లభించిన తరువాత అద్దములు, కుండలు, పెంకులు, ఇటుకలు, మొదలయిన మట్టిపనుల యందును, వంతెనలు, విగ్రహములు, మండపములు, దేవాలయ ములు మొదలయిన రాతిపనులయందును, బల్లలు, పెట్టెలు, మంచ ములు, బండ్లు మొదలయిన కఱ్ఱపనులయందును, కాలువలు, నూతులు, చెఱువులు మొదలయిన నీటిపనులయందును, చిత్రములు వ్రాయుట యందును, రంగులు వేయుటయందును, తివాచులు బట్టలు మొద లయినవి నేయుటయందును, బెత్తపుపనులయందును, కొమ్ముపనుల యందును, తక్కిన యన్నిపనులయందును, ఎంతో యభివృద్ధిని చూడ వచ్చును. అప్పు డావిరియంత్రములును నీటియంత్రములును గాలియం త్రములును దేశమంతటను వ్యాపించి దేశము కన్నులపండువుగా నుండవచ్చును. ఇదియంతయు మనకిప్పుడు స్వప్నములోని వార్తగా తోఁచవచ్చునుగాని చదువుకొన్నవారు దేశాభిమానులయి తమ కృత్యమును తెలిసికొని వృత్తులయందు ప్రవేశించి దేశాభివృద్ధికి తమ శరీరములను ప్రాణములను ధారపోసినచో నచిరకాలములోనే యీ చెప్పినదంతయు మన కన్నులయెదుట నగపడుసత్యమే కావచ్చును. మనుష్యుల కుపచారములు చేయుట మొదలయినవి కొన్ని సేవకవృత్తు లగునుకను, అన్నివృత్తులలోను సేవకవృత్తి యధమమయినది గను కను, వెంటలెత్తుట, దొడ్లుతుడుచుట, బట్టలుతుకుట మొదలయిన కొన్నిపనులు న్యాయముగానే యెల్లదేశములయందును సమస్తకాల ములయందును నీచములుగా చూడఁబడుచున్నవి. అందుచేత వాని

నవలంబించినవారికి తక్కినవృత్తుల నవలంబించిన వారికి గల గౌరవ ముండదు. దేశమందెంత విద్యాభివృద్ధియైనను సమస్త జనులును పండితులగుట యెన్నఁడును సంభవింపనేరదు; కొందఱు గాకపోయిన కొందఱయినను మూర్ఖులుగా యుండకతప్పరు. అట్టివంటివారే సాధారణముగా నీకడకట చెప్పిన నీచవృత్తులయందు ప్రవేశించి పని చేయుచుందురు. అవి తప్ప గౌరవమునకు భంగము కలిగించెడు పట్టియు విద్యావంతుల కిష్టములు కానట్టియు వృత్తులు మఱియేవియు లేవు. ఇవిసహితము మనదేశమునం దిప్పుడు గౌరవప్రదములుగా నెంచఁబడుచున్న భిక్షాదివృత్తులకన్న వేయిరెట్లు శ్రేష్ఠమయిన వనియే చెప్పవచ్చును. సోమరితనమున కాలము గడపుచు స్వకాయ కష్టపడక పరులవిత్తమువలన జీవించుటకంటె హేయమైనవృత్తి లోకములో నేదియు నుండదు. యాచ్ఞావృత్తి పరమనికృష్టమైన దనియు దానికంటె లాఘవాస్పద మయినది మఱియొకటి లేదనియు మనపూర్వు లనేకవిధములఁ జెప్పియున్నారు. వారిలో నొకకవివర్యుఁడు యాచకుఁడు గడ్డికంటెను తేలికయనియు, గడ్డి కసవులు గాలి కెగురఁగొట్టుకొని పోవుచుండఁగా యాచకుఁ డెగురకొట్టుకొని పోకుండుటకుఁగల కారణము దరికి చేరవచ్చినచో వాఁడు తన్నుకూడ యాచించి పీడించునని గాలిదేవుఁడు భయపడుటయేయనియు, చమత్కారముగా చెప్పిన శ్లోకముననేకులు చదివియుందురు. కాలకర్మ దోషమువలన నిప్పుడగౌరవముగా నెంచఁబడకున్న యాచ్ఞావృత్తి నశించి కష్టపడి స్వార్జితమువలన జీవించు వృత్తులే గౌరవావహములని యెప్పుడెంచఁగాని దేశమెన్నటికిని బాగుపడదు. చదువుకొన్నవారు వృత్తులయందుఁజేరి పనిచేసినఁగాని వృత్తులకు గౌరవము రాదు. మన పెద్దింటి మహానుభావులు సహితము తాము వృత్తులయందు

ప్రవేశించి యేవృత్తి నవలంబించినను న్యాయమార్గావలంబనులకు గౌరవలోపములేదని లోకమునకుఁ జూపి యున్నారు. రాజసూయా ధ్వరముచేసి సార్వభౌముఁడైన ధర్మరాజంతవాని తమ్ములు నకుల సహదేవు లశ్వపాలనమును గోపాలనమును నీచముగా నెంచక పనిచేసి యున్నారు; దిగ్విజయముచేసి విజయుఁడని పేరొందిన యాసార్వభౌముని తమ్ముఁడే నాట్యాచార్యుఁడుగా కుదిరెను; చక్రవర్తియైన నలుఁడును, భీముఁడును వంటలవారుగా నుండుటకు సంశయింపలేదు. ఈకడపట చెప్పిన వారిరువురును విద్యాధికులగుటచే పాకకౌశలమునం దసమానులై నలపాక భీమపాకములని లోకులు సామెతగా చెప్పుకొనునంత ప్రసిద్ధి కెక్కిరి. అంతకుపూర్వమే వారికి చిరకాలాభ్యాసములేక పాకవిద్యయం దటువంటినేర్పు కలుగుట సంభవింపదుగదా? అది యెట్లైనను రాజాధి రాజులు పాదాక్రాంతులై పనిచేయ సమస్తగౌరవములను పొందిన కిరీటాధిపతులు సహితము సమయము వచ్చినప్పు డట్టి వృత్తుల నవలం బించుట గౌరవహీనతగా నెంచలేదనియు, వారటువంటివృత్తులయందు ప్రవేశించుటవలన వారిగౌరవము లేశమాత్రమును చెడలేదనియు, పయి నిదర్శనములవలన స్పష్టమగుచున్నది. అదిగాక మనఋషులును విద్వాంసులును పలువురు చతుష్షష్టికళల నభ్యసించి ప్రవీణులయినట్టు బహుగ్రంథములు సాక్ష్యమిచ్చుచున్నవి. పాక శిల్ప గజాశ్వశాస్త్రాదులు చతుష్షష్టికళలలో చేరిన వాటచేత పూర్వకాలమునందు మనలోని విద్వాంసులు బహువృత్తులకు గౌరవము తెచ్చిరనుట విస్పష్టమగు చున్నది. మఱియు నిప్పైని చెప్పిన శాస్త్రములకు ఋషులే కర్తలయి యున్నారు. కాఁబట్టి పూర్వపు విద్వాంసులమార్గము ననుసరించి యిప్పటి విద్యావంతులును వృత్తుల నవలంబించి యాయావిషయముల యందు గ్రంథములను రచించి వాని నభివృద్ధి పొందించినంగాని దేశాభి వృద్ధి కలుగదు.

మనదేశమునందలి శిల్పాదుల యభివృద్ధికయి యాయాజాతులవారే యాయావృత్తుల నవలంబింపవలయు నన్న నియమమును పెట్టుకొనక యెవ్వరికి దేనియందభిరుచిగలదో వారాపనియందు ప్రవేశించుట యావశ్యకమనియు వస్తునిర్మాణక్రమము కాలానుగుణముగా మారుచుండవలయుననియు, కర్మకారులు విద్యాభ్యాసము చేసినవారు కావలయుననియు, విద్యావివేకవంతులు వృత్తులకు పూనుకొనవలయుననియు చెప్పియున్నాను. పుస్తకములయం దెంతచదివినను చదివిన విషయములను ప్రత్యక్షముగా చూచి గ్రహించినంగాని యావిద్య పూర్ణము కానేరదు. సంగీతశాస్త్రమునందు రాగలక్షణాదులను నేర్చుకొన్న మాత్రముచేతనే యెవ్వరును కర్ణరసాయనముగా పాడ శక్తులుకారు. కాబట్టి లోకములో ననుభవజ్ఞానములేని చదువంత ప్రశస్తము కాదు. శిల్పాదులయందు ప్రవేశించిన విద్యావంతులు యంత్రనిర్మాణాదులను గూర్చిన కేవల శాస్త్రజ్ఞానముతో తృప్తిపొందియుండక యంత్రముల నిర్మించి వానితో పనిచేసెడు దేశములకుం బోయి నిర్మాణకౌశలమును పనిచేయు క్రమమును కనిపెట్టి యనుభవజ్ఞానమునుగూడ సంపాదింపవలయును. అట్లుచేసినసే నిజమైన యభివృద్ధి కవకాశము కలుగునుగాని యిల్లువదలక మూల కూరుచుండి యాకాశమువంక చూచి యాలోచించుచున్న మాత్రమున నభివృద్ధి కలుగదు.

మిత్రులారా! మనము విద్య చదువుకొన్నది మనస్వభావమును శక్తిని గ్రహించి యుక్తాయుక్తముల నాలోచించుటకు శక్తులమయి యుక్తమార్గమున నడుచుకొనునిమిత్తము గాని మనము చదువుకొన్నామని యితరులకు చూపుటకొఱకును ప్రతిష్ఠకొఱకును గాదు. తక్కినవారికంటె మనము వివేకుల మయినందుకు ఫలము మన మాత్మాభిమానము గలవారమయి, అంతరాత్మ చెప్పినదాని యందు

గౌరవముంచి, తదుక్తరీతిని ప్రవర్తించుట. అంతేకాని మన మంతరాత్మ నడుగున త్రొక్కి మూర్ఖులయిన వారి మెప్పునకయి దానిని వారియభిప్రాయములకు బలిపెట్టి యస్వతంత్రులమయి కీలుబొమ్మలవలె పరులాడించిన ట్లెల్లను నాడుచుండుట మన కెంతమాత్రమును పౌరుషకర్మము కాదు. మీరు మీస్వాతంత్ర్యమును మాటలచేత మాత్రమేకాక కార్యములచేతఁగూడ లోకమునకు వెలడిపఱిచి తెలియనివారు చేసెడు పరిహాసములను లక్ష్యము చేయక మీరు న్యాయమని నమ్మిన ప్రకారముగా శిల్పాదివృత్తులయందు మీలోతగినవారు ప్రవేశించి యితరులకు దారిచూపి లోకోపకారధురీణులగుదురని కోరుచున్నాను.



# వేశ్యాకాంతలు.

సువివేకులారా!

నే నీదినమున ప్రసంగింపవలసినది వేశ్యావృత్తివిషయమే యయినను, ఆసంగతి నారంభించుటకు ముందు సుఖభేదములను గుఱించి కొంచెము ప్రస్తావింపవలసియున్నది. లోకములో నెవ్వ రెప్పు డేకార్యమును చేసినను, ఏకార్యమును త్యజించినను, తమ సుఖము నపేక్షించియే యని యెల్లవారు నెఱుఁగుదురు; కాఁబట్టి యెల్లవారును జేసెడు ప్రయత్నములన్నియు దుఃఖనివారణముకొఱకును సుఖసంపాదనముకొఱకును ననుట స్పష్టము. అందుచే నెంతమూఢుఁడును బుద్ధిపూర్వకముగా సుఖము పోఁగొట్టుకొని దుఃఖమును తెచ్చిపెట్టుకొనఁడు. అయినను తమయధీనములోనున్న విషయములలోనే పలువురు మూర్ఖత్వముచేతనో యింద్రియలోలత్వముచేతనో దూరము విచారింపక తాత్కాలికసుఖము వచ్చునని భ్రమపడి కార్యములను జేయుచుండుటవలన వారికి సుఖమునకు మాఱుగా దుఃఖమే బహుతరముగా సంప్రాప్తమగుచున్నది. అదిచూచి బుద్ధిమంతులగువారు తా మొకకార్యమును జేయునప్పుడు సద్యఃఫలముమాత్రమే చూడక దానివలన ముందు కలుగఁబోవు ఫలములనుగూడ విచారించి కర్తవ్యాకర్తవ్య నిశ్చయముచేయుదురు. దానినిబట్టియే సర్వసాధారణముగా లోకములో నవివేకులు పలుకష్టముల పాలగుచు వచ్చుచుండుటయు సువివేకులు సుఖపరంపరను చెందుచుండుటయు సంభవించుచున్నది ఈజగములో మృగ మొక్కటియే ముందుసంగతి బొత్తిగా

విచారింపక ప్రస్తుతసుఖముతోనే తృప్తిపొందియుండునది. మనుష్యుఁ డెంత బుద్ధిహీనుఁడుగా నున్నను కొంచెముగానో గొప్పగానో భవిష్యత్సుఖమును చూచుకొనుచునేయుండును. కాఁబట్టి మనుష్యునకును మృగమునకును గల భేదము ముందుగా భావిసంగతులయొక్క విచారావిచారములలోనే యారంభమగును. మనుష్యుఁడు ముందుసంగతుల నెంతయల్పముగా విచారించువాఁడయిన నంత మృగప్రాయుఁడనియు, ఎంతయధికముగా విచారించువాఁడైన నంతజ్ఞానాధికుఁడనియు, చెప్పఁబడును. ఇప్పుడు చెప్పినదానివలన మనము చేయువానిలో పలుకార్యములు సుఖదాయకములుగానే కనఁబడినను వానిలో గూడ సుఖతారతమ్యవిచారము చేయవలసిన యావశ్యకము కలుగుచున్నది. మనకుఁ గలిగెడు సుఖమంతయు శరీరసుఖమనియు, ఆత్మసుఖమనియు రెండువిధములుగాఁ జెప్పవచ్చును. ఈరెండుసుఖములలో శారీరసుఖమునకంటె నాత్మికసుఖ ముత్తమమయినదని కొంచెము వివేకముగలవారందఱును ఏకవాక్యముగా నొప్పుకొనియున్నారు. వీనిలో దేహసుఖము మృగములకును మనకును సామాన్యమయినది; ఆత్మసుఖ మొక్కటియే మనుష్యుల మైనంగాన మన కధికముగా వచ్చినది. మనబాహ్యేంద్రియములను తృప్తిపఱచుటవలనఁ గలుగునది దేహసుఖము; నీతిమార్గమున నడుచుటవలనను భగవద్భక్తి మొదలయిన వానివలనను కలుగునది యాత్మసుఖము. ఇంద్రియసుఖము పశువులకును మనకును సామాన్యమయినదే కాఁబట్టి యింద్రియసుఖము నెంతయెక్కువగా ననుభవించినను దానివలన మనకు పశువులకంటె నాధిక్య మేమియు రాదు. ఇంద్రియసుఖముల కనుకూలమయిన పదార్థములను సంపాదించుకొనుటలోను, వాని నుపయోగించుకొనుటలోను, మితము తప్పి యనుభవించుటవలనఁ గలుగు రోగాదులలోను

మృగములకు లేని కష్టము లనేకములు మనకు తటస్థించుచుండుటచేత నింద్రియసుఖములనే మరిగి యాత్మసుఖములను మఱచువారు పశుతుల్యులయినను గాక వానికంటెను హీనులగుచున్నారు. కేవలేంద్రియ సుఖపరాయణులయిన మానవాధములకువలె తిండినిత్తము పడ వలసిన కష్టము లేవియు పశువులకు లేవు; వారివలె పశువులెప్పుడును తప్ప త్రాగి దేహస్మృతి తప్పి పడిపోవు; అతిసంభోగము నాశించి సుఖరోగములను తగిలించుకొని బాధపడవు. కాబట్టి మన యాధిక్యమెల్లను మన యాత్మసుఖముల ననుభవించుటలో నున్నది. మన మెంతయధికముగా నాత్మసుఖములకయి ప్రయత్నించుచు వానిని పొందుచుందుమో వివేకిలోకములో మనమంత యగ్రగణ్యుల మగుచుందుము. ఆత్మ నిత్యమయినదియు దేహ మస్థిరమయినదియు నగుటనుబట్టి స్వభావముచేతనే దేహసుఖ మస్థిరమయినదనియు, ఆత్మసుఖము స్థిరమయినదనియు నేర్పడుచున్నది. అధికసుఖమునకయి యల్పసుఖమును విడుచుట బుద్ధిమంతుల లక్షణము గనుక, ఆత్మానందమునకు భంగము రాకుండునంతవఱకే యింద్రియసుఖముల ననుభవించుచుండుటకై తెలివిగలవాఁ డెప్పుడును కృషిచేయుచుండవలెను. అనఁగా ఆత్మానందమునకు భంగము సంభవించునని తోఁచినయెడల శరీరసుఖ మెంత యధికమైన దయినను దానిని మానుకొనవలయును. ఈ దేహాత్మసుఖములలో తారతమ్య మున్నట్లే ప్రత్యేకముగా దేహసుఖములలోను, ఆత్మసుఖములలోను కూడ తారతమ్యముండును. అందుచేతనే యధిక దేహసుఖము నపేక్షించి వివేకు లల్పదేహ సౌఖ్యములను విడిచి కొంచెము తాత్కాలిక కష్టములకయినను సహింతురు. మనము కొన్ని సమయములయందు జిహ్వాకింపుగా నుండు పంచభక్ష్య పరమాన్నములను భుజించుట మానుకొని నోటి కసహ్యముగా

ముందు కాలకూటవిషమువంటి చేదుమందులను కన్నులు మూసి
కొని మ్రింగుచుండుట కింతకంటె వేఱు హేతువేమున్నది? ఈ
కష్టపడుట యంతయు నప్పటి కింపు కాకపోయినను ముందు చిరసుఖ
మనుభవింపఁ గలుగుదుమన్న యాశచేత నేకదా? చిరకాల మాహార
నిద్రాదులను లక్ష్యముచేయక గురువు కొట్టినను తిట్టినను సహించి
పాఠశాలయందు విద్యాభ్యాసము చేయుట బహుకష్టముల కోర్చు
కొనుట పడినప్రయాసమునకు మించినఫలము ముందు లభించునన్న
కోరికవలన నేకదా? అల్పత్వాధికత్వభేదము మాత్రమే కాక మనము
సుఖప్రదము లనుకొను వానిలో నిహపరలోకముల రెంటియందును
సుఖమిచ్చునవి కొన్నియు, ఈలోకమునందుమాత్రమే సుఖమిచ్చు
నవి కొన్నియు, అప్పటికి సుఖమిచ్చునవిగానే కనఁబడినను కడపట
దుఃఖముగా పరిణమించునవి కొన్నియు ఉండును. సత్యము మొద
లయినవి మొదటి తరగతిలోనివి; ఆహారాదులు రెండవతరగతిలోనివి;
వ్యభిచారాదులు కడపటితరగతిలోనివి. ఈదుఃఖప్రదములైన వానిలో
గూడ కొన్ని యప్పుడే ఫలమిచ్చునవిగాను, కొన్ని యప్పటికి తెలియ
కుండ లోలోపలనె పనిచేయుచు కొంతకాలమునకు తరువాత ఫల
మిచ్చునవిగాను ఉండును. మనము గంధకద్రావకమును త్రాగిన
యెడల వెంటనే నోరు భగ్గున మండి తాపము హెచ్చి యప్పుడే ఫల
మగపడును; కలుషజలమును త్రాగినయెడల నప్పటి కేమియు కనఁ
బడక క్రమక్రమముగా పనిచేసి యెప్పుడో వ్యాధిని తెచ్చిపెట్టి దీర్ఘ
కాలమునకు ఫలమగపడును. తాత్కాలికముగా ఫలమగపడినను,
అగపడకపోయినను బుద్ధిమంతుఁడగువాఁడు తానొకపనిని దూరము
విచారించి యది యెప్పుడు నేహానిని చేయని నిర్దుష్టకార్యమయిన కృత్య
ముననే చేయవలెను. ఈపయిన వివరించినసుఖములలో నిహపరలోక

ముల రెంటను సుఖమిచ్చునది యుత్తమమనియు, ఈలోకమున మాత్రమె సుఖమిచ్చునది మధ్యమమనియు, తాత్కాలికముగా మాత్రము సుఖమిచ్చునది యధమమనియు నేనిక్కడ చెప్పనక్కఱ లేకయే యెల్లవారికిని తెలియును. వానిలో నుత్తమసుఖమునిమిత్తమె మధ్యమాధమ సుఖములను వదలుకోవలెననియు మధ్యమసుఖము నిమిత్తమయి యధమసుఖములను వదలుకోవలెననియు, కూడ నెల్ల వారును నెఱిగినయంశమే. ఇహమునం దాత్మానందమునకు లోపము లేకుండి పరమునందుకూడ కలిగెడు శాశ్వతానందమే మోక్షసుఖము గనుక, మహానుభావులైనవా రాయొక్క పారమార్థికసుఖమునే మన స్సునం దుంచి దానినిమిత్తమె తక్కిన యెన్నిసుఖములనైనను తృణ ప్రాయముగా త్యజించి విషయసుఖములయందు కేవలము నిస్పృహు లగుచున్నారు. లోకములో నటువంటి మహాత్ములెప్పుడును మిక్కిలి తక్కువగానే యుండుటచేత వారివిషయమయి చెప్పుట యనావశ్య కముగనుకను, సామాన్యజనులీ విషయసుఖములనుకూడ ననుభ వింపవలసినవారే గనుకను, ఇప్పుడు చెప్పిన సుఖతారతమ్యాదులముందు చెప్పబోయెడి వేశ్యాసంభోగాది సుఖస్వభావగౌరవములను తెలిసికొను టకు చాలియుండును గనుక, ఇంతటితో నీవిషయమును చాలించి ప్రస్తుతవిచారణీయాంశము నారంభింతము.

ఈయొక్క హిందూదేశముమాత్రము తప్ప మఱి యేదేశమునం దును, ఏకాలమునందును, దిగంబరులయి మృగప్రాయులయి వన చరులుగా నుండు మూర్ఖశిరోమణులు మొదలుకొని దివ్యాంబరధారు లయి విద్యావివేకసంపన్నులయి సుందరమందిరములయందు వాసము చేయు నాగరికశిఖామణులవఱకును గల యేజాతివారిలోను, వ్యభిచా రమే ప్రతిష్ఠావహమయిన కులవృత్తిగా నేర్పఱుచుకొని పంభోగవిద్యు

మము లేక స్వేచ్ఛగా విహరించు కులమువారున్నట్టు కనియు వినియు నుండలేదు. అదియేమి పాపకర్మమో గాని నిర్భాగ్యకరమయిన యీ దేశమునందుమాత్రము చిరకాలమునుండి మానహీనమయిన యీ పాడుపనికయి ప్రత్యేకముగా భోగకాంతలజాతి యొకటి యేర్పడి నేటివఱకును తెంపులేక బహుకాలసిద్ధముగా నచ్చుచున్నది. కాల కర్మవశముచేత మన దేశము నాశ్రయించియున్న వ్యభిచారదోష మయిన యపకీర్తిభూతములయిన క్షేత్రముల సుస్థిరములయిన జంగమశాలలయి ములవలెనున్న యీభోగాంగనలజాతి యీదేశమున నెప్పుడు నామ మాత్రావశిష్టమగునో దుర్వాహ్యముగా నున్నది. అయినను మన పూర్వులు వీరిని వ్యభిచారనిమిత్తముద్దేశింపలేదనుము. సంగీతము సర్వజనరంజకమయినది గనుకను, దానిలో మృదుమధురస్వరముగల సుందరులు నృత్తగీతాదులను నేర్చుకొని హస్తాద్యభినయముతో రాళ్లు కరఁగునట్లుగా పాడునప్పు డాస్థలము భూతలస్వర్గముగా నుండును గనుక నృత్తగీతాదుల యభివృద్ధినిమిత్తమే యేర్పఱిచిరనియు, చెప్ప వచ్చును. సంగీతమునందట్టి యద్భుతజగన్మోహనశక్తి యున్నదన్న మాట నేను లేదనను. సంగీతమొక్క మనుష్యులను మాత్రమేకాక చెవులుగల పశుపక్షిజంతువులనుగూడ నానందింపఁజేయఁగలదనియు నేనె ఱుఁగుదును. అందుచేత మన పెద్దలు "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసంఫణిః" యని సంగీతమును శిశువును పశువును పామునుగూడ గ్రహించునన్న వాక్య మతిశయోక్తిగాక కేవలము స్వభావోక్తియనుటయే నానిజమయిన తాత్పర్యము. సర్వజనమనోహరమయిన యీసంగీతము ముఖ్యముగా కాపాడవలసినవారు స్త్రీలేయనియు, వారికంఠమునందు పురుషకంఠమునకంటె నధికమార్దవమును మాధుర్యము నుండు ననియు, అందులో లయను దెల్పు పాదాభినయమును, అర్థమును

ప్రకటించు హస్తాభినయమును, భావాదులను బోధించు నేత్రాభినయమును దానికి తోడుపడినచో రసజ్ఞులయినవారి కిచ్చుటనే నశరీర స్వర్గము లభించుచున్నట్లుండునని యు, నేను పూర్ణిగా గుర్తెఱుఁగుదును. కాఁబట్టి స్త్రీజనసామాన్యమున కలంకారభూతమయిన పాతివ్రత్యముచే భూషితురాండ్రయి సర్వజనసమ్మానార్హురాండ్రయిన కులకాంతలయొద్దనే సర్వజనసమ్మోహనకరమయిన యీసంగీతవిద్య యున్నపక్షమున పయినిచెప్పిన గుణములను మాత్రమేకాక యింకను ననేకములయిన లాభములను కలిగి యిహపరసాధకమగుననుటకు లేశమయినను సందేహము లేదు. కాని మనదేశమున కట్టి భాగ్యము లభింపక యమూల్యమయిన యీగానవిద్య సంసారకల్పవృక్షమునకు వేరుపురుగులును, పాతివ్రత్యాన్నత్యసమునకు విఱుగుడుమందులు నయిన వేశ్యలపాలపడుటచేత దానివలన కలుగవలసిన యుత్తమలాభములేవియు కలుగకపోవుట యటుండఁగా మీఁదుమిక్కిలి మితిమీఱిన యనర్థములుకూడ సంప్రాప్తము లగుచున్నవి. ఏఁబదిదివ్యవాసనలను చుట్టును బెట్టినను మధ్య నొకయుల్లిపాయను చితుకఁగొట్టి పెట్టినపక్షమున, ఆసువాసనల గౌరవమంతయు నడఁగిపోయి సహింపరాని దుర్గంధమే యెల్లయెడలను వ్యాపించునట్లు సంగీతమొకటియేకాక యింక వేయిసుగుణములుకూడ కలిగియున్నను వానికొక్క వ్యభిచారమును తోడుకలిసినయెడల నావేయిసుగుణములును మూలపట్టి దుర్భరమయిన యొక్కవ్యభిచారమే పయికివచ్చి లోకములో చేయఁగలిగినంతనష్టమును చేయుచుండును. వేశ్యల ప్రధానవ్యాపారము జారత్వముకాక నృత్యగీతాదులు గనుక వానినిమాత్రమే యనుభవించి తక్కిన విషయములయందు విముఖులయి జితేంద్రియులయి యుండరాదాయని కొందఱడుగవచ్చును. దూరమునుండి పోడిమాటల

నన్నిటినైనను జెప్పవచ్చునుగాని నిజముగా సమయము సంభవించి రత్నాభరణములతో దృష్టి మిఱుమిట్లుగొలిపి మతిభ్రమ కలిగించు వేశ్యలు తారసించినప్పు డెంతటి దృఢచిత్తులకును మనసు నిలుప శక్యముకాదు. మన గట్టితనమంతయు దూరముగానుండి నీతులు చెప్పవంతవఱకే సాగునుగాని మనమనసు నొక్కసారి యాప్రకృతికు లోనిచ్చినయెడల, అది నెగసమీపమున బెట్టిన వెన్నవలె కరఁగి యావంకకు పాఱక మానదు. మనసీతులును నిష్ఠలును నియమములును స్త్రీలచూపులు మనమీఁద ప్రసరింపకున్నంతవఱకే నిలుచునుగాని స్త్రీలగాలి మనమీఁద సోఁకినతరువాత నవియన్నియు ఝంఝామారుతమునకు దూదపింజె లెగిరిపోవునట్లు నానాముఖముల చెదరిపోవక యొక్కనిమిషమును నిలువఁజాలవు. ఒక్క మనమాట యెందుకు? ఇంద్రియనిగ్రహము చేసితిమని ప్రతిష్ఠవహించి సంసారము త్యజించి యడవులయం దాకలములు తినుచు తపస్సులుచేయు ఋషులయంతటివారు సహితము మోహము పుట్టించు స్త్రీముఖ చంద్రబింబమును జూచి మోసపోయి తమతపస్సును గిపస్సును మఱచి యాస్త్రీలను జపించుకొనుచు వారికి దాసులగుచు వచ్చినారని మనము వినియుండలేదా? అందుచేతనే భర్తృహరి

శ్లో. విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబు పర్ణాశనా
స్తేపి స్త్రీ ముఖ పంకజం సులలితం దృష్ట్వైవ మోహంగతాః
శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుంజంతి యేమానవా
స్తేషా మింద్రియ నిగ్రహో యదిభ వే ద్వింధ్య స్తరే త్సాగరే.

వాయుభక్షులును జలహారులు నైన విశ్వామిత్రుఁడు పరాశరుఁడు మొదలయిన మహర్షులును స్త్రీముఖపద్మమును చూచినప్పుడు మోహపరవశులగు చుండఁగా, నేతితోను పాలతోను పెరుగుతోను వరి

యున్నమతిను సంసారులకే యింద్రియనిగ్రహము కలిగిన యెడల వింధ్యపర్వతముసహితము సముద్రమునందు తేలవలసినదేయని చెప్పి యున్నాడు. పర్వతము సముద్రమునందు తేలుట యెంత యసాధ్యమో సంసారములో నున్నవారు చక్కని స్త్రీని చూచినప్పుడు మనస్సును నిగ్రహింపఁగలుగుట యంతయసాధ్యమని యాకవిసార్వభౌముని తాత్పర్యము. ఈవాక్యముయొక్క సత్యమును తేటపఱుచుట కయి నేను మీకిక్కడ నొకచిన్నకథను చెప్ప ననుజ్ఞ వేఁడుచున్నాను.

పూర్వము వేదాంతశాస్త్రకర్తయైన వ్యాసులయొద్ద బ్రహ్మవిద్య నభ్యసించుచు విజితేంద్రియుఁడనియు దృఢచిత్తుఁడనియు పేరు పొందిన జైమినిమహర్షి యొకనాఁడు వ్యాసవిరచితమయిన యొక గ్రంథమును జదువుచు దానియం దొకచోట "బలవా నింద్రియ గ్రామో విద్వాంస మపి కర్షతి" బలవంతమైన యింద్రియవర్గము విద్వాంసుని సహిత మీడ్చునని యుండఁగా చూచి యింద్రియజాలము తనవంటి పండితుని సహితము తప్పుత్రోవ కీడ్చునా యన్న యహంకారముచేత గంటము చేతఁబుచ్చుకొని యాతాళపత్రముమీఁది "విద్వాంస మపికర్షతి" యనియున్న భాగమును "విద్వాంసం నాపకర్షతి" యని దిద్ది బలవంతమైన యింద్రియసమూహము విద్వాంసుని నాకర్షింపదని యర్థము కలుగునట్లు చేసెను. వ్యాసుఁ డదిచూచి యాశ్చర్యపడి తనశిష్యుని చిత్తస్థైర్యమును పరీక్షింపవలెనని బుద్ధిపుట్టి యాశ్రమమును భద్రముగా కాచుకొని యుండవలసినదని యాతని కప్పగించి తాను మఱియొకపుణ్యాశ్రమమునకు పోయివచ్చెదనని చెప్పినడిచెను. గురువుయొక్క యాజ్ఞాప్రకారముగా జైమిని తపోవనమును కనిపెట్టుకొని యుండి యొకవృక్షమూలమునఁ గూరుచుండి

రవుసంకెళ్ళవలె నితరుల నాకర్షించి తమవలలోఁ బడవేసికొని బంధించుటయం దారితేఱినవారు; అదిగాక నృత్తవిద్య నధీనము చేసికొని తమకన్నులు త్రిప్పుమిషమీఁద చూపరులడెందములు త్రిప్పుచు తమయాటతో సభలోని పెద్దలనుకూడ నాడింప శక్తి కలవారు; వీనికి మెఱుఁగు దెచ్చునట్లు మన్మథునయినను మరలుకొల్పి యింటిబంటును జేయించు పరమసామర్థ్యముగల యభినయమును చేతఁ జిక్కించుకొన్నవారు; వీని యన్నిటిశక్తులను దిగఁద్రొక్కి తాను మించి ప్రకాశింపఁగల ప్రభావముగలిగి యెటువంటి కఠినహృదయముల నయినను లక్కలాగున కరఁగించి రాగప్రవాహములో ముంచి తనప్రకర్ష కాకర్షింపఁగల సంగీతము వారిజిహ్వాగ్రమున నటించుచుండును. ఇటువంటి యమోఘసాధనములు గలిగి యెక్కడఁ జూచినను సుందరవేషములతో మేఁకవన్నెపులులవలె సేమఱియుండు వారిని బ్రింగ నోరుతెఱచుకొని వేశ్యారూపముననున్న యపమృత్యుదేవతలు తమయాలయములయందు మాత్రమేకాక మన సభాభవనములయందు సహితము స్వేచ్ఛగా సంచరింప నవకాశము కలిగి యుండఁగా యౌవనాంధకారము కన్నులఁ గప్పుకొనుటచే దూరదృష్టి లేనివారై లోకానుభవము లేమిచే లోగుట్టు తెలియక పైరూపములను చూచి మోసపోవు దుర్బలులు మిడుతలగ్నిలో పడునట్లు వెదకుకొనుచు పోయి వారివాత పడక యెట్లు తప్పించుకోఁ గలుగుదురు; అయినను మనదేశమునందున్న వారాంగన లందఱును పయిని చెప్పిన నృత్తగీతాదులయందుఁ గాని రూపమునందుఁగాని తక్కినవారికంటె నెక్కువవారు కారు. కొందఱు పాటపాడిన గార్దభములు తమ చుట్టములకుఁగాని చేరవచ్చునంతటి యింపుగానే యుండును; కొందఱాటలాడినను నిప్పుఁద్రొక్కిన మర్కటముల గంతులకన్న నెక్కువ రమ్యముగా నుండదు. అట్లయినను

శుభకార్యములయందు మేళములకువచ్చు వేశ్యలవలనఁ గలిగెడు నష్టమునకు మాత్రము లోపముండదు. ఎట్టివారయినను స్త్రీలు నామము చేతనే సుందరులు; యౌవనము వారికి తోడుపడి దేహమునకు లేని మెఱుఁగు తెచ్చును; ఇంకను గొంతకొలతయున్న సర్వావయవముల యందును తళుకుతళుక్కని ప్రకాశించు నగలు దానిని మాటివేయును; ఆపయిని దీపములవెలుతు రెట్టి కురూపముల నయినను సురూపములనుగాఁ జేసి కుబ్జల నప్సరసలను గావించును; ఇవియన్నియు నిట్లుండఁగా వారు పాడుపాటలు జితేంద్రియులకైన నున్మాదము పుట్టించు కామశాస్త్రిక బోధకములు; వారభినయించునప్పుడు సాధ్యమయినంత వఱ కెల్లవారు తమ్మే యాభోగస్త్రీలు కౌఁగిలించుకొని ముద్దాడ వచ్చుచున్న రనుకొనునంత భ్రమపడుట కవకాశము కలుగును. అట్టి సమయములో నెవ్వరి మనస్సులు సంచలింపకుండును? అట్లు సంచలించునప్పుడు వారు కులకాంతలై యుండి యందని ప్రమాదపడ్డయిననైన నష్టమేమియు లేకుండవచ్చును. వారట్టివారునుగాక యొక్క కాసిచ్చిన రాత్రియెల్లను తమదేహములను కొల్లగా నంగహీనుల కయినను సమర్పింపఁ గంకణము కట్టుకొన్న వెలయాండ్రు; ఈవిధముగా వారు సులభసాధ్యలుగా నున్నప్పుడు కామాతురులకు వారిని చేర కుండుటకు సిగ్గును భీతియు నెక్కడనుండి వచ్చును? "కామాతురాణాం నభయం నలజ్జా" యని వినలేదా? వారవారు లట్టి స్వభావము కలవారు గనుకనే యొకకవి గామునకే,

శ్లో. జాత్యంధాయ చ దుర్ముఖాయ చ జరాజీర్ణాఖిలాంగాయ చ
గ్రామీణాయ చ దుష్కులాయ చ గళత్కుష్ఠాభిభూతాయ చ
యచ్ఛంతీషు మనోహరం నిజవపుర్లక్ష్మీ లవశ్రద్ధయా
పణ్యస్త్రీషు వివేక కల్ప లతికా శస్త్రీషు రజ్యేత కః

వేదాంతశాస్త్రము చింతనము చేయుచుండఁగా సంజవేళను కనుచీఁకటిలో పాదములు మొదలుకొని శిరస్సువఱకును మేలిముసుఁగు వేసికొని లజ్జాభయములు నటింప మెల్ల మెల్లఁగా నడుగులుపెట్టుచు నొక విగ్రహ మాసమీపమునకువచ్చి జాలి పుట్టించెడు హీనస్వరముతో రాత్రి పరుండుటకు తావిమ్మని వేఁడుకొనెను. వ్యాసశిష్యుఁ డామె నాదరించి సంకోచింపక తలుపులు వేసికొని లోపల నిర్భయముగా పరుండుమని నియమించి మూఁగదిచూపి తాను మరలవచ్చి చెట్టు క్రింద కూరుచుండి చదువుకోఁచక యామె యెవ్వరైయుండునా యని యాలోచించుచుండెను. ఇంతలో చీఁకటిపోయి సంపూర్ణ చంద్రుఁ డుదయించి పట్టపగలని భ్రమించి కోకిలలు పాడునట్లుగా పండువెన్నెలలు కాయఁజొచ్చెను; కామాగ్ని రగులుకొనునట్లుగా మందమారుతము హాయిగా వీవనారంభించెను; ఆచల్లగాలితో నాశ్రమవృక్షముల పువ్వుల కమ్మతావులు గుప్పున ముక్కున సోఁకి దేహము పులకితము కాసాగెను; ఆశ్రమమున నొంటిగా నున్న యట్టి సమయములో గదిలోనున్న సుందరి యాతని చిత్తమునందు నిలిచి భ్రమపెట్ట మొదలుపెట్టెను. అప్పు డాతఁ డాసుందరి యెవ్వరో యిట్టి వేళ నొంటిగ రా కారణమేమో తెలిసికొందమని లేచి పరస్త్రీతో మాటాడుట యుచితముకాదని బుద్ధి మరలించుకొని మరల కూరుచుండి యింతలో కాముఁడు తనశక్తి నంతను గనఁబఱిచి చిత్తము ముఱ్ఱూతలూచి యాతని నపస్మారినిగాఁ జేయఁగా వెనుకకు నీడ్చు పాదములతో మెల్లగా గదిగుమ్మముచేరి పిలువసాగెను. ఎంతపిలిచి నను గదిలోనుండి ప్రత్యుత్తరము రాకపోయినందున, అతని చిత్తము మఱింత సంచలించి చివరకు తనయింద్రియములు తనకు వశములు గాక తన్ను కామున కొప్పగింపఁగా నంతవఱకును సహాయముగా

నున్న వివేకము తన్ను విడిచిపోఁగా నతఁడు మన్మథోపదేశముచేత నిచ్చెన వేసికొని గదిగోడయెక్కి గుణాలున లోపలఁదుమికెను. అట్లు దుమికి కన్నులు తెఱచి చూచునప్పటికి దీపమువెలుతురున జడలతోను గడ్డముతోను రుద్రాక్షమాలలతోను వ్యాసమహర్షి కన్నులయెదుట కనఁబడఁగా పయిప్రాణములు పయికిపోయి నిశ్చేష్టితుఁడయి దేహ మెల్లను కంపమెత్తి చెమ్మట కాలువలుగట్ట కొంతసేపు చిత్రప్రతిమ వలె నిలుచుండి తెలివి తెచ్చుకొని "స్వామీ! చెడితి చెడితి" నని గురువు పాదములమీఁద పడెను. ఆయన శిష్యుని ప్రేమతో లేవనెత్తి భయముడిపి ధైర్యముచెప్పి పిమ్మట నవ్వుచు "బలవా నింద్రియ గ్రామో విద్వాంస మపి కర్షతి" యన్నమాట సత్యమేనా యని యడుగఁగా గర్వభంగము కలిగి సిగ్గుపడి కొంతతడవు నోటమాట రాక యూరకుండి దుమికినప్పుడు కాలికి తగిలిన గాయపురక్తముతో "కర్షతి కర్షతి కర్షత్యేవ" యని "యీడ్చు నీడ్చును తప్పక యీడ్చు" నని మూఁడుమార్లు గోడమీఁద వ్రాసెనఁట! స్త్రీలు తారసించినప్పుడు వనవాసులయిన జ్ఞానులయవస్థయే యిట్లగుచుండఁగా యౌవనమదాంధులయి సంసారసుఖములలో మునిఁగి తేలుచుండువా రెట్టియవస్థను పొందిరన్నను, ఆశ్చర్యపడవలసిన దేమున్నది? అందులోను వేశ్య లందఱివంటి సామాన్యస్త్రీలు గారు. ఉగ్గుపాలనుండియు పరవంచనచేయు నుపాయములనే నేర్చుకొని పరులసంసారములను గూలఁద్రోచియు తాము విత్తార్జనముచేసి యీభూలోకములో బాగుపడవలయునని దీక్షవహించి స్వప్నావస్థయందయినను పాపభీతి లేని మహానుభావురాండ్రు; ఆపయిని విత్తాపహరణముచేయు దొంగలకు తోడుపడు రాత్రినే తాము తోడుపఱుచుకొని సాధారణముగా దీపములవెలుతురున నూతనవేషములతో తళుకుతళుక్కని మెఱసి బంగా

పుట్టుగ్రుడ్డివానికిని, ముఖమున పుండ్లుండు వానికిని, ముసలితనముచే నవయవపటుత్వము తప్పిన వానికిని, జడునకును, కులహీనునకును, కుష్ఠ రోగికిని, ఒక్కరూక నిమిత్తము తమ సుందరశరీరములను గుత్తకిచ్చుచు వివేకకల్పలతకు గొడ్డలివలె నుండు రావాంగనల నెవ్వఁడు కోరునని దూషించి యున్నాఁడు. మంచివారొకవేళ నీరీతిగానే భావించినను వారిమనస్సు లెప్పుడును వారిస్వాధీనములో నుండునవి కావు దృఢ చిత్తుల హృదయములుసహితము యొకానొకప్పుడు వారివశములో నిలువక మీఱి సంచరించును. వారారంభదశలో మునులు చెక్కిన సంకీళ్ళవలె నున్న భోగస్త్రీలను జూచినప్పుడు విముఖులయి దూరముగా తొలఁగి కూరుచుండియే చెవియొగ్గి సంగీతమును విన మొదలుపెట్టుదురు; అట్లు కొన్నిదినములు జరిగినతరువాత క్రమక్రమముగా చేరువను జరిగి పాట విననారంభింతురు; ఈవిధముగా మఱికొన్ని దినములు జరిగిన తరువాత నభినయమునుగూడఁ జూడవలయునని మొగమువంకఁ జూడ సాగుదురు; అటుపయిని దానిసౌందర్యమును జూడవలయు నని మే ముఖము తేఱిపాఱ చూడఁజొత్తురు; అంతకు వచ్చినతరువాత నిఁక నాగదు గనుక నొకనాఁడు పట్టిసౌందర్యవతితోడి సంభోగమునే కోరుదురు; కట్టకడపట నెప్పుడో యొకసారి యూరివంతపసియుగూడ కానిచ్చి మాటదక్కించుకొని వివేకమును మనస్సులోనుండి తఱిమివేసి దినదిన క్రమమున వేశ్యలకు దాసులై వారితోడిదే లోకమని యుండి వేశ్యావృత్తి సర్వోత్కృష్ట మయినదని వాదములు చేయుచు తుద కామేఁకవన్నపులుల నోళ్ళలోఁపడి యిల్లును దేహమును గుల్లచేసికొని యిహపరములకు దూరులై రోగములచేత బాధపడుచు వార్ధకము దాఁక బ్రతికినయెడల నప్పుడు భాగవతోత్తము లగుదురు. మునుపట శ్రీరంగనీతులను జెప్పినవారే యారీతిగా చెడి తుద కెంగసకుం బసికి

రాకపోయినవారుకాఁగా మనమెందఱినో చూచియున్నాము. పెద్దల నడతయే పిన్నలకు మార్గప్రదర్శక మగును గనుక పయి పెద్దలనుజూచి బాలురు సహితము తప్పుత్రోవలం బ్రవేశించి యిది యేమిరాయని యెవ్వరైన మందలించిరఁచో సిగ్గువిడిచి వారు చేసినారుకారా వీరు చేసినారు కారా యని దృష్టాంతములు చూపుచు, అంతటితోనైన నూరకుండక తమభార్య లందఱు స్త్రీలు కారనియు, తల్లిదండ్రులు చిన్న ప్పుడు తమయనుమతిలేక వివాహములు చేసిరనియు, సంభోగము లేనిమొదల నీర్ష్యనష్టము కలిగి రోగములు వచ్చునసియు, కుయుక్తులు చెప్పి తమ బుద్ధివైశిష్ట్యమును వెల్లడించుకొనుచు, తామేమో యింద్ర భోగము ననుభవించుచున్నా మనుకొని సంతోషపడుచున్నారు. వారికి లభించిన యింద్రపదవి యంతయు నింద్రునకు జారత్వఫలముగా దేహమునిండ లభించిన సహస్రనేత్రములవలెనే తమ దేహములనిండ పెట్టినియులంకారముగా వేయుకాయలను మచ్చలను సంపాదించుకొని కన్నులు గుంటలుపడి నేనుఁగులవంటివారు పీనుఁగులవంటివారగుట తప్ప మఱియొకటి కానరాదు. పెద్దలు గోతిలో పడుచున్నారను హేతువుచేత చిన్నలుకూడ పడవలయునని సుబుద్ధిమంతులును చెప్పరు గనుక పరులు చెడిరి కాన తామును చెడవలెననుటకు మొదటికారణ మొక కారణమే కానేరదు. కాఁబట్టి తమ దుశ్చేష్టల కితరులను నిదర్శనముగాఁ జెప్పుట కేవలము బుద్ధిహీనత. ఇఁక తమ భార్యలు రూపవతులు కారనెడు కారణము మొదటికారణమునకంటె శ్రేష్ఠమయినదని బుద్ధిమంతు లెవ్వరును పలుక సాహసింపరు. ఎల్ల వారును తమభార్యలు చక్కనివారు కావలెనని కోరుచుండుటయే కాని తాము చక్కనివారగుదురా కారా యన్న యంశము విచా రింపరు. తమభార్య లొకవేళ తమకంటె చక్కనివారిమీఁద కన్ను

వేసి 'మీరు మాకంటె కందముగా నుండలేదు గనుక మేము మఱి యొకరిని జూచుకొందు'మని భర్తలు నేర్పిన యుక్తి మరల వారియెడలం బ్రయోగింప సాహసించిన పక్షమున నీయపూర్వబుద్ధిమంతులు తాము చూపిన కారణముయొక్క గౌరవమును తెలిసికొని మూకీభావమును వహింతురేమోయని యాశ బాధించుచున్నది. కాని కాముని ప్రభావమును తలంచుకొనఁగా నాయాశ కవకాశము కనఁబడదు. చిన్నతనములో తల్లిదండ్రులు తమయిష్టమును తెలిసికొనకయే వివాహము చేసినను తామప్పుడంగీకరించి యూరకుండుటచేత భార్యలెట్టి కురూపిణులయినను వారి నాదరించి యేలుట కెల్లవారును బద్ధులగుచున్నారు. మంచిభార్యకు లక్షణము గుణసంపన్నురాలిగ నుండుట కాని చర్మముయొక్క రంగును ముఖముయొక్క గుండ్రతనమును కావు. బుద్ధిమంతుఁ డయినవాఁ డెవ్వఁడును "అనుకూలం సద్గుణా భార్యా" యన్న సదుక్తిని మనసునం దుంచుకొని భార్య గుణవంతురాలు కావలెననియే కోరునుగాని కేవల రూపవతి కావలెనని కోరఁడు. అదిగాక మనపూర్వులు "భార్యా రూపవతీ శత్రు" వనియే భావించుకొనుచుండిరి. ఈ నార్యోక్తియొక్క సత్యము బృహస్పతి యంతటి బుద్ధిమంతున కనుభవమయిన యంశము. గుణవతిగాక భార్య రూపవతిమాత్రమే యగుట సంభవించిన పక్షమున తమవలెనే పయిత్తోలును జూచి యాశపడి వివిధకుతంత్రములు పన్ను మహాపురుషుల యనుగ్రహమువలన భార్య నిజముగా శత్రువే యగును గనుక భార్యతో సుఖపడవలె ననుకొన్న భర్త తన కట్టి శత్రువును కోరుకొనకుండుటయే క్షేమకరము. ఇటువంటి యుక్తిరత్నములను పన్ను నేర్చిన బుద్ధిమంతులకు బుద్ధి చెప్పుటకు వజ్రతుల్యములైన యీ మనస్సులను భేదింపఁజాలిన వాగ్రూపమయినయిటువంటి రమ్యులహితోపదేశ

మునకంటె కార్యరూప మయిన ప్రబలహితబోధ తటస్థించి వారి కంటె రూపవతులయిన భార్యలు వారిని మీాఱి తిరుగుట సంభవింప వలెను గనుక, వారిని సన్మార్గచరులనుగాఁ జేయుట కయినను దైవము వారికట్టి చక్కనిభార్యలను దయచేయునుగాక! అయినను లోకములో నన్నియు మనము కోరుకొనునట్లు సంభవింపవు; మనకు న్యాయముగా నేది లభించినదో మనము దానితోనే తృప్తినొంది యుండవలెను. అప్పుడే మనకు నిజమైన యానందము కలుగును. అందఱికిని వీర్యనష్టము సంభవించుననికాని సంభవించు ననుకొన్నను బాలురందఱును తమవలె చెడి తిరుగుచున్నారనుట కాని తిరుగవలె ననుటగాని హాస్యాస్పదము గనుక, ఆవిషయమిక్కడ ప్రసంగింపవలసిన యావశ్యకము లేదు. ఈవేశ్యాసంభోగమువలన నొక వేళ కొన్ని స్వల్పలాభము లున్నవని చేసెడి వాదము నిమిత్తము క్షణకాల మంగీకరించినను, దానివలన కలిగెడి యనంతములయిన కీడులను తలఁచుకొన్న వారి కాలాభములు లవణమహాసముద్రములో రెండు మూఁడు తీయనీటిబొట్లవలె కనఁబడి మేను పులకరించి యటువంటిదశ పగవానికయినను వలదని తోఁచకమానదు; వేశ్యాపరాయణు లగు పురుషులకు మొట్టమొదట యశోహానియు, ధనహానియు, మాన హానియు, కలుగును—అనఁగా మానవంతుని సుఖజీవనమున కేమేమి కావలయునో యవి యన్నియు చెడును. వేశ్యలమూలమున నొకా నొకప్పుడు ప్రాణములవంటి మిత్రులతో సహితము విరోధము సంభ వించును; గౌరవమును పేరుండదు; "అరగడియ భోగము, ఆఱునెలల రోగము" అన్నట్లు నిమిషసౌఖ్యమున కాశపడి రోగములు తగిలించు కొని యొందఱు కలకాలమును దుఃఖపడుచున్నవారు కారు? వారి పడెడుదురవస్థలు తలఁచుకొన్న నెంతటి కఠినచిత్తునకును దేహము పుల

కరింపకపోదు. వేశ్యలమూలమున నెంతమంది లక్షాధికారులు సహితము భిక్షాధికారులయి తిండికిలేక దేహముచెడి మానహీనమైన బ్రతుకు బ్రతుకుచున్నారు కారు? మానములకు తోడుగా ప్రాణములను సహితము పోఁగొట్టుకొన్నవా రెందఱు లేరు? భోగస్త్రీల మూలమున నెందఱి బిడ్డలును భార్యలును కుటుంబములును చెడి తిండికి లేక కూటిపేద లగుచుండలేదు? ఎందఱిభార్యలు నాఁకుల చెడుతిరుగుళ్లు చూచి సహింపలేక మానముకంటె ప్రాణమధికము కాదని యెంచి యాత్మహత్యలు చేసికోలేదు? ఎందఱిభార్యలు మానమునకు కట్టుపడి యాత్మహత్య పాపమనుకొని గృహమున నొదిగియుండి చచ్చినవారికంటెను భాగ్యహీనలయి యావజ్జీవమును మనోవ్యధచేత కుంది కృశించుచున్నారు? పూర్వులు కూడఁబెట్టిపోయిన ధనమంతయు పోఁగా, తల్లిదండ్రులు ప్రేమతో నెత్తి పెంచిన దేహమంతయు చెడఁగా, కులకాంత లింటివద్ద నుస్సురని 'యహోరాత్రములు విలపింపఁగా, బిడ్డలు మొదలగువారు కడుపుకాలి మాడఁగా, యోగ్యులు నిందింపఁగా, గురువు లుపదేశించిన బుద్ధులన్నియు మంటఁగలియఁగా ఆత్మ పాపములపాలయి వ్యధచెందఁగా, వేశ్యాప్రియు లేమిసుఖమనుభవించెదరో యూహింపఁ దరము కాకున్నది. పాపమని చెప్పి యంతరాత్మ పెట్టు చీవాట్లమాట యటుండఁగా నాయంతరాత్మ మైమఱచి నిద్రించుచున్న కాలములో సహితము తామే యావేశ్యల యొక్క ప్రేమనంతను గుత్తగొనవలెనని విశ్వప్రయత్నములు చేయు పరమసాహసికులయిన విటులమూలమున నిద్రపట్టక మనస్సునకెంత మాత్రమును నెమ్మదిలేక యుండును. ఇట్లిహపరదూరమయి పాపైకమూలమయిన యీయకృత్యమునకుం జొచ్చి వేశ్యలమీఁదనె ప్రాణములు పెట్టుకొనియుండు పల్లవులపయి నాపల్లవపాణుల కెటువంటి

ప్రేమ యుండునోయని విచారింప నదియు సున్నగానే కనఁబడు చున్నది. వెలయాండ్రకు పలుకులయందు మాత్రమే తేనె లొలుకు చుండునుగాని హృదయము లెప్పుడును కఠినశిలలుగానే యుండును. దినమున కొక్క లక్షయుపపతులను గలసినను వారందఱును తమ పయిని యావారాంగనల కెక్కువ వలపుగలదని భ్రమించునట్లుగా మాయమాటలను కల్లవలపును బ్రకటించుచు హరించుటకు విటుల యొద్ద ధనమున్నంత కాలమును తాము వారి బహిఃప్రాణములవలె నటించుచు మెల్లగా నాభోగులను రోగులనుచేసి యాగణికామతల్లులు తమతల్లులచేత వారి నిల్లు వెడలఁగొట్టించి జ్ఞానులనుజేసి పైకము లేనివాఁడు పరస్త్రీ వర్జితుఁడన్నట్లు స్వభార్యానిరతులనుజేసి పంపించి వేయుదురు. ఈరీతి మోసపుకృత్యము లన్నియు వానికి తల్లిచను పాలతో సమానముగా నూటిపోసినవే గనుక, ఒకవేశ్య యొందఱిని మోసపుచ్చి యెంతధన మపహరించి యెందఱిని నీతిమార్గము నుండి తొలఁగించి యెన్నిసంసారములు పాడుచేసిన నంతప్రతిష్ఠ వహించు చుండును. పురుషుల సుఖముమాట యటుండఁగా నిఁక వేశ్యల సుఖ మేపాటిదిగా నుండునా యని విచారింపఁగా ఆసౌ భాగ్యమును సహితము తెలిసికొని యానందింపవచ్చును. అతిభోగము చేత వారికి సంతానము కలుగదు; రోగము లంటుకొని చిన్నతనము లోనే నిన్న స్నిగ్ధముగాను కోమలముగాను నున్న దేహమంతయు రేపు పుచ్చి గజ్జికాకరకాయవలెనయి చెడిపోవును; తాము చేయించు కొన్న యలంకారములకు మన్నుపిఁడు పెట్టిన భూషణములుకూడ తోడు పడును; కొంచెము వయసు జాఱినతోడనే విటపురుషులు తిమ్మనివిడిచి యవలకు జాఱఁగా, గడించినసొమ్ము వ్యాధులక్రింద వ్యయపడఁగా, వెనుకటి సంగీతనాద మిప్పుడు రోదననినాదముగా మాఱఁగా, ముప్పది

సంవత్సరముల ప్రాయముననే దేహము చెడిపోయి తిండికిలేక తమ పాపఫల మనుభవించుచు రోగములచేత బాధపడుచు నిట్టి కులవృత్తి నంగీకరించిన యీదేశముయొక్క యపకీర్తి మూర్తీభవించి యీరీతిని బహురూపముల మెలఁగుచున్నదో యన నభాగ్యదేవతలవలె నల్లెడ దిరుగుచుందురు. ఇటువంటివా రగుటచేతనే వేశ్యల నెంతమాత్రము నాదరింపక వారెంత సౌందర్యవతులయినను శ్మశానకుసుమములనువలెఁ జూచి విడువవలయునని యొకకవీశ్వరుఁడు పలికియున్నాఁడు—

శ్లో. ఏతా హసంతి చ రుదంతి చ విత్తహేతో
ర్విశ్వాసయంతి పురుషం న తు విశ్వసంతి।
తస్మాన్నరేణ కులశీల సమన్వితేన
వేశ్యా శ్మశానసుమనా ఇవ వర్జనీయాః॥

వీరు ధనమునిమిత్తమయి నవ్వుదురు; ఏడుతురు; పురుషులను నమ్మింతురు; తాము వారిని నమ్మరు; కాఁబట్టి కులశీలములు గలవాఁడు వేశ్యలను వల్లకాటియందలి పువ్వులనువలె విడువవలయునని పయి శ్లోకమున కభిప్రాయము. మఱియు నింకొకచోట భర్తృహరి వేశ్యల పయి రోఁతపుట్టునట్లుగా,

శ్లో. కశ్చుంబతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞమపి
చారభట చోర చేటక విట నటనిష్ఠీవనశరావమ్॥

ఎంతమనోహర మయినదయినను దూతలకును భటులకును దొంగలకును దాసీజనులకును విటులకును నటులకును తమ్మయుమియు పీకుదానువంటి దయిన వేశ్యాధరమును కులపురుషుఁ డెవఁడు పానము చేయునని దూషించి యున్నాఁడు. ఇదేప్రకారముగా నొక తెలుఁగు కవియును,

చ. పడిగము తమ్ములం బుమియుఁ పల్లవకోటికి నోరు, వేశి యం

గడి సవరంబు, సంత సారకాయ లురోజము, లచ్చురచ్చపా
వడి యెద, యూరువుల్ గమిడివాతియనంటులు, మోవిజిడ్డిగి
జ్జడి, వెలయాలి జీవనము జీవనమే తలపోసి చూడఁగన్.

నోటిని పీకుదాను గాను, కొప్పును బజాఱున కట్టిన సవరముగాను, స్తనములను సంతసారకాయలుగాను, ఱొమ్మును రచ్చపావడిగాను, తొడలను వీధిముందరి యరఁటిచెట్లుగాను, అధరోష్ఠమును కల్లుపాయ గాను వర్ణించి యున్నాఁడు. భర్తృహరి చెప్పినట్లుగా జారులు చోరులు నటులు విటులు మొదలయినవా రందఱును విచ్చలవిడిగా తిన్ని పెట్టుచుండుటచేత నోటిని పీకుదానుతో పోల్చుట మిక్కిలి సరిగానున్నది; కొనుటకు వెళ్ళిన వారెల్లను గిల్లి చూచుచుండులాగునే బహుజనకఖుతములకు లోనయిన వేశ్యల స్తనములకు సంతసారకాయలతోడి యుపమానము సరిగా కుదిరియున్నది; ఎంగిలియని చూడక యందఱును పానము చేయుచుండుటచేత వేశ్యలయధరోష్ఠమునకును కల్లుత్రాగు తాటాకులపాయకును సామ్యమెంతయైన చక్కఁగా నున్నది. ఇటువంటి వేశ్యలతోడి సాంగత్యమునకంటె నింద్యమయినది మానవంతునకు మఱి యేదియున్నది? అందుచేతనే మఱి యొక సంస్కృతకవీశ్వరుఁడు

శ్లో. దర్శనా చ్చిత్తవైకల్యం స్పర్శనాత్తుధనక్షయః
సంభోగా త్కిల్బిషం పణ్య స్త్రీణాం ప్రత్యక్షరాక్షసాం॥

పణ్యస్త్రీలను ప్రత్యక్షరాక్షసులనుగాఁ జెప్పి వారిని చూచుట చేతనే చిత్తచాంచల్యమును, తాఁకుటచేతనే ధనక్షయమును, సంభోగము చేతనే పాపమును వచ్చునని చెప్పి యున్నాఁడు. ఇట్లింతదూరము చెప్పుట, యోసభలయందును మఱి యేశుభకార్యములయందును వేశ్యలను రప్పించి యాదరింపఁగూడదని సాధించుటకొఱకే సుండీ.

అప్పుడు వేశ్యల మేళములే లేకపోయినయెడల సర్వజనాహ్లాదకరమయిన సంగీతము నశించుననియు, వివాహాదులగు సంతోషకార్యములయందు బంధుమిత్ర సమావేశ మయినప్పుడు వారికి హృదయాహ్లాదకరముగా నుండునది యేదియు లేకపోవుననియు, సంగీతము నిలిచిన నభినయశాస్త్రము నశించుననియు, కొందఱు భయపడుచున్నారు. అవి పోవుటవలన మనదేశమును రెండుపిశాచములు వదలినట్లు సంతోషింపవలయునే కాని యెంతమాత్రమును భయపడవలసిన పని లేదు. పయికి వెగటుగా కనబడినను మనకు మేలుకూర్చునవి మాత్రమే మనకు హితములును నాదరణీయములునుగాని పిశాచములవలె బయికి నానావిధ సుందరాకారములతో గనబడి భ్రమపెట్టి కడపట మనలను పాడుచేయునవి హితములు కావు. ఇప్పుడు మనదేశమునందు గానాభినయవిద్యలు రెండును తెలియనివారిని కుమార్గమునకు దింపి పాడుచేయుటకు మాత్రమే యుపయోగపడుచున్నవి కాని సన్మార్గమునకు త్రిప్పుటకు లేశమాత్రము నుపయోగపడుచుండ లేదు. అటువంటి యనర్థదాయకములయిన విద్యలు నశించినప్పుడు మనము చింతపడవలయునో సంతోషపడవలయునో బుద్ధిమంతు లూహించుకొనగలరు. అదికాక సర్వజనులను వశపఱచుకొనదగిన యుత్కృష్ట సాధనము నొకదానిని దుర్మార్గులచేతిలో విడిచిపెట్టిన పక్షమున దానిని వారు తప్పక తమదుష్టకార్యములయం దుపయోగించుకొందురు గనుక దానివలన లోకమున కెప్పుడును మితిమీఱిన హాని కలుగుచుండునే కాని యెప్పుడును లాభలేశ మయినను కలుగనేరదు. దుష్టనిగ్రహమును శత్రుసంహారమును జేసి దేశమును సంరక్షింపగల శూరుని హస్తము నలంకరింపవలసిన దివ్యాయుధమును దీసికొని పోయి చోరుని హస్తమున పెట్టిన పక్షమున దానినాదొంగ మంచి

వారిని సంహరించి ధనము దోచుకొను తన కులవిద్యయందు తప్ప మఱి యెక్కడ నుపయోగించును? పాతివ్రత్యమునకు జన్మభూము లయి పురుషుల మనోవ్యథలను పాఱఁద్రోలి గృహమును భూతల స్వర్గముగాఁ జేయఁదగిన యిల్లాండ్రయొద్ద నుండవలసిన సంగీతవిద్యను దీసికొనిపోయి భార్యాభర్తల నెడఁబాపి సంసారములను గూలఁ ద్రోసి గృహములను మహారణ్యములనుగాఁ జేయ బిరుదు వేసికొన్న లంజెలకు సమర్పించిన పక్షమున, వారు దానిని కిరాతులు మచ్చు చూపి పక్షులను తమవలలలోని కాకర్షించునట్లు యౌవనవంతులను తమవలలోఁ జిక్కించుకొని పాడుచేసి పందువంటి కాపురములను పడఁగొట్టుటయందుఁ దప్ప మఱి దేనియందుఁ వినియోగపఱుతురు? కాఁబట్టి యీ యుత్తమసాధనములను దుష్టశిరోమణుల చేతులలోనుండి యెంతశీఘ్రముగా తొలఁగింపఁ గలిగిన లోకమున కంత క్షేమకర మగును. అందుచేత మనము మొట్టమొదట చేయవలసినపని భగ వంతునిచేత లోకానుగ్రహార్థముగా ప్రసాదింపఁబడిన యమూల్య మయిన గానవిద్యామృతమును వారాంగనల నోళ్ళనుండి విడిపించి సంసా రులనోళ్ళకు చవిచూపుట. సంగీతమువలన నిజముగాఁ గలుగవల సినలాభములు మనము పనిచేసి యలసి యింటికి వచ్చినప్పుడు మన స్సునకు విశ్రాంతియు నుల్లాసమును గలిగించుట, కఠినచిత్తుల మనస్సు లనుసహితము రాగరసముచేత కరఁగించి వారికి దయాదాక్షిణ్యాదు లుదయించునట్లుచేసి నీతిమార్గమునకు మరలించుట, దుఃఖములను పోఁగొట్టుటకుఁజేసి హృదయముల కానందము పుట్టించుట, ఇంద్రియ సుఖములను మఱపించి చిత్తములను పారమార్థిక సుఖములకయి ప్రే రేచి భగవద్భక్తికి పురికొల్పుట, మహాత్ములుచేసిన ఘనకార్యములను వర్ణించు గీతములవలన దేశాభిమానము మొదలయిన సద్గుణములను

పెంపు చెందించుట, మొదలయినవి. ఇటువంటి యుత్తమగుణముల కు తేజము కావలసిన యీసంగీత మిప్పుడు లంజెల యధీనమయి యుండుటవలన దానియందలి సుగుణములన్నియు రూపుమాసి వాని స్థానమున దుర్గుణశతము లుద్భవిల్లి సంగీతవిద్యయందు సుగుణసంపత్తి కూడ నున్నదా యని సాధువులు శంకించునంతటి దుర్దశపట్టి యోగ్యులు దాని నభ్యసించుట తమగౌరవమునకు తగదని యెంచి సాధారణ ముగా మానుకొనుచున్నారు; ఈకాలమునందు వేశ్యలు పాడుగీతము లను నేర్చుకొని పాడువారి నెల్లవారును నీచులుగా నెంచి యనాదరింప కుండుటయే యిందుకు చాలినంత నిదర్శనముగా నున్నది. అందుచేతనే సంగీతశాస్త్రము నభ్యసించినవారు సామాన్యముగా వేశ్యలకు చదువు చెప్పుకొని పొట్టపోసికొనవలసినవా రగుచున్నారు; వారిని తమసర సను గూరుచుండఁబెట్టుకొనుటయు తమకుంక్తిని పెట్టుకొని భోజనము చేయుటయు నవమానకరమని తగుమనుష్యు లందఱును భావించు చున్నారు. అదిగాక మనదేశమునందిప్పుడు వేశ్యల సొమ్మయియున్న గానస్వభావ మెట్టిదాయని విచారింపఁగా వారిప్పుడు పాడుగీతము లన్నియు శృంగారరస ప్రధానములయి విటుల నాకర్షించుటకు మాత్రమె యనుకూలముగా నున్నవి. చెడుపాటలు పాడుటవలన చెడుతలంపులును, చెడుతలంపులవలన చెడుపనులును పట్టుపడి యీ సంగీతము నేర్చుకొన్నవారు సాధారణముగా జారత్వాది దోషములకు స్థానభూతులగుచున్నారు. వేశ్యలనెడి యీకపటురూత పాములనోటి నుండి వెలువడు పాటలలోని దుర్నీతి యలంకారబహుళమయిన మృదు భాషలో నడఁగియుండి పయికెంతో యింపుగా నగపడి వెన్న మెత్తిన విషమువలె మోసపుచ్చి యపారమయిన హాని నాపాదించునదిగా నున్నది. ఈపాటలు మనకు సహజముగా మిత్రరూపమున నగపడు

గర్భశత్రువులు; మన కిటువంటి వానివలననే నష్టమధికముగా కలుగును; గాని నిజరూపమునఁ గనఁబడు క్రూరశత్రువులవలన సహిత మింతనష్టము కలుగదు. మనకిది శత్రువని ప్రత్యక్షముగా తెలిసినప్పుడు దానికి లోఁబడకుండ మనము కాపుదలలో నుందుము. ఈ గీతములు తియ్యనిమాటలలో నిమిడి పయికి తమదుష్టస్వభావమునేమియు తెలియనీయక చక్కెరపూసిన విషమువలె ముగ్ధహృదముల నాకర్షించుచు చేయవలసిన నష్టమంతయు చల్లగా చేసివేసి జవసత్వము లుడిగి కార్యము మించినతరువాత పయివారికి తమశత్రురూపమును జూపుచున్నవి. ఇటువంటి హీనశత్రువులను రూపుమాపుటకంటె దేశక్షేమము కోరువారికి ముఖ్యకర్తవ్యము మఱియొకటిలేదు. ఈసత్ప్రయత్నముచేత శాస్త్రనామమును వహించి యయోగ్యముగా గౌరవము పొందుచున్న యీయభినయమును పాటలును మనదేశమును వదలి పాతాళము పట్టిననే, కులకాంతలు గానవిద్య నభ్యసింపఁగూడదని పుట్టిన విపరీతాభిప్రాయముచెడి, సంగీతమున కాశపడి పురుషులు భార్యలను విడనాడి భోగమువాండ్రపంచలు పట్టి తిరుగవలసిన దుర్గతి తొలఁగి, కులాంగనల మూలముననే యోగ్యులకు సంగీతమువలనఁ గలుగవలసినఫలము గలుగు భాగ్యములభించి, ప్రతిగృహము నానందమున కాటపట్టగుటకు కారణమగును. వేశ్యలు చేయు నభినయమంతయు సంభోగాదివర్ణనలతో నిండియుండి యౌవనదోషగ్రస్తులయియున్న నిరపరాధులను దోషములలోనెల్లను మహాదోషమయిన జారత్వమునకుదింపి వారిని పాడుచేయుటకు సాధనమయి దుష్టమయి నదిగా నున్నది. కాఁబట్టి వేశ్యావృత్తి పోవుటవలన నృత్తగీతాదులు నశించునని భయపడు బుద్ధిమంతులిప్పుడు కొంతధైర్యము తెచ్చుకొని యీయుత్తమవిద్యలు వారాంగనల పిడికిళ్ళనుండి విముక్తినొంది

యితరులపాల బడుటవలన మఱింత గౌరవముపొంది యిప్పుడున్న దుష్టస్వభావమును విడిచి పరులకు హానిచేయుట మానుకొని నీతిని భగవద్భక్తిని వృద్ధిపఱచుచు దేశమునకు క్షేమమే చేయునని సంతోషింపవచ్చును. కులకాంతలు నృత్తగీతాదులు నేర్చుకొనుట యెంతమాత్రమును గౌరవలోపమయిన పనికాదు. అవియున్ననే కుటుంబములో నిజమయిన యానందమును సౌఖ్యమును కలుగును. భర్తలు పగలెల్లను బయిటఁబనిచేసి యలసి యిల్లుచేరునప్పుడు వారిశ్రమము తీర్చి సంతోషమియ్యఁగలిగినది. సంగీతము తప్ప మఱి యేదియున్నది? మననాటకములను పురాణములను జూచినయెడల పూర్వకాలమునందు హిందూసుందరులు నృత్తగీతాదులు నేర్చుచు వచ్చినరనుటకు పెక్కు దృష్టాంతములు కనఁబడును. పూర్వకాలమునందు మనదేశమున నృత్తగీతాది వినోదముల నిమిత్తమై చారణులను సాంసారిక కాంతలే యేర్పఱుపఁబడి యుండిరి.

వివాహములు మొదలయిన శుభకార్యములుకూడ వధూవరులకు నీతినేర్పవలసిన పవిత్రసమయములగుటచేత నీతివనమునకు దావానలప్రాయలయిన వేశ్యల నచ్చటికిచేర్చి సిగ్గుపడక యానందింపఁ గలుగుట యాచారముయొక్క యద్భుతప్రభావమువలననే కదా? ఆహా! ఆచారమహిమము నేమని చెప్పవచ్చును! చిరకాలమునుండి వచ్చుచున్న యెడల ధర్మము నధర్మముగాను, అధర్మమును ధర్మముగాను తోపించి లోకము కన్నులుగప్పు శక్తి యొక్క యాచారమునందేకాక మఱి దేనియందున్నది? దురభిమానమును వదలి విచారింపఁగా పాతివ్రత్యమును నేర్చుకోవలసిన పెండ్లికూఁతులకును లంజెలయిన వేశ్యలకును ధర్మమునకును అధర్మమునకును గలంత వ్యత్యాసమున్నట్టు స్పష్టముకాకపోదు. కాఁబట్టి యట్టివేళలయందు వేశ్యలను

రప్పింపక యిహాపర సాధనమయినదియు శ్రావ్యమయినదియు నగు భగవద్విషయికమైన సద్గానముతో కాలక్షేపము చేయుట యెంతయు నుచితముగ నుండును. భోగముమేళ మనఁగా స్పష్టమయిన భాషలో లంజెల దండనియేకదా యర్థము! మనమెంతో వేడుకపడి వధూవరుల బాగునుగోరి శుభకార్యము చేసికొన్నప్పు డానంద పరిపూర్తికయి మనకు పనికిమాలినలంజెలతోడి సాంగత్యమెందుకు? నీతిమాలిన లంజెలచేత పాడించు బూతుపాటలకన్న భగవంతుని దివ్య నామామృత మెవ్వరి చెవులకు మధురతరముగా నుండదు? ఒకవేళ నీశ్వరవిషయకములైన గీతములు పామరులకు కొందఱికి రుచింపక పోయినను పోనిండు. ప్రాజ్ఞులయినవారి కెవ్వరికిని దైవభజనము రుచింపక పోదు. ఈప్రకారముగా మనము వివాహాదులయందు పురుషులచేత భక్తివిషయమయిన గానములు పాడించుచు వచ్చినచో క్రమక్రమముగా ప్రోత్సాహము కలిగి పలువురు గానవిద్య నభ్యసించి నృత్తగీతాదుల నున్నతస్థితికి తీసికొనిరాతురు వారాంగనలపాలయి [illegible]యిన కుత్సితగాన మడఁగిపోయి 'పురుషులలో సద్గానము ప్రబలి సంగీతమున కెప్పటి గౌరవమురాఁగా మనస్త్రీలు దాని నభ్యసించి వివాహసమయములయందు మాత్రమే కాక యుక్తసమయముల యందెల్లను కూడ గృహములను సంతోషభరితములనుగాఁ జేయఁ గలుగుదురు. ఒకవేళ వేశ్యలపాటయందు రక్తి కొంచెమధికముగా నుండునేమో యని కొందఱు భ్రమపడినను దానియందు గుణముల కంటె దోషములు సహస్రగుణము లధికముగా నుండుననుట నిర్వివాదాంశము గనుక దోషబాహుళ్యమయిన యీయల్పసుఖమును మానుకొనుటయే మనకు పరమధర్మము. ఆయాశకుసహిత మవకాశములేక యీకాలమునందు వేశ్యలు వ్యభిచారమునే ప్రధాన

వృత్తిగా నేర్పఱచుకొన్నారుగాని సంగీతమును కానేకాదు. చేసికొన్నచో నాప్రధానవృత్తికి సంగీతము నొకయంగమునుగా మాత్రము కొందఱు చేసికొనుచున్నారు. ఏగ్రామమునందును వేశ్యలసంఖ్యకు కఱవు లేకపోయినను వారిలో శ్రావ్యముగా గీతములను పాడువారు మాత్రము దేశమున కొక్కరయిన నున్నారో లేరోయని సంశయింపవలసియున్నది. అందుచేత నిప్పుడీమేళములు "లంజెలు లేకున్నను గుడి రంజిల్లదు ప్రజలమనసు రంజిల్లదు" అన్ననీతిని స్థాపించుటకయి యాలంకారముగా నుపయోగపడుచున్నవే కాని సంగీతమున కంతగా నుపయోగపడుచుండలేదు. వారిలో కొందఱు పాటపాడిరా యింట నెవ్వరో మృతినొంది యుందురని పొరుగువా రందఱును పరుగెత్తుకొని రావలసినదే; ఆటయాడిరా కాళ్ళక్రింద పుట్టెడు ధాన్యమున్నను నలిగి తెల్లనిబియ్యము కావలసినదే; అభినయము పట్టిరా కాళ్ళును చేతులును వంకరబోయెడు దొమ్మరోగమని వైద్యునిమిత్తము పరుగెత్తవలసినదే. ఏదియెట్లున్నను తాంబూలమునకు వచ్చినవారు మేళ మొకమూల నాట్యమాడుచుండఁగా తా మొకమూల ముచ్చటలాడుచు లేవఁబోవునప్పుడు వేశ్యలున్నారన్నమాటమాత్రము మఱచిపోక తండ్రితద్దినము మానుకొనసైనను విధిగా వారికి సమర్పింపవలసిన ముదుపు చెల్లించి వెళ్ళిపోవుచున్నారుగాని సంగీతసుఖము నంతగా ననుభవించుచుండఁగా చూడము. ఇఁక మేళములను రప్పించినవారో వేశ్యలచేత పాడించుట గౌరవావహమనుకొందురే కాని సంగీతము విని తామానందింపవలెనని యితరుల నానందింపఁజేయవలెనని పుట్టిన యుద్దేశముతో పిలిపింపరు. కాఁబట్టి మనవారు కొందఱనుకొనునట్లు వేడుకసమయములయందుఁగాని యితరసమయములయందుఁగాని సంగీతసుఖము ననుభవించువా రావగింజలో నరపా

లయినను లేరు. అందుచేత వేశ్యాస్త్రీలు పలువురు సంగీతమునందు మహిమాంగనలకన్నను, నాట్యమునందు భృంగికన్నను ప్రవీణురాండ్రు కాకపోయినను పలుకుటుంబములను పాడుచేసి వేలకొలంది ధనమార్జించి మిద్దెలను మేడలను సహితము కట్టగలుగుచున్నారనుటకు మనపట్టణములో మిూగందఱును నెఱింగియున్న యొకటిరెండు నిదర్శనములే చాలియుండును. మనమండలమునందు లక్షలకొలంది జనులున్నను వేశ్యలసంగీతము విని యానందించుచుండువారు లక్షకొకరయినను నున్నారో లేరోయని యనుమానింపవలసియున్నది. కాబట్టి వేశ్యావృత్తి లేకుండునట్లు చేయుటవలన సంగీతవినోదము చెడునన్నమాట కల్ల; వారియొద్దనున్నది నిజమయినసంగీతమే కాదనియు, దానివలన నితరదేశములయందు కుటుంబములలో కలుగుచుండు లాభములేవియు కలుగకుండుటయేకాక యనంతములయిన చెడుగులుకూడ కలుగుచున్నవనియు పయినే చూపియున్నాను; అదిగాక సంగీతము గణికల సొమ్మగుటవలన ప్రతికుటుంబమునందును కలుగవలసిన యానందము చెడుచున్నదనియు, గానవిద్య వేశ్యలలో నశించిపోయినయెడల నొక్కొక్క వారాంగనకు మాఱుగా వేవురేసి కులాంగనలయొద్ద వెలసి యిప్పు డిచ్చుచున్న విషతుల్యములగు ఫలములకు మాఱుగా నమృతతుల్యములగు దివ్యఫలము లిచ్చుననియు కనబఱిచి యున్నాను. వేశ్యల సంగీతము కొన్ని సత్ఫలములనే యిచ్చునని యొప్పుకొన్నను, అది యావశ్యకమైన భోగమును వినోదప్రదమును గనుక ప్రత్యక్షముగా కనబడు దుష్ఫలములతో కూడిన వినోదమును సహితము మానుకోవలయుననియు కొంతవఱకు సాధించి యున్నాను. ఒకవేళ దాని నావశ్యకమునుగానే గ్రహించి సుఖప్రదమనియే యంగీకరించినను, ఇతరులకు చెఱుపు

మనము సుఖపడఁగోరరాదు. కనుక వివాహమాడి పతివ్రతలై పుత్రులతోను పుత్రికలతోను భర్తలతోను సంసారసుఖ మనుభవిం పఁదగిన మానవతులను మానహీనలైన జారిణులనుగాఁజేసి యా మూలమున సుఖించుట మానవధర్మము కాదు. బోసినోటివాఁడు పేలపిండిని మెచ్చుకొనునట్లు వదలుకచ్చువాఁడొకడు వేశ్యావృత్తిని శ్లాఘించుచు వేశ్యలు లేకపోయినయెడల సంసారులు పాడగుదురని చెప్పినను, అది యుక్తికిని అనుభవమునకును దూరమైనమాట యని ధీమంతు లందఱును తెలిసియుందురు. "మగనివద్ద జారత్వమును అత్తవద్ద చోరత్వమును నేర్చుకొనె" నన్నట్లు భర్తగా రమ్మవారి యింటికిఁ బోవ, భార్యగా రయ్యవారింటికిఁ బోయి యుభయులును పాడగుదురు. తల్లిదండ్రు లేలాగో యిఁకబిడ్డలు నదేవిధము. వేశ్యలు లేకపోయిన వ్యభిచారము పూర్ణముగాపోయి లోకమంతయు బాగు పడునాయని కొందఱు ప్రశ్న వేయవచ్చునుగాని సంఘములో నెప్పుడును కొందఱుగాకపోయిన కొందఱయినను చెడి గుడిసెవేటులై వ్యభిచరించుట సంభవింపవచ్చినను వారు వేశ్యలవలె వ్యభిచారమును వంశ్లు మొలచినప్పటినుండియు విద్యగా నభ్యసించిన ప్రౌఢురాండ్రు కాకపోవుటచేత కలిగెడు నష్టము బహుగుణము లల్పముగా నుండు నని మాత్రము సమాధానము చెప్పఁగలము. ఏదేశమునందును బుద్ధిమంతులు చేయు ప్రయత్నమంతయు సాధ్యమైనంతవఱకును కీడును తొలఁగించి మేలును పెంపు చెందించు కొఱకే కాని మఱియేమియు కాదు. కాఁబట్టి దేశముయొక్క క్షేమము నిమిత్తమై యీదుర్వృత్తిని సాధ్యమైనంతవఱకు మాన్పఁ బ్రయత్నించుట విద్యాధికుల కందఱకును విధిగా నేర్పడుచున్నది. మనము సుఖముగా నున్నయెడల నెవ్వరేగంగలో మునిఁగిన మనకేమని స్వార్థపరులై యూరకుండుట

తెలివిగలవారి కర్తవ్యకృత్యముకాదు. కొంతవఱకైనను పరార్థపరుఁడై శక్తికొలఁదిని లోకమునిమిత్తము పాటుపడుట ప్రతిమనుష్యునకును ధర్మమై యుండఁగా విద్యాధికులకది ముఖ్యధర్మమని వేరె చెప్ప వలయునా? మన మితరులకు బోధించునప్పుడు మనము నిషేధించిన పని ముందుగా మనము మాని చూపవలెను. అట్లు చేయక మనము మనశ్చాంచల్యముపొందక యుండగలము గదా యను గర్వముచేత మన మావేడుకకు కొంత యవకాశమిచ్చినయెడల పామరులు మన మాటలయందుకంటె చేష్టలయందే యధికవిశ్వాసముంచి వీరుమాట లయందు దేవతలైనను చేష్టలయందు మనతో సమానులే యని యెంచి మనహితోపదేశములను లక్ష్యముచేయక తామును మన మవలంబించిన మార్గమునే యనుసరించి యాపైని మనకంటె నాలుగు మెట్లెక్కువ యెక్కుదురు. కాఁబట్టి వినోదము తప్ప మఱియొకవిధ మైన చెడుగు కలుగదనుకొన్నను, దానివలన నితరులకు కలిగెడుఫల మును కొంచె మాలోచించి పామరులకుకూడ మనకున్న పరిశుద్ధ చింతనే యుండఁబోదని యెఱిఁగి లోకము నిమిత్తమైనను మనము కొన్ని చిఱుసుఖముల నవశ్యముగా మానుకొనవలయును. మనమనస్సు కూడ నొకవేళ చలింపవచ్చును గనుక ముందుగా చెడుమార్గమున ప్రవేశించుట కవకాశమిచ్చి యందు ప్రవేశించిన తరువాత వానితో పోరాడి కష్టమువిూఁద మరలించుటకు ప్రయత్నించుటకంటె ప్రప్రథ మముననే యామార్గమును మూసివేయుట మనకయిన నెంతక్షేమ కరము! కొందఱంతయు నొప్పుకొని మాకిచ్ఛలేకయే మామిత్రుల ప్రోత్సాహముచేత నిట్లు చేయవలసినవారమైతిమని చెప్పవత్తురు. మన మిత్రులనిమిత్త, మెన్నఁడయిన మనము కానిపని చేయ వచ్చునా? మనము చేసిన సుకృతదుష్కృతములకు భగవంతుని సమ

క్షమున మనమే యుత్తరవాదులము గావలసిన వారము కాని మన మిత్రులు కారు. కాఁబట్టి మనమాదోషమును మిత్రులమీఁద త్రోసి వేయరాదు. మిత్రులకుఁగూడ ధర్మమును బోధించి వారిని మంచి మార్గమునకు త్రిప్పుట మనకు విధి. మన మెన్నిపాట్లు పడినను వారు వినక చెడఁదలఁచుకొన్న పక్షమున వారి నంతటితో విడిచి వారిపై త్రికి వేయినమస్కారములుచేసి యూరకుండుట యెంతయు నుత్తమ కార్యము.

ఈవేశ్యావృత్తివలన నెవ్వరికి నేవిధమయిన సుఖమును గలుగ నేరదుకాని పయి కొకవేళ కొంచెము సుఖదాయకముగా కనఁబడినను ఈవఱకు చెప్పినదానివలన నిది యీారంభములో వివరించిన సుఖభేద ములలో మొదట సుఖములాగున కనఁబడి కడపట దుఃఖముగా పరిణ మించుచున్న దానిలో తప్ప మఱియొకసుఖములో చేరదు గనుక దీనిని విడిచిపెట్టవలయునని మఱిమఱి చెప్పవలసిన యావశ్యకము లేదు. మనపూర్వులయిన సీవేశ్యావృత్తి నాదరించినవారు కారు. నృత్తగీతాది వినోదవిద్యలను వీరియధీనముచేయుక సంసారులగు చార ణాదులయందే యుంచిరి; మనపెద్ద లేధర్మశాస్త్రమునందును వారాం గనల ననులోమవిలోమసంకరజాతులలో నొకదానియందయిన నంగీకరించియుండలేదు. వీరికి దాయమెక్కడను వివరించి యుండ లేదు. వీరితో సంభోగించినవారికి ఘోరప్రాయశ్చిత్తమును విధించి పరాశరులవారు,

శ్లో. పశు వేశ్యాదిగమనే మహిష్యుష్ట్రీం కపీం తథా
ఖరీం చ సూకరీం గత్వా ప్రాజాపత్యం సమాచరేత్.

అని బ్రాహ్మణాదిజాతుల స్త్రీలతో వ్యభిచరించినందుకు వేఱువేఱు ప్రాయశ్చిత్తములు చెప్పిన తరువాత వేశ్యలనుగూడ పశువులతోను

గేదెలతోను కోతులతోను గాడిదలతోను పందులతోను గలిపి వానితో సంభోగించునప్పుడు చెప్పిన ప్రాయశ్చిత్తమునే వేశ్యాసంభోగమునకు జెప్పియున్నారు. అదిగాక మనధర్మశాస్త్రకర్తలు వేశ్యాప్రియులు పంక్తిబాహ్యులనియు వారికి రాజసభలలో కొలువు లియ్యకూడదని యు విధించియున్నారు. అందుచేతఁ బూర్వకాలమునందు వేశ్యల నుంచుకొన్నవా రెంతో హీనులుగా చూడఁబడుచుండిరి; మనరాజులు వారికి సభలలో పనులియ్యకుండిరి; కులమువారును వారిని మిక్కిలి తక్కువగాఁ జూచుచుండిరి. కాబట్టి యాకాలములో బహిరంగము గా వేశ్యల నుంచుకొనుట యెంతో తలవంపులుగానుండి మానాభి మానములు గలవా రందఱును వ్యభిచారమును మానుచువచ్చిరి. ఈకాలమందన్ననో యించుమించుగా మనరాజులందఱును నశించి నారు: ఉన్న కొందఱయినను దివాంధక్షేత్రములవలె శోభింపకున్నారు; అందుచేత నీదేశోపద్రవమును నివారించుటకు వారుశక్తులుకారు; ఇట్టి దురాచారములను మాన్పుటకయి కులమువారి కిప్పుడు మునుపున్న నీతియు కట్టునుగూడ లేక విత్తమే ప్రధానమయియున్నది. కాఁబట్టి యిప్పుడేవిధమయిన యడ్డంకియు లేక వ్యభిచారమున్న తప్పుగానే తో చక యెల్లవారును హేరాళముగా వేశ్యల నుంచుకొనుచున్నారు; ఇప్పుడా వేశ్యాప్రియుల గౌరవమున కెంతమాత్రమును భంగము కలుగుచుండ లేదు. ఇప్పుడిప్పుడు విద్యాధికులయినవారు ప్రబలు లయి కొంతవఱకు దురాచారములను తగ్గించుటకు శక్తులగుచున్నారు. గనుక వారందఱునుజేరి యిటువంటి దుర్వృత్తియందు ప్రవేశించు వారిని చిన్నచూపునఁ జూచుచు పదిమంది సమావేశమైనచోట వారిని గౌరవింపక పోవుచు వచ్చినయెడల వ్యభిచారము కొంతవఱకయినను తగ్గునని నమ్ముచున్నాను. వ్యభిచారమునకయి యొకజాతి యేర్పడి

యుండుట మన దేశమునకంతకు నిందాకరము. అట్టి నిందను మన దేశ మెప్పుడు తొలఁగించుకొని నాగరికతగల దేశములలో తల యెత్తుకొనఁ గలుగునోయని కాలమున కెదురుచూచుచు నట్టికాలమును శీఘ్రముగా తెచ్చుటకై మనచేతనైన ప్రయత్నము మనము చేయుచుండవలసియున్నది. ఈ దుష్కాలమును రూపుమాపుటకై సాధారణముగా వేశ్యలకు సంతానము లేకుండఁజేసి భగవంతుఁడే కావలసినంతపని చేయుచున్నాఁడు. ఆపనికి సాయముగా వేశ్యలితర బిడ్డలను పెంచుకొని వారిని పాడుచేయు దురాచారమును మనము పని పూని తొలఁగించుచు వచ్చిన పక్షమున మన మనుకొన్న కాల మత్యంత శీఘ్రముగానే రాఁగలదు. మనము చేయవలసిన పనికి దొరతనము వారుకూడ మనకు సహాయులయి వ్యభిచారవృత్తికయి పిల్లలను పెంచుకొనుట యిండియాదేశపు శిక్షాస్మృతిలో శిక్షార్హమయిన నేరముగా విధించియున్నారు. మన మీవిషయమునందు శ్రద్ధవహించిన యెడల వివాహమాడి పతివ్రతలు కావలసిన బాలికలెందఱో వ్యభిచారకూపమునుండి బయలబడి సంసారసుఖ మనుభవింపఁగల వారగుదురు. అట్టి నోరెఱుఁగని నిరపరాధులను రక్షించుటను మించిన పుణ్యకార్యము మఱియొకటి లేదు. కాఁబట్టి మనవారు వేశ్యలు పరుల ముద్దుబిడ్డలను పెంచుకొనకుండ నివారించుటలోను, శుభకార్యాదులయందు భోగముమేళముల పిలిపించి యాదరింపకుండుటలోను తగినకృషి చేయుదురని కోరుచు నింతటితో విరమించుచున్నాను.

# ఐ క మ త్యా ము.



By

K. VEERESA LINGAM

# ఐ క మ త్య ము



ఓ మహాజనులారా !

నేనీదినమున మీా కైకమత్యమునుగూర్చి కొన్నివాక్యములను చెప్పఁబోవుచున్నాను. మీారందఱును సావధానమనస్కులరయి యాలకింపుఁడు. అనేకు లొక్క విషయమునం దేకాభిప్రాయము కలిగియుండుటయే యైకమత్యము. మనుష్యుఁ డెప్పుడును ఏఘనకార్యమును ఒంటిగాచేసి సర్వజన శ్లాఘాపాత్రముగా నిర్వహింపఁజాలఁడు; అల్పకార్యములను నిర్వహించుటలో నహితము మనుష్యుఁడు సామాన్యముగా అన్యులసాహాయ్యము నపేక్షింపవలసినవాఁడుగానే యున్నాఁడు. మనకు నిత్యమును కావలసియుండెడి యన్నవస్త్రముల విషయమునఁగూడ నెందఱో యెన్నివిధములనో పాటుపడవలసి యున్నది. ధాన్యము చల్లుటకు ముందుగా కొందఱు భూమిని దున్ని పెంటకట్టి బాగుచేయవలెను; విత్తనములుచల్లి మొక్కమొలిచినతరువాత కొందఱు పొలమునకు నీరుపెట్టి కలుపుతీసి కష్టపడవలెను; పయి రెదిగి కంకులు వేయనారంభించినది మొదలుకొని యెలుకలనుండియు చిలుకలనుండియు దానిని కాపాడుచు పండినతరువాత చేనుకోసి కొందఱు ధాన్యమును జాగ్రత్తచేయవలెను; ధాన్యమిల్లు చేరిన తరువాత కొందఱు దంపి యుముక మొదలయినవి తీసి బాగుచేసి బియ్యము చేయవలెను; కట్టకడపట కొందఱాబియ్యమును వండి పాకము చేయవలెను. ఇట్లిందఱు పాటుపడినంగాని సుఖముగా తినుట కొక్కని కొక్కపూట నోటికి పట్టెడన్నము రాదు. ఇవిగాక దున్నుటకు సాధనములయిన నాగళ్ళను, కోయుటకు సాధనములయిన కొడవళ్లను, దంపుటకు సాధనములయిన రోలు రోకళ్ళను,

వంటకు సాధనములయిన పాత్రములను, చేయుటకయి యెందఱో కష్టపడవలెను. ఈప్రకారముగానే మనము ధరించుకొను వస్త్రముల నిమిత్తముకూడ మొట్టమొదట ప్రత్తిని పయిరు చేయుటకును, నూలుగా మార్చి వస్త్రములు నేయుటకును, పలువురు పాటుపడ వలయును. మనము సుఖముగా నొకగృహమునందు వాసము చేయ వలెనన్న పక్షమున దానినిర్మాణము నిమిత్తమయి యిటుకలును పెం కులును పట్టువారును, గోడలు పెట్టువారును, తలుపులు మొదలయిన వానికి బల్లలు కోయువారును, మేకులు బందులు మొదలయినవి చేయు వారును, వివిధముగా పాటుపడువారనేకులు కావలెను. ఒక్క మనుష్యుఁ డింత యన్నముతిని, బట్టకట్టుకొని, నీడను పరుండఁగలుగు టకే యింతమంది పాటుపడవలసి యుండఁగా అనేకుల కుపయోగ పడెడు మహాకార్యముల విషయమయి యింతకంటె నెక్కువజనుల యొక్క తోడ్పాటావశ్యకముగా కావలసి యుండునని చెప్పనక్కఱ లేకయే యెల్లవారును సులభముగా నూహించుకోవచ్చును. కాఁబట్టి యీలోకములో సర్వకార్యసిద్ధులకును కొంచెముగానో గొప్పగానో పలువురుచేరి పాటుపడక తప్పదనియు, చేసెడి కార్యముయొక్క గౌర వాధిక్యమునుబట్టి యధికసంఖ్యాకుల తోడ్పాటుకావలసియుండుననియు, ఐకమత్యము లేక యొక్కకార్యము నిమిత్త మనేకులు కలియుట సంభ వింపనేరదనియు, పయినిచెప్పిన దానివలన స్పష్టమగుచున్నది. మను ష్యుని సుఖమునిమిత్తమయి కావలసిన ప్రతికార్యములోను పలువుర తోడ్పాటు కావలెనని యెప్పుడు తేలుచున్నదో యప్పుడే మనుష్యు లను పరస్పరసాహాయ్యమపేక్షించు జీవులనుగా పరమేశ్వరుఁ డుద్దే శించి సృజియించెననియు, ఈశ్వరోద్దేశమునకు విరుద్ధముగా నన్య సాహాయ్యము నపేక్షింపక మనుష్యుఁ డేకాకిగా నుండుటకు ప్రయ

త్సించినపక్షమున సుఖపడఁజాలఁడనియు, స్పష్టమగుచున్నది. కాఁబట్టి పలువురతోఁజేరి సుఖించుట మనుష్యధర్మము; ఏకాకిగా నుండఁ గోరుట మృగధర్మము. ఇందుకు సందేహములేదు. పరస్పర సాహాయ్యము నపేక్షింపక మిత్రబాంధవాదులతోడి సంబంధమును పెట్టుకొనక నేకాకియై తిరుగువాఁడు మృగప్రాయుఁడయి మృగమువలెనే వసించుటకు గృహములేక గుహాలలోను చెట్లనీడను శయనించుచు కందమూలాదులను భక్షించుచు దిగంబరుఁడయి సంచరింపవలసి వచ్చును. అట్లు సంచరించునప్పుడు సహితము మృగాదులకున్న సౌఖ్యములో నాల్గవ పాలయినను మనుష్యునకు గలుగదు. వానికివలె శీతవాతాతపబాధలనుండి తప్పించుట కవసరమయిన రోమాదులతో నిండియున్న దృఢచర్మము మనుష్యునకులేదు; వానికివలె శత్రుజంతువులనుండి రక్షించుకొనుట కనుకూలములయిన కొమ్ములు మొదలయిన స్వాభావికసాధనములేవియు మనుష్యునకులేవు. కాఁబట్టి యన్యోన్యసాహాయ్యమును పొందుచు సంఘీభవించి యుండకపోయిన పక్షమున లోకములో మనుష్యునంత దుర్బలమయిన జంతువు మఱియేదియు లేదు. జంతువులలోపల మిక్కిలి చిన్నదని మనము భావించెడు చలిచీమ సమీపించినను భయపడి కుట్టునేమో యని మనుష్యుఁడు దూరముగా తొలఁగవలసినవాఁడగును. స్వభావముచేత నింత దుర్బలుఁడయిన మనుష్యుని బలమంతయు సంఘీభావముతో నున్నది. సంఘీభావము కలిగియున్నప్పుడు మనుష్యునకు సమస్తబలములును గలుగును. అతఁడప్పుడు ప్రపంచములోని సమస్త జంతువులను తనకు లోఁబఱుచుకొని వానికన్నిటికిని తాను ప్రభువయి తన యిష్టము వచ్చినవానిని రక్షించుటకును శిక్షించుటకును సమర్థుఁడగును. ఒంటిగాఁడయి యున్నప్పుడు లేడివంటి సాధుజంతువును సహి

తము వశపఱుచుకోలేనివాఁడు సంఘీభవించి సింహామువంటి క్రూర మృగముల మందలను సహితము వశపఱుచుకొనుటకును శక్తుఁడగును. కాఁబట్టి మనుష్యుని సుఖవంతోపాదులును, అభివృద్ధియు, సంఘబలము ననుసరించి యుండును. మన యనుభవమునుబట్టి చూడఁగా నొక్క మనుష్యులలో మాత్రమేకాక మృగాదులలో సహితము సంఘీభవించి యున్నవానిలోనే యభివృద్ధి విశేషముగా కానవచ్చుచున్నది. ఏకాకిగా నుండు పెద్దపులి సంవత్సరమునకు మూఁడు నాలుగేసి పిల్లలను పెట్టుచున్నను పులులసంఖ్య విశేషవృద్ధి చెందకుండుటయు సంవత్సర మున కొక్కదూడను మాత్రమే యీనుచున్నను గోవులసంఖ్య యత్యధికమయి యాహారను మందలుగా పెరుగుచుంఁడుటయు మన కను భవసిద్ధమయి యున్నది. అయినను సమస్తజంతువులలోను మనుష్యుఁ డొక్కఁడే సంఘీభావమును పొందిననేకాని సుఖపడనివాఁడుగాఁ గానఁబడుచున్నాఁడు. కేవల మృగమువలె భార్యాభృత్యాది సం బంధములను బొత్తిగా లేనివారు కాకపోయినను మనవలె పట్టణముల యందుండి బహుజనులతోడి సంబంధమును గలిగి యుండక యడవుల యందు పరిమితజనులతో నుండు కోయవాండ్రు మొదలయిన వారిని సహితము మనము మృగప్రాయులనుగా భావించుచున్నాము. మనము వారి నట్లు పశుతుల్యులనుగా గణించుటకుఁ గల ప్రధానకారణము వారు పలువురతోడ సహవాసముచేసి యందువలనఁ గలుగు సుఖాదు లను బొంద నెఱుఁగకుండుటయే కాని వేఱుకాదు. కాఁబట్టి మనుష్యుఁ డెంత యెక్కువమందితో సహవాసము చేయుచు పరస్పరసౌఖ్యము నిమిత్తమయి కలిసి పాటుపడుచుండునో యంత యెక్కువ నాగరికుఁడు గాను సుఖమనుభవించువాఁడుగాను ఉండును. ఇట్లింతమందితోఁ గలియుటయును పరస్పరసాహాయ్యము చేసికొని సుఖపడుటకును మను

ష్యులలో నైకమత్య మవశ్యముగా నుండవలెను. ఐకమత్యము లేని యెడల ననేక లేకీభవించుట కలుగనేరదు. ఒక్కపట్టణములోని వారిలోఁగాని యొక్క దేశములోని వారిలోఁగాని బహుసంఖ్యాకు లైకమత్యము కలిగి కలిసి యుండనిపక్షమున వారిలో పరస్పరద్వేషమును వైషమ్యమును కలుగును; వైషమ్యము గలిగిన తరువాత వారిలో వారు బాహుయుద్ధమున కొకవేళ దిగకపోయినను వాక్కలహములకును పరస్పర దూషణములకును దిగుదురు. ఐకమత్యము లేకపోవుట వలన సర్వజనోపయుక్తములైన ఘనకార్యములను వేనిని వారు చేయుటకు సమర్థులు కారు. ఒకరాష్ట్రప్రజలలో నైకమత్యము తగ్గి యుండుట చూచి యన్యరాష్ట్రములవా రట్టి జనులను లోకువ చేసి వారిని జయించి దేశము నాక్రమించుకొని స్వలాభముకొఱకు నిరంకుశముగా ప్రభుత్వము చేయుదురు. జనులలో సంపూర్ణైకమత్యమే యున్నపక్షమున శత్రువులు మొదలయినవారు వారికి కీడు చేయ లేక పోవుటయేకాక వారిని జూచి భయమును సహితము పొందుచుందురు. సమస్తశ్రేయములకును మూలాధారమయిన యైకమత్యమే జనులలో లేకుండినయెడల, వారిలో నన్యోన్యమైత్రియు ప్రేమయు నుండవు; అందుచేత వారికి నిజమయిన నెమ్మదియు క్షేమమును కలుగవు. ఒక తెగవారి మేలొక తెగవారి కీడుగా నుండును; అందుచేత నొకతెగ వారి యభివృద్ధి కొకతెగవా రెప్పుడును భంగము కలుగఁజేయుటకే చూచుచుందురు. దేశమునం దిట్టివి యెప్పుడు వ్యాపించి యుండునో యప్పుడు మొత్తముమీఁద దేశాభివృద్ధి కలుగక యొకతెగవారు చెడుటచేత రెండవతెగవారు బాగుపడి సంతోషించుచు, సంతోషించు తెగవారియొక్క యుచ్ఛ్రదినములు పోయి వా రడుగంటి నప్పుడు పయికి లేచినవారు సంతోషించుచు నుండుట మాత్రము సంభవించును. కాఁబట్టి

జనసామాన్యముయొక్క క్షేమలాభములను కోరెడు దేశాభిమానులందఱును సాధ్యమయినంతవఱకు జనులలో బహువిషయములయం దైకమత్యము కుదురునట్లు చేయుటకయి తమ యావచ్ఛక్తిని కృషిచేయుచుండవలెను.

అధికప్రయాసమును పొందినను ఒక్కనికి సాధ్యము కాని పని, పలువు రైకమత్యము కలిగి పాటుపడెడు పక్షమున సులభసాధ్యమగును. ఇందు కొక్క చిన్న నిదర్శనము చూపెదను. ఉత్సవాదులయందేనుఁగంత బలముగల సర్వసంపన్నుఁడు తన యావచ్ఛక్తిని వినియోగించి లాగినను కదలని రథమును బలహీనులయిన బాలురు సహితము పలువురు చేరి యవలీలగా లాగి వీధులవెంబడిని పరిగెత్తింపఁ గలుగుచున్నారు. జనులలోగల యైకమత్యమే నిజమయిన నాగరికమునకు గుఱుతు. లోకములో నెప్పు డేదేశమువా రభివృద్ధి నొంది మహోన్నతదశకు వచ్చినను, వారిలోఁగల యైకమత్య ప్రభావము చేతనేకాని యది లేని దేహబలముచేతను విద్యాబలముచేతను గాదు. ఐకమత్యము జనులలో నెప్పుడు తగ్గిపోయి పరస్పరద్వేషాదు లేదేశమునందు ప్రబలునో యప్పుడే యా దేశము తన యౌన్నత్యము నంతను బోఁగొట్టుకొని సమస్తకష్టములకును లోఁబడవలసిన దగును. మన దేశము చిరకాలము క్రిందటనే పూర్వమునందున్న స్వాతంత్ర్యమును బోఁగొట్టుకొని యన్యదేశీయుల యధీనమగుటయు మనవారిలో నైకమత్యము చెడి, జాతి మత ద్వేషాదులు ప్రబలుటచేతనే కాని వేఱుకారణముచేతఁ కాదు. ఇరువదియైదు కోట్ల జనులు గల మనదేశమునం దే పూర్ణమయిన యైకమత్య ముండియున్నయెడల, ఎంతటి బలవంతులయినను మన దేశమువంక త్రేఱిచూడనయినను శక్తులయి యుందురా? అన్యదేశీయులయిన దుష్టపరిపాలకులకు దాసులయి మన పూర్వులు వారి

వలన నన్నిదుర్దశల ననుభవించినారుకారు? క్రూరులయిన కొందఱ
తురుష్క ప్రభువుల కాలములో మనదేశమునకు సంప్రాప్తములయిన
కడగండ్లను తలఁచుకొనఁగా మనమనస్సు లిప్పుడును నొచ్చుచున్నవి.
ఆ కాలమునందు మనస్త్రీలకు సంభవించిన విపత్తులను తలఁచుకొందు
మేని మనదేహము లిప్పుడును కంపము నొందవా? మనభాగ్యము
వలన మనదేశమున కిప్పుడు న్యాయైకావలంబులయిన హూణప్రభు
వులు రాజ్యమునకు వచ్చి సర్వజనక్షేమకరముగా ప్రజాపరిపాలనము
చేయుచున్నారు గనుక మన మిప్పుడు పూర్వకష్టములనన్నిటిని మఱచి
మరల తలయెత్తుకొని తిరుగుచు సుఖింపఁగలిగియున్నాము. ఈమధ్య
కాలమునందు మనదేశ మెప్పుడు ననుభవించి యెఱుఁగని సత్పరిపాలన
సుఖమును మనదేశమునకు క్రొత్తగా చవి చూపుచుండుటయే కాక
యీహూణప్రభువులు తమలోఁగల యైకమత్యమువలన మన కైక
మత్యమునుగూడ నేర్పుచున్నారు. వారిలో నెంతటి యైకమత్యము
నుండనిపక్షమున సంఖ్యయందు నాలవ వంతయినను లేని జనులు
సముద్రములు దాటి విదేశమునుండి వచ్చి యింత గొప్పదేశమును
ఏకచ్ఛత్రముగా పాలింపఁ గలుగుదురా? ఐకమత్యము లేకపోయిన
యెడల సంఖ్యకు జను లెందఱుండినను పరుల కశ్రమ సాధ్యులగు
దురు. ప్రత్యేకముగా నొక్కొక్క కట్టెచొప్పున నన్నిటినైనను విఱు
చుట కొక్కనికి శక్యమగును. ఆ కట్టెల నన్నిటినికాక కొన్నిటినైనను
మోపుగాకట్టి విఱువుమన్నచో నొక్కనికి కాదుకదా పలువురకైనను
సాధ్యము కాకయుండును. మృగకీటకాదులు సహితము కొన్ని సంఘీభ
వించి గొప్పకార్యములను సాధించి లాభమును పొందుచున్నవి. అడ
వులలో గుఱ్ఱములు మొదలయిన మృగములు కొన్ని మందలుగా
వసించుచు సింహములకు సహితము లొంగక నిలిచి గెలుచుచున్నవి.
అంతటి పెద్దజంతువులమాట విడిచి గుంపులుకూడి యుండెడు చిన్న జంతు

వ్రులసంగతి చూతము. అసంఖ్యముగా నిత్యమును మనకాళ్ళక్రింద పడి నలుగుచుండెడి చీమలవంటి యత్యల్పజంతువులు సహితము బారులు చేరి బలవంతమయిన కాలసర్పమును సహితము నిమిషములో నంతము నొందించుచున్నవి. అల్పమృగాదులే సంఘీభవించి యిటువంటి లాభములను పొందుచుండఁగా జ్ఞానాదిసమస్తసాధనములచేతను వానికంటె బహుగుణము లధికులని ప్రఖ్యాతి నొందుచున్న మనుష్యులు మాత్రము సంఘీభవించి యైకమత్యము కలవారయి తమ్మును తమ దేశమును వృద్ధిపొందించుకొని యనంతములయిన సౌఖ్యలాభముల నేల పొందరాదు? జంతువులలో మాత్రమే కాదు, ప్రాణములేని జడపదార్థములలో సహితము సంఘీభావమువలన నద్భుతమైనశక్తి యొకటి పుట్టుచున్నది. గట్టిగా పట్టుకొన్నయెడల ప్రత్యేకముగా నున్నపుడు తెగిపోయిన గడ్డిపోచలే యన్నియుఁ గలసి వెంటిగా నేర్పడి మదపుటేనుఁగును సహితము బంధింపఁగలుగుచున్నవి. ఒక్కొక్కటిగా నున్నప్పుడు చిన్నకోటిననను నీడువలేని నూలుపోగులు సంఘీభవించి పగ్గమయి బలమయిన రథమును సహిత మీడ్వఁగలుగుచున్నవి. ఈ ప్రకారముగా సంఘీభవించి యుండెడు మఱియేవస్తువులను జూచినను మన కవియన్నియు సంఘీభావమువలనఁ గలుగు ఫలమిట్టిదిసుమా యని బోధించుచుండునట్లుండును. వీనిని జూచియైన మనవారైకమత్యమును సంఘీభవించు విధమును నేర్చుకొని వానిని సత్కార్యములయం దుపయోగించినచో తాము బాగుపడుటయేకాక శీఘ్రకాలములోనే మనవారు దేశమునంతను బాగుచేయుటకు శక్తులగుదురు. ఐకమత్యములేనిదే ఏదేశమునందును, ఏకాలమునందును ఏమంచిపనులును వర్ధిల్లవు. దేశాభివృద్ధికరములయిన వాణిజ్యాదులయందును, శిల్పాదులయందును, శాస్త్రములయందును, విద్యలయందును, అభివృద్ధికైకమత్య మవశ్యముగా కావలెను. ఐకమత్యములేక యివికాని మఱి

యేవృత్తులునుకాని మంచిదశకు రానేరవు. ఐకమత్యాభావమువలననే మనదేశములో వాణిజ్యాదులు సహితము ప్రబలకున్నవి. పదిమందిచేరి పనిచేయుట యన్నమాట మనవారెఱుఁగరు. మనవారు తామే బుద్ధిమంతుల మనుకొని యెవ్వరిని నమ్మక ప్రవర్తించుచు సంఘముల వలని లాభములను పొందఁజాలకున్నను మానవధర్మమునుబట్టి యెవ్వరినో యొకదొంగను నమ్మి యూవంచకుని తేనెమాటలకు మోసపోయి సొమ్మును పోఁగొట్టుకొనుచున్నారు. అదిచూచి తక్కినవారు పరులను నమ్మిన మోసముగలుగునని నిశ్చయించుకొని యెవ్వరితోను గలియక యేకాకులయి తగినలాభమును పొందఁజాలకున్నారు. కొందఱు మాత్ర మిప్పుడిప్పుడు కొన్నిచోట్ల వాణిజ్యసంఘములుగాఁజేరి వ్యాపారముచేయుట కారంభించుచున్నారు. అయినను పెక్కుచోట్ల కృష్ణమ్మసెట్టి సహోదరులాదిగాఁగల నామములను వహించి పలువురను భ్రమింపఁజేయుచున్నారు. ఆవాణిజ్యసంఘములో నెందఱుచేరి యున్నారోయని విచారించినచో పయిసెట్టిగారును తమ్ముఁడును తప్ప మఱియెవ్వరు నుండరు. పరులమీఁదకూడ విశ్వాసముంచి వారిని గూడఁ దమలోఁ జేర్చుకొని సంఘీభవించి వ్యాపారము చేయుచు వచ్చినచో నొకానొక దుష్టుఁడొకచోట మోసముచేసినను తఱచుగా నట్టిమోసములు జరగక లాభము కలుగుచుండుటకు సందేహముండదు. ఒక్కని కొక్క వ్యాపారమునందు విశేషవిత్తమును వ్యయపెట్టుటకును విరివిగా పనిసాగించుటకును శక్తియుండదు. పలువురు చేరుటవలన మనుష్యబలము ధనబలమునుకూడ కలిగి విరివిగా వ్యాపారము సాగించుటకును విశేషలాభమును పొందుటకును అవకాశముండును. వాణిజ్యాదులయందు మాత్రమేకాక లోకోపయుక్తములయిన సమస్తకార్యములయందును సంఘములుగాను సమాజములుగాను కూడి పనిచేసినచో నొక్కఁడసాధ్యమని యూహించెడు

పనులను సహితము సులభముగా సాధింపఁగలుగుదురు. ఈ హేతువుచేతనే తగినతోడ్పాటును పొందకపోవుటవలన విశేషవిత్తవంతులును బుద్ధిశాలులును నిర్వహింపలేని ఘనకార్యములను బహుదేశములలో సామాన్యులు పలువురుకూడి పనిచేసి నిర్వహించి యున్నారు. పశ్చిమఖండవాసు లిప్పుడు యంత్రనిర్మాణాదులయందును శాస్త్రాదులయందును సమగ్రములయి యుండుటకు కారణము వారు సంఘములుగాచేరి పనిచేయుటయే. మతమును వ్యాపింపఁజేయవలెనన్నను, త్రాగుబోతుతనమును మాన్పవలెనన్నను, జ్యోతిశ్శాస్త్రమును వృద్ధిచేయవలెనన్నను, లోకమున కుపయోగించు మఱి యేపనిని చేయవలెనన్నను, తెలివిగలవారు పలువురాయా విషయములను వ్యాపింపఁజేయుటకయి సంఘములుగాచేరి కలిసి పనిచేయుదురు. ఇట్టిసంఘములు యూరోపుఖండమునందు లక్షలున్నవనుట యతిశయోక్తిగాదు. వారిని జూచి మనవా రిప్పు డీదేశములోని ముఖ్యపట్టణములలో నెల్లను సమాజము లేర్పఱిచి పనిచేయుటకు నేర్చుకొనుచున్నారు. సమాజములు చేరి యెంతటి ఘనకార్యములయినను నిర్వహింపవచ్చును. సమాజములయందున్న యద్భుతశక్తి మఱి దేనియందును గానరాదు. సమాజములవలన తమయభిప్రాయములను మహాజనులలో సులభముగా వ్యాపింపఁజేయుట కవకాశము కలుగును; ఒక్కరీతి యభిప్రాయము గలవారందఱును దూరముగా నున్నను చేరువగానున్నను కలియుట సంభవించును; అట్టివారందఱును జేరినపక్షమున నొకమహాసేనవలె నయి సులభముగా జయము కలుగును. సమాజములలో తఱచుగాచేరి సంభాషించుటవలనను చర్చించుటవలనను ధైర్యమును ఉత్సాహమును కలుగును; అనేకులు చేరి యాలోచించుటవలన మంచియుపాయములు తోఁచును; తాము పూనిన కార్యములకు తోడ్పడువారును వాని నామోదించువారును

కొందఱు కలరని యెఱిఁగినందున ప్రతిసామాజికునకును కార్యాచరణమునందు ద్విగుణమయిన బలము కలుగును; జ్ఞానాభివృద్ధి కలుగును; సమాజములకు తఱుచుగా వచ్చుచుండుటవలనను వారి ప్రసంగములను వినుచుండుటవలనను జనులలో నైకమత్యమును సత్కార్యాచరణమునందాసక్తియు కలుగును; చెప్పఁబూనినచో సమాజములవలనఁ గలిగెడు లాభము లిటువంటి వనేకములున్నవి. ఒకసమాజముయొక్క యుపయోగమును నిర్ణయించుట యాసమాజము చేసిన పనివలనఁగాని వారు పలికినమాటవలనఁ గాదు. కాఁబట్టి, యీసమాజమువారు కేవల ప్రసంగములతోనే సరిపుచ్చక దేశక్షేమకరమయిన పనినికూడ కొంత శీఘ్రకాలములోనే నిర్వహించి తమకార్యములవలన సమాజములవలన ప్రయోజనమును లోకమునకుఁ జూపఁ బ్రయత్నింతురని నమ్ముచున్నాను. సమాజము లెప్పుడును జనులలో తెలివిని అభివృద్ధి చేయుటకును, ఆలోచనను పెంపుచేయుటకును, సత్యవర్తనమును ప్రోత్సాహపఱుచుటకును, దుష్టత్వమును నడఁచివేయుటకును, స్వాతంత్ర్యమును వివేకమును బలపఱుచుటకును, సత్యమును వ్యాపింపఁజేయుటకును, ఇతరవిధముగా దేశక్షేమమును కలుగఁజేయుటకును అయి యుండవలెను. ఈవిధమయిన లాభములేవియులేక కేవల వినోదముకొఱకును కాలయాపనముకొఱకును సభలు చేసెడు పక్షమున సామాజికులకుఁగాని జనులకుఁగాని యట్టి సమాజములవలన ప్రయోజనము లేశమును గలుగదు. కాఁబట్టి, మనసమాజము పయిని వివరించినవానిలో కొన్నిటినైన నిర్వహింపఁగలుగవలయు ననియు, చిరకాకాలము నిలవుకొనవలయు ననియు కోరుచు, నాకోరికను సఫలముచేయు భూతదయాపరుడైన యీశ్వరుని ప్రార్థించుచు, ఈవిషయమును ముగించుచున్నాను.

# దానములు

మానవకోటి కీశ్వరుఁడు ప్రసాదించిన గుణములలో నెల్ల కరుణాగుణ ముత్తమోత్తమమయినదిగా నున్నది. రెండు ప్రయోజనముల నుద్దేశించి సర్వకారుణ్యుఁడయిన యీశ్వరుఁ డా యుత్తమగుణమును మనకు ప్రసాదించుచున్నాఁడు. అం దొకటి పరోపకారము; రెండవది క్షమ. పరోపకార మనఁగా పరమేశ్వరుఁడు మన తోఁబుట్టువులనుగా సృజించిన మానవకోటియెడల దయగలిగి వారి సౌఖ్యాభివృద్ధి కొఱకును దుఃఖశాంతికొఱకును శక్తికొలఁదిని సాహాయ్యము చేయుట క్షమ యనఁగా పరులు మన కపకారము చేసినను వారియందు ద్వేషము వహింపక వారికి కీడుచేయక యోర్చుకొని యుండుట ఈ రెంటిలో పరోపకారవిషయమైన మొదటిధర్మమును గుఱించి మాత్ర మీసారి కొంచెము ముచ్చటింతము. లోకములో పరోపకారము చేయు విధ మనేకరీతులుగా నుండును; అందొకటి దానము. దానమును పాత్రులయినవారి కెల్లవారును తమ శక్తికొలఁదిని చేయుచుండుట మానవధర్మము. మనము వీధులయందు నడుచునప్పుడు దేహమున గాయములుకలిగి బాధపడుచుండెడి వాని నెవ్వనినైనఁ జూచిన పక్షమున మనకు వానియెడల జాలిగలిగి సాహాయ్యము చేయవలెనని బుద్ధిపుట్టును; అప్పుడే మనము దేహమునిండ గాయములు చేసికొని బలవంతముగా భిక్షము గ్రహించుటకయి ప్రయత్నించుచుండువాని నెవ్వనినైనఁ జూచిన పక్షమున మనకు వానిమీఁద కోపము వచ్చి వానిని శిక్షింపఁ జేయవలెనన్న బుద్ధిపుట్టును. ఈవిధముగా గాయములుగల వారిలో నొక్కనియందు సహజముగా మనకు దయగలుగుటయు మఱియొక్కనియందు కోపము కలుగుటయు విచారిం

పఁగా మన దయకును దయాగుణమునుబట్టి కలుగవలసిన యుపకారము నకును సర్వజనులును పాత్రులుకాక కొందఱుమాత్రమే పాత్రులనుట భగవదుద్దేశమయినట్లు స్పష్టముగా తెలియవచ్చుచున్నది. పాత్రా పాత్రవిచారము పెట్టుకోక 'దేహి' యని చేయిచాచి యాచించిన వానికెల్లను దానము చేయవలెనని కొందఱును, కొన్ని తెగలవారికి మాత్రమే దానము చేయవలెనని మఱికొందఱును, విపరీతాభిప్రా యములు కలిగియున్నారు గాని యిరుతెఱఁగులవారి యభిప్రాయము లును సరికావు. యోగ్యాయోగ్య విచారముచేయక చేసెడి దానము వలనఁ గలిగెడు కష్టములు యుక్తసలమునందు తెలుపఁబడును గనుక, ముందుగా కొన్ని తెగలవారికే దానము చేయవలె నన్న యంశము విచారింతము. భగవంతుని దృష్టియందు మనుష్యులందఱును సమా నులు; మానవకోటియంతయు తనచే సృజింపఁబడిన పెద్దకుటుంబ మగుటచేత, ఆయన కందఱియందును సమానప్రేమమే కలిగి యున్నది. ఆయన యేకరీతిగా జనుల నందఱిని పుత్రప్రేమతోఁ గాపా డుచు, సృష్టపదార్థములవలని లాభముల నందఱికిని సమానముగానే యనుగ్రహించి యున్నాఁడు. ధనికులు, దరిద్రులు, నాగరికులు, గ్రామ్యులు, నల్లవారు, తెల్లవారు, హిందువులు, తురుష్కులు, పండితులు, పామరులు అను భేదమును చూడక యీశ్వరాజ్ఞానుసార ముగా సూర్యుఁడెల్లవారికిని కాఁకను, వెలుతురును నిరంతరము నిచ్చు చున్నాఁడు; ఈశ్వరేచ్ఛానుసారముగా మేఘములందఱికిని వర్షజలము నిచ్చుచున్నవి; వాయు వందఱిమీఁదను ప్రసరించుచున్నది. మానవ కోటికంతకు నొక్కరీతి దేహములను, అవయవములను, ఆలోచనను, బుద్ధులను, గుణములను, లోపములను, సుఖసాధనములను, పరమే శ్వరుఁడు ప్రసాదించియున్నాఁడు. కాఁబట్టి, యీశ్వరుని బిడ్డలవంటి

వారయిన మనుష్యులందఱును సోదరభావము కలవారయి పరస్పర సాహాయ్యమునకును, ప్రేమకును అర్హులయి యున్నారు. ఈశ్వరుఁడనుగ్రహించిన యపరిమిత సుఖములను నిత్యము ననుభవించుచు, ఈశ్వరానుగ్రహమువలననే ముందు శాశ్వతానందమును పొందఁగోరియున్న మనము పయి హేతువులనుబట్టి విచారింపఁగా మనజాతివాఁడని, మనమతమువాఁడని, మనదేశమువాఁడని, భేదభావము చూపక యర్హుఁడైనప్పుడు మానవసామాన్యమున కెల్లను చేతనైన విధమున తోడుపడవలయునని యేర్పడుచున్నది. అయినను మనకు మనుష్యులతో నుండు పరస్పరసంబంధతారతమ్యమునుబట్టి మనము చేయు దానములు మన సమీపమున నుండు వారికి ముందుగా చెందవలసియుండును. అట్లగుట యావశ్యకమైయెనను సమయము తటస్థించి మనకు శక్తికలిగియున్నప్పుడు దూరదేశములవారికి సహితము మనము ధనాదిసాహాయ్యమును చేయక యూరకుండరాదు. మన కుటుంబమును పోషించుట మనకు ప్రథమ ధర్మము; తరువాత ధనమున్నచో నిఱుపేదలయి పాటుపడ శక్తిలేని బంధువులకును, గ్రామవాసులకును, దేశస్థులకును తోడుపాటు చూపవలెను. ఈ దేశములో కొందఱింట భార్యాపుత్రాదు లన్నవస్త్రములకు లేక కష్టపడుచుండఁగా, ప్రసిద్ధికయి యప్పుచేసియయినను దానములుచేసి మహాదాతలని పేరుపొందఁ జూచుచున్నారు. ప్రతిపురుషుఁడును తనభార్యను బిడ్డలను, వృద్ధులగు తల్లిదండ్రులను వివాహములుకాని చెల్లెండ్రు మొదలయిన కుటుంబమును పోషించుటకు ముఖ్యబద్ధుఁడగుచున్నాఁడు. ఇట్లు ధర్మానుబంధముగా తన పాలఁబడిన కుటుంబమును అనాదరించి వారి యావశ్యకములకు కొఱఁతకలిగించి స్వభావవిరుద్ధముగా దాత ననిపించుకొనుటకయి పరులకు దానమిచ్చువాఁడు,

తనగోవులను జంపి వాని చర్మములతో చెప్పులను కుట్టించి పరులకు దానము చేయు ధర్మాత్ముని వంటి వాఁడగును. అట్లుగాక తీర్పలేని యప్పులుచేసి దానములు చేయువాఁడు పరులసొత్తును దొంగిలించి దాని నన్యులకిచ్చెడు పగటిదొంగగాను, ఎఱిఁగియుండి యట్టి ధనమును దానముగా స్వీకరించువారు దొంగసొత్తును హరించెడు పాపులుగాను, ఉందురనుటకు లేశమయినను సందేహము లేదు. కాఁబట్టి వివేకులగువారు దానము నిమిత్తమయి తామెప్పుడును ఋణములు చేయక తమకున్నదానిలో తమ కుటుంబసంరక్షణమునకు వ్యయమయినది పోఁగా నేదయిన మిగిలిన పక్షమున దానిని దానధర్మముల కుపయోగింపవలెను. తీర్పలేని యప్పులను చేసెడివారు దొంగలకన్నను పరమాధములని చెప్పవలసియున్నది. దొంగ యెత్తుకొనిపోయిన సొమ్మింక రాదని నిరాశచేసికొని యజమాను లొకసారి యేడిచి యూరకుందురు. రానియప్పుల నిచ్చిన వారో యెప్పుడో వచ్చునన్న యాసచేత ప్రయాసపడి వెనువెంట తిరుగుచు నిత్యము నేడ్చుచుందురు. అప్పులపాలయినవారికి సమస్తగౌరవములును నీతియుకూడ చెడును. అప్పిచ్చినవాఁడు కనఁబడినచోటనెల్ల నడుగుచుండినచో, అవమానకరముగా నుండును. అప్పులవారి బాధ తప్పించుకొని వారిని త్రిప్పుటకయి సాకులు కల్పించి కల్లలాడుచు పుచ్చుకొన్నవాఁడు పలువిధములయిన నైచ్యములకు లోఁబడవలసివచ్చును. కాఁబట్టి యెల్లవారును మితముగా వాడుకొనుచు, వ్యాధులు వచ్చునప్పటికిని పనిలేక యుండునప్పటికిని వృద్ధత్వము వచ్చునప్పటికిని కొంచెము కూడఁబెట్టుచు, శక్తికి మించకుండ తగిన దానధర్మములు చేయుచుండవలెను. ఇట్లు చెప్పుటచేత ధనము నిలువలేనివాఁడు దానధర్మములు మాని లుబ్ధశిరోమణిగా నుండవలెనని చెప్పుట నాయభిప్రాయ మెంతమాత్రమును గాదు.

భగవదనుగ్రహమువలన నిరంతరమును మతిమీరిన సుఖముల ననుభవించుచు పరలోకసుఖమునిమిత్తమయి దయచూడుమని యీశ్వరుని వేఁడుకొనుచుండెదు మన మాయన బిడ్డలును సహోదరులు నయి సమానవకోటియెడల నాదరమును ప్రేమమును గౌరవమును కనఁబఱిచి శక్తులమై యున్నంతవఱకు మనము కొంతకష్టపడియైన గతిలేనివారికి తగిన త్రోడ్పాటును జూపి కేవల వాగ్వాడంబరమువలనఁ గాక కార్యములచేతఁ గూడ మనము తదనుగ్రహము పొందుట కర్హులమని చూపకపోతిమేని, మనమెట్లు భగవత్కటాక్షమునకు పాత్రులమయి నిత్యానందపదవి పొంది సుఖింపఁ గలుగుదుము? అర్హులయియున్న సమస్తజనులయెడలను మన యౌదార్యమును సమయోచితముగా చూపుట యావశ్యకమేయైనను, ఒక్కఁడెప్పుడును సమస్తదేశముల వారికి నుపకారము చేయుటకు సమర్థుఁడు కాఁజాలఁడు. కాఁబట్టి ప్రతిమనుష్యుఁడును శక్తికొలఁదిని చేరువ నున్నవారి కుపకారము చేయుటకై ముఖ్యముగా పాటుపడవలె జాలును. దేశమునకెల్ల మహోపకారము చేయఁదలఁచిన పక్షమున, ఇతర ఘనకార్యములయందువలెనే సంఘీభవించి మహాపురుషులు పూనుకొని నిర్వహింపవలెను. మనదేశములో ప్రత్యేకముగా నొక్కరొక్కరు చేయుటయేకాని సంఘీభవించి లోకోపకారములయిన పుణ్యకార్యములను చేసెడి యుత్తమమార్గము నింకను మనవారు గ్రహింపలేదు.

దానములని చెప్పఁబడువానిలో విద్యాదానము, అన్నదానము, వస్త్రదానము, ఔషధదానము, ధనదానము ముఖ్యములు. ఈ దానములలో నెల్ల విద్యాదాన మనఁగా జ్ఞానదానము సర్వోత్కృష్టమైనది. ప్రపంచయాత్ర నిర్వహింపవలసిన మనుష్యనామము గలవారి కెల్లను జ్ఞాన మావశ్యకమే గనుక సర్వజనావశ్యప్రహణీయ

మయిన విద్యాదానముతో సమానమయినది లోకములో మఱియొ కటి లేదు ? దీనికి కొందఱు పాత్రులనియు కొందఱు పాత్రులు కార నియు నియమము లేదు. ఈవిద్యాదానమునకు జాతిమతాదిభేదం ములు లేక శ్రద్ధాళువులైన స్త్రీలును పురుషులును సమస్తమానవు లును సమానార్హులు. ఈదానమువలన దాతకును ప్రతిగ్రహీతకును కూడ లాభమును గౌరవమును గలుగును. దీనివలన నుభయులకును జ్ఞానాభివృద్ధి యగునేకాని తక్కిన దానములయందువలె నెవ్వరికిని తక్కువ పడదు. ఇతరదానములవలెంగాక యిది యిద్దఱికి నిహపర సాధనమయినది. మనదేశములో విద్యయను పదార్థమునే కొందఱు విపరీతార్థమున గ్రహించుచున్నారు. పదార్థవిషయమయిన యథార్థ జ్ఞానము విద్యగాని, స్వప్రయోజనపరులు స్వలాభార్థముగాను, తాము మితజ్ఞులమని లోకమునకు తెలిసిన హానివచ్చునని భావించెడు మహా పండితులు తాము సర్వజ్ఞులని చూపుటకుంగాను, వ్రాసిన మోసపు వాక్యములును తెలియని విషయములును విద్య కాదు. సత్యమునకు దూరములయిన విషయములను నేర్చుకొనుటవలన లోకమునకు నష్టము గలుగును గాని లాభ మోతమాత్రమును కలుగదు. కాంబట్టి విద్య నుపదేశించువాండును గ్రహించువాండును గూడ సత్యప్రవచము నందును సత్యగ్రహణమునందును బద్ధాదరులయి యుండవలెను. విద్య పుస్తకరూపముగానే యుండవలసిన దన్న యావశ్యకము లేదు; అది వాగ్రూపముగా నున్నను ఉండవచ్చును. వాగ్రూపముగా నీతులు మొదలయిన సద్విషయములను బోధించువాం డొక్కండు మనవా రిప్పుడు చదివించెడు వేయిగ్రంథములు గలిగించెడు దానికన్న లోకమున కెక్కువ లాభము కలిగింపవచ్చును. సత్యమెక్కడ నున్నను పవిత్ర మయినదే గనుక మనద నిడి దురభిమానమును విడిచి సత్యములైన

విషయము లెవరి గ్రంథములలో నున్నను, ఏ భాషయం దున్నను, గ్రహించుటకయి ప్రయత్నింపవలెను. విద్య గ్రహించుటకు శ్రద్ధ గలవా రందఱును యోగ్యులేయయినను విద్యోపదేశము చేయుటకు మాత్ర మెల్లవారును యోగ్యులు కారు. విద్యాదానమునకు చిర కాలము కష్టపడి పరిశోధించి యుత్తమజ్ఞానమును లోకానుభవమును పొందిన సుజ్ఞానులు మాత్రమే యాచార్యులుగా నుండుట కధికారులు. విద్యాదాన మన్ని దానములలోను శ్రేష్ఠతమమయినది. గనుక, విద్యాదాతలకు అన్నప్రదాతలు మొదలయినవారికంటె నెక్కువ గౌరవమును పూజ్యతయు కలిగియుండవలసినది. అట్లయ్యును మనదేశములో నన్నప్రదాతకుఁగల గౌరవము విద్యాప్రదాతయయిన యుపాధ్యాయునకు లేదు. ఇందునకుఁ గారణమేమని విచారించుటకయి దూరము పోవలసిన పనిలేదు. మనదేశముయొక్క దౌర్భాగ్యముచేత నిరక్షరకుక్షులును, బాహ్యవేషములును పటాటోపములును గలిగి పారంపర్యముగా శిష్యపరంపరను వంచించి ధనార్జనముచేసి కుటుంబ భరణము చేసికొమరిగిన గురునామధారులును, మన పిన్నపెద్దలకు విద్యాగురువు లగుటచేత మన యుపాధ్యాయుల కింతటిగతి పట్టినది. ఎంతో విద్యావంతుఁడును బుద్ధిమంతుఁడును అగువాఁడు పిల్లలకు చదువు చెప్పుటకు పూనుకొనవలసినదానికి మాఱుగా మనదేశములో నిప్పు డేవృత్తికిని పనికిరానివాఁడు బడి పెట్టుకొని బాలురకు విద్యోపదేష్ట యగుచున్నాఁడు. అటువంటి మహోపాధ్యాయులు బాలురను తరింపఁజేయుటకయి మనదేశమునం దంతటను నిండియుండఁగా, విద్యగల మంచియుపాధ్యాయుల గౌరవము తగ్గుటలోను దేశములో మౌఢ్య మెక్కువ యగుటలోను వింత యేమున్నది? దేశముయొక్క స్థితిని బాగుపఱిచి జనులను విద్యాధికులనుగాఁ జేయవలెనన్న చింత

గల దేశాభిమాను లందఱును సర్వవిధముల ప్రయత్నముచేసి సాధ్యమయినంతవఱ కిటువంటి యుపాధ్యాయుల సంఖ్యను తగ్గించి, వారిస్థానమున తెలిసినవారిని విద్యాదానమునకు నియోగించి, ధనికులలో మాత్రమేకాక సామాన్యజనులలోను స్త్రీలలోనుకూడ సువిద్య వ్యాపించునట్లు చేయవలెను. తక్కువ జాతులవారును స్త్రీలును గూడ విద్యగలవారయి కార్యాకార్యములను చక్కగా విమర్శింపఁగలవారగువఱకును విద్యాధికులయియున్న గొప్పజాతులవారికిని పురుషులకును తగినంత యభివృద్ధియు సుఖమును గలుగవు. మనము జనసామాన్యమును విద్యాసంపన్నముగాఁ జేసి వారిని మనతో సమానులనుగాఁ జేయుటకయి ప్రయత్నింపక పోయిన పక్షమున సహవాసదోషముచేత మనమే యించుమించుగా వారితో సమానులమయి మూర్ఖులవలె సంచరింపవలసిన వారమగుదుము. విద్యావిహీనులు పశువులని యెల్లవారును చెప్పుచున్నారు గదా? మనము స్త్రీలకు విద్య చెప్పింపక వారిని పశువులవలెనుంచి వారితో సహవాసము చేయుచుండెడు పక్షమున మనుష్యులు పశువులతో సహవాసము చేసినట్లేకదా యగును! మనమెంత విద్యాధికులమని స్వతంత్రులమని గర్వపడుచున్నను, మన యిండ్లకడ స్త్రీలమాటనె విని వారి యిష్టానుసారముగా నడుచుచున్నామనుట యెల్లవారికి ననుభవసిద్ధమే. స్త్రీలను విద్యావిహీనులనుగాఁ జేసి మనము వారి యాలోచనప్రకారముగా వర్తించుచున్నామనుట కర్థము మనుష్యులు పశువులచేత నడపఁబడుచున్నారనియో జ్ఞానులు మూఢులచేత నడపఁబడుచున్నారనియో యగును. మన కిప్పుడు పట్టియున్న యీదురవస్థను తొలఁగించుకొని మనము సుఖాభివృద్ధిని పొందవలెనన్న పక్షమున, మనస్త్రీలను విద్యావతులనుగాఁజేసి వారిని మనతో సమానురాండ్రనుగా దిద్ది వారు మన

కాలోచన చెప్పుట కర్తృరాం(డగునట్లు చేయవలెను. జనసామాన్యము యొక్కయు బాలికలయొక్కయు విద్యాభివృద్ధి నిమిత్తమయి ధర్మ పాఠశాలలను పెట్టించుటతో సమానమయిన యుపకారమును పుణ్య మును ఇతరములయిన దానములు వేయిచేసినను కలుగవు. కాఁబట్టి మనవారందఱును పయిరీతి పాఠశాలలను దేశమంతటను స్థాపించి పేదలకును స్త్రీలకును విద్యాదానము చేయించి పుణ్యమును కట్టుకొనఁ బ్రయత్నింతురని దృఢముగా నమ్ముచున్నాను.

సమస్తధర్మములకును దేహ మాధార మగుటచేతను, దేహ ధారణమున కన్న మాధారమగుటచేతను, తక్కిన దానములలో నన్నదానము శ్రేష్ఠమయినదని చెప్పవచ్చును. ప్రతి దానమునకును ప్రతిగ్రహీతయొక్క సుఖాభివృద్ధియో దుఃఖోపశమనమో ఫలముగా నుండవలెను; దానివలన నేకీడును కలుగఁగూడదు. అట్లుండునట్లు చేయుటకయి దానివిషయమున పాత్రాపాత్రవిచారము ముఖ్యముగా చేయవలెను. ఇప్పు డన్నదానమున కెట్టివారు పాత్రులన్న విషయమును ముందుగా విచారింతము. క్షుద్బాధ యందఱికిని సమానమే గనుక, ఆఁకలిగొనియున్న వాఁడెల్ల నన్నదానమునకుఁ బాత్రుఁడని సామా న్యముగాఁ జెప్పుదురు. కాని సూక్ష్మదృష్టితో విచారించెడు పక్షమున వారిమాట సరియైనది కాదని తోఁచకపోదు. ఎక్కడనో భాగ్యహీను లయిన కొందఱికి తప్ప భగవంతుఁ డందఱికిని కరచరణాద్యవయవము లను ప్రసాదించియున్నాఁడు. అట్లు ప్రసాదించి యుండుటచేతనే యవయవపటుత్వము గలవా రందఱును వాని నుపయోగించుకొని పాటుపడి జీవనము చేయువలెననుట భగవదుద్దేశమనియు, వాని నుపయోగపఱుచుకొని పాటుపడక సోమరిగా తిరుగువాఁడు భగవదాజ్ఞ నుల్లంఘించినవాఁ డగుటచేత దానిఫలము ననుభవింపవలసినవాఁ

డనియుఁ విస్పష్టమగుచున్నది. కాఁబట్టి దృఢకాయులయి పాటుపడి జీవింప శక్తికలవా రన్నదానమున కర్హులు కారని చెప్పనక్కఱ లేకయే బోధపడుచున్నది. రోగములచేతను, ముసలితనముచేతను, అంగవైకల్యముచేతను, దైవికములయిన యితరాపత్తులచేతను పాటు పడి సంపాదించుకోలేని నిరాశ్రయులయిన బీదవాండ్రును, తల్లిదండ్రులు లేని దిక్కుమాలిన పసిబిడ్డలును, గతిలేని వితంతుస్త్రీలును, అన్న దానమున కర్హులు. ఇట్టి లోపములు గల వారన్నాతురులయి వచ్చి నప్పుడు బ్రాహ్మణుఁడని, పంచముఁడని, హిందువని, తురుష్కుఁడని చూడక యెల్లవారికిని సమానముగా శక్తి కొలఁదిని దానము చేయ వలెను. వీరికి చేయు దానము సదా ప్రీతిపూర్వక మయినదిగా నుండ వలెను. వీరుగాక మన మన్న మిచ్చి సత్కరింపవలసినవా రింకొక తెగ వారుకూడ నున్నారు. వారు పరదేశమునుండి యాకస్మికముగా వచ్చిన యభ్యాగతులు. వారికి జరుగుఁబాటు కలిగియున్నను గ్రామ మునకు క్రొత్తవారగుటచే వారికిఁ గావలసిన యానుకూల్యములు సులభముగా లభింపనేరవు గనుక, అట్టి యతిథులను భోజనాదులచేత వచ్చిన దినమున సత్కరించుటకూడ మనకు విధిగా నున్నది. వీరికి చేసెడు భోజనాదిసత్కారము పయివారి దానివలె కేవల దయతో చేయునదిగా నుండక పూజ్యతాబుద్ధితో చేయునదిగా నుండవలెను. ఇటువంటివారికేఁ గాక పాటుపడి సంపాదించుకోఁగలవారై దృఢశరీరు లయ్యును దేహములు దాఁచుకొని పాటుపడక సోమరులై పరులను యాచించి తిన మరగిన సోమరిరాములకును, హేయాతిహేయమయిన యాచనయే కులవృత్తిగాఁ జేసికొని మానావమానములు మాని నైచ్యముగా తిరుగు యాచకచక్రవర్తులకును దానములు చేయ

పోవుటయేకాక బహువిధములయిన యనర్థములను తటస్థించును. ఏమి కాలకర్మదోషముననో కాని మన దేశమునం దిప్పు డీ దానవిషయ మయి విపరీత ప్రవర్తనము కానఁబడుచున్నది. కటికిదరిద్రులయిన కుంటివాండ్రును గుడ్డివాండ్రును క్షుత్పీడచేత బాధపడుచు గుమ్మములవద్ద నిలిచి వీధులలో గొంతుపగుల దీనాలాపము లఱచుచుండఁగా మనవార లనేకులు వారి మొఱ్ఱలాలకించి బిచ్చముపెట్టిన మహాపాతకమువచ్చి తమ్ము చుట్టుకొనునని భయపడి వారికి భిక్షము పెట్టక పోవుటయేకాక మీఁదుమిక్కిలి వాండ్రను దుర్భాషలాడి వెడలఁగొట్టి, పాటుపడి నలుగురను పోషింప శక్తిగలిగియు పాటుపడక ముఖస్తుతులుచేసి వంచించి ధనమును గొనెడు దృఢకాయులకు సంతోషపూర్వకముగా దానములు చేయుచున్నారు. అట్లు చేయుటచేత యాచనయే వృత్తిగాఁ గలవారు మానవకోటికి కలంకారములుగా నుండు మానము, లజ్జ మొదలయిన యుత్తమగుణములను పోగొట్టుకొని సోమరితనమునకు ఫలములయిన వంచనము మొదలయిన నీచగుణములను పొంది పాడగుచున్నారు. జూదము లాడుట, కొండెములు చెప్పుట, ఇచ్చకము లాడుట, కూటసాక్ష్యములు పలుకుట, కుటుంబ కలహములు పెట్టుట, మిత్రభేదము చేయుట మొదలయిన యకార్యకరణము లనేకము లీ సాపాటురాములయందే తఱచుగా కానఁబడుచున్నవి. ఇట్టివా రుదరము నిమిత్తమయి బహువిధవేషములను వేసి, సత్యమును విడిచి తమయింట శ్రాద్ధమనియు, వివాహమనియు, వడుగనియు, యజ్ఞమనియు, యాగమనియు బొంకి వంచించి ధనమును గొనుచు, సత్రములు పెట్టించెదమని సమారాధనములు చేయించెదమని గుళ్ళు గోపురములు మండపములు కట్టించెదమని చెప్పి భ్రమపెట్టి గడించి గృహములు కట్టించుకొని భార్యలకు నగలు చేయించుకొనుచు,

ఊరూరం దిరిగి సత్రములకు సమారాధనములకుం బోయి పరాన్నముతో కడుపు నింపుకొనుచు, వైరాగులమని యోగులమని మాంత్రికులమని నటించి బెదిరించి ధనాపహరణము చేయుచు; కాకులవలె నఱచుచు నిండ్లకడను రేవులకడను కాచి, కాసువీసములు పెనఁగులాడి గ్రహించుచు, వివాహాదులయందు దొమ్మిచేసి చేతులు విఱిచియు తోరణములు త్రెంచియు తిట్లుతినియు కొట్లుపడియు దక్షిణాలందుచు, చూచువారు నవ్వినను పెట్టువారు తిట్టినను లక్ష్యము చేయక కొల్లగాండ్రవలె మీఁదఁబడి బలవంతముగా లోకువైనవారి చేతులలో ధనము లాగుకొనుచు, ఎంత యిచ్చినను తృప్తినొందక సంతుష్టి లేక యియ్యనివారిని పాపులని తిట్టుచు, శుభకార్యములు లేనియెడల నింటింట శ్రాద్ధములు కావలెనని కోరుచు, చావులు వేఁడుచు, ఇంట ధనమున్నను మూఁడుజాములవఱకును మెతుకులు తినక మాడుచు, తేరతిండ్లకయి వెతకులాడుచు, నానావిధకుప్రవర్తనలచే నయోగ్యముగా కాలము గడుపుచున్నారు. ఇటువంటి యవలక్షణములుగల సోమరిసార్వభౌములసంఖ్య యిప్పుడు బ్రాహ్మణేతరులయందును దినదినాభివృద్ధి చెందుచున్నది. ఇంటింటఁ దిరిగి బిచ్చమెత్తుచు, సందయినయెడ నెవ్వరును లేకుండఁ జూచి చేతికి దొరకిన వస్తువులను దొంగిలించుచు, భిక్షమే వృత్తిగాఁ జేసికొన్న దృఢదేహులయిన హీనజాతులవారి నెందఱినో మనమిప్పుడు ప్రతిగ్రామమునందును దండోపదండములుగాఁ జూచుచున్నాము. ఇట్టివారికి బిచ్చము పెట్టెడి యాచారము మనదేశములో లేకయుండినయెడల, వారందఱును పాటుపడి గౌరవముతోఁ గూడిన జీవనమును సంపాదించుకొని తాము బాగుపడి పరులకు శ్రమమియ్యక లోకమున కుపకారులయి యుండురుగదా ? వీరు వ్యవసాయమునందు ప్రవేశించిన, పంట లధిక

మగును; మఱి యేవృత్తియందు ప్రవేశించినను, ఆయావృత్తు లధిక లాభకరము లగును. అంతేకాక వీరు న్యాయముగా పాటుపడి సుఖ జీవనము చేయుచుండినయెడల వీరి పోషణమునకయి వ్యయ మయ్యెడు సొమ్మంతయు జనులవద్దనుండి జను లధికధనసంపన్ను లగుదురు. మన మీ యనర్థములను తొలఁగింపవలెనన్నచో మనవా రాచరించెడి యవిచారమూలకములయిన యీ దానములను కట్టి పెట్టవలెను. కావలసియుండినయెడల బీదలయి దృఢకాయులయి యుండెడి వారికి మనము చేయవలసిన సాహాయ్య మొక్కటి యున్నది. మనదేశమునం దక్కడక్కడ పనిశాలలు పెట్టించి, పనిపాటులు లభింపని యిటువంటి బీదలచేత నందు పనిచేయించి జీవనమున కిచ్చుచు వచ్చినచో వాండ్రకు జీవనము నడచుటయే కాక వాండ్రు చేసిన పనివలన అయ్యెడు వ్యయములును కలిసివచ్చును. కాఁబట్టి మనవారింక పరాన్నభక్షణవ్రతులకయి యన్నసత్రములను వృద్ధిపొందింపఁ జూడక వాని స్థానమున బీదలకయి కర్మశా లలను పెట్టించుటకయి చూడవలెను. పయిని చెప్పిన వికలాంగులు మొదలయిన యశక్తులకు మాత్రమే యన్నసత్రము లుండవలెను. కాని యితరుల కక్కఱ లేదు. మనవార నేకు లితరుల కష్టములను బాధలను తొలగించుటకయి దానములుచేయుక పేరునిమిత్తమును ముఖస్తుతుల కబ్బియు దానములు చేయుచున్నారు. సదుద్దేశముతో హృదయపూర్వకముగా చేయని యిటువంటి దానములవలన ప్రయో జనము లేశమయినను లేకపోవుటయే కాక మితిమీఱిన యనర్థము లును కలుగుచున్నవి. పేరున కాశపడి, ముఖస్తుతుల కాశపడి, వివాహా దులయందు శక్తికిమించిన దక్షిణ లిచ్చి, అప్పులపాలయి చెడిపోయిన వా రెందఱున్నారో కొంచెము విచారించిన యెడల వారి మనస్సులకే

విశదమగును. కేవల కీర్తికే యాశపడి దానములు చేయువారు కొందఱు పరులు తమ్ము దాత లనుకొనవలెనని యితరులు చెంత నున్నప్పు డపాత్రునకయిన దంభమునకయి దానములు చేయుచు, పరు లెదుట లేనప్పు డుత్తమపాత్రునకయిన చిల్లిగవ్వ యియ్యక సాగనంపుచుందురు. అటువంటివారు సత్యమయిన దాతలు గాక పరులను వంచించు పెనుమోసగాండ్రగుదురు. కాఁబట్టియే యొక చేయి చేసిన దానమును రెండవచేయి యెఱుఁగకుండునట్లుగా గుప్త దానము చేయవలెనని పెద్దలు చెప్పుదురు. నిజమయిన దాతకు ప్రసిద్ధి తాను కోరనక్కఱలేక తనంతనే వచ్చును. కొమ్మల మఱుఁగున నున్నను పుష్పము యొక్క సువాసన పయికి వచ్చునట్లుగా, గుప్తదానము చేసెడు త్యాగుల యౌదార్యమును తాను చాటుకొనకయే జగత్ప్రసిద్ధమగును. కొందఱు ఘనులు, ధనికులు తమ గ్రామములకు వచ్చుచున్నారన్న వార్త చెవి సోకఁగానే యెదురుపోయి కొనివచ్చి వారికి సమస్తోపచారములును చేసి విందులు చేయుచు, దరిద్రులు తమ యిండ్లకు వచ్చి పిడికెడు బియ్యము బిచ్చము పెట్టుఁడని దీనత్వముతో వేఁడుకొన్నను వినిపించుకొనక యాదీనులను తిట్టి కొట్టి తఱిమివేయుదురు. అట్టివారు చేయువ్యయము జలములేక యెండఁబాఱుచున్న చేలకు నీరుపెట్టక, అతివృష్టిచే మురిగిపోవుచున్న పొలములకు నీరు పెట్టినట్టు నిష్ఫలమగును. ఇఁకఁ గొందఱు మనస్సులో సమాధానము లేకపోయినను యాచకులు తమ్ము తిట్టుదురో బందతనము చేయుదురో యని భయపడి వారికి కాసువీసము లిచ్చి పంపివేయుదురు. అట్టి దురాగ్రహగ్రస్తులయిన యాచకపిశాచముల శాపములు వారికే తగులునుగాని వారికి ధనమియ్యనివారి కెంతమాత్రమును తగులవు. అట్టి దానము దారిదోపుడుకాండ్ర కిచ్చిపెట్టునకు

వెఱచి ధనకనకాదుల నిచ్చెదు మహాదానమునకంటె శ్రేష్ఠమయినది కాదు. అట్టి యాచకులును దొంగలకంటె నేవిషయమునను మంచి వారుకారు. దొంగలు చీఁకటిరాత్రులలో నప్పుడప్పుడు నిద్రపోవు చుండఁగా కొందఱియిండ్లలో ధనాపహారణము చేయుదురు. కాని యీ పగటిదొంగలో ప్రతిదినమును పట్టపగలు మేలుకొని యుండఁ గానే యెల్లవారల యిండ్లకడను ధనాపహారణము చేయుదురు. ఇట్టి వీరికి దానముచేసి ప్రోత్సాహపఱుచుట దొంగలను పోషించి పరు లను దోచుకొనుట కయి ప్రోత్సాహపఱుచుట వంటిది. ఇటువంటి దానములుగాక మనలో మత్తోన్మాదముగలవారు కొందఱు తోడి మానవులు తిండిలేక పరితపించుచున్నను వారికి తోడ్పడక దయాలే శములేక మాంసమును చేపలను కొని, గ్రద్దలను వెదకుకొనుచుఁ బోయి పిలిచి యెగరవేయుచు, బియ్య మొడికట్టుకొని పోయి చెట్లు పుట్టలు వెదకి చీమలకుఁ బోయుచు ప్రొద్దుపుచ్చుచున్నారు. మన లోని తెలివిగలవా రిటువంటి మూఢతాజన్యములయిన దానము లను సహితము వారించి గతిలేని వృద్ధులు మొదలయినవారి కిచ్చు టయే భగవత్ప్రీతికరమని తెలియనివారి మనస్సులో నాటుకొను నట్లు చేయవలెను.

కడుపున కన్న మమరిన తరువాత కట్టుకొనుటకు బట్ట యావ శ్యము కాఁబట్టి యన్నదానము తరువాత వస్త్రదానము ముఖ్యమయిన దని చెప్పవచ్చును. వస్త్రదాన మన్నదానమువలె ప్రతిదినము చేయ వలసిన పనిలేదు; సంవత్సరమునకు రెండుపర్యాయములు చేసినఁ జాలును. ముఖ్యముగా శీతకాలమునకుముందు బీదలకు వస్త్రదానము చేయుట మిక్కిలి యుపయుక్తముగా నుండును. అన్నదానార్హులని చెప్పఁబడిన యగతికులగు రోగపీడితులు వృద్ధులు వికలాంగులు

# రాజమహేంద్రవర స్త్రీ పునర్వివాహ చరిత్రము.



By

**K. VEERESA LINGAM**

విద్యాదానమునకును అన్నదానమునకును తరువాత ఔషధదానము ప్రధానమయినదని చెప్పవచ్చును. ఈ యౌషధదానమునకు రోగపీడితులయి దిక్కులేక యున్నవారు పాత్రులు. అట్టిరోగులకొక్క యౌషధమును మాత్రమే కాక యారోగ్యమున కావశ్యకములయిన పథ్యపానములను వస్త్రాదులను కూడ సమకూర్పవలయును. అన్నదానాదులు చేయుటకు ధనికులందఱు నర్హులే యయినను, ఈ దానమునకు మాత్ర మెల్లవారు నధికారులు కారు. రోగస్వభావమును గుణమును చక్కగా తెలిసికొని తగిన చికిత్సచేయఁగల వైద్యుఁడు మాత్రమే మందులనిచ్చుట కర్హుఁడు. అట్లుగాక యెల్లవారును వైద్యవేషము ధరించి మందులసంచులు గొని యౌషధదానము చేయుటలుపెట్టినయెడల ప్రమాదము సంభవించి రోగియొక్క బాధనివారణమగుటకు మాఱుగా హెచ్చుకావచ్చును. ఒకానొకప్పుడు భిషగ్వేషధారుల యజ్ఞానముచేత రోగికి ప్రాణోపద్రవముకూడ సంభవింపవచ్చును. కాఁబట్టి యౌషధదానమునకయి ధర్మవైద్యశాలలు పెట్టించి వానియందు వైద్యశాస్త్రాభ్యాసముచేసి యనుభవశాలులయియున్న ఘనవైద్యుల నధికారులనుగా నియమించుటయే కాక, భూభారము నడఁచుటకయి యవతరించిన యమదూతలవలె నెల్లయెడలను వ్యాపించి యున్న వైద్యవేషధారులు స్వకుటుంబభరణార్థమయి తోఁచిన మందుల నిచ్చుచుండెడి మనదేశమునందలి గొప్ప దురాచారమును మాన్పుటకయి సకలవిధములఁ బ్రయత్నింపవలెను.

ధనదానమును గుఱించి విశేషముగా చెప్పవలసిన యావశ్యకము లేదు. అది తనంత నుపయోగపడునది కాదు; దాని నెవ్వరును కొరుకుకొని తినరు. అన్నవస్త్రాదుల నిమిత్తమును, విద్యనిమిత్తమును, మందు నిమిత్తమును, ధనము కావలసి యుండును. ఆ యా దానముల కెవఁ

ర్థులలో వారు మాత్రమే ధనదానమున కర్థులుగాని యితరులు కారు. పండితులు మొదలయిన వారినికూడ ధనదానముచే సత్కరించి మంచి విద్యలను ప్రోత్సాహపఱుపవచ్చును. ప్రత్యేకముగాఁ జేయవలసిన దానము లనివార్యముగా కొన్ని యున్నను, బహుజనోపకారార్థమయి చేయవలసిన ధర్మము లనేకములు సంఘీభవించి యైకమత్యముతోఁ జేయవలసి యుండును. పయిని చెప్పిన దానములలో విద్యాదానము నిమిత్తము ధర్మవిద్యాశాలలను. అన్నదానము నిమిత్తమయి యన్నసత్రములను, బీదల పనిపాటుల నిమిత్తమయి కర్మశాలలను, ఔషధదానము నిమిత్తమయి ధర్మవైద్యశాలలను, స్థాపింపవలయును. ఈ మహాకార్యముల నొక్కొక్కరు పూనుకొనుటకంటె పలువురు చేరి చిన్నచిన్న మొత్తములను చందాలు వేసి చేసినను శ్రేష్ఠతరముగా జరపవచ్చును; ఇవిగాక మిగిలిన చిల్లరదానము లంతగా నావశ్యకములు కావు. వానిని చేసినను చేయవచ్చును; చేయకపోయినను చేయకపోవచ్చును. చేయుటవలన విశేషప్రయోజనము లేదు; చేయకపోవుటవలన విశేషనష్టమును లేదు. కాఁబట్టి వానివిషయమయి యిక్కడ ప్రస్తావింపక యీ ప్రసంగము నింతటితో విరమించుచున్నాను.

# రాజమహేంద్రవర స్త్రీ పునర్వివాహ చరిత్రము



ఓ మిత్రులారా !

స్త్రీపునర్వివాహ విషయకములయిన యుపన్యాసములను విని విని మీరు విసుగుచెంది యుందురు. బహుస్థలములయందు ఉపన్యాసములు చేసి చేసి నేనును విసిగియున్నాను. కొన్ని సంవత్సరములనుండి యేపట్టణమునందుఁ జూచినను, ఏసభలయందు విన్నను, ఏవృత్తాంత పత్రికలయందుఁ జదివినను, ఈ విషయమయిన చర్చలకును, ఉపన్యాసములకును, వాదప్రతివాదములకును విరామము కానరాకున్నది. వితంతువివాహములు తగుననువారును తగవనువారును కూడ శాస్త్రవచనములతోను యుక్తులతోను పుస్తకములు నింపివేసినారు. ఈ విధముగా ఎక్కడఁజూచినను కావలసినన్ని ప్రసంగములును వాగ్వాదములును పుష్కలముగా నడుచుచున్నను, చినుకలయినను లేక వట్టి యుఱుములతోను మెఱుపులతోను సరిపోయెడు శుష్కమేఘాడంబరమువలెనే చెవులు చిల్లులు వోయెడి యీ వాగాడంబరమువలనను ఫలమేమియు కలుగక కార్యములకు మాత్ర మింతవఱకును పెద్ద కఱవే పట్టియున్నది. కార్యమునకు ముందు కొంతకాలము మాటలావశ్యకములే యయినను, ఎల్లకాలమును మాటలతోనే కూరుచుండుట మాత్రము శ్లాఘాపాత్రము కాదు. మాటలు కావలసిన కాల మీవఱకే దాటిపోయినది. శ్రుతిస్మృతివిహితమైన ధర్మస్వరూపమును తెలిసికొన నిష్టమును శక్తియుఁ గలవారి కందఱికిని శాస్త్ర మెట్లున్నదో యీవఱకే తెలిసిపోయినది. స్త్రీపునర్వివాహమువలని సాధకబాధకములును లాభనష్టములును బహుకాలముక్రిందటనే యెల్ల

వారికిని ప్రతిదినఘంటాఘోషము లయిపోయినవి. కాఁబట్టి యిఁక కావలసినవెల్లను కార్యములు కాని మాటలు కావు లఉత్త పొడిమాటలు చెప్పుటకన్న ఒక్క కార్యమునుచేసి చూపుటవలన జనుల మనస్సులు పూర్వాచారమునుండి శీఘ్రముగా మరలి సహస్రగుణము లధికమయిన ఫలము కలుగును. కొందఱు ప్రయాసమున కోర్చి తాము మొట్టమొదట పనిచేసి చూపనిదే యెంతటి మంచికార్యమైనను కేవల ధర్మోపదేశమాత్రముచేత లోకములో వ్యాపింపదు. కాఁబట్టి యిప్పుడు కష్టములకు సహించి ధైర్యము వహించి కార్యములను నిర్వహించి, అంకురించిన సత్కార్యబీజమును కబళింప నోరప్పళించెడు విఘ్నమృగశతములనుండియు పామరజనదూషణాకాలవాయువునుండియు దానిని సంరక్షించుచు రావలయును. క్రొత్తగా కార్యము లారంభించువారికి ఈవఱకు మఱియొకచోట పనిచేసి కష్టనిష్ఠురములకు లోనయియున్న వారియొక్కయు జరిగిన కార్యములయొక్కయు చరిత్రము కొంత సహాయపడవచ్చును గనుక రాజమహేంద్రవరమున జరిగిన స్త్రీ పునర్వివాహచరిత్రమును వివరించుటకు చెప్ప ననుజ్ఞ వేఁడుచున్నాను.

మనదేశములో జనసామాన్యముయొక్క సుఖాభివృద్ధికి భంగకరములుగా నున్న బహుదురాచారములను సాధ్యమైనంతవఱకు తొలఁగింప ప్రయత్నింపవలయునన్న బుద్ధి యీశ్వరానుగ్రహమువలన చిరకాలముక్రిందటనే నాకు మనస్సులో నంకురించియుండెను. ప్రాయ మధికమయినకొలఁదిని నా కా యభిలాష బలపడసాగెను. దేశాభివృద్ధి నపేక్షించెడు నామిత్రులు కొందఱి సాహాయ్యమువలన కొన్నివిషయములలో కొంతవఱకు ప్రజోపయుక్తములయిన కొన్నిమార్పులను మా పట్టణములో కలుగఁజేయుటకును నేను శక్తుఁడ నయినాను.

అయినను స్త్రీపునర్వివాహ మీదేశములో వ్యాపించుటకు తగిన కాలము వచ్చినదనికాని ప్రయత్నము చేసినచో దానిని నెలకొల్పుట నావంటివారికి సాధ్యమగుననికాని నేనప్పుడు తలఁచి యుండలేదు. భ్రూణహత్యాదులు నశించి స్త్రీపునర్వివాహములు నిరాటంకముగా జరుగుచు బాలవితంతువులు ద్వితీయభర్తలతో సుఖించుచుండఁగా చూడవలెనని నాకెంత యభిలాష యుండినను, ఒక్కసారిగా ఇంతటి గొప్పమార్పు నిమిత్తమయి ప్రయత్నముచేయుటకు నాకు సాహసము పుట్టలేదు. ఇట్లుండఁగా పాఠశాలలో నా సహపాఠియు దేశాభిమానియు నైన నా ప్రియమిత్రుఁడొకఁడొకనాఁడు నా యొద్దకు వచ్చి మనము స్త్రీపునర్వివాహవిషయమయి కృషి చేయవలయునని యత్యంతాతురతతో చెప్పెను. అట్లుచేయుట యావశ్యకృత్యమని నేనెంత దృఢముగా విశ్వసించియున్నను, చేయవలెనని నాకెంత యభిలాష యున్నను, విశేషపాండిత్యముకాని ధనముకాని లౌకికాధికారముకాని లేని నావంటివారిట్టి మహాకార్యము తలపెట్టిన ప్రయోజనము లేదని యెంచి నామిత్రుని నేనంతగా ప్రోత్సాహపఱుపక యుపేక్ష చేయఁజొచ్చితిని గాని యతఁడే ప్రతిదినము నాయొద్దకు వచ్చి ప్రోత్సాహకరములయిన మాటలుచెప్పి నన్ను పురికొల్ప నారంభించెను. అతఁడీప్రకారము కొన్నిదినములు నాకుత్సాహము పుట్టించి యీ కార్యము నిమిత్తమయి ప్రయత్నము చేయతగిన సమయము వచ్చినదని కొందఱు వైదికులచేతఁగూడ చెప్పించి నన్ను బలవంత పెట్టఁగా, అన్నలుఁ తన్ను విడిచిపెట్టినను బంధువులు బాధించినను కడవఱకును నాతో నిలిచి పనిచేయునట్లు నామిత్రునిచేత వాగ్దానము చేయించుకొని, ఒకదిన మాతఁడు వ్రాసితెచ్చిన సభాహ్వాన పత్రికమీఁద నా చేవ్రాలు చేసి ప్రకటించితిని. ఈ యాహ్వాన

పత్రికను చూచినతోడనే శుద్ధవైదికవృత్తియందున్న మా పట్టణము లోని పండితులందఱును నామీఁద కత్తులు నూఱుట కారంభించిరి; పూర్వాచారపరాయణులయియున్న లౌకికశిఖామణులును వారికి తోడ్పడి, నన్ను సాధింప దీక్షవహించి యుండిరి. ఈ ప్రకారముగా ప్రతిపక్షులు తమ సాధనములతో సంసిద్ధులయి యుండఁగా, నేను పంపిన యాహ్వానపత్రిక ననుసరించి యీ విషయమయి నే నుపన్యసింపవలసిన దినమును వచ్చినది. అప్పటికి నాకు స్త్రీపునర్వివాహవిషయమయి యేమి గ్రంథములున్నవో తెలియవు. విద్యాసాగరుని గ్రంథమున్నట్టు మాత్రము తెలియునుగాని, ఆ గ్రంథమును నాకప్పుడు లభింపలేదు. మనుస్మృతియు, పరాశరస్మృతియు, యాజ్ఞవల్క్యస్మృతియు మాత్రమప్పుడు నా యొద్దనున్నవి. ఈ విషయమయి పురుషార్థప్రదాయినిలో నొకరు ప్రచురించిన చిన్న గ్రంథ మొకటి నాకు చిక్కినది. ఈ గ్రంథముల సాహాయ్యముతో నాబుద్ధికి తోఁచిన యుక్తులనుచేర్చి యొక యుపన్యాసము వ్రాసి దానిని శ్రీవిజయనగరపు మహారాజుగారి బాలికాపాఠశాలామందిరమున జరిగిన మహాసభలో ౧౮౭౯ వ సంవత్సరము జూలయి నెలలో మొట్టమొదట చదివినాను. నా యుపన్యాసము బహుజనుల మనస్సులను కరఁగించినను, పండితుల కోపాగ్నికి నేతిధారయయి వారిని మఱింత కుపితులనుగాఁ జేసినది. ఆ దినమున వాదమెట్లుజరుగునో వినవలె ననియు, పండితుల విజయమును చూడవలెననియు, బహువిధాభిప్రాయములతో గుంపులుగా వచ్చిన జనులతో అయిదాఱువందల జనులు పట్టఁదగిన సభామందిరమంతయు నూవులు పయికి చల్లినను క్రింద రాలనట్టుగా క్రిక్కిఱిసిపోయినది. నా యుపన్యాసము కాఁగానే ఆ మహాసంఘములో నుండి వృషభముమీఁదికి లేచు వ్యాఘ్రములవలె పండితు లనేకులు

లేచి శ్రీశంకరాచార్యస్వాములవారివద్ద ముఖ్యపండితులుగా నుండిన అద్దేపల్లి కృష్ణశాస్త్రులవారు మొదలైనవారు తమ పాండిత్యమునంతను కనఁబఱిచి నన్ను బహువిధముల దూషించి 'నష్టే మృతే' ఇత్యాది పరాశరస్మృతివచనమున కనేకవిరుద్ధార్థములు కల్పించి పరిహాసముచేసి ప్రత్యుత్తరము చెప్పుటకు నా కవకాశ మియ్యక, పయివారము నా యుపన్యాసముమీఁది ఖండనోపన్యాసములు చదివెదమని వాగ్దానములుచేసి నాఁటికి సభనుండి వెడలిపోయిరి. ఆ దినము మొదలుకొని పట్టణమునందంతటను ప్రతిగృహమునందును స్త్రీపునర్వివాహవిషయమయిన చర్చలే జరుగనారంభించినవి. ఆ కాలమునందు విధవావివాహమన్న శబ్ద మందఱికిని శూలమువలె సోఁకి కర్ణకఠోరముగా నుండెను. నన్నావఱ కితరవిషయములయందు భూషించువారును ఈ విషయమునందు దూషింప నారంభించిరి. నామిత్రులు సహితము కొందఱు నన్ను నిరుత్సాహపఱుపసాగిరి. పండితులందఱును నామీఁద ధ్వజమెత్తి, చూచువారు లేక మూలఁబడియున్న ప్రాతతాటాకుపుస్తకముల నన్నిటిని పయికితీసి బూజు దులుప మొదలుపెట్టిరి. ఏ గ్రంథము నడిగినను వారు నాకొక్కపర్యాయ మెరవియ్యకపోవుటయే కాక గ్రంథనామములయినను నాకు తెలుపక మఱుఁగుపఱచుచు వచ్చిరి. నా పక్షమున కొందఱుమిత్రులున్నను వారప్పుడు చేయఁగలిగిన సాహాయ్య మత్యల్పముగా నుండెను. మొదట నన్నీకార్యమునకు పురికొల్పిన మిత్రుఁడు మాత్రము సంస్కృతమునందు కొంత పాండిత్యము కలవాఁడగుటచేత నాకు బహువిధముల తోడుపాటుగా నుండెను. నాకింతలో కాశీపట్టణమునుండియు కాలీఘట్టపట్టణము నుండియు బొంబయినుండియు కావలసిన పుస్తకములన్నియు వచ్చినవి. ముప్పది స్మృతులకంటె నధికముగా నాకప్పుడు లభించినవి. అవి యన్నియు చదువుటకు నా

కప్పు డవకాశము లేకపోయినను, ఈశ్వరుఁడు మాత్రము నాకు మిక్కిలి సహాయుఁడయి యుండుటచేత నేను చూచిన భాగములోనే నావాదమున కనుకూలమయిన ప్రమాణవచనము లనేకము లప్రయత్నముగా దొరకెను. ఈప్రకారముగా సత్యబలమును దైవబలమును నాపక్షమునం దుండుటచేత నాకు ధైర్యము హెచ్చి నేనుత్సాహముతో పనిచేయుఁగా, పండితు లుపన్యాసములు చేసిన సభనాఁడు నాప్రతివాదమును విన్నమీఁదట జనుల కందఱకును పండితులవాద మసారమనియు స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమనియు అభిప్రాయము కలుగ నారంభించెను. పండితులు నన్ను బహిరంగముగా సభలయం దోడించలేక బహువిధమాయోపాయములు ప్రయోగింపఁజొచ్చిరి. కొందఱింటింటికి తిరిగి శాస్త్రజ్ఞానములేని పెద్దమనుష్యులవద్ద నేను చేసిన వపార్థములనియు, శాస్త్రము స్త్రీపునర్వివాహము నంగీకరింపదనియు, కలియుగము గనుక వర్ణసాంకర్యము కలిగి లోకము చెడిపోవుననియు, చాటు మొదలుపెట్టిరి. కొందఱు నయమున భయమున నన్ను మఱలింపఁ జూచిరి. కొందఱు నన్నకస్మాత్తుగా పిలిపించి వాదములో నోడించి శాస్త్రవిషయమున జనులకు కలుగుచున్న విశ్వాసమును చెడఁగొట్ట ప్రయత్నించిరి. అక్కడి పండితులు తాము వాదమునందు నిర్వహింపలేక యితరస్థలములనుండి పండితులను పిలిపించుటకై ప్రయత్నించి, ఆవిషయమునను లబ్ధమనోరథులుగాక విశాఖపట్టణమండలమునందలి యొకరాజుగారిచే నొక ఖండనగ్రంథమును వ్రాయించి తెప్పించి, పండితు లందఱును దానియందు తమకు తోఁచినవిషయములను చొప్పించి, పుస్తకములోని సంగతులు మాపక్షమువారి కెవ్వరికి తెలియకుండ రహస్యముగా నుంచి, కాశీ మొదలైన స్థలములయందు చిరకాలము వసించి మంత్రశాస్త్రప్రవీణుఁ

డని ప్రసిద్ధిఁ గాంచిన మహామంత్రజ్ఞుఁ డైన జోస్యుల వేంకటయనులు గారిలోపల నొకసభ చేసి, ఆసభకు స్త్రీపునర్వివాహప్రతిపక్షులను మాత్రమే యాహ్వానముచేసి నన్ను కస్మాత్తుగా పిలుచుకొనిపోయి, పయిగ్రంథమును జదివి యందలి యంశముల కాధారమునవే యుత్తరము చెప్పవలయునని యడిగి నన్ను పరాజితుని జేయఁజూచిరి. కాని యీశ్వరానుగ్రహమువలన నేను సమయోచితములయిన ప్రత్యుత్తరముల చెప్ప నారంభింపఁగా, ప్రజలకు తనమాటలయందు విశ్వాసము చెడునని భావించి యాపండితులు నాయుత్తరములను వినక కడుపునొప్పి యని యొకఁడును కాలునొప్పియని యొకఁడును లేచిపోయిరి. అటు తరువాత పరమతాంత్రికుఁడయిన యాచయనులుగారు నన్నొంటిగా పిలిచి నన్నును నాపూర్వులను స్తోత్రములతో శ్లాఘించి పూనిన కార్యమునుండి మరలింప బ్రయత్నించెను గాని దైవయత్నమువలన ఆపండితసత్తముని కోరిక సఫలము కాక, విధవావివాహవృక్షమును మూలచ్ఛేదము చేయుటకయి దీక్షవహించిన సభల కాలయమయి బ్రాహ్మణశ్రేణిలో శుద్ధశ్రోత్రియుల యిండ్లనడుమనున్న యాగృహమే యిప్పుడు విధవావివాహప్రవర్తకసమాజమువారి యధీనమయి యీ నూతనదంపతుల కాపురమున కాలయమయి యున్నది. నేను మొట్ట మొదట నిచ్చిన యుపన్యాసము ప్రకటింపఁబడఁగానే తెలుఁగుదేశమునందంతటను స్త్రీపునర్వివాహవిషయమైన వాదములే ప్రబలి మండనవాదులు నాపుస్తకము నాధారము చేసికొని శాస్త్రమును యుక్తులను చెప్పఁజూనుటయు, ఖండనవాదులు బహువిధముల పూర్వపక్షములు చేయఁజూనుటయు కొంతకాలము జరిగెను. గుంటూరు నుండి భువనగిరి పరదేశిసోమయాజులుగారును, బందరునుండి శ్రౌతము కోటీశ్వరశాస్త్రిలుగారును, చెన్నపురినుండి కొక్కొండ వేంకటరత్నము

పంతులుగారును, వర్తమాన రత్నాకర విలేఖకులును, కాకినాడనుండి పగిరాల జగన్నాధముగారును, విశాఖపట్టణమునుండి దంతులూరి నారాయణగజపతిరాజుగారును, రాజమహేంద్రవరమున వేదము వేంకటరాయశాస్త్రులుగారును, ఇంకను ననేకులును నా ప్రథమోపన్యాసము మీఁద ఖండన గ్రంథములను వ్రాసిరి. ఈ ఖండన గ్రంథములయందలి ముఖ్యాంశములకును రాజమహేంద్రవరమునందలి పండితులు చెప్పిన యంశములకును ఉత్తరముగా నేను మరల శ్రీవిజయనగరము మహారాజుగారి బాలికాపాఠశాలలో జరిగిన మహాసభలోనే నా ద్వితీయవిజ్ఞాపనము నుపన్యసించి ప్రకటించినాను. ఇదిగాక బహుస్థలములయం దీవిషయమై వ్రాయుచు, వచ్చిన ప్రతివాదుల వాదములకెల్ల నుత్తరములు ప్రకటించుచు వచ్చినాను. తీఱికయున్నప్పుడితరస్థలములకు పోయి యుపన్యాసములు చేయుటకును ప్రయత్నించుచు వచ్చినాను. నేను మొట్టమొదట కాకినాడకుపోయి యుపన్యాసము చేసినప్పు డక్కడి బ్రాహ్మణులు నా మీఁద రాళ్ళువేయుటకును యత్నించినారు. ఈకార్యమునకు విఘాతము కలుగఁజేయుటకయి యెంద ఱెన్నివిధముల ప్రయత్నములు చేసినను, మాది న్యాయపక్షమయినందునను, న్యాయ మెక్కడ నుండునో దేవుఁడక్కడ నుండును గనుకను, దేవుఁ డేవంక నుండునో యావంక జయము కలుగుట సహజమగుటచేతను, నాతోడివారును నేనును సంఖ్యయం దతిదుర్బలులమైనను, విద్యాధికులము కాకపోయినను, మా ప్రయత్నములే కొనసాగుచువచ్చి శత్రువులకృషి యంతయు విఫలము కాసాగెను. ఈవిషయమై తఱుచుగా వాదప్రతివాదములు జరుగుచువచ్చుటచేత విధవావివాహమన్న శబ్ద మారంభదశయందు వలె చెవులకు కటువుగా నుండక కొంతకాలములో జనులకది పరి

చితపద్ధమై పోయినది. అనేకులకు విధవావివాహములు శాస్త్రసమ్మతములనియు, అవశ్యాచరణీయములనియు, అభిప్రాయము కలుగసాగెను. బాలవితంతువుల సంబంధు లనేకులు తమ వితంతుకన్యలకు పునర్వివాహములు చేయ నుద్దేశించుకొన మొదలుపెట్టిరి. ఇంతకు మునుపే శ్రీ పైడా రామకృష్ణయ్యగారు తమ సహజౌదార్యముతో ముప్పదివేలరూపాయలను ఈకార్యమునిమిత్తమయి యిచ్చెదమని వాగ్దానము చేసినారు. ఈ సమయములో స్త్రీపునర్వివాహములయం దత్యంతాభిరతిగల ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు మా పట్టణమునకు ప్రాడ్వివాకుఁడుగా వచ్చుటకూడ దైవవశముచేత సంభవించినది. వివాహములు జరిగెడు పక్షమున తాము భోజనములకు వచ్చెదమని ముప్పదిమందికంటె నధికముగా లౌక్యులైన బ్రాహ్మణులు వాగ్దానములు చేసినారు. వితంతుకన్యలు దొరికినపక్షమున తాము వివాహ మాడెదమని మా శాస్త్రపాఠశాలలోని విద్యార్థు లనేకులు బయలుదేఱినారు. ఈ కార్యములో నాకు విద్యార్థులే ముఖ్యసహాయులుగా నుండి నా కంగరక్షకులుగాకూడ నుండుచు వచ్చినారు. ఇంచుమించుగా రెండుసంవత్సరము లీప్రకారముగా వాదములైన తరువాత కార్యములేని నిరర్థకవాదములతోఁ బ్రయోజనములేదని తెలిసికొని, యేలాగుననైన కొన్నివివాహములు జరపవలెనని నిశ్చయించుకొని, మాలో నయిదుగుర మొక అంతరంగికసమాజముగా చేరి మా ప్రయత్నము లితరులతో ప్రాణమిత్రులతోనైనను జెప్పకుండునట్లు మాలో మేము ప్రమాణములు చేసికొని, రహస్యముగా కార్యాలోచనము చేయుట కారంభించినాము. మనదేశములో సాధారణముగా పేరునకు సమాజము లనేకము లుండుటయేకాని, అందఱును గలిసి యైకమత్యముతో పనిచేయుచుండుట కానము. ఏ పని చేసినను సమాజముపేరు పెట్టి

రొక్కరే చేయుచుండవలెను. ఈ విషయములో శ్రద్ధవహించి పని చేయు సామాజికులుగల సమాజము నేర్పఱుపవలయునని నేను పలుమాఱు ప్రయత్నములు చేయుచు వచ్చితిని గాని, ఆ సమాజములలో నొక్కటియు చిరకాల ముండుటకాని, యైకమత్యముతో పనిచేయుట కాని తటస్థింపలేదు. ఈ రహస్యసమాజములో మాటాడుకొన్న సంగతులుసహిత మేలాగుననో కాని మఱునాటికే ప్రతిపక్షులయొద్దకు పోసాగెను. మే మీ ప్రకారముగా కార్యములు జరుపుటకు కృతనిశ్చయులమయి గూఢముగా పని చేయుచుండుటయు, వివాహములు జరిగెడు పక్షమున భోజనముల కెవ్వరు వచ్చెదరో, తాంబూలముల కెవ్వరు వచ్చెదరో, ప్రతిపక్షము పూనక సహాయులుగా నెవ్వరుందురో తెలిసి కొనుటకై లక్ష్మీనరసింహముగారిలోపల రెండుసభలు చేయుటయు, చూచి స్త్రీపునర్వివాహనిషేధపక్షమువారు భయపడి మా ప్రయత్నములు మాటలతో పోక కార్యములకు వచ్చునని సంచరించి తొందరపడి మా ప్రయత్నములకు విఘ్నములు కలుగఁజేయుటకయి వారును సభలుచేరి యుపాయముల నాలోచింప మొదలుపెట్టిరి. ఒక దినమున పూర్వాచారపరాయణులయిన లౌక్యులును వైదికులును మార్కండేశ్వరుని యాలయములో సభచేరి నన్ను వర్ణమునుండి బహిష్కారము చేయుటకును విధవావివాహముల కేవిధమైన తోడ్పాటు చూపెదమన్నను వారిని బహిష్కరించెదమని భయపెట్టుటకును ముందే నిశ్చయించుకొనవచ్చి, వారిలోని ముఖ్యులైన కొందఱు బ్రాహ్మణులు నన్ను కొట్టవలెననికూడ నుద్దేశించిరి. ఈ సంగతి కొంచెము పట్టణములో తెలియఁగానే సభ యారంభమైన యర గంటలోపల దేవాలయమంతయు పాఠశాలలోఁ జదువుకొను రెండు వందలవిద్యార్థులతో నిండిపోయినది. నా విషయమై దౌర్జన్యము

జరిగింప నెంచిన యా దుష్టులు విద్యార్థులసంఖ్యను జూచి భయపడి తమ కేమి పరాభవము సంభవించునోయని మెల్లగా నావలకు జారిరి. సభవారును మొట్టమొదట నుద్దేశించుకొని వచ్చినపని జరప నేరక తమయిండ్లకు పోవలసినవారైరి. ఆదినము మొదలుకొని పట్టణములో సంక్షోభమును కక్షలును ప్రబలసాగెను.

ఇప్పటికి వితంతువులైన తమకన్యలకు వివాహములు చేసెద మని బయలుదేఱినవా రనేకులేర్పడినను తాము ముందుగా నడు గిడుదు మనువారు మాత్రము కనబడలేదు. ఎల్లవారును ముందొక వివాహ మయినయెడల తాము రెండవవారముగా నుందు మనువారె కాని తామే మొదటివారుగా నుందుమనువారు కానరాలేదు. అట్లుండుట లోకస్వభావమే. ముందుగా నెవ్వరైన ప్రవేశించుట చూచి వారికి కష్టములు వచ్చినచో తాము ప్రవేశింపక తొలఁగుటకును కష్టములు రానిచో తామును ప్రవేశించి సుఖ మనుభవించుటకును జనులెప్పుడును సామాన్యముగా కోరుచుందురు. మాప్రయత్నము లిట్లుండఁగా కృష్ణామండలమునుండి మామిత్రులైన దర్భా బ్రహ్మా నందముగారు తమవైపున నొకగ్రామములో నొక బ్రాహ్మణవితంతు కన్య యున్నదనియు, మనుష్యులను పంపినయెడల వారివెంట తల్లి యాచిన్నదానిని పంపు ప్రయత్నము తాము చేసెదమనియు నాకొక జాబు వ్రాసిరి. ఈవిధముగా మొట్టమొదట వివాహము చేయువారు కూడ తటస్థించినందుకు సంతోషించి యీవిషయమై విశేషశ్రద్ధను వహించి సర్వవిధముల నాకు సహాయులుగా నుండిన లక్ష్మీనర సింహముగారి నడిగి పుచ్చుకొన్న తెలివిగల యిద్దఱు మనుష్యులను తోడిచ్చి, యీకార్యములయం దత్యంతాదరము కలిగి ప్రథమశాస్త్ర పరీక్షయందు కృతార్థుఁడై మాతో మొదటినుండియు పనిచేయు

చూడిన సోమంచి భీమశంకరముగారిని నాజాబుతో బ్రహ్మానందము గారియొద్దకుఁ బంపితిని. ఇటువంటి కార్యములలో పేరు పైకి తెలిసినచో కార్యభంగము కలుగును గనుక, ఆచిన్నది యేగ్రామమునం దున్నదో, తల్లి పేరెవరో యేమియు మేము పంపిన మిత్రునకుసహితము చెప్పక రహస్యముగానే యుంచి బ్రహ్మానందముగారిని చూచిన తరువాత సమస్తమును వారే చేసెదరని మాత్రము చెప్పితిమి. వీరు బయలు దేఱిన రెండుదినముల కెల్లను తాముద్యోగాంతరముమీఁద నూఱు మైళ్ళదూరములో నున్న మఱియొక గ్రామమునకు పోవుచున్నా మనియు కొన్నిమాసములవఱకును మరల వచ్చుటకు వీలుపడదనియు మరల వచ్చినతరువాతనే యీకార్యము విషయమై కృషిచేయవచ్చు ననియు బ్రహ్మానందముగారివద్దనుండి నాకు జాబు వచ్చినది. మా మిత్రుఁడు బయలుదేఱి పోయిన గ్రామము మాపట్టణమునకు నూట యేఁబది మయిళ్ళ దూరములో నున్నది. అక్కడకు పొగబండ్లు లేవు; తంతిసమాచార మందదు. అట్టి స్థితిలో మేమందఱము నాలోచించి వివరముగా జాబువ్రాసి మనుష్యుని పంపుట యుచితమని నిశ్చ యించి, ఆచిన్నది నివసించు గ్రామమును తల్లి యింటిపేరును, పేరును జరపవలసిన కృత్యమును వివరముగా తెలుపుచు మామిత్రునకొక జాబువ్రాసి, దానికి లక్కముద్రలువైచి విశ్వాసపాత్రుఁడయిన మనుష్యుని చేతికిచ్చి పంపితిమి. ఈలోపల మామిత్రుఁడు గమ్యస్థా నముజేరి విచారింపఁగా బ్రహ్మానందముగా రావఱకే గ్రామము విడిచి దూరగ్రామము పోయినట్టు తెలియవచ్చినది. పోవలసిన గ్రామమేదో, తేవలసిన చిన్నదెవరో తెలియదు; తాము వచ్చిన కార్యమునైనను మఱియొకరితో చెప్ప వల్లకాదు; తుదకు తా మెవ్వరోకూడ తెలుపనయినను తెలుప వల్లకాదు; ఈ స్థితియం

దేమియు నాలోచన పాలుపోక బుద్ధిమంతుఁడు గనుక తొందరపడి గ్రామము విడిచి రాక మాయుత్తరము నపేక్షించి మామిత్రుఁడా గ్రామములోనే వేచియుండఁగా, మేము పంపిన మనుష్యుఁడు పోయి కలిసికొని మాజాబు నిచ్చెను. అప్పుడు పోవలసిన గ్రామమునకు వారందఱును బయలుదేఱిరి. ఆచిన్నదాని తల్లిదండ్రులు ధనికులై గొప్ప వంశమునందుఁ బుట్టినవారు; ఈకార్యము తల్లి కొక్కతెకు తప్ప బంధువర్గమున కెవ్వరికిని ఇష్టములేదు; ఆచుట్టుపట్టుల గ్రామము లన్నియు వారి బంధువులతో నిండియున్నవి; ఈసంగతి కొంచెము తెలిసినచో మోటు గ్రామములవా రెంత దౌర్జన్యము జరిగింతురో యెల్లవారు నెఱిఁగియుందురు; ఆప్రక్కల మామిత్రునకు సాయము చేయువా రొక్కరును లేరు. ఇటువంటిస్థితిలో నామిత్రుఁడు చక్కగా నాలోచించి తామెక్కడకుఁ బోవుచున్నారో బండివాండ్రకు సహితము చెప్పక రాత్రి రెండుజాములప్పు డాగ్రామము చేరి ప్రయాసముమీఁద వారియిల్లు తెలిసికొని చిన్నదానితల్లిని లేపి రహస్యముగా తాము వచ్చినసంగతి తెలుపఁగా, ఆమె బ్రహ్మానందముగారు రానిదే తాను పిల్లను పంపనని చెప్పెను. వారారాత్రి యామె నెలాగుననో బతిమాలి యేమేమో చెప్పి యొప్పించి పిల్లదాని నొంటిగా వచ్చునట్లొడఁబఱిచి తెల్లవాఱకమునుపే యాచిన్నదానిని తీసికొని బయలుదేఱి యాదిన మేగ్రామమునను దిగి వంటచేసికొని భోజనము చేయక యటుకులే తిని యుండి, యెవ్వరు వచ్చి పట్టుకొందురో యను జంకుచేత శీఘ్రప్రయాణములుచేసి కొన్నిదినములలో తామాచిన్నదానిని సురక్షితముగా తెచ్చి మాయింటివద్ద చేర్చిరి. అమఱునాఁడే యీసంగతి యూరంతయు పొక్కి యాచిన్నదానిని చూచుటకయి జనులు తీర్థప్రజవలె రాసాగిరి. అందుచేత కొన్నిదినములు మాయిల్లు

తిరుమల వేంకటేశ్వరులవారి యాలయమువలె వచ్చెడివారితోను పోయె
డువారితోను సందడిగా నుండెను. అప్పుడు మేము వరునిగూర్చి విచా
రింపఁజొచ్చితిమి. ఈ ప్రయత్నము మేమారంభించినది మొదలుకొని
తల్లిదండ్రులు భయపడి సమస్తప్రయత్నములును చేసి బ్రహ్మచారు
లయిన విద్యార్థులకు బలవంతపెట్టి వివాహములు చేయ నారంభించిరి.
అందుచేత నావలను వివాహమాడ నిశ్చయించుకొన్న విద్యార్థులలో
కొందఱికి వివాహము లయిపోయినవి. ఉన్నవారిలో కొంద ఱన్యశా
ఖలవార గుటచేత పనికిరాక పోయినారు. మిగిలినవారిలో మంచివారి
నేర్పఱుచుట కాలోచించుచుండఁగా, ఆవఱకు నావద్దనుండి విద్య
నేర్చుకొని సర్వకళాశాలాప్రవేశపరీక్షయందు తేఱి, అప్పుడు విశాఖ
పట్టణములో నిరువదిరూపాయలపనిలో నున్న యిరువదిరెండుసంవత్స
రములప్రాయముగల యొకచిన్నవాని భార్య యాకస్మికముగా పోవుట
తటస్థించెను. అతఁడు వితంతువివాహములు మొదలయిన క్రొత్తమార్పు
లయందాసక్తియు నుత్సాహమును గలవాఁడు. నేనాతనికి జాబు
వ్రాయఁగా తానొకచిన్నదానిని వివాహమాడుట కంగీకరించెను.
అతఁడు చిన్నవాఁడగుటచేతను విద్యగలవాఁడగుటచేతను మంచి
యుద్యోగమునందుండుటచేతను పలువురాతనికి పిల్ల నిచ్చెదమని
తిరుగుచున్నను వారి నందఱిని నిరాకరించి, వితంతువివాహము
చేసికొని బుద్ధిపూర్వకముగా ననేకకష్టములు పొందుటకు సాహసించిన
యాతని ధైర్యమును పరోపకారచింతయు మిక్కిలి శ్లాఘింపఁదగి
యున్నవి. ఆతనికి మఱింత ప్రోత్సాహము కలిగించి దర్భా బ్రహ్మా
నందముగారి తమ్ములయిన వేంకటశాస్త్రిగా రాతనిని వెంటఁబెట్టు
కొని రాజమహేంద్రవరము వచ్చిచేరిరి. అంతవఱకును జనులు పరి
పరివిధముల నూహలు చేయనారంభించిరి. కాని వరుఁడెవ్వరో

యెవ్వరికిని నిశ్చయముగా తెలిసినదికాదు. వరుఁడు గోగులపాటి శ్రీరాములుగారని తెలిసినతోడనే మా పట్టణములోని యాతనిబంధువులు మొదలయినవారు వచ్చి వివాహము చేసికోవలదని హితోపదేశములుచేసి కార్యముగానక మరలిపోవుచువచ్చిరి. వివాహము జరుగునని రూఢిగా తెలిసిన తరువాత మా పట్టణమునందు పుట్టిన సంక్షోభ మింతంతయని చెప్పుటకు శక్యము కాదు. ఆవఱకు నిశ్శబ్దముగనుండిన మా పట్టణమంతయు మహావాయువుచేత సంక్షోభమునొందిన మహాసముద్రమువలె కలఁగ నారంభించినది. ఎక్కడ చూచినను సభలే; ఎక్కడ చూచినను వీధులలో గుంపులుకూడి గుజగుజలాడుచుండుటలే; ఎక్కడ చూచినను కోపవాక్యములే; ఎక్కడ చూచినను బెదిరింపులే; ఈ యాకస్మికసంక్షోభములో తామంతకు మునుపు పేరులేక మూలఁబడియున్న యనామధేయు లనేకులు సుప్రసిద్ధులయినారు; వివాహములలో తోరణములు త్రెంపి పెనఁగులాడి చేతులు విఱిచి సంభావనలు గొను మహాపురుషులు సభాపతులయినారు; ఇచ్ఛకములాడి యింటింటఁదిరిగి బిచ్చమెత్తుకొను తుచ్ఛులు సందడిగాతిరిగి సమాచారములు తెచ్చుట కెంతో పెద్దలయినారు. వీరి యాటోపమును జూచి నా మిత్రులుసహితము కొందఱు నాతో మాటాడుటకే భయపడినారు; స్త్రీపునర్వివాహవిషయమయి తమ ప్రాణములనైన నిచ్చెదమని యితరులకు జాబులు వ్రాసి యాంతిరంగికసమాజములో చేరియున్నవారు సహితము పెండ్లికి వచ్చుమాట యటుండఁగా మావీధిని నడుచుటకే జంకుపడి కార్యస్థానమునకుఁ బోవునప్పుడు చుట్టుతిరిగి మఱియొక మార్గమునఁ బోవువారైరి. మాయింట వంటచేయు పనికత్తెకూడ మమ్మునవఱకే విడిచి పెట్టెను; పురోహితుఁడు మాయింట శుభకర్మలు చేయించుటకయి

రాక మానుకొనెను. బంధువులందఱును నన్ను పలువిధముల నిందిం చుచు జాతిభ్రష్టునివలె చూడసాగిరి. వివాహదినమున మా యింట మాత్రమే కాక మా యింటిచుట్టును వీధిపొడుగునను రక్షకభటులు కావలి కావలసివచ్చినది. ఇటువంటి సంక్షోభములో 1881 వ సంవ త్సరము డిసెంబరు నెల 11 వ తేది రాత్రి రాజమహేంద్రవరమున మొదటి స్త్రీపునర్వివాహము జరిగినది. ఆవివాహమునకు మొదటి నుండియు నాతో నుండి పనిచేసిన మిత్రుఁడు రాలేకపోయినను ధైర్య శాలులును దేశాభిమానులు నయిన నా మిత్రులనేకులు తాంబూల ములకు మాత్రమేకాక భోజనములకు సహితము వచ్చిరి. అట్టి యమూల్య మయిన సాయముచేసి నాకు తోడుపడి పెక్కుకష్టములకు లోనయిన వారియెడల నే నెల్లకాలమును కృతజ్ఞుఁడనయి యుండవలెను. వారి లోను నాకు మొదటనుండియు పరమాప్తుఁడయి, ఒక్క యీ కార్యము నందుమాత్రమేకాక దేశక్షేమము నిమిత్తమయి నేను చేయ తలపె ట్టిన మంచికార్యములలో నెల్లను నాకు కుడిభుజమయి యుండి, పయికి పేరు నాదయినను చాటున నాకంటెను బహుగుణము లధికముగా పనిచేయుచు వచ్చుచున్న బసవరాజు గవర్రాజుగారి సాహసచరిత్రము నిచ్చట ముఖ్యముగా శ్లాఘింపవలసి యున్నది. పదిమంది యొక్క సారిగా లోకాంతరగతులయినప్పుడు పుట్టునంత సంక్షోభము ఈ వివా హదినమున వారియింట పుట్టినది. భార్యవంకవారును తనవంకవారు నయిన బంధువు లనేకు లొక్కసారిగా గొల్లున గోలపెట్టి మధ్యాహ్న సమయమున మృతుని నిమిత్తమయి యేడ్చునట్లేడ్చుచు శపించుచు లేచిపోయిరి. తల్లిదండ్రులు చిన్నతనములో పోయినప్పటినుండియు పెంచి పెద్దవానిని జేసిన పెద్దతల్లి తన్ను విడిచిపోయినను వెనుక తీయక, లోకోపకారము నిమిత్తమయి యెన్నికష్టములు వచ్చినను

సహించుకొని యుండి, భార్య దీర్ఘవ్యాధిచేత బహుమాసములు మంచ మెక్కియుండి బంధువులు రాక బహుబాధలు తటస్థించినను ప్రాయశ్చిత్తమన్న పేరైనను తలపెట్టక, ఈ దినమువఱకును పరోపకారమయిన యీ కార్యమునిమిత్తము వ్యయప్రయాసములను సంతోషపూర్వకముగా వహించుచున్న యీ నామిత్రుని నెట్లు శ్లాఘింపవలయునో నేనెఱుఁగకున్నాను. ఈపక్షమునఁ జేరి వివాహసమయమున భోజనములు చేసినవారందఱును కొంచెముగానో గొప్పగానో యీ విధమయిన శ్రమల కోర్చినవారే. పలువురు విధిలేక ప్రాయశ్చిత్తములు చేయించుకొని మమ్ము విడువవలసినవారయినను వారిమనస్సు లిప్పటికిని మాపక్షముననే యున్నవనుటకు సంశయము లేదు. ఒకరు రాజకార్యముమీఁద గుంటూరు వెళ్ళవలసినవారయి యక్కడ నీళ్ళ బ్రాహ్మణులు దొరకకయు కాపురముంచుట కిల్లు దొరకకయు బహుబాధలు పొంది యిష్టము లేకయే ప్రాయశ్చిత్తమునకు లోను కావలసినవారయిరి; ఆయన భావమఱఁది మఱియొక రారంభదశ యందలి కష్టముల కన్నిఁటికిని తాళి మొన్నటివఱకును మాలోనేయుండి యెదిగి యీడేరి కాపురమునకు సిద్ధముగా నుండిన తనతోఁడఁబుట్టిన పడుచు నత్తవారు తీసికొనిపోవనందున ప్రాయశ్చిత్త మంగీకరింపవలసినవారయిరి; మఱియొకరు పెద్దకుటుంబమగుటచేత తమకొడుకులకును కుమార్తెలకును సంబంధములు దొరకవన్న భీతిచేత ప్రాయశ్చిత్తము చేసికొనిరి. మొట్టమొదట దూరదేశముపోయి కన్యకను తీసికొనివచ్చి యెంతో పనిచేసిన నామిత్రుఁడు సహితము తనమేనమామ కాలము చేసినప్పుడు గత్యంతరము లేక ప్రాయశ్చిత్తమున కొప్పుకొనవలసినవాఁడయ్యెను. కొందఱు తొందరపడి ముందుగా ప్రాయశ్చిత్తములు చేసికొన్నను, ఇటువంటి సమయములో ధైర్యము నిలుపలేక

పోయినందుకు వారిని నిందింపవలసిన పనిలేదు. మొట్టమొదటి రెండు వివాహములకు రెండుమూడువేల రూపాయలను గవ్వలవలె వ్యయము చేసి, వివాహము లాడిన దంపతులు కాపురము లుండుటకయి గృహములను కట్టించి యిచ్చి, తరువాత స్త్రీపునర్వివాహముల నిమిత్తమయి పదివేలరూపాయ లొక్కసారి రొక్కముగా నిచ్చి, తమవ్యవహారము నందించుమించుగా లక్షరూపాయలు నష్టము వచ్చినను, వచ్చిన నష్టమునకు కారణ మీకార్యములలో ప్రవేశించుటయే యని పామరులు ఘోషించుచున్నను లేశమును వెరుకతీయక, నేటివఱకు వివాహములు చేసికొన్నవారికిని వివాహములతో సంబంధించియున్నవారికిని సర్వవిధముల సాహాయ్యము చేయుచున్న శ్రీ పైడా రామకృష్ణయ్యగారి యంతటి ధైర్యౌదార్యశాలి సహిత మాసంక్షోభములో మనస్థైర్యమును నిలుపలేక ప్రాయశ్చిత్తము చేసికొనవలసి వచ్చినప్పుడు, బయల మిత్రులును బంధుజనులును కులమువారును బహువిధముల దూషించి బెదరించుచుండఁగా, ఇంట భార్యలును తల్లులును బహువిధముల విలపించుచు మనస్సు కలంచుచుండఁగా, మతగురువులు బహిష్కార పత్రికలు పంపి భీతి గొలుపుచుండఁగా, సామాన్యజనులు ధైర్యము నిలుపఁగలుగుదురా? ఈ సంగతి యటుండనిచ్చి వివాహచరిత్రము నించుక చిత్తగింపుఁడు.

వివాహవ్యయముల నిమిత్తమయి రామకృష్ణయ్యగా రావఱకే మావద్దకు వేయిరూపాయలను పంపియుండిరి. మా పురములోని ప్రముఖు లనేకులు వివాహమునకు చాకలివాండ్రను వాద్యగాండ్రను కూడ రాకుండఁ జేయుటకయి బహువిధముల ప్రయాసపడిరి. పెండ్లిలో మేళములకు వచ్చిన వేశ్యలనుగూడ వెలివేసి వారియొద్ద నుండి కొంతసొమ్ము తీసికొనిరి. ఇటువంటి బాధలచేత మేమెక్కువ

ధనమిచ్చి పట్టణములో వాద్యములు వాయించు మంగలివాండ్ర నెల్లను పెండ్లిలో కుదుర్చవలసివచ్చినది. వీరినందఱిని వెలివేసిన పక్షమున తలలు గొఱుగువారు లేకయు శుభకార్యములయందు వాద్యములు వాయించువారు లేకయు మాకంటె తామే యెక్కువ కష్టపడవలసి వచ్చును గనుక మా ప్రతిపక్షులు బుద్ధిమంతులయి యట్టిప్రయత్న మును మానుకొనవలసినవా రయినారు. అప్పు డావఱకు పనిలేక సోమరులుగా తిరుగు బ్రాహ్మణవేషధారుల కందఱకును పుష్కలముగా చేతులనిండ కావలసినంతపని దొరికినది. కొందఱు మేము కుదుర్చు కొన్న వంటబ్రాహ్మణులయొద్దకు పోయి వాండ్రను బెదిరించియు లంచము లిచ్చియు, రాకుండఁ జేయుచువచ్చిరి; కొందఱు వివాహ తంత్రము నడుప నిర్ణయించుకొన్న పురోహితుని పట్టుకొని దూషించి భయపెట్టి మొగము చాటువేయించుచు వచ్చిరి; కొందఱు వీధుల మూలలను మాయింటి యెదుటను గూరుచుండి మాయింటికి వచ్చు వారిని మాత్రమేకాక మావీధి పట్టుకొనిపోవువారిని సహితము బహి ష్కారపత్రికలను తెప్పించుటకయి పేరులు వ్రాసికొన మొదలుపెట్టిరి. ఇటువంటి దుష్ప్రయత్నములలో విద్యావిహీనులయి వైదికవృత్తియం దున్న పూర్వాచారావలంబకులు మాత్రమేకాక యింగ్లీషునందు పాండి త్యము కలిగి పట్టపరీక్షయందును ప్రథమశాస్త్రపరీక్షయందును కృతార్థులయి మావద్ద విధవావివాహముల కనుకూలముగా మాటా డుచు స్త్రీపునర్వివాహమును తామంగీకరించినట్లు చేవ్రాలు చేసిన మహానుభావులుకూడ కొందఱుకూడి తామే ప్రధాననాయకులయి, తాము చదువుకొన్న విద్యకును పొందిన స్థితికినికూడ నగౌరవము తెచ్చి నందున కెంతయు చింతిల్లవలసియున్నది. పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రము తొడిగిన ట్లింతమంది యనాథకాంతలమీఁద ధ్వజమెత్తినను, ఈశ్వ

రుఁడు వారిపట్ల నుంచుటచేత మాయూరి పెద్దమనుష్యుల యభిమత మీఁదఁ జేసినది కాదు. నూఱేసిరూపాయ లిప్పిచ్చియు, నెల కేడేసి రూపాయలచొప్పున జీతమిచ్చి సంవత్సరమువఱకు పని చేయించు కొనుట కొడంబడికలు వ్రాసియిచ్చియు వివాహదినములలో దినము నకు నాలుగేసి రూపాయల చొప్పున నియ్యనొప్పుకొనియు, మేము నలుగురు వంటబ్రాహ్మణులను నీళ్లబ్రాహ్మణులను సంపాదించుకొనఁ గలిగినారము. ఎంతమంది పురోహితులను బెదరుపెట్టి సాగనంపినను, కట్టకడపట ధైర్యముచేసి వారిమాట వినక వచ్చిన పురోహితుని భార్యను గోదావరిలోఁ బడుటకయి పరుగెత్తించి మరలించినను, నూఱురూపాయ లిచ్చి మా వివాహమునకొక యాజకుని సంపాదింపఁ గలిగినారము. ఇట్లు ప్రథమవివాహము నిర్విఘ్నముగా జరుగుటయు, అనేకులు భోజనములకును, తాంబూలములకును, దక్షిణలకును వచ్చు టయు, వాయువేగ మనోవేగములతో మా మండల మంతయు వ్యాపింపఁగా తమ వితంతుబాలికలకు వివాహముచేయఁ దలఁచు కొన్నవా రనేకులు మా పట్టణమునకు రాసాగిరి. అందుచేత మొదటి వివాహమయిన నాలవదినముననే రెండవవివాహముకూడ జరిగినది. పెండ్లికొమార్తె తల్లి తన వితంతుకుమారికను తెచ్చి భర్త తన్నంపె నను నమ్మకముపుట్ట చెప్పెను. మేమామాటలు విశ్వసించి సకలకళా శాలాప్రవేశపరీక్షనిమిత్తమయి భోజనముచేసి పరీక్షాస్థలమునకుఁ బోవుచున్న యొకవిద్యార్థిని తక్షణము రప్పించి వివాహము సిద్ధము చేసితిమి. పెండ్లికొమారుఁడు మంగళస్నానమునకు కూరుచుండు వఱకును మా పురజనులీ వివాహము జరుగుచున్న సంగతియే యెవ్వరు నెఱుఁగరు. ప్రతిపక్షులచారు లతఁడు మంగళస్నానమునకు కూరు చుండఁగా చూచి పరుగెతుకొనిపోయి పిడుగువంటి యీవార్త నతని

తండ్రితోఁ జెప్పిరి. అతఁడును రోదనముచేయుచు పెద్దపెట్టున కేకలు వేయుచు వివాహసమయమునకు పరుగెత్తుకొనివచ్చి పెండ్లికొమారుని తీసికొనిపోవుటకయి ప్రయత్నించెను. కాని మాలో కొందఱాయనను కౌఁగిటఁబట్టుకొని యొకగదిలోనికి లాగుకొనిపోయి కూరుచుండఁ బెట్టి శతమానము ముడిపడువఱకును మంచిమాటలు చెప్పి యోదార్చుచు, అవలను మెల్లఁగా పంపివేసిరి. ఆమఱునాఁటి రాత్రి యీ యిద్దఱు దంపతులను మహావైభవముతో పెండ్లిపల్లకులలో నూరేగించిరి. ఆ రాత్రి జరిగిన వైభవము సంస్థానాధిపతుల వివాహములయందుకూడ జరిగియుండదు. అఱువదిమంది పోలీసుభటులతో పోలీసు సూపరింటెండెంటు పల్లకులను జనుల యొత్తుడునుండి సంరక్షించుచు పురవీధులలో వెంటనడిచెను. వేలకొలఁదిజను లావేడుకను చూడవచ్చుటచేత వీధు లొకకొననుండి రెండవకొన వఱకును మనుష్యులతో నిండిపోయి యీ వీధివా రావీధికి నడుచుట దుర్లభమాయెను. చిరకాల దురాచారవాసనచేతను ద్వేషప్రధానులయిన కొందఱి ఛాందసులవలని భీతిచేతను పల్లకులు వీధులగుండ పోవునప్పుడు కొందఱు తలుపులు మూసికొన్నను, ఆ వధూవరులను జూచిన సామాన్యజనులు మాత్ర మెక్కడ జూచినను సంతోషించి యాకార్యములను శ్లాఘించుచునే వచ్చిరి.

రెండవపెండ్లికొమారును తండ్రి యనుమతి లేకయే తల్లి తీసికొని వచ్చినదని ప్రతిపక్షులు విని, అతనిచేత మామీఁద దండవిధాయకునివద్ద నేరము మోపించి యభియోగము తెప్పించి మమ్ము శిక్షింపచేయువలెనని ప్రయత్నము చేసిరి కాని యీ సంగతిని యుక్తసమయములో తెలిసికొని మెలఁకువపడి ముందుగా మేమే పెండ్లికొమారైతల్లిని పినతల్లిని పంపి యామెభర్తను మాయొద్దకు రప్పించుకొని సభల కెక్కకుండ తప్పించుకొంటిమి. ఈ వివాహమయిన మఱు

నాఁటినుండియు జనులవలని బాధ లంతకంతకు ప్రబలసాగినవి. ఈ వివాహములను చేయించినవారిని చేసికొన్నవారిని భోజనములకు పోయిన వారిని మాత్రమేకాక చూడఁబోయినవారిని సహితము పలువిధముల బాధలు పెట్ట నారంభించిరి; ఈ శుభకార్యములయందు కొంచెము సంబంధమున్నవారి నందఱిని వారు కాపురమున్న యద్దెయిండ్లలో నుండి లేవఁగొట్టిరి; కాపురముండుట కెవ్వరు నిండ్ల నియ్యకుండిరి; నూతులలో నీళ్ళు తోడుకోనియ్యకపోయిరి; నీళ్ళు తెచ్చు బ్రాహ్మణులను త్రేకుంటఁ జేసిరి; శుభాశుభకార్యములకు పురోహితులను బ్రాహ్మణులను రాకుండఁ జేసిరి; దేవాలయములకు పోనియ్యకపోయిరి; బంధువులు మొదలయిన వారిని పోకుండఁ జేసిరి; కనఁబడినచోట్ల మొగము ముందఱనే దూషింపసాగిరి; మఱియు నింక నెన్నివిధముల వారాయాస పెట్టఁగలుగుదురో యన్నివిధములను శ్రమ కలుగఁజేయ సాగిరి. అంతేకాక తాము బాధించి యెదురు తమ్మే బాధించుచున్నారని యల్లరిచేసి దొంగయభియోగములు చేయసాగిరి. అల్లరిమూక మాట యటుండఁగా మండలన్యాయసభలో న్యాయవాదిగానున్న యొకబ్రాహ్మణోత్తముఁడే యొకదినమున బొట్టు నోకివేసికొని భోజనము చేయునట్లు నటించుచు తనవెంట కొంత బ్రాహ్మణులమూకను జేర్చుకొని యొకవిజ్ఞాపనపత్రికతో దండవిధాయకునియొద్దకు పోయి వితంతువివాహవిధాయకపక్షమువారి నాయకులు దేవాలయములు దూరి తమ కనేకవిధముల తొందరలు కలుగఁజేయు చున్నారని యేడ్చుచు మొఱ్ఱపెట్టుకొనునంతటి నైచ్యమునకు లోఁబడెను. ఈ పక్షములో చేరినవారు రాజకీయోద్యోగములలో నున్నయెడల వారి మీఁద లేనిపోని దోషముల నారోపించి వారిని పనినుండి తొలఁగింపవలయుననియు మఱియొకచోటికి మార్చవలయుననియు పయి యధి

కారుల కాకాశిరామన్న విన్నపములను పంప మొదలుపెట్టిరి. పాఠశాలలో నుపాధ్యాయులుగా నున్న యొకల వారి నాకొలువులనుండి తొలఁగింపవలయునని విశ్వప్రయత్నములు చేసిరి. ఈ ప్రకారముగా నుపాధ్యాయపదమునుండి ప్రతిపక్షులు తొలఁగింప పాటుపడిన వారిలో నొకరు తల్లిసంద్రులను తోడఁబుట్టినవారిని విడిచి మాతో చేరి భోజనము చేయుటయేకాక గతసంవత్సరమున వితంతువును వివాహము కూడ చేసికొనెను. ఈ బాధ లిటుండఁగా కొన్నిదినములలో ముప్పదిమందికి శ్రీశంకరాచార్యస్వాములవారియొద్దనుండి బహిష్కారపత్రికలుకూడ వచ్చినవి. ఆ పత్రికలను జూచి పరమానందభరితులయి శ్రీ విజయనగరము మహారాజుగారి బాలికాపాఠశాలలో సభచేసి, ఆవల కిచ్చకములాడుచు చిత్తము చిత్తమని యనుగ్రహమును వేచి తిరుగు నవామధేయులుకూడ తమకంటె నెక్కువవారి పేరులను గౌరవ సూచకమయిన 'గారు' ను మాటయైన చేర్పకుండ నుచ్చరించి లాఘవపఱిచి మహాజనమధ్యమున వారిని వెలివేసితి మనియు, శుభాశుభ కార్యములయందు వారియిండ్ల కెవ్వరును పోఁగూడదనియు, వారిని పిలువకూడదనియు, వారిని దేవాలయములకు పోనియ్యకూడదనియు కేకలువేయుచు బల్లమీఁద నెక్కి గంతులు వేసిరి. ఇటువంటి దుస్సహములయిన బాధలకు తాళఁజాలక పలువురు ప్రాయశ్చిత్తములు చేసికొనిరి. ఈ యవమానమునకు సహింపలేక, ఆత్మూరి లక్ష్మీనృసింహముగారు శ్రీశంకరాచార్యస్వాములవారిమీఁద తెచ్చిన యభియోగము కొట్టుపడిపోవుటచేతకూడ ప్రతిపక్షులు మా పక్షము వారిని మఱింత లోకువచేసి గేలిచేయసాగిరి. ఏ వంకఁ జూచినను కష్టములును వ్యసనములును చుట్టుకొనియుండి యంధకారబంధురములయి యా దినములు స్త్రీపునర్వివాహవిధాయకపక్షమువారికి దుర్దిన

ములుగా నుండెను. అవఱకు వితంతువివాహములు చేసెదమని ముందుకు వచ్చినవా రాపేరునైనను తలపెట్టక పిలిచినను పలుకక పలాయితులయిరి. ప్రతిపక్షులు తమకు సంపూర్ణజయము కలిగిన దనియు విధవావివాహపక్షము మరల నెప్పటిని తల యెత్తలేకుండ స్థిరముగా చెడిపడనియు పరమానందహృదయులయి మిన్నంది యుండిరి. మాలోని మహాధైర్యవంతులు సహిత మింక వివాహములు కావని యధైర్యపడి నిరుత్సాహులయిరి. ఇటువంటి చెడుదినముల యందు సహితము మమ్ము చేయివిడువక రహస్యముగా మాకు బహు విధముల తోడుపడినవారు సహితము కొందఱుండకపోలేదు. వారిలో న్యాపతి సుబ్బారావుపంతులుగారు మాకారంభదశనుండియు నాలోచన చెప్పుచు సర్వవిధముల సాయముచేసినారు. మాకు పాఠశాలలోని విద్యార్థులనేకులు పెట్టనికోటగా నుండి చేతనయిన విధముల తోడుపడినారు; కొందఱెక్కడకు పొమ్మన్నను పోయి చేయుమన్న పనిని రెండవవారెఱుఁగకుండ చేయుచువచ్చిరి. విద్యార్థులకు మా యందున్న యభిమానమునకొక్క చిన్ననిదర్శనము చెప్పెదను. లక్ష్మినరసింహముగారు తెచ్చిన యభియోగము పోయినతరువాత శ్రీశంకరాచార్యులవారును వారిని పురస్కరించుకొనియున్నవారును మహోచ్ఛ్రాయదశయందుండి విజయగర్వముచేత మిన్నును మన్నును గానకుండిరి. ఆ యభియోగము పోయిన మఱునాఁడు శ్రీశంకరాచార్యస్వాములవారిని మహావైభవముతో రాజమహేంద్రవరమున వీధులలో నూరేగించుటయే కాక, ఆ వార్త తంత్రీముఖమున కాకినాడకు పంపఁగా నచ్చటివా రా లేఖను పల్లకిలో పెట్టి యూరేగించి గొప్ప యుత్సవముచేసి గొప్ప యాడంబరముతో పోయి కయిదా రామకృష్ణయ్యవారి యంతటి ధనికునిని చెల్లుబడిగలిగినవానిని సహితము

లక్ష్యముచేయక, ఆయన గుమ్మమువద్ద చప్పటలుగొట్టి కేకలు వేసి చేయఁగలిగినంత యల్లరి చేసిరి. ఇటువంటి సంతోషదినములలో స్వాములవారు రాజమహేంద్రవరమును విడువక మా పక్షమువారికి మఱింత యవమానము కలుగుటకయి ప్రతిదినమును వాద్యములతో వీధులగుండ నూరేగుచు భిక్షలు చేయుచు కొన్నిమాసములక్కడనే నిలిచియుండిరి. ఆ కాలములో స్వాములవారు విధవావివాహముల నెంత నిషేధించుచు వచ్చినను ఘోటకబ్రహ్మచారులయిన వారి శిష్యులుమాత్రము రండలతోడ రాత్రులమంత్రకము లయిన వివాహములను రహస్యముగా జరపుచునే వచ్చిరి. పాఠశాలలోని విద్యార్థులు కొందఱీసంగతిని కనిపెట్టి యొకనాఁటిరాత్రి వేచియుండి యొక బ్రాహ్మణవిధవతో సంసారముచేయుచున్న బ్రహ్మచారి శిష్యుని పట్టుకొని, ఆ యపూర్వదంపతులను వీధిలోని కీడ్చుకొని వచ్చి యెల్లవారికిని చూపి యవమానపఱిచిరి. అందుచేత స్వాములవారి శిష్యుల కందఱికిని పాఠశాలలోని విద్యార్థులమీఁద ద్వేషము పుట్టి, వారిబాలురమీఁద నేలాగుననైన పగతీర్చుకోవలెనని నిశ్చయము చేసికొని యుండిరి. ఇట్లుండఁగా వారికి సమయమును వెంటనే దొరకినది. రెండుదినము లయిన తరువాత పగలు పండ్రెండుగంటలవేళ స్వాములవారి శిష్యులు గోదావరిలో స్నానము చేయుచుండఁగా, పాఠశాల విడిచినపిమ్మట విద్యార్థులిద్దఱక్కడకు స్నానమునకు పోయిరి. వారిని చూచి యా స్వాములవారి శిష్యులు పాఠశాలలం జదువుకొను విద్యార్థుల నందఱిని కలిపితిట్టఁగా ఎవరు తప్పిదముచేసిరో వారిని తిట్టవలయును కాని మొత్తముమీఁద తిట్టుట న్యాయము కాదని యొక విద్యార్థి నుందలించినందున వాక్కలహము ముదిరి పిండివంటలు నిత్యమును తిని బలిసియున్న యాశిష్యు లాచిన్నవానిని పట్టుకొని

నిష్కరుణులయి క్రూరముగా కొట్టిరి. అప్పుడక్కడ నున్న రెండవ విద్యార్థి పాఱిపోయి యీ సమాచారమును పట్టణములో చెప్పఁగా, పాఠశాలలోని విద్యార్థు లనేకులు కూడుకొని తమ తోడిబాలకుని క్రూరముగా కొట్టినందునకై యీ దుండగపుశిష్యులను దండింపవలయు నని ప్రతిజ్ఞచేసికొని గుంపులుకూడి కోపముతో స్వాములవారున్న గృహముముందు వీధిలో తిరుగసాగిరి. విద్యార్థుల యాగ్రహమును జూచి భయపడి యీ శిష్యులు వీధిలోనికి రాక యింటిలో నడఁగి యుండుటయేకాక యిద్దఱురక్షకభటులను సహాయులుగా తెచ్చుకొని గుమ్మములో కావలి యుంచుకొనిరి. విద్యార్థు లాప్రకారముగా రాత్రి జాముపఱకును తిరిగి స్వాములవారి శిష్యు లిల్లు వెడలివచ్చు జాడ కానక విసిగి నాఁటి కిండ్లకు పోయిరి. శిష్యు లటుతరువాత సహి తము వీధిమొగముచూచుటకు సాహసింపలేక తమకు కావలసిన వస్తువులను గోడచాటుననుండి పొరుగువారిని బతిమాలుకొని తెప్పించుకొని, దాహశాంతికయి మంచినీరు కావలసిరాఁగా రాత్రి రెండుజాములవేళ వందఱును కఱ్ఱలుపట్టుకొని గుంపులుగా బయలుదేఱి యారక్షకభటులను వెంటనుంచుకొని గోదావరికిపోయి నీరు తెచ్చుకొనిరి. మఱునాఁటి యుదయమున యథాప్రకారముగా విద్యార్థులు పాఠశాలకు పోయిరి. ఆ మధ్యాహ్నము విద్యార్థులు సందడి యంతగా వీధులలో కానరాక పోయినందున కొంతధైర్యము తెచ్చుకొని యీ శిష్యులును వీధిత్రొక్క సాహసించి యయిదాఱుగురొకకూటముగా చేరి బహిర్భూమికి పోవు నిమిత్తమయి రెండుమూడుగడియల ప్రొద్దుండఁగా గోదావరియొడ్డున నున్న యిసుకతిప్పకేసి నడిచిరి. ఈ సంగతి యేలాగుననో యొకవిద్యార్థి కనిపెట్టి తక్కినవారికి సమాచారము పంపెను. ఆ శిష్యులును బాహ్యభూమికిపోయి మరలివచ్చుచు గోదావరియొడ్డుననున్న ధాన్యపుపాక

లను సమీపించునప్పటికి, వారియెదుట దండధరులవలె కొందఱు విద్యార్థులు కనఁబడిరి. వారు కంటపడఁగానే గుండెలు పగిలిపోయి బెదరి ముందుకు నడువ కాళ్ళురాక బెదరిబెదరిచూచుచు నలుప్రక్క లను చూపు నిగిడింపఁగా నానాముఖముల విద్యార్థులు గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి. ఆ సంఖ్యను చూడఁగానే శిష్యులకు మును పున్న ధైర్యముకూడ మూలముట్టుగ పోయి యెదిరించుటకయి ప్రయత్న మైనను చేయక పిక్కబలము చూపి పాఱిపోవుటకు కాళ్ళకు బుద్ధి చెప్పిరి. విద్యార్థులు ముందు వచ్చువారిని పట్టుకొని పాదరక్ష ప్రయోగములచేత బుద్ధిచెప్పి దాసుల మనిపించుకొని యా శిష్యులను విడిచిపెట్టిరి. ముందు పరుగెత్తినవారి యవస్థను జూచి వెనుకటివారు తాము వారి దారి పట్టక ప్రాణరక్షణార్థమయి గోదావరిలో దిగి కంఠము లోతువఱకును పాఱిపోయిరి. విద్యార్థులు కొందఱు వారిని వెంబడించి పట్టుకొని నీటిలో ముంచి లేవనెత్తి కొన్నినిమిషములు వారి తలలను మద్దెలలనుగాఁజేసి వినోదించి తమ తోడివిద్యార్థి నన్యా యముగాకొట్టిన ఋణమును వడ్డీతోకూడ తీర్చుకొనిరి. మొట్టమొదట దెబ్బలుతిని తప్పించుకొనిపోయిన యిద్దఱు శిష్యులును వాయువేగ మున పరుగెత్తి స్వాములవారి సన్నిధానము చేరి కన్నీటితో పాద ములు కడుగుచు పురాణవిద్యాశాలలోని బాలురవలన జగద్గురువు యొక్క శిష్యులకు సంప్రాప్తమయిన కష్టపాటును విన్నవించుకొని, అక్కడనున్న రక్షకభటులతోడ కొన్నినిమిషములలో మరల యుద్ధ భూమి చేరిరి. రక్షకభటు లాశూరులతో రణరంగమును చేరునప్పటి కక్కడ రెండువందల విద్యార్థులకంటె నధికముగా చేరి యుండిరి. నీటిలోనున్న విద్యార్థు లారక్షకభటులను జూచి శిష్యులను విడిచిపెట్టి తాము నీటిలో మునిఁగి యీఁది మఱియొక రేవున తేలి యింటికి

పోయిరి. చేతిలోని పాత్రలను నీటిలో పోఁగొట్టుకొని యపాత్రులయిన యా శిష్యులను వెంటఁబెట్టుకొనిపోయి రక్షకభటులు వారి స్వాముల వారితోఁ జేర్చిరి. స్వాములవారు శిఖాయజ్ఞోపవీతములను విసర్జించి నను రాగద్వేషాదులనుమాత్రము విసర్జింపనందున శిష్యులకు సంభవించిన దుర్దశనిమిత్తమె కొంతసేపు విలపించి యావిద్యార్థులను శపించి యూరిలోనివారు తమ్ము వచ్చి ప్రార్థించి యలుకతీర్చెదరేమో యని పీఠమును విడిచి లేచిపోయెదనని వారికిని వీరికిని సమాచారములు పంపెను. ఆ రాత్రి పట్టణములో బడిపిల్లలు స్వాములవారి శిష్యులను కొట్టి చంపిరనియె ప్రవాదము పుట్టెను. అందుచేత విధవావివాహములకు ప్రతిపక్షులుగా నున్నవారు వీథులలో మొగము చూపుటకే తెగింపలేకపోయిరి. ప్రథమశాస్త్రపరీక్షనిచ్చి న్యాయవాదిగా నుండి స్త్రీపునర్వివాహనిషేధవాదులకు నాయకుఁడుగా నుండిన యొక ప్రబలగృహస్థు సాయమున చల్లగాలి నిమిత్తమె గోదావరి యొడ్డున కూరుచుండి యుండి యాశిష్యులవార్త చెవినిసోఁకఁగానే యధైర్యము పుట్టి తనసేవకుని చేతిదీపము నారిపించి తలనిండ ముసుఁగు వేసికొని రాజమార్గమున నడవక ప్రాణములరచేతిలో పెట్టుకొని సంకులగుండ పోయి యిల్లుచేరి తిరిగిచూచెను. అటువంటి స్థితిలో స్వాములవారికి ముఖ్యబలముగా నున్నవారొక్కరును వారి నూరార్పుటకయి యా రాత్రి పీఠదర్శనమునకురాక, తత్క్షణ మయూరు విడిచి పొమ్మని లోకగురువుల కాలోచన చెప్పిరి. విద్యార్థులు తమ విద్యాశాల నుండి రాకమునుపే స్వాములవారు మఱునాఁటియుదయమున పీఠమును మా పట్టణమునుండి తరలించి పొగయోడకు కట్టిన పడవలలో శిష్యబృందముతో తాము నదిని తరించి భిక్షలు చేయింపలేక శ్రమపడుచున్న మా పురమువారినికూడ తరింపఁజేసిరి. మొదట దెబ్బలుపడిన

విద్యార్థి స్వాములవారి శిష్యులమీఁదను, స్వాములవారి శిష్యులు విద్యార్థులమీఁదను ధర్మసభలలో నభియోగములు తెచ్చిరి; కాని దండవిధాయకుఁడు జగద్గురునిశిష్యుల కై దేసిరూపాయలు ధనదండనము విధించి ఋజువు లేనందున విద్యార్థులను విడిచిపెట్టెను.

ఇది యిట్లుండఁగా నేత్రపర్వముఁజూచినను కష్టములే కనఁబడుచు, మరల వితంతువివాహము లగునన్న యాశ కవకాశము లేక, పూనిన కార్యము అకాలనాశనము నొందిన ట్లగపడుచున్న యాకాలములో నేలాగుననైనను కొన్ని కార్యములు చేసి యిటువంటి సత్కార్యము మనుష్యకుటిలప్రయత్నమువలన నిర్మూలము కానేరదని లోకమునకు చూపవలెనని మా పక్షమువారు మఱింత ధైర్యోత్సాహములతో బహుప్రయాసముల కోర్చి పనిచేయసాగిరి; కాని మొట్టమొదట మా కృషి సఫలమగునట్లు కనఁబడలేదు. ఆవఱకు తమ వితంతు కన్యలకు వివాహముచేయుఁడని మమ్ము బ్రతిమాలుకొన్న వారికడకు పోయి మేమే బతిమాలుకోఁగా మాతో మనసిచ్చి మాటాడక పోవుటయే కాక మామీఁద కోపమును సహితము పడి, అట్టియనుచిత ప్రసంగమును చేసినందుకు మమ్ము తిట్టసాగిరి. మఱికొందఱు మమ్ము తమయొద్దకే రానీయక పోయిరి. వివాహములనిమిత్తమయి మమ్ము ప్రార్థించిన వారొక్క బాలవితంతువుల సంరక్షకులు మాత్రమే కాక విద్యావతులైన బాలవితంతువులుకూడ మాకు పలువురు జాబులు వ్రాసి యుండిరి. ఇఁక వారితో నుత్తరప్రత్యుత్తరములు జరపి కార్యసాఫల్యము చేయవలెనని మేము ప్రయత్నింపఁగా, మా జాబులా యనాథకాంతలను చేరుటయే యసాధ్యమాయెను. ఈ సమయములో మాకు పాఠశాలలోని విద్యార్థులు చేసిన సాయ మెప్పటికిని మఱువఁదగినది కాదు. మా విద్యార్థులలో కొందఱు లోకోపకార

కార్యార్థమై యగ్నిహోత్రములో దూఁకుమన్నను దూఁకుటకు వెనుక తీయనివారుండిరి. ఆ కాలములో నిరువదిరూపాయల యుద్యోగము లోనుండి ప్రవేశపరీక్షం దేఱి బంధుజనమును విడిచి మాలోఁ జేరి యున్న యొకరు గల్లగొండ కోదండరామయ్యగారు. నేనీ చెన్నపురము రావలెనని బయలుదేఱినప్పుడు నాకు సహాయుఁడయి వంటచేసి పెట్టుటకు సహితము పూనుకొని నేను సముద్రములోని పొగయోడను చేరుటకయి పడవ నెక్కఁబోవునప్పుడు ఝంఝామారుతము ప్రబలముగా వీచుచు నంతతధారగా వర్షము కురియుచు సముద్రతరంగములు పర్వతోపమానములుగా నుండుటచేత మిత్రులు బహువిధముల పోవలదన్నను మానక నావెంట సంతోషపూర్వకముగా చిన్నపడవలో సముద్రమునం దయిదుమైళ్ళు ప్రయాణముచేసి యా భయంకరస్థితిలో ధూమనౌకాధికారి యపాయకరమని యెంచి మమ్మెక్కించుకొనక నిరాకరించుటవలననే వ్యసనముతో వెనుకకు మరలినసంగతి మీరు విన్నయెడల విద్యార్థు లెంతటి ధైర్యోత్సాహములును విశ్వాసమును కార్యనిర్వాహణాసక్తియు లోకోపకారచింతయు కలవారయియుండిరో మీరే తెలిసికోవచ్చును. వారే యర్ధరాత్రమున నెంతదూరమున నున్న యే గ్రామమునకుఁ బోయి యెవ్వరితో మాటాడి యేకార్యమును చేసికొనిరమ్మన్నను మాఱు మాటచెప్పక చెప్పినట్లు చేసికొని వచ్చుచుండిరి. ఇటువంటి తోడ్పాటు చేతనే మే మనేకకార్యములు నిర్వహింపఁ గలిగితిమి.

ఈ కాలములో మా పట్టణమునకు నాలుగామడలదూరములో నున్న పెద్దాపురములో చదువుకొన్న యొక మాధ్వబాలవితంతు వుండెను. ఈ చిన్నదానిని వివాహమాడుటకు కాకినాడలో నొకయుపాధ్యాయుఁ డొప్పుకొనెను. తల్లిదండ్రులావలఱు వివాహము చేయుట

నుద్దేశించి యుండినను, అప్పుడు పుట్టిన సంక్షోభమునకు జడిసి మే మెన్నివిధములచేత చెప్పినను వినక పోయిరి. చిన్నది పదియాఱునంవత్సరములు దాఁటినదగుటచేతను, ఆ చిన్నదానికే తనయభిమతమును తెలిపియుండుటచేతను, ఆ చిన్నదానితోనే స్వతంత్రముగా నుత్తర ప్రత్యుత్తరములను జరపుట యుక్తమని తలఁచితిమి. కాని తల్లిదండ్రులును బంధువులును విరోధులుగా నుండుటచేతను, వారిసంగతి నావలెనే యెఱిఁగినవారగుటచేత భద్రముగా కాచుచుండుటచేతను, మాకాపని యొకపట్టున సాధ్యమయినదికాదు. అయినను స్త్రీపునర్వివాహపక్షమునం దత్యంతాభిమానము కలిగి ఆ కాలమునందు పెద్దాపురములో నుండతటస్థించిన యొకమిత్రుని సాహాయ్యముచేత మేము చిన్నదానియింట పనిచేసెడి యొకకట్టెవానిగుండ నుత్తరప్రత్యుత్తరములను జరపనారంభించితిమి. వయస్సులో నున్నవారికి నిరంతర వైధవ్యదుఃఖమునకంటె మరణమే శ్రేష్ఠముగా నగుపడును గనుక, తానేలాగునన్నైన దుస్సహబాధనుండి బయలపడి సుఖింపఁగోరి యా చిన్నదే తన్నుఁ గొనిపోవుటకుఁగల వివిధమార్గములను మా కుపదేశించినది. ఆమె చెప్పిన యుపాయము ననుసరించి తగినంతమందిని పల్లకి మోచువారిని నియమించి, ఆ పల్లకితో మామిత్రుని నొకనిని కొందఱుభటులను సాయమిచ్చి పంపి సంకేతస్థలమున రాత్రివేళ ఆ చిన్నదానిని కలిసికొని యామెను పల్లకిలో నెక్కించుకొని తెల్లవారు నప్పటికి రాజమహేంద్రవరము తీసికొనివచ్చి విడుచునట్లు తగిన యేర్పాటు లన్నియు చేసితిమి. కాని యా సంగతి యేలాగుననో కొంచెము పొక్కి ఆ చిన్నదాని బంధువులకు ముందుగా తెలియఁగా వారు జాగరూకులయి యుండుటచేతను, అక్కడకుపోయిన మా మనుష్యుల తెలివితక్కువచేతను, ఆ యేర్పాటు లేమియు నిష్ఫలములగు

వ్యయప్రయాసములకు లోనయి మావారు పోయిన దారినే వట్టిచేతులతో మరల రావలసినవారయినారు. అటుమీఁదట మేము చేసిన ప్రయత్నమును చిన్నదానిపేరును సమస్తజనులకును వెల్లడియయి పోయినవి. ఎల్లవారును ఈ వివాహమునకు విఘ్నము కలుగఁజేయుటకయి చేయవలసిన ప్రయత్నముల నన్నిటిని జేసిరి. అయినను మా యుత్తరప్రత్యుత్తరములసంగతి మాత్ర మెవ్వరికిని తెలియక మిక్కిలి రహస్యముగానే యుండినది. అందుచేత మేము మఱియొక యుపాయము నాలోచించి మా వద్దన మెవ్వరికిని భేద్యము కాకుండునట్లు గోప్యముగా నిర్వహించి పరమనిపుణుఁడును మాకు పరమవిశ్వాసియు నయిన యొకమనుష్యుని పెద్దాపురమునకుఁ బంపితిని. అతఁ డెవ్వరికి ననుమానము కలుగకుండ మార్గస్థునివలె నటించి రాత్రి వారివీధి యరుగుమీఁదనే పరుండి తనసందేశము నా చిన్నదానికి తెలిపి నేర్పుతో పనిచేసెను. అమావాస్యనాఁడు రాత్రి రెండుజాముల వేళ మబ్బుపట్టి చినుకులు పడుచుండఁగా తనతండ్రికి తలనొప్పి వచ్చుటచేత నుపచారములు చేయుచున్న తల్లి మొదలయినవారి నేమఱించి లఘుశంకకు పోవుమిషమీఁద వీధిలోనికి వచ్చి యాచిన్నది మా మనుష్యునితో తాను వచ్చుటకు సిద్ధముగా నున్నసంగతి తెలిపెను. అతఁడు వెంటనే యాచిన్నదానిని వెంటఁగొని బయలుదేఱి యా చిన్నదానికావఱకు తీసికొనిపోయిన బట్టలుకట్టి పురుషవేషము వేసి, పగలు చూచుకొనివచ్చిన మాఱుమూలలదారిని గాఢాంధకారములో, వానలో తడియుచు పరుగెత్తి కొంతదూర మాచిన్నదానిని నడిపించియు కొంత దూర మెత్తుకొని మోచియు తెల్లవాఱునప్పటికి రెండామడలు నడచి, అక్కడ బండిచేసికొని మఱునాఁడు రెండుజాముల వేళ నామెను మా యింటికిఁ జేర్చెను. ఆచిన్నది యిల్లు దాఁటిన నాలుగైదు నిమిషముల

కొల్లను తల్లి మొదలయినవారామె పోయిన సంగతిని కనిపెట్టి చుట్టుపట్ల వెదక నారంభించిరి. ఆమె యింకనుమిత్తమే పోయినదని వారు గ్రహించి బంధువులతోడను పొరుగువారితోడను చేరి నానాముఖముల పరుగెత్తి యన్ని దారులను వెదకి యెక్కడను కానకపోయిరి. అంతట వారందఱు నాలోచించుకొని పగలెత్తుకొని పాఱిపోయినట్లా చిన్నదానిమీఁద పోలీసువారివద్ద ఫిర్యాదుచేసి యామెను పట్టుకొనుటకయి యారాత్రియే వారంటు పుట్టించుటయేకాక, ఆ చిన్నదానిని దొంగిలించితిమని మామీఁద నేరమును మోపి దండవిధాయకునివద్ద నొకయభియోగమును దెచ్చిరి. మఱునాఁడీసమాచారము నాకు తెలియఁగానే వారంటు తప్పించుటకయి పోలీసు సూపరింటెండెంటుగారింటికి పోఁగా, ఆయన కాకినాడకు పోయినట్టు తెలిసినది. అప్పు డింటికివచ్చి పోలీసినిస్పెక్టరును నేను మరల వచ్చుపర్యంతమును వారంటుమీఁద చిన్నదానిని పట్టుకొనకుండునట్లు ప్రార్థించి వెంటనే బయలుదేఱి పడవమీఁద మఱునాఁటి మధ్యాహ్నమునకు కాకినాడచేరి యక్కడ విచారింపఁగా పోలీసు సూపరింటెండెంటు పెనుగుదురను గ్రామమునకు పోవునట్లు తెలియవచ్చినది. అప్పుడు వ్యసనము మఱింత యధికమయి భోజనము లేని విచారమును మఱచి పెనుగుదురు పోవుటకయి ప్రయత్నించుచుండఁగా పోలీసు సూపరింటెండెంటప్పుడే మరలవచ్చి కాలువలో పడవమీఁద నున్నట్టును మఱికొంతసేపటిలో చామర్లకోటకు పోవునట్టును వర్తమానము తెలిసినందున, ఆయెండలో పరుగెత్తి సాయంకాలము నాలుగుగంటలవేళ కాలువమీఁదిపడవలో ఆదొరగారిని సందర్శించి సంగతి విన్నవించుకొనఁగా నతఁడాచిన్నదానిని పట్టుకొనకుండ పోలీసుఉద్యోగస్థుల కుత్తరువు పంపెద నని చెప్పి నన్ను పంపివేసెను. ఇఁక పెండ్లికొమారుని తీసి

కొనిపోవలసినపని మఱియొకటి యున్నది. అందుచేత నే నక్కడినుండి తిన్నఁగా హిందూపాఠశాలకుపోయి యక్కడ నుపాధ్యాయుఁడుగా నున్న యాతనిని కలిసికొని రమ్మని పిలువఁగా, అతఁడీ యభియోగము వలనను జనులవలని భీతివలనను కొంతజడిసి నావెంట రాకుండుటకయి కొన్నిసాకులు చెప్ప మొదలుపెట్టెను. కాని, నేనన్నిటికిని తగిన పరిహారములు చెప్పి యక్కడనుండియే తిన్నఁగా నే నాతనిని బలవంతముగా పడవవద్దకు తీసికొనిపోయి నా గదిలో కూరుచుండఁబెట్టుకొనఁగా, అతఁడు నన్ననేకవిధముల ప్రార్థించియు నేను పూనిక విడువనందున నామాట తీసివేయలేక నాతోవచ్చి మఱునాఁడు తెల్లవాఱిన తరువాత బట్టలన్నియు నా గదిలో యుంచి లఘుశంకకు పోయి వచ్చెదనని నాతో చెప్పి పడవదిగి వెనుకకు పాఱిపోయెను. నేను మాత్రము నాఁడు మధ్యాహ్నము రెండుగంటలకు రాజమహేంద్రవరముచేరి ముందుగా తంతివృత్తాంతకార్యస్థానమునకు పోయి పెండ్లికొమారుని చర్యను కాకినాడలోని నా మిత్రులకు తంత్రీముఖమున తెలిపి యింటికి పోయి మూఁడవనాఁడు మధ్యాహ్నము మూఁడుగంటలకు భోజనము చేసితిని. తరువాత కాకినాడకు మనుష్యులను బంపి పెండ్లి జరగకుండ చేయుటకై వివిధమాయోపాయములను పన్నుచున్న విరోధుల ప్రయత్నముల కన్నిటికిని ప్రతిక్రియలుచేసి ఇదే సమయమని పెండ్లికొమారుని బాధింప నెంచిన ఋణప్రదాతలనుండి యాతనిని విముక్తుని జేసి తుదకాతనిని రాజమహేంద్రవరమునకు మఱల రప్పించితిమి. పెండ్లికొమారుని ఋణవిముక్తుని చేయుటకై యప్పుడిచ్చిన రెండువందలరూపాయలును తప్ప పెండ్లికొమాళ్ళ కెవ్వరికి నిందు నిమిత్తమయి చిల్లిగవ్వయైనను లంచ మియ్యలేదు. వితంతువులను వివాహమాడిన పాఠశాలలోని విద్యార్థులందఱును లోకోపకారా

ర్థము పరిశుద్ధచింతతోనే వివాహములు చేసికొనిరి కాని యెంతమాత్ర యును ధనాశచేత కాదు. అటుతరువాత పెండ్లికొమార్తె యొక్క తల్లి మొదలగు బంధువులు మా యింటికివచ్చి యేడ్చియు కేకలు వేసియు బెదరించియు బుద్ధులుచెప్పియు బ్రతిమాలియు వాగ్దానములు చేసియు, పెండ్లికొమార్తెను మరల తీసికొనిపోవుటకై నానావిధముల పాటు పడిరి. కాని వారిప్రయత్నములన్నియు విఫలములై నందున వారు నిరాశులై వెనుక మరలవలసినవారయిరి. అటుపిమ్మట పెండ్లికొమారుని యొక్క యన్నగారును రాజమహేంద్రవరమువచ్చి మంచిమాటలుచేత నాతనిని తీసికొనిపోవలెనని యెన్నో యుపాయములు చేసెను. గాని యాతని యుపాయములును సఫలములైనవి కావు. అటుతరువాత వివాహమగువఱకును పెండ్లికొమారుఁడు మరల పాఱిపోకుండ కంటికి రెప్పవలె నొకరు విడిచి యొకరము కాచి, ౧౮౮౨ వ సంవత్సరము అక్టోబరునెలలో బహుకష్టముమీఁద మూఁడవ వివాహమును నిర్వహింపఁగలిగితిమి. ఈ వివాహమునకు మాకు మొదటివివాహమునకంటెను పదిరెట్లు ప్రయాసమెక్కువయ్యెను. మొదటివలెనే యిప్పుడును రక్షకభటులు పహాయిల్లుకావలికాయవలసివచ్చెను. ఈవివాహమునకు విశేషవ్యయముచేసి మొదటికంటె నధికవైభవముతో జరపితిమి. ఇంత ధనవ్యయము చేసినను, ఇంతమంది రక్షకభటులు కావలి కాచినను ఉత్సవసమయమునందు దుష్టులు కొందఱు పెండ్లిపల్లకిమీఁద రాళ్ళు విసరిరి. ఆవల విమర్శమీఁద ప్రతిపక్షులు లావఱలో తెచ్చిన యభియోగము లన్నియు కొట్టుపడిపోయినవి. ఈ వివాహముతోనే ప్రతిపక్షుల గర్వము సగమడఁగినది గాని తరువాత జరిగిన నాలవ వివాహముతో పూర్ణముగా గర్వభంగమైనది. ఈ వఱకు జరగిన వివాహములు మూఁడును లౌక్యులుగా నుండు నియోగిబ్రాహ్మణుల

లోను మాధ్వబ్రాహ్మణులలోను జరగినవి; వైదికులలో మాత్ర మా వఱకు జరగలేనందున వారది గొప్పప్రతిష్ఠగా చెప్పకొనుచు తమ వారిలో నట్టివివాహము జరుగుట యసాధ్యమని దంభములు పలుకుచువచ్చిరి. కాకినాడలో ను తమవైదికకుటుంబమునందు పుట్టి చనువుకొన్న యొకబాలవితంతు వుండెను. ఇట్లు వివాహములు జరుగుచుండుట విని యీయామె మనస్సులో తానుగూడ వివాహమాడుట కెంతో యభిలాషపడుచుండెను. ఆయింటియెదుటనే కాపురమున్న యొక పెద్దమనుష్యుఁ డీసంగతి కనిపెట్టి, అతఁ డీకార్యములయందు విశేషాభిమానము కలవాఁడగుటచేత మెల్లగా ఆ చిన్నదానితో మాటాడి మాకా సంగతి తెలియఁబఱచెను. మేమును తగినప్రయత్నములను చేయుచుంటిమి. ఇట్లుండఁగా నొకనాటిరాత్రి పదిగంటలవేళ నొక యూరేగింపుమహోత్సవము జరగుచుండఁగా దానిని చూచుటకయి యా చిన్నది వెలుపలికి వచ్చి నా మిత్రునిజూచి తన్నిప్పుడు రాజమహేంద్రవరము పంపఁగలరా యని యడిగెను. అతఁడంగీకారము చేసెదనని చెప్పి యా నిముషమునందే మూఁడవవితంతువివాహము చేసికొన్న మా మిత్రునితోఁ గలిసికొని పల్లకిని సిద్ధముచేయించి యా రాత్రివేళనే రాజమహేంద్రవరమునకు పంపిరి. తెల్లవాఱునప్పటి కాకస్మికముగా పల్లకివచ్చి మా గుమ్మములో దిగఁగా, మే మా చిన్నదానిని లోపలికి తీసికొనిపోయి భద్రముగా నుంచితిమి. ఆ చిన్నదాని యన్నగారును మేనమామలును బంధువులును లౌకికోద్యోగములయందుండి ప్రబలులుగా నున్నవారు; పినతండ్రులు మొదలైనవారు కొందఱు యజ్ఞాదిక్రతువులుచేసి పండితు లనిపించుకొనుచున్న శిష్టసంప్రదాయములోనివారుగా నున్నవారు. ఆమె మేనమామ లా రాత్రియే రాజమహేంద్రవరముననున్న బంధువులకును పోలీసువారికిని

తంత్రీవార్తలు పంపుటయేకాక మఱునాఁడు పడవమీఁద బయలు దేఱి తామే రాజమహేంద్రవరమునకు వచ్చిరి. వారువచ్చి చిన్నదానిని తమవెంట రమ్మని బహువిధముల బ్రతిమాలుకొనిరి. కాని చిన్నది వారి కోరిక చెల్లింప నంగీకరింపనందున మంచివరుని జూచి వివాహము చేయుమని యామెను నాకొప్పగించి తమయూరికి పోయిరి. ఆ చిన్న దానికి వివాహము చేయు నుద్దేశించి యామె యన్నగారావఱకు నాతో ననేకపర్యాయములు మాటాడి జాబులు వ్రాసినవాఁడే యయినను, బహిష్కారపత్రికలు మొదలైనవి వచ్చిన తరువాత వెనుకతీసి తాను కార్యము చేయుటకు సాహసింపలేకపోయెను. ఈ చిన్నదానిని వివాహ మాడిన యాతఁడును శుద్ధశ్రోత్రియవంశమునందు పుట్టి వైదికవృత్తి యందున్న యన్నలను తండ్రిని కలిగియున్నవాఁడు. దేశాభిమానము కలిగి యిట్టి జనక్షేమకరములైన కార్యములయం దుత్సాహము కలిగి సర్వవిధముల నాకు సహాయములుగా నుండిన విద్యార్థులలో నితఁ డొకఁడు. ఇతఁడు (పులవర్తి శేషయ్యగారు) సర్వకళాశాలాప్రవేశ పరీక్షాసిద్ధుఁడయి యిప్పుడు మండలన్యాయసభయం దుద్యోగములో నున్నవాఁడు. ఇటీవల నేనీతని నొకవితంతుకన్యను తీసికొనివచ్చుట కయి పంపినప్పుడు వారివస్తువులను మోసికొని వచ్చుటకయి కూలి వాఁడు దొరకకపోఁగా, లేశమయినను వెనుకతీయక యభిమానమును విడిచి కార్యసాధనమే ముఖ్యప్రయోజనముగా నెంచుకొని తానే కావడిని కొన్నిక్రోసులు మోచుకొనివచ్చి కార్యమును నిర్వహించిన వాఁడు. ఇతఁడొకపర్యాయము తండ్రి తనకు వివాహముచేయ సిద్ధ పడినప్పుడు వితంతువివాహమునిమిత్తమే తానా వివాహమును నిరాకరించిన ధైర్యశాలి. ఇతఁడును, నాతో చెన్నపురికి ప్రయాణ మయి తరువాత పదవవితంతువివాహమాడిన యాతఁడును, మొట్ట

మొదట స్వజాతివితంతువులు దొరకకపోవుటచేత నింతకాలము నిలిచి యున్నవారేకాని దొరకినయెడల వీరే వితంతువివాహమునకు ప్రథములుగా నుండవలసినవారు. ఈ నాలవవివాహ మయినపిమ్మట ప్రతిపక్షులు తమ ప్రయత్నములవలన కార్యములేదని తెలిసికొని నిరుత్సాహులయి ప్రత్యక్షముగా బాధించుటకును కార్యవిఘాతము చేయ పాటుపడుటకును మానుకొని యుపేక్షాపరులు కాసాగినారు. మేము విశేషప్రయత్నము చేసినదీ నాలుగువివాహముల వఱకేకాని తరువాత దంపతులు తమంతట తామే రా మొదలుపెట్టినారు. ఇప్పటికి మా సమాజముయొక్క యాదరణముక్రింద పంద్రెండు స్త్రీపునర్వివాహములు జరగినవి. వైశ్యు లిట్టికార్యములకు సాహసించుట పరమాద్భుతమే యయినను, ఈ జరగిన వివాహములలో రెండు వైశ్యస్త్రీపునర్వివాహములుకూడా నున్నవని తెలుపఁగలిగినందులకు నా కెంతో సంతోషముగానున్నది. ఈ వివాహములైన వారందఱు నించుమించుగా సుఖులయియే యున్నారు. కొందఱి కీవఱకే సంతానము కలిగినది; మఱి కొందఱికి కలుగనున్నది. బహుప్రయాసముతో నాటిన సత్కార్యబీజ మీప్రకారముగా మొలకెత్తి పుష్పించి ఫలించి దినదినాభివృద్ధి చెందుచుండఁగా చూచుట యీ వృక్షమును నాటినవారి కెంతసంతోషకరముగా నుండును! మధ్య వేయికష్టములు వచ్చినను కార్యసాఫల్యమయినతరువాత పొందినప్రయాసమేదియు గణనకురాదు. పదిమంది చేరినతరువాత కొన్ని మనస్తాపములును చిక్కులును గలుగక మానవు. గాని చేసినమహాకార్యమును తలఁచుకొనఁగా; అవి యెంతమాత్రమును గణనకు తేఁదగినవిగా నుండవు. కొందఱు ధనాశాపరులుగా నుండి పలుమఱు మామీఁద తొందరలు కలుగఁజేయవచ్చును; కొంద ఱవివేకము చేతను కొందఱు దుస్స్వభావముచేతను తగవు లాడవచ్చును. ఆరంభ

ములో మాకింకను బహువిధములయిన చిక్కులు తటస్థించినవి. మమ్ము కొందఱు మోసముచేసి సొమ్మపహరించినవారును ఉన్నారు. మొదటి రెండువివాహములు నయినతరువాత బహువిధమనస్తాపములు సంభవించిన కాలములోనే వివాహితయైన రెండవవితంతుకన్యయొక్క తండ్రి లోకాంతరగతుండగుట తటస్థించెను. అప్పుడు వాహకు లెవ్వరును దొరకకపోయినను మాలో మేమే శవమును స్మశాన వాటికకు తీసికొనిపోయి దహనసంస్కారము జరిగించి, పుస్తకము చూచి చదివి యపరక్రియలను నేనే జరగింపవలసినవాఁడ నయినాను. వంటబ్రాహ్మణులు మొదలయినవారు బెదరించి లేచిపోవుచు రాఁగా, అటుతరువాత జరగిన యయిదవవివాహమునకు నా భార్యయే గోదావరి నుండి నీళ్ళు మోచుకొనివచ్చి వంట మొదలయిన పనులెల్లను నిర్వహింపవలసిన దాయెను. ఇట్టికష్టములను నివారించుటకై మేము సాధ్యమయినంత ప్రయత్నముచేసి ఆఱవవివాహమును వంటలు మొదలైనవి చేయఁగలిగిన బ్రాహ్మణునకే చేసి వంటబ్రాహ్మణులవలని బెదరింపులను తప్పించుకొనఁ గలిగితిమి. ఏడవవివాహమే మొదటికోమటి వివాహము. మూఁడవదైన మాధ్వవివాహము జరగినప్పుడు పల్లకి చుట్టును రక్షకభటులు కావలియున్నను రాళ్ళురువ్వినకాలము పోయి, ఏడవదయిన యీ కోమటివివాహము జరగినప్పటికి రక్షకభటుల సాహాయ్య మక్కఱలేకయే దంపతులను రాత్రివేళ వీధులగుండ నిర్భయముగా నూరేగింపఁగలిగిన కాలము వచ్చినది. ఎనిమిదవవివాహము నేను దంపతుల నిక్కడకు తీసికొని వచ్చుటచేత ఈ పట్టణమునందే జరిగినది. తొమ్మిదవవివాహమే రెండవ కోమటివివాహము. పదవ వివాహము రాజమహేంద్రవరములో జరపిన బ్రాహ్మణవివాహము. తరువాతి రెండువివాహములును కొన్నిమాసములక్రిందట బళ్ళారిలో

జరుపఁబడినవి. మా సమాజమువారే తాము ధనవ్యయముచేసి యీ చెన్నపురియందును బళ్ళారియందునుకూడ వివాహములు చేయించుటనుబట్టి చూడఁగా, ఒక్క మాపట్టణమునందేగాని మా మండలమునందేకాని తెలుఁగుదేశమునందు మాత్రమే కాని వివాహములు చేయించుట మా సమాజోద్దేశము కాదనియు ధనమున్నయెడల నీ చెన్నపురి రాజధాని క్రిందిదేశములలో నెక్కడ జరగినను వివాహములకు తోడుపడుటయే మా యుద్దేశమనియు మీకు తేటపడి యుండవచ్చును. మేము మాప్రాంతముల జరగిన వివాహములలో నొక్కరికిని లంచమియ్యలేదని యీవఱకే చెప్పియున్నాను. మూడవ వివాహమునకు పెండ్లికొమారుని ఋణవిముక్తునిగాఁ జేయుటకయి యిచ్చిన రెండు వందలరూపాయిలును గాక మఱిరెండువందలరూపాయలిచ్చి అప్పులవారమ్ముకొనిపోవ సిద్ధముగా నున్న యొకపొలమును విడిపించి యిక్కడ వివాహమయిన యొనిమిదవదంపతుల కియ్యవలసి వచ్చినది. మేము రొక్కముగా నిచ్చిన సొమ్మింతే. తక్కినది వివాహవ్యయములక్రిందను, పెండ్లికూఁతుల కిచ్చిన రెండేసివందలరూపాయల యాభరణముల క్రిందను, దక్షిణలక్రిందను, బట్టలు మొదలయిన వానిక్రిందను, ఈ నూతనదంపతులు కాపురముండుటకై కొన్న యిండ్లక్రిందను వ్యయపడిపోయినది. వివాహములనిమిత్తమై దంపతుల నిక్కడకు తీసికొని వచ్చినప్పుడొక్క ప్రయాణవ్యయములకే మూడు నాలుగువందల రూపాయలైనవి. ఇవిగాక ప్రతిమాసమును పురోహితునియొక్కయు వంటబ్రాహ్మణులయొక్కయు జీవితములకును పాఠశాలలం జదువుకొను వివాహితుల భరణమునకును వృత్తాదులకును కొంతవ్యయము చేయవలసి యున్నది; ఈ వ్యయములన్నియు శ్రీ పైడా రామకృష్ణయ్యగారు మహౌదార్యముతో మా సమాజమునకు దయచేసిన పదివేల

రూపాయలతోనే జరుపఁబడినవి. ఈయన సాహాయ్యమే లేకయుండిన యెడల మేమిందులో నొక్కవివాహమునైనను జేయుటకు సమర్థుల మయియుండము. కాఁబట్టి యీవివాహముల కంతకును మూలాధార మీ మహాపురుషుఁడేయని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈయన కీమధ్య లక్షయేఁబది వేలరూపాయలు నష్టము వచ్చినను, ఇప్పటికిని బహువిధముల నీమహాకార్యములకు తోడుపడుచునే యున్నాఁడు. ఈ పదివేలరూపాయలును గాక మొదటి రెండువివాహములకు నయిన సమస్తవ్యయములను వహించుటయేకాక, ఈయనయే కొన్నిగృహ ములను సహితము పునర్వివాహదంపతులు కాపురముండుటకయి సమాజమువారి వశమున నుంచియున్నాఁడు. పరోపకారశీలుఁడయిన యీ దయాశాలియొక్క యీ యోగ్యదానమును నేను వర్ణింపవలసిన పనిలేదు. ఈ యిచ్చినధనము పోయినను, తనువులు పోయినను, మఱి యేమి పోయినను, ఈయన కీర్తి యీభూమండలములో స్థిరముగా నుండకపోదు. నావంటివారు కొందఱు పనిముట్లవలె కొంత యుప యోగపడినను, ఈ కార్యవ్యాపనమున కీతనుఁడే ముఖ్యకారణుఁడు. మన హిందూదేశమునందలి ధనికులలో నిటువంటి పరోపకారచింత గల దానశీలురు మఱిపదిమంది యున్నయెడల నీభరతఖండ మత్యల్ప కాలములోనే తొల్లింటి మహోన్నతదశకు వచ్చి బాగుపడుననుటకు సందేహము లేదు. ఇటువంటి లోకోపకారధురీణు లనేకులు శీఘ్ర కాలములోనే మనదేశమున కలంకారభూతులుగా జనించి యీ భరత ఖండముయొక్క పురోభివృద్ధికి తోడుపడుదురుగాక !

దేశాభివృద్ధికి హేతుభూతమయి లోకోపకారకమయిన యీ కార్యమునకు తోడుపడి, దుస్సహావైధవ్యదుఃఖములపాలయి గతి కానక బాధపడుచున్న యనాథయువతులను సాధ్యమయినంతవఱకు

దుఃఖసముద్రములోనుండి రక్షించుటయే దేశాభిమాన లేశము గల పుణ్యపురుషుల కందఱికిని మహాకర్తవ్యకృత్యమన్న సంగతి మీవంటి వివేకులకు నేనిప్పుడు చెప్పవలసిన యావశ్యకము లేదు. అందఱును శ్రీ పైడా రామకృష్ణయ్యగారివలె వేలకొలఁది రూప్యముల నిచ్చుటకు శక్తులు కారు; బంధువులు మొదలయిన వారిని త్యజించి కులజనులకు విరోధులయి లోకోపకారార్థమయి యిట్టి కార్యములలో ప్రవేశించి పనిచేయుటకును నెల్లవారును శక్తులు కారు. అయినను తమశక్తి మున్నయెడల తోఁచిన ధనప్రదానముచేసి బొత్తిగా సహాయ్యపడలేని వారుమాత్ర మొక్కరును ఉండరు. ఇప్పుడు కార్యముల నిమిత్తమనేకులు క్రొత్తవారు వచ్చుచున్నారు; రెండుమూడు కార్యము లీవఱకే సిద్ధముగా నున్నవి. కేవల ధనలోపముచేతనే వాని నిప్పుడు నిర్వహించుటకు మేము శక్తులము కాక యున్నాము. ఇంతేకాక యీవఱకు వివాహములు చేసికొన్నవారికిని కొన్నివిధముల సాహాయ్యములు కావలసియున్నవి. మీవంటి విద్యాధికులు తెలిసివా రింతమంది దేశమందంతటను నిండియుండఁగా ధనాభావమువలన కార్యములు కాకున్నవన్న నిందమాత్రము రాదని దృఢముగా నమ్మి యున్నాను; నా విశ్వాస మెంతవఱకు సత్యమో ముందు చూడవలసియున్నది. ఈ దేశాభిమానులందఱు నొక్కొక్క రూపాయచొప్పున నిచ్చినను మొత్తముమీఁద వేలకొలఁది రూపాయలు పోగుపడవచ్చును. సంఘమున కెంతశక్తి యైన నున్నదికదా? శక్తికొలఁదిని మీవంటివారీవిషయమున తోఁచినంత ధనసహాయ్యమును చేసినయెడల, అందువలన నెవ్వరికిని నష్టము కలుగదు గాని యనేక బాలవితంతువులను దుర్భరసంతతవైధవ్యబాధలనుండి తొలఁగించి కాపాడి లోకమునకు మహోపకారము చేయవచ్చును. ఎవ్వరికిని భారముగా నుండని యీ

యుత్తమకార్యమునకు మీరు తోడుపడెదు పక్షమున, ఇంతవఱకును కాయకష్టపడి శ్రీ పైడా రామకృష్ణయ్యగారి ధనముతో చేసిన పనినే నేటినుండి మీ ధనముతో చేసి చేతనయినంత కృషి చేసి మీ ధనము సార్థకపడునట్లు సాధ్యమయినన్ని వివాహములను జేయింపఁ బ్రయత్నించెదను. ధనసాహాయ్యమును శరీరప్రయాసమును లేని వాగ్రూపకమయిన దేశాభిమానముతో లేశమును ప్రయోజనము లేదు. కార్యములు లేని మాటలుచేత నీవఱకే మన దేశము మిక్కిలి చెడియున్నది. ఇఁకముందట్టి చెఱుపు మఱేమియు కలుగకుండునుగాక! నేనిప్పుడు మీవంటివారివద్ద చేసెడు ప్రార్థన వృథా పోదను నమ్మకముతో, మీకు తోఁచినంత ధనసహాయ్యమును నెలచందాలను దయచేసి కార్యనిర్వాహణ భారమును మీరు వహింతురని మఱిమఱి వేఁడుచున్నాను. దైవము మీమనస్సులయందు చొచ్చి, దిక్కు లేని లెక్క లేని యనాథయువతులను రక్షింప సహాయపడిన పుణ్యము మీకు దక్కుంచునుగాక!

# స్త్రీపునర్వివాహవిషయ కోపన్యాసము



By

## K. VEERESA LINGAM

66

# స్త్రీపునర్వివాహ విషయకోపన్యాసము

అస్మద్దేశీయులారా :

ఈదినమున నేనుపన్యసింపఁబూనిన విషయము మీకు వినుటకును నాకు చెప్పుటకునుగూడ నెంతమాత్రమును సహ్యము కానిదే. ఈవిషయము వినుటకు మీ కెంతభారముగా నుండునో చెప్పుటకు నాకును నంత భారముగానే యుండును. కాని యీపని మన కెంత సంతాపకర మయిన దయినను మనప్రయత్నమువలన నరంతమైన మానుషసంతాపము కొంతవఱకైనను తొలఁగవచ్చునన్న యాశ కనఁబడుచున్నంతవఱకును మన మీవిషయమున కొంచెమయినను విముఖులము కాఁగూడదు. మన మీలోకములో జన్మమెత్తినది న్యాయపక్షము నవలంబించి కొంచెముగానో గొప్పగానో యన్యాయముతో ప్రతిదినమును పోరాడుచు సాధ్యమైనంతవఱకు న్యాయమును సేవించి సుఖాభివృద్ధి చేయుటకొఱకే. అన్యాయ మెంతకాలమునుండి నిరంతరాయముగా సాగుచున్నను, ఒకానొకప్పుడది యెంతప్రబలముగా కనఁబడినను, ప్రముఖులెంతమంది దానిని చేపట్టియున్నను, న్యాయమునకంటె నన్యాయమున కెక్కుడువశక్తి వచ్చునని మాత్రము మీరు స్వప్నావస్థయందును నమ్మఁబోకుఁడు. న్యాయస్వరూపుఁడైన సృష్టికర్తయే యొకఁడుండి యతఁడే యీలోకవృత్తమును నడిపించుచు పరిపాలించుచున్నంతవఱకు భూమిమీఁద న్యాయమున కట్టిదుర్గతి యెన్నఁటికిని బట్టనేరదు. లోకములో నన్యాయమెప్పుడు ప్రబలి యున్నతస్థితిని పొంది దుస్సహమగునో యప్పుడే మానవకోటియందు దానిని నిర్మూలింపవలెనన్న బుద్ధి యుదయించి తదనుకూలమైన

యుత్సాహమును రోషమును సాహసమును ధైర్యమును పూనికయు పుట్టి దాని వినాశమున కెంతో సులభముగా దారి యేర్పడును. అన్యాయము ప్రత్యక్షముగా తలయెత్తి న్యాయము నశింపఁగ ద్రొక్కుటకై సిద్ధపడినప్పు డన్యాయముమీఁద ధ్వజమెత్తి దానిని మాపు మాపుటకై ప్రయత్నింపనివారు కేవల వివేకశూన్యులు తప్ప మఱి యెవ్వరుందురు? అధర్మముతో పోరాడి విజయమునొంది న్యాయమును ప్రతిష్ఠాపించుటకై కత్తులు, కఱ్ఱలు, ధనము, బలము మొదలయిన దుస్సాధ్యములగు దుర్బలసాధనము లేవియు నక్కఱ లేదు; సత్యము, కారుణ్యము, ఉత్సాహము, సాహసము మొదలయిన సర్వజన సాధ్యములగు నమోఘసాధనములచేతనే యెంతపనినైనను చేయవచ్చును. కాఁబట్టి ప్రపంచములో ధర్మబలముతో సమానమైనబలము మఱియొకటి యేదియు లేదు. దేహబలము లేకపోయినను మనుష్యబలము లేకపోయినను, సాధనబలము లేకపోయినను, మఱి యేబలము లేకపోయినను, ధర్మబల మొక్కటి మాత్ర ముండెనా యెంతటి యసాధ్యకార్యములనైనను దుర్బలులు సహిత మొక్కనిమిషములో సాధ్యములను జేసికోవచ్చును; అదియొక్కటి లేకపోయెనా ప్రబలులు సహిత మెంతకాలమో కృషిచేసియు నొక్క యల్పకార్యమును సాధింపలేకపోవుదురు. ధర్మబలమున్నవానికే దైవబలమును మనోబలమును సమస్తబలములును కలుగును. కాఁబట్టి యెల్లవారును ముందుగా సమస్తమునకును ధర్మబలమునే సహాయపఱుచుకొనుటకై ప్రయత్నింపవలయును. ధర్మబలము శోషపడినయెడల మనహృదయములనుండి వెలువడుమాటలే మహామంత్రములై విరోధులనైనను వశ్యులనుగాఁ జేయును; మనయాలోచనయందే యప్పు డద్భుతమైన సమ్మోహనశక్తి పుట్టును. కాఁబట్టి ప్రత్యేకముగా మాటలువిని తలం

పులునుకూడ వ్యర్థములు కావని యెఱిఁగి మన మొకవేళ వేఱువిధముగా తోడుపడలేకపోయినను వాఙ్మనఃక్రియలచేతనైనను మంచిపని కెప్పుడును తోడుపడుచుండవలయును. లోకాపాయకరములైన యాచారములవిషయమై యాలోచించి ప్రసంగించుటవలనను కొంత యక్రమ మడఁగి ధర్మము వర్థిల్లి లోకోపకారము కలుగుటకు శీఘ్రముగా మార్గమేర్పడవచ్చును. గనుక నేనిప్పుడు చెప్పఁదలఁచుకొన్న వాక్యములను శ్రద్ధవహించి విని విన్నదానిని సావకాశముగా నాలోచించి యాలోచించినదాని నితరులతో చర్చించుటచేతనైనను మీరందఱును సత్కార్యవ్యాపనమునకు తోడుపడుదురని దృఢముగా నమ్ముచున్నాను.

భగవంతుఁడు దయాధర్మస్వరూపుఁడనియు, ఆతని సృష్టిలోని సమస్తప్రాణులును స్వభావముచే నెప్పుడును సుఖముతో యనుభవించుచుండునవియు అందుచేత సామాన్యముగా నెల్లజంతువులును సుఖమనుభవింపవలయుననియే భగవన్మత మనియు, సమస్తమతముల వారును సమస్తదేశములవారును నిర్వివాదముగా నంగీకరించి యున్న పరమసిద్ధాంతాంశమేకదా? లోకములో సమస్తజీవరాసులును నైసర్గికముగా సదా సుఖమే యనుభవించుచుండుటయు, వానికెప్పుడయిన దుఃఖము సంప్రాప్తమైనయెడల నది యశ్రద్ధచేతఁగాని యజ్ఞానముచేతఁగాని భగవన్నిర్దేశము నతిక్రమించి ప్రవర్తించుటవలననో పరుల యక్రమమువలననో యాగంతుకముగా వచ్చుచుండుటయు నెల్లవారును కొంచెము విమర్శించినచో ననుభవముచేతకూడ నెఱుఁగవచ్చును. ఆయావస్తువుల తత్త్వము నెఱిఁగి క్రమముగా నుపయోగించుకొన్నచో సృష్టిలోని గణనాతీతములైన సమస్తపదార్థములు నేదో యొకవిధముగా మనసుఖసంతోషాదులకే తోడుపడునట్టి యంశము

వివేకము గలవారి కెవరికి తెలియకుండును? సృష్టిమర్యాదనుబట్టియు దానివలనఁ దెలిసికోఁదగినంతవఱకు భగవత్స్వభావమును బట్టియు విచారింపఁగా భగవచ్ఛాసన మెప్పుడును ప్రజాసుఖమునకే యనుకూలముగా నుండుననియు ప్రజాసౌఖ్యమునకు ప్రతికూలముగా నుండు కట్టుపాటులన్నియు భగవన్మత విరుద్ధములయి పాపైకమూలములయి యుండుననియు మందమతి సహితము సులభముగా తెలిసికోవచ్చును. కాఁబట్టి లోకములో గొందఱెప్పుడును దుఃఖపడుచు నుండవలెననియే భగవదిచ్ఛయనియు ధర్మమనియు బోధించువారు కేవల వంచకులనియు భగవత్సంకల్ప మాప్రకారముగా నుండుననుట యపచారమనియు దైవదూషణమనియు జ్ఞానలేశము గలవారందఱును తెలిసికోవలెను. ఎప్పుడును బహుజన సుఖదాయకమయిన కార్యమే పుణ్యకార్యము; బహుజన దుఃఖకరమయిన కార్యమే పాపకార్యము. పుణ్యపాపనిర్ణయము చేయుటకు లోకములో నింతకంటె మంచి సాధనము మఱియొకటి లేదు. అందుచేతనే మనపెద్దలు చక్కఁగా విచారించి,-

శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః।
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ ॥

అని పరోపకారమే పుణ్యమును పరపీడనమే పాపము నన్న సర్వశాస్త్రసారాంశమయిన పరమార్థమును రెండుమాటలతో చెప్పియున్నారు. కాఁబట్టి సమస్తకార్యములయందును మన మీయమూల్యమయిన యుత్తమవాక్యమును మూలసూత్రముగా గ్రహించి శిరసావహించుకొని నడవవలయును. ఈశ్వరేచ్ఛానుసారముగా ప్రవర్తించుచు దయానిధియయిన యాతని యనుగ్రహమునకు పాత్రులమయి యిహపరలోకసుఖములను పొంది యానందింపఁ దలఁచుకొన్న పక్ష

మున మనము చేయవలసిన ప్రయత్నములన్నియు జనసామాన్యము నకు సుఖాభివృద్ధి యగుటకును దుఃఖము తగ్గుటకును ననుకూలమయి నవిగా నుండవలెను; కాఁబట్టి మనమేరాజశాసనమును విధించినను, ఏకులధర్మమును నిర్ణయించినను, ఏమతనియమమును జేసినను, అవి యెప్పుడును సాధ్యమయినంత యధికసంఖ్యాకుల కధికసుఖము కలుగఁ జేయుట కనుకూలపడునట్లుగా నుండవలయును. అట్లుండక యవి ప్రత్యేకముగా నొక్కతెగవారి మేలునకే యనుకూలముగా నుండి, ఇతరుల కందుమూలమున బాధ కలుగుచున్న పక్షమున, ఆయేర్పాటు లెన్నటికిని భగవదిచ్ఛానుసారములు కానేరవనియు నవి క్రూర మయిన పిశాచముయొక్క ప్రేరణమువలన చేయఁబడినవనియు రూఢిగా నమ్మవచ్చును. లోకవృత్తమునందు మన కితరులతోడి సంబంధ మని వార్యము గనుక పరస్పరసాహాయ్యములేక మనకీలోకములో నిజ మయిన సౌఖ్యమే లేదు. ఇతరులు సుఖించునప్పుడే మనమును సుఖ పడుదుము. అందఱును స్వప్రయోజనపరులయి ప్రతిపురుషుఁడును పరులసుఖమును విచారింపక యొక్క తనసౌఖ్యము నిమిత్తమే పాటు పడెడుపక్షమున లోకములో నెవ్వరికిని సుఖముకలుగక మనమంద ఱమును మృగములకంటె హీనులముగా నుందుము. స్వప్రయోజన పరత్వము నెంతవఱకు విడిచిపెట్టి లోకోపకారము నిమిత్తమయి జను లెంత పాటుపడుదురో వారిస్థితి యంత యుత్కృష్టదశను పొంది వారంత సుఖాధిక్యమును పొందుచుందురు. కాఁబట్టి సుఖమనఁగా జన సామాన్యముయొక్క సుఖమేకాని యొకజాతివారియొక్కగాని తెగవారి యొక్కగాని సుఖమెన్నటికిని కాదు. మనము మొత్తముగా జన సామాన్యముయొక్క సుఖమునిమిత్తమై పాటుపడినప్పుడే లోకమున కంతకును సుఖము కలుగును. లోకసుఖము నిమిత్తమయి చూచునప్పు

డెవ్వరికిని సాధ్యమయినంతవఱకు నిష్కారణముగా బాధ కలుగకుండునట్లు చూడవలయును. ఒకవేళ కొందఱికి నష్టము కలుగకుండ జనసామాన్యముయొక్క సుఖాభివృద్ధికి తగిన యేర్పాటేదియైనను చేయ శక్యముకాకపోయినయెడల నేవిధముగాఁ జేసిన నత్యల్పసంఖ్యాకుల కత్యల్పబాధ కలిగి బహుజనసుఖావహమగునో యావిధముగా దానిని చేయవలెను. మన మొకకార్యముయొక్క యోగ్యతాయోగ్యతలను విచారించునప్పుడు భగవత్సమ్మతమయిన యీ ధర్మమును దృఢముగా మనసునందు నిలుపుకొనవలెను.

మనుష్యులకు మృగాదులకులేని యుక్తాయుక్తవివేక మొకటి యధికముగా నున్నది. ఆవివేకమును భగవంతుఁడు వారికి ప్రసాదించినందుకు ఫలముగా వారొకకార్యమును చేయునప్పుడు దేశకాలపాత్రాదులను విమర్శించి యయుక్తమును విడిచి యుక్తమయిన దానినే చేయవలసినవారగుచున్నారు; అందుచేత మృగాదులవలెఁ గాక మనుష్యుల యాచారవ్యవహారాదులు కాలానుగుణముగా మాఱుచుండుట యనివార్యమయి యున్నది. జనులు విమర్శకులయి భగవంతుఁడు తమకు దయచేసిన యుచితానుచితజ్ఞానమును సార్థకపఱచుకొనుచు దేశకాలస్థితినిబట్టి చక్కగా నాలోచించి దేశక్షేమకరములయిన మార్పులను నిశ్శంకముగా చేసికొనుచు వచ్చినచో వారు క్రమక్రమముగా మహోన్నతదశకువచ్చి నాగరికాగ్రగణ్యులై యుక్తప్రవర్తనముచేత దేవతాతుల్యులగుదురు; అట్లుగాక యీశ్వరోద్దేశమునకు వ్యతిరిక్తముగా జను లవిమర్శకులై తమవివేకమునంతను పదటఁగలిపి దేశకాలానుగుణముగా ప్రజాక్షేమకరములైన మార్పులను చేసికొనక పూర్వ మాచరింపఁబడినదే మంచిదని కూరుచున్నపక్షమున నభివృద్ధి యన్నమాటలేక జను లంతకంతకు

మూఢులయి హీనదశను పొంది కడపట మృగప్రాయు లగుదురు. ప్రకృతిధర్మమునుబట్టి మన ముద్దేశించినను ఉద్దేశింపకపోయినను గూడ మన మూచారాదులలో మనకు తెలియకనే యేదో యొకవిధముగా మార్పు కలుగుచునే యుండును; ఒక్క-మృగాదులుమాత్రమే యెప్పుడును మార్పులేకుండ నుండునవి. మనుష్యులలో మార్పు కలుగకుండుట యసాధ్యము; విమర్శలేనిచో కలిగెడు మార్పు మాత్రము సాధారణముగా సుఖప్రదమయినదిగా నుండదు. విమర్శలేకయే కార్యములను జేయుచు వచ్చినచో మన కాచారమే పరమదైవతమయి యుచితానుచిత వివేకమును మన మనసులనుండి దూరముగా పాఱఁద్రోలి తుదకు మానుషధర్మమే మనలను విడిచిపోవునట్లు చేయును. అప్పుడు మనము దురాచారభూతమునకు సంపూర్ణదాసులమయి దయాదాక్షిణ్యాదులను వదలివేసి యది నడిపించినట్లెల్ల గ్రుడ్డివారివలె కన్నులు మూసికొని నడుచుచు వివేకము మనలను వదలుటచేత విపరీతబుద్ధి కలవారమయి, మంచిని చెడ్డగాను చెడ్డను మంచిగాను భావించుకొనుచు పాపభీతి యెఱుఁగక యెంతటి క్రూరకృత్యమున కయినను వెనుకతీయనివారమగుదుము. మనలోని రాజపుత్రులు వివాహముల యందలి యతివ్యయమును మాని సుఖపడవలసినపనికి మాఱుగా వివేకరహితులయి ధనాభావముచేత తమకడుపున పుట్టిన స్త్రీశిశువులనే కరుణమాలి వధించెడి కిరాతవృత్తిని పూనఁగలుగుటయు, పలువురు సత్యమయిన యీశ్వరుని మఱచిపోయి కాళికాశక్తి మొదలయిన పేళ్ళు పెట్టిన రాతిబొమ్మలకు తృప్తి కలుగునని దయాశూన్యులయి తమ్ముఁబోడి మానవులను కొన్నిసమయములయందు తాము కన్నబిడ్డలను కూడ బలవంతముగా బలిపెట్టు ఘోరరాక్షసకృత్యమును వహింపఁ

గలుగుటయు, కొందఱు పుణ్యము వచ్చుననియు పాపనివారణ మగు ననియు భ్రమపడి ప్రేమానుబంధమును తెగఁగోసి తమగర్భమున జనించిన శిశువులను గొనిపోయి మొసళ్ళ కాహారముగా గంగాగర్భ మున పాఱవేయు ప్రత్యక్షపాశకార్యమున కొడిగట్టఁగలుగుటయు, ఆచారపిశాచప్రభావమువలన నేకదా? మన మీదినమునఁ బ్రసంగింపఁ బోయెడు దయనీయలయిన బాలవితంతువుల దరిలేని మరణాంతదుర్ద శలు చూచి మనవారిమనసులు కరఁగకుండుటయు, ఆ యనాథయువ తుల వచింపరాని దురవస్థలను వారించుటకయి చేసెడి పరోపకారపరా యణుల యుత్తమప్రయత్నములకు మనవారింతమంది విరోధులయి నానావిధముల ప్రతిబంధములను విఘ్నములను కల్పించి కార్యవిఘా తము చేయఁ జూచుచుండుటయుకూడ నాచారపిశాచావేశబలము వలన కలిగిన వికారముచేత వివేకముచెడి తమ్ము దా మెఱుఁగనేరని యవస్థలో నుండుటచేత నేకదా? ఓక్రూరాచారపిశాచమా! నీపేరు తలఁపునఁ బాఱినంతమాత్రమున నాదేహమిప్పుడు కంపమెత్తి నీమీఁద పట్టరానికోపము వచ్చుచున్నది. ఓపాపపుదురాచారమా! లోకములోని సమస్తదేశములకును శిరోభూషణమయి సకలదేశముల వారి గౌరవమునకును పాత్రమయియుండిన మా భరతఖండమునందు దొంగవలె నెప్పుడో యేలాగుననో మెల్లగాఁబ్రవేశించి యెవ్వరును కనిపెట్టకుండ క్రమక్రమముగా ప్రబలి యందఱికన్నులను గప్పి ద్రోహివయి కొంతకాలమున కీశ్వరుని ధర్మాధికారమునే నీవాక్ర మించుకొని స్థిరపడి యమాయికు లయిన యస్మద్దేశీయులను మోహా పతిచి వశ్యులను జేసికొని నీదుష్ప్రభుత్వము నల్లయెడలను స్థాపించి వారిమీఁద నిరంకుశాధికారమును చెల్లించుచు వివేకము చెఱిచి యనుదినము కొందఱిచే నెన్నిదుష్కార్యములను చేయించుచున్నావు!

నీవు వచ్చిచేరి యుక్తాయుక్తవివేకమును మావారల హృదయపీఠముల నుండి తఱిమివేసినావు; సమస్తసుగుణముక్తావళికిని నాయకమణియైన కారుణ్యమును హృదయపేటిక చేరకుండ రూపుమాపినావు; సుఖవృక్షమునకు పాదుగానున్న దేశాభిమానమును హృదయక్షేత్రముల నుండి వేళ్ళతో పెల్లగించివేసి యాస్థానమున సత్యజ్ఞానదయాదాక్షిణ్య వివేకాదులకు విఱుగుడుమందుగానుండు దురభిమానవిషవృక్షములను దట్టముగా నాటినావు. నీవువచ్చి యాశ్రయించి నీప్రభుత్వము బలపడిన పాపముచేత నేకదా విద్యావివేకాదులయం దనన్యసాధారణ మహిమ నొందియుండి యితరదేశముల హీనదశనుజూచి పరితాప పడుచుండిన మాహిందూదేశమునకు పూర్వపు మహోన్నతస్థితి యంతయు కాలక్రమమున మూలపట్టి విద్యావివేకాదులయందు దినదినాభివృద్ధి నొందుచున్న యాయన్యదేశములే తన యిప్పటిహీన దశను జూచి పరితాపపడవలసిన దుర్గతి పట్టవలసివచ్చినది! నీయధికార ప్రాబల్యము ముదిరినదోషముననేకదా లేశమైన నభివృద్ధి కవకాశము లేక సకలదేశముల గౌరవమునకును పాత్రమై యుండిన యీ భరత ఖండము నానాటికి క్షీణదశనుపొంది యిప్పుడితరదేశముల పరిహాసమునకు పాత్రము కావలసినదగుచున్నది! నీకు గురుత్వము సంప్రాప్తమైన దుర్యోగముచేత నేకదా నాప్రాణతుల్యమైన యీయార్యావర్త దేశము నిజమయిన తనసుగుణసంపదనంతను పోగొట్టుకొని కేవల బాహ్యవేషధారణముతోనే తృప్తివహింపవలసినదైనది! సకల శాస్త్రములకును కళలకును సద్గుణములకును సద్వర్తనమునకును నాటపట్టయి యుండిన యీ నాజన్మదేశముయొక్క పూర్వావస్థను తలచుకొన్నకొలదిని నీమీదికోపమును దేశముయొక్క యిప్పటి దుస్థితిని గూర్చి సంతాపమును పెరుగుచున్నవి. మాప్రియదేశముయొక్క

యనర్థమున కెల్లను మూలమనైన యో యనాచారపిశాచమా! నీవే
యిప్పుడు ఘనకాలము రూపముదాల్చి నాయెదుట నిలువఁబడితివా,
హత్యచేసిన పాపము వచ్చినను చేతులకసిదీఱ నిన్నొక్కసారిగా మెడ
నులిమి చంపివేసి, ఈ దేశమును పట్టుకొనిన పీడను నేటితో వదల్చి ఋణ
విముక్తుఁడనై కృతార్థుఁడ నగుదును. నిన్నీలాగుననైన రూపు
మాపి దేశమును మునుల చెప్పిన ప్రకారముగా నీశ్వరశాసనమున
కొప్పింపఁ గలిగినప్పుడుగదా నాకు కోపశాంతి కలుగును! మాకు నీయు
లగు హిందూమహాజనులారా! ఆచారపిశాచము మనల నీప్రకార
ముగా దారితప్పించి తప్పుత్రోవను బెట్టి ప్రకృతినియమమును మన యభి
వృద్ధిమార్గమున కడ్డముగా కంటకప్రాయములగు ప్రతిబంధకము
లను కల్పించి బహుకాలమునుండి తరతరములు బాధించుచుండఁగా,
తెలిసి మన మింకను నెంతకాలము పౌరుషము విడిచి భగవదాజ్ఞా
రూపమయిన శాస్త్రదేవతాధికారమును తా నక్రమముగా నాక్ర
మించుకొని మనలను బుద్ధిహీనులనుజేసి మనమీఁద నెక్కి త్రొక్కు
చున్న యనాచారమను ద్రోహికి పరమభృత్యులమై కన్నులు మూసి
కొని హైన్యముతో దాస్యముచేయుచు మనమేలునైనను విచారిం
పక యజ్ఞానాంధకారమునఁబడి యుందము? ఎఱిఁగియెఱిఁగి లేశ
మైనను పూజార్హతలేని యీద్రోహిని కాళ్ళను చేతులను కట్టుకొని
యారాధించుచు మనయభివృద్ధినిఁగూడ నిరాకరించి వేరుపురుగువలె
పైకి తెలియకుండ లోలోపలనే మనసౌఖ్యవృక్షమును మూలముతో
ఛేదింపఁ బాటుపడుచున్న యీతని క్రౌర్యముయొక్క దుష్ఫలములను
పలుమారులు ననుభవించుచుండియు తెగువలేక యెంతకాలము
పూజార్హమైన శాస్త్రదేవతనుకూడ నీక్రూరునకు దాసినిజేసి సమర్పించి
యశక్తులమై యుందము? ఇప్పుడిప్పుడు వివేకమాంత్రికుఁడు కాల

మహిమచేత మనహృదయభవనములయందు ప్రవేశించి మోహతమ మును క్రమక్రమముగా చెదరఁగొట్టుచున్నాఁడు. కనుక వెనుకటి వారివలె మన మిప్పుడు దురాచారగ్రహముయొక్క సమ్మోహన మంత్రప్రభావముచేత పూర్ణముగా కట్టుపడి యుండలేదు. మన మాచారమునకు సేవ చేయవలసినదని లేదనియు, మనకు భగవంతుఁ డొక్కఁడే సర్వాధికారియనియు స్పష్టముగా తెలిసియున్నాము. కాఁబట్టి, సోదరులారా! మన మింతటనైనను తెలివితెచ్చుకొని మాంద్యమునుండి లేచి దేవకార్యవిషయమై వీరభటులవలె నడుములు కట్టుకొని నిలువఁబడి యీశ్వరాధికారము నపహరించి యేలుచున్న యాచారనామకద్రోహిని బలవంతముగా సింహాసనమునుండి పడ విడిచి యీశ్వరుని సింహాసనము నీశ్వరునకర్పించి మనము దాస్యము నుండి విముక్తులమై స్వాతంత్ర్యపదవిని పొంది యీశ్వరశాసనమును తలధరించి చేయుచు నాతనిపరిపాలనములోనుండి పూర్వకాలము నందు మన దేశము నలంకరించిన మనుగౌతమాది కీర్తిశరీరుల సంతతి వారమని చెప్పుకొనుట కర్హులమగుటకు ప్రయత్నింతము లెండి.

ఆచారపిశాచమును హృదయపీఠములనుండి పాఱఁద్రోలి వివే కమును స్థాపించి యీశ్వరాజ్ఞానుసారముగా ప్రవర్తించుచు మనము సుఖపడి యితరులను సుఖింపఁజేయుటకై కేవల ప్రమాణబద్ధులము కాక కార్యసమయములయందు విషయవిచారము కూడ చేసి సాధక బాధకముల నాలోచించి తేలిన సిద్ధాంతాంశము నవలంబించుచుండ వలయును. నిష్పాక్షికబుద్ధితో చేయు తత్త్వవిచారమును మానివేసి కేవల ప్రమాణబద్ధులమగుదుమేని క్రూరాచారములకును స్వప్రయో జనపరుల కుత్సితకల్పనలకును లోనయి మన సుఖమును లోకసుఖ

మునుకూడ చెడఁగొట్టుకొందుము. తత్త్వవిమర్శకు ప్రతిబంధకరము లయిన దురభిమానమును జయాకాంక్షను దూరీకరించి యేకవిషయం మును చర్చించి పరిశోధించుటకును, ఈశ్వరముఖమును జూచి సత్య మునే పరిగ్రహించుటకును కృతనిశ్చయులమయి యీ ప్రకారముగా వర్తింతుమేని మన మాచారమునకు భక్తులము కాకుండుటకును సమస్తసుఖములను పొందుటకును శక్తుల మగుదుము. కార్యాకార్య పరిశోధనము చేసి కాలానుగుణముగా దోషబాహుళ్యము గలవానిని త్యజించుచు గుణబాహుళ్యముగలవానిని భజించుచు నుండకుందు మేని పూర్వాచార మెంత ప్రబలముగా నున్నను ప్రమాణవచనము లెంత కట్టుదిట్టముగా నున్నను వాని నతిక్రమించి భగవంతుఁడు మన కనుగ్రహించియున్న స్వాతంత్ర్యప్రభావమునుబట్టి మనుష్యప్రకృతి మార్పుచెందక యెప్పుడును స్థిరముగా నేకరీతిగా నుండునది కాదు గనుక మనకు తెలియకయే మన యాచారాదులలో మార్పులు గలు గుచు విమర్శతో చేయఁబడినవి కాకపోవుటచే తఱుచుగా నవి చెడు గునకే కారణమగుచు నట్లేర్పడిన దురాచారములు కాలమహిమ చేత కొంతకాలమునకు సదాచారముగానే తోఁచి లోకములో చెడు గభివృద్ధి చెందును. అప్పు డావిషయమున విమర్శన యారంభ మయి నచో దాని నవలంబించినవారికి దురభిమానము తోడుపడి వివేకమును కప్పివేయఁగా వారు తమ యాచారమే సదాచారమనియు, అదియే సృష్ట్యాదినుండియు వచ్చుచున్నదనియు, అదియే శాస్త్రసమ్మత మని యు, పట్టుపట్టి వాదించి జయాకాంక్షతో పోరాడి సత్యగ్రహణమునం దాదరము లేక శాస్త్రముల నాచారానుగుణముగా నర్థముచేయ పాటు పడుచు లోకమునకు మితిమీఱిన హాని నాపాదింతురు. ఎంత నష్టకర మయిన దురాచారమయినను కొంతకాలమునుండి వచ్చుచున్న పక్ష

మున సదాచారముగానే కనఁబడునని దూపుటకయి పయిని చెప్పిన రెండుమూడునిదర్శనములే చాలును గనుక నింక నిక్కడ లక్ష్య బాహుళ్య మక్కఱలేదు. లోకములో మన కంతకంతకును విద్యా బుద్ధులలో నభివృద్ధి నొందుచుండుటయును, అభివృద్ధికి తగినట్టుగా నాయాకాలములయందు మార్పులు కలుగుచుండుటయు ఆమార్పులు దేశక్షేమకరములుగా నుండవలయుటయు, భగవదుద్దేశమే గనుకను, విషయవిచారము లేక యోగ్యమైన మార్పులు కలుగుట సంభవింపదు గనుకను, మన మిది పూర్వాచారమా కాదా యను విచారము మాని యిది లాభకరమయినదా నష్టకరమయినదా ప్రస్తుతస్థితి కనుకూల మయినదా ప్రతికూలమయినదా యని విచారించుచు కాలమునకు తగిన లాభకరములయిన మంచిమార్పుల నెప్పుడును చేసికొనుచుండ వలయును.

మౌఢ్యముచేతను స్వార్థపరత్వముచేతను చేయఁబడిన బహు జనారిష్టకరములయిన యేర్పాటులు కొన్ని యాచారప్రధానమువలన మంచివిగానే కనఁబడినను, అవి భగవదుద్దేశమునకు విరుద్ధములయి నందున సర్వదేశములయందును సర్వకాలములయందును వ్యాపింపక యెప్పుడో యొకప్పుడు నశింపఁదగియుండును. ఎంతకాలమునుండి వచ్చుచున్న యాచారమయినను మానవస్వభావమును బొత్తిగా చంపివేయలేదు; నశించినదనుకొనుచున్నప్పుడుకూడ మానుషస్వభా వము లోపల నడఁగియుండి యెప్పుడో మరల బయలుదేఱి కడపట విజయమునొందక మానదు. కాఁబట్టి ప్రకృతిధర్మవిరుద్ధములును నష్టకరములు నయిన మనుష్యసంకేతము లెంతకాల మాచరింపఁ బడుచు వచ్చినను కడ కెప్పుడో మాపుమాయవలసినవే. అందుచేతనే

చిన్నతనములో భర్తలను పోఁగొట్టుకొన్న యబలలను పునర్వివాహము చేసికోనియ్యని ప్రకృతివిరుద్ధమయిన క్రూరాచారము లోకమం దంతటను వ్యాపింపఁగలిగినది కాదు; అన్నికాలములయందును తల యెత్తఁగలిగినదియుఁ గాదు. మనలోని పామరులీదురాచారము జగత్తునందంతట ననాదిగా వచ్చుచున్నదని భ్రమించుచున్నను, నిజము చేత ప్రపంచములో షోడశభాగములోనయినను లేనట్టు కొంచెము భూగోళశాస్త్రజ్ఞానము గలవారి కందఱికిని తెలియును. ఇప్పుడీ భూమండలములో వ్యవహరింపఁబడుచున్న యేనుఖండములలో నొకఖండములోనైనను పూర్ణముగా నీదురాచారము లేదు. ఆ యున్న యొక్కఖండములోనయినను బహుదేశములం దుండక యొక్క హిందూదేశమునందు మాత్రము వ్యాపించియున్నది. ఆ హిందూదేశములోనయిన నన్నిమతములవారిలోను లేక యొక్క హిందూమతావలంబకులలో మాత్రము కానఁబడుచున్నది. ఆ హిందూమతావలంబకులలో నయిన సమస్తవర్ణముల వారిలోను నుండక యొక్క యగ్రవర్ణములు మూఁటిలోను మాత్రమే పొడచూపుచున్నది; ఆ మూఁడువర్ణముల వారిలోనైన నెల్లకాలము నుండక కలినిషేధములలో పరిగణింపఁబడి యుండుటచేత ప్రత్యేకముగా నొక్క యీ కలియుగములో మాత్రమే వచ్చినది. ఈ కలియుగములో నయినను నిరాక్షేపముగా వ్యాపింపక ప్రథమపాదములోనే బహుకాలమునుండి వివేకిలోకముచే దూషింపఁబడుచు నీవఱకే యీదురాచారదుర్గము సంచలించి యదురుకదరి యున్నది. ఇప్పుడు దేశమందంతటను వ్యాపించుచున్న విద్యాప్రభావమువలన ప్రకృతివిరుద్ధమయిన యీ దురాచారమిఁక నెంత కాలమో మొదలంట కూలక నిలువనేరదు. స్వభావవిరుద్ధమయిన యీ ఘోరాచార మెప్పుడో రూపుమాయుట యనివార్యమే యయి

నను దేశక్షేమము నపేక్షించు దేశాభిమానమాననీయుల కందఱకును దాని వినాశమును వేగిరపఱుచుటకయి వలయు ప్రయత్నముల నెల్లను జేయుట విధిగానున్నది. ప్రస్తుతాచారమును మానుఁడని మీ కుపదేశించుటకు ముందుగా దానివలన జనసంఘమున కిప్పుడు కలుగుచున్న నష్టములను దానిని మానుటవలన కలుగఁబోయెడు లాభములను మీకుఁ గొంత చూపవలసి యున్నది. అవి యన్నియు రసపుష్టి గల ప్రౌఢవాక్యములతో మీహృదయములు కరఁగునట్లుగా నుపన్యసించుటకు నేను శక్తుఁడను కాకపోయినను లోకోపకారబుద్ధియు ననాథ యువతుల దురవస్థయు నన్ను బహువిధములఁ బ్రేరేప నాపక్షమున నున్న సత్యబలమును నమ్ముకొని నాకు తోఁచిన సంగతులను కొన్నిటిని చెప్ప సాహసము చేయుచున్నాను.

సర్వజ్ఞుఁడయిన యీశ్వరుఁడు స్త్రీపురుషభేదము లేక మనుష్యసామాన్యమంతయు నీలోకములో సాధ్యమయినంత సంపూర్ణసుఖము ననుభవించుటకే యుద్దేశించి యున్నాఁడు. ఇహలోకములో పొందఁదగిన వానిలో కామసుఖ మొకటి ముఖ్యమయినది. సర్వదయాకరుఁడయిన జగదీశ్వరుఁడు పురుషులకువలెనే స్త్రీలకును క్షుత్పిపాసాదులవలెనే కామమును ప్రసాదించి యున్నందున, పురుషులుగాని స్త్రీలుగాని దానిని యుక్తరీతిని శాంతి పొందించుకొని సుఖపడవలయుననియే యీశ్వర సంకల్పమగుట స్పష్టము. కాఁబట్టి చౌర్యాదులయందు ప్రవేశింపక యుదరపోషణము చేసికొనుట యెట్లు న్యాయమో వ్యభిచారాదులయందుఁ బ్రవేశింపక కామశాంతి చేసికొనుటయు నట్లే న్యాయమగును. కామశాంతికయి యేర్పడిన న్యాయమార్గము వివాహబంధము. మన మా ధర్మమార్గము నవరోధించి మనవారినెంత నిర్బంధములో నుంచినను స్వర్గము వచ్చునన్న యాశచూపి

యెన్నిసుబోధలు చేసినను మనుష్యప్రకృతి యడఁగక యధర్మమార్గమున నడుచునుగాని యెల్లవారికి నింద్రియనిగ్రహము కలుగనేరదు. సమస్తమును తెలిసి, సర్వసంగములును పరిత్యజించి, సంసారబంధమును కోసివేసి, శరీరములు కృశింపఁజేసి, అడవులలో కందమూలఫలాదులు తినుచు తలక్రిందుగా తపస్సుచేయు ఋషులవంటి మహానుభావులే యప్పుడప్పుడు కామవికారమునకు లోనయి వివేకము పోఁగొట్టుకొని యకార్యకరణమునకు ప్రవర్తించుచుండఁగా, ఉప్పును పులుసును తినుచు సంసారసుఖములలో సదా మునిఁగి తేలుచు మంచి వయసులో సుందరమందిరములయందు వసించియుండువారికి కామమును జయించుట శక్యమగునా? శక్యము కాదు గనుకనే భర్తృహరి,

శ్లో॥ విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబు పర్ణాశనా
స్తేపి స్త్రీ ముఖపంకజం సులలితం దృష్ట్వైవ మోహంగతాః
శాల్యన్నం సఘృతం పయో దధియుతం భుంజంతి యేమానవాః
తేషా మింద్రియనిగ్రహో యదిభవే ద్వింధ్యః ప్లవేత్సాగరే.

అని విశ్వామిత్ర పరాశరాదులయిన వాతాంబుపర్ణాశనులు సహితము సుందరమయిన స్త్రీముఖపద్మమును జూచి మోహపరవశులగుచుండఁగా, నెయ్యి, పాలు, పెరుగు మొదలయినవానితో వరియన్నము భక్షించు మనుష్యులకే యింద్రియనిగ్రహము కలుగుపక్షమున వింధ్యపర్వతము సముద్రమునందు తేలవలసినదేయని చెప్పుచున్నాఁడు. ఋషులసంగతి యిట్లుండఁగా విద్వాంసులసంగతి చెప్పుచు మనువు,

శ్లో॥ మాత్రా స్వస్రా దుహిత్రా వా నవివిక్తాసనో భవేత్ ।
బలవా నింద్రియగ్రామో విద్వాంస మపికర్షతి॥

బలవంతమయిన యింద్రియవర్గము విద్వాంసులను సహిత మీడ్చును

గనుక తల్లితోనైనను తోడఁబుట్టినపడుచుతోనైనను కొమార్తెతో
నైనను రహస్యముగా కూరుచుండఁగూడదని విధించియున్నాఁడు.
తల్లి మొదలయిన వారితోనే విద్వాంసులుసహిత మొంటిగా కూరు
చుండఁగూడదన్నప్పుడు మూఢులవిషయమయి చెప్పనక్కఱయే
లేదు. ఆకలములు తినుచు నడవులయం దిమసగోచులు కట్టుకొని
వసించు తపసులయొక్కయు, జననీజనకులను విడిచి గురుకులవాసము
చేయుచు నిష్ఠతో విద్యాభ్యాసముచేయు విద్వాంసులయొక్కయు
పాట్లే యిట్లుండఁగా నిఁక విద్యాగంధమే యెఱుఁగక యుక్తాయుక్త
వివేక మాత్రకుముందే లేక యింద్రియసుఖానుభవమునకు నిదానము
లయిన సుందరమందిరములయందు సదా యౌవనవంతులయిన సుం
దరపురుషులమధ్యమున మెలఁగుచు నుప్పును పులుసును జిహ్వాకింపుగా
తినుచు వయసులోనుండి తమయొక్క యింద్రియవర్గమే కాక వివిధ
మార్గోపాయములు పన్ను దుష్టపురుషులుకూడ కామోపభోగముల
కయి పురికొల్ప స్వభావచంచలలయి యనాథలగుటచే స్వేచ్ఛాచా
రిణులయిన యబలలకు మనస్స్థైర్యముతో నింద్రియనిగ్రహముచేయ
శక్యమగునని స్వప్నావస్థయందయినను నమ్మవచ్చునా? కాముని
ధాటికి మహావిద్వాంసుల మనస్సులే గాలిలోని దీపములవలె కల్లల
నాడుచుండఁగా నిఁక చెదరక నిలుచుట కబలలయిన యనాథబాలల
మనసు లెంతవాటివి? మీరెంతకష్టపడి శిరోజములు తీయించి బోడి
తలచేసినను, ఆభరణములను తీసివేసి వికారపఱచేసినను, మూడు
పూటలును భోజనము చేయనీయక కడుపుమాడ్చినను, కటికినేలను
పరుండనియమించి దేహమంతయు నొవ్వఁజేసినను, మఱియెట్టి
దురవస్థల నన్నిటిని తెచ్చిపెట్టినను, స్వభావసిద్ధముగా యువతులకు
భగవంతుఁడు దయచేసిన కామమును మాత్రము మీరు తీసివేయ

శక్తులుకారుగదా? వయసుపోనున్న పురుషునకు భార్య పోయినంత మాత్రముచేత కామముడుగకుండుట మగవాఁడు మరలవివాహము చేసికొనవలెనని యీశ్వరేచ్ఛ యయినట్లు కారణముగా నూహింపఁ దగియున్నదో అదేప్రకారముగా భర్త పోయినంతమాత్రముచేత యువతికి కామము పోకుండుటయు స్త్రీపునర్వివాహముకూడ భగవ త్సమ్మతమేయని తెలిసికొనఁదగియుండలేదా? భగవంతునితో ప్రతిఘ టించి భగవదుద్దేశమునకు విరోధముగా పనిచేసి మీరెన్నటికి కడ తేఱఁ గలుగుదురు? ఈశ్వరేష్టమును వ్యతిరేకించి మీరెట్లిహపర సుఖములను పొందఁగలుగుదురు? భగవదుద్దేశమునకు వ్యతిరిక్త మయిన పనియందు ప్రవేశించుట కేవల ఘోరరాక్షసకృత్య మగును గాని లేశమయిన మానుషస్వభావమున కర్హకృత్య మగునా? ఈశ్వరుఁడు సుఖ మనుభవింప సృజించిన వారిని మనయావచ్ఛక్తిని ధారపోసి కష్టములపాలుచేయ పాటుపడుట యెంత పాపకార్యము? ఎంత క్రూరకృత్యము? ఎంత దుష్కర్మము? మనదేశములోని క్రూరాచారమునుబట్టి యీదేశపువితంతువు లనుభవింపవలసిన దుర్ద శలను తలఁచుకొన్నంతమాత్రమున పగవారి మనస్సయినను కలుక్క మనక మానదుకదా? వారిదురవస్థలు మనస్సునకు తగిలినంతమాత్రము చేత దిక్కుమాలిన పశువుల మెడలువిఱిచి చంపెడు దయారహితు లయిన కిరాతులకయినను మనస్సు దహించుకొనిపోయి జాలిపుట్టదా? అట్టి దయాశూన్యులయిన యన్యులకే యట్లు జాలికలుగుచుండఁగా మనబాలవితంతువులదుర్గతి చూచి మనకేల కొంచెమయినను కనిక రము పుట్టఁగూడదు? తమవేడుకనిమిత్తమయి కడుపున పుట్టిన కన్నులు తెఱవని పసిపిల్లలకు మంగళసూత్రధారణమిషమున మెడకొక త్రాడుకట్టి, బలినిమిత్తమయి గుడికి మేఁక నీడ్చుకొని పోవుకసాయిను

వేపరొట్ట కట్టినట్టుగా చేతులకు తోరముకట్టి, వాద్యముల మ్రోతతో వివాహమని పేరుపెట్టి యది యేమో కన్యాపరులకే తెలియని జాతర వంటి యొకతంతు నడిపి, యిదియంతయు నేదో క్రొత్తబట్టలు కట్టుకొని పిండివంటలు తినెడి మహోత్సవమనుకొన్న సంతోషదినములు దాఁటిన తరువాత భర్త పోయినాఁడన్న పిడుఁగువంటి దుఃఖవార్త కుటుంబము నంతను దుఃఖసముద్రములో ముంచినప్పుడును ప్రాణాధికలయిన తమ ముద్దుకూఁతులను బ్రతికియున్నంతకాలమును దుస్సహ వైధవ్య దశకు తెచ్చిన దురదృష్టమును తలఁచుకొని తలలుపీక ఱొమ్ములు బాదు కొనుచు తల్లిదండ్రులు పెద్దపెట్టున రోదనము చేయుచున్నప్పుడును వారి యొద్దకుఁబోయి మొగములవంక తెల్లఁబోయి చూచుచు "అమ్మా! ఎందుకేడ్చుచున్నావు? నాయనా! ఏల యేడ్చుచున్నావు?" అని యెఱుఁగని ప్రశ్నలు వేయుచు తమను ముందు ప్రాపింపఁబోయెడు దురవస్థను లేశమయినను చింతింపఁజాలని పసిబిడ్డల యవస్థచూచి యైనను మీమనసులు కరఁగకున్నవా? విన్నమాత్రముచేతనే గుండెలు బద్దలయ్యెడు యిటువంటి వార్తలను సహృదయములకు నాటునట్లుగా వర్ణించుటకయి కాళిదాసువంటి మహాశక్తి సంపన్నుఁడొకఁ డుండిన మీమనసులయం దప్పుడయినను జాలి పుట్టునేమో! మఱి యెవ్వరికి పుట్టకపోయినను కడుపునకన్న తల్లిదండ్రులకైన నాముగ్ధ బాలికలయందు కరుణపుట్టి వారిని పునర్వివాహముచేసి సుఖపెట్ట వలెనన్న బుద్ధి జనింపఁగూడదా? నిన్న మొన్నటివఱకు నెంతో ప్రేమతో పెంచి ప్రాణములనెల్లను వారిమీఁదనే పెట్టుకొని యుండి భర్త పోయినాఁడన్న పాడువార్త విన్నమాత్రమున సమస్తాలంకారములను తీసివేసి విరూపినిజేసి ముసుఁగువేసి మూలఁ గూరుచుండఁ బెట్టి చచ్చియు చావకుండ దినమున కొకప్పూటనే యిన్ని మెతుకులు

వేయుచు కట్టుకొని తిన్నదిగుడ్డయైన నియ్యక ముతకబట్ట చుట్టఁబెట్టి ఘోరికల జన్మములను దుఃఖభాజనములనుగాఁ జేయుటకై తల్లిదండ్రుల కెట్లు మనసొప్పుచున్నది? ఏకగర్భవాసమున జనించిన తోఁబుట్టువులుచెలులును, ఇంటఁ జొచ్చిన కోడండ్రు మొదలయినవారును రాత్రింబగళ్ళు కంటికి నేలకు నేకధారగా నేడ్చుచు మరణపర్యంతము వైధవ్యదుఃఖము ననుభవించుచుండఁగా కన్నులు పెట్టుకొని చూచుచు అన్నదమ్ములును అత్తమామలును బావమఱఁదులును నిర్దయులై యెట్లు చూచి సహింపఁగలుగుచున్నారు? అనాథలైన తమవారి ముద్దరాండ్రు సమస్తదుఃఖములకు లోనై యెన్నరాని కడగండ్లు పడుచుండఁగా వారివిషయమయి కొంచెమయినను జాలివహింపక వారి యాతనలను నివారించుటకు లేశమయినను ప్రయత్నముచేయక రక్తసంబంధము గల బంధువృందమును తాముమాత్రము హాయిగా సంసారసుఖము ననుభవించుట కెట్లు సిగ్గుపడకున్నారు? సజ్జనులారా! మన బాలవితంతువులు పడు బాధలు చూచి యన్యదేశీయులు సహితము హృదయములు నీరుగా కరఁగ పరితపించుచున్న వారికష్టముల నేలాగునైన గట్టెక్కించి యాపన్నివారణముచేసి దేశమును సుఖస్థితికి తీసికొనిరావలెనని సర్వప్రయత్నములును జేసి పాటుపడుచుండఁగా, ఒక్కదేశమునఁ బుట్టి యొక్కవేదమును నమ్మి యొక్కకుటుంబము వలెనున్న మీరు మాత్రము చీమకుట్టినట్లయినను లేక హృదయములు రాయి చేసికొని యేల నిర్విచారముగా నున్నారు? అనాథలయిన యాఁడువారిమీఁద కరుణ పుట్టుటకు మాఱుగా వారిమీఁద మీకు ద్వేష మేల పుట్టవలెను? మీరు మీశక్తినంతను విని యోగపఱిచి యనాథలయిన యువతుల సౌఖ్యమునకుఁగల న్యాయమార్గమును మూసివేయుటచేత వారు ప్రకృతిని జయింపనేరక యింద్రియదౌర్బ

ల్యాముపలనను కామప్రేరణమువలనను కాముకజన ప్రార్థనమువలనను పురికొల్పఁబడి యున్మత్తురాండ్రయి తప్పుత్రోవలు ద్రొక్కుటవలన మీకు కలుగుచున్న ముప్పులనైన మీరాలోచించుచున్నారా? కామనివారణమున కసాధ్యసాధనమును గాక ప్రకృతి చంచలలయిన యనాధకామినులు దోషములలో నెల్లను నికృష్టదోషమయిన వ్యభిచారమునందు ప్రవేశించి సమస్తానర్థములను తెచ్చిపెట్టుచుండుట మీ దృష్టిగోచర మగుచుండ లేదా? వ్యభిచారమే సమస్తానర్థములకును మూలమైనది. లోకములో జరిగెడు నరహత్యలలో ముప్పాతిక మూడు వీసములు వ్యభిచారసంబంధమునుబట్టి జరిగినవే యైయుండును. మానవంతుఁడయినవాఁడు తనవారు మఱి యేయపరాధము చేసినప్పుడయినను చూచి సహించి యూరకుండఁగలుగును గాని జారత్వము కంటఁ బడినప్పుడు మాత్రము జారపురుషునిగాని స్త్రీనిగాని యిద్దఱినిగాని కత్తిదయిన పొడిచివేయవలె నన్నంత యాగ్రహము రాక యూరకుండఁజాలఁడు. జారత్వ మొక్క మగనికి మాత్రమేకాక యత్తమామలకును బావమఱఁదులకును తల్లిదండ్రులకును నన్నదమ్ములకును గూడ మాయని యపకీర్తికరముగా నుండును; బంధువులకెల్ల నవమానకరముగా నుండును; తుట్టతుదకు కులమువారికిఁగూడ తలవంపులుగా నుండును. అందుచేతనే యభిమానవంతులయినవారు తమ యింట నెవ్వరయిన వ్యభిచరించుచున్నారన్న యనుమానము కలిగినంతమాత్రమునఁగూడ హృదయములు నిప్పులలో పొరలించినట్లు మండ తమస్త్రీలనో యనుమానింపఁబడిన జారపురుషులనో చంపినదాఁక నిద్రపట్టక పిమ్మట తాముకూడ దొరతనమువారి కఠినశిక్షలకు ప్రాణములను దేహములను సమర్పించుచున్నారు. ఆంకుతనము బయలుపడినప్పుడు బంధువులు మొదలైనవారాడు ములుకులవంటి

కాసిమాటలకు తాళఁజాలక రోషముచేత నూతిలోనో గోతిలోనో పడి ఆత్మహత్యలు చేసికొన్న వితంతువు లెంతమంది యున్నారుకారు? ఇదియంతయు విచారింపఁగా మీరు న్యాయమైన పునర్వివాహము నరికట్టుట పరమహేయమైన గూఢవ్యభిచారమునకును నరహత్యలకును స్త్రీహత్యలకును కారణమగుచున్నదని మీకు బోధపడుచుండ లేదా? ప్రజాసౌఖ్యమునిమిత్తమె ధర్మశాస్త్రములనుజేసి శాస్త్రోప దిష్టప్రకారముగా జనులను నడిపించి ప్రసిద్ధిగన్న మహర్షులసంతతివార మని పేరు పెట్టుకొనియు మీరు వారుచేసిన నియమములను మీఱి శాస్త్రవిహితమైన పునర్వివాహమును చేసికోనియ్యక యుత్తము రాండ్రు కాఁదగిన గతిలేని యనాథకామినులను సకలబాధలను బెట్టి వేశ్యలకన్నను హీనముగా వ్యభిచరించుటకై దింపుట మీకు నగు పాటుకాదా?

ఈవ్యభిచారమువలనఁ గలుగుచున్న నష్టము లివిమాత్రమే కావు. ఇంతకన్నను ఘోరములైన వనేకములున్నవి. వితంతువులు చిన్నతనములోనే స్వతంత్రురాండ్రయి మగని సొత్తంతయువచ్చి తమ్ముఁ జేరినపక్షమున మఱింతసులభముగా చెడిపోయి తమధన మంతయు మక్కువగల పరపురుషులకు పలుమిషలమీఁద దోచిపెట్టి వయసు మళ్ళినతరువాత కూటికిని గుడ్డకును లేని నిర్భాగ్యురాండ్రయి యటుకులు కొట్టుకొనియో పూటకూళ్ళుపెట్టియో బంధువులయింటఁ జేరి రోఁతమాటలకెల్లను తలయొగ్గి వారి కుపచారముచేసియో బ్రతుకవలసినవారగుచున్నారు. అట్లు ధనము చేతచిక్కకపోయెనా వెలిచవిమరిగిన బాలవితంతువులు పుట్టినింటనో యత్తింటనో యుండి గృహయజమానులింటికి తెచ్చిన యుప్పులో నుప్పును పప్పులో పప్పును

తమజారపురుషులయిండ్లకు నడిపించుచుందురు. కొన్ని సమయముల యం దంతటితో సరిపెట్టక సమయము దొరకినప్పు డింటనున్న వెండి గిన్నెలో నగలో దొంగిలించి రహస్యముగా వాని నుపపతులపాలు చేసెడివిధవలును పలువురున్నారు. ఆచౌర్య మొకవేళ పట్టుపడినప్పుడు కూడ గృహయజమానులు వెల్లడిచేయక నలుగురకును దెలిసిన దమకే యప్రతిష్ఠయని దొంగను తేలుకుట్టినట్టుగా నోరెత్తక యూర కుండవలసినవా రగుచున్నారు. మానహానికంటె ధనహాని యధిక మైనదికాదు గనుక మన మీవిషయము నంతగా నొక్కి చెప్ప నక్కఱ లేదు.

కొందఱు విధవ లింటఁగల నిర్బంధములకు కట్టుపడి యుండలేక కామపరాధీనలయి ప్రియజనకుని ప్రియతరులయిన సోదరులను ప్రియతమురాలయిన తల్లిని నెంతో కష్టముమీఁద విడిచి యేరాత్రి వేళనో తమచేతఁ జిక్కినంత సొమ్మువస్తులికి తరలించి యేచాకలి వానినో యేమంగలివానినో యేతురకవానినో యేదూదేకులవానినో తీసికొని లేచిపోయి యూరనెక్కడనో గుడిసె వేయుచున్నారు. నడుమను చెడి కులటలయిన యీసాంసారికవారులగతి మొదటినుండియు కులటలయి వ్యభిచారమే కులవిద్యగానున్న వేశ్యలస్థితి కన్నను వేయిమడుంగులు హీనమయినదిగా నుండును. వేశ్యలు తామితరులను మోసపుచ్చి వారిధనము నపహరించి తాము బాగుపడుదురు; ఈస్వైరిణులో తామే యితరులచే మోసపోయి తమధనమును వారికి దోచిపెట్టి తాము చెడిపోయి దేహము చెడఁగొట్టుకొని పూటకూటికి గతిలేనివారగుదురు. వేశ్య లుగ్గుపాలనాఁటినుండియు నభ్యసించిన మాయలును వేషములును చతురవాక్యములును కల్లవలపులును వీరి చేతఁగావు. వారికివలె కష్టకాలములయందు తోడుపడుటకు వీరికి

బంధువర్గమును కులమువారును చేరు. ఇట్లెన్నివిధముల వీరిస్థితి పరమ హేయముగా నున్నను, నిజము విచారింపఁగా నింటనుండి వ్యభిచరించువారికంటె నిల్లువిడిచి బహిరంగముగా లేచిపోయినవారే కొంత యుత్తమురాండ్రనవచ్చును. ఇల్లువిడిచి లేచిపోయినది తా నొక్కతె మాత్రమె చెడిపోయి జాతిభ్రష్టురాలగుచున్నది గాని, ఇంటనుండి వ్యభిచరించు దానివలె తనకుటుంబమువారిని బంధువులనుగూడ భ్రష్టులను జేసి వర్ణసంకరులను జేయదు. అయినను తనయింటనున్న స్త్రీ లేచిపోయి తమ కన్నులయెదుట ప్రత్యక్షముగా కులహీనునితో సంసారము చేయుచుండఁగా చూచుటకంటె నవమానకరము మఱియొకటి లేదు గనుక, మానహానికంటె మరణమయినను మేలుగా దోఁచును గనుక, ధనికులైనవా రట్టివిధవలను మెల్లగా బతిమాలుకొని యాత్రకు వెళ్ళినదనియో బంధుగృహమునకు వెళ్ళినదనియో చెప్పి తీసికొనివచ్చి మరల నింటఁబెట్టుకొని విటపురుషులను సమాధానపఱచి వాండ్రకు మఱింత స్వాతంత్ర్యము నిచ్చి గూఢ వ్యభిచారములను ప్రోత్సాహపఱుపవలసినవారగుచున్నారు. కొన్ని సమయములయందు కులమువారు తమ బహిష్కారపత్రికలతో గృహయజమానులను బెదరింప బయలువెడలినను ధనాంజనము కంటికగపడినతోడనే భ్రమపడి దక్షిణతోఁ గూడిన సమారాధనముతో తృప్తిఁబొంది పిండివంటలను భక్షించి యీ సాంకర్యమును తాముగూడ పంచుకొని కృతార్థులగుచున్నారు. ఓమహాజనులారా! ఈ వర్ణసాంకర్యమెల్లను పునర్వివాహమును మాన్పిన మహాఫలమే కదా? ఈ ప్రకారముగా సద్వంశమునఁ బుట్టిన మీ బాలవితంతువులు వంటబ్రాహ్మణులతోను, మ్లేచ్ఛభటులతోను, చాకలివాండ్రు మొదలయిన హీనజాతులతోను చెడి తిరుగుచుండుట మీకు ప్రతిష్ఠగానే తోఁచుచున్నదా?

బంధువులకు తమయింటనున్న యౌవనవతులైన విధవలవలన రెండువిధములైన దుఃఖములు కలుగుచున్నవి. ఆవితంతువులట్టి దురవస్థపాలై యుండఁగా చూచెడు దుఃఖముమాట యటుండఁగా వారు దుష్టమార్గముల ప్రవేశింపకుండ కాపాడుటకై పడెడు దుఃఖ మొకటియు వారిదుశ్చేష్టలవలన నేదియైన సంభవించినయెడల దానిని నివారించుకొనుటకయి కలిగెడు దుఃఖము మఱియొకటియు. విధవలకు పరపురుషసంభోగమునకు ఫలముగా నెప్పుడయినను గర్భము నిలువక మానదు. రండాగర్భము దాచినను నష్టమె వెల్లడిచేసినను నష్టమే. ఆసంగతి యితరులకు తెలిసిపోవునన్న భీతిచేత వితంతువులె సాధ్యమైనంతవఱకు దాచిపెట్టి కులమువారి కన్నులుకప్పి తమకు గర్భప్రదానముచేసిన మహాపురుషుల సాహాయ్యముచేతనో తార్పుడుకత్తియల సాహాయ్యముచేతనో రహస్యముగా మందులు తెప్పించుకొని గర్భపాతములు చేసికొనుచున్నారు' కొన్నిసమయములయం దింతవఱకును నిరపరాధినులుగానుండు తల్లులు సహిత మీఘోరపాతకమునకు సహకారిణులు కావలసివచ్చును. వారప్పుడు కూఁతులకు కడుపువచ్చినదని సంతోషించి సూడిదలు పెట్టుటకు మాఱుగా దుఃఖించుచు పిండము పడిపోవుటకు మందులు పెట్టవలసి వారగుదురు. కొందఱికి యుక్తసమయములో మందులు లభింపకయు లభించినను కొన్నిసమయములయందు దైవయత్నముచేత మనుష్యప్రయత్నములన్నియు విఫలములై వేసినమందులు ఫలింపకయు, చూలుపెరిగి శిశుజననము సంభవించును. అప్పుడు చేయవలసిన దింతయు నేవిధముననో కులమువారి కన్నులు కప్పి యంత బాపుకొనవలెను. కులము కన్నులు కప్పుట కేలాగున శక్యమగును? శిశుహత్య తప్ప వాకి సాధనాంతరము కనఁబడదు. కులమంతయు శిశుహత్యలో నున్నది. శిశువును చంపినచో

కులము నిలుచును; చంపకున్న చెడిపోవును. కన్న కడుపగుటచేత శిశువు మొగముచూచి చేతులార చంప బుద్ధి పుట్టక మఱియేమి చేయుటకును తోఁచక మనస్సులో వేయి తేళ్ళును జెఱ్ఱులును కుట్టి నట్లు బాధపడుచు కులమునకు వెఱచి తల్లి యీపాపమున కొడికట్ట వలసి వచ్చుచున్నది. ఓ పాపపుకులమా! నీవెంత కరుణమాలిన క్రూర రాక్షసివిగా నున్నావు! ఈవఱ కెన్నిలక్షలమంది చక్కని శిశువులను నీపొట్టను బెట్టుకొన్నావు! నీవింకను నెంతకాలము శిశుకళేబరముల తోనే దేహము పెంచుకొనెదవు? నీయాశ వాళి కెన్నటికైన నంత మున్నదా లేదా? ఓహిందూమహాజనులారా! చంపి పాఱవేయఁబడి యున్న లేఁతశిశువుల ముద్దుమొగములను జూచినప్పుడు మృగపక్ష్యా దుల మెడలు విఱిచి పచ్చినెత్తురు త్రాగు ఘోరకిరాతుల కయినను దయ పుట్టుచుండఁగా మీకేల యించుకయినను కనికరము పుట్టదు? మీహృదయములను భగవంతుఁ డినుముతోను రాతితోను జేసి నాఁడా? వారి తీవ్రసంతాపమును హృదయముల కెక్కింపఁగల మహానుభావుఁ డొకఁడున్నయెడల నినుపబొమ్మలును రాతిబొమ్మ లునుగూడ నిలువున నీరయి కరఁగిపాఱకుండవని నేను భావించె దను. మీకీహింసయంతయు జూచుటకు వినోదకరముగా నున్నదా? కూఁతులు నీళ్ళాడినప్పుడు పురుళ్ళుపోసి మనుమలను మనుమరాండ్రను పెంచవలసిన తల్లులను శిశుహత్యలకును గర్భస్రావములకును తోడు పడునట్లు చేయుట మీకు వేడుకగానున్నదా? చూచిచూచి శిశు వులను చంపలేనివారు పురుషశిశువులను మాలమాదిగల కియ్యఁగా గొప్పవాండ్ర కడుపునఁబుట్టి యుద్యోగములు చేయుచు నూళ్ళేల వలసిన యాబిడ్డలు మీకన్నులముందఱనే వీధులలో పెంటలుతుడు చుచు ముఱికినీళ్ళెత్తుచు నీచపుపనులు చేయుచుండఁ జూచుట మీకు

కన్నులపండువుగా నున్నదా? ఆఁడుశిశువులను వేశ్యలపాలు జేయఁగా నుత్తమవంశమునందుఁ బుట్టి పతివ్రతాశిరోమణులు కాఁదగిన యా కన్నియలు కన్నవాండ్రతో వ్యభిచరించుచు గర్భకట్టుకొని యింటింట నాడవలసినవారగుచుండఁగా చూచుట మీకు నేత్రోత్సవముగా నున్నదా? వేసినమందులు వికటించి కడుపులోనున్న పిల్లలతోడిపాటుగా తల్లులుకూడ నెందఱు స్వర్గస్థలగుచుండలేదు? ఇవి యన్నియు మీకు పుణ్యకర్మలుగానె తోఁచి పునర్వివాహ మొక్కటి మాత్రమే మీమనస్సులకు పాపకర్మముగా తోఁచుచున్నదా? ఇవి యన్నియు మీరు పునర్వివాహము నంగీకరింపక పరలోకమునం దనుభవించుటకయి కూడఁబెట్టుకొనుచున్న దుష్ఫలములే సుండీ.

ఇప్పటి మనదేశపు శిక్షాస్మృతిలో గర్భపాతములును శిశుహత్యలును నేరములని యేర్పడియుండుటచేత నేరములను పట్టుకొనుటకయి నియమింపఁబడియున్న రాజభటులు కొన్ని సమయములయందు లంచములు పుచ్చుకొని భాగ్యవంతులను వదలిపెట్టుచు వచ్చినను ధనదానముచేత వారిని తృప్తిపఱుపలేని నిర్భాగ్యురాండ్రయిన విధవలనైనను కొంతమందిని రచ్చకీడ్చుచున్నారు. అపరాధము ఋజువుపడినపక్షమున గర్భస్రావముల నిమిత్తమయి మందుల నిచ్చిన వారికిని పుచ్చుకొన్న వారికిని తోడుపడిన వారికినికూడ శిక్ష కలుగుచున్నది; అదేప్రకారముగా శిశుహత్యలు చేసినవారికిని చేయించిన వారికిని సహాయులైన వారికినికూడ క్రూరశిక్షలగుచున్నవి. కులము త్యజింపలేక దానియందలి యభిమానముచేత తమకడుపున పుట్టినబిడ్డలను సహితము దయమాలి చంపుట కొప్పుకొన్న యనాథలను మాలవాండ్రచేత నురితీయించునప్పు డామాలవాండ్రకును దుఃఖము పొరలివచ్చి కన్నులనీరు కాలువలు గట్టుచుండఁగా కులము

వారికి సంతోషకరముగా నున్నదా ? ఈ నేరములు చేసినవారు మాత్రమేకాక నేరముచేసిన స్త్రీనువిచారింపఁబడినప్పుడును మూల నున్న నిరపరాధులగువారుకూడ సభల కీడ్వఁబడి యవమానమును, మానహాని యపకీర్తియు పొందవలసినవారగుచున్నారు. ఒకవేళ నేరము ఋజువుపడక వ్యవహారము తేలిపోయినను దానిని తప్పించుకొని బయలుపడుటకై చేయవలసిన రహస్యవ్యయములమాట యటుండఁగా రాజసభల కెక్కి నలువురనోళ్లలోను పడి నిర్దోషులయిన తల్లిదండ్రులు మొదలయిన వారును న్యాయప్రమాణముల నొంది నిందలపాలయి యెప్పుడును పదిమందిలో తలయెత్తుకొని తిరుగలేనివారగుచున్నారు. ఈ యపకీర్తికి వెఱచి మందులు మాకులు తెచ్చి యియ్యలేక కడుపు వచ్చినదని తెలియఁగానే తమ విధవపుత్రులకే విషముపెట్టి కడతేర్చిన తల్లిదండ్రు లెంతమంది యున్నారుకారు ? చిరకాలాచారమహిమచే పాపకార్యమని భ్రమించిన ధర్మకర్మమును నివారించుటకయి మంద భాగ్యులయిన బంధువులు ప్రత్యక్షపాతకములయిన యెన్ని ఘోరకృత్యముల కొడిగట్టి వంశపారంపర్యమువఱకును తెఱుగని పాపమును మూట కట్టుకొనుచున్నారు ? బాలవితంతువులకు వివాహములేని యీఘోర దురాచారమువలన నేకదా దోషముచేసిన వారటుండఁగా నిర్దోషులయిన బంధువర్గమునకుకూడ మానహానియు రాజదండనమును నిష్కారణముగా కలుగుచున్నవి.

వివాహములులేక చెడి వెలిచవులు మరిగిన బాలవిధవలతోడి సహవాసదోషముచేత గృహములనుండు పుణ్యస్త్రీలు సహితము పలువురు భర్తలుండియు జారకాంతలు ప్రవర్తించి చెడిపోవుచున్నారు. లోకములో సామాన్యముగా చెడునడతలఁ బ్రవేశించువారితరులను

సాధ్యమయినంతమందిని తమతో సమానులనుగాఁ జేసికొని తమతప్పు నందలి లాఘవమును తగ్గించుకొనుటకయి చూచుచుండుట సహజ గుణము. ఆప్రకారముగానే దుర్వృత్తియందు ప్రవేశించిన వితంతువులు తమనేరము మాసిపోవుటకయి తమప్రావీణ్యమునంతను జూపి సాధ్య మయినంతవఱకు మగవాండ్రను సహితము జారత్వమునఁ బ్రవేశపెట్టి, తాచెడ్డకోతి వనమెల్లను జెఱచిన దన్నట్లు చేతనయినంతవఱకు కంద ఱిని తమవంటివారినిగాఁ జేయుచుందురు. ఈ పని కనుకూలముగా సమస్తమును మనచేత చేయించువాఁడు భగవంతుఁడే కనుక మన మేమిచేసినను దోషము లేదన్న మిట్టవేదాంతమును తాము ముందుగా నేర్చుకొని యనుష్ఠించుచు పరులను భ్రమింపఁజేయుటకయి పయికి జపతపములఁ జేయుచు మేకవన్నె పులులవలెనుండి జారత్వము రుచి పడ్డ వితంతువులు కొంద ఱింటనున్నవారు పతివ్రతలుగానున్నచో తమ పయి మాటలు సాగవనియు తిన్నఁగ తప్పుపట్టుచుందురనియు నెంచి తాము నేర్చుకొన్న వేదాంతమునే సమయముచూచి మనసుల కెక్కు నట్లుగా నింటనున్న పుణ్యస్త్రీలకుఁగూడ నుపదేశించుచు చిరబోధ వలన మనస్సులకు నాటించి వారినిగూడ తమమార్గమునకే దింపు చుందురు. సీటిబొట్టువంటి మృదుపదార్థము విడువక పడఁగా పడఁగా రాతివంటి కఠినవస్తువులే క్రమక్రమముగా సీలుచుండఁగా తోడి వారల దుష్టోపదేశములు వినఁగా లక్కవంటి స్త్రీలమనస్సు కరుఁగకుండునా? ఈప్రకారముగా పుణ్యాంగనలలో నొకరినిజూచి యొకరు పాడయినవా రసంఖ్యముగా నున్నారని మనలో నెఱుఁగనివా రెవరు? అప్పుడొక్కతె నీవు ఱంకుచేసితి వని రెండవదాని నాక్షేపిం చినచో మరల దానిచేత నామాటయే తాను ననిపించుకోవలసివచ్చు నని కుక్కిన పేనులాగున నోరు మూసికొని పడియుండవలసి వచ్చును.

అందుచేత జారత్వము పుణ్యస్త్రీలలోను నిరంకుశముగా చెల్లుచు సమస్తానర్థములకును మూలమగుచున్నది; కాబట్టి బాలవితంతువులకు వివాహములేని యీ క్రూరాచారమే మగఁడుగల వారినికూడ చెడు మార్గమున దింపుటకుఁ గారణమగుచున్నది.

ఒక్కొక్కపురుషున కొక్కొకస్త్రీ భార్యగా నుండవలెనని యుద్దేశించి భగవంతుఁ డించుమించుగా స్త్రీపురుషులను సమాన సంఖ్య గల వారినిగానే సృజియించి యుండుటచేతను, మనదేశములో సాధారణముగా లెక్క కెక్కువగానుండు స్త్రీలు బాల్యములోనే విధవలయి భార్యాత్వమున కంగీకరింపఁబడక వ్యర్థురాండ్రుగానుండుటచేతను, భార్యలు పోయినవారుగూడ మరల కన్యలనే వివాహము చేసికొనవలసినవారగుచుండుటచేతను, సంఖ్యాతీతులయిన పురుషులు వివాహములుకాక బాధపడుచుండుటకును వారు మదనవేదనకు తాళజాలక వ్యభిచారమునందుఁ బ్రవేశించి రోగములు తగిలించుకొని దేహములు చెడఁగొట్టుకొనుటకును సాంసారికస్త్రీలను బ్రయత్నము చేసి చెఱుపుటకును కారణమగుచున్నది. ఈహేతువుచేత వివాహమున కర్హురాండ్రయిన స్త్రీలసంఖ్య మిక్కిలి తక్కువయయి పురుషులనేకులకు వేగిరము వివాహములు కాకపోవుటచేత వారు మూడేండ్ల పిల్ల దొరకిన చాలునని యెంత సొమ్మయినను వెచ్చించి భార్యలను గొనుటకు సిద్ధపడుచున్నారు; వారియాత్రమును జూచి యాశాపిశాచగ్రస్తులయిన తల్లిదండ్రులు ధర్మమును మఱచి రాక్షసకృత్యమని వెఱవక ధనమున కాశపడి తమపుత్రికలను వృద్ధులకును దరిద్రులకును వ్యాధిగ్రస్తులకును వికలాంగులకును దయావిహీనులయి విక్రయించి కడుపున పుట్టిన పసిబిడ్డల గొంతుకలు కోయుచున్నారు. చిన్నప్పటినుం

డియు పెంచి పెద్దవానినిజేసి విశ్వాసముచేత తమ్ముఁజేరవచ్చిన పిట్ట లను తమపొట్టకయి గొంతుకలుకోసి చంపు కిరాతులకును పిత్రాకారమున నవతరించిన యీకిరాతకులకును, భేదమం తగా లేకపోయినను తమకడుపునపుట్టిన బిడ్డల నిర్వికారముగాఁ జేసి నరమాంసవిక్రయము చేయునొల్లని యాకిరాతులే వీరికంటె సహస్ర గుణముల మంచివారని చెప్పవచ్చును. ఓకులజనులారా! స్త్రీపునర్వి వాహమును మానిపి జ్ఞానములేని ఘాతుకమృగములతో నయినను కననిబలని యీ స్వజాతిహింసను మాని వగోబ్లో ప్రోత్సాహకులుమట విరాకులగౌరవమున కర్హమయిన పనిగానే తోఁచుచున్నదా ?

ఇంతేకాక వయస్సులములో భార్యావిహీనులు కానటసిం చిన పురుషులు వితంతువివాహములు లేకపోవుటచేత తా మెదిగిన స్త్రీలను వివాహమాడ లభింపక చిన్నపిల్లలనే పెండ్లి యాడవలసినవా రయి వారెదిగి కాపురమునకు వచ్చునంతవరకును కామబాధకు సహించి యుండలేక వ్యభిచారమునకు దిగి సుఖరోగముల పాలయి తాము చెడుటయేకాక భార్యల దేహములనుగూడ చెడఁగొట్టియు, ఈడేరని పిల్లలకే గర్భాధానము చేయునప్పు డొందఱిపెట్టి యేడుపులతోను పెడబొబ్బలతోను శోభనగృహమును దుఃఖమందిరముఁజేసి తరువాత పెక్కుబాధలను పొందియు, బహుకష్టముల ననుభవింపవలసినవా రగుచున్నారు. చిన్నతనపు మగుటచేత రెండవ పెండ్లిభార్యలు గృహ కృత్యములు చక్కఁబెట్టుకొనుటకు చేతఁగాక యిల్లు పాడుచేయుదురు; ముసలిభర్తలకును పడుచుభార్యలకును మనస్సెప్పుడును కలియక తటుముగా యౌవనవతులయిన యాభార్యల కౌఁగిలింతలు ముది భర్తలకన్న మంచపుపెట్టెలకే యధికముగా లభించుచు పెక్కుచోట్ల

అంకుచేత జారత్వము పుణ్యస్త్రీలలోను నిరంకుశముగా చెల్లుచు సమస్తానర్థములకును మూలమగుచున్నది; కాబట్టి బాలవితంతువులకు వివాహములేని యీ క్రూరాచారమే మగఁడుగల వారినికూడ చెడు మార్గమున దింపుటకుఁ గారణమగుచున్నది.

ఒక్కొక్కపురుషున కొక్కొకస్త్రీ భార్యగా నుండవలెనని యుద్దేశించి భగవంతుఁ డించుమించుగా స్త్రీపురుషులను సమాన సంఖ్య గల వారినిగానే సృజియించి యుండుటచేతను, మనదేశములో సాధారణముగా లెక్క కెక్కువగానుండు స్త్రీలు బాల్యములోనే విధవలయి భార్యాత్వమున కంగీకరింపఁబడక వ్యర్థురాండ్రుగానుండు టచేతను, భార్యలు పోయినవారుగూడ మరల కన్యలనే వివాహము చేసికొనవలసినవా రగుచుండుటచేతను, సంఖ్యాతీతులయిన పురుషులు వివాహములుకాక బాధపడుచుండుటకును వారు మదనవేదనకు తాళ జాలక వ్యభిచారమునందుఁ బ్రవేశించి రోగములు తగిలించుకొని దేహములు చెడఁగొట్టుకొనుటకును సాంసారికస్త్రీలను ప్రయత్నము చేసి చెఱుపుటకును కారణమగుచున్నది. ఈ హేతువుచేత వివాహమున కర్హురాండ్రయిన స్త్రీలసంఖ్య మిక్కిలి తక్కువయయి పురుషులనేకులకు వేగిరము వివాహములు కాకపోవుటచేత వారు మూఁడేండ్ల పిల్ల దొరకిన చాలునని యెంత సొమ్మయినను వెచ్చించి భార్యలను కొనుటకు సిద్ధపడుచున్నారు; వారియాత్రమును జూచి యాశాపిశాచ గ్రస్తులయిన తల్లిదండ్రులు ధర్మమును మఱచి రాక్షసకృత్యమని వెఱవక ధనమున కాశపడి తమపుత్రికలను వృద్ధులకును దరిద్రులకును వ్యాధిగ్రస్తులకును వికలాంగులకును దయావిహీనులయి విక్రయించి కడుపున పుట్టిన పసిబిడ్డల గొంతుకలు కోయుచున్నారు. చిన్నప్పటినుం

డియు పెంచి పెద్దవానినిజేసి విశ్వాసముచేత తమ్ముఁజేరవచ్చిన పిట్టలను తమపొట్టకయి గొంతుకలుకోసి చంపు కిరాతులకును పితృరూపమున నవతరించిన యీకిరాతపురుషులకును, భేదమెంతగా లేకపోయినను తమకడుపునపుట్టిన బిడ్డల నిష్కారముగాఁ జేసి నరమాంసవిక్రయము చేయునొల్లని యీకిరాతులే వీరికంటె సహస్రగుణముల మంచివారని చెప్పవచ్చును. ఓకులజనులారా! స్త్రీపునర్వివాహమును మానిపి జ్ఞానములేని ఘాతుకవ్యాపారములలో నయినను కనఁబడని యీ స్వజాతిహింసను మానవకోటిలో ప్రోత్సాహపఱచుట మీకులగౌరవమున కర్హమయిన పనిగానే తోఁచుచున్నదా?

ఇంతేకాక వయస్కాలములో భార్యావిహీనులు కాఁ దటస్థించిన పురుషులు వితంతువివాహములు లేకపోవుటచేత తా మెదిగిన స్త్రీలను వివాహముకూడ లభింపక చిన్నపిల్లలనే పెండ్లి యాడవలసినవారయి వారెదిగి కాపురమునకు వచ్చువఱకును కామబాధకు సహించి యుండలేక వ్యభిచారమునకు దిగి సుఖరోగముల పాలయి తాము చెడుటయేకాక భార్యల దేహములనుగూడ చెడఁగొట్టియు, ఈడేరని పిల్లలకే గర్భాధానము చేయునట్లు తొందరపెట్టి యేడుపులతోను పెడబొబ్బలతోను శోభనగృహమును దుఃఖమందిరముఁజేసి తరువాత పెక్కుబాధలను పొందియు, బహుకష్టముల ననుభవింపవలసినవారగుచున్నారు. చిన్నతన మగుటచేత రెండవ పెండ్లిభార్యలు గృహకృత్యములు చక్కఁబెట్టుకొనుటకు చేతఁగాక యిల్లు పాడుచేయుదురు; ముసలిభర్తలకును పడుచుభార్యలకును మనస్సెప్పుడును కలియక తఱుచుగా యౌవనవతులయిన యాభార్యల కౌఁగిలింతలు ముదిభర్తలకన్న మంచపుపెట్టెలకే యధికముగా లభించుచు పెక్కుచోట్ల

వారిసంభోగసుఖము పతులకన్న నుపపతులకే విశేషముగా లభించు చుండును. ఈప్రకారముగా చెప్పుచుఁ బోయినచో స్త్రీపునర్వివాహము లేకపోవుటవలన మనదేశమునకు మూడుచున్న కీడులనంతముగా నున్నవి. న్యాయదృష్టిచేత విమర్శించి చూచువారి మనస్సులను స్త్రీపునర్వివాహమునకు సుముఖములనుగా జేయుటకీ చెప్పినవే చాలి యుండును గనుకను, ధర్మదృష్టి లేక యాచారమే ప్రధానమని భల్లూకపుపట్టు పట్టి కూరుచుండువారిని సమాధానపఱుచుటకయి లక్షయుక్తులు చెప్పినను కార్యము లేదు గనుకను, ఈనష్టపరంపరను పెంచి చెప్ప మానుకొనియెదను.

ఇంతవఱకు చెప్పిన ప్రకారముగా దుష్ప్రవర్తనమునందుఁ బ్రవేశింపని బాలవిధవలు పలువురున్నను వారిబ్రతుకు సహితము విరామములేని దుఃఖపరంపరతోనే నిండియుండి మిక్కిలి శోచనీయముగా నుండుననుటకు సందేహము లేదు. వారి ప్రేమకంతకును ముఖ్యాస్పదుఁడయిన ప్రాణనాయకుఁ డీలోకమును విడిచి పోయినందున వారు సుఖపడి మఱుఁగుచొచ్చుటకీప్రపంచములో నాధార మేదియు లేదు. దుఃఖబహుళమయిన యీలోకములో వివాహబంధము వలని సుఖ మనుభవించునప్పుడే స్వగృహము భూతలస్వర్గమువలె నుండును. అదిలేనప్పుడు దివ్యమందిరములు మహారణ్యసదృశములుగా నుండి జీవనమే దుర్భరముగా నుండును. లోకములో మనుష్యుల సుఖమంతయు నితరేతర సంబంధమువలనను, అన్యోన్యసాహాయ్యమువలనను, పరస్పరబాంధవ్యమువలనను, కాని యెవ్వరిసంబంధమును లేకయేకాకిగా నుండువాని కేసుఖమును లేదు. ఈ పరస్పరసంబంధములకును ప్రజాభివృద్ధికిని యోగక్షేమములకును సుఖసంతోషములకును

నిదానమయినది వివాహబంధము. వివాహబంధమువలననే భార్యలు, భర్తలు, తల్లులు, తండ్రులు, అత్తలు, మామలు, బావలు, మఱఁదండ్రు, కొడుకులు, కూఁతులు మొదలయిన సుఖావహమగు బంధువర్గమంతయు నేర్పడును. వివాహబంధమువలననే స్త్రీపురుషు లొక్క దేహమయి, ఒకరినొకరు ప్రేమించుచు, ఒకరినొకరు సుఖపెట్టుచు, ఒకరినొకరు గారవించుచు, ఒకరికొకరు తోడుపడుచు, ఆరోగ్యదశయందును రోగసమయమునందును, సుఖకాలమునందును కష్టకాలమునందును, ఐశ్వర్యస్థితిలోను దారిద్ర్యదశలోను, యావజ్జీవము నెడఁబాయక సుఖంచుచుందురు. వివాహబంధమునకు బద్ధులయిజీవించునప్పుడే స్త్రీపురుషుల కెడతెగని మైత్రికలిగి, నీతియు గుణసంపదయు వృద్ధిఁబొంది, దైవభక్తి హెచ్చి పాపభీతి యుదయించి, సత్ప్రవర్తనము కలుగును. వివాహబంధమువలన పురుషునకు సంసారభారము మీఁదపడి దుర్వృత్తి కవకాశము లేక కుటుంబభరణము నిమిత్తమును పుత్రాదుల విద్యాభివృద్ధుల నిమిత్తమును పాటుపడవలసినట్లే స్త్రీకిని గృహకృత్యనిర్వాహణము పతిశుశ్రూష శిశుపోషణము మొదలయిన పనులు పయిఁబడి శుష్కకలహములకును పరదోషకథలకును నవకాశము లేక పాతివ్రత్యమును మంచినడవడియు పట్టుపడును. దిక్కులేనివారికిని దిక్కుకలుగుటయు వార్ధకమునందును భరణరక్షణములు గలుగుటయు వివాహబంధమువలనఁ గాక మఱిదేనివలనఁ గలుగును? వివాహబంధమే లేనియెడల స్త్రీపురుషుల పరస్పరసంబంధమును ప్రేమానుబంధమును లేక శిశుపోషణము జరగక బిడ్డల విద్యవృద్ధికాక కాలక్రమమున మనుష్యులు మృగప్రాయులు కారా? ఏకాకిత్వముచేత దేహమునకును మనస్సునకును తగినంత పనిలేక పాపచింతనలు గలిగి మనుష్యులు పాపకార్యములయందు తగులుకొనరా? మగనితోను

పుత్రులతోను నున్నప్పుడు కష్టములువహితము నిరుత్సాహమును నిరాశను కలుగనీయక ధర్మమార్గమున నడిపించుటకును, భగవద్భక్తిని వృద్ధిచేయుటకును, శాంతము ధైర్యము మొదలయిన వానిని నేర్పుట కును సాధనము గును. పుత్రాదుల సంరక్షణము నిమిత్తమును విద్య నిమిత్తమును తను కడుపుకట్టుకొని నకలశ్రమలకును లోనయినను తల్లు లెంతమంది లోకములో తమవంటి ధన్యురాండ్రెవ్వరును లేరని సంతోషించుచున్నారు? పుత్రులతోఁగూడి యనుభవించు సుఖము ద్విగుణముగా కనఁబడును; కష్టము సగము తగ్గినట్లుండును. అప్రయో జకుఁడయినను దరిద్రుఁడయినను మగనితోఁగూడి సంసారసుఖ మనుభవించునప్పుడు పట్టును కష్టములుండి మహారణ్యమధ్యముగా నున్నను గృహము స్వర్గమువలెనే యుండును. మగఁడొకఁడుండి నయిన మఱియేవి లేకపోయినను, అలోపము లేవియు కనఁబడవు; అన్నియునుండి మగఁ డొక్కఁడు లేకపోయెనా లోకములోని వన్నియు లోపములుగానే తోఁచును. మగఁడున్నయెడల భార్య మానమును కాపాడును; కుటుంబమును పోషించును; గౌరవమును కలుగఁజేయును; అవి యేవియు లేకపోయినను పతిపుత్రాదుల సమా వేశమే స్త్రీకి సంతోషజనకముగా నుండును; ప్రణయకలహములు సహితము మనోహరముగా నుండును. భర్త లేనియెడల స్త్రీ తన్నొరు లవమానపఱిచినయెడల నెవ్వరితోఁ జెప్పుకొని దుఃఖశాంతి పొందును? కష్టములు వచ్చినప్పుడు తానెవ్వరిమఱుఁగు చొచ్చును? మనోవ్యాకులత కలిగినప్పుడు తన్నుఁ జేరఁదీసి యాదరించువారెవ్వరు? తనమనస్సు దుర్విషయములమీఁదికి పోయినప్పుడు బుద్ధిచెప్పి మర లించువా రెవ్వ రుందురు? కార్యాకార్యవిచారమునందు సంశయము కలిగినయెడల మనసిచ్చి యాలోచన చెప్పువా రెవ రుందురు? తన

రూపమును గుణసంపదను జూచి మెచ్చుకొనువా రెవరుందురు? భర్తృవియోగమువలన స్త్రీల కిటువంటిసుఖములన్నియు పోయి బహు కష్టము లాశ్రయించినప్పుడు కులమయినను వారిని మఱింత హింస పెట్టుటకు సిద్ధపడునే కాని వారియెడల లేశమయినను కనికరము పూని దుఃఖనివారణమునకు సాధనమును జూపకున్నది. పతి పోయిన యుత్తర క్షణమునుండియు సమస్తసుఖములకు నాధారభూతమయిన యీ ప్రపంచము వారిపాలిటికి బహుళదుఃఖప్రదముగా మాఱి భారముగా కనఁబడుచుండును. నొసట కుంకుమబొట్టు పోయిలోని బూడిదబొట్టుగా మాఱుచున్నది; చేతుల బంగారుకంకణములు రాగిపట్టెలుగా మాఱుచున్నవి; మెడలోని ముత్యాలహారములు తులసిపూసల పేరులుగా మాఱుచున్నవి; అమూల్యములయిన సరిగంచు పట్టుచీరలు చలువలేని పనికిమాలిన ముదిగుడ్డలుగా మాఱుచున్నవి; పట్టెమంచములమీఁది మెత్తపరుపులు కటికినేలను తాటిచాపలుగా మాఱుచున్నవి; పిండి వంటలతోడి షడ్రసోపేతములయిన భోజనము లుప్పుడుపిండిగా మాఱుచున్నవి. మనుష్యులు నడుమ పెట్టిన యలంకారములను మాత్రమే కాక భగవంతుఁడు పుట్టుకతోనే దయచేసిన నల్లని నిడుదశిరోజముల నెడి యమూల్యాలంకారములనుగూడఁ దీసివేయించుట సుందరుల కెంత సంతాపకరముగా నుండును? చిన్నప్పటినుండియు చమురు రాచి పెంచుకొని నిత్యమును దువ్వుకొనుచు పువ్వులు ముడుచుకొనుచు ప్రాణముతో సమానముగాఁ జూచుకొనుచున్న తలవెండ్రుకలను మంగలివాని కత్తికత్తుల కొప్పగించుటకంటె మానవతుల కొక్క సారిగా తలకొట్టివేయుటయే యుత్తమముగా తోఁచదా? గతదినము వఱకును మూడుపూటలను కడుపునిండ సుఖభోజనముచేయువానిని ప్రాణము శోషిల్లునట్లుగా మూడుజాముల కన్ని మెతుకులువేసి మాడ్చి

జీవచ్ఛవముగా నుంచుట యెంత దుఃఖకరముగా నుండును! పెండ్లి దినములలో తప్ప మంగళసూత్రము కట్టినవాని మొగమెప్పుడును మరల చూడకపోయినను లోకులు భర్తయని పిలుచువాఁడు కాలధర్మము నొందినంత మాత్రముచేత తైలాభ్యంజనాది సమస్తభోగములను మాన్పించి పసిబాలికను సహితము సమస్తసుఖములకును దూరముగా చేయుట యెంత పరితాపకరము! "పర్యంకశాయినీ నారీ విధవా పాతయేత్పతిమ్" అనుటవలన, ఆచిన్నది యొక్క-సారి మంచముమీఁద పరుండినా స్వర్గములోనున్న భర్త తలక్రిందుగా భూలోకమునఁ గూలునఁట! ఆముద్దరాండ్రకు పూర్వము తాము పెట్టుకొన్న నగలను చూచినను, కట్టుకొన్న బట్టలు చూచినను పరుండు మంచములు పఱుపులు చూచినను, మనస్సు దహించుకొనిపోయి దుఃఖము పొరలి పొరలి రాదా? తనయీడు సువాసినులు నగలుపెట్టుకొన్నను మంచిచీరలు కట్టుకొన్నను తమ బ్రదుకాప్రకారముగా కాలిపోయినదాయని మనస్సు బగ్గున మండుకొనిపోదా? తనతోడివారు శుభకార్యములయందు పేరంటములకుఁ బోవుచున్నను భోజనములకు పోవుచున్నను తానట్టి నోము నోచుకోలేదుగదాయని గుండెలు బ్రద్దలు కావా? తనతోడివారు బిడ్డలను కనిపెంచుచు మగనితో సంసారము చేయుచుండుట చూచినప్పుడును వారిసుఖమును తలఁచుకొన్నప్పుడును కడుపు పగిలిపోదా? భర్తలుపోయిన ముద్దరాండ్రెంత పిన్నవయసువారయినను పొరుగింట వివాహాది మహోత్సవములు జరుగుచున్నప్పుడుకూడ పోయి వేడుకచూచుటకు నోచుకోలేదుగదా? పొరుగింటదాఁక పోనేల? తమయింట నేశుభకార్యము జరుగుచున్నను నలుగురితోను కలిసి సంతోషముగా తలయెత్తుకొని తిరుగుటకు వల్లకాక యెవరికంటను బడక దేవ డింత చేసెనుగదా యని యేడ్చుచు

సేమూలనో యొదిగి పడియుండవలెను. వేయిమాట లెందుకు? లోకములో పండుగులు మొదలయినవి వచ్చి యుండఱకును సంతోష దినములుగా నుండునవి యెల్లను వారికి దుఃఖదినములుగా నుండును. పెద్దలయిన తల్లిదండ్రులు గదిలో పరుండి సుఖమనుభవించుచున్నప్పు డీవల పంచను జేరి యొక్కరాత్రి విధవలయిన జవ్వనులు పడు క్షోభ యింతంతని యెవ్వరికి చెప్పశక్యమగును? మగఁడుపోయిన కూఁతురు తమ పడకగది గుమ్మమువెలుపల కటికినేల చాపమీఁద నొంటిగా కూలి తనదుర్గతి దలఁచుకొని విలపించుచుండఁగా దయాలేశముగల జననీ జనకులకు రాత్రులు తాము లోపల పట్టెమంచములమీఁద శయనించి నిర్విచారముగా సుఖ మనుభవించుటకంటె మరణము నొంది స్వర్గసుఖ మనుభవించుట యుక్తముగా తోఁచదా? పుట్టినప్పటినుండియు ప్రేమతో పెంచి తనుప్రాణములకంటె నెక్కువగాఁ జూచుకొనుచున్న తల్లిదండ్రులకు జీవితేశ్వరులను పోఁగొట్టుకొని దుఃఖసాగరమునందు మునిఁగి తమపాలఁబడ్డ ముద్దుకూతుఁల నాదరించి పతిశోకమును మఱచునట్లు చేయుటకు మాఱుగా కరుణమాలి క్రూరమయిన కులాచారమునకు దాసులయి వారిని విరూపము నొందించి యావజ్జీ వము తీఱనికష్టములపాలు చేయవలసివచ్చుట యెంత మనస్తాపకర ముగా నుండును! అట్టియనాథకాంతల దుఃఖములను జూడ నోచుకొన్న యత్తమామలకును బావమఱఁదులకును తక్కిన బంధువర్గమునకును కలకాలము దుఃఖము కలుగుచుండదా? మన దేశములో విధవాధర్మము లేవో కొంచెము మనస్సునం దుంచుకొనుఁడు.

"శ్లో॥ రండానాం సతతం ధర్మః ఉదయా త్పర మేవహై।
నిత్యస్నానం తతో బంధు సన్నిధానేవ సంతతం॥

శ్లో॥ నివాసో గుహ్య సంభాషా సచ్ఛిద్రహాసా సదాశ్రయః।
చతుర్థకాల భుక్తిశ్చ దశమీరాజ్య వర్జనం॥

శ్లో॥ సుగంధ వస్త్రాలంకార గీతాదీనాం విసర్జనం।
తాంబూలాంజన పుష్పాణాం సతతం దూరవర్జనం॥

శ్లో॥ ఖట్వాతల్పాది శయనం శరీరోద్వర్తనం ప్రజం।
అభ్యంజనం చోష్ణ వారి స్నాన మాందోళికాదికం॥

శ్లో॥ పునా న్యాని సర్వాణి వస్త్రాణి న చ కామయేత్।
మురాలాపం సష్టంతాం నిగ్రహానుగ్రహార్థతాం॥

శ్లో॥ పుత్రాధికార కళ్యాణ యజ్ఞ కార్యాది సత్క్రియాం।
కుర్వతీ తాపసీయా సా తత్స్వేన గురుసంజ్ఞైః॥

శ్లో॥ క్షారంచ లవణం దివ్యం మధురం సూపకం తథా।
వర్జయిత్వా విశేషేణ నిత్యం కటుక మేవచ॥

శ్లో॥ ప్రాతస్నే గోభుజస్నే న్నిత్యం గ్రామార్థే న వసేవనా।
ఆపత్తిషి కర్వంతి మేవం కాలం ప్రయత్నతః।
ప్రాణవృత్తిం ప్రకుర్వీత వయస శ్చరమే గతిః॥"

అను కపిలస్మృతి ప్రకారముగా భర్తృకాలముచేసిన యువతి పెరుగు త్రాగ కూడదు; పాలు త్రాగ కూడదు; సుగంధము దరికి చేరనీయఁ గూడదు; మంచిబట్ట కట్టుకోఁ గూడదు; అలంకారము కూడదు; పాట వినఁ గూడదు; తాంబూలము వేసికొనఁ గూడదు; కాటుక పెట్టుకొన రాదు; పుష్పములను దగ్గఱకు రానీయరాదు; మంచము పరుపు మొదలైన వానిమీఁద పరుండఁ గూడదు; శరీరము నలుగు పెట్టుకోరాదు; తల యంటుకోరాదు; వేడినీళ్ళు పోసికోరాదు; పల్లకి బండి మొదలైనవి

యెక్కఁగూడదు; ఇటువంటి ఇతరములైన సమస్తవస్తువులను కోర రాదు; ఒకరిమీఁద దయచూపరాదు; కోపపడఁగూడదు; పుణ్య కార్యములు చేయఁగూడదు; శుభకార్యములు చేయఁగూడదు; ఈ కార్యములలో నేవిచేసినను తల్లిదండ్రులచేతను బంధువులచేతను దెబ్బలు తినవలెను; ఉప్పు తినఁగూడదు; పులుసు తినఁగూడదు; తీపి తినఁగూడదు; పప్పు తినఁగూడదు; ఒకరును చేసిన కారమును మాత్రమే తినవలెను. అఱువదిసంవత్సరములు వచ్చువఱకు నొక్కపూట సగముతిండి తినవలెను. ఇదిగాక "రండాపాకం సదా త్యాజ్యం ప్రవదంతి మనీషిణః" శ్రాద్ధాదులయందును శుభకార్యములయందును మాత్రమేకాక యితరసమయములయందును విధవచేసిన పాకము నెవ్వరును భుజింపరాదు. లోకములో నాఁడుపుట్టుక పుట్టి మగనిని పోఁగొట్టుకొని కలకాలము నిటువంటిబాధలు పడుచుండుటకంటె నొక్కసారిగా మరణమునొందుట యెంతహాయిగా నుండును? దొరతనమువారు క్రూరకృత్యమని తలఁచి సహగమనమును మాన్పించి లోకోపకారము చేసినను భాగ్యహీనలగు విధవల దురవస్థలను తలఁచుకొనఁగా వారి పాలిటి కది యొక యపకారమే యయినదనియు వారి కందువలన నుద్దేశించిన మేలు కలుగలేదనియు నేను భావించెదను. ఈప్రకారముగా బ్రతికియున్నంత కాలమును సమస్త సుఖములను బాసి నిరంతర దుఃఖమును తీవ్రమనోవేదనను పొందుచుండుటకంటె బ్రతికియుండఁగానే చచ్చిన శవముతో కట్టిపెట్టి కాల్పఁబడికాని పూడ్వఁబడికాని గడియలో ప్రాణవియోగము పొంది యీబహువిధ దుఃఖముల నుండి విముక్తి పొందఁగాంచుట యెవరి కభ్యర్థనీయముగాఁ గనఁబడదు? ఇట్లు చెప్పుటచేత సహగమనమును మాన్పిన ఫలము స్త్రీలకు కలిగించుటకై పునర్వివాహములను తగినంత ప్రోత్సాహపఱుప

వలయుననియు పునర్వివాహము చేసికొన్నంత మాత్రముచేత పెద్ద పులులవలె మీఁదఁబడి బాధింప జంకెలువేయు మతాచార్యుల యుపద్రవములనుండి యనాథబాలికల రక్షింపవలయుననియు నాయభిప్రాయమే కాని సహగమనము క్రూరకృత్యము కాదనికాని దానిని మాన్పఁగూడదని కాని నాయభిప్రాయ మెంతమాత్రమును గాదు. మనదేశములోని విధవలు పడు బాధ లివిమాత్రమే కావు. అనాధలయిన కాంతలు తమజీవనాంశమునకై భర్త బంధువులతో తగవులు పడి దారిగానక న్యాయసభలలో వ్యాజ్యములకు దిగినప్పుడు భర్తలు ఋణము చేసి పోయి రనియు, పిత్రార్జితమయిన సొత్తు లేదనియు, ఉన్నది స్వార్జితమనియు, ఆసతులు వ్యభిచారిణులనియు, వాదించి దొంగసాక్షులను కుదిర్చి యప్రమాణములు చేయించి యసత్యములు పలికించి వివిధ మాయోపాయములు పన్ని వారిభరణము నెగఁబెట్ట యత్నింతురు. ఒకవేళ నాపురుషోత్తముల ప్రయత్నములు ఫలింపక భగీరథప్రయత్నముమీఁద నావిధవలకు న్యాయాధిపతి యొక్కపూట తిండికైనను చాలీచాలనట్టుగా తీర్పు చెప్పినయెడల దాని నపహరించుటకై యున్న సొత్తును బంధువులపేర వ్రాయించియు రాజభటులు వచ్చినప్పుడు తాము మొగము చాటువేసి సొత్తేమియు నగపడకుండ దాచియు, మాయవేషము లెన్నెన్నియో వేయుదురు. ఓహో! మగఁడు చచ్చి యేడ్చుచున్న యనాథల కొక్కపూటతిండికి చాలీచాలని జీవనాంశము నియ్యవలసి వచ్చునని వారి మగల భాగమునంతను వేసికొనియు మనవారు వితంతువులమీఁద లేనిపాపములు మోపి యెటువంటి యకృత్యములకు లోనయి తాము సుఖపడఁజూచుచున్నారు! ఇటువంటి గతిమాలిన విధవలు పుట్టినిల్లుచేరి వారియండను జేరి బ్రతుకవలసియుండును. తల్లిదండ్రు లొకవేళ తమ యనాథపుత్రికలను వీరై

నంత ప్రేమతోనే చూతురన్నను వదినెలును మఱదండ్రును వారి మీఁద తమకాప్రేమ యుండనేరదు గనుక పోయిన భర్తలనిమిత్తమై వారేడ్చునప్పుడెల్ల వారము లేక వర్జ్యము లేక నిందింపయింటిలో నేడ్చు చున్నదనియు దొంగయేడుపనియు, తిప్పలుపట్టుచు, వారిభరణమును కూడ తామే పుచ్చుకొని సుమారుజామునకు కిన్ని మెతుకులు వేసియు రాసెడు మ్రింగువని విసుగుకొనుచు ఒక్కపూట పెట్టెడు మెతుకు లకై యహోరాత్రములు విరామము లేకుండ యింటిపని యంతయుఁ జేసి యట్టిమైనవాండ్రచేతను రోఁతమాటలు పడుచు నెవ్వరే కాని కూఁతలు కూసినను తలయొగ్గి యూరకున్నను మఱింత బాధపెట్టుచు, వారిజీవనమును దుర్భరముగాఁ జేయుచుందురు. ఇంట నెవరికేవిపత్తు సంభవించినను విధవలే దానికి కారణమగుదురు. వీధిలోనికి ప్రయా ణమైనప్పుడు విధవముఖము కనఁబడినను విధవ యెదురుగా వచ్చినను దుశ్శకున మైనదని యెల్లవారును చెప్పుకొట్టుదురు. ఎంతో ప్రేమతోఁ జూచుచుండు సోదరులుసహితము నిద్ర లేచినతోడనే విధవతోడఁ బుట్టినపడుచు కనఁబడిన పాపమునను ప్రొద్దుననేలేచి విధవముండ ముగము చూచితిని. నేఁ డేమికీడు మూడునోయని చిరాకు పడు చుందురు. వారిని చూచినవారందఱును వారెంతో పాపము చేసినవా రని భావింతురు; ఈనిర్భాగ్యురాలు భార్యయయి మగనిని చంపినదని దూషింతురు. ఆహా! ఈలోకములో విధవలకు సుఖమన్నమాటయే యుండక వారిజీవనమే నిరర్థకమై వారు బ్రతికియుండియు చచ్చిన వారితో సమానులుగానే యుందురుగదా? ఓహిందూమహాజను లారా! పరులవలని బాధలకన్నలేక ప్రాణవల్లభులు పోవుటచేతనే దుర్వారదుఃఖములపాలయి కుమిలి కృశించుచు నెల్లవారికిని దయ నీయులు గాఁదగిన యనాథయువతులను కరుణించి యాదరించుటకు

మాఱుగా మీఁదిమిక్కిలి నిష్కరుణలయి పొట్టకు తిన్నగా మూఁడు పూటలను తిన్నంతయన్నమునైన పెట్టక సగము మాడ్చి చంపుచు గృహమునఁగల హీనమయిన కష్టపుపనియంతయు వారిమీఁదనే వేసి మీర నేకవిధముల బాములు పెట్టుచుండుటచేత నేగదా లోకములో దయను పురికొల్పవలసిన "విధవా" శబ్దము భాషలోని పదములలో నెల్లను కర్ణకఠోరమైనదిగా మాఱిపోయినది ! "విధవ" యను పేరుకంటెను నీచమయినదియు, అవమానకరమయినదియు రోషమును కలిగించునదియు, మన దేశములో మఱియొక పదమున్నదా? ఎంతనీచుని నయినను "విధవా" యని పిలిచినంతమాత్రమున మండిపడి వాఁడది యెంతో గొప్పతిట్టుగా భావించుకొని తిన్నామాట యన్నవానిని మ్రింగివేయఁ జూచుచున్నాఁడు. ఒకని "పశువా" యన్నను కొంతసహింపఁగలుగునుగాని "విధవా" యన్న నించుకయు తాళఁజాలఁడు. దీనినిబట్టి విధవలయవస్థ మృగములదానికంటెను మన దేశములో హీనమయినదిగా నున్నట్టు మీరూహించుకో వచ్చును. అయ్యో! ఇటువంటి సంతాపకరమయిన దశలో నిలిచి యనాథలయిన యబల లెంతకాలమునుండి మన దేశములో కన్నుల నీరుకార వెత కుడుచుచున్నారో కదా! కటకటా! ఈయనాథకాంతలకన్నుల నుండి వెలువడిన జలమంతయు నిలువ యుండినయెడల దేశమునందంతట నెన్నిబాష్పనదులు ప్రవహించుచు నెన్ని మహాసముద్రములేర్పడునో ! నిర్భాగ్య వితంతువులారా ! మీయాపదలు తలఁచుకొన్నచో నెటువంటి రాతిగుండెయయినను నీరుగా కరఁగకుండునా? పాపపువిధి మిమ్ము మఱియొకచోట పుట్టింపక యీహిందూదేశమునందు దయాశూన్యులయిన ద్విజులకడుపున నేల పుట్టించుచున్నాఁడు? మీరిందు జన్మింపక పక్షుల మెడలు విఱుచుకొని తిను కిరాతుల కడు

పునఁ బుట్టినను పునర్వివాహములు గలిగి కొంత సుఖపడుదురుగదా? ఈ దేశమున నగ్రవర్ణములవారిలో స్త్రీలయి పుట్టుటపాపము పగవారి కయినను గలుగకపోవునుగాక! ఓ మహాజనులారా! మీరొక్క నిమిషము పక్షపాతము మాని స్త్రీలయవస్థను సమబుద్ధితో విచారించి స్త్రీపునర్వివాహమున కనుజ్ఞ యిచ్చి శుద్ధమయి యుండిన మన యార్యకులమున కంతకు నపకీర్తికరముగా నున్న యీదురాచార కళంకమును బాపుకొని హిందువులనాథలను హింస పెట్టుచున్నారన్న యీనిందను సాధ్యమయినంత శీఘ్రముగా తొలఁగించుకొనుట కయి ప్రయత్నింపుఁడు. ఒకపురుషుఁడు తనజీవితకాలములో నెంతమంది భార్యలనయినను చేసికొనవచ్చును; ఒకస్త్రీ పసితనములో భర్తపోయినను యావజ్జీవమును మరల వివాహము చేసికొనఁగూడదు. కామముడిగి కాటికి కాళ్లుచాచుకొనియున్న ముసలివానికి సహితము భాగ్యహీనురాలయిన మూడేండ్ల పసికూనను వివాహమాడి యావజ్జీవము దానికొంపతీసి హింసింప ననుజ్ఞ యిచ్చి, మూడేండ్ల ముద్దరాలికి మగఁడు పోయినను బ్రతికియున్నంత కాలమును వివాహము లేక రూపమును యౌవనము నడవిలోఁ గాచిన వెన్నెలకాఁగా ప్రాణమున్నంత కాలమును దుఃఖపడవలెనని నిర్బంధించుట యేమిన్యాయము? ఏమి ధర్మము? విధవావివాహము మంచిదని జంకుమాని నిశ్శంకముగా బహిరంగముగా సభలలో చెప్పలేకపోయినను, కులమువారి యెదుట నొప్పుకోలేకపోయినను, గృహమునకు పోయి తన ముద్దుల కూఁతురు సంపూర్ణ యౌవనమధ్యమున ననాథయయి దీనముఖముతో శోకదేవత రూపము దాల్చి వచ్చినట్లు సుఖహీనయయి యింట మెలఁగుచుండఁగాఁ జూచునప్పుడును రూపమున రతీదేవిని మించెడి తన ప్రియసోదరి సంపూర్ణచంద్రబింబమును బోలెడు ముఖము వాడిపోయి

పోయిన భర్తకయి దుఃఖించుచు పుష్పపల్లవసమావృతమైన కోమలలత యకాలమునందు చీడపట్టి యెండఁబాఱినట్లుగా సుందరమువంటి యాంగములు శోషిల్లి వయఃపాకలమున శుష్కించఁగాఁ జూచునప్పుడును హృదయము పగిలి పాపపు పూర్వాచారమును నిందించి పునర్వివాహములను కోరనివాఁ డెవఁ డుండును? ఆలోచించఁగా లోకములో స్త్రీపురుషులు సమానముగా నుండుటయు, వయసు చెల్లి సుఖపడవలసిన కాలము పోకముందే పురుషుల కనేకులకు భార్యలు పోయినట్లే స్త్రీలకును భర్తలు పోవ తటస్థించుచుండుటయు, చూడఁగా పురుషులవలెనే స్త్రీలును పునర్వివాహము చేసికొనవలసినది భగవదిష్టమనియు ధర్మమనియు మీకు తేటపడుచుండలేదా? ప్రపంచములో స్త్రీలును పురుషులును సంఖ్యయందించుమించుగా సమానముగానే యున్నను, పురుషులు యుద్ధాదులవలనను సముద్రయాత్రలు మొదలయిన కష్టకార్యములవలనను సులభముగా నశింపవలసిన వారుగా నుండుట కనుక సామాన్యముగా పురుషులసంఖ్యకంటె కొంచెమధికముగా నుండును. దీనినిబట్టి విచారింపఁగా నొక్కపురుషుని కొక్కస్త్రీ యుండి వివాహసంబంధమువలన వారు పరస్పరసుఖ మనుభవింపవలసినవారనుట కరతలామలక మగుచున్నది కాదా? అట్లు లేకపోవుట వలన నొక్క స్త్రీలుమాత్రమే కాక మొత్తముమీఁద పురుషులును బహుబాధలకు లోనుగావలసిన వారగుదురు. మూఁడు నాలుగు సంవత్సరములక్రిందట గణించిన లెక్కప్రకారముగా మనహిందూదేశములో ౨౫,౨౮,౯౧,౮౨౧ జనులున్నట్టు కనఁబడుచున్నది. వారిలో ౧౨,౮౯,౪౧,౮౫౧ రు పురుషులు; ౧౨,౩౯,౪౯,౯౭౦ రు స్త్రీలు. ఆస్త్రీలలో నాలుగవవంతుకంటె నధికముగా ననఁగా ౨,౦౯,౩౮,౬౨౬ రు విధవలుగా నున్నారు. వారిలో తొమ్మిది సంవత్సరములకు లోపున

వయసువారు ౭౮,౯౭౬ రును, తొమ్మిది సంవత్సరములకు పయిఁబడి పదునాలుగు సంవత్సరములకు లోపలివయస్సులో నున్నవారు ౨,౦౭,౩౮౮ రును, పదునాలుగు సంవత్సరములు దాటి పందొమ్మిది సంవత్సరములకు తక్కువ ప్రాయములో నున్నవారు ౩,౮౨,౭౩౬ రును, మొత్తమిరువదిసంవత్సరములకు లోపలి యీడుగల బాలవిధవలే యాఱులక్షల యిఱువదితొమ్మిదివేల నొంబండ్రున్నారు. మనహిందూదేశములో ప్రతిసంవత్సరము నిన్నిలక్షల యనాధబాలికలు పతివిహీనలయి కలకాలమును తీఱని వెతల పాలగుచుండఁగా ప్రతిక్రియ చూడక యుపేక్షించి యూరకుండుట దయాలేశము గలవారికి ధర్మమగునా? భగవంతుసబిడ్డలై మన దేశమునఁ బుట్టిన యనాధబాలిక లింతమంది ప్రతిదినమును మనకన్నులయెదుట కన్నులనీరు వంతలధారగా కారనేడ్చుచు గతిలేక బాధ పడుచుండఁగా దయఁజూపలేని మనము సిగ్గులేక యేమొగము పెట్టుకొని మన విషయమయి దయచూపుమని భగవంతుని వేడుకోఁగలము?

ఆవంగతి యట్లుండనిండు. స్త్రీ పునర్వివాహములకు ప్రతిపక్షులుగా నున్నవారు విధవోద్వాహములు చేసిన వ్యభిచారము మానదనియు, వానివలన శిశుహత్యలకు మాఱుగా పతిహత్యలు జరుగుననియు, అతిప్రజాభివృద్ధి కలిగి దేశమునకు క్షామము సంభవించుననియు, మనము వివాహమాడినస్త్రీలు మన మరణానంతరమయినను మఱియొక భర్తతో కాపురము చేయుదురన్న మాటయే వినుట కసహ్యముగా నుండుననియు, వితంతువులు తమస్థితి కలవాటుపడి సుఖముసే యనుభవించుచున్నారనియు, ఒకభర్తను పొందిన స్త్రీపోడి సంభోగమున కెవ్వరు సంగీకరింపరనియు, గొల్లలు మొదలయినవారి

వలెనే యుగ్రవర్ణములవారిలోకూడ మాఱుమనువులు చేసినయెడల వారిగౌరవము పోవుననియు, వివిధములయిన యాక్షేపములను జేయుచున్నారు.

విధవావివాహములు నెలకొల్పినంత మాత్రముచేత వ్యభిచారము సంపూర్ణముగా నశించునని నేను చెప్పజాలనుగాని చాల వఱకు తగ్గునని మాత్రము దృఢముగాఁ జెప్పఁగలను. ఒకదోషమును మనము పూర్ణముగా నశింపఁజేయలేము గనుక సాధ్యమగునంత వఱకు దానిని తగ్గించుటకయి ప్రయత్నము చేయఁగూడదనుట సయుక్తికము కాదు. లోకములో నధర్మమెప్పుడును పూర్ణముగా నశించుట సంభవింపదు గనుక, బుద్ధిమంతులగువారు సాధ్యమయినంతవఱకు మేలును వృద్ధిఁబొందించుటకును కీడును తగ్గించుటకును సదా పాటుపడుచుండవలయును. రక్షకభటులు నేరములన్నిటిని పట్టుకోలేరు గనుక, ఆరక్షకశాఖనే తీసివేయవలెననుట యుచితముగా నుండునా? న్యాయాధిపతులు అన్ని వ్యవహారములలోను న్యాయమును కనుఁగొనలేరు గనుక దొరతనమువారు న్యాయసభలన్నియు నెత్తివేయవలెననుట బుద్ధిమంతులంగీకరింపఁదగి యుండునా? ఔషధమువలన సమస్తరోగములును కుదురుచుండలేదు గనుక వైద్యమెప్పుడును చేయింపఁగూడదనుట వివేకులు మెచ్చఁదగి యుండునా? జగత్తులో మనము చేయవలసిన పనులన్నియు శక్యమయినంతవఱకు కీడును తగ్గించి సుఖాభివృద్ధి చేయుటకొఱకే గనుక, మనము స్త్రీపునర్వివాహము నంగీకరించుటయు దోషనివారణమును సుఖాభివృద్ధి కలుగుటకొఱకే యయియుండవలెను. స్త్రీపునర్వివాహమును పునరుద్ధారణము చేయుటవలన నొక్క వ్యభిచారము మాత్రము పూర్ణముగా పోకపోయినను గర్భస్రావములును భ్రూణహత్యలును శిశుహత్యలును

పూర్ణముగా నశించిపోవుటకు సందేహములేదు. పుణ్యస్త్రీలకువలెనే వయసులోనున్న విధవలకును కామశాంతికయి న్యాయమయిన మార్గమును కనఁబఱిచినయెడల వారక్రమముగా వ్యభిచరింతురేని దొంగలను శిక్షించినట్లు శిక్షించి వ్యభిచారము నడఁచుటకు సాధ్యమగునేకాని మఱియొకవిధముగా సాధ్యముకాదు. ఆఁకలి గొనియున్నవారిని గొనిపోయి భోజనపదార్థములతో నిండియున్న యొకగదిలో పెట్టి తాళమువేసి న్యాయమార్గమున పాటుపడి సంపాదించి క్షుత్తుతీర్చుకొనుటకవకాశమియ్యక నిరోధించి వారు క్షుద్బాధకు తాళలేక యాగదిలోని యాహారపదార్థములలో నేదయిన భక్షించినచో వారిని దొంగతనమును చేసిరని దండించుట యెంత న్యాయముగా నుండునో, అట్లు దొంగతనమును మాన్పుట యెంతవఱకు సాధ్యమగునో మీరే యాలోచించుకొనుఁడు. అట్టిస్థితిలో పయినిర్బంధములను బెట్టి శిక్షించువారినే యందఱును క్రూరులందురు గాని దుస్సహమయిన క్షుత్తును తీర్చుకొనుటకయి యా భోజ్యపదార్థభక్షణము చేసిన వారి నెవ్వరును దోషులని దూషింపరు. కాఁబట్టి యీసంగతిని మీరు మనసునందుంచుకొని, కామపీడితులయియున్న యనాథయువతులను కాముకజనమధ్యమున వసించునట్లుచేసి కామశాంతికయి వారికున్న న్యాయమార్గమును నిరోధించి యందుచే వారక్రమమునకు దిగునట్లు చేసి తరువాత నయినను క్రమమయిన మార్గము చూపఁ బ్రయత్నించుటకు మాఱుగా వారిని శిక్షింతుమందురేని వివేకులయినవారు మిమ్మెట్టివారినిగా భావింతురో మీరే సమబుద్ధితో విచారించుకొనుఁడు. క్షుద్బాధవలె కామబాధ యంత నివారించుకొన శక్యముకానిదా యని మీరడుగవచ్చునుగాని పయినుండి యితరులవిషయమయి తేరగా మాటలు చెప్పుటకంటె కామనిగ్రహముచేయుట యౌవనదశలో

నెంత సాధ్యమగునో వివాహమును మానుకొని స్వవిషయములో ననుభవముచేత పరీక్షించిన పక్షమున మీకే స్పష్టముగా విశద మగును. విద్యావివేకములు గలిగి స్థిరచిత్తులని చెప్పఁబడుచు కొంత కాలము భార్యతో విషయసుఖము ననుభవించి సంతానముఁ బడసి వయసు చెల్లిన పురుషులే భార్యపోయినప్పుడు కామము జయింపలేక మూఁడేండ్లదానిని వివాహమాడి దానినిమిత్తమయి యింకొకఁడి కని పెట్టుకొని యుండవలసి వచ్చుచుండఁగా, ఇఁక మూఁడేండ్లప్పుడు ముండ లయి యదపాజ్ఞలులేక పెరిగి మూర్ఖురాండ్రగుటచేత నుచితానుచిత వివేకము లేనివారయి స్వభావచంచలలయి యౌవనమదముచేత దేహములు తెలియకుండు స్త్రీలకా యెల్లకాలము నింద్రియనిగ్రహము చేయుట శక్యమగును? పురుషులకంటె స్త్రీలకు కామ మెక్కువగా నుండునన్న మనపుస్తకములమాట యటుండనిచ్చి స్త్రీలకును పురుషు లకును కామము సమానముగానే యుండునన్న సత్యమును గూడ మాటుపఱిచి ప్రతిపక్షులవాదమునకు మిక్కిలి యనుకూలముగా నుండు లాగున పురుషులకన్న స్త్రీలకే తక్కువకామ ముండునని యంగీకరించి నను, అప్పుడుసహితము వితంతువివాహ మనావశ్యకమని యేర్పడ నేరదు. సోమయ్యకంటె సోమమ్మ కాఁకలి తక్కువ గనుక సోమమ్మను తిండిపెట్టక మాడ్చి చంపవలయునని మతిమంతుఁ డెవఁడు సాధింపఁదల పడును? అంతటి ధీమంతుఁ డొకఁడుండెనా సోమయ్యకంటె సోమమ్మకు కామము తక్కువ గనుక సోమమ్మను వివాహ మాడ నియ్యక బాధింపవలయుననియు నతఁడు సిద్ధాంత మేర్పఱుప సాహ సింపవచ్చును. కాఁబట్టి వితంతువులకు వివాహమువలన వ్యభిచారము పూర్ణముగా మానదని యేర్పడినను, స్త్రీలకు కామము తక్కువేయని యొప్పుకొన్నను, అధర్మ మెంతతగ్గిన నంత క్షేమకరము గనుకను బల

హీనలను సహితము వారు పొందఁదగినంత సుఖమును పొందనియ్యక హింసించుట న్యాయము కాదు గనుకను స్త్రీపునర్వివాహ మావశ్యక మని యేర్పడక తప్పదు.

మనపెద్దలు కొందఱు స్త్రీపునర్వివాహములు వ్యాపించినచో శిశుహత్యలకు మాఱుగా పతిహత్యలు జరుగునని భయపడుచున్నారు; కాని వారిమాటలంతగా నాదరణీయములు గావు. ఇతరులను పాడు చేసి తాము సుఖపడువారెవ్వరును తమవలన నపకారము నొందిన వారివిషయమయి భయపడుచుండుట సహజమే గనుక, మనవారి కిప్పుడు కలిగెడు భయమందువలన వచ్చినదేకాని నిజమయినది కాదు. ఈదేశమునందే కాదు ప్రతిదేశమునందును పరులను నిర్బంధపెట్టి తాము సౌఖ్య మనుభవించువా రా నిర్బంధము మానినయెడల కీడు మూడునని తలఁచుచునే యుందురు. కాని కీడు తొలఁగించుటవలన కీడుకలుగుట మాత్ర మెక్కడను లోకానుభవ విరుద్ధము. ఒక్క యీ హిందూదేశమునందు తప్ప తక్కిన సమస్తదేశములయందును స్త్రీ పునర్వివాహములున్నవి గదా! వానిలో నెక్కడ నయినను పతి హత్యలు జరుగుచున్నట్లు మీరు వినియున్నారా? ఏదేశముమాటో మన కేటికి? ఈ హిందూదేశములోనే మాఱుమనుములున్న గొల్లలు మొదలయిన వారిలోనే భార్యలు భర్తలను చంపుచున్న ట్లెప్పుడయిన మీకన్నిగోచర మయినదా? ఎవ్వరిలోనులేని భయము నిష్కారణ ముగా మీ కేల రావలెను? భార్య పోయినయెడల మరల వివాహ మాడవచ్చునని మీరు ప్రతిదినమును భార్యల నూరక చంపుచు న్నారా? ముసలిమగనికి పడుచుభార్యయు, రూపహీనునకు రూప వతియు, దరిద్రునకు మదవతియు, సంభవించినప్పుడు యౌవనవంతుని

రూపవంతుని ధనవంతుని సంపాదించుటకయి భార్య భర్తకు విషము పెట్టునన్న భయము మీబుద్ధికల్పితమే కాని మఱియొకటి కాదు. ఎంత తెలివిమాలినదయినను తాను ముందు మఱియొకభర్తను చేసికొని సుఖముగా బ్రతుకఁగోరినప్పుడు హత్యచేసి తనప్రాణము మీఁదికి తెచ్చి పెట్టుకొనునా? ముందు వివాహమాడఁదలఁచుకొన్న పురుషుని సాహాయ్యమయిన నక్కఱలేక యొకస్త్రీ విషాదులు సంపాదించి పతిహత్య చేయుటకు శక్తురాలగునా? ముందు తనకింతకు మంచివాఁడు తటస్థించినయెడల తనగతియు పూర్వపు భర్తతోడిదే యగునని తలఁపక యామెభర్తృఘ్నురాలిని వివాహము చేసికొనుట కెవ్వఁడైనను నొడఁబడునా? నరహత్య చేయుటకు పాపభీతి యుండదా? పాపభీతి లేకపోయినను మగనిని చంపి మఱియొకనిని వివాహము చేసికొనుటకయి యాకాలమునందు రూపవంతుఁడును ధనవంతుఁడును యౌవనవంతుఁడును దీర్ఘకాలపు బ్రహ్మచారిగానో యప్పుడు భార్య పోయినవాఁడుగానో యుండుట తటస్థించి యట్టివాఁడు హంతకురాలితో సమానమైన కులము వాఁడును శాఖవాఁడును భిన్నగోత్రుఁడును నయియుండి పెద్దవాఁడయి యామెను వరించుట సాధారణముగా సంభవింపఁదగి యున్నదా? వీనినన్నిటిని న్యాయబుద్ధితో నాలోచించినయెడల పతిహత్యల కవకాశము లేదని యీ యాక్షేపణము చేసెడివారికే తెలియవచ్చును.

ఇఁక స్త్రీపునర్వివాహమువలన మితిమీఱిన ప్రజాభివృద్ధియు కాటకములును దారిద్ర్యమును సంభవించునని భయపడువారి భీతిని మాన్పుటకయి కొంత ప్రయత్నింతము. ఈ యతిప్రజాభివృద్ధియు కాటకములును స్త్రీపునర్వివాహములున్న యితరదేశములకు వేనికిని

కలుగక యొక్క హిందూదేశమునకు మాత్రమే కలుగునా? మన హిందూదేశమునం దింకను కావలసినంత నేల సేద్యములేక బీడుగా పడియున్నది; అరణ్యములు కొట్టి బాగుచేయువారు లేక రోగజనకములై కొండవాండ్రకు మాత్రము వాసయోగ్యములయి బహుయోజన విస్తీర్ణము లయిన ప్రదేశము లనేకము లించుమించుగా ప్రతిమండలమునందును ఫలపఱచుకొను దిక్కులేక వ్యర్థముగా పడియున్నవి. మన దేశమునందలి వృత్తులును హస్తకర్మలును తగినవా రవలంబింపక యింకను మిక్కిలి హీనదశయందేయుండి ప్రజాభివృద్ధిని కోరుచున్నవి. మనదేశమునందు యౌవనదశయందున్న విధవ లందఱును వివాహములాడి సంతానముగాంచి పుత్రులతోను పౌత్రులతోను దినదినాభివృద్ధి నొందునంతటి భాగ్యమే మనదేశమునకు లభించినను, అప్పుడు సహితము వారందఱును పయిని చెప్పిన వ్యర్థముగా నున్న భూమినంతను ఫలమునకుదెచ్చి దేశమును మంచిస్థితికి తెచ్చి తాము సుఖపడుటకే సమర్థు లగుదురు. అంతేకాక యిప్పుడు మనదేశమునందు పండిన పంట లితరదేశములకు విశేషముగా నెగుమతి చేయఁబడుచున్న సంగతి యందఱు నెఱిఁగి యుందురు. ఇప్పుడున్న ప్రకారమే భూమి యుండి యభివృద్ధిలేక యిప్పటి ప్రకారముగా భూమి ఫలించుచున్నను మనదేశములోనిపంట యొక్కసారిగా జనసంఖ్య యిప్పటికంటె ద్విగుణమయినను వారికందఱికిని చాలియుండును. కాబట్టి ప్రజాభివృద్ధి కలిగి కాటకములు సంభవించి తాము తిండికిలేక చచ్చిపోదుమని భయపడువారు విధవోద్వాహమువలన తమకిప్పుడు వచ్చిన యుపద్రవము లేదని తెలిసికొని గుండెకుదిరి హాయిగా నిద్రపోవచ్చును. ఇఁకముందు పుట్టఁబోవువారు వసించుటకు స్థలములేక చచ్చిపోదురని భయపడుటకును వారినిమిత్తమయి యాసియాఖండ

ముసం దించుమించుగా నిర్మానుష్యమయి వాసయోగ్యము కాని భూమి కావలసినంత యున్నది. గనుక, ఆభయమునకు నవకాశము లేదు. ఈబుద్ధిమంతు లిప్పుడు విధవల మూలమున ప్రజాభివృద్ధి కలుగుచుండ లేదని సంతోషించుచున్నను దేశస్థితిని చక్కగా విమర్శించినచో వారియానందమున కంతగా నవకాశము కనఁబడదు. విధవలు పలువు రిల్లువిడిచి లేచిపోయి బహిరంగముగా నెవ్వరినో యుంచుకొని కని పెంచుచు ప్రజాభివృద్ధిని చేయుచునే యున్నారు. వీరుగాక యిల్లు వదలలేని వితంతువులును శిశుహత్యల నెన్నిటిని జేసినను కావలసినంత మంది కూఁతులను గొడుకులను గని వేశ్యలకును మాలమాదిగలకును నీచకులమువారికిని నిచ్చి సాధ్యమయినంత ప్రజాభివృద్ధిని చేయుచునే యున్నారు. ఇప్పుడును ప్రజాభివృద్ధి యేలాగునను మానలేదు గాని ముందు వితంతువివాహములే ప్రబలి సర్వత్ర వ్యాపించినయెడల నిప్పటివలె సంకరసంతానము వృద్ధిఁ బొందక న్యాయమయిన యోగ్యసంతానము వర్ధిల్లి దేశక్షేమమున కనుకూలపడును. అంతే భేదము గాని స్త్రీపునర్వివాహమువలన వ్యత్యాస మంతకంటె విశేషముగా నుండదు. ప్రజాభివృద్ధి కలుగకుండ వారించి భూభారమునడఁచి దేశసంరక్షణముచేయ దీక్షవహించిన యీమహానుభావులు పరులకు మాత్రమే యుపదేశింపక యీవిషయమున తాముకూడ కొంత తోడుపడిన నెంత శ్లాఘాపాత్రముగా నుండును! వారిపరోపకార చింతయంతయు ననాథలను దుఃఖపెట్టి వారిజీవనము వ్యర్థముచేయ పాటుపడుటతోనే సరిపోవలెనా? భార్యలను పోఁగొట్టుకొన్న ముసలివాండ్రయిన తాము ద్వితీయవివాహములు మానివేసి యీఘనకార్యమునకు తోడుపడరాదా? అట్లు తోడుపడి విధవలమీఁద వేయఁదలఁచిన దుస్సహమయిన భారములో గొంత తామును వహించినప్పుడుగదా

లోకము వారి పరిశుద్ధచింతను మెచ్చుకోఁ దగియుండును! అనాథలయిన స్త్రీల నేడిపించుట కీపరోపకారచింత యక్కఱలేకయే కావలసినన్ని కష్టములున్నవి. కాఁబట్టి బుద్ధిమంతులయిన యితరదేశస్థులు పరిహసించునట్లు విద్యాసంపన్నులయినవారు స్త్రీలను బాధించి వారి బ్రతుకు నిరర్థకముచేసి దుఃఖములపాలు చేయుటకయి యిటువంటి హేతుకల్పనలు చేయకుందురని కోరుచున్నాను.

కొందఱు మన భార్యలు ముందు మఱియొకరిని వివాహమాడఁబోవుదురన్న యవమానవాక్యము నెట్లు సహింపఁగలుగుదుమని చెప్పుచున్నారు. అట్టివారు తమజీవితకాలములోనే కాక తమమరణానంతరమును తమ్ము భర్తలని చెప్పుకొను దురదృష్టము వహించిన కాంతలు వివాహసుఖ మనుభవింతురన్నమాట నయినను విని సహింపలేరఁట! ఆమాట విన్న స్వర్గములోనున్న తమయాత్మలకుఁగూడ విశ్రాంతి కలుగదఁట! భార్యలు చచ్చినతరువాతనేకాక వారు జీవించియున్న కాలములో సహితము తాము వచ్చినంతమంది స్త్రీలను వివాహము చేసికోవచ్చునఁట. అట్లుచేయుట భార్యలకవమానకరము కాదఁట! తాము మృతులయి యీలోకమును విడిచిపోయిన తరువాత నయినను తమ్ము తలఁచుకొని కలకాలమును కష్టపడక కొంతకాలమయినను తమభార్యలు వివాహమాడి సుఖపడిపోవుదురన్న పిడుగువంటిమాట యొక్కటియే మిక్కిలి యవమానకరమఁట! ఇటువంటి సచ్చింతకల మహానుభావులతో వాదమేటికి? యుక్తులేమిటికి? వట్టి కంఠశోషణము.

వితంతువులకు తమస్థితి సహజముగానే కనఁబడి చిరకాలాభ్యాసమువలన వారు సుఖమునే యనుభవించుచున్నారు గాని కష్టపడు

చుండలేదన్న యంశమును కొంత విచారింతము. విధవలు కష్టముల కలవాటుపడి యీవిషయమయి వారేమియు మొఱపెట్టుకొనుచుండ లేదనుట కభిప్రాయము చిరకాలాచారము మానవ ధర్మమయిన మానావమానవివేచనమును చెడఁగొట్టి వారిని మృగములవలెను వృషములవలెను చేసినదనుటతప్ప మఱియొకటి కాదు. అట్లగుట మనకే యవమానకరము. వారిప్పుడు తెలిసికోలేక పోయినంతమాత్ర ముచేత విధంతువులను మనము పెట్టు బాధ యోగ్యమయినదగునా? విధవలు తమకష్టదశను బాగుగా తెలిసికొనుచుండ లేదనుటయు సత్యము కాదు. మనదేశపు విధంతువులు సుఖ మనుభవించుచున్నా రనుటకంటె పెద్దయసత్యమును మఱియొకటి లేదు. అట్టి యవస్థయే సుఖమయినయెడల మనవారు పట్టెమంచములును పఱుపులును మాని వేసి కటికినేలను పరుండుచు, పూటపూటకు రుచ్యములయిన కూరల తోను పెరుగుతోను పాలతోను నేతితోను సుఖభోజనము విడిచి యొంటిపూట తినుచు, వస్త్రాద్యలంకారములను తీసివేసి బోడితలలు చేసికొని కావలసినంత సుఖ మనుభవింపవచ్చును. పురుషులెంత పిన్న వయసు వారయినను వివాహసమయమునందు తప్ప భార్యల మొగము చూడనివారయినను భార్యలు పోఁగానే వారినిట్టి తల గొఱిగించి విరూపులనుజేసి తిన్నగా తిండిపెట్టక కడుపు కాలవేసి శక్తికి మించిన పని చేయించుచు వస్త్రాద్యలంకారములను వేసిని ధరింపనీయక వీధి మొగము చూడకుండ నిర్బంధించి మూల నదిమిపెట్టి మరల నెప్పటికిని పెండ్లి లేకుండఁజేసి పొడ కనఁబడినప్పుడెల్లను దుశ్శకున మయినదని తిట్టుచు విధంతువులను పెట్టెడు కష్టములు తమ్ముఁ బెట్టినప్పుడు కాని పురుషులు వారిసౌఖ్యమును పూర్ణముగా తెలిసికొనుటకు శక్తులు కారు. విధంతువులు కొంత సుఖమనుభవించుటయు వాస్తవమే యయి

నను, ఆసుఖమునకు మాత్రము మనము కారణభూతులము కాము. వారికష్టములను దుస్సహముగాఁ జేయుటకయి మన చేతనయినంత పని మనము చేసినాము. వారి జీవనము దుఃఖభాజనముగాఁ జేయుటకయి యీ చేసినదానికంటె మన మెక్కువ యేమి చేయఁగలము? అనాథలయి మనపాలఁబడిన యబలల జీవనమును మనమెంత సుఖహీనముగాఁ జేయ పాటుపడినను కరుణాపరిపూర్ణుఁడయిన పరమేశ్వరుఁడే లోకములో నెవ్వరిని ధర్మమును విడిచినప్పుడు తప్ప సంపూర్ణదుఃఖము నెప్పుడును పొందనియ్యఁడు గనుక, ముల్లబంటి దుఃఖములో మోకాలిబంటి సుఖమున్నట్లు దౌర్భాగ్యస్థితిలోనే వారు కొంచెము సుఖమనుభవించుచున్నారు. ఆపన్నుల నెప్పుడు నుపేక్షింపనివాఁడును మహారణ్యమధ్యమునందు సహితము మధురోదకమును వర్షించి ముండ్లమొక్కలను సహితము పోషించువాఁడును నయిన యాపరమదయాళుఁడు చిరకాలమునుండి కష్టపరంపరపాలయి దిక్కుమాలియున్న వితంతువుల యూషరహృదయములయందు మాత్రము కొన్ని సంతోషబీజములను నాటి పెంచకుండునా? అయినను విధవ లప్పుడప్పుడు పొందు సంతోషమును తృప్తిని జూచినను దేశాభిమానము గలవారందఱును విచారపడవలసినదే. లోకములో పిచ్చివాండ్రు తమస్థితి తెలిసికోలేక పొందెడి యానంద మెటువంటిదో యీవితంతువుల యానందము నట్టిదే; కాని యంతకంటె యోగ్యమయినది కాదు. వారిస్థితి వారికి నిజముగా తెలియదు గనుకను, ఆలోచన లేనివారు గనుకను, మూర్ఖురాండ్రు గనుకను, వారు సంతోషింపఁ గలుగుచున్నారే కాని జ్ఞానభానుకిరణమొక్కటి గాఢాంధకారావృతమయియున్న వారి హృదయకుహరమునందు ప్రవేశించి యక్కడి యజ్ఞానతిమిరమును కొంచెము తొలఁగింపఁ గలిగిన మొదల నిమిషములో వారిసంతోషమును గింతోషమును

పోయి యీసుఖమంతయు దుఃఖముగా పరిణమించుటకు సందేహము లేదు. అట్టి జ్ఞానోదయము గలిగిన మఱుసటి క్షణమునందు పురుషులు తమ విషయమై చేసిన యన్యాయమయిన యకృత్యమునకు మనమీఁద వారి కెంత కోపమువచ్చునో యిప్పుడు చూచుకొనవలసియున్నది. మన కుల సంరక్షణార్థమై వితంతువు లీలాగున కష్టపడుట విధి యని భావించు వారును కొందఱున్నారు. మన కులసంరక్షణార్థమయి చేసే యన్యాయమును, హింసయు, క్రూరత్వమును కావలసియున్నయెడల, అట్టి యధర్మమూలమయిన కులము భూమిమీఁద లేకుండ నశించునుగాక! ఈయనాథల కష్టములమీఁదనే నిలిచెడు కుల మెంత శీఘ్రముగా నశించిన మన కంత మేలు గలుగును. కాఁబట్టి యనాథల కన్నీటిచేతనే పెరిగెడు పాపుల యొక్కసారిగా పాడుకానిండు. మనకులమునకు పరకీయులవలననే బ్రతుకవలసిన దుర్గతి సంభవించునప్పుడు నయ, దాక్షిణ్యము, ధర్మము మొదలయిన పదములు భాషలో నశింపవలసినవే. భూలోకమున మనుష్యజన్మ మెత్తినవారిని మృగములకంటెను హీనదశ నొందునట్లు చేయుటకంటె భూమిని మృగములపాలు చేసి యవి కాపురముండుటకే విడిచిపెట్టి మనుష్యులు మూలముట్టుగ నశించుట యుక్తము. కాని భగవంతుని రాజ్యములో నొకరి దుఃఖమువలననే యితరులు శాశ్వతముగా సుఖింపవలసిన యవస్థ మాత్ర మెన్నటికిని సంప్రాప్తము కాదు. అనావృష్టివలన పంటలు పండునని మీరు నమ్మిన యెడల స్త్రీల బాధవలననే మీకు క్షేమము కలుగుననియు మీరప్పుడు నమ్ముఁడు. న్యాయస్వరూపుఁడును దయానిధియు నయిన పరమేశ్వరుఁడే మనలను పరిపాలించుచున్న పక్షమున స్త్రీలను పెట్టుబాధలవలనను ప్రకృతిధర్మములను మీఱుటవలనను మనకుఁగాని మరి యెవ్వరికిఁగాని యిహలోకసుఖమయినను పరలోకసుఖమయినను కలుగునని నమ్ముట

కేవలము వెఱ్ఱితనము. ఎల్లకాలమును వితంతువు లీలాగునవే యన్యాయముగా బాధ పడుచుండవలసినయెడల పయిని భగవంతుని సత్యపాలనమే లేకపోయి దయావిహీనుఁడయిన క్రూరరాక్షసుఁడెవఁడో యీప్రపంచమును పాలించుచుండి యుండవలెను. పరలోకసుఖము నిమిత్తమయి యిటువంటి కిరాతకృత్య మావశ్యకమనుట యీశ్వరదూషణమును సత్యదూషణమును న్యాయదూషణమునుగాని వేఱు కాదు. భగవంతునియందును సత్యమునందును న్యాయమునందును విశ్వాసము లేక చిరకాలమునుండి వచ్చుచున్న యాచారమునందే పరమవిశ్వాసముంచి దానిని సదా కనుచుండుట చేతను దాని క్రౌర్యమునకు అలవాటు పడి యుండుటచేతను మనదేశమున కీ యనర్థమునకంతకును కారణమయినది. చిర పరిచయమువలన చెడుగును మంచినిగాను పరులను బాధించి పొందు సుఖమును న్యాయ్యముగాను తోఁపించు పరమసామర్థ్యముగల యాచారమునందు విశ్వాసబుద్ధి లేక సత్యమునందు విశ్వాసము కలిగినయెడల పరపీడనము పాపకార్యములును మఱునాటికే నశించును.

ఒకసారి భర్తను పొందిన స్త్రీతోడి సంభోగమున కెవ్వరాశ పడుదురనియు మీరు సందేహింపవలసిన పని లేదు. మనవారి కా నీతి నే యుండి యొకరు సంభోగించిన స్త్రీతోడి పొందే రోఁతగా తోఁచునేని మనదేశములో వ్యభిచారమే లేకపోయి యుండును; పయికి పెద్దమనుష్యులవలె పగలెల్లను వేషములు వేసికొని తిరుగుచు చీకటి పడఁగానే భార్యలను విడిచిపెట్టి లంజెల యిండ్లకు వేంచేసెడు మహానుభావులే మనదేశములో లేకపోయి యుందురు; దుర్నీతికి పట్టుకొమ్మలయి బహుసంసారములను కూలఁద్రోయుట చే కులవిద్యగాఁగల వేశ్యలందఱును మహాపతివ్రత లయియే యుందురు; మనదేశము

నను కులటలన్న పేరే లేకపోయియుండును; బాలవిధవల కిప్పటివలె వ్యభిచారదోషమును గర్భపాతాది మహాపాతకములును సంభవింపకయే యుండును. నిత్యమును కన్నకన్నవారితోనెల్లను గలియు వేశ్యల పాదములాశ్రయించి తమధనమును గొల్లపెట్టు మహాపురుషులవంటి వారికా యెక్కుడో భర్తపోయిన స్త్రీని వివాహమాడుట గోరతగా నుండునది! ఇప్పుడిటువంటి వికృతివేషములతో నున్నప్పుడే విధవల తోడి పొందసహ్యముగా నుండినప్పుడు వారీవికృతివేషమును మార్చి సువాసిని చిహ్నములను ధరించినప్పు డెవ్వరికైన మరియొక విధముగా నుండునా? కొంతకాల మాచారము సాగినతరువాత స్త్రీపునర్వివాహ మందఱకును మొదటివివాహమువలెనే సామాన్యముగా తోచకపోదు. ఇంతేకాను మనవారు ముందుగా స్త్రీవారికి లేకపోక పురుషులకు మొదటగని బాలవితంతువుల కయినను పునర్వివాహము కనుక చేయించిన తరువాతనైనగా పెద్దవారిసంగతి యాలోచింపరాదా?

గొల్లలు మొదలయిన వారితోడి పాటుగా మనలోగూడ మారు మనువు లున్నయెడల మనయాధిక్యము పోయి మనము వారితో సమానులము కామా యని యగ్రవర్ణములవారు కొందఱనుమా నించుచున్నారు. వారితో సమానముగా భోజనము చేయుచుండుట వలన మనయాధిక్యము పోలేదు; వారితో సమానముగా బట్టలుకట్టు కొనుచుండుటవలన మనగౌరవము పోలేదు; వారితో సమానముగా వివాహము లాడుచుండుటవలన మనశ్రేష్ఠత పోలేదు; వారితో సమా నముగా మన మన్నిపనులు చేయుచున్నను పోక, ఇప్పుడు జరుగు చున్నట్టుగా పాపమూలమయిన గర్భస్రావములు శిశుహత్యలు మొద లయిన వానివలనను పోక, శాస్త్రసమ్మతమయిన పునర్వివాహములను

మనస్త్రీలకుఁ జేసి యీమహాపాతకముల నన్నిటిని పోఁగొట్టుకొనుట వలననా మనగౌరవము పోవును? మనకు శిశుహత్యలతోను గర్భపాతములతోను నిలిచెడు గౌరవము పోయినను పోనిండు.

ఓ హిందూమహాజనులారా! నేనీవిషయము నీవఱకే యెక్కువగాఁ జెప్పియున్నాను. మనపూర్వులు ధర్మశాస్త్రములను జేసి లోకమును యుక్తమార్గమున నడిపించి యుండఁగా వారిసంతతివారమయ్యును మన మన్యులను మంచిమార్గమున నడిపించుమాట యటుండ మనమునుగూడను యుక్తమార్గమున బ్రవర్తింపక మనస్త్రీల గతి నయినను బాగుచేసికోలేకుండుట యెంతయు నవమానకరముగా నున్నది. స్త్రీలకు పునర్వివాహము సంభవించుటవలన వారికి లాభమే కాని యెవ్వరికి నేవిధమైన నష్టమును లేదు. మనము వితంతూద్వాహము కూడదనుటవలన మన మోర్వలేని తనము బయలుపడునే కాని వేఱు సుగుణ మేదియు నెల్లడికాదు. మన కడుపునపుట్టిన యనాథలైన బాలికల యెడలనే దయఁజూపలేని పశువుల మన మే మొగము పెట్టుకొని మాపాపములు క్షమించి దయచూపుమని యీశ్వరుని నిత్యము వేఁడుకోఁగలము? ఈశ్వరునియొక్క సమస్తకళ్యాణగుణములకును దయ గదా శిరోమణియయి సృష్టియం దెల్లయెడల బ్రకాశించుచున్నది! తమ యల్పాయుష్కాలములో లోకములోని సమస్త జీవరాసులును నపారమయిన సుఖమనుభవించు చుండుట కాతని దయకాక మఱి యేమికారణ మున్నది. ఘాతుకమృగములు సహితము స్వజాతిమృగములను బాధింపక ప్రేమ చూపుచుండఁగా జ్ఞానసంపద చేత నత్యధికులమయిన మనము లాభలేశమైనను లేక నిష్కారణముగా మనతాతలును ముత్తాతలును బాధపెట్టిరను ప్రబలహేతువు చేత కరుణమాలి యనాథలయి దిక్కుమాలి మనలను జేరిన యీ యాడు

వారిని హింసపెట్టుట ధర్మమగునా? నష్టకర మైనప్పుడెల్లను పూర్వాచారమును మార్చుకొనుచుండుటకు మనపూర్వు లెప్పుడయిన వెనుక తీసిరా?

శ్లో॥ పరిత్యజే దర్థకామౌ యౌస్యాతాం ధర్మ వర్జితౌ
ధర్మంచా ప్యసుఖోదర్కం లోక విక్రుష్టమేవచ॥

అని ధర్మశాస్త్రకర్తలలోనెల్ల నగ్రగణ్యుఁడైన మనువు అసుఖకరమును లోకమునకు శోకకరమునైన ధర్మము నయినను విడువవలయునని విధించి యుండలేదా? స్త్రీపునర్వివాహమును సమస్తధర్మశాస్త్రములును ప్రతిపాదించుచున్నవి గనుక మనమిప్పుడు చెడిన ధర్మమును పునరుద్ధారణము చేయవలసి యున్నదికాని ధర్మవిరుద్ధముగాఁ జేయవలసిన దేమియు లేదు. ఆచారవిరుద్ధముగా మన మిప్పటి యనాథల విషయమున నేమియుఁ జేయలేక పోయినమని నిమిషమాత్రమును భావింపఁ బోకుఁడు. మనము చేయఁగలిగినది కావలసినంత యున్నది. రాజులకంటెను, సేనలకంటెను, ధనములకంటెను, సాధనములకంటెను బలవత్తరమైన సత్యబలమును ధర్మబలమును మనపక్షమున నున్నవి. గనుక, వానిసాహాయ్యముచేత మన మెంతటివారి నైనను నిర్వహింప సమర్థుల మగుదుము. ఈధర్మబలమునుముందఱ లెక్కలేని సమస్తబలములును పాదాక్రాంతములు కావలసినవే. కాఁబట్టి యెంతకాలమునుండి యున్నను హింసయు నధర్మమును దుర్బలము లయినవని తెలిసికొని సత్యమునందు విశ్వాసముంచి న్యాయమే నిజమైన బలమని నమ్ముకొని ధర్మస్థాపనమునకయి ప్రయత్నింపుఁడు. నేనిప్పుడు చెప్పిన సంగతులు చక్కఁగా నాలోచించుకొని పామరుల మాటలను పాటిగాఁ బట్టక మీయంతరాత్మ బోధించునట్లు ప్రవర్తింపుఁడు.

శ్లో॥ యత్కర్మ కుర్వతో౽స్యస్యా త్పరితోషో౽ంతరాత్మనః।
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతం తు వర్జయేత్ ॥

అను మనువచనమును మూలసూత్రముగాఁ గొని మీరేపని జేసిన మీయంతరాత్మ సంతోషించునో యాపనిని జేయుచు నంతరాత్మ కసంతుష్టికరమయిన పనిని మానుఁడు. ఇప్పుడున్న దే మంచిదన్న దురభిమాన మొక్కదానిని విడిచిపెట్టితిరా యీశ్వరుఁడు మిమ్ము సత్యమార్గమున బ్రవేశపెట్టి యామూలమున మీకును దేశమునకును కూడ క్షేమము కలుగఁజేయును. దీనదయాళుఁడయిన పరమేశ్వరుఁడు మీహృదయములయందుఁ బొచ్చి గతిమాలియున్న హిందూవితంతువుల మొఱ్ఱ యాలకించి వారి దురవస్థ తొలఁగించి దరిచేర్చుటకు మీకు బుద్ధి పుట్టించునుగాక !



# స్త్రీపునర్వివాహ విషయక ప్రథమ విజ్ఞాపనము.



By

**K. VEERESA LINGAM**

# స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము.



అస్మద్దేశీయులగు వివేకమహితులారా!

నేనిప్పుడు చేయఁబోయెడి యీచిన్నవిన్నపమును సదయహృదయులరయి యాలకించి, నిష్పక్షపాతబుద్ధితోను న్యాయైకదృష్టితోను సావధానముగా విమర్శించి, సత్పక్షమని మీమనస్సులకుఁ దోఁచినంతవఱకు నంగీకరింతురని మిమ్మందఱను మిక్కిలి వినయముతో ప్రార్థించుచున్నాను. ఇప్పటి యాచారమునుబట్టి నావాక్యము లొకవేళఁ గొందఱిచెవులకు మొట్టమొదట వెగటుగా తోఁచవచ్చును; కాని, కొంచెము పారమార్థికబుద్ధితో పరిశీలించి చూచినయెడల గ్రాహ్యములుగాఁ గనఁబడకపోవని నమ్మెదను. మనము యుక్తిగా విషయవిచారమును మాని ప్రస్తుతాచారమునే ప్రమాణమని పట్టుపట్టి కూర్చుండుమేని, అభివృద్ధి నొందుటకు లేశమయినను నవకాశము లేకపోవుటయేకాక క్రమక్రమముగా మనము దురాచారములయందు తగులుకొన్నవారమయి మానుషధర్మమును మఱచి చెడిపోవుదుము. ఇతరుల దృష్టియం దెంత క్రూరకృత్యముగాఁ గనఁబడినను, ఎవరి యాచారము వారికి మంచిదిగానె కనఁబడుట స్వాభావికము. బహుకాలమునుండి వచ్చుచున్నందున వివాహములయందు విస్తారధనమును వెచ్చించెడి యాచారమును మీఱఁజాలక, అంతటిధనమును వెచ్చించుశక్తి లేక వివాహములయందలి యతివ్యయమును మానుటకు బదులుగా పుట్టినతోడనే తాముకన్న స్త్రీశిశువులను నిర్దాక్షిణ్యముతో వధించెడి దురాచారమును న్యాయైకావలంబకులైన మన దొరతనమువా రిప్పటికిని రాజపుత్రులలో మొదలంట మానుపఁజాలకున్నారు.

గొనక నిరాకరించి యూరకుండుటకును మనముప్రయత్నింప వలయును గాని, స్వాభిమానముచే మనము పట్టినకోడికి మూడే కాళ్లనుచుండుట న్యాయము కాదు. కాఁబట్టి తమయొక్కయు దేశముయొక్కయు క్షేమలాభములను గాంక్షించు వారందఱును సర్వవిధముల శోధించు సత్యమును గనుఁగొని పిచ్చి కుదిరినది రోకలి తల జుట్టుమనక, యేర్పడిన సిద్ధాంతప్రకారముగాఁ దాము ప్రవర్తించుచు ఇతరులను బ్రవర్తింపఁ జేయవలయును. ఈదురాచారమువలన నాకు ప్రత్యేకముగా సంభవించెడు నష్టమేమియు లేదు; కాఁబట్టి యితరులేగంగలో మునిఁగిన నాకేమని యూరకుండుట మానుషస్వభావమునకు పొసఁగి యుండదు. కాఁబట్టి యీవిషయమును నేను పెంచి చెప్పనక్కఱ యుండదు; స్వోదరపూరణమాత్ర ప్రయోజనుఁడయి లోకోపకార చింతలేని మనుష్యశరీరధారి భూమికి భారముగానుండి పశుపక్ష్యాదులకన్నను నిరర్థకజన్ముఁడని చెప్పుటయే యిచట చాలియుండును.

నేనిప్పుడు చెప్పఁబోయెడు స్త్రీపునర్వివాహవిషయము పరులు ఆక్షేపించి చెప్పువఱకును మనకుఁ దెలియనంతటి స్వల్పాంశము కాదు. ఈవఱకే బహుకాలముక్రిందట కృష్ణదేవరాయలవారి కాలమున పండితమండలాగ్రగణ్యులుగానుండి, నేఁటివఱకును పండితులందఱిచే ఈశ్వరావతారమని శ్లాఘింపఁబడుచున్న జగదేకపండితులగు అప్పయ్యదీక్షితులవారు స్త్రీపునర్వివాహవిషయమునందున సాధకబాధకములనెల్ల నాలోచించి, స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమనియు దోషనివారకమనియు సిద్ధాంతీకరించినట్టును, ఆకాలమునందు విద్యాలయములని ప్రసిద్ధిగన్న కాశీ మొదలైన పట్టణములకెల్లను బోయి పండితులతో వాదించి తమసిద్ధాంతమును శాస్త్రముచేతను యుక్తిచేతను సూప స్థాపించినట్టును, అదిచూచి పరాజితులయిన మనపండితులు ప్రపం

చాంతము సంభవించినట్లు దుఃఖపడి యందఱును గట్టుకట్టుకొని పోయి దీక్షితులవారి మాతను దీనులయి ప్రార్థించి యామెచేత ముందుగాం దనకుం బునర్వివాహము చేసిన పిమ్మట మఱియొకస్త్రీకిం జేయవలసిన దని కుమారునకుం జెప్పించి స్త్రీపునర్వివాహమును మానిపించి లబ్ధ మనోరథులైరఁట్టను, ఇప్పటి మనపెద్దలే చెప్పుచున్నారుగదా? పూర్వోక్తదీక్షితులవారికిం దరువాత సహితము లోకోపకారపారీణు లైన పలువురు పండితోత్తములు స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మత మని పెక్కుగ్రంథములను వ్రాసియున్నారు. స్త్రీపునర్వివాహము లేకపోవుటవలనం గలిగెడు నష్టములనుగాని, ఉండుటవలనం గలిగెడు లాభములనుగాని, వానిని స్థాపించుటకయి కావలసిన యుక్తిశాస్త్ర ములనుగాని చూపుటలో వారిలో నెవ్వరితోను సమానుఁడను కాక పోయినను, బీామనసుల కెక్కునట్లుగా రసపుష్టిగల మంచిశైలితో నుపన్యసింప శక్తుఁడను గాకపోయినను, లోకోపకారచింతయు స్త్రీల దురవస్థయు నన్నుం బ్రేరేప ధైర్యము తెచ్చుకొని పూర్వపు మహాను భావులు ప్రదర్శించిన మార్గమున ననుసరించి కొంచెము ప్రసంగింప సాహసించుచున్నాను.

సర్వసముండైన జగదీశ్వరుఁడు పురుషులకువలెనే స్త్రీలకును ఆఁకలి మొదలగువాని నెట్లు గలుగఁజేసి యున్నాఁడో అదేప్రకార ముగా కామమును సహితము కలుగఁజేసి యున్నాఁడు; వానిని యుక్త మయినరీతిని శాంతిపొందించుటచేతనే స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని సౌఖ్యము కలుగును. కాఁబట్టి చౌర్యము మొదలగు దుర్వృత్తులయందుఁ బ్రవేశింపక యాఁకలిని దీర్చుకొనుట యెట్లు న్యాయమో వ్యభిచారము నందుఁ బ్రవేశింపక కామమును నిర్వర్తించుకొనుట అట్లే న్యాయము. అయినను తుపిఁపాసాదులవలె కామశాంతిని పొందించుకొనుట యని

వార్యము కాకపోయినను, కామమును జయించుటసహితము సాధారణముగా మనుష్యమాత్రునకు సాధ్యముకాదు. అడవులలో నాకలములు తినుచుండు యోగులు సహితము కామమోహితులై, యకార్యకరణమునకుం జొచ్చిరన, ఇఁక నితరులమాట చెప్పవలసినదేమున్నది? ఇందుకు దృష్టాంతముగా మన తొంటిపండితులు వ్రాసిన శ్లోకము నొకదాని నిం దుదాహరించుచున్నాను :—

"శ్లో॥ విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబు పర్ణాశనా
స్తేపి స్త్రీ ముఖ పంకజం సులలితం దృష్ట్వైవ మోహం గతాః
శాల్యన్నం సఘృతం పయో దధి యుతం భుంజంతి యే మానవాః
తేషా మింద్రియ నిగ్రహో యది భవే ద్వింధ్యః ప్లవే త్సాగరే॥"

విశ్వామిత్రుఁడు, పరాశరుఁడు మొదలగు వాతాంబు పర్ణాశనులయినను, సుందరమయిన స్త్రీముఖమును జూచి మోహమును పొందుచుండగా, నెయ్యి, పాలు, పెరుగు వీనితో వరియన్నమును భక్షించు మనుష్యుల కింద్రియనిగ్రహము కలుగునేని, వింధ్యపర్వతము సముద్రమునందు తేలవలె నని యీశ్లోకమున కర్థము. ఇట్లు కొంచెముగానో గొప్పగానో విద్యాభ్యాసము చేసి యుక్తాయుక్తములను తెలిసిన పురుషుల విషయముననే కామమును జయించుట పర్వతము సముద్రములో తేలునంత యసాధ్యమయినచో, విద్యాగంధ మయిన నెఱుఁగకుండు మన దేశపు స్త్రీలవిషయమున నెట్లుండునో మీరే యూహింపఁదగి యుండును. అంతియకాక మన పూర్వులు

"శ్లో॥ స్త్రీణాం ద్విగుణ ఆహారో బుద్ధి శ్చాపి చతుర్గుణా
సాహసం షడ్గుణం చైవ కామశ్చాష్టగుణో భవేత్॥"

అని స్త్రీలకుఁ బురుషులకంటె నాలురెట్లు సాహసమును, ఎనిమిదిరెట్లు కామమును గలదని వ్రాసియున్నారు. పురుషులతో

సమానముగానే కామమున్నను దానిని నిర్జించుటను స్త్రీలకు సాధ్యము కాదని యేర్పడుచుండఁగా, మనవారు చెప్పినట్టు నిజముగా నెనిమిది రెట్లు కామమే యున్నయెడల వారు దానిని మర్దించుకోఁ గలుగుదు రనుటకింకొక వెఱ్ఱి వేఱొకటిలేదు; అట్టిచో సాహసముకూడ నాలు రెట్లున్నచోఁ జెప్పవలసినదే లేదు. అట్లుగాక స్త్రీలకు పురుషులతో సమానమయిన సాహసమును కామమును గలిగి యుండుననన్నను, ఉప్పును బులుసును దినుచు యౌవనదశయందుండు స్త్రీలకు కామ మును వారించుకొనుటకు శక్యమగునని మనము స్వప్నావస్థయం దయినను దలంపవచ్చునా? పురుషునకు భార్య పోయినంత మాత్రమున కామ ముడుగకుండుట పురుషుఁడు పునర్వివాహము చేసికొనవలెనని భగవదిచ్ఛ యయినట్లు ప్రకారముగా నూహింపఁదగియున్నదో, ఆప్రకారముగానే భర్త పోయినంతమాత్రమున స్త్రీకి కామము పోకుండుటయు స్త్రీపునర్వివాహముకూడ భగవన్మతమని తెలిసికోఁ దగి యుండలేదా? భగవదుద్దేశమునకు వ్యతిరిక్తమయిన పనిని జేయఁగోరుట మనుష్య స్వభావమునకు లేశమును న స్వాభావమయిన పని యగునా? సుఖ మనుభవింపవలెనని యుద్దేశించి యీశ్వరుఁడు సృష్టించిన వారిని, కష్టముల పాలుసేయ మన యావచ్ఛక్తిని వినియో గించుట యెంత క్రూరకృత్యము? వితంతువులైన మన స్త్రీలగతిని తలఁచుకొన్నప్పుడు పగవారికయినను మనసు దహించుకొనిపోవు నపుడు, మనకేల కొంచెమయినను కనికర ముండఁగూడదు? తమ కడుపునఁ బుట్టిన బిడ్డలకు పసితనములో పెండ్లియనఁగానేమో తెలి యక యది క్రొత్తవస్త్రములను గట్టుకొని పిండివంటలు తిని వాద్య ముల మ్రోతతో జరుపు నొకవేడుక యనుకొనుదశలో వివాహములు చేసి, మగఁడు పోయినాఁడని జననీజనకులు శోకమును పొందు

చుండఁగా "అమ్మా! యేల యేడ్చెదవు?" "నాయనా! యెందుకు దుఃఖించెదవు?" అని యుసుగు పుత్రికలను జూచి దల్లిదండ్రుల కయిన నేల కరుణ పుట్టరాదు? నిన్న మొన్నటివఱకును నెంతో ప్రేమతోఁ బెంచి ప్రాణముల నెల్ల వారిమీఁదనే పెట్టుకొని యుండి, మగఁడు పోయినాఁడన్న మాటను విన్నమాత్రమున సమస్తాలంకారములను దీసివేసి, తల గొఱిగించి ముసుఁగువేసి మూల కూరుచుండఁబెట్టి, విరూపినిఁజేసి చచ్చియుఁ జావకుండ దినమున కొక్క పూటనే మెతుకులు వేయుచు, కట్టుకోఁ దిన్నని బట్టనైన నియ్యక ముతకబట్టనే యిచ్చుచు, పుత్రికల జన్మములను దుఃఖభాజనములు చేయ నెట్లు మనసొప్పుచున్నది? ఏకగర్భవాసజనితలయిన తోడఁబుట్టిన పడుచులును, తమ యింటఁ జొచ్చిన కోడండ్రును, కంటికి నేలకు నేకధారగా నేడ్చుచు, మరణ పర్యంతము దుఃఖమును గుడుచుచుండఁ గనులు పెట్టుకొని చూచుచు అన్నదమ్ములును, మామలును, మఱఁదులును, బావలును నెట్లు నిర్దయులయి సహించి యూరకుండఁగలుగుచున్నారు? రక్తసంబంధముగల బంధువులందఱును అనాథలయిన తమవారిలలనలు సమస్తదుఃఖములకును లోనై యెన్నరాని కడగండ్లు పడుచుండఁగా వారివిషయమయి లేశమయినను జాలిఁబొందక వారియాపత్తులను నివారించుటకుఁ గొంచెమయినను ప్రయత్నముచేయక యెట్లు తాము సుఖమనుభవింప సిగ్గుపడకున్నారు? అస్మద్దేశీయులారా! మనవితంతువుల దురవస్థను జూచి యన్యదేశీయులు సహితము మనసులు నీరుగా కరఁగ పరితపించి వారి యాపన్నివారణమునకయి సర్వప్రయత్నములు చేయుచుండఁగా ఒక్కదేశమునఁబుట్టి యొక్క వేదమును నమ్మి యొక్క కుటుంబమువలె నున్న మీరుమాత్ర మేల మీహృదయములను రాయిచేసికొని నిర్విచారముగ నున్నారు? భర్తృవిహీనలయిన

కాంతలదుర్దశను తొలఁగించుటకుఁ జేయు ప్రయత్నముమాట యటుండఁగా, మీఁదుమిక్కిలి వారిని ముందు కూడ సర్వాభాగ్యురాండ్రనుగాఁ జేయుప్రయత్నము నయిన నేల విడువకున్నారు? అనాథలైనయాఁడు వారియెడ కనికరమును జూపుటకు మాఱుగా, వారినిమిత్త మింత ద్వేషము నేలపూనెదరు? మీచేతనైనపని మీరు వారిశిరోజము లను తీసివేయింపఁ గలరు; ఆభరణములను ధరించుకోకుండ మాన్పఁ గలరు; రెండుపూటలను భోజనము చేయనీక కడుపు మాడ్పఁగలరు; మఱియు నిట్టిదురవస్థల నెన్నిటి నయినఁ దెచ్చి పెట్టఁ గలరు; కాని స్వభావసిద్ధముగా వారికి భగవంతుఁడు కలుగఁజేసినకామమును మా త్రము తీసివేయ శక్తులరు కారుగదా? అట్టి వారి స్వాభావికమైన కామము శాంతిపడుటకుఁగల క్రమమైనమార్గమును మీరు మీశక్తి యంతయు వినియోగించి నిరోధించుటవలన, మీకుఁ గలుగుచున్నకష్ట ముల నయిన మీరాలోచించుకొనుచున్నవారు కారు. ఇఁక నైనను మేలుకొని కన్నులు తెఱచిచూచి, యిప్పుడు కలుగుచున్న యవమాన కరములైన పలుకష్టములను దెలిసికొనఁ బ్రయత్నింపుఁడు. ఈకష్టము లన్నియు మీకీవఱకుఁ దెలియనివి కాకపోయినను, తెలిసినవారికిసహి తముస్మరణకుఁదెచ్చుట యప్పుడప్పు డావశ్యకమగును గనుక వానిలోఁ గొన్నిటిని సంగ్రహముగా వివరించుచున్నాను. సావధానమనస్కుల రై యాలకింపుఁడు.

విద్వాంసులు సహితము కామవికారమునకు లోఁబడక తప్పిం చుకో నేరరు గనుక, ప్రకృతిచంచలలైన కామినులు బాల్యములోనే కామము నడఁచుకోలేక విధవలైనహేతువుచేత భర్తవలనిభయము నైన నెఱుఁగక సులభముగా నింద్రియసుఖవాంఛం దగులుకొని, దోషములలో నెల్లను మిక్కిలి హేయ మయినవ్యభిచారమునందుఁ

ప్రవేశింతురు. తిన్నగా నాలోచించి చూడఁగా లోకములోని నరహత్యలలో ముప్పాతిక మువ్వీసము వ్యభిచారసంబంధమునుబట్టి వచ్చినవే యైయుండును. మానవంతుఁడైనవాఁడు తనకుటుంబములోఁ జేరిన స్త్రీ మఱియేనేరమును జేసినను చూచి యూరకుండఁ గలుగునుగాని అంకుతనమును జూచినప్పుడు మాత్రము సహించి యూరకుండఁ జాలఁడు. అంకుతన మొక్క మగనికి మాత్ర మవమానకరముగా నుండునని మీరు భ్రమింపఁ బోకుఁడు; తల్లిదండ్రులకును, అన్నదమ్ములకును, అత్తమామలకును బావమఱఁదులకును, అందఱకును అపకీర్తిఁదెచ్చి పదిమందిలో వారు తలయెత్తి తిరుగ లేకుండఁ జేయును; బంధువుల కెల్లను అపఖ్యాతిగా నుండును; తుదకు కులము వారికి సహితము తలవంపుగా నుండును. ఇట్లుండుటంబట్టియే యభిమానవంతులగువారు అనాథలైన తమ వదినె మఱఁదండ్రుగాని అక్కచెల్లెండ్రుగాని జారత్వమునం బ్రవర్తించుచుండఁగా జూచి యోర్వలేక కొన్ని సమయములయందు తమ స్త్రీలను మఱికొన్ని సమయములయందా స్త్రీల నిమిత్తము వచ్చిన జారపురుషులను పొడిచివేసి చంపి తాముగూడ దొంగతనమువారి కత్తిశిక్షలకు శరీరములను ప్రాణములను నొప్పగించుచున్నారు. అంకుతనము బయలఁబడినపుడు తమ బంధువులును పొరుగువారును అను ములుకులవంటి కాసిమాటలను పడలేక నూతిలోనో గోతిలోనో పడి యాత్మహత్యలు చేసికొను వితంతువులును పలువురు గలరు; దీనినిబట్టి చూడఁగా స్త్రీ పునర్వివాహము లేకపోవుటవలనఁ గలిగిన వ్యభిచారము స్త్రీహత్యలకును నరహత్యలకును కారణ మగుచున్నది.

వితంతువులు చిన్నతనములోనే స్వతంత్రురాండ్రయి మగని సొత్తంతయు వచ్చి తమకుఁ జెందినపక్షమున, పలువిషయములలోఁ

జెడిపోయి ధనమునంతను మక్కువగల పురుషుల పాలుచేసి యచిర కాలములోనే కూటికిని గుడ్డకును లేని యనాథలగుచున్నారు. ఇంత యేల? స్వతంత్రురాండ్రైన విధవలు జారత్వవిషయమునఁ దమ సంస్థానములను సహితము పోఁగొట్టుకొని, కొడుకులు బ్రతికియున్న యెడలఁ దమకు స్వాతంత్ర్యము లేకపోవునని యెంచుకొని కన్నకొడుకులనైనఁ దత్తపుత్రులనైనఁ జంపింపను వారికి విషాన్నము పెట్టింపను సాహసించినవారిని మీరు కనియు వినియు నున్నారు. అట్టివారలు పలువురున్నను, సభలలో వారిపేరులు వెల్లడించుట యుచితము కాదు. ఈవిషయమున మీమనస్సులే మీకు సాక్ష్యము నియ్యవచ్చును. వెలిచవి మరిగిన స్వతంత్రురాండ్రు గాని విధవలు సహితము పుట్టినింటనో యత్తింటనో యుండి పురుషు లింటికిఁ దెచ్చిన వస్తువులలో నువ్వులలో నువ్వును, పప్పులో పప్పును పరపురుషులకు పెట్టువారును నెక్కడఁ జూచినను లెక్కకు మిక్కిలిగాఁ గలరు. ఇంటఁగల నగలను దొంగిలించి, రహస్యముగా నుపపతులకు సమర్పించుచుండు విధవలును గొందఱున్నారు. ఇట్టిచెడువృత్తి ధనహానికిని గారణ మగుచున్నది.

కొందఱు విధవలు ఇంటఁగల నిర్బంధమునకు కట్టువడి యుండలేక, కామాధీనలయి యేరాత్రివేళనో తమ చేతఁజిక్కినంత సొమ్ముతో నుపకాంతుని నెవ్వనినో తీసికొని లేచిపోయినవారును కనఁబడుచున్నారు. ఇంటనుండి వ్యభిచరించువారికంటె అట్లు లేచిపోయినవారే కొంత యుత్తమురాండ్రనవచ్చును. ఒకతె యిల్లు విడిచి లేచిపోయెనేని, తానొక్కతె మాత్రము జాతిభ్రష్టయై చెడిపోవును; ఇంటనుండి వ్యభిచరించునదో, తన కుటుంబమువారిని బంధువులను కూడ భ్రష్టులను జేసి, వర్ణసాంకర్యము చేయుచున్నది. లేచిపోయిన విధవలనుకూడ మరల

దీసికొని యింటఁ బెట్టుకొని, వర్ణసాంకర్యమును జేయువారు గొప్పగొప్ప వారిలోనే యనేకు లుండియున్నారు. మన బ్రాహ్మణోత్తములందఱును తలకొక్క రెండణాలు దక్షిణయిత్తురని యాశపడి సంతర్పణములయందును సమారాధనములందును అట్టివారి యిండ్లకు భోజనములకు వెళ్ళి యాసాంకర్యమును తాముకూడ పంచుకొని సంకరులగుచున్నారు. ఈప్రకారముగా నీదుర్వృత్తి వర్ణసాంకర్యమునకును గారణ మగుచున్నది.

మనపెద్దలనుగ్రహించి పునర్వివాహము లేకుండఁ జేసినను, భగవంతుఁ డనుగ్రహించి కామమును మాత్రము తీసివేయనందున యౌవనవతులయిన విధవలు పరపురుష సంభోగమునకు ఫలముగా గర్భమును ధరించి, ఆసంగతి యితరులకుఁ దెలియునన్న భీతిచేత తమకు గర్భప్రదానముచేసిన మహాపురుషుల సాహాయ్యముచేతనో, అట్టి పురుషసింహములను గాల్చుటయందు సమర్థురాండ్రైన తార్పకత్తియల తోడ్పాటుననో, మందులు తెప్పించుకొని గర్భపాతములను జేసికొనుచున్నారు; అట్టియుపాయము లభింపని యనాథయువతులు నవమాసములును గర్భమును ధరించి బిడ్డలనుగని కన్నబిడ్డల ముద్దుమొగములను జూచి చంపఁ జేతులాడక, జాతికట్టుపాటును మీఱుటకు శక్తురాండ్రుగాక పరితపించి తుదకెట్లో తెగించి మిక్కిలి దుఃఖముతో శిశుహత్యలను చేయ సాహసించుచున్నారు. చంపి పాఱవేయఁబడియున్న యట్టి లేతశిశువులను జూచినప్పుడు మనహిందువుల కొక్కరికి తప్ప, మృగపక్ష్యాదుల మొదలువిఱిచి చంపు ఇతరజాతులలోని కిరాతుల కయినను జాలిపుట్టి యట్టి ఘోరకృత్యమును మాన్పింపవలె నను బుద్ధి పుట్టకపోను. గర్భస్రావమునకయి పుచ్చుకొన్న మందులు కొన్నిసమయములయందు వికటించి పుచ్చుకొన్నవారికే ప్రాణాంత

మును కలుగఁజేయుటయుఁ గలదు. దీనినిబట్టి విచారింపఁగా స్త్రీపునర్వివాహము లేకపోవుట భ్రూణహత్యలకును శిశుహత్యలకును గూడఁ గారణ మగుచున్నది.

ఇప్పటి మనదేశపు శిక్షాస్మృతిలో గర్భపాతములును శిశుహత్యలును నేరములని యేర్పఱుపఁబడి యుండుటవలన, రాజకీయభటులా నేరములను పట్టుకొనుటకయి పూనుకొని తిరుగుచుగా భాగ్యవంతులకడ ధనమును స్వీకరించి విడిచిపెట్టుచు వచ్చినను ధనదానము చేత వారిని దృప్తిపఱుపలేని నిర్భాగ్యులైనను రచ్చకీడ్చుచున్నారు; నేరము ఋజువుపడినపక్షమున, గర్భస్రావము నిమిత్తమై యౌషధములను దెచ్చినవారికిని పుచ్చుకొన్నవారికిని సహాయపడినవారికిని ప్రేరకులుగా నున్నవారికిని దండనము కలుగుచున్నది; అదే ప్రకారముగా శిశుహత్యలయందును జేసినవారికిని చేయించిన వారికిని తోడుపడువారికిని శిక్ష యగుచున్నది. ఒకవేళ నేరము ఋజువుపడక వ్యవహారము కొట్టుపడిపోయినను, దానిని తప్పించుకొని బయలపడుటకయి చేయవలయు రహస్యములయిన ప్రయత్నములకయి ధనము వెచ్చపెట్టవలసి వచ్చుటయేకాక రాజసభలకెక్కి నలువురనోళ్ళలోను పడి తల్లిదండ్రులు మొదలగువారు మానసష్టమును శరీరాయాసమును పొందవలసిన వారగుచున్నారు. దీనినిబట్టి విమర్శించిన, మన యీదురాచారము నేరము చేసినవారికి మాత్రమేగాక నిర్దోషులును యితరులనేకుల మానభంగమునకును రాజదండనమునకును గారణ మగుచున్నది.

ఇట్టి స్వైరిణులయిన విధవలతోడి సహవాసదోషముచేత గృహమున నుండు పుణ్యస్త్రీలు కొందఱు భర్తలుండియు జారకాంక్షలం బ్రవరించి చెడిపోవుచున్నారు. కాఁబట్టి వనసోలన్ని గెలిచిన

దన్నట్లు, విధవలయి చెడునడతలం బ్రవర్తించు స్త్రీలు, సమస్తమును జేయించువాఁడు భగవంతుఁడే గనుక మనమేమిచేసినను దోషము లేదను మిట్టవేదాంతము నొకదానిని నేర్చుకొని పైకి జపములను దపములను చేయుచు ఇంట నున్నవారు కొందఱు పతివ్రతలుగా నున్న దమపయి మాటలు సాగవని, తాము నేర్చుకొన్న వేదాంతమును వారికిఁగూడ నుపదేశించుచు మెల్లగా వారినిఁగూడఁ దమమార్గములకు దింపుచుందురు. నీటిబొట్టువంటి మృదుపదార్థము పడగా పడఁగా రాయి యంత కఠినవస్తువే యఱుగుచుండఁగా వారిదృఢమయిన యుపదేశములను వినఁగా వినఁగా లక్కవంటి స్త్రీల మనస్సు కరఁగక పోదు గనుక పుణ్యాంగనలలో నొకరిని జూచి యొకరట్లు పాడయిన వారును అసంఖ్యముగా నున్నారు. కాఁబట్టి మన యీదురాచారము భర్తలున్న వారిని సహితము చెడుమార్గమునఁ బ్రవర్తింపఁజేయుటకును గారణమగుచున్నది.

ఇంచుమించుగా భగవంతుఁడు స్త్రీపురుషులను సమానసంఖ్య గలవారినిగా సృజియించి యొక్క పురుషున కొక్క స్త్రీ యుండవలెనని యుద్దేశించి యున్నను మనదేశములో లెక్కకెక్కువగా నుండు స్త్రీలు విధవలయి వ్యర్థురాండ్రగుచుండుట వలనను, మృతభార్యులగు పురుషులు మరల కన్యకలనే వివాహము చేసికొనుచుండుటవలనను, సంఖ్యాతీతులయిన పురుషులు వివాహముకాక బాధపడుచుండుటకును మదనవేదనకుఁ దాళఁజాలక వ్యభిచారమునం బ్రవేశించుటకును గారణమగుచున్నది. తమకు వేగిరము వివాహములు కాకపోవుటవలన పురుషులు మూడేండ్లపిల్ల దొరకినను చాలునని యెంత సొమ్మయిన వెచ్చించుటకు సిద్ధపడుచున్నారు; ఆశాపిశాచాగ్రస్తులైన తల్లిదండ్రులు ధనమున కాశపడి రాక్షసకృత్యమని వెఱవక తమపుత్రికలను

ముసలివాండ్రకును వ్యాధిగ్రస్తులకును వికలాంగులకును సహితము విక్రయించి సొమ్ము గడించుకొనుచున్నారు. కాబట్టి నరమాంసవిక్రయమునకును కొంతవఱకు మన యీదురాచారమే కారణ మగుచున్నది.

ఈరీతిని జెప్పఁ బూనుకొన్నచో స్త్రీపునర్వివాహము లేకపోవుటవలనఁ గలుగు ననర్థము లెన్నియైన నున్నవి. మీరు నిష్పక్షపాతబుద్ధితో విచారించి చూచునెడల, మనలోని యీదురాచారమును నివర్తింపఁ జేయుటకు బ్రయత్నించుట యావశ్యకమని తోఁపఁ జేయుట కీపయిని చెప్పినవే చాలియుండును; పక్షపాత మవలంబించి యున్నయెడల, నేనిఁక లక్షనష్టములను గనఁబఱిచినను బ్రయోజన ముండదు. మీమనసున కెక్కునట్లుగా వర్ణించుటకై కాళిదాసాది మహాకవులయొద్దఁగల వర్ణనాసామర్థ్యము నాయొద్ద లేదు; మిమ్మందఱను వశపఱుచుకొని యొప్పించుటకై నేనింతవఱకును జెప్పినదానిలో నేదియు నింద్రజాలము లేదు; మంత్రములును లేవు. మీరందఱు నెఱిఁగియున్న సంగతులలోనే కొన్నిటిని నేటితెలుఁగు మాటలతోఁ జెప్పియున్నాను; నేను జెప్పెడి యీపాడిమాటలకన్నను మీరు ప్రతిదినమును బ్రత్యక్షమునఁ జూచుచుండు ననంతనిదర్శనములే స్త్రీపునర్వివాహము లేకపోవుటవలనఁ గలుగు నష్టములను మీకుఁ జక్కగా బోధించి యుండవచ్చును. పయిని జెప్పినట్టు దుష్ప్రవర్తనమునఁ బ్రవేశింపని విధవలస్థితి సహితము మిక్కిలి శోచనీయమనుటకు సందేహము లేదు. విధవయయిన కన్యక జీవనమే వ్యర్థమగుచున్నది; వారికి సుఖమన్నమాటయే యుండదు; సమస్తభోగములును వారికి ఆకాశకుసుమసదృశములయి యుండును; వారిని జూచినవారందఱును వారినెంతో పాపము చేసినవారినిగా భావింతురు; వారు బ్రతికియుండియుఁ జచ్చిన

వారితో సమానలయి యుందురు. అట్టివా రింట నుండఁజూచు తల్లి దండ్రులకును అత్తమామలకును కలకాలము దుఃఖము కలుగు చుండును. ఇట్టియాపదల నన్నిటిని తలఁచుకొనునప్పుడు దయార్ద్రి హృదయులయిన వారి కందఱకిని స్త్రీపునర్వివాహము చేయఁగూడ దని వేయుశాస్త్రములు చెప్పినను వాని నన్నిటిని మీఱి యౌక్క సారిగా స్త్రీపునర్వివాహములు చేయింపవలయునని లేచునంత సాహ సము పుట్టక యుండదు. మనవారు స్త్రీలవిషయమునయిన తమ నిర్దా క్షిణ్యమును క్రూరత్వమును మన వేదములమీఁదను శాస్త్రముల మీఁదను త్రోసివేసి తాము నిర్దోషులుగాఁ గనఁబడుట కెంతప్రయ త్నించుచున్నను, మన హిందూజనులవలె హిందూవేదమును హిందూ ధర్మశాస్త్రములును ఈవిషయమున క్రూరములుగా నున్నవి కావు. మనవారందఱును సర్వోత్కృష్టప్రమాణమనియు నీశ్వరకృతమనియు నంగీకరించిన వేదమునందే,-

శ్రుతి॥ ఉదీర్ష్వనార్యభిజీవ లోక మితాను మేత ముపశేష ఏహి-
వా హస్తగ్రాభస్య దిధిషో స్త్వమేతత్పత్యుర్జ నిత్వ మభినంబభూవ-
ఆరణ్యకము, ౬ ప్రపాఠకము, ౧ అనువాకము.

అని యున్నది. మాధవాచార్యులను పేరంబరఁగు విద్యారణ్యులవారు పై శ్రుతికి వేదార్థప్రకాశాఖ్య వ్యాఖ్యానమునందు వ్రాసియున్న యర్థ మునే నేనిందు వ్రాయుచున్నాను—

హేనారి! త్వం ఇతాసుం=గతప్రాణం, ఏతం=పతిం, ఉప శేషే=ఉపేత్య, శయనం కరోషి; ఉదీర్ష్వ=అస్మాత్పతిస మీపా దుత్తిష్ఠ; జీవలోకమభి=జీవవంతం ప్రాణిసమూహ మభిలక్ష్య, ఏహి=ఆగచ్ఛ; త్వమ్, హస్తగ్రాభస్య=పాణి గ్రాహవతః, దిధిషోఃపునర్వివాహేచ్ఛోః, పత్యుః, ఏతత్,

జనిత్వం=జాయాత్వాం, అభిసంబభూవ=అభిముఖ్యేన సమ్యక్ ప్రాప్నుహి.

(రెండుమారులు వివాహమైన స్త్రీ పునర్భువనియు, పునర్భువును వరించువాఁడు దిధిషువనియుఁ జెప్పబడును. 'పునర్భూర్దిధిషూ రూఢా ద్విస్తస్యా దిధిషుః పతిః' అని యమరము.)

ఋగ్వేదైహిక కాండయందలి పూర్వక్రియయందు విధింపఁబడిన సహగమనమును జేయుటకు మృతభర్తృక భీతురాలైయున్న యెడల, సహగమనము చేయని యామెయొద్ద బంధువు లీమంత్రమును జదివి యామెను లేవఁదీయవలెనని విధి గలిగి యున్నది. 'ఓ నారీ! ప్రాణము పోయిన యీపెనిమిటి యొద్ద నేల పడి యుండెదవు? బ్రదికి యున్నవారిని జూచి లేచిరా. పునర్వివాహము చేసికొనఁగోరు పురుషునకు భార్యవు కమ్ము.' అను నర్థమిచ్చెడి యీమంత్రమును మఱ్ఱఁది మొదలగువారు పెనిమిటిపోయిన స్త్రీ యొద్దఁ జదివి యామెను లేవఁ దీతురు. ఈశ్రుత్యర్థము మఱింత స్పష్టమగునను నుద్దేశముతో, బంధువులు ప్రేతముగూర్చి చెప్పెడి పితృమేధమునందలి దీని పై మంత్రమును గూడ నర్థసహితముగా నిందు క్రింద వ్రాయుచున్నాను—

శ్రుతి॥ ఇయం నారీ పతిలోకం వృణానా నిపద్యత ఉప త్వా
మర్త్య ప్రేతం। విశ్వం పురాణ మనుపాలయంతీ తస్యై
ప్రజాం ద్రవిణం చేహ ధేహి॥

హేమర్త్య=ఓమనుష్యుఁడా, ఇయం నారీ=ఈ స్త్రీ, పతిలోకం=పెనిమిటివైన నీలోకమును, వృణానా=కోరుచున్నదై, ప్రేతం=ప్రేతవగు, త్వాం = నిన్ను, ఉప=సమీపమునందు, నిపద్యత=పడియున్నది. పురాణం=ప్రాచీనమగు, విశ్వం = ప్రపంచమును,

అనుపాలయంతీ = అనుసరించి ప్రవర్తించుచున్నది.

తస్యై = ఆచిన్నదానికొఱకు, ప్రజాం = సంతానమును,

ద్రవిణంచ = ధనమును, ఇహ = ఈలోకమునందు,

ధేహి = బాగుండునట్లు చేయుము.

చచ్చిపోయిన పెనిమిటి శవమువద్ద భార్య పడియున్నప్పుడు, ప్రేతము నుద్దేశించి యీమంత్రమును బంధువులు పఠింతురు. 'ఓ చచ్చిపోయిన వాఁడా! నీభార్య నీలోకమును గోరి ప్రేతవగు నీసమీపమున పడి యున్నది; ప్రాచీనమయిన యీప్రపంచధర్మము ననుసరించి ప్రవర్తించుచున్నది. కాఁబట్టి దీనికి సంతానమును ధనమును వృద్ధిపొంది బాగుండునట్లు చేయుము.' అని యీ మంత్ర తాత్పర్యము. "ఉదీర్ష్వ" ఇత్యాది మంత్రమును పుత్రులు లేని స్త్రీయొద్దనే చదువుదురు. కాఁబట్టి యీమె కావలెనే పుత్రులు కలరని చెప్పుట కవకాశము లేదు.

శ్రుతిని మించిన శబ్దప్రమాణము వేఱొకటి లేదు గనుక, దీనిని బట్టి సర్వవిధముల స్త్రీ పునర్వివాహ మంగీకర్తవ్యమైనట్లు స్పష్టమగు చున్నది. ఇందలి వారెవ్వరైనను స్త్రీ పునర్వివాహమును నిషేధించు శ్రుతికూడ నున్నదని యాక్రింద నుదాహరించిన దానిం జదువ వచ్చును—

శ్రుతి. యదేకస్మిన్ యూపే ద్వే రశనే పరివ్యయతి తస్మా దేకో ద్వే
జాయే విన్దతే - యన్నైకాగ్ం రశనాం ద్వయో ర్యూపయోః
పరివ్యయతి తస్మాన్నైకా ద్వౌ పతీ విన్దతే.—యజుస్సంహిత.

ఒకయూపమున రెండుత్రాళ్ళు గట్టవచ్చును గాన, నొక్కఁడు రెండు భార్యలను పొందవచ్చును; ఒకత్రాటి ననేక యూపములకుఁ గట్టుట లేదు గనుక, ఒక్కతె యనేక భర్తలను పొందదని పై శ్రుత్యర్థము.

ఒకని కిద్దఱు భార్యలని చెప్పిన తోడనే బాలుఁడు సహితము నేకకాలమం దాతని కిద్దఱు భార్యలు గలరని తెలిసికొనును గాని మునుపు పోయిన భార్యయుఁ దరువాత వివాహమాడిన భార్యయుఁ గలిసి యిద్దఱు భార్యలున్నారని యెప్పుడు నూహింపఁడు; అదేప్రకారముగా నొక స్త్రీ కిద్దఱు భర్తలన్నచో నేకకాలమం దిద్దఱు భర్తలనియే యూహించును. దీనినిబట్టి విచారింపఁగాఁ, బై శ్రుతికి పురుషున కేకకాలమునందే యిద్దఱు భార్య లుండవచ్చుననియు, స్త్రీకొక భర్త యనంతరము మఱియొక భర్త యుండవచ్చును గాని యేకకాలమం దిద్దఱు భర్త లుండఁగూడదనియు తాత్పర్య మయినట్లు కరతలామలకముగా గనఁబడుచున్నది. "అగ్నిష్ఠం ద్వాభ్యాగ్ం రశనాభ్యాం పరివీయ" అని పయిని జెప్పఁబడిన యగ్నిష్ఠ మను యూపమునకు రెండు రశనలు గట్టవలెనని విధించెడి యీసూత్రమును నేకకాలమందు గనుటను సూచించుచున్నది. ఒకవేళ నీశ్రుతికి స్త్రీపునర్వివాహ నిషేధమే యర్థమని యొప్పుకొన్నను, నేనిప్పుడు చెప్పుచున్న సంగతి కొంతమాత్రమును దౌర్బల్యము గలుగదు.

శ్లో॥ ధర్మంజిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః।
శ్రుతిద్వైధం తు యత్రస్యా త్తత్ర ధర్మా వుభౌ స్మృతౌ॥

అను మనువచనముం బట్టియు,

వ్యా. యత్ర పునః శ్రుత్యో రేవ ద్వైధం పరస్పర విరుద్ధార్థ ప్రతిపాదనం తత్ర ద్వావపి ధర్మౌ.,

అను కుల్లూకభట్ట వచనముంబట్టియు, శ్రుతియందు పరస్పర విరుద్ధ ధర్మబోధకవచనము లున్నపక్షమున వికల్పమున రెండును గ్రాహ్యములే యగును. కాఁబట్టి యీశ్రుతికిఁ బ్రతిపక్షులు చెప్పునర్థము నొప్పుకొన్నను, స్త్రీపునర్వివాహము చేయవచ్చుననియే యేర్పడును.

మఱియు నొకపండితుఁడు వాదము కొఱకై శ్రుతికి విరుద్ధమైన యర్థమునే యొప్పుకొని, విశేషముచేత సామాన్యము బాధింపఁబడును గనుక స్త్రీ యిద్దఱుభర్తలం బొందఁగూడదను సామాన్యవిధి "ఉదీర్ష్వ నారి" అను మృతభర్తృకయయి తన్ను మఱియొక పెనిమిటి చెందఁ గోరుట కవకాశముగల స్త్రీవిషయమగు విశేషవిధిచే నితర స్త్రీ విషయముగాఁ బర్యవసితంబగునని సాధించియున్నాఁడు. "యదేకస్మిన్" ఇత్యాది శ్రుతివాక్యమునకు నేను మొదటఁ జెప్పిన యర్థమే సరియైన దని స్థాపించుటకు శ్రుత్యంతరము సహితముగలదు. అది యేదనిన:—

శ్రుతి. "తస్మా దేకస్య బహ్వ్యో జాయా భవన్తి; నైకస్యై బహవ స్సహపతయః —ఋగ్వేదము.

'కాఁబట్టి యొకనికి నేకకాలమునందు బహుభార్య లగుదురు; ఒకతెకు నేకకాలమునందు బహుపతులు కలుగరు, అని యీశ్రుత్యర్థము. ఈ శ్రుతి కీయర్థమును నేను మాత్రము క్రొత్తగాఁ జేసినది కాదు; పూర్వపు పెద్దలును ఈప్రకారముగానే యర్థమును జేసియున్నారు.

"శ్లో॥ గ్రహణం సహశబ్దస్య పర్యాయా ద్బహవో ధవాః,
స్యురితి ప్రతిపత్త్యర్థం ప్రాజాపత్యే వచస్తథా.

పయిశ్రుతి యందు 'సహ' శబ్దగ్రహణము పర్యాయముచేత బహుభర్త లగుదురనుట కని ప్రాజాపత్యవచనము. భారత వ్యాఖ్యానమునందు నీలకంఠాచార్యులును,-

వ్యా. నైకస్యైబహవ స్సహపతయః । సహేతి యుగప ద్బహుపతి నిషేధో- నతు సమయ భేదేన.

అని యొకస్త్రీకి ఏకకాలమునందు బహుపతులు నిషేధమగునే కాని భిన్నకాలములయందుఁ గాదని పయి శ్రుత్యర్థమును బరిష్కరించి యున్నారు. వీని నన్నిటిని బరిశీలించి చూడఁగా స్త్రీపునర్వివాహము వేదవిహితమని తేటపడుచున్నది.

"యస్తు వేదవిశ్వాస రహితో ధర్మాత్పరాఙ్ముఖః తన్నానుష్ఠతి,
స జన్మనా బ్రాహ్మణోపి కర్మచణ్డాలో భవేత్."

అని యెవఁడు వేదమునందు విశ్వాసము లేనివాఁడయి, అందలి ధర్మములయందు విముఖుఁడయి వాని ననుష్ఠింపకుండునో వాఁడు జన్మముచేత బ్రాహ్మణుఁడయినను కర్మముచేత చండాలుఁడేయని మాధవాచార్యులు వ్రాసియున్నాఁడు గనుక, వేదచోదితమయిన పూర్వోక్తధర్మము ననుష్ఠింపరాదనువారెవ్వరిని నేను నమ్మఁజాలను. వేదార్థములను బోధించుటచేతనే స్మృతులకుఁ బ్రామాణ్యము కలుగును గనుక, శ్రుతివిరుద్ధముగా నన్ని స్మృతులయందును ఈపునర్వివాహము కూడదని యున్నను అంగీకరింపఁదగినది కాదు. శ్రుతికి విరుద్ధమయినచో స్మృతి గ్రాహ్యము కాదనుటకుఁ బ్రమాణములు,—

శ్లో॥ "శ్రుతి స్మృతి విరోధేతు శ్రుతిరేవ గరీయసీ
అవిరోధే సదాకార్యం స్మార్తం వైదికవత్సదా."

శ్రుతి స్మృతులకు విరోధమున్నయెడల శ్రుతియే గౌరవింపఁ దగినదనియు విరోధము లేనియెడల శ్రుతివలెనే స్మృతియు నాదరింపఁ దగినదనియు జాబాలియు,

"ధర్మంచ జ్ఞాతు మిచ్ఛంతాం ప్రకృష్టప్రమాణం శ్రుతిః,
ప్రకృష్టబోధనేనచ శ్రుతి స్మృతి విరోధే స్మృత్యర్థో నాదరణీయః"

ధర్మమును తెలిసికో నిచ్ఛగలవారికి శ్రుతియే ప్రకృష్టప్రమాణమనియు, శ్రుతికి విరోధమయిన స్మృత్యర్థము అనాదరణీయమనియు కుల్లూకభట్టును, మీమాంసాశాస్త్రమున

"విరోధేత్వనపేక్ష్యం స్యాత్ అసతిహ్యనుమానం; శ్రుతివిరోధే స్మృతివాక్యం అనపేక్ష్యం అప్రమాణం అనాదరణీయం చ."

స్మృతి శ్రుతికి విరోధమయినప్పుడు ఆ స్మృతికి వేదమం దాధార ముండునని యనుమానము లేకపోవుచున్నదనియు, శ్రుతికి విరోధ మయిన స్మృతివాక్యమును అపేక్షింపరాదు ప్రమాణముగా నెత్తుకో రాదు ఆదరింపరాదనియు, జైమిని మహర్షియు వ్రాసియున్నారు. పై వచనములనుబట్టి శ్రుతికి విరుద్ధముగా స్మృతుల యందు స్త్రీపున ర్వివాహ నిషేధకవాక్యము లున్నను, అవి గ్రహింపఁదగినవి కావని తెల్లమగుచున్నదికదా! ఇట్లు చెప్పుటచేత స్మృతి స్త్రీపునర్వివాహ మును నిషేధించుచున్నదని నా తాత్పర్యము కాదు; ఊరక వాదము కొఱకు స్మృతి నిషేధించినను అది ప్రమాణము కాదని చూపుట కయి యీచర్చను జేసితినే కాని స్మృతియు ఈపునర్వివాహము నంగీక రించుమనే యున్నది.

శ్లో॥ కృతేతు మానవా ధర్మా స్త్రేతాయాం గౌతమా స్మృతాః।
ద్వాపరే శాంఖ లిఖితాః కలౌ పారాశరా స్మృతాః॥

అనుబృహస్పతి వచనమువలనను, సమస్తమహర్షులును వ్యాసుని వెంటఁ బెట్టుకొని పరాశరుని యొద్దకుఁ బోయి కలియుగ ధర్మములను జెప్పుఁ డని ప్రార్థింపఁగా, పరాశరులవారు కలియుగధర్మములను వారి కుప దేశింపఁ బూనుకొన్నట్టున్న పరాశర స్మృతియందలి ప్రతిజ్ఞవల్లను, కలి యుగమునకు స్మృతులలోనెల్లఁ బరాశరస్మృతియే ప్రధాన మయిన దని విస్పష్టమగుచున్నదిగదా! అట్టి పరాశర స్మృతిలోనే,-

"శ్లో॥ నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ।
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధియతే॥"

అని పెనిమిటి దేశాంతరముపోయి సమాచారము తెలియని వాఁడయి నను, మరణము నొందినను, సన్యసించినను, నపుంసకుఁ డయినను, పతితుఁడయినను, స్త్రీపునర్వివాహము కూడునని విధి యున్నది.

ఈవిధి యుగాంతరవిషయమని మూలవిరుద్ధముగాఁ జేయు మాధవీయ వ్యాఖ్యానములును, పరివేదినీపరమని చేయు సందర్భశుద్ధి లేని యర్థములును, బ్రాహ్మణపరము కాదని చెప్పు ననాలోచితోక్తులును, బొత్తిగాఁ బాటింపఁదగినవి కావు. ఇది యుగాంతర విషయమన్నచో, ఈస్మృతి కలియుగము నిమిత్తము చేయఁబడినదన్న పరాశరుల ప్రతిజ్ఞకే భంగము వచ్చును; గనుక, "అయంచ పునరుద్వాహో యుగాంతర విషయో ద్రష్టవ్యః" అనుటచే, ఈపునర్వివాహము యుగాంతర విషయమని మాధవాచార్యులవారు చెప్పవచ్చినవారు కారనియు, "అయుగాంతరవిషయో ద్రష్టవ్య" యని పదచ్ఛేదము చేసికోవలయుననియు, ఈవిధి యెవ్వరయిన యుగాంతవిషయమని భ్రమింతురేమో యని యిది యుగాంతరవిషయము కాదని తెలిసికోఁదగిన" దని స్పష్టపఱచియున్నారనియు, ఒకపండితుఁ డర్థము వ్రాసి యున్నాఁడు. ఆయర్థము తాను జేసిన యీస్మృతియొక్క యితరస్థలములయందలి వ్యాఖ్యానమునకు విరుద్ధముగా నున్నను యుక్తికి సరిపడియే యున్నది గనుక, ఒకవేళ మాధవాచార్యులవారి తాత్పర్యమును అదియే యయి యుండవచ్చును. "ఉదీర్ష్వ నారి" ఇత్యాది శ్రుతివాక్యములకు స్త్రీపునర్వివాహము కాదునని యర్థము వ్రాసిన మాధవాచార్యులే, మరల స్వోక్తి వ్యాఘాతముగాను, మూలవిరుద్ధముగాను, ఈయుగమున స్త్రీపునర్వివాహము నిషేధమని వ్యాఖ్యానము చేయునని నమ్మఁదగియు నుండదు. ఇప్పుడు చెప్పినయర్థమే సరి యయినచో, మాధవాచార్యులవారు,-

"శ్లో॥ ఊఢాయాః పునరుద్వాహం జ్యేష్ఠాంశం గోవధం తథా।
కలౌ పంచ నకుర్వీత భ్రాతృజాయాం కమండలుమ్॥

అను నాదిత్యపురాణవచనమునుబట్టి, పయివిధి కలియుగనిషేధములలో జేరినదేమో యని సాధారణులు భ్రాంతిపడుదు రని యెంచి,

తద్భ్రాంతి నివారణార్థముగా "ఊఢా శబ్దేన విధివదూఢా గ్రాహ్యా అన్యత్ర పునరుద్వాహ స్యాత్రా ప్యంగీకృతత్వాత్" అని పూర్వ కాలమునందు మొదటి వరునికంటె మంచివరుఁడు దొరికిన పక్షమున వివాహిత యయిన కన్యకకు మరల వివాహము చేయు విధికలదు గానఁ బై నిషేధ మట్టి యూఢావిషయమనియు, 'అపి శబ్ద సారస్యముచేత ఆయూఢలలోను అక్రమోఢ యనఁగా బలవంతముగా నెత్తుకొని పోయి కాని మఱియొకవిధముగా మోసముచేసి కాని విధియుక్తముగా వివాహము చేసికోఁబడిన కన్య పునర్వివాహమునకు యోగ్యురాలే యనియుఁ దెలియ వ్రాసియుందురు. ఊఢయనఁగా విధియుక్తముగా వివాహము చేయఁబడిన స్త్రీ. "పరివేదన పర్యాధానయోరివ స్త్రీణాం పునరుద్వాహ స్యాపి ప్రసంగాత్ క్వచిదభ్యనుజ్ఞాం దర్శయతి" పరివేదన పర్యాధానములకువలెనే స్త్రీల పునర్వివాహమునకును ప్రసంగమువలన కొంచె మభ్యనుజ్ఞ ప్రదర్శించి యున్నాఁడను మాధవీయ వ్యాఖ్యానము వల్లను, మూలమునందు 'నారీణా' మను స్త్రీసామాన్యవాచక ప్రయోగమువల్లను, వ్యాఖ్యానమునందును "స్త్రీణా" మని సే దానికర్థము వ్రాయఁబడుటవల్లను, ప్రకరణమువల్లను గూడ "నష్టే మృతే" ఇత్యాది విధి పరివేదిపరముకాదని బాలురకు సహితము తెలియును. ఇది యాచారకాండమునందు లేక ప్రాయశ్చిత్త కాండమునందున్న దనుట యొక యాక్షేపము కాదు; ప్రాయశ్చిత్త సంబంధములేని పెక్కువిషయము లాకాండమునందుఁ జేరి యున్నవి. అంతియకాక ప్రాయశ్చిత్తకాండమునందుఁ జెప్పిన యీవిధులను గాకవేఱుగా భర్త పోయిన స్త్రీలవిషయమయి సహగమనాది విధులను మఱెక్కడను పరాశరులవారు వ్రాసియుండలేదు. ముందెవ్వరో తనస్మృతికి వ్యాఖ్యానము చేయువారు చెప్పుదురని, పరాశరుఁడు తనస్మృతిలో సామా

న్యముగా మృతభర్తృకల విషయమయిన ధర్మములను విడిచిపెట్టు ననుట యుక్తికిని అనుభవమునకును విరుద్ధమగునుగదా? అంతియ కాక పరాశరులవారు తన స్మృతియందు ప్రాయశ్చిత్తముతో సంబంధములేని "ఔరసః క్షేత్రజశ్చైవ దత్తః కృత్రిమకస్సుతః। దద్యాన్మాతా పితావాపి సపుత్రో దత్తకస్స్మృతః॥" (ఔరసుఁడు, క్షేత్రజుఁడు, దత్తుఁడు, కృత్రిమకుఁడు, కొమాళ్ళు; తల్లిదండ్రులచే నియ్యఁబడినవాఁడు దత్తుఁడు) ఇత్యాది వచనములను ప్రాయశ్చిత్తకాండములో వ్రాసియున్నారు; ప్రాయశ్చిత్తమును విధించెడి, "శ్లో॥ క్షత్రియం మృత మజ్ఞానా ద్బ్రాహ్మణో యోనుగచ్ఛతి। ఏకాహ మశుచిర్భూత్వా పంచగవ్యేన శుద్ధ్యతి॥" (క్షత్రియుఁడు మృతుఁడయినప్పుడు అజ్ఞానముచేత వెళ్ళిన బ్రాహ్మణుఁడు ఒకదిన మశుచిగానుండి పంచగవ్యముచేత శుద్ధుఁడగును) ఇత్యాది వచనముల నాచార కాండమున వ్రాసియున్నారు. కాఁబట్టి యొకకాండమునందున్నవానికే యెక్కువ గౌరవము నియ్యవలెననుట యుక్తియుక్తము కాదు. సందర్భము తెలియుటకయి పూర్వోత్తర శ్లోకములఁ గూడ నిందుదాహరించుచున్నాను.—

శ్లో॥ "జ్యేష్ఠభ్రాతా యదాతిష్ఠే దాధానం నైవకారయేత్।
అనుజ్ఞాతస్తు కుర్వీత శంఖస్య వచనం యథా॥" ౨౭

పరాశరుఁడు వివిధధర్మములను జెప్పుచు ఇరువదియేడవ శ్లోకముచేత, అన్న యుండఁగా తమ్ముఁడు అదానము చేయఁగూడదనియు, శంఖుని వచన ప్రకారముగా అనుజ్ఞనుపొంది చేయవచ్చుననియు జెప్పినాఁడు;

శ్లో॥ "నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే॥" ౨౮

అను నిరువదియెనిమిదవ శ్లోకముచేత, పయిని జెప్పిన అయిదు ఆపదల

యందును స్త్రీలు పునర్వివాహము చేసికోవచ్చునని చెప్పినాడు;

శ్లో॥ మృతే భర్తరి యానారీ బ్రహ్మచర్యే వ్యవస్థితా।
సామృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః॥ ౨౯

అను నిరువదితొమ్మిదవ శ్లోకముచేత, మగడు పోయినపిమ్మట యేస్త్రీ బ్రహ్మచర్యము నందు వర్తించునో ఆస్త్రీకి మరణానంతరము బ్రహ్మచారులకు వచ్చు స్వర్గము లభించునని చెప్పినాడు;

శ్లో॥ "తిస్రఃకోట్యర్ధకోటీచ యాని లోమాని మానుషే
తావత్కాలం వసేత్స్వర్గే భర్తారం యానుగచ్ఛతి॥" ౩౦

అను ముప్పదవ శ్లోకముచేత, పెనిమిటితో సహగమనము చేయు స్త్రీ మనుష్యశరీరముమీఁద నెన్ని రోమములుండునో యన్ని సంవత్సరము లనఁగా మూఁడుకోట్ల యేఁబదిలక్షల సంవత్సరములు స్వర్గమునందు వసించునని చెప్పినాఁడు. పూర్వోక్తశ్లోకములోని "ప్రవ్రజితే" యను పదముచేత, ఈవిధి బ్రాహ్మణేతరులకేయని చెప్పుటకు లేశమయినను అవకాశ ముండదు. ఇప్పుడు ముద్రితమయియున్న మనుస్మృతిలో ఈశ్లోకము కనఁబడక పోయినను, పరాశరులవారు దీనిని మనుస్మృతిలోనుండి తీసికొన్నట్టు మాధవాచార్యులవా రొక్కచోట వ్రాసియున్నారు. అట్లయినచో

శ్లో॥ వేదార్థోప నిబద్ధత్వాత్ ప్రాధాన్యంతు మనోః స్మృతం।
మన్వర్థ విపరీతాయాః సాస్మృతి ర్న ప్రశస్యతే॥

అను నాపస్తంబ స్మృతి వచనమును బట్టి సర్వస్మృతులకంటె ఉత్కృష్టమయిన మనుస్మృతియును ముఖ్యముగా కలియుగము కొఱకే యేర్పఱుపఁబడిన పరాశరస్మృతియును కూడ స్త్రీపునర్వివాహము నంగీకరించుచునే యున్నవి. స్త్రీపునర్వివాహము ధర్మశాస్త్రసమ్మతమగుటకు స్మృత్యంతరములయందును ప్రమాణవచనములు పెక్కులు

గలవు. అందుఁ గొన్నిటి నిందు క్రింద ప్రదర్శించుచున్నాను:—

శ్లో॥ "పాణిగ్రాహే మృతే కన్యా కేవలం మంత్ర సంస్కృతా।
సాచేదక్షతయోనిస్స్యా త్పున స్సంస్కార మర్హతి."

పాణిగ్రహణము చేసికొన్నవాఁడు మృతినొందినప్పుడు, మంత్రయుక్తముగా వివాహముచేసికొన్న స్త్రీకి అక్షతయోనియైన పక్షమున మరల వివాహము చేయవచ్చునని వాసిష్ఠ స్మృతియందును,

శ్లో॥ ఉద్వాహితాపి యాకన్యా న స్యా త్సంప్రాప్త మైథునా।
పునస్సంస్కార మర్హేత యథాకన్యా తథైవసా."

వివాహము చేసికొన్న దైనను పురుష సంపర్కమొందనిదై యున్నయెడల, కన్యక కెట్లో యట్లే దానికిని వివాహము చేయవచ్చునని నారదస్మృతియందును,

శ్లో॥ 'దేయాన్యత్ర వివాహితాపిచ బలాద్వావిద్ధయోని ర్నచేత్'

పెండ్లియైనదైనను పురుషసంభోగము లేనిదైనచో మఱియొకనికిచ్చి బలాత్కారముగా వివాహము చేయవచ్చునని మార్కండేయస్మృతి యందును, పునర్వివాహ మంగీకరింపఁబడి యున్నది. మఱియు "నష్టే మృతే" యనుశ్లోకము నారదసంహితయందును గైకొనఁబడి యున్నది; మఱియు మనుస్మృతియందు మఱియొకచోట

శ్లో॥ "సాచే దక్షతయోని స్స్యా ద్గత ప్రత్యా గతాపివా
పౌనర్భవేన భర్త్రాసా పునస్సంస్కార మర్హతి॥"

అని యక్షతయోనియైన స్త్రీకిఁ బునర్వివాహ మొప్పుకోఁబడి యున్నది. యాజ్ఞవల్క్య స్మృతియందును

శ్లో॥ "అక్షతాచ క్షతాచైవ పునర్భూ స్సంస్కృతా పునః"

అని అక్షతయోనియైనను కాకపోయినను గూడ పునర్భూవివాహ మంగీకరింపఁబడి యున్నది. "ప్రథమ మేకస్యజాయా భూత్వా పునః

అన్యస్య జాయా భవతీతి పునర్భూః" అని ముందొకనికి భార్యయై మరల మఱియొకనికి భార్య యగునది పునర్భువని గురుబాల ప్రబోధిక యందు పునర్భూ శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము వ్రాయఁబడి యున్నది. ఇంతవఱకును వ్రాసిన దానినిబట్టి స్త్రీపునర్వివాహము ధర్మశాస్త్ర సమ్మతమని కూడ విశదమయినదిగదా? పెనిమిటి బ్రతికియుండగానే మఱియొక మంచివరుఁడు దొరికినయెడల స్త్రీకిఁ బునర్వివాహమును విధించు మనుస్మృతులు నిజముగా భర్తృవియోగమును పొంది యాపద్దశయందుండు స్త్రీకిఁ బునర్వివాహమును విధించకపోవునా? మంచి వరుఁడు దొరకినప్పుడుకూడ స్త్రీకిఁ పునర్వివాహమును విధించు స్మృతి వచనములలో నొకటి రెంటి నిందు క్రింద వ్రాయుచున్నాను —

శ్లో॥ దత్తామపి హరేత్పూర్వా చ్ఛ్రేయాంశ్చేద్వర ఆవ్రజేత్."

యా. స్మృ.

శ్లో॥ "హీనశ్చే త్కులశీలాభ్యాం హరే త్కన్యాం నదోషభాక్
నమంత్రాః కారణం తత్ర నతు కన్యానృతం భవేత్॥"

శా. స్మృ.

పైనుదాహరించిన "ఊఢాయాః పునరుద్వాహమ్" మొదలుగాఁ గల యాదిత్యపురాణవచనమును, "దత్తా శ్చైవ కన్యాయాః పునర్దానం పరస్యచ" అను బృహన్నారదీయవచనమును, భర్త జీవించియుండఁగా జేయు పూర్వశ్లోక ద్వయోదాహృత స్త్రీపునర్వివాహమును నిషేధించుట కై పుట్టఁబడియుండును. ఇవి గట్టిగా స్త్రీపునర్వివాహమును బొత్తిగా గలియుగమున నిషేధించుటకై పుట్టినవేయని మీరు వాదించెడు పక్షమున, అవి ప్రమాణములే కావని నేను దృఢముగాఁ జెప్పఁ గలను. పైనిజెప్పిన రెండువచనములును అష్టాదశపురాణములలోనివి కాక, ఉపపురాణములలోనివయి యున్నవి. అందులోను "ఊఢాయాః

పునరుద్వాహః" మన్నది ముద్రింపఁబడిన యాదిత్యపురాణములో లేనే లేదు. ఒకవేళ నీరెండువచనములును అష్టాదశ పురాణములలో నొక దానిలోనివే యైనను గ్రాహ్యములుగావు. ఎట్లన

శ్లో॥ "శ్రుతి స్మృతి పురాణానాం విరోధో యత్ర దృశ్యతే।
తత్ర శ్రౌతం ప్రమాణంతు తయోర్ద్వైధే స్మృతిర్వరా॥"

అను వ్యాస వచనముచేఁబట్టి శ్రుతిస్మృతి పురాణములలో విరోధము సంభవించినపుడు శ్రుతియే ప్రమాణమనియు, స్మృతికిని పురాణమునకును భేదము సంభవించిన యెడల స్మృతియే శ్రేష్ఠమనియు సిద్ధాంత మగుచున్నది గనుక, స్త్రీపునర్వివాహము వేదవిహితమయినప్పుడు స్మృతియుఁ బురాణమునుకూడ విరోధముగా నున్నను అవి కొంచెమయినను ప్రమాణములు గావు; అట్టిస్థితిలో స్మృతియొక్కటియే విరోధముగా నున్నప్పుడు సహితము పనికిరాని పురాణము శ్రుతియు స్మృతియుఁగూడ నేకీభవించి యుండఁగా తద్విరోధముగా నెట్లు పనికివచ్చును? కాఁబట్టి యీపురాణవచనములు శ్రుతి స్మృతుల నొలతమాత్రమయిను బాధింపనేరవు. ఇట్లన్నచో నిఁక స్మృతిపురాణములలో నేమి ప్రయోజనమున్నదని మీరు శంకచేయవచ్చును. శ్రుతిలోఁ జెప్పఁబడనిదాని విషయమయి స్మృతియు, శ్రుతి స్మృతులలోఁ జెప్పఁబడని దాని విషయమయి పురాణమును, ప్రమాణములు గనుక వానివలనను ప్రయోజనము కలదని నేనుజెప్పెదను. ఇందుకు నిదర్శనముగా నాపస్తంబులవారి వాక్యముల నిందుదాహరించెదను.—

శ్లో. "య దదృష్టంహి వేదేషు తద్ద్రష్టవ్యం స్మృతౌ కిల
ఉభాభ్యాం యదదృష్టస్తు తత్పురాణేషు పఠ్యతే.
శ్లో॥ శ్రుతి స్మృతి పురాణేషు విరుద్ధేషు పరస్పరం,
పూర్వం పూర్వం బలీయం స్యా దితి న్యాయవిదో విదుః,"

వేదములయందుఁ గనఁబడని విషయములను స్మృతివలన గ్రహింప వలయును; ఆరెంటియందును గనఁబడని విషయములను పురాణముల నుండి గ్రహింపవలయును; శ్రుతిస్మృతిపురాణములలో విరోధము కనఁబడునపుడు వెనుకటిదానికంటె ముందుది బలీయమయినదని న్యాయ విదులు చెప్పుదురు, అని పై శ్లోకద్వయమునకును తాత్పర్యము. ఇట్లింతదూరము చెప్పుటచేత పురాణములు స్త్రీపునర్వివాహమును నిషేధించుచున్నవని నామతము కాదు; ముఖ్యములైన పురాణములును స్త్రీపునర్వివాహము నంగీకరించుచునే యున్నవి. అందఱిచేతను పంచమ వేదమని యంగీకరింపఁబడిన భారతమునందు,

> "శ్లో॥ అర్జునస్యాత్మజః శ్రీమా నిరావా న్నామ వీర్యవాన్
> సుతాయాం నాగరాజస్య జాతః పార్థేన ధీమతా
> ఐరావతేన సా దత్తా హ్యనపత్యా మహాత్మనా
> పత్యౌ హతే సుపర్ణేన కృపణా దీనచేతనా ॥"

అని యర్జునుఁడు మృతభర్తృక యయిన యులూచిని శాస్త్రీయముగా వివాహము చేసికొని యిరావంతుఁడను పుత్రుని బడసినట్టు భీష్మపర్వ మునఁ జెప్పఁబడి యున్నది; అరణ్యపర్వమున దమయంతికి ద్వితీయ స్వయంవరమని చెప్పిపంపఁగా నామెను పునర్వివాహము చేసికొనవలె నను నిచ్ఛతో ఋతుపర్ణునంతటి రాజర్షి వచ్చినట్టు చెప్పఁబడి యున్నది. "అక్షతా భూయ స్సంస్కృతా పునర్భూః" అని విష్ణుపురాణమునందు అక్షత యయిన పునర్భూ వివాహము కంఠోక్తిగానే విధింపఁబడి యున్నది. ఇవి యన్నియు విమర్శింపఁగా స్త్రీపునర్వివాహము శ్రుతి స్మృతి పురాణ సమ్మతమని నిష్కృష్టాంశము తేలుచున్నది.

ఇఁక మీరు స్త్రీపునర్వివాహమునకు శాస్త్రసమ్మతి యున్నను శిష్టాచారము కావలెనను రేమో శాస్త్రతిరస్కారముచేసి మనసు

వచ్చినట్టు ప్రవర్తించువారు శిష్టులు కారు గనుక, శాస్త్రవిహితమైన పనికి వేరుగ శిష్టాచారము గనఁబఱుపవలసిన యక్కఱ యుండదు.

"లోకే(వేత్యవిహితోధర్మః - తదలాభే శిష్టాచారః ప్రమాణం"

అను వ్యాస వచనమును బట్టియు,

"శ్లో॥ ధర్మజిజ్ఞా సమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః।
ద్వితీయం ధర్మశాస్త్రంతు తృతీయం లోకసంగ్రహః॥"

ధర్మజిజ్ఞాస చేయువారికి ప్రథమప్రమాణము వేదమనియు, రెండవ ప్రమాణము ధర్మశాస్త్రమనియు, మూడవప్రమాణము లోకాచారమనియు చెప్పు భారతానుశాసనికపర్వ వాక్యమును బట్టియు,

"శ్లో॥ న యత్ర సాక్షాద్విధయో నవిషేధాః శ్రుతౌ స్మృతౌ।
దేశాచార కులాచారా స్తాత్ర ధర్మం నిరూప్యతే॥"

శ్రుతి స్మృతులకు విరోధముగా నుండనపుడు మాత్రమే దేశాచార కులాచారములు ధర్మములను జెప్పుననియున్న స్కాందపురాణవచనమును బట్టియు, శాస్త్రములోఁ జెప్పని విషయములకుమాత్రమే శిష్టాచారము ప్రమాణము గనుక, శాస్త్రోక్తమయిన స్త్రీపునర్వివాహమునకు శిష్టాచారముతో బనిలేదు. కావలయునన్న అర్జునుఁడు విధవయయిన యులూచిని పెండ్లియాడుటయు, ఋతుపర్ణుఁడు దమయంతిని ద్వితీయ స్వయంవరమున వరింపఁ జనుదెంచుటయు శిష్టాచారములే. ఇప్పటి వారిలోనే కావలెనన్న, పునహా మొదలగు దేశములయం దిప్పుడు జరుగుచున్న స్త్రీపునర్వివాహములే శిష్టాచారమునకు నిదర్శనములని చెప్పవచ్చును. మనయాంధ్రదేశమునందే యీయాచారమును జూప వలయునన్న, మనశాస్త్రమునకే బద్ధులైయున్న గొల్లలు మొదలగువారియందుఁ బునర్వివాహము స్త్రీలలో జరుగుచుండుటను దృష్టాంతముగాఁ జెప్పవచ్చును. గొల్లలు మొదలగువారి యాచారము

శిష్టాచారమని నేను చెప్పరాను గాని, నిరక్షరకుక్షులగుటచేత నెప్పుడును గతానుగతికులుగానే యుండవలసిన వారియందీ యాచారము నడుమఁ దెచ్చిపెట్టుకోఁబడ్డదనుట కవకాశ ముండదనియు, అందువలన హిందువులలో స్త్రీలకుఁ బునర్వివాహము చేసెడి యాచారము పూర్వమునుండియు నుండి మధ్య గొప్పజాతులవారు విడిచిపెట్టినను వారిలో మాత్రము నేఁటివఱకును వచ్చుచున్నదనియు మాత్రము చెప్పెదను. ఇందువలన స్త్రీపునర్వివాహము శ్రుతి స్మృతి పురాణ శిష్టాచారముల చేతను యుక్తిచేతను అవశ్యకర్తవ్యమని కనబడుచున్నది.

పురాణవచనములు శ్రుతిస్మృతులను బాధింపలేకపోయిన యెడల,

శ్లో॥ అశ్వాలంభం గవాలంభం సన్యాసం పలపైతృకమ్ ।
దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌ పంచ వివర్జయేత్ ॥

అని కలినిషేధములలోఁ జేరిన యీకార్యములనెల్ల మరల నాచరింపవలసినదే విధి యగునాయని కొంద ఱడుగుదురు. ఈశ్లోకమును, పూర్వోక్త బృహన్నారదీయాదిత్య పురాణవచనములును, "కాలికా క్షతయోన్యోశ్చ వరేణాన్యేన సంస్కృతిః" ఇత్యాద్యక్షతయోనికా పునర్వివాహ నిషేధవచనములును, శ్రుతిస్మృతులకంటెఁ బురాణములు బలీయములని సాధించుటకుఁ బనికిరావుగాని, పూర్వకాలమునం దక్షతయోనికా వివాహాదు లాచరింపఁబడుచు వచ్చెననుటకును, ఆయా కాలములవారు దేశకాలవైపరీత్యములనుబట్టి లోకవిరుద్ధములుగాఁ దోఁచిన శాస్త్రవిహితధర్మములను కాలానుగుణముగా నప్పుడప్పుడు మార్చుకొనుచు వచ్చిరనుటకును నిదర్శనములుగా నుండును. దైవకృతములని యెన్నఁబడిన శ్రుతిస్మృతులలోని విధులనే యిష్టానుసారముగా మార్చుటకును వారి తరువాతివారికిని స్వాతంత్ర్యముండునేని,

మొన్న మొన్న పుట్టిన కట్టుబాటులను నష్టికరములని యేర్పడినప్పుడు మనము మాత్రమేల మార్చుకోరాదు? తన పూర్వపువారు కలియుగమున నిషేధించిన సన్యాసమును శంకరాచార్యులు మరల స్థాపించుటయు కాలానుగుణముగా విధులు మార్పుచెందవలయు ననుటకును, చెందుచు వచ్చుననుటకును దృష్టాంతమయి యున్నది. పయిని జెప్పిన నిషేధములన్నియు నష్టికరములుగాఁ గనఁబడినందున వాని నాచరణమును మానుకొన్నను సర్వవిధములచేతను లాభకరమయిన యీ స్త్రీపునర్వివాహమును అగ్రవర్ణములవారెందుకు మానుకొన్నారని మీరు శంకింపవచ్చును. తక్కువజాతులవారగు రజకులు మొదలయినవారు చేసెడి పని నే యగ్రజాతులవారను మనము జేసినయెడల మన యాధిక్యమేమను దురభిమానముచేతనో, అప్పుడు దుష్టరాజులు రాజ్యము చేయుచున్నందున స్త్రీపునర్వివాహవిధి యున్న పక్షమున వారు బలవంతముగా భర్తలను జంపించి వారి చక్కని భార్యలను గైకొందురను భయముచేతనో, స్త్రీలే మఱియొక పురుషునిమీఁద తమకు బుద్ధిపుట్టినప్పుడు భర్తలను విషప్రయోగాదులచేఁ జంపి తమ యిష్టమువచ్చిన వారిని పెండ్లియాడుదురను పిచ్చియూహచేతనో, సంతులేని వితంతువులసొత్తును అపహరింపవచ్చునను బంధువుల దుర్బుద్ధిచేతనో, మఱి యిట్టి యేయితర కారణముచేతనో మనపూర్వులిట్టి వివాహములను మాన్పియుందురు. ఈకాలమున నట్టి బాధకములేవియు లేకపోవుటచేతను, స్త్రీపునర్వివాహము లేకపోవుటవలన జరగు ఘోరకృత్యములసంఖ్యములుగాఁ గనబడుచున్నందునను, మరల కాలానుగుణముగా ఆచారమును మార్చుకొనుటయందే యాక్షేపణమును గనఁబడదు. ప్రభువుల ధర్మపరిపాలనముయొక్క తారతమ్యమును బట్టియే ధర్మములు నడచుచు వచ్చునుగాని పూర్వకాలమే మంచి

దనికాని యీకాలము చెడ్డదనికాని యెంచ వల్లకాదు. కృతయుగము నందును వేనుఁడు మొదలగు దుష్టప్రభువులు రాజ్యము చేయుకాల ములో ధర్మములు చెడిపోయినట్లును, త్రేతాయుగములో రావణుఁడు మొదలగువారు దేశోపద్రవమును జేసినట్లును మన స్మృతులును పురాణములును జెప్పుచున్నవిగదా? ధర్మములు క్రమముగా జరుగునేని, ఇదియే కృతయుగమగును; యుగభేదముచే నొక లాభకరమయిన పని యాయుగమున మాత్రము జరగరాదనుట వెఱ్ఱిమాట. దీని బట్టియే మనుస్మృతి నవమాధ్యాయమునందు,-

శ్లో॥ "కృతం త్రేతా యుగం చైవ ద్వాపరం కలి రేవచ
రాజ్ఞోవృత్తాని సర్వాణి రాజాహి యుగముచ్యతే.
కలిః ప్రసుప్తో భవతి సజాగ్ర ద్ద్వాపరం యుగమ్
కర్మ స్వభ్యుద్యత స్త్రేతా విచరంతు కృతం యుగం॥"

కృత త్రేతా ద్వాపర కలియుగంబులు రాజకృతములే యనియు, రాజు లనుబట్టియే యుగవ్యవహారము గలిగెననియు, రాజు తెలియనివాఁ డగుచో కలియనియు, తెలిసియు నడవకున్న ద్వాపర మనియు, నడవఁ బ్రయత్నము చేయుచో త్రేతయనియు, కార్యములు సాగించినచోఁ గృతయుగమనియుఁ జెప్పఁబడి యున్నది. దీనినిబట్టి విచారింపఁగా యుగభేదములనుబట్టి ధర్మవ్యవస్థ లేర్పడుటకంటె రాజులయొక్క ప్రభుత్వ స్థితినిబట్టి యప్పటి సాధక బాధకముల నాలోచించి కాలానుగుణముగాఁ గావలసిన మార్పుల నేర్పరచుకొనుటయేకాని వేఱుకాదని తోఁచు చున్నది. కాఁబట్టి యిప్పటి కాలమున కనుకూలముగా మనమీ భ్రూణ హత్యాది దోషనివారకమయిన సదాచారము నేర్పఱచుకొనుట సర్వ విధముల శ్రేయోదాయకమును నిర్బాధకమును అని తోఁచుచున్నది.

"శ్లో॥ పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే।
పుత్రో రక్షతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి॥"

అను శ్లోకమును జదివి మొన్న నొకపండితుఁడు స్త్రీపునర్వివాహము వలన స్త్రీకి స్వాతంత్ర్యము కలుగుననియు, స్త్రీకి స్వాతంత్ర్యము నెప్పుడు నియ్యఁగూడ దనియు, స్త్రీపునర్వివాహమున కదియే యాక్షేపణమనియుఁ జెప్పియున్నాఁడు. స్త్రీపునర్వివాహమువలన స్త్రీలకు వచ్చు స్వాతంత్ర్యమేదియు లేదు; మగఁడు పోయిన స్త్రీని ఆజ్ఞ పెట్టువారు లేకుండఁజేసి స్వేచ్ఛగా వదలివేసిననే స్వాతంత్ర్యము కలుగును గాని, భర్త యొకఁడుండినపక్షమున స్వాతంత్ర్య మెన్నటికిని కలుగ నేరదు. "భర్తా రక్షతి యౌవనే" యౌవనమునందు భర్త రక్షించు నని యుండుటచేత, యౌవన మున్నంతవఱకును స్త్రీకి భర్త యుండి యామె యాతని యాజ్ఞలో నుండవలెనని యేర్పడి యౌవనమున భర్త పోయిన స్త్రీకి పునర్వివాహము విధ్యుక్తమయినట్టే తేటపడు చున్నది.

ఓపండితసార్వభౌములారా! శాస్త్రములకుఁ బ్రత్యక్షవిరోధముగా ననేక దుశ్చేష్టలు జరుగుచుండఁగా కన్నులు పెట్టుకొని చూచుచు నోరెత్తలేక యూరకుండెడి మన మీయనాథలయిన యబలల విషయములో మన పాండిత్యమునంతను గనఁబఱిచి, దురభిమానులు మెచ్చునట్లు శాస్త్రమున కపార్థములు గల్పించి, కోమలుల సౌఖ్యమునకు విఘాతము కలిగించి యందువలన వారు బహుదుష్కార్యములకు దిగునట్లు చేయ మన యావచ్ఛక్తిని వినియోగింపవలయునా? పిచ్చుక మీఁద బ్రహ్మాస్త్రము వేసినట్లును, ఆఱునెలలు సాముచేసి మూల నున్న ముసలిముండను గొట్టినట్లును, ఎంతోకాలము కష్టపడి మనము చదువుకొన్న చదువునంతను మగఁడు చచ్చిన యాఁడువారిని బాధించు

టకే ధారపోయవలయునా? మన విద్యను వివేకమును గతిలేని యనాథలను దుస్థితినుండి తొలఁగించి కాపాడుటకయి యుపయోగింపరాదా? "శ్లో॥ యత్పాపం బ్రహ్మహత్యాయాం ద్విగుణం గర్భపాతనే। ప్రాయశ్చిత్తం న తస్యాస్తి తస్యాస్త్యాగో విధీయతే." అను పరాశరస్మృతి ప్రకారముగా బ్రహ్మహత్యకంటెను ఘోరపాతకమయి ప్రాయశ్చిత్తము సహితములేని భ్రూణహత్యాదులకు మూలమయిన దానిని వృద్ధిపొందించుటకయి శాస్త్రతిరస్కారమును జేయ శంకింపక, అట్టి ఘోరపాతకము లడఁగునట్లు బహుజనోపకారకముగా శాస్త్రసమ్మతమయిన స్త్రీపునర్వివాహము జరుగుట కనుజ్ఞ యియ్యక, మూఢులయిన జనుల మెప్పుకొఱకు మన మాత్మవంచకులమయి పాపభీతి లేక శాస్త్రమునకు విపరీతార్థములుచేసి దురాచారమును నిలువఁబెట్టుటకయి మన శక్తినంతిను వినియోగించిన ముందు మనకేమి ప్రతిష్ట రాఁగలదు? ఈశ్వరుఁడైనను మనల నెట్లు మెచ్చును? కాఁబట్టి యితరుల మెప్పును విచారించుటకు ముందు తాము చేయుపనిని తమ యంతరాత్మ మెచ్చునో లేదో ముఖ్యముగా విచారింపఁ బండిత మండలి నెల్లను మిక్కిలి వినయముతోఁ బ్రార్థించుచున్నాను.

అన్నివిధములచేతను స్త్రీపునర్వివాహ మీకాలమున నవశ్యాచరణీయమని విదితమగుచున్నను, దానికి ప్రతిబంధకముగా కొందఱు కొన్ని యాక్షేపణములు పలుకుదురు. స్త్రీపునర్వివాహమునకు విధి యున్నప్పుడు "స్త్రీపునర్వివాహమంత్రము లెక్కడ నున్నవి?" "ఒకసారి యియ్యఁబడిన స్త్రీని మరల నెట్లియ్యవచ్చును?" "పూర్వభర్తయాబ్దిక మెవ్వరు పెట్టుదురు?" మొదలయినవి గొప్ప యాక్షేపణాంశములుగావు. స్త్రీపునర్వివాహ విధు లుండి, వివాహమంత్రములను మార్చవలసిన విధులుండకపోవుటచేత, ప్రథమవివాహమునం దేయే

మంత్రములున్నవో ద్వితీయ వివాహమునందును ఆయామంత్రములే పనికివచ్చును. మృతభర్తృకకు సహితము రజస్వల కాకమునుపు కన్యా శబ్దవ్యవహారము గలదు.

శ్లో॥ అష్టవర్షా భవేత్కన్యా నవ వర్షాతు రోహిణీ
దశవర్షా భవేద్గౌరీ అత ఊర్ధ్వం రజస్వలా॥

అని యున్నను. పండ్రెండు సంవత్సరముల వయస్సుగల చిన్నదానికి వివాహము చేయునపుడు సహితము "కన్యా" మనుటకు మాఱుగా "రజస్వలా" మని, యేవివాహమునందును మంత్రమును సంస్కరించుటయు లేదు. స్త్రీపునర్వివాహము చేయవలయునని విధి యెప్పుడున్నదో, అప్పుడే దత్తయైన స్త్రీ మరల నియ్యఁబడుట కర్హురాలని శాస్త్రమువల్లనే తెలియవచ్చుచున్నది. ఒకసారి దత్తయయిన స్త్రీ మరల నియ్యఁబడఁగూడదనెడిపక్షమున, పూర్వోదాహృతములైన ఊఢా పునర్వివాహ విధాయక స్మృతివచనములును,

శ్లో॥ "ప్రతిగృహ్య యః కన్యాం వరో దేశాంతరం వ్రజేత్
త్రీనృతూన్సమతిక్రమ్య కన్యాఽన్యం వరయేద్వరమ్॥"

ఇత్యాది గణనాతీతములైన స్మృతివచనములును వ్యర్థములయి పోవును. కాఁబట్టి "యిచ్చిన కన్యను మరల నియ్యరా" దను వచనమునకు వివాహిత యయినదానిని నక్రమముగా మఱియొకని కియ్యరా దనికాని, స్మృతిలో నుదాహరింపఁబడిన స్థలములలోఁ దప్ప వేఱుచోట్ల నియ్యరాదనిగాని యర్థము చెప్పుకోవలెను. అంతియకాక కన్యా దానము వధూవరు లిద్దఱును యావజ్జీవము పరస్పర సౌఖ్యము నిమిత్తము కలిసి యుండుటకై యేర్పఱుచుకొన్న యొకవిధమయిన యొడంబడికయొక్క పూర్వాంగమేగాని, దాత తనస్వత్వమును వదలుకొని యచేతన పదార్థమునువలె ప్రతిగ్రహీత తన మనసువచ్చినట్టు

చేసికొనుటకును యిచ్చుటకాదు అట్లు కానియెడల మన ధర్మశాస్త్ర ప్రకారము ఆకన్యక విషయమయిన స్వత్వమును బొత్తిగా లేనివారు సహితము దానముచేయుట కెట్లర్హులగుదురు ?

"శ్లో॥ పితా దద్యా త్స్వయం కన్యాం భ్రాతా వానుమతే పితుః
మాతా మహో మాతులశ్చ సకుల్యో బాంధవ స్తథా
మాతా త్వభావే సర్వేషాం ప్రకృతౌ యది వర్తతే
తస్యా మప్రకృతిస్థాయాం కన్యాం దద్యు స్స్వజాతయః ॥"

అను నారదసంహితా వచనమునుబట్టి, పిత్రాద్యభావమునందు బంధువులును స్వజాతివారును కన్యాదానము చేయవచ్చునని కనఁబడుచున్నది. వివాహములయందలి కన్యాదానము చేయుట, ఆకన్యవిషయమయిన స్వత్వముగలవారు తమకుఁగల స్వత్వము వదలుకొనుటకే యనెడుపక్షమున, బాల్యముననే జననీజనకులు మొదలైనవారిని పోఁగొట్టుకొన్న కన్యలగతి యేమి కావలయును ? స్త్రీపునర్వివాహమయినతోడనే పూర్వపుగోత్రమునుండి యన్యగోత్రమునకు మాఱిపోవును గనుకను, ఒకగోత్రమువారికి అన్యగోత్రమువారు ఆబ్దికాదులు పెట్టుట యశాస్త్రీయము గనుకను, స్త్రీ నూతనగోత్రమునకు మాఱినతోడనే పూర్వభర్తతోడి సంబంధమంతయు వదలిపోవును. అందుచేత నాతని యాబ్దికాదులును నష్టమైపోవును. ఒక్క స్త్రీల విషయముననే యిట్లుకాదు. ఒకపురుషుఁ డన్యగోత్రమునకు మాఱినప్పుడును అట్లే యగును. ఒక్కఁ డన్యగోత్రపువారికి దత్తుఁడయ్యెనేని, జనకపితతోడి సంబంధము బొత్తిగా వదలిపోవుట మన మందఱమును చూచుచునే యున్నాము గనుక, దీని విషయమయి నేను విస్తరించి చెప్పనక్కఱలేదు. మఱియును దాయవిషయమును, స్త్రీపునర్వివాహము శాస్త్రీయమను విషయమును, ప్రథమవివాహ మంత్రములే

ద్వితీయవివాహమునఁ బనికివచ్చునను విషయమును, మన దొరతనమువారిప్పుడొక రాజశాసనమువలన స్థిరపఱిచియే యున్నారు.

ఈ వఱకే యీవిషయమును విస్తారముగాఁ జెప్పియున్నాను. స్త్రీపునర్వివాహము యుక్తికిని శాస్త్రమునకునుకూడ అనుకూలముగా నున్నదనియుఁ గొంతవఱకుఁ జూపియున్నాను. శాస్త్రమునకుఁ దమ యిష్టానుసారముగా విపరీతమయిన యర్థమును జెప్పఁగల పండితోత్తములు పలువురున్నారనియు నేనెఱుఁగుదును. శాస్త్రవిచారముతోడ వస్తువిచారమును సహితము చేయవలెను. అట్లు చేయనియెడల విపరీత సిద్ధాంతము లేర్పడును. శర్కరరుచి యెట్టిదో సాధింపఁ బ్రయత్నింపక "అన్నిటిలో శర్కరయ మధుర మయిన" దను వాక్యమును బట్టియే విమర్శకుం బూనుకొన్నచో, అన్నిటిలోను శర్కరయే మధురమయిన దని సాధారణముగాఁ జెప్పెడి యర్థమును ఖండించి పండితసార్వభౌములు 'శర్కర అమధురమయిన' దని పదవిభాగమునుజేసి తమ యర్థమును సాధింపవచ్చును. అందుచేత సత్యము మూలబడి, శర్కర అమధుర మయిన దనఁగా తియ్యనిదని చెప్పఁబడక, పుల్లనిదో చప్పనిదోయని సిద్ధాంత మేర్పడవచ్చును. సాధారణముగా పామరులు, చదువుకొన్నవారేమి చెప్పినను మాఱుమాటాడక విశ్వసింతురు. కాఁబట్టి పలువురు పామరులుచేరి చేయు హానికంటె విపరీతబుద్ధి యయిన యొక్కపండితుఁడు చేయుహానియే లోకమున నత్యధికముగా నుండును. అందుచేతనే "పాఠకా విపరీతాశ్చేత్ ప్రాకృతా ఏవ కేవలమ్" అను సదుక్తి లోకములో వెలసి యున్నది. మనలోఁ జదువుకొన్నవారెవ్వరును స్వప్రయోజనమునే ముఖ్యముగాఁ జూచుకొనక, నూఱు వచ్చినను నూఱు పోయినను లోకోపకారమునకయి తమయావచ్ఛక్తిని వినియోగించి దేశమును మంచిస్థితికి దెచ్చుటకుఁ బ్రయత్నింతు

రని మిక్కిలి ప్రార్థించుచున్నాను. మనవారీవఱకే శాస్త్రనిషిద్ధములయిన సముద్రయానము మొదలగువానిని సర్వసాధారణముగాఁ జేయుచున్నారు; శాస్త్రవిహితములయిన బ్రహ్మచర్యము మొదలగువానిని బొత్తిగా మానివేయుచున్నారు; ఆచారమునైనను నంతగా గౌరవించుచున్నట్టు కనఁబడదు. కొన్ని సంవత్సరముల క్రిందట ధూమనౌకలెక్కి సముద్రయాత్రచేయుట బొత్తిగా ఆచారము గాకపోయినను, ఇప్పుడు ధారాళముగా బ్రాహ్మణులలోని శ్రోత్రియులు సహితము ధూమనావలమీఁద సముద్రయానమును జేయుచున్నారు. ఈవిధముగాఁ దమరొక్కరి సదుపాయమును గోరి శాస్త్రమును మీఱుటకు సాహసించుచున్నప్పుడు, లోకోపకారార్థమయి శాస్త్రము వ్యతిరేకముగా నున్నను దానిని మీఱుట దోషమని తోఁచదు; ఐనను లోకోపకారమయిన యీపనికి శాస్త్రమును విరోధముగా లేదు. స్త్రీపునర్వివాహము లేకపోవుటవలనఁ గలిగెడు నష్టము లెల్లవారికిని జక్కఁగాఁ దెలియును; అట్టినష్టముల ననుభవముచేత నెఱిఁగియున్నవారును పలువురు గలరు; నూటిలో తొంబదిమందికి మనసులో స్త్రీపునర్వివాహము కావలెననియు, అది దోషనివారకమనియునే యభిప్రాయమున్నది. కాని నలుగురును ఏమనుకొందురోయను భీతిచేత చిరకాలమునుండి వచ్చుచున్న యాచారమునకు విరుద్ధముగాఁ జెప్ప తెగింపకున్నారు. "గతానుగతికో లోకో న లోకః పారమార్థికః" అన్నట్లు జనులందఱును ఒకరు పోయినట్లు మనమును బోవుద మనువారేకాని పారమార్థికబుద్ధితో న్యాయమయిన పని జనవిరుద్ధముగా నున్నను దానిని నిర్వహింతమని పూనుకొని నిలుచువారు లేరు. కొందఱికి పూనుకొని నిలువవలెనని యభిప్రాయ మున్నను, తోడుపడువారు లేకయు ప్రోత్సాహపఱచువారు లేకయు పైకిరాక, పూర్వమెంతో గొప్ప

వారు తలపెట్టినప్పుడే సాగినపని సాధారణులమగు మనము తల పెట్టినప్పు డగునా" యని నిరుత్సాహులయి యూరకుండుచున్నారు. సమస్త సాధనకలాపమును గల రాజాధిరాజులు సహితము చేయలేని పనిని ధైర్యస్థైర్యములు గల సాధారణులు స్వల్ప సాధనములతో సాధించి యున్నారు. ఒకపనిని నిర్వహించుటకు ధైర్యస్థైర్యములు సాధనములుగాని, గొప్పతనమును ధనమును ముఖ్యసాధనములు గావు. మన మింత యల్పసంఖ్యాకుల మేమి చేయఁగల మనియు సంశయింపఁ బనిలేదు. ఆరంభమున నేదియు ప్రపంచములో చిన్నది కానిది పెద్దదయినదిలేదు. దేశమంతటను బ్రవహించి సస్యములను ఫలవంతములనుగాఁ జేయుచు జంతుసమూహమున కెల్లను మధురోదకమునిచ్చుచు లోకోపకారములుగా నుండు పెద్దనదులన్నియు మొట్టమొదట నొకటిరెండు చిన్నయూటలనుండి పుట్టినవే. మొట్టమొదట మనమిప్పు డొక్కయూరివారమే యయినను, కాలక్రమమున దేశమంతయు మనలోనే చేరవచ్చును. మనము పూనినపక్షముయొక్క న్యాయమునుబట్టి మనలో పలువురు చేరుదురుగాని మనసంఖ్యాధిక్యమును జూచికాదు. కాఁబట్టి మీరు సంఖ్యయందు తక్కువగా నున్నను, ధైర్యముతోను స్థైర్యముతోను పనిచేయుదురేని మన దేశమునందలి స్త్రీలగతిని బాగుచేయుటకయి పూనుకొనువారిలో మీరే యగ్రగణ్యులుగానుండి శాశ్వతమయిన కీర్తిని పొందుదురనుటకు సందేహములేదు. మనస్సునకు యుక్తమని రూఢిగా దోఁచినపనిని భగవంతునిమీఁద భారమువేసి మూఢజనులును వేదజడులును జేయు దూషణములకు వెఱవక, యావచ్ఛక్తిని వినియోగించి నిర్వహింపవలయును. ఏసత్కార్యమునందుఁగాని చక్కఁజేసిన వారికేగాక, చేయించిన వారికిని ప్రేరేపించినవారికిని అందున కామో

దించినవారికినికూడ ఫలముకలదని బోధించు పండితోక్తి నిందుదాహరించుచు నిప్పటి కీవిషయము నింతటితో విరమించు చున్నాను.

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః।
సుకృతే దుష్కృతే చైవ చత్వార స్సమభాగినః॥

సర్వకారుణ్యుఁడును దీనజనబాంధవుఁడును అయిన ఈశ్వరుఁడు విశేషముగా మనదేశమునందలి యితరుల కష్టములను విచారింపక మాకుఁబూర్వమును స్వప్రయోజనపరులయి యుండఁ బుద్ధి పుట్టకుండునట్లును లోకోపకారపారీణులు కావలెనను బుద్ధి యుదయించునట్లును అనుగ్రహించునుగాక !



# స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము.

అస్మద్దేశీయులగు సదయహృదయులారా!

గతమాసమున స్త్రీపునర్వివాహవిషయమయిన యుపన్యాసము నొకదానిని బ్రచురించియున్నానుగదా? ఏమో వ్రాసినానని యనాదరింపక పలువురు పండితులును మహాజనులును దానిని సావధానముగాఁజదివి యాదరించుటచే నేనుపడిన ప్రయాసమంతయు సఫలమయినదని యెంతయు హర్షించుచున్నాను. నేనాయుపన్యాసమును సభలోఁ జదివినతోడనే యిచ్చటిపండితులు కొందఱు 'జని' శబ్దమునకు భార్య యను నర్థము లేదనియు, 'పతౌ' యనుదానికి పతిసదృశుఁడర్థమనియు కొన్నియాక్షేపణములను జేసి విచారణీయాంశముతో సంబంధింపని సంగతులనుకూడ చాలసేపుచెప్పిరి. ఆదినమున నాకుఁ బ్రత్యుత్తరము చెప్పుటకవకాశమియ్యనందునను పండితు లసత్యము చెప్పరాయను విశ్వాసముచేతను, సామాన్యజనులు కొందఱు మొట్టమొదట వారివాదముకూడ న్యాయమయినదేమోయని భ్రమపడినను, రెండవసారి వారు మొదట వాదించినవాదమును గట్టిపెట్టి కొంతవఱకు నేనుజెప్పిన యర్థములనే యొప్పుకొన్నందున నంతటికిని సంశయనివారణ మయినది. నాయుపన్యాసమునకు ఖండనగ్రంథమును తెలుఁగుభాషలో వ్రాసికొనివచ్చి చదివెదమని వారు మొదటిసభదినమున వాగ్దానముజేసియు వారట్లుచేయక సంస్కృతమున వ్రాసికొనివచ్చినందునను వారి కాధారముగానున్నవన్న భారద్వాజసూత్రాదులు తీసికొనిరాక నిరాధారములైన మాటలను జెప్పుచు వచ్చినందునను వారివాదమేదియు జనులు గ్రహింపలేక యలరి

చేసిరి. మరల పదియేను దినములకు జరుగఁబోవు సభయందు వారు తమ ఖండనగ్రంథమును తెనుఁగున వ్రాసికొని వచ్చెదమనియు భారద్వాజ సూత్రమును దెచ్చెదమనియు వాగ్దానము చేసినమీఁదట నాటికి సభ ముగిసినది. మరల జరిగిన సభనాఁడు వెనుకటిసభయందు నిర్ణయ మయినప్రకారముగా సభికులందఱును పండ్రెండుగంటలకే వచ్చినను పండితులుమాత్రము మూఁడుగంటలకువచ్చి తమయుపన్యాసమును జదివిరికాని భారద్వాజసూత్రమును దీసికొని రాలేకపోయిరి. వారి యుపన్యాసము ముగిసినతోడనే నేనును తోఁచినంతవఱకు సదుత్తరములను జెప్పినాను. నాటి వారివాదములో ముఖ్యమయినది శ్రుతిస్మృతులకంటె శిష్టాచారము ప్రధానమయినదనుట. ఇది యిట్లుండఁగా నామఱుసటి భానువారమునాఁడు జోస్యుల పేరిచయనులగారిలోపల మఱియొక సభచేసి, ఆసభకుఁ దమపక్షమున కనుకూలురై యున్నవారని తోఁచినవారిని మాత్రమే యాహ్వానముచేసి యెక్కడినుండియో వ్రాయించి తెప్పించిన నాయుపన్యాసముమీఁది ఖండనమును అద్దేపల్లి కృష్ణశాస్త్రులుగారు చదివిరి. ఆఖండనమునకు, సమాధానము చెప్పుటకయి నాకవకాశము నిచ్చెదమని సభికులందఱును వాగ్దానముచేసియు, వారిసిద్ధాంతమును నేను పూర్వపక్షము చేయ నారంభించిన కొంతసేపటికి కడుపునొప్పియని యొకరును కాలునొప్పియని యొకరును లేచిపోవ మొదలుపెట్టిరి. కృష్ణశాస్త్రులవారు తమకుఁ జెప్పుట కేమియుఁ దోఁచనప్పుడు "ఏమియుం దోఁచకున్న వెక్కిరించు" మన్న సామెతను జ్ఞప్తికిఁ దెచ్చుకొని, "శేషం కోపేన పూరయేత్" తను నార్యోక్తికిని లక్ష్యభూతులగుచువచ్చిరి. "బోద్ధారో మత్సరగ్రస్తాః" అను పండితోక్తిని పలుమాఱుచదివియు నేనేమో యనుకొనుచుంటినిగాని యీపండితులవాదమును జూచినతరువాత

దానిసత్యము లక్ష్యసహితముగా నాకు బోధపడినది. వారిఖండన గ్రంథములలోపల సారమంతగా లేకపోయినను, "దుర్మదధ్వాంత రవి" మొదలగు పెద్దపేళ్ళనుమాత్రము వానికిఁబెట్టి ఘృతకోశాతకీ న్యాయమున వానిని సార్థకపఱిచిరి. వారి ఖండనగ్రంథములను జదివి పదినేనుదినములకంటె నెక్కువగానయినను, వారిలో నొక్కరును తమగ్రంథముయొక్క ప్రతిని నేటివఱకును నాకియ్యనందున వానికిఁ బూర్ణముగాఁ బ్రత్యుత్తరములను వ్రాయుటకు శక్తుఁడనుగాకపోయి నను జ్ఞాపకమున్నంతవఱకును వానికి సమాధానములు వ్రాయుటయే కాక మఱికొన్ని విశేషాంశములఁగూడ నిందు వ్రాయుచున్నాను. ఇక్కడిపండితులు మొదట తాము వ్రాసిన ఖండనగ్రంథములు బాగుగ నుండలేదని మరల వ్రాయుచున్నారని వినుచున్నాను. నాయందుఁ గరుణించి పండితులును మహాజనులును నావిన్నపమును సావధాన ముగాఁ జిత్తగించి సత్యమును గ్రహింతురని వినయపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాను.

శాస్త్రమునకంటె శిష్టాచారము ప్రబలమైనదను విషయమును మొట్టమొదట విచారింతము. మొట్టమొదట శాస్త్రమును తిరస్కరించి తమ యిచ్ఛానుసారముగాఁ బ్రవర్తించువారు శిష్టులేకారు; ప్రతిపక్షు లయినను శిష్టులసదాచారమునే యనుసరింపవలయునని చెప్పెదరు. కాని వారిదురాచారములనుకూడ ననుసరింపవలయునని చెప్ప సాహసింపరని నేను దలంచెదను.

శ్లో॥ యస్మిన్ దేశే యదాచారః పారంపర్య క్రమాగతః ।
శ్రుతిస్మృత్యవిరోధేన సదాచార స్స ఉచ్యతే ॥

అను బోధాయనవచనమునుబట్టి యేదేశమునం దేయాచారము శ్రుతి స్మృతి విరోధములేకుండ పారంపర్యక్రమముగా వచ్చినదో యదే

సదాచారమని స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. ఈయర్థమునే

శ్లో॥ అనుష్ఠితంతు యద్దేవై ర్మునిభి ర్యదనుష్ఠితం।
నానుష్ఠేయం మనుష్యై స్త దుక్తం కర్మసమాచరేత్॥

అను స్మృతివాక్యమును చెప్పుచు, దేవతలచేతను మునులచేతను జేయఁబడినది మనుష్యులచే ననుష్ఠింపఁదగినది కాదనియు వారిచే (శ్రుతిస్మృతులయందుఁ) జెప్పఁబడిన కర్మలనే చేయవలయుననియు విధించుచున్నది. దేవతలయొక్కయు మునులయొక్కయు శ్రుతి స్మృతి విరుద్ధమయిన యాచారమే మనకు గ్రాహ్యము కాకపోవుచుండఁగా సామాన్యమానవులయొక్క యాచారము గ్రాహ్యముకాదని వేఱుగఁ జెప్పనక్కఱయే యుండదు. లోకాచారమునకంటె శ్రుతి స్మృతులే బలవత్తరములని చూపుటకై నేనీవఱకే నాయుపన్యాసమునందు వ్యాస, భారత, స్కాందవచనముల నుదాహరించియున్నాను. "ఆగమేతిహాస పురాణోక్తాచారస్తు వేదానుకూలవత్వా గ్రాహ్యః అగ్రాహ్య ఏవ తత్ప్రతికూలే" యని, ఆగమేతిహాసపురాణోక్తములయిన యాచారములు వేదానుకూలము లయినప్పుడుమాత్రమే గ్రాహ్యములనియు తత్ప్రతికూలము లగ్రాహ్యములే యనియు శంకరవిజయమునందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ స్మృతి ర్వేద విరోధేతు పరిత్యాగో యథా భవేత్।
తథైవ లౌకికం వాక్యం స్మృతిబాధే పరిత్యజేత్॥

అను ప్రయోగపారిజాతమునం దుదాహరింపఁబడిన స్మృతివాక్యము వేదమునకు విరోధముగానున్న స్మృతి యేప్రకారముగా పరిత్యజింపఁబడునో ఆదేప్రకారముగా స్మృతివిరోధమయిన యాచారమును పరిత్యజింపవలయునని చెప్పుచున్నది.

శ్లో॥ శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే య స్తే ఉల్లంఘ్య వర్తతే।
ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ సవధ్యో నాత్ర సంశయః॥

శ్రుతి స్మృతులు నా (యీశ్వరుని) యాజ్ఞలేగనుక వాని నుల్లంఘించి ప్రవర్తించువాఁడు నా (యీశ్వరుని) యాజ్ఞను మీఱి నాకు ద్రోహి యయి నిస్సందేహముగా వధ్యుఁడగు ననియు,

శ్లో॥ తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యా కార్య వ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి॥

కాఁబట్టి కార్యాకార్య వ్యవస్థ చేయుటకు నీకు శాస్త్రమే ప్రమాణము; శాస్త్రవిధానమును గుర్తెఱిఁగి యీలోకమున నీవేపనిని కాని చేయఁదగుననియు భగవద్గీతలయందును, మఱియుంగల యనేకప్రమాణగ్రంథములయందును శాస్త్రముయొక్క యాత్కృష్ట్యము సహస్రముఖముల ఘోషింపఁబడియున్నది. ఇట్లుండఁగా మన ప్రతిపక్షులు శాస్త్రమున కన్న ఆచారమే యెక్కువయినదని యేల వాదించుచున్నారో తెలియఁజాలకున్నాము. ఇట్లు వాదించుటకు వారికి శాస్త్రములయందుఁ బ్రమాణబుద్ధియైనను లేకపోవలెను; లేదా, బహుజనులచేత నాచరింపఁబడుచుండు దానికి శాస్త్రమునందు గతిలేకపోవునాయని యూహయైనను పుట్టవలెను. ఉండునేమోయని యనుమానింపఁదగిన దానికంటెఁ బ్రత్యక్షమయిన శ్రుతియే బలీయమగును గనుక, "శ్రుతిర్హి బలీయ స్యా దానుమానికా దాచారాత్" అను సూత్రమునుబట్టి వారి యీకడపటి యూహకును నవకాశము లేదు. శ్రుతి స్మృతులకంటె నాచారమే బలీయమనుటకు ప్రమాణగ్రంథములనుండి వారొక్క యుదాహరణమునయినను జూపఁగలిగినవారు కారు; తమకేమో లాభకారి యనుకొని తైత్తిరీయోపనిషత్తు శిక్షా

వల్లిలోని యీక్రింది శ్రుతివాక్యమును మాత్రము వారుదాహరించిరి :—

యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని-నో ఇతరాణి-
యాన్యస్మాకగ్ం సుచరితాని తాని త్వయోపాస్యాని-నో ఇతరాణి-

'ఏవి నిందితములుకాని కర్మలో యవియే యనుష్ఠింపఁదగినవి కాని యితరములు కావు; మాసుచరితలేవియో యవియే నీచే నుపాసింపఁదగినవికాని తక్కినవి కావు' అని బోధించుటవలన నీశ్రుతియు శాస్త్ర విరుద్ధాచారమును నిషేధించుచునే యున్నది. దీనియర్థ మెల్లరకును దేటపడుటకయి యీశ్రుతియొక్క శంకర రామానుజ భాష్యముల నిందు వ్రాయుచున్నాను :—

యాన్యపిచాన్యాని-అనవద్యాని=అనిందితాని, శిష్టాచారలక్షణాని-కర్మాణి-తాని సేవితవ్యాని త్వయా నో కర్తవ్యాని=నకర్తవ్యాని ఇతరాణి, సావద్యాని శిష్టకృతాన్యపి; యాన్యస్మాకం=ఆచార్యాణాం సుచరితాని=శోభనచరితాని, ఆమ్నాయా ద్యవిరుద్ధాని=తాన్యేవ త్వయోపాస్యాని-అదృష్టార్థాన్యనుష్ఠేయాని=నియమేనకర్తవ్యానీ త్యేతత్-నోఇతరాణి=విపరీతా న్యాచార్యకృతాన్యపి.

అని శంకరాచార్యులును,

శిష్టాచారేష్వపి శ్రుతి స్మృతివిరోధశూన్యతయా యాని సుచరితాని తాన్యేవ ఫలోశాదికాని గ్రాహ్యాణి-నలోభాదిమూలచరితానీత్యర్థః

అని రామానుజాచార్యులును, పై శ్రుతివాక్యమునకు వేదవిరుద్ధములుకాని యాచార్యుల యాచారములను గ్రహింపవలయునేకాని వేదవిరుద్ధములైన శిష్టాచారములను గ్రహింపఁగూడదని స్పష్టముగా వ్యాఖ్యానము చేసియున్నారు. ఏవిధమునఁజూచినను శాస్త్రము శిష్టాచారమునకంటె దుర్బలమైనదని సాధించుట కాధారము లేశమైనను గనఁబడదు. ఇట్లున్నను మనదేశ మేమి పాపము చేసికొన్నదో

కాని శాస్త్రముయొక్క యధికారమును దా నతిక్రమముగా నాక్రమించుకొని యెల్లయెడలను ఆచారమే మనదేశమునందు నిరంకుశాధికారమును చెల్లించుచున్నది. జనులును విషయవిచారమును బొత్తిగా మానివేసి యాచారమున కత్యంతము దాసులై యది నడిపించునట్లెల్లను నడుచుచున్నారు; శాస్త్రమున కాచారానుకూలముగా నపార్థములు కల్పించి, శాస్త్రదేవతను ఆచారపిశాచమునకు లోఁబఱిచి దాసినిగాఁ జేయుచున్నారు. ఓయాచార పిశాచమా! నీవు వచ్చి యాశ్రయించి స్థిరపడినతరువాత నేకదా యీహిందూదేశము తక్కిన దేశముల హీనదశను జూచి పశ్చాత్తాపపడు పూర్వపుస్థితిని బోఁగొట్టుకొని తన్నుఁజూచి యితరదేశములవారే పశ్చాత్తాపపడవలసిన యిప్పటిదశకు వచ్చినది. నీయధికారప్రాబల్యము ముదురుటచేత నేకదా దేశమయిన నభివృద్ధి కవకాశములేక దేశము నానాటికి క్షీణదశను బొందుచున్నది? నీకు పరమభక్తులౌటచేత నేకదా జనులు తమ మేలునైన దెలిసికోలేక యెవ్వరైన నిన్నతిక్రమించి యించుక దేశమునకు క్షేమకరమయిన పనికిఁ బూనినచో వారిని బహువిధముల దూషించుచు 'మీతాతలును ముత్తాతలును మీవంటి బుద్ధిమంతులు కారా? వారు చేయని కార్యమును మీరేల చేయవలె' నని యాక్షేపించుచు నీయధికారమును స్థాపింపఁ జూచుచున్నారు? అభివృద్ధి కయి ప్రయత్నముచేయువారి మాటలను విన్నమాత్రముననే పాపమువచ్చి చుట్టుకొనునని యెంచి కొందఱు దూరదూరముల తొలఁగుచున్నారు. ఓయాచారపిశాచమా! నీవు వచ్చి చేరి యుక్తాయుక్తములను విచారించి తెలిసికొనుశక్తిని మనుష్యుల మనస్సులలోనుండి పాఱఁదోలినావు; సమస్తసుగుణములకును శిరోభూషణమయిన కారుణ్యమును మొదలంట పెలగించివేసినావు; నిజమయిన

యోగ్యత లేకపోయినను బాహ్యవేషధారణముచేతనే గౌరవము కలుగునట్లును బాహ్యచిహ్నభావమాత్రమున యోగ్యుల కగౌరవము కలుగునట్లును జేయుచున్నావు. ఓజనులారా! మీరింకను నెంతకాలము తుచ్ఛమయిన యాచారమునకు కన్నులు మూసికొని దాస్యము చేయుచు మీలాభమును సహితము తెలిసికోలేక యజ్ఞానాంధకారమునఁ బడియుండెదరు? దేవుఁడిచ్చిన జ్ఞానమును పదటఁ గలిపి మీయభివృద్ధిని నిరాకరించి యెంతకాల మీలాగున క్రూరమయిన యీ దురాచారమునకు దాసులయి యుండెదరు? ఇంతటనైనను తెలివితెచ్చుకొని మనమేలును కన్నులు తెఱచి చూచి శాస్త్రముయొక్క నిజమయిన తాత్పర్యమును గ్రహించి దానిననుసరించి ప్రవర్తింప యత్నింపుఁడు. మనము పూర్వాచారము మీఱరాదనుకొన్నను మనకుఁ దెలియకయే కొన్నిమార్పులు కలుగుచుండును. మృగాదులుమాత్రమే మార్పులేక యెప్పుడు నేకరీతిగా నుండునుగాని మనుష్యులలో మార్పులు గలుగుచుండుట సహజగుణము. మనము విషయవిచారమును బొత్తిగాఁ గట్టిపెట్టి పూర్వపుదే మంచిదని పట్టుపట్టి కూరుచుండుటచేతే నిప్పుడు మనలోఁ గలుగుచున్న మార్పులన్నియు తఱచుగా చెడుగునకే కారణమగుచున్నవి. ఒకదానిని క్రొత్తగా నేర్పఱచి సమర్థించుట కష్టమయినను నేనిప్పుడు పూనుకొన్న కార్యమునందు క్రొత్తదేదియు లేదు; శాస్త్రమహాసముద్రమున నాచారమను నాచుచేఁ గప్పఁబడి స్పష్టముగాఁ గనఁబడకున్న పూర్వరూపమునే మీకు నేను జూపఁబూనుకొన్నాను. నేను పూనిన కార్యమునకుఁ బ్రతిపక్షులయి సింహములవలె నిలువఁబడిన పండితులతో నెదిరించి నాపక్షమును సాధించుటకుఁ దగినంత సామర్థ్యము నావద్దలేకపోవుట వాస్తవమే యైనను, నేను పూనిన

పక్షముయొక్క బలమును విచారింపఁగా నాకంటె నసమర్థులును దానిని సాధింపవచ్చునను నమ్మకము తోఁచుటఁబట్టి సాహసించు చున్నాను.

వేదము స్త్రీపునర్వివాహము నంగీకరించునా యంగీకరింపదా యను నంశమును మొట్టమొదట విచారింతము.—

శ్రుతి. "ఉదీర్ష్వ నార్యభిజీవలోక మితాసు మేత ముపశేష ఏహి-
హస్తగ్రాభస్య దిధిషో స్త్వ మేత త్పత్యుర్జనిత్వ మభిసంబభూవ"

ఈశ్రుతికి విద్యారణ్యులవారు వ్రాసిన వ్యాఖ్యానము నీవఱకే వ్రాసి యున్నాను కాఁబట్టి యీసారి దానియర్థమునుమాత్ర మిం దుదాహరించుచున్నాను.

నారి=ఓనారీ, (నీవు) ఇతాసుమ్ =గతప్రాణుఁడయిన, ఏతం =ఈపతిని గూర్చి, ఉపవేషే =సమీపమున పడియున్నావు, ఉదీర్ష్వ =(పతిసమీపమునుండి) లెమ్ము; జీవలోక మభి =జీవించియున్న ప్రాణిసమూహమునుజూచి, ఏహి =రా. త్వమ్ =నీవు, హస్తగ్రాభస్య=పాణిగ్రాహకుఁడును, దిధిషోః =రెండవమాఱు వివాహమాడ నిచ్ఛగలవాఁడును (అయిన) పత్యుః =భర్తకు, ఏతత్ =ఇటువంటి, జనిత్వం =భార్యాత్వమును, అభిసంభభూవ =అభిముఖ్యముచే చక్కఁగా పొందుము. ఇట్లు స్త్రీపునర్వివాహమును విధించునది యీశ్రుతి యొక్కటియేకాదు. అథర్వవేదము నందలి యీక్రింద నుదాహరింపఁబడిన వాక్యమును స్త్రీపునర్వివాహమున కవకాశము నిచ్చుచునే యున్నది.—

శ్రుతి॥ యా పూర్వం పతిం విత్వా అథాఽన్యం విందతే పతిం।
పంచౌదనం చ తావజం దదాతో నవియోషతః॥
సమానలోకో భవతి పునర్భువా పరః పతిః।
యోఽజం పంచౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి॥

ఒకస్త్రీ మొదట నొకనిని పెండ్లిచేసికొని తరువాత మఱియొకరిని పెండ్లి చేసికొన్నయెడల, వారు అజాపంచౌదనము చేసినచో వారెడఁబాయకుందురనియు, అజాపంచౌదనము చేసినపక్షమున రెండవభర్త పునర్భువుతోడ సమానలోకమును పొందుననియుఁ బైశ్రుతి కర్థము. పూర్వకాలమునందు బ్రాహ్మణుఁడు బ్రాహ్మణేతర జాతులలోని స్త్రీలను మాత్రమేకాక, ద్విజాతులలో బ్రాహ్మణేతరుల విధవలనుగూడ వివాహ మాడఁదగినట్లు వేదము వల్లఁ గనఁబడుచున్నది. ఇందుకు నిదర్శనముగా నథర్వవేదమందలి వాక్యము నిందు క్రింద నుదాహరించు చున్నాను.—

శ్రుతి॥ ఉదయ త్పతయో దశ స్త్రియాః పూర్వే అబ్రాహ్మణాః।
బ్రహ్మాచేత్ హ స్త మగ్రహీత్ సఏవ పతి రేకధా॥
బ్రాహ్మణ ఏవ పతిర్నరాజన్యో న వైశ్యః।
త త్సూర్యః ప్రబ్రువా నితి పంచేభ్యో మానవేభ్యః॥

ఒక స్త్రీకి మొదట బ్రాహ్మణులు కానివారు పదిమంది భర్తలయి, ఆమెను బ్రాహ్మణుఁడు పాణిగ్రహణము చేసికొనుపక్షమున, అతఁడే యామెకుఁ బెనిమిటియనియు, బ్రాహ్మణుఁడే పతిగాని రాజన్యుఁడును వైశ్యుఁడును కాఁడనియు, ఈయర్థమును అయిదుజాతుల మానవులకును సూర్యుఁడు చాటుచు తిరుగుచున్నాఁడనియు, పైశ్రుతి బోధించుచున్నది. ఈచెప్పినవానివల్ల శ్రుతి స్త్రీపునర్వివాహము నంగీకరించుచున్నట్టు విస్పష్ట మగుచున్నది. ఇంతియేకాక పూర్వము నేనుదాహరించిన యీక్రింది ఋగ్వేదవాక్యమును సూచనఁగా స్త్రీపునర్వివాహము నంగీకరించుచునే యున్నది:—

శ్రుతి. ఏకస్య బహ్వ్యో జాయా భవన్తి। నైకస్యై బహవ స్సహ పతయః.

ఈ శ్రుతియం దొకపురుషునకు బహుభార్యలగుదురని సాధారణ ముగాఁ జెప్పఁబడి, ఒక స్త్రీకి ఏకకాలమునందు బహుపతులు కారని చెప్పఁబడుటయే భిన్నకాలములయందు స్త్రీకి బహుభర్తలు కావచ్చు ననుట తేలుచున్నది. ఈయర్థమునే భారత వ్యాఖ్యానమున నీలకంఠా చార్యులవారును స్పష్టపఱిచి యున్నారు. మనవారు కొందఱు సహ శబ్దమునకు మఱియొక యర్థమును జేయఁజూతురు గాని, వారు దాని కేయర్థమును చెప్పినను ఇతర శ్రుతివాక్యసమన్వయముచేత దీనికి స్త్రీల కేకకాలమునందు మాత్రమే బహుభర్త లుండఁగూడ దన్న యర్థము సిద్ధమగును. ఈ దేశమునందు ముద్రింపఁబడిన పరాశర స్మృతి వ్యాఖ్యానములో నీశ్రుతిలోని "సహ" శబ్దమునకు మాఱుగా "స్యుః" అని కానఁబడుచున్నది. కాని, తక్కిన సను స్తముద్రితపుస్తక ములయందును "సహపతయః" అనియే యుండుటవల్లను, పూర్వులు వ్రాసిన వ్యాఖ్యానములలో సహశబ్దమునే స్వీకరించి యుండుటవల్లను, ఋగ్వేదులలో నెల్ల "నైకస్యై బహవ స్సహపతయః" అను పాఠమే పారంపర్యముగా వచ్చుచుండుటవల్లను, 'స్యుః' అను పాఠము లేఖక ప్రమాదజనితమయి యుండవచ్చును. ఇట్లు ఋగ్వేదమునందును, యజుర్వేదమునందును, అధర్వవేదమునందును స్త్రీపునర్వివాహమునకు విధులే కనఁబడుచున్నవి కాని నిషేధవచనము లెందును గనఁబడు చుండలేదు. ఎటువచ్చినను మన ప్రతిపక్షులు నిషేధవాక్యమని యీ క్రింద నుదాహరించిన యజుర్వేదవాక్యమును గనఁబఱుతురు :—

శ్రుతి॥ యదేకస్మిన్ యూపే ద్వే రశనే పరివ్యయతి
తస్మాదేకో ద్వే జాయే విందతే
యన్నైకాగ్ంరశనాం ద్వయో ర్యూపయోః
పరివ్యయతి తస్మాన్నైకా ద్వౌ పతీ విందతే

ఈ శ్రుతియు స్త్రీల కేకకాలమునందే బహుపతిత్వమును నిషేధించు చున్నదిగాని భిన్నకాలములయందుఁ గాదు. వ్యాఖ్యానమున కెప్పుడును స్వతంత్రప్రమాణత లేదు గనుక, మూలవిరుద్ధముగానున్న వ్యాఖ్యానమెప్పుడును గ్రాహ్యముగాదు. అయినను, విద్యారణ్యుల వారు కాలభేదమునందుఁగూడ స్త్రీకి బహుపతు లుండఁగూడదని వ్యాఖ్యానములో వ్రాసినవారు కారు; ఈసంగతి యెల్లవారికిని దెలియుటకయి యీశ్రుతియొక్క విద్యారణ్యభాష్యము నిందు క్రింద వ్రాయుచున్నాను:—

యద్యస్మాత్, ఏకస్మిన్ యూపే పురుషస్థానీయే, ద్వే రశనే, రజ్జూ స్త్రీస్థానీయే, పరివ్యయతి=పరివేష్టయతి, తస్మాత్, ఏకః పుమాన్ ద్వే జాయే, విందతే=అనుభుఙ్క్తే, యద్యస్మాత్, ఏకాం రశనాం ద్వయోర్యూపయోః న పరివ్యయతి, తస్మాత్, ఏకా స్త్రీ ద్వౌ పతీ, న విందతే=న ప్రాప్నోతి.

పయిశ్రుతి యేకకాలమునందే స్త్రీలకు బహుపతిసంభవమును నిషేధించుచున్న దనుట కాధారము లనేకములు గలవు. ఈ శ్రుతి వాక్యము "అగ్నిష్ఠ"మనుయూపమును గూర్చినమంత్రము. "అగ్నిష్ఠం ద్వాభ్యాగ్ం రశనాభ్యాం పరివ్యయ" అనుసూత్రమునుబట్టి యేక కాలమునందే యగ్నిష్ఠయూపమునకు రెండురశనలను జుట్టఁబెట్టుదురు; ఒక్కయూపమున కేకకాలమునం దేప్రకారముగా రెండురశనలను జుట్టుదురో యదేప్రకారముగా నొకపురుషుఁ డేకకాలమునం దిద్దఱు స్త్రీలను బొందునని దృష్టాంతమునుబట్టి శ్రుతియొక్క పూర్వార్థమున కర్థము స్పష్ట మగుచున్నది. పయివాక్యమున కేకకాలమునందని యర్థ మగుచుండఁగా, క్రిందివాక్యమునకు భిన్నకాలములయందుఁగూడఁ గూడదని యర్థము చెప్పుటకు తదర్థబోధక మయినపదము లేకుండ

వీలుపడదు గనుక, ఒక రశన నేకకాలమునం దేప్రకారముగా రెండు యూపములకుఁ జుట్టిరో యదేప్రకారముగా నొకస్త్రీ కేకకాలమునం దిద్దఱు భర్తలుండరని శ్రుత్యర్థము. పయిశ్రుతి యూపసామాన్యమును గురించినదిగాక విశేషముగా నగ్నిష్ఠయూపమును గురించి చెప్పఁ బడినది గనుక, యూపసామాన్యమునం దెప్పుడయిన నొక రశనను రెండుయూపముల కేకకాలమునందుఁగాని పర్యాయమునఁగాని కట్టు చురా యనునది యిక్కడ విచారణీయాంశము గాదు. భారతము నందును, పూర్వోక్త ఋగ్వేదవాక్యమును ఈ శ్రుతియుఁకూడ ద్రౌపదీ వివాహఘట్టమున నేకకాలమునందు స్త్రీలకు బహుపతిత్వము నిషేధ మనిచూపుటకే యుదాహరింపఁబడి యున్నది.

శ్లో॥ సర్వేషాం ధర్మతః కృష్ణా మహిషీ నో భవిష్యతి।
ఆనుపూర్వ్యేణ సర్వేషాం గృహ్ణాతు జ్వలనే కరాన్॥

'ధర్మమార్గమున మాయందఱకును ద్రౌపది భార్య కాఁగలదు. జ్యేష్ఠానుక్రమముగా నందఱిబాణములను అగ్నిసమీపమున గ్రహించునుగాక' యని యుధిష్ఠిరుఁడు ద్రుపదునితోఁ జెప్పినప్పుడు, ద్రుపదుఁడును బూర్వోక్తఋగ్వేదవచనార్థమును మనసునందు నిలుపుకొని

శ్లో॥ ఏకస్య బహ్వ్యో విహితా మహిష్యః కురునందన।
నైకస్యా బహవో లోకే శ్రూయంతే పతయః క్వచిత్॥

అని స్త్రీల కేకకాలమునందు బహుపతిత్వనిషేధమును జెప్పి యున్నాడు. శ్రీమాధవాచార్యులవారును పరాశరస్మృతి వ్యాఖ్యానమునందును స్థూలసూక్ష్మధర్మవివేచనమును జేయుచు, పైకి నధర్మముగాఁ గనఁబడు ద్రౌపదీవివాహమునందలి బహుపతిత్వమును సూక్ష్మధర్మమునుగాఁ జెప్పి ద్రుపదుఁడు లోకవిరుద్ధమని చెప్పిన వాక్యము నందుకొని, "తిర్యక్ష్వపి ఏకస్యాం గవి వృషభద్వయయుద్ధ

దర్శనాత్" తిర్యగ్జంతువులయందుసహిత మొకయావు విషయమయి రెండుగి తలుపోరాడుట చూచుచుండుటవలన లోకవిరుద్ధము స్ఫుటమే యనియు, "వేదేప్యేవం శ్రూయతే" వేదమునందు నిటులే చెప్పఁబడు చున్నదని 'ఏకస్య బహ్వ్యో' యను శ్రుతిని "యదేకస్మిన్ యూపే" యను శ్రుతిని నుదాహరించియున్నారు. మాధవాచార్యులవా రిచ్చిన దృష్టాంతమువల్లను, వేదమును ఆ యర్థమునే యిచ్చుచున్నదని కంఠోక్తిగాఁ జెప్పుటవల్లను, ఏయి శ్రుతిద్వయమును ఏకకాలమునందే స్త్రీలకు బహుపతిత్వ నిషేధము చేయుచున్నదని మాధవాచార్యుల వారి తాత్పర్యమయినట్లు బాలురకుసహితము తేటఁపడగలదు. ఒక వేళఁ బ్రతిపక్షుల యిష్టానుసారముగా "యదేకస్మిన్ యూపే" యను శ్రుతికి వాదము నిమిత్తమయి ఏకకాలమునందుఁగాని భిన్నకాల ములయందుఁగాని స్త్రీలకు ద్విపతిత్వనిషేధమునే యొప్పుకొన్నను, శాస్త్రసమన్వయరీతిచేత సామాన్యవిశేషవ్యవస్థను జేయఁగా స్త్రీ కిద్దఱుభర్తలు గూడదన్నసామాన్యవిధి భర్తమరణము సంభవించి నప్పుడు పునర్వివాహము చేసుకోవచ్చునని విధించు "ఉదీర్ష్వ నారి" యను విశేషవిధిచేత బాధింపఁబడి మృతభర్తృక యయినప్పుడు తప్ప స్త్రీకి బునర్వివాహము లేదని సిద్ధాంత మగుచున్నది. ఈ ప్రకార ముగా విశేషసామాన్య భావముచేత వ్యవస్థచేయుట కవకాశము లేక రెండును సమానబలము గలవిగా నున్నప్పుడుసహితము పూర్వోప న్యాసమునం దుదాహృతము లయిన 'ధర్మజిజ్ఞాసమానానాం' మొద లయిన స్మృతివచనములచేతను, 'విహితప్రతిషిద్ధత్వే వికల్పే పర్యవ సానం' అను న్యాయముచేతను వికల్పముగా స్త్రీపునర్వివాహ మంగీ కార్యమేయగును. ఏ విధముచేతఁ జూచినను స్త్రీపునర్వివాహము వేదవిహితమే యని నిష్కృష్టాశయము తేలుచున్నది. మఱియు నీ

నమమ వర్తమానతరత్నాకర పత్రికాధిపతిగారు,-

"సూర్యాభ్యుదిత స్సూర్యాభినిర్ముక్తే -సూర్యాభినిర్ముక్తః
కునఖ -కునఖీ శ్యావదతి -శ్యావద న్నగ్రదిధిషౌ -అగ్రదిధిషుః
పరివిత్తే -పరివిత్తో వీరహాణి"

ఇత్యాది శ్రుతివాక్యమును వ్రాసి "సూర్యో దుదయించునపుడు నిద్ర పోవువాఁడు మహాపాపి. అస్తమించునపుడు నిద్రపోవువాఁడు వానికంటె నధికుఁడు. వానికంటె పుప్పిగోళ్ళవాఁ డధికుఁడు. వానికంటె నల్లని దంతములుగలవాఁ డధికుఁడు. వానికంటె దిధిషుఁడు (అనఁగా విధంతు వులను పరిగ్రహించినవాఁడు) అధికుఁడు. వానికంటె నగ్రజునకు వివా హము కాకముందు వివాహితుఁడగువాఁ డధికుఁడు. వానికంటె వీర హత్య చేసినవాఁ డధికుఁడు' అని యర్థము వ్రాసి దిధిషుఁడు మహా పాపి కనుక వేదము మహాపాపిని వివాహము చేసికొమ్మనునా యని శంకించియున్నారు. దిధిషు వనఁగా విధంతువును వివాహము చేసి కొనువాఁ డని యర్థము వ్రాయుట కేవలము పొఱపాటు. "పున ర్భూ దిధిషూ రూఢా ద్విస్తస్యా దిధిషుః పతిః" అను నిఘంటువుంబట్టి రెండవమాఱు వివాహము చేసికొనుదాని భర్త దిధిషుఁ డనఁబడును. పూర్వోక్తశ్రుతియందు దిధిషునికన్నను మహాపాపి యని చెప్పఁబడిన పరివిత్తికి కుబ్జత్వాదిలోపములయం దేప్రకారముగా స్మృతివాక్య మునుబట్టి దోషము లేదో, యదే ప్రకారముగా మృతభర్తృకను వివాహము చేసికొను దిధిషునకును శ్రుతిస్మృతివాక్యబలమునుబట్టి దోష ముండదు; శాస్త్రవిరుద్ధముగా పునర్భువును వివాహము చేసి కొన్న దిధిషుఁడుమాత్రమే దోషి యగును. ఈ యర్థమే పయి శ్రుతిద్వయ సమన్వయమువలనం దేలును.

ఈ వఱకుఁ గొంత శ్రుతివిచారము ముగిసినది గనుక, ఇఁక స్మృతులవిషయమై కొంత చర్చింతము. ఈ విషయము నీవఱకే విద్యాసాగరుఁడు మొదలగు గొప్పపండితులు విశేషముగా వ్రాసియున్నారు. నేనును వారిమార్గమునే యనుసరించి కొన్నివిశేషాంశములనుగూడ నందందుఁ దెలిపెదను. మనుస్మృతి మొదలుగాఁగల ధర్మశాస్త్రము లనేకములు కలవు; వానికర్తల నామధేయములు యాజ్ఞవల్క్యస్మృతి మొదలగువానియందుఁ జెప్పఁబడియున్నవి. వేదములయం దన్నిధర్మములును జెప్పఁబడియుండలేదు గనుకను, కాలభేదమునుబట్టి యాయాయుగములకు వేఱువేఱుగ విశేషధర్మములు కావలసివచ్చును గనుకను, ఆయా యుగములకు విశేషధర్మము లేర్పడియున్నవి. అందుచేత స్మృతులయందుఁ జెప్పఁబడిన ధర్మము లన్నియుఁ బ్రతియుగము నందును అనుష్ఠింపఁబడవలసిన యావశ్యకము లేదనియు, ప్రత్యేకముగా నేయుగమున కేస్మృతి యేర్పడియున్నదో యా యుగమునకా స్మృతియందుఁ జెప్పఁబడిన ధర్మములే ముఖ్యములనియు, అనుక్తములనుమాత్ర మితరస్మృతులనుండి గ్రహింపవలయుననియు, విస్పష్టమగుచున్నది.

శ్లో॥ అన్యే కృతయుగే ధర్మా స్త్రేతాయాం ద్వాపరే పరే।
అన్యే కలియుగే నృణాం యుగహ్రాసానురూపతః॥

అను మనువచనము యుగానుసారముగా, కృతయుగధర్మములు వేరనియు, త్రేతాయుగపువి వేరనియు ద్వాపరయుగపువి వేరనియు, కలియుగపువి వేరనియు, స్పష్టముగాఁ జెప్పుచున్నది. ఇఁక నేయుగమున కేస్మృతి ముఖ్యమయినదని విచారింపఁ బూనుకొందుమేని,

శ్లో॥ కృతే తు మానవా ధర్మా స్త్రేతాయాం గౌతమాః స్మృతాః।
ద్వాపరే శాంఖలిఖితాః కలౌ పారాశరాః స్మృతాః॥

అను పారాశరస్మృతివచనమునుబట్టి కృతయుగమునకు మనుస్మృతియు, త్రేతాయుగమునకు గౌతమస్మృతియు, ద్వాపరయుగమునకు శాంఖలిఖితస్మృతులును, కలియుగమునకు పారాశరస్మృతియు ప్రధానములయి యున్నట్లు కరతలామలకముగాఁ దెలియవచ్చును. పరాశరస్మృతి ప్రథమాధ్యాయమునందు ఋషు లందఱును వ్యాసునియొద్దకుఁ బోయి,-

శ్లో॥ మానుషాణాం హితం ధర్మం వర్తమానే కలౌ యుగే।
శౌచాచారం యథావచ్చ వద సత్యవతీసుత ॥

వర్తమానకలియుగమునందు మనుష్యులకు విహితములగు ధర్మములను జెప్పుమని యడుగఁగా నతఁడు సమస్తధర్మములును దనకుఁ దెలియవు గనుకఁ దన తండ్రియైన పరాశరు నడుగుదమని చెప్పి, వారి నందఱిని నాతనికడకుఁ దీసికొనిపోయి యడుగఁగాఁ బరాశరుఁడు చెప్పినట్లుండుటచేతఁ బరాశరస్మృతియందలి ధర్మము లన్నియుఁ గలియుగధర్మములే యని నిస్సందేహముగాఁ దెలియవచ్చుచున్నది. అంతియకాక పరాశరస్మృతియొక్క ద్వితీయాధ్యాయముయొక్క మొదట,-

శ్లో॥ అతః పరం గృహస్థస్య ధర్మాచారం కలౌ యుగే।
ధర్మసాధారణం శక్యం చాతుర్వర్ణ్యాశ్రమాగతం।
సంప్రవక్ష్యా మ్యహం పూర్వం పరాశరవచో యథా ॥

పూర్వము పరాశరుఁడు చెప్పినట్టుగా కలియుగమునందలి గృహస్థధర్మాచారములను చాతుర్వర్ణ్యాశ్రమాగతములై శక్యములయిన సాధారణధర్మములను జెప్పుచున్నానని యుండుటయు, పరాశరస్మృతిలోని వన్నియు కలిధర్మములే యని స్థిరపఱుచుచున్నది. పరాశరస్మృతి యందలి నాలుగవ యధ్యాయములో,-

శ్లో॥ నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ।
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే॥

అని పతి నష్టుఁడయినప్పుడును, మృతుడయినప్పుడును, సన్యసించి నప్పుడును, నపుంసకుఁడైనప్పుడును, పతితుఁడైనప్పుడును, ఈ యయిదాపదలయందును స్త్రీకిపునర్వివాహము విధింపఁబడి యున్నది. ఈ శ్లోకములోని పదములనుబట్టిగాని, ప్రకరణమునుబట్టిగాని, దీనికి మఱియొక విధముగా నర్థము చెప్పుటకు వీలులేదు. దీని కితరస్మృతుల తాత్పర్యానుసారముగా నర్థము చేయవలసిన యావశ్యకమును లేదు. కలియుగధర్మప్రవర్తకమైన యొకస్మృతియందుఁ బ్రత్యేకముగాఁ గలియుగమునందే యాచరణీయమయిన యొకధర్మము చెప్పఁబడి అది యితరయుగధర్మప్రవర్తకములయిన బహుస్మృతులకు విరుద్ధమయినప్పుడు, అన్నిస్మృతులతోను సమన్వయించునట్లుగా మొదటి స్మృతి వాక్యమున కర్థము చెప్పవలెనన్నచో నట్టి స్మృతివలనఁ బ్రయోజనమే లేకపోవును; కాలానుగుణముగా యుగధర్మములు వేఱువేఱుగా నుండునను మన్వాదివచనములును వ్యర్థములయి పోవును.

కలిధర్మబోధకమయిన యీ పరాశరస్మృతికి వ్యాఖ్యానము చేసిన వారిలో మాధవాచార్యులును నందపండితుఁడును ప్రసిద్ధులు. వారిరువురును స్త్రీపునర్వివాహము కూడదను కోటిలో చేరినవారే యయినను, పూర్వోదాహృతమయిన "నష్టే మృతే" యను శ్లోకమునకు మొదట వ్యాఖ్యానము చేసిన మాధవాచార్యుఁ డొకవిధముగాను, తరువాత వ్యాఖ్యానముచేసిన నందపండితుఁ డొకవిధముగాను, అర్థమును వ్రాసియున్నారు. వారిలో మాధవాచార్యుఁడు "పరివేదన పర్యాధానయో రివ స్త్రీణాం పునరుద్వాహస్యాపి ప్రసంగాత్ కించిదభ్యనుజ్ఞాం దర్శయతి" అని పరివేదనపర్యాధానములకువలెనే స్త్రీల

పునర్వివాహమునకును ప్రసంగమువలనఁ గొంచె మనుజ్ఞను జూపు చున్నాఁడని, యిది స్త్రీపునర్వివాహవిధి యయిన ట్లొప్పుకొని, "అయంచ పునరుద్వాహో యుగాంతర విషయో ద్రష్టవ్యః" అని యీ పునర్వివాహము యుగాంతరవిషయముగాఁ జూడఁబడఁదగినదని వ్రాసి తన వాక్యమున కాధారముగా "తథా చాదిత్యపురాణం ఊఢాయాః పునరుద్వాహం జ్యేష్ఠాంశం గోవధం తథా। కలౌ పంచ నకుర్వీత భ్రాతృజాయాం కమండలు—మితి" యని యాదిత్యపురాణ ములోనిదని యొకశ్లోకమును వ్రాసిరి. ఈశ్లోక మాదిత్యపురాణ ములోగాని, నాగరపుస్తకమున నున్నట్టు ఆదిపురాణములోఁగాని కనఁబడనట్టు వ్రాసి, "నష్టేమృతే" యనువచనము యుగాంతర విషయమను మాధవోక్తికి "కలౌ పారాశరాస్స్మృతాః" అనుమూల వచనవిరోధమును, "అతః కలౌ ప్రాణినాం ప్రయాససాధ్యే ధర్మే ప్రవృత్త్యసంభవాత్ సుకరో ధర్మోఽత్ర బుభుత్సితః" కలియుగము నందు మనుష్యులకు ప్రయాససాధ్యములయిన ధర్మములయందుఁ బ్రవర్తించుట యసంభవము గనుక సుకరములైన ధర్మములు పరా శరస్మృతిలోఁ జెప్పఁబడునను స్వవ్యాఖ్యాన విరోధమును, గ్రంథ ములోఁ గనఁబడని "ఊఢాయాః పునరుద్వాహ" మను శ్లోకమును గైకొనుటచే వివాదగ్రస్తవచన ప్రామాణ్యాశ్రయమును, పురాణమున కంటె స్మృతి బలియమను వ్యాసవచనవిరోధమును, "ఊఢాయాః పునరుద్వాహ" మను పురాణవచనము సామాన్యముగా వివాహితకుఁ బునర్వివాహమును నిషేధించుచు "నష్టే మృతే" యను పరాశరవచ నము విశేషముగా నయిదాపదలయందు మాత్రము పునర్వివాహమును విధించుచుండుటచేత సామాన్యవిశేషభావవిరోధమును, పొసఁగునని పండితు లీవఱకే యాక్షేపించి దోషపంచకమును గనబఱిచి

యున్నారు. ఈ ప్రకారముగానే చతుర్వింశతిస్మృతివాఖ్యయందు భట్టోజిదీక్షితులును,—

"న చ కలినిషిద్ధస్యాపి యుగాంతరీయ ధర్మస్యైవ నష్టే మృతే ఇత్యాది పరాశరవాక్యం ప్రతిపాదక మితి వాచ్యం—కలా వనుష్ఠేయాన్ ధర్మా నేవ వక్ష్యామీతి ప్రతిజ్ఞాయ తద్గ్రంథస్థప్రణయనాత్"

కలియం దనుష్ఠింపఁదగిన ధర్మములనే చెప్పుచున్నానని పరాశరుల వారే ప్రతిజ్ఞ చేసియుండుటవలన "నష్టే మృతే" ఇత్యాది పరాశర వాక్యము యుగాంతరవిషయమును కాదని రూఢి చేసి యున్నారు. మాధవాచార్యులకును తరువాత ఈసందేహమేకలిగి ద్వాదశాధ్యాయ వ్యాఖ్యానావసానమునందు,—

"నను వ్యాసేన కలిధర్మాణాం పృష్టత్వా త్కలౌ పారాశరాః స్మృతా ఇతి పరాశరేణో క్తత్వాచ్చ పరాశరోక్తా స్సర్వే కలిధర్మా ఏవేతి వక్తవ్యం"

వ్యాసునిచేఁ గలిధర్మములే యడుగఁబడుటవలనను గలియందుఁ బారాశరస్మృతి యని పరాశరునిచేతనే యుత్తరము చెప్పఁబడుట వలనను పరాశరోక్తధర్మము లన్నియు కలిధర్మములే యని రెుుప్పుకొని,—

"కిం చ శేషం మునివిభాషిత మితి ఇతరమున్యుక్తకలి నిషేధానా మప్యభ్యుపగతిః స్పష్టం లక్ష్యతే"

అయినను 'శేషంమునివిభాషితమ్' అనుటవలన నితరమునులచేఁ జెప్ప బడినకలినిషేధములకు గతి కలుగుట స్పష్టముగాఁ గనఁబడుచున్నదని,-

"నష్టే మృతే ప్రవ్రజిత ఇతి పునరుద్వాహవిధిః పరివేద నాద్యక్రమవివాహవిషయత్వేన అన్యథా సిద్ధః"

'నష్టే మృతే ప్రవ్రజితే' ఇత్యాది పునర్వివాహవిధి పరివేదనాద్యక్రమ వివాహవిషయమగుట యన్యవిధముగా సిద్ధించుచున్నదని వ్రాసియున్నారు. 'అన్యథా' యనఁగాఁ బరాశరస్మృతివచనముచేతఁగాక 'ఊఢాయాః పునరుద్వాహః' మను పురాణవచనముచేత సిద్ధించుచున్న దని మాధవాచార్యుల తాత్పర్యము. పరాశరులవారు "శేషం మునివిభాషిత" మని చెప్పుటచేఁ దనస్మృతియందుఁ జెప్పఁబడక మిగిలిన విషయములకు ఇతరమునివాక్యము లనఁగా నితర ధర్మశాస్త్రవాక్యములు ప్రమాణములనిరే కాని మాధవాచార్యు లర్థముచేసినట్టు తన స్మృతియందుఁ జెప్పఁబడిన ధర్మములకు విరోధముగా నుండు నితర పురాణవాక్యములుగూడ ప్రమాణములని చెప్పినవారు కారు. కాఁబట్టి మాధవాచార్యులవారి యీవాదమును నిరాధార మయినదే. మఱియు నీమాధవాచార్యులే 'శేషం మునివిభాషిత' మనుచోట శేషమనఁగా నవశిష్టమని వ్యాఖ్యానము వ్రాసియున్నారు. ఇంతియేకాక మాధవాచార్యులు "నష్టే మృతే" యను పునర్వివాహవిధి యుగాంతరవిషయ మనుటచే మూలగ్రంథమునందలి యుత్తరశ్లోకముల సంబంధమునకును, వానికిఁ దాను వ్రాసిన వ్యాఖ్యానమునకును గూడఁ బొసఁగుబాటు లేకపోవలసివచ్చినది. పరాశరులు మొదట స్త్రీలకుఁ బునర్వివాహమును జెప్పి, తరువాత బ్రహ్మచర్యమును జెప్పి, తదనంతరము సహగమనమును జెప్పి, ఆమూటిలో నేదియైనను జేయవచ్చునని విధించిరి. ఆమూటిలో నొకటి పూర్వయుగముల కయినచోఁ దక్కినవియుఁ బూర్వయుగములకే కావలసివచ్చును. లేదా, అన్నియుఁ గలియుగమున కయినను గావలసి యుండును.

"శ్లో॥ మృతే భర్తరి యా నారీ బ్రహ్మచర్యే వ్యవస్థితా।
సా మృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః॥"

అను తరువాయి శ్లోకమునకు వ్యాఖ్యచేయుచు మాధవాచార్యులవారు "పునరుద్వాహ మకృత్వా బ్రహ్మచర్య వ్రతానుష్ఠానే శ్రేయోతిశయం దర్శయతి" యని వ్రాసియున్నారు. ఇవి రెండును ఏకయుగమునందే కాకపోయినయెడల, పునరుద్వాహము చేసికోక బ్రహ్మచర్యవ్రతమును జేయుటయందు శ్రేయోతిశయమున్నదని చెప్పుట కెట్లు వీలుకలిగి యుండును? మాధవాచార్యులు గొప్పవాఁడే యయినను "ప్రమాదో ధీమతామపి" యని యుండుటవలన, ఈవిషయమున నాతఁడు పొఱ పడిన స్థలములయందు,

"మాధవస్తు సామాన్య వాక్య నిర్ణయం కుర్వన్ భ్రాంత ఏవ" అని నిర్ణయసింధువు మొదలయిన గ్రంథములయందు కమలాకరభట్టు మొదలగువారాక్షేపించి వ్రాసియే యున్నారు. ఈబాధకముల నాలో చించి, 'అయం చ పునరుద్వాహో యుగాంతరవిషయ' మనుచోట 'అయుగాంతరవిషయ' మని పదచ్ఛేదము చేసికోవలెననియు, అది యే మాధవాచార్యుల తాత్పర్యమనియు, ఆపునర్వివాహము ప్రకర ణమునుబట్టి పరివేదినీపరమగుననియు, కనుకనే మాధవాచార్యులు అగ్రేదిధిషూప్రాయశ్చిత్తస్థలమునందు "నష్టాది నిమిత్తేషు తు నష్టే మృతఇతి వక్ష్యమాణం ద్రష్టవ్య" మని వ్రాసియున్నారనియు నంది రాజు లక్ష్మీనారాయణదీక్షితులుగారు వ్రాసియున్నారు. కాని యీవి ధముగా పదచ్ఛేదముచేయుట యెంతమాత్రము యుక్తముగాఁ గనుపట్టదు. ఎట్లన్న—శబ్దశక్తిచేతఁగాని ప్రకరణమునుబట్టిగాని 'నష్టే మృతే' యను పునర్వివాహవిధి పరివేదినీపరముగాదని సాధారణ సంస్కృతభాషా పరిజ్ఞానముగల వారలకుసహితము సులభముగాఁ దెలియును. మూలములో నెక్కడను బరివేదినియను నర్థమిచ్చు పద

ములేదు; వ్యాఖ్యానము నందయినను స్త్రీణా మనియే సామాన్య ముగా వ్రాయఁబడినదిగాని పరివేదినీపదము గాని తదర్థబోధక పదాంతరముగాని వేయఁబడి యుండలేదు. ప్రకరణమునుబట్టి విచారించినను 'నష్టే మృతే' యనుశ్లోకము పర్యాధానవిధి తరువాత నున్నదిగాని పరివేదనీవిషయము చెప్పఁబడిన తరువాతలేదు. పునర్వివాహవిధి పరివేదినీ పరమగునెడల, బ్రహ్మచర్యమును సహగమనమునుగూడ పరివేదినులకే యగునుగనుక, పరాశరులవా రొక్క పరివేదినులకు మాత్రమే బ్రహ్మచర్యమును సహగమనమును విధించి స్త్రీలకు సామాన్యముగా మానివేసినారని చెప్పుటకంటె విరుద్ధము మఱియొకటి యుండదు. 'అయంచ పునరుద్వాహో అయుగాంతర విషయో ద్రష్టవ్య' యనుచో యుగాంతరవిషయమని యర్థము చేసితిమేనిఁ బూర్వ మొకచోట 'నష్టే మృతే' యనుదానిని మనువచనముగా వ్రాసి "సోయం పునరుద్వాహో యుగాంతరవిషయః" (ఈపునర్వివాహము యుగాంతరవిషయము) అని వ్రాసియున్నాఁడు గాన నిచ్చట నీపునర్వివాహమును యుగాంతరవిషయమేయని సముచ్చయార్థకమయిన 'అయంచ' యనుదానిలోని చ కారమున కర్థము పోసఁగియుండునుగాని, అయుగాంతర విషయమని పదచ్ఛేదము చేసినచో చ కారమువలన నేమిప్రయోజన ముండును ? అంతియకాక 'తథాచాదిత్యపురాణే' మని యాదిత్య పురాణవచనమును వ్రాయుటచే నాదిత్యపురాణవచనము పూర్వవాక్యమున కుపష్టంభకముగాఁ గదా యుండవలయును? అయుగాంతర విషయమని పదవిభాగము చేసెడి పక్షమున, కలియుగమున నూఢావివాహమును నిషేధించు వచనము కలియుగమునకే యీవిధి యని చెప్పు పూర్వవాక్యమున కెట్లుపష్టంభకము కాఁగలదు? 'ఊఢాయాః పునరుద్వాహ' మను వచనము మొదటఁజెప్పినట్లు యుగాంతరవిషయ

మనుటకును, తరువాతఁ జెప్పినట్లు అయుగాంతర విషయ మనుటకును గూడ నేప్రకారముగా నుపష్టంభకప్రమాణము కాఁగలదు? కాఁబట్టి యుగాంతరవిషయమనియే మాధవాచార్యులవారి యభిప్రాయము గాని అయుగాంతరవిషయమనికాదు. వెనుక 'నష్టాది నిమిత్తేషు తు నష్టే మృత ఇతి వక్ష్యమాణం ద్రష్టవ్య' మని నష్టాది నిమిత్తముల యందో ముందుఁ జెప్పఁబోవు నష్టేమృత ఇత్యాది విధి చూడఁదగిన దనుటవలన పరివేదినుల విషయమయినకూడ నష్టాది నిమిత్తములయం దావిధిని జూడవలసినదని మాత్రమే మాధవాచార్యుల తాత్పర్యము గాని 'నష్టే మృతే' యను విధి పరివేదినీపరమేయని యెంతమాత్ర మును కాదు.

ఇఁక రెండవ వ్యాఖ్యానకారుఁడయిన నందపండితుఁడు 'నష్టే మృతే' యను విధి వాగ్దత్తాపరమని యీక్రింద నుదాహరించిన రీతిని వ్యాఖ్యానము చేసియున్నాఁడు—

"నన్వస్తు పరివేదనే కన్యయా జ్యేష్ఠసమర్పణానంతరం పున స్తేనైవ వివాహో వాగ్దానాన న్తర మనిష్పన్నే వివాహే తు వరవైగుణ్యే జ్ఞాతేకథ మిత్యత ఆహ-నష్టే మృత ఇతి వాగ్దానానన్తరం పాణిగ్రహణాత్ప్రాక్ ఏతా ఉత్పత్స్యమానపతిత్వే పూర్వస్మి న్వరే నష్టే దూరదేశగమనేనాఽపరి జ్ఞాతవృత్తాంతే నారీణాం కన్యానా మన్యః పతి ర్విధీయతే- తథాహ నారదః -పరిగృహ్యాతు యః కన్యాం వరో దేశాంతరం వ్రజేత్। త్రీ నృతూ నసమతిక్రమ్య కన్యాఽన్యం వరయే ద్వరం॥ స్త్రీపుంసయో స్తు సంబంధా ద్వరణం ప్రాగ్విధీయతే। వరణా ద్గ్రహణం పాణేః సంస్కారోపి విచక్షణైః। తయో రనియతం ప్రోక్తం వరణం దోషదర్శనాత్। ఇతి."

'నష్టే మృతే' యను విధి వాగ్దత్తాపరమయినట్లు ప్రకరణమును బట్టియుఁ గనఁబడదు; శబ్దశక్తిచేతను ఆ యర్థము రాదు. మూలము

లోని నారీణా మను పదము వివాహితలయిన కాంతలకేగాని యీ విధి వివాహముకాని కన్యలకుఁ గాదని సూచనగాఁ జెప్పుచున్నది. వాగ్దత్త యొక్క కాఁబోవువరుఁడు దేశాంతరము పోవుట మొదలయినవి యాపదలు కాఁజాలవు గనుక, అయిదాపదలయందని యుండుటచేతనే వివాహితలయిన స్త్రీలకే పునర్వివాహము విధింపఁబడినట్టు తెలిసికోఁదగియున్నది. పునర్వివాహము వాగ్దత్తలకే యనునెడల, ప్రకరణమునుబట్టి బ్రహ్మచర్యమును సహగమనమునుగూడ వాగ్దత్తలకే యయి పరిహాసాస్పదమయిన యర్థము సిద్ధించును. మఱియు

శ్లో॥ "నోదకేన నవా వాచా కన్యాయాః పతి రుచ్యతే।
పాణిగ్రహణసంస్కారాత్ పతిత్వం సప్తమే పదే॥

అను నారదసంహితావచనమును బట్టియు

"శ్లో॥ నోదకేన న వా వాచా కన్యాయాః పతి రుచ్యతే।
పాణిగ్రహణసంస్కారో నియతం పతిలక్షణం॥"

అను పరాశరవచనమును బట్టియు, ఉదకదానముచేతఁగాని వాగ్దానముచేతఁగాని కన్యకయొక్క వరునకు పతిసంజ్ఞ లేదనియు, పాణిగ్రహణానంతరముననే పతిసంజ్ఞ కలుగుననియు స్పష్టమగుచున్నందునను, మూలమునందు పతిశబ్దమే ప్రయోగింపఁబడి యున్నందునను, 'నష్టే మృతే' యను శ్లోకము విధించు పునర్వివాహము వివాహితలకేగాని వాగ్దత్తలకుఁ గాదని కరతలామలకముగాఁ దెలియవచ్చుచున్నది. పతిశబ్దమునకు లక్షణచేత కాఁబోవు పతియని యర్థము చేసికొని వాగ్దత్తాపరమున నన్వయించుకోవలెనని కాశీస్థ రామశాస్త్రులవారనిరి. శబ్దశక్తిచేతను ప్రకరణముచేతను పదముయొక్క వాస్తవార్థము సమన్వయింపని పక్షమున లక్షణచేత వేఱర్థమును గ్రహింపవలయునుగాని, సర్వవిధముల నిర్బాధకమయి స్పష్టమయిన యర్థము నిచ్చు

చున్నప్పుడేల లక్షణచేత విపరీతార్థమును దెచ్చిపెట్టుకో వలయునో యూహింపఁజాలకున్నాను. వ్యాకరణశాస్త్రమునుబట్టి "పత్యౌ" యని యుండవలసిన దానికి 'పతౌ' యని యుండుటవలన నా పదమునకు పతి సదృశుఁడని యర్థము చేసికోవలెననియు, అపతౌ యని పదవిభాగము చేసి నియోగపరముగా నర్థము చెప్పుకోవలెననియు, కాశీనథ బాల శాస్త్రిలవారు చెప్పిరి. ఆర్షప్రయోగమగుటచేత వ్యాకరణదోష మిచ్చట ప్రవర్తింపదు. అయినను మనోరమయందు "పతౌ" యను రూపమును సాధువే యగుట విశదపఱుపఁబడి యున్నది.—

> సూ. 'పతి స్సమాస ఏవ' (పతిశబ్ద స్సమాస ఏవ ఘిసంజ్ఞకః వార్తికము) ఏవకార ఇష్టతో అవధారణార్థః-అన్యథా హి సమాసే పతిరేవేతి సంభావ్యేత -ధాత్వాదే రిత్యాది జ్ఞాపకానుసరణే చ ప్రతిపత్తిగౌరవం స్యాత్ -అథకథం 'సీతాయాః పతయే నమః'- పరాశరశ్చ 'నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ' వితి ఉచ్యతే -పతి రితి ఖ్యాతః పతిః -ణౌటి లోపే అచఇరిత్యౌణాదికః- అయం పతిశబ్దః పతి స్సమాస ఏవేత్యత్ర న గృహ్యతే- లాక్షణిక త్వాత్ -ఏతేన 'కృష్ణస్య సఖ రర్జున' ఇతి భారతం -సఖినా వాన రేంద్రేణే తి చ రామాయణం చ వ్యాఖ్యాతం."

పయి నుదాహరింపఁబడిన మనోరమా వ్యాఖ్యానముం బట్టియు, 'సీతా యాః పతయేనమః' ఇత్యాది ప్రయోగములు రామాయణాది గ్రంథ ములం గనఁబడుచుండుటం బట్టియు, "పతౌ" యను రూపమును సాధు వేయని స్పష్టమగుచున్నది. "షష్ఠ్యా ఆక్రోశే" అను సూత్రమును బట్టి నిందార్థమునందును మఱికొన్ని విశేషశబ్దములయందును దప్ప షష్ఠీవిభక్తియుం దలుక్సమాసము శబ్దశాస్త్రమునందు విధింపఁ బడి యుండలేదు గనుక, "సీతాయాః పతయేనమః" ఇత్యాది స్థల

ములయందు దలుక్షణమాసమని చెప్పుటకు వీలులేదు. కాబట్టి యిచ్చట పతిశబ్దమునకు భర్తయనియే యర్థమగుట విస్పష్టమగుచున్నది. వారు 'నష్టే మృతే' యను విధి నియోగపరమనుట కాధారలేశము గాని లేకపోవుటచేతను, విధవానియోగము పూర్వయుగములందు సహితము మన్వాదులచే బహుధర్మముల నిందింపఁబడి యుండుటచే తను, పరాశరస్మృతియందలి స్త్రీపునర్వివాహవిధి నియోగపరము కాదని నేను జెప్పనక్కఱలేకయే యెల్లరును సులభముగాఁ దెలిసి కోవచ్చును.

'నష్టే మృతే' యనుశ్లోకమును పరాశరులవారు నారదస్మృతి నుండి గ్రహించియున్నారు; నారదస్మృతిని జూచినను, ఈ స్త్రీపునర్వి వాహము వాగ్దత్తావిషయము కాదని తేటపడఁగదు. నారదస్మృతి—

శ్లో॥ నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ।
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే॥
అష్టవర్షా ణ్యుదీక్షేత బ్రాహ్మణీ ప్రోషితం పతిమ్।
అప్రసూతా తు చత్వారి పరతోన్యం సమాశ్రయేత్॥

భర్త నష్టుఁడయినపుడు బ్రాహ్మణస్త్రీ సంతానము గలదయినయెడల నెనిమిదిసంవత్సరములును, సంతానము లేనియెడల నాలుగుసంవత్సర ములును జూచి వేఱొకనిని వివాహము చేసికోవలసినదని విధించుట వలన నయివిధి వాగ్దత్తాపరమని మందమతి సహితము చెప్పఁజాలఁడు.

అద్దేపల్లి కృష్ణశాస్త్రులుగారు చదివిన ఖండన గ్రంథములో "నష్టే మృతే" యను పునర్వివాహవిధి సంకరులకని యొకచోటను, వాగ్దత్తలకని మఱియొకచోటను వ్రాసినారు. వాగ్దత్తలకని యర్థము చేయకపోయిన పక్షమున,-

శ్లో॥ పర పూర్వ స్త్రియాః పుత్రా న పిండం నోదక క్రియాః।
కన్యాయాః పూర్వ భర్తా చ ధర్మాధర్మా వ వాప్యతే॥

అని పరపూర్వస్త్రీయొక్క పుత్రులు పిండమును ఉదకక్రియయును గలవారు కారనియు, ఆ కన్యయొక్క పూర్వభర్త ధర్మాధర్మములను పొందఁడనియుఁ జెప్పిన పరాశరవచనమునకు బాధకలిగి, పరాశరుని చేత దూషింపఁబడిన పునర్వివాహమునకు ప్రవర్తనము కలుగునని చెప్పిరి. కాని పరాశరులవారు దూషించిన పరపూర్వ, మగఁడుండఁగా నతనిని విడిచి మఱియొకనిని జేరినదిగాని విధివిహితముగా వివాహమైనది గాదు; ఈయర్థమునే సూచించుచు మనువు పరపూర్వాలక్షణమును వ్రాసియున్నాఁడు___

శ్లో॥ పతిం హిత్వాపకృష్టం వముత్కృష్టం యా నిషేవతే।
నింద్యైవ సా భవే ల్లోకే పరపూర్వేతి చోచ్యతే॥

తక్కువవాఁడయిన పతిని విడిచి గొప్పవాని నెవతె పొందుచున్నదో యా స్త్రీ లోకములో నింద్యురాలగుననియు, అట్టిస్త్రీ పరపూర్వ యని చెప్పఁబడుననియు, మనువు పంచమాధ్యాయమున వ్రాసియున్నాఁడు. మృతభర్తృకకు వివాహము గలదని సూచించు వాక్యము పరాశరస్మృతియందు మఱియొకటికూడఁ గలదు.

శ్లో॥ విధవా యా భవేత్కన్యా నిర్దోషా భర్తృవర్జితా
తస్యావాసః పితు ర్వేశ్మ న లజ్జా చైవ సర్వదా॥

విధవయయిన కన్య నిర్దోషురాలయి భర్తచేత విడిచిపెట్టఁబడినప్పుడు సర్వదా పితృగృహమున వాసము చేయవలయునని, విధవ భర్తచేత విడువఁబడి యనిన తోడనే పునర్వివాహము గలదని పామరులును సులభముగా నూహింపదగియున్నది. ఈ శ్లోకమును కృష్ణశాస్త్రిగారు చదివిన ఖండనగ్రంథములో నుదాహరింపఁబడిన "పరపూర్వ

స్త్రీయః" యను శ్లోకమును నాగరప్రతులయందుఁ గనఁబడుచున్నను, ఈ దేశమున ముద్రితమైయున్న తెనుఁగుపుస్తకములందుఁ గానరా కున్నవి. తమ వ్యాఖ్యకు విరుద్ధముగా నుండునని సందపండితాదులో, లేక యిక్కడ పుస్తకమును ముద్రించినవారో యీ శ్లోకములను దీసివేసియుందురు. తమ గ్రంథమునందు క్రొత్తశ్లోకములను జేర్చ కుందుటకును మునుపున్నవానిని తీసివేయకుండుటకును పరాశరులవారు తమ స్మృతియందలి శ్లోకసంఖ్యనుగూడ కడపట నిచ్చియున్నారు. మాధవాచార్యులవారును వ్యాఖ్యానములో "వచనాంతరాణా మావాపోద్వాప నివృత్తయే సంఖ్యాభిధానం" అని యీ సంగతినే వ్రాసియున్నారు.—

శ్లో॥ ఏత త్పరాశరం శాస్త్రం శ్లోక పంచశతాధికమ్।
త్రిసప్తతి సమాయుక్తం ధర్మశాస్త్రస్య సంగ్రహః॥

ఈ పరాశరవచనమునుబట్టి పరాశరస్మృతిలో నైదునందలడెబ్బది మూఁడు శ్లోకము లుండవలసినను, శ్లోకమును క్రమముచేసి లెక్కించి చూచినవారందఱును ఏడెనిమిదిశ్లోకములు తక్కువగా నుండుటను కనిపెట్టఁగలరు. శ్లోకసంఖ్య తక్కువగుటకుంగల కారణము గ్రంథములోనుండి కొన్నిశ్లోకములు తీసివేయఁబడుటతప్ప మఱియొకటి యని యూహింపఁదగియుండదు.

స్త్రీపునర్వివాహము కలియుగనిషేధములలోఁ జేరియున్నది గాన, ఆచరణీయముకాదని కొందఱందురు. ఏ గ్రంథమునందును స్మృతిభర్తృకావివాహము నిషేధింపఁబడి యుండలేదు; ఒకవేళ నిషేధింపఁబడి యున్నదని యొప్పుకొన్నను, కలిధర్మప్రవర్తక మయిన పరాశరస్మృతి వచనమునకంటె పురాణవచనములు దుర్బలములయి నవి గనుక, అవి యంగీకరింపఁబడదగినవియు గావు. విధవావివా

హమును నిషేధించుచున్నవన్న వచనముల నించుక విచారింతము. "ఊఢాయాః పునరుద్వాహ" మను నాదిపురాణవచనము సాధారణ ముగా వివాహితలకుఁ బునర్వివాహమును నిషేధించుచున్నదిగాని మృతభర్తృకలకు నిషేధించుటలేదు. దేవరాచ్చ సుతోత్పత్తి ర్దత్తా కన్యా ప్రదీయతే" యను క్రతువచనమును "దత్తాయా శ్చైవ కన్యాయాః పునర్దానం పరస్యచ" అను బృహన్నారదీయ పురాణ వచనమును, "దత్తా కన్యా ప్రదీయతే" యను నాదిత్యపురాణవచః మును, సామాన్యముగా దత్తయైన స్త్రీయొక్క పునర్వివాహమును నిషేధించుచుండఁగా, అయిదాపదలయందుమాత్రము విశేషముచేత పరాశరవచనము స్త్రీపునర్వివాహమును విధించుచున్నది. కాఁబట్టి పయి నిషేధవచనములన్నియు మంచివరుఁడు దొరికినపుడు కన్యను మఱియొకనికిచ్చు పూర్వయుగాచారమును నిషేధించుచున్నవే కాని, కలిధర్మప్రవర్తకమగు పరాశరవచనమును నిషేధించుచుండలేదు; అట్లు నిషేధించుట కవి చాలినవియుఁ గావు. ఎట్లన్నను — ఆదిత్య పురాణాదులు పరాశరుఁడు విధించిన ధర్మములలోని యశ్వమేధాదులను కలియుగ నిషేధములని చెప్పుచున్నను, స్మృతికంటెఁ బురాణము దుర్బలమైన దగుటచే వానిని పాటింపక శూద్రకుఁడు, ప్రవసేనుఁడు మొదలగురాజులు కలియుగములోనే యశ్వమేధాదులను జేసియున్నట్టు గ్రంథములు చెప్పుచునేయున్నవి. కాఁబట్టి యొకవేళ నేపురాణ మయినను పరాశరస్మృతిలో విధింపఁబడియున్న స్త్రీపునర్వివాహమును నిషేధించినను, ఆ నిషేధము గ్రాహ్యము కాకయేపోవును.

విధవావివాహమును స్మృతులు కొన్ని నిషేధించుచున్నవి. కాఁబట్టి యది యిప్పుడాచరణీయముకాదని కొందఱు చెప్పిరి. కాని యే స్మృతియు స్త్రీపునర్వివాహమును నిషేధించి యుండలేదు; ఉండి

వను, అవి యితరయుగములకుఁ బనికివచ్చు స్మృతులు కాఁబట్టి యీ కలియుగమునకయి ముఖ్యముగాఁ జేయఁబడిన పరాశరస్మృతిని బాధిం పను జాలవు.

శ్లో. అజ్ఞాతశ్చ ద్విజో యస్తు విధవా ముద్వహే ద్యది
పరిత్యజ్య చ తాం చైవ ప్రాయశ్చిత్తం సమాచరేత్ ॥

అను వసిష్ఠవచనము నొకదానిని మాత్రము "ఏ ద్విజుఁడైనను అజ్ఞానమువలన విధవను వివాహమాడెనేని దానిని బరిత్యజించి ప్రాయశ్చిత్తము చేసికోవలె" నని విధవావివాహమునకు బాధకముగాఁ దీసికొనివచ్చిరి. పూర్వయుగములయందు సహితము స్మృతికర్త లందఱును స్త్రీపునర్వివాహము నంగీకరించినను, కొందఱు అక్షతయోనికి మాత్రమే వివాహము చేయవలెనని చెప్పిరి. పయిచెప్పిన సామాన్య విధికి బాధకముగా,—

శ్లో॥ పాణిగ్రాహే మృతే బాలా కేవలం మంత్రసంస్కృతా ।
సా చే దక్షతయోని స్స్యా త్పునస్సంస్కార మర్హతి. ॥

అను విశేషవిధినిగూడ వసిష్ఠుఁడే చెప్పియున్నందున, ఈతఁడును అక్షతయోనికి మాత్రమే వివాహము చేయుమనువారిలోనివాఁడు. తక్కిన స్మృతులయం దెక్కడనుగాని స్త్రీపునర్వివాహమును నిషేధించు వాక్య మొక్కటియైనను గానరాదు. "వేదార్థోపనిబద్ధత్వా" దిత్యాది వాక్యములవలన సర్వస్మృతులలోను మనుస్మృతి యుత్కృష్టమయినదనియును, దానికి విరుద్ధముగానున్న స్మృతు లంగీకరింపఁ దగినవి కావనియు మనుస్మృతిలో విధవావివాహము నిషేధింపఁబడియున్నదనియు, అందుచేఁ బరాశరవచనము చెల్లదగినది కాదనియుఁ గొందఱనిరి. మనుస్మృతి కృతయుగధర్మప్రవర్తకమయినది కాఁబట్టి ఆయుగమునందు మాత్రమే యది యితరస్మృతులకంటె బలీయమయి

నదిగాని, కలియుగధర్మప్రవర్తకమయిన పరాశరస్మృతికంటె బలీయమైన దెన్నటికిని గానేరదు. అయినను మనుస్మృతియు స్త్రీపునర్వివాహము నంగీకరించుచునే యున్నది. కాని, కొందఱు భ్రాంతిపడునట్లు నిరాకరించుచుండలేదు. ఇప్పటి ముద్రిత పుస్తకమునందు కనఁబడక పోయినను "నష్టే మృతే" యను శ్లోకము మనుస్మృతిలోఁగూడ నున్నట్లు మాధవాచార్యులు వ్రాసిన దానివల్లనే తెలియవచ్చుచున్నది గదా? నారదసంహితనుబట్టికూడ అది మనుస్మృతిలోనిదే యయినట్లు స్పష్టమగుచున్నది. ఎట్లన్న—నారదసంహిత ప్రారంభమునందు,—

"భగవా న్మనుః ప్రజాపతిః సర్వభూతానుగ్రహార్థ మాచారస్థితిహేతుభూతం శాస్త్రం చకార తదేతత్ శ్లోకశతసహస్ర మాసీత్ తేన అధ్యాయసహస్రేణ మనుః ప్రజాపతి రుపనిబధ్య దేవర్షయే నారదాయ ప్రాయచ్ఛత్-స చ తస్మా దధీత్య మహత్త్వా న్నాయం గ్రంథః సుకరో మనుష్యాణాం ధారయితు మితి ద్వాదశభిః సహస్రై స్సంచిక్షేప-తచ్చ సుమతయే భార్గవాయ ప్రాయచ్ఛత్-స చ తస్మా దధీత్య తథైవాయుర్హ్రాసా దల్పీయసీ మనుష్యాణాం శక్తి రితి జ్ఞాత్వా చతుర్భిః సహస్రైః సంచిక్షేప - తదేతత్ సుమతికృతం మనుష్యా అధీయతే - విస్తరేణ శతసహస్రం దేవగంధర్వాదయః యత్రాయ మాద్యః శ్లోకో భవతి :—

ఆసీ దిదం తమోభూతం న ప్రాజ్ఞాయత కించన।
తతః స్వయంభూ ర్భగవాన్ ప్రాదురాసీ చ్చతుర్ముఖః॥

ఇత్యేతే మధికృత్య క్రమా త్ప్రకరణాత్ ప్రకరణ మనుక్రాంతం తత్ర తు నవమం ప్రకరణం వ్యవహారో నామ యస్యేమాం దేవర్షి నారదః సూత్రస్థానీయాన్ మాతృకాన్ చకార."

అని మనువు మొదట లక్షగ్రంథమును వ్రాసి యాసంహితను నారదున కీయఁగా, ఆతఁడు దానిని మనువునొద్దనే చదివి మనుష్యులకు సులభ ముగాఁ దెలియుటకయి దానిని సంగ్రహపఱిచి పండ్రెండువేలగ్రంథ ముగా వ్రాసి భార్గవుఁడయిన సుమతి యనువానికిఁ జెప్పినట్టును, మనుష్యులయొక్క అల్పజీవితకాలమును దలఁచి యతఁడు మరల దానిని నాలుగువేల శ్లోకములుగా సంగ్రహించి మనుష్యులలో వ్యాపింపఁజేసినట్టును, నారదస్మృతియందు వ్రాయఁబడి యుండుట చేత నారదసంహితలోనివన్నియు మనుస్మృతియందుఁ జెప్పఁబడినవే యనుటకు సందేహముండదు. "నష్టేమృతే" యను విధి స్పష్టముగా నారదసంహితయందుఁ గనఁబడుచున్నది. కాఁబట్టి యది మనుస్మృతి లోనిదే యనుట స్పష్టము. దీనినిబట్టి విచారింపఁగా మనుస్మృతి పూర్వోక్తములయిన అయిదాపదలయందును స్త్రీ పునర్వివాహము నంగీకరించుచున్నదని నిశ్చయముగాఁ దేలుచున్నది. ఇఁక మనుస్మృ తిలో విధవావివాహము నిషేధింపఁబడి యున్నదని ప్రతిపక్షులు గనఁ బఱుచు ప్రమాణములనుగూర్చి కొంచెము విచారింతము :—

"న ద్వితీయశ్చ సాధ్వీనాం క్వచిద్భర్తోపదిశ్యతే"

పుణ్యసతులకు రెండవవాఁ డెప్పుడును భర్తయని చెప్పఁబడఁడను శ్లోకార్థమును మాత్రము వ్రాసి తమపక్షమును సాధింపవలెనని స్త్రీపున ర్వివాహ నిషేధవాదులు ప్రయత్నించిరి కాని తక్కిన భాగమునుగూడ సంపూర్ణముగా నుదాహరించినచో వారి యభిమత మెంతమాత్ర మును కానేరదు. సందర్భము చక్కఁగాఁ దెలియుటకయి దాని పూర్వ శ్లోకములనుగూడ నిం దుదాహరించుచున్నాను :—

శ్లో॥ మృతే భర్తరి సాధ్వీస్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా
స్వర్గం గచ్ఛ త్యపుత్రాపి యథా తే బ్రహ్మచారిణః

అపత్యలోభా ద్యాతుస్త్రీ భర్తార మతివర్తతే
సేహ నిందా మవాప్నోతి పరలోకా చ్చ హీయతే
నాన్యోత్పన్నా ప్రజాస్త్రీహ న చాప్య న్యపరిగ్రహే
నద్వితీయశ్చ సాధ్వీనాం క్వచి ద్భర్తోపదిశ్యతే॥

భర్తపోయిన సాధ్వియయిన స్త్రీ బ్రహ్మచర్యమునందు వర్తించునేని పుత్రవిహీనురాలయినను బ్రహ్మచారులవలెనే స్వర్గమును పొందు ననియు, సంతానాపేక్షవలన నేస్త్రీ వ్యభిచరించునో యాస్త్రీ యిహమున నిందను పొందుటయేకాక పతిలోకమును సహితము పోఁగొట్టుకొనుననియు, అన్యునివలనఁ గలిగినవారు స్త్రీకి క్రమమయిన సంతానమునుగారు. పరుని భార్యయందుఁ గలిగినవారు కన్నపురుషుని సంతానమునుగారు. శాస్త్రమునం దెక్కడను సాధ్వులయిన స్త్రీలకు రెండవవాఁడెప్పుడును భర్తగా విధింపఁబడలేదనియు, మనువు వ్యభిచారము కూడదని చెప్పినవాఁడేకాని పునర్వివాహముకూడదని చెప్పవచ్చినవాఁడు కాఁడు. "అనంతాః పుత్రిణాం లోకాః। నాపుత్రస్య లోకో ఽస్తీతి శ్రూయతే" యని యుండుటవలనఁ బుత్రులు లేనివారికిఁ బరలోకము లేదను భ్రాంతిచేత సంతానార్థము స్త్రీ వ్యభిచరించునేమోయని, బ్రహ్మచర్యము చేసినను స్వర్గము కలదనియు, వ్యభిచరించి కన్నవాడు పుత్రుఁడు కాఁడుగనుక నట్టిసంతానమువలనఁ బ్రయోజనము లేదనియు ద్వితీయుఁ డనఁగా విధివిహితముగా వివాహమాడిన పెనిమిటికంటె నన్యుఁ డెప్పుడును స్త్రీకి భర్తకాఁజాలడనియు మనువు వ్రాసియున్నాఁడు. కాఁబట్టి ప్రతిపక్షులు ఉదాహరించిన శ్లోకార్థము ద్వితీయవివాహము కూడదనుట కెంతమాత్రము నుపయోగింపదు.

మఱియును మనప్రతిపక్షులు తమపక్షమును సాధించుకొనుటకయి యీక్రింద నుదాహృతమయిన మఱియొక శ్లోకార్థమును

గూడఁ గనఁబఱిచి యున్నారు—

" న వివాహవిధా వుక్తం విధవావేదనం పునః"

ఇది.యును బూర్వోత్తర సందర్భములను జక్కఁగా విమర్శించి చూచిన యెడల వారివాదమున కించుకయుఁ బనికి రాదు. సంగతి సందర్భము తెలియుటకయి పూర్వోత్తర శ్లోకముల నిందుదాహరించెదను:—

శ్లో॥ దేవరా ద్వా సపిండా ద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా ।
ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరిక్షయే ॥
విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతోనిశి ।
ఏక ముత్పాదయే త్పుత్రం నద్వితీయం కథం చన ॥
ద్వితీయ మేకే ప్రజనం మన్యంతే స్త్రీషు తద్విదః ।
అనిర్వృతం నియోగార్థం పశ్యంతో ధర్మత స్తయోః ॥
విధవాయాం నియోగార్థే నిర్వృత్తే తు యథావిధి ।
గురువచ్చ స్నుషావచ్చ వర్తేయాతాం పరస్పరమ్ ॥
నియుక్తౌ యౌ విధిం హిత్వా వర్తేయాతాం తు కామతః ।
తావుభౌ పతితౌ స్యాతాం స్నుషాగ గురుతల్పగౌ ॥
నాన్యస్మిన్ విధవా నారీ నియోక్తవ్యా ద్విజాతిభిః ।
అన్యస్మిన్ హి నియుంజానా ధర్మం హన్యుస్సనాతనం ॥
నోద్వాహికేషు మంత్రేషు నియోగః కీర్త్యతే క్వచిత్ ।
న వివాహ విధా వుక్తం విధవా వేదనం పునః ॥
అయం ద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో విగర్హితః ।
మనుష్యాణా మపి ప్రోక్తో వేనే రాజ్యం ప్రశాసతి ॥
స మహీ మఖిలాం భుంజ న్రాజర్షి ప్రవరః పురా ।
వర్ణానాం సంకరం చక్రే కామోపహతచేతసః ॥

తతః ప్రభృతి యో మోహాత్ ప్రమీతపతికాం స్త్రియం।
నియోజయత్యపత్యార్థం తం విగర్హంతి సాధవః॥

అని మనువు నియోగమునుగూర్చి వ్రాయుచు, సంతానము లేనప్పుడు స్త్రీ దేవరునివలనఁగాని సపిండునివలనఁగాని నియోగమువలనఁ గుమారుని గనవచ్చును మొదలయిన సంగతులను మొదట వ్రాసి, తరువాత ద్విజాతులచేత విధవ నియోగింపఁబడఁదగినది కాదని వ్రాసి, వెంటనే 'వివాహమంత్రములయం దెక్కడను నియోగము చెప్పఁబడలేదు. వివాహవిధులయందు మరల విధవాగ్రహణమును జెప్పఁబడలేదని వ్రాసి, యావెనుకను పండితులయిన ద్విజులచే నది పశుధర్మమని నిందింపఁబడిన దనియు వేనుని రాజ్యకాలములో జరిగి వర్ణసంకరమయినదనియు, కాఁబట్టి సంతానార్థము నియోగించుటను సాధువులు గర్హింతురనియు బహువిధముల నియోగమును దూషించియున్నాఁడుగాని, విధవావివాహమును నిందించియుండలేదు. నియోగప్రకరణ మధ్యమున సందర్భములేకుండ నొక్కమాటను మాత్రము విధవావివాహమునుగూర్చి వ్రాయుననుట యుక్తి కెంతమాత్రమును సరిపడి యుండదు.

నోద్వాహికేషు మంత్రేషు నియోగః కీర్త్యతే క్వచిత్ ।
న వివాహవిధా వుక్తం విధవా వేదనం పునః॥

అనుశ్లోకమునకు వివాహమంత్రములయం దెక్కడను నియోగమునుం జెప్పఁబడలేదు. విధవాగ్రహణమును వివాహవిధులయందుఁ జెప్పఁబడలేదనియే యర్థమగునుగాని ప్రత్యేకముగా విధవావివాహము వివాహమంత్రములయందుఁ జెప్పఁబడలేదని ప్రకరణానుసారముగా లేశముగాని యర్థము చెప్పుట కవకాశము లేదు. కాఁబట్టి యిక్కడఁ జెప్పిన విధవావేదనము నియోగాంగవివాహమయి, విధవ నొకరి

దగ్గఱకు వెళ్ళుమని నియోగించుటకుఁగాని, యామె నౌకరు స్వీకరించుటకుఁగాని మంత్రములు లేవని పైశ్లోకమునకుఁ దాత్పర్యమగును. వేదనమను పదము గ్రహించుట యను యర్థమిచ్చు విద్ ధాతువు నుండి పుట్టిన విశేష్యము. ఈధాతువునుండి పుట్టిన 'విందేత' యను రూపమును పూర్వోదాహృత శ్లోకములకుఁ దరువాతి శ్లోకమునందు నియోగమునందు స్వీకరించుటకే మనువుపయోగించి యున్నాఁడు. ఆశ్లోకముల నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను.—

శ్లో॥ "యస్యా మ్రియేత కన్యాయా వాచా సత్యే కృతే పతిః।
తా మనేన విధానేన ద్విజో విందేత దేవరః॥
యథావిధ్యఽధిగ మ్యైనాం శుక్లవస్త్రాం శుచివ్రతాం।
మిథో భజేతా ప్రసవా త్సకృ త్సకృ ద్వృతావృతౌ॥

విధవావేదనమనుచోట నియోగాంగవివాహమని యర్థము చెప్పక స్వతంత్రవివాహమని యర్థము చేసినచో, "నష్టే మృతే" యను మనువచనమునకే విరుద్ధమగును; అంతియకాక మఱియొకచోట మనుస్మృతియందే యీక్రిందిశ్లోకములచే విధింపఁబడిన విధవావివాహమునకును గతి లేకపోవలసివచ్చును:—

శ్లో॥ యా పత్యా వా పరిత్యక్తా విధవా వా స్వయేచ్ఛయా।
ఉత్పాదయే త్పునర్భూత్వా స పౌనర్భవ ఉచ్యతే॥
సా చే దక్షతయోని స్స్యా ద్గతప్రత్యాగతాపి వా।
పౌనర్భవేన భర్త్రా సా పున స్సంస్కార మర్హతి॥

ఏ స్త్రీ పతిచేత విడువఁబడిగాని విధవయయి స్వేచ్ఛచేతఁగాని మఱియొకనికి సంతానము గనునో యా స్త్రీ పునర్భువనియు తత్పుత్రుఁడు పౌనర్భవుఁడనియు చెప్పఁబడుదురనియు, ఆ స్త్రీ యనఁగా పతిచే విడువఁబడినట్టిగాని విధవయైనట్టిగాని స్త్రీ యక్షతయోని యైనచో

పౌనర్భవుఁడయిన భర్తచే వివాహసంస్కారమున కర్హురాలనియు మొదటి పెనిమిటిని విడిచి మఱియొకనిం జేరి మరల మొదటి పెనిమిటి కడకు వచ్చిన స్త్రీ మొదటిపెనిమిటితోడి వివాహసంస్కారమున కర్హురాలనియు, పై శ్లోకముల కర్థము. ఇక్కడ నక్షతయోనియైన విధవకు శాస్త్రీయమయిన పునర్వివాహమును విధించుచున్న మనువే వెనుక విధవావివాహమునకు మంత్రములు లేవనుటకంటె వింత మఱియొకటి యుండదు. కాఁబట్టి యెల్లవిధముల స్త్రీపునర్వివాహము మనుస్మృతిచే విధింపఁబడినదనియు, మనువెక్కడను విధవావివాహమును నిషేధించలేదనియు, పైని చెప్పిన సంగతులవల్ల స్పష్టముగాఁ దెలియ వచ్చుచున్నది. బ్రహ్మపురాణములోని యీక్రిందిశ్లోకములును ఈ పై నుదాహరింపఁబడిన మనువచనముల యర్థమునే బోధించుచున్నవి:—

శ్లో. మృతే భర్తరి యా నారీ త్యక్తవత్యథా తం స్వయమ్ ।
సవర్ణా జ్జనయే ద్గర్భం భర్తుః పౌనర్భవం సుతమ్ ॥
యది సా బాలవిధవా బలా త్త్యక్తాఽథవా క్వచిత్ ।
తథా భూయ స్తు సంస్కార్యా గృహీతా యేన కేన చిత్ ॥

పరిశీలించి చూడఁగా నితరయుగధర్మబోధకములైన స్మృతుల యందు సహిత మెక్కడను స్త్రీపునర్వివాహ నిషేధవాక్యములు లేవు; స్త్రీపునర్వివాహవిధాయక వచనములు పెక్కులు గలవు. వానిలోఁ గొన్నిటిని నామొదటి యుపన్యాసమునం దుదాహరించి యుంటినిగాన వాని నిచ్చట మరల వ్రాయుట మానుచున్నాను. మనప్రతిపక్షులు పునర్వివాహము చేసికొన్న స్త్రీలు పునర్భువులని చెప్పఁబడి కొన్ని స్మృతులలో వారు దూష్యురాండ్రుగాఁ బరిగణింపఁ బడినారని యీ క్రింది శ్లోకములను జూపుదురు.—

సప్త పౌనర్భవాః కన్యాః వర్జనీయాః కులాధమాః ।
వాచా దత్తా మనోదత్తా కృతకౌతుకమంగళా ॥
ఉదకస్పర్శితా యా చ యా చ పాణిగృహీతికా ।
అగ్నిం పరిగతా యా చ పునర్భూప్రభవా చ యా ॥
ఇత్యేతాః కాశ్యపేనోక్తా దహన్తి కుల మగ్నివత్.

వాగ్దత్త, మనోదత్త, కృతకౌతుకమంగళ, ఉదకస్పర్శిత, పాణిగృహీతిక, అగ్నింపరిగత, పునర్భూప్రభవ అను నేడుగురును వర్జనీయులైన పునర్భువులుగానే చెప్పఁబడినను, వారిలో మొదటి నలుపురకు నీ యుగమునందు ధారాళముగా వివాహములు జరుగుచు వారు దూష్యురాండ్రుగా నెంచఁబడకపోవుటయు, పునర్భువులని పిలువఁబడకపోవుటయు నెల్లవారికిని విశదమై యే యున్నది. కాఁబట్టి యట్టి స్త్రీలకు పునర్భూ వ్యవహారము పూర్వయుగములయందే కాని యీయుగమునందు లేదని బాలుఁడైనను దెలిసికొనును. పూర్వయుగములయందు సహితము పునర్భూవివాహము మను యాజ్ఞవల్క్యాదులచే నంగీకరింపఁబడియే యున్నదని పూర్వోదాహృత మైన "యా పత్యా వా పరిత్యక్తా" యను మనువచనమువలనను, "అక్షతా చ క్షతా చైవ" యను యాజ్ఞవల్క్య వచనమువలనను, "యా చ క్లీబం పతిత మున్మత్తం వా పతి ముత్సృజ్య అన్యం పతిం విన్దతే వా సా పునర్భూ భవతి" యను వసిష్ఠవచనమువలనను, స్పష్టపడుచునే యున్నది. పునర్భూ సంతానమును క్రమమయినదే యనుటకును, పౌనర్భవులు దాయార్హులును పిండదానార్హులు ననుటకును మను, యాజ్ఞవల్క్య స్మృతులనుండి ప్రమాణములను గనఁబఱిచెదను. ద్వాదశవిధ పుత్రులను జెప్పిన తరువాత—

క్షేత్రజాదీన్ సుతా నేతా నేకాదశ యథోదితాన్ ।
పుత్ర ప్రతినిధీ నాహుః క్రియాలోపా న్మనీషిణః ॥

పరలోకక్రియలు లోపించునపుడు క్షేత్రజాదులగు పదునొకండుగురు పుత్రులను వరుసగా పుత్రప్రతినిధులనుగా పెద్దలు చెప్పిరనియు,-

శ్రేయస శ్శ్రేయసో లాభే పాపీయా న్రిక్థ మర్హతి ।
బహవ శ్చేత్తు సదృశా స్సర్వే రిక్థస్య భాగినః ॥

ఔరసాది పుత్రులలో మొదటితరగతివారు లేనపుడు వరుసగా తరువాతి తరగతివారు దాయమును పొందుదురనియు వారు పలువురున్న యెడల సమానభాగములను పొందుదురనియు మనువ్రను,-

పిండదోంశహార శ్చైషాం పూర్వాభావే పరఃపరః ।

పూర్వపువారు లేనపుడు తరువాతివారు క్రమముగా పిండప్రదానమునకును దాయమునకును అర్హులగుదురని యాజ్ఞవల్క్యుఁడును, పౌనర్భవులు పిండప్రదాన దాయహరణ పాత్రులని చెప్పియున్నారు. పరాశరులవారీయుగమున రెండవమాఱు వివాహమాడిన స్త్రీలసంతానమునకు పౌనర్భవులను నామము తీసివేసి వారి నౌరసులనుగానే చెప్పియున్నాఁడు; పునర్వివాహము చేసికొను స్త్రీలకును ఈయుగమున పునర్భూ సంజ్ఞ లేదు. పూర్వయుగములయందువలె వారించుకయైనను తక్కువవారుగా నెంచఁబడక ప్రథమవివాహమాడిన భార్యతోను, అట్టి భార్యవలనఁ గలిగిన సంతానముతోను సమానముగా గౌరవింపఁబడవలయుననియే పరాశరుల తాత్పర్యము.

"ఔరసః క్షేత్రజ శ్చైవ దత్తః కృత్రిమక స్సుతః."

అని పరాశరుఁడు కలియుగమున నాలుగువిధములయిన పుత్రులను మాత్రమే యంగీకరించియున్నాఁడు. స్వక్షేత్రజుఁడే యౌరసుఁడని యర్థముచేసి పరాశరునిమతమున మూఁడువిధములయిన పుత్రులే

కలరని కొందఱు చెప్పియున్నారు. ఈదేశమునం దౌరసపుత్రుఁడును, దత్తపుత్రుఁడును మాత్రమే యంగీకరింపఁబడుచున్నను, కాశీ మొదలగు స్థలములయందలివారు కృత్రిమకసుతుని గూడ నంగీకరించుచున్నారు. దీనిని విచారించియే నందపండితుఁడు దత్తకమీమాంసయందు,—

"దత్తపదం కృత్రిమస్యా ప్యుపలక్షణం, ఔరసః క్షేత్రజ శ్చైవ దత్తః కృత్రిమక స్సుత ఇతి కలిధర్మప్రస్తావే పరాశరస్మరణాత్"

అని కృత్రిమపుత్రునిగూడ కలియుగమునందు గ్రహించి యున్నాఁడు. పరాశరస్మృతి ననుసరించియే కలియుగమునం దర్జునుఁడు మృతభర్తృకయైన యులూచిని వివాహము చేసికొనియున్నాఁడు. ఈ క్రింద నుదహరించిన భారతశ్లోకములవలన ఉలూచి క్రమమయిన భార్యగా నెంచబడుటయు, ఆమెవలన నర్జునునకుఁ గలిగిన పుత్రుఁ డౌరసుఁడనియె చెప్పఁబడుటయు, సులభముగాఁ దెలిసికోవచ్చును:—

అర్జునస్యాత్మజ శ్శ్రీమా న్నిరావ న్నామ వీర్యవాన్
సుతాయాం నాగరాజస్య జాతః పార్థేన ధీమతా
ఐరావతేన సా దత్తా హ్యనపత్యా మహాత్మనా
పత్యౌ హతే సుపర్ణేన కృపణా దీనచేతసా
భార్యార్థం తాం చ జగ్రాహ పార్థః కామవశానుగాం
అహన న్నర్జున శ్చాపి నిహతం పుత్ర మౌరసం
జఘాన సమరే శూరాన్ రాజ్ఞ స్తాన్ భీష్మరక్షిణః.

అర్జునుఁడు కలియుగములోని వాఁడాయని సందేహము తోఁచినవారు యుధిష్ఠిరశకసంవత్సరములను దెలిసికొందురేని సంశయ నివారణముం జెందగలరు. మఱియును రాజతరంగిణియందు,-

శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతలే
కలే ర్గతేషు వర్షాణా మభవన్ కురుపాండవాః ॥

కలియుగమునం దాఱువందల యేఁబదిమూడు సంవత్సరములయిన తరువాత కురుపాండవు లున్నారని స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది. అద్దేపల్లి కృష్ణశాస్త్రులుగారు చదివిన ఖండవ్రగంథములో,—

స నాగలోకే సంవృద్ధో మాత్రాచ పరిరక్షితః।
పితృవ్యేణ పరిత్యక్తః (పార్థద్వేషా ద్దురాత్మనా॥)

అను భారతశ్లోకములోని మొదటి మూడు పాదములు మాత్రము వ్రాసి "పార్థద్వేషా ద్దురాత్మనా" యను నాలవపాదమును విడిచిపెట్టి, ఇరావంతుఁడును దల్లియు జాతిబహిష్కృతులుగాఁ జేయఁబడిరనియు, తండ్రిచేత విడిచిపెట్టఁబడియె; అతఁడు నాగలోకమునందు పెరిగెననియు, 'మాత్రా చ పరిరక్షిత' యనుటచే మాతామహాది బంధువులచేఁగూడ విడువఁబడినట్టు కనఁబడుచున్నదనియు, పితృవ్యులచే విడువఁబడుట స్పష్టముగానే చెప్పఁబడి యున్నదనియు, స్వకపోలకల్పితములైన కొన్నియూహలనుజేర్చి, ఆయుపన్యాసకులు మోసముచేసి గెలుపుగొనుటకుఁ బ్రయత్నించిరి. కాని పూర్వోదాహృత శ్లోకములోని నాలవ చరణమువల్లఁ బినతండ్రి దుర్మార్గముగా పార్థునియెడఁ గల ద్వేషముచేతనే యిరావంతుని విడిచిపెట్టెను గాని మఱియొక కారణముచేత కాదనియు, 'మాత్రాచ' యని చకారమును బ్రయోగించుటచే తల్లి మొదలగు బంధువులచేఁ బెంపఁబడినాడనియు, తల్లిపుట్టినింట నున్నది గనుకనే నాగలోకమునందుఁ బెరిగినాఁడనియుఁ దేటపడి వారు విఫలమనోరథులయిరి. ఈ వివాహము కర్మభూమియైన భరతఖండమునందు జరుగక నాగలోకమునందు జరిగినది గనుక దృష్టాంతముగాఁ దీసికొని రాఁగూడదని కొందఱనిరి; కాని యట్లుచెప్పు వారికాలము

నం దెవ్వరైన నితర దేశమునకుఁ బోయి విధవను వివాహమాడి వచ్చినచో నంగీకరింతురాయని యడిగినప్పుడు నిరుత్తరు లౌదురు.

స్మృతులలో కన్యకకే వివాహము చేయవలసిన దని యుండుట చేతను, వివాహమంత్రములలో కన్యాశబ్దమే కనఁబడుచుండుటచేతను, కన్యావివాహముమాత్రమే చేయవలయును గాని విధవావివాహము చేయఁగూడదని కొందఱాక్షేపించిరి. పూర్వోక్తమయిన "విధవా యా భవేత్కన్యా" యను పరాశరవచనమునుబట్టి విధవకు సహితము కన్యా వ్యవహారము కలదుగాన, కన్యయే దానయోగ్యురాలను స్మృతులును వివాహమంత్రములును పునర్భూకకు సహితము పనికివచ్చును. కన్యాశబ్ద మొకవేళ నవివాహితలకే చెల్లవలయు నన్నను,-

శ్లో॥ అవిప్లుతబ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియ ముద్వహేత్ ।
అనన్యపూర్వికాం కాంతా మసపిండాం యవీయసీమ్ ॥

అస్ఖలితబ్రహ్మచారి లక్షణవంతురాలును పరపూర్వకానిదియు మనోహరురాలును అసపిండురాలును వయస్సుచేఁ జిన్నదియు నైన స్త్రీని వివాహమాడవలయునని యాజ్ఞవల్క్యుఁడు విధించినట్లు,-

"శ్రుతిశీలినే విజ్ఞాయ బ్రహ్మచారిణేఽర్థినే దేయా"

వేదాభ్యాసము చేసినట్టియు సదాచారసంపన్నుఁడును జ్ఞానవంతుఁడును బ్రహ్మచారియు నైన వరునకే కన్య నీయవలయునని బోధాయనులును చెప్పియున్నారు. వీరిట్లు సామాన్యముగాఁ జెప్పినంతమాత్రమున బ్రహ్మచారులు కాని పురుషులకు వివాహము కూడదని కాని, కన్యలు కాని స్త్రీలకు వివాహము కూడదని కాని చెప్ప వల్లకాదు. ఇవి సామాన్య విధులగుటచేత విశేషవిధులనుబట్టి పురుషుల కెట్లో యట్లే స్త్రీలకును పునర్వివాహము చేయవచ్చును. పూర్వోదాహృతమయిన మనువచనమునుబట్టి యనన్యపూర్విక యనుచోఁ బతి యుండఁగా

నతనిని విడిచిపెట్టి మఱియొకనిని బొందు స్త్రీ యని యైనను జెప్ప వచ్చును. పురుషుని ద్వితీయవివాహమునకువలెనే స్త్రీల ద్వితీయవివాహమునకును వివాహమంత్రము లిప్పు డున్నట్టుగానే పనికివచ్చును. పురుషుని ద్వితీయవివాహమునందును "స్నాతకాయ కన్యార్థినే తుభ్య మహం సంప్రదదే" యనియే దానవాక్యములో స్నాతకున కిచ్చునట్లే చెప్పఁబడి యున్నది. ఒకసారి భార్య పోయినవాఁ డెప్పుడును స్నాతకుఁడు కానేరఁడుగదా? విధవ కన్యయైనను గావచ్చునుగాని విధురుఁ డెప్పుడును స్నాతకుఁడు కానేరఁడు. వివాహమంత్రములలో విధురునకు స్నాతకశబ్ద ముపయోగింపఁబడునపుడు, విధవకుఁ గన్యాశబ్దము నుపయోగించుటవలనను బాధక మేమియు లేదు.

ఒకసారి యియ్యఁబడిన కన్య మఱల నియ్యఁబడఁగూడ దనియు, కన్యాదానమాత్రమున జనకునకు పుత్రికయందుఁ గల స్వత్వ మంతరించును గాన మరల నిచ్చుట కధికార ముండదనియు, కొందఱు వాదింతురు. స్త్రీపునర్వివాహమునకు విధు లెప్పు డున్నవో యప్పుడే యియ్యఁబడిన కన్య మరల నియ్యఁబడవచ్చు నని శాస్త్రసిద్ధాంతమనియు, కన్యకవిషయమయిన స్వత్వము లేనివారు సహితము కన్యాదానము చేయవచ్చునని శాస్త్ర మంగీకరించుచున్నందున కన్యాదానము వధూవరు లిద్దఱును యావజ్జీవము పరస్పరసౌఖ్యము నిమిత్తము కలిసియుండుటకై యేర్పడిన వివాహబంధము యొక్క పూర్వాంగమే కాని దాత కన్యయెడఁ గల తన స్వత్వమును వదలుకొని యచేతనపదార్థమువలెఁ బ్రతిగ్రహీత తన మనసువచ్చినట్టు చేసికొనుటకై యిచ్చుట కాదనియు, వెనుకనే వ్రాసియున్నాను. కన్యాదానమాత్రమున జనకునికి దుహితయందుఁ గల స్వత్వము నశింపదనుటకుఁ బెక్కునిదర్శనములు గలవు. తక్కిన సమస్తదానములయందును

"సంప్రదదే న మమ" ఈ వస్తువు నీ కిచ్చుచున్నా నిఁక నాది కాదని యుండఁగా కన్యాదానమునందు మాత్రము "న మమ" నాది కాదను మాట లేకపోవుటయు, కన్యాదాన మాత్రముచేతనే కన్య మగని యధీనురాలు గాక యుక్తవయస్సు వచ్చు పర్యంతము జనకుని యింటనే యుండుటయు, దానమాత్రముచేతనే పుత్రికాత్వము పోక జనకుని సొత్తునకుఁ బుత్రికయు నామెపుత్రులును కర్తలగుటయు, విధవయగు స్త్రీకి పరాశరుఁడు పితృగృహనివాసమును విధించుటయు, దుహిత విషయమైన స్వత్వము తండ్రికిఁ గన్యాదాన మాత్రమున పోవదను టకుఁ జాలిన నిదర్శనములుగా నుండవచ్చును. అచేతన పదార్థములను రాజు దానము చేసినపుడు నహితము ప్రతిగ్రహీతయుఁ దద్వంశము వారును నశింతురేని దాని స్వత్వము మరల రాజునకే వచ్చుచున్నది. వివాహమాత్రమున జనకునకుఁ బుత్రికయెడఁ గలుగు స్వత్వము నశింపదు గనుకనే, అర్జున వివాహమునం దులూచిని తండ్రియైన యైరావతుఁడే మరల దానముచేసియున్నాఁడు. "ఐరావతేన సా దత్తా" యను భారతవచనమునుబట్టి యీ సంగతి యెల్లరకును దెలిసియే యున్నది.

దమయంతీ పునస్స్వయంవరము మిమచేఁ గల్పింపఁబడినది గాని నిజముగా జరుగలేదు గనుక దానిని దృష్టాంతముగా పుచ్చుకో గూడదనియు, ఋతుపర్ణుఁడొక్కఁడు తప్ప ఇతరరాజు లెవ్వరును రాలే దనియు, నలుఁడు ధర్మవిరుద్ధమైనపని చేసినందునకై దమయంతిని దూషించినాఁడనియు, ప్రతిపక్షులు చెప్పిరి. దమయంతీ పునస్స్వయం వరమును నేను జెప్పుట పూర్వకాలమునందు స్త్రీపునర్వివాహ మాచ రింపఁబడి యాచారమున్నదని కనబఱచుటకే కాని దమయంతి ద్వితీయ వరుని బెండ్లియాడె ననియు, దురుద్దేశముతోనే యీ సమాచా

రము పంపెననియుఁ జూపుటకుఁగాదు. ఆకాలమున స్త్రీలకు రెండవ వివాహము చేసెడి యాచారమే లేనిపక్షమున, రాజర్షియైన ఋతుపర్ణుఁ డయోధ్యనుండి యామెను జేపట్టవలెనని వచ్చుటయే సంభవింపక పోయి యుండును; పతివ్రతాతిలకమయిన దమయంతియు నామెతండ్రియు నధర్మమైన పనికై రమ్మని వర్తమానమును బంపకయు నుందురు. అందఱును పునస్స్వయంవరమునకు రాకపోవుటకుం గలకారణము వారు పిలువఁబడకపోవుటయేకాని దోషమను తలంపు కాదు. దమయంతి సుదేవునిఁ బంపునప్పు డాతనితో,-

అస్తాస్యతి పునర్భైమీ దమయంతీ స్వయంవరమ్
తత్ర గచ్ఛంతి రాజానో రాజపుత్రా శ్చ సర్వశః.

"దమయంతి ద్వితీయస్వయంవరంబు రచియింపఁబోయిన నందులకు భూవలయంబునంగల రాజులెల్లను బోయెద" రని ఋతుపర్ణునకుం జెప్పుమనియే పలికెను నలుఁడావార్తను విన్నప్పుడును,-

మమ శోకేన సంవిగ్నా నైరాశ్యా త్తనుమధ్యమా
నైవం సా కర్హిచి త్కుర్యా త్సాపత్యా చ విశేషతః.

"సాధ్వి నాకుఁ గూర్చి సంతతి కలయది చెలువ యిట్లు లేల చేయు" నని దమయంతి ద్వితీయవివాహమును జేసికొనకపోవుటకుఁ దన యెడలఁ గల ప్రేమయును సంతతి కలిగియుండుటయునే కారణములుగా నెంచుకొన్నాఁడు గాని యాకార్య మధర్మమయినదని యించుకయు నెంచుకోలేదు. అతఁడు దమయంతిని జూచి కోపముతోఁ బలుకునప్పుడును,-

కథం ను నారీ భర్తార మనురక్త మనువ్రతమ్
ఉత్సృజ్య వరయే దన్యం యథా త్వం భీరు కర్హిచిత్.
దూతా శ్చరంతి పృథివీం కృత్స్నాం నృపతిశాసనాత్

భైమీ కిల స్మ భర్తారం ద్వితీయం వరయిష్యతి
స్వైరవృత్తా యథాకామ మనురూప మివాత్మనః.

అనురక్తుఁడును ననువ్రతుఁడును నైన భర్తను వదలి యన్యుని వరియించుట తగునా యనియు, రాజాజ్ఞవలన దూతలు దమయంతి రెండవ పెండ్లి యాడునని చెప్పుటకయి తిరుగుచున్నారనియు, స్వైరిణివిధమున నిట్లుచేయుట యర్హమా? యనియు నిష్ఠురోక్తులాడెనే కాని శాస్త్రవిరుద్ధమయిన పనిని జేయుచున్నావని దోషారోపణము చేయగలిగినవాఁడు కాఁడు. దీనినిబట్టి పూర్వము స్త్రీలు పునర్వివాహమును జేసికొనెడి యాచారమున్నట్లు తేటపడుచునే యున్నది.

ఇఁక దాయవిషయమయి యెక్కడనైనను విధులున్నవా యని కొందఱు శంకింతురు. స్త్రీకి ద్వితీయభర్తవలనఁ గలిగిన పుత్రులు పూర్వయుగమునందు పౌనర్భవులని పేర్కొనఁబడి, అట్టివారికి వచ్చు దాయముయొక్క వివరణము మను యాజ్ఞవల్క్య స్మృతులయందుఁ గనఁబడుచున్నను, ఆ విధులీయుగమున కొంతమాత్రమును చెల్లుబడి కావు; పరాశరులవారు స్త్రీకి ద్వితీయభర్తవలనఁ బుట్టిన సుతులను గూడ నౌరసులనుగానే చెప్పినందున, ఈ యుగమున వారికిఁ బ్రథమ వివాహమునందుఁ బుట్టిన వారివలెనే దాయము వచ్చును. దొరతనము వారు విధవాపునర్వివాహశాసనమును జేసి దానియందు స్త్రీల యొక్క దాయనిర్ణయమును జేసియున్నందున, అందునకు విరుద్ధముగా మన ధర్మశాస్త్రమునం దేమున్నను చెల్లనే చెల్లదు. ఆ శాసనము యొక్క రెండవ ప్రకరణమునందు "భరణరూపమునఁగాని" భర్తకైనను అతని వంశజులకైనను వచ్చు దాయరూపమునఁగాని, పునర్వివాహము చేసికొనుటకు స్పష్టముగా ననుజ్ఞ యియ్యక దానవిక్రయముల కధికారము లేకుండ జీవితకాలమునం దనుభవించుటకు మా

త్రమే మరణశాసనమువలనఁ జెందఁజేసెడునట్టి గాని, మృతుఁడయిన భర్తయొక్క సొత్తునందలి స్వత్వమును సంబంధమును పునర్వివాహమయినతోడనే యామెను విడిచిపోయి, యామె మృతినొందినప్పుడేలాగుననో యదేప్రకారముగా నామె పూర్వభర్తయొక్క బాధ్యులకుగాని యామె మరణానంతరము సొత్తునకుఁ గర్తలు కాఁదగినవారికిఁగాని చెందు" నని విధింపఁబడియున్నది. దీనినిబట్టి చూడగాఁ బునర్వివాహమాడు స్త్రీయొక్క నగలు మొదలయిన స్త్రీధనమును చరరూపకమయిన సొత్తును తప్ప తక్కిన స్థిరరూపకమయిన పూర్వభర్తయొక్క వసతి మొదలగునవి యన్నియు నాతని జ్ఞాతులకే చేరునని విదితమగుచున్నది.

అస్మద్దేశీయులగు దయార్ద్రహృదయులారా! సమస్తసద్గుణహారావళికిని దయయే నాయకమణియని మీరందఱు నెఱిఁగియే యున్నారుగదా? ఈశ్వరునియొక్క సమస్తకళ్యాణగుణములకును దయయే శిరోభూషణమై సృష్టియం దెల్లెడలను బ్రకాశించుచున్నది. లోకములోని సమస్తజీవరాసులును తమ యల్పాయుష్కాలములో నపారసుఖమును బొందుచుండుటకు భగవంతునికి వానియెడల గల నిర్హేతుకజాయమానకటాక్షము తప్ప వేఱుకారణ మేదియున్నదని మన మూహింపఁగలము? ఒకరి యాపదను జూచినపుడు దయార్ద్రహృదయుఁడై యాపన్నివారణమునకుఁ దగిన నుపాయమును జింతించువాఁ డెవఁడో వాఁడొక్కఁడే నిక్కమైన మానవుఁడు గాని, తక్కిన దయాశూన్యు లందఱును మనుష్యరూపముననున్న ఘాతుకమృగములే యగుదురు. ఎట్టి ఘాతుకమృగమయినను తన యాహారమునిమిత్తము ఇతరజాతిజంతువులను హింసించును గాని స్వజాతిమృగములను హింసింపదు. తెలివిలేని మృగములయందు సహిత మిట్టి మేర యొకటి గన

బడుచుండఁగా జ్ఞానసంపదచే నత్యధికులయిన మనుష్యులయందు తమకు లేశమయినను మేలు లేకపోయినను వెనుకటివారు బాధ వెట్టుచువచ్చిరను హేతువునుబట్టి యనాథలైన యబలల హింసవెట్టు గుణముండుట ధర్మ మగునా ? మనము ప్రతిదినమును గరుణఁ జూపు మని సర్వకారుణ్యుఁడయిన యీశ్వరునిఁ బ్రార్థించుచు, మనము మాత్ర మట్టి కరుణనేల దిక్కుమాలిన యనాథలయందుఁ జూపరాదు ? శాస్త్రమో నమస్తవిధముల స్త్రీపునర్వివాహమును విధించుచున్నది. ఐనను శాస్త్రమునకు కల్పితార్థములను గల్పించి యనాథలయిన స్త్రీలను సాధింపఁ గంకణము గట్టుకొన్న పండితమండలాగ్రగణ్యులును అందందు పలువు రుందురు. నిద్రపోయెడివానిని లేపవచ్చునుగాని మేలుకొన్నవానిని లేపుట శక్యము కాదు; కాఁబట్టి యట్టి పండితసత్తములను బోధించుటకు బ్రహ్మయైనను శక్తుఁడు కానేరఁడు. ఎద్దు పుండు కాకికి ముద్దు కానట్టు అనాథస్త్రీల కష్టములును వారిమనసులను గరఁగింపఁ జాలవు. ఆరంభదశయం దెంత మంచికార్యమును గాని కొందఱు దూషించుచునే యుందురు. పామరుల దూషణమును పాటిగాఁ బట్టక సాహసించి, బాల్యముననే భర్తలను పోఁగొట్టుకొన్న వారి జనకులును లోకోపకారచింత గలవారును కార్యమునకుం బూనిన చో నిప్పుడు దూషించువారే పిదప భూషించెడికాలము వచ్చును గాని రాకపోదు. శాస్త్రనిషిద్ధకార్య మని భ్రమపడి వివాహమును జేయుట మానుకొని, అందువలనఁ గలిగెడి ప్రత్యక్ష ఘోరపాతకము లైన గర్భపాతములను శిశుహత్యలను జూచియూరకుండుట ఇహపర సుఖదాయక మగునా? కన్నబిడ్డలకు శాస్త్రీయముగా వివాహములు చేయక స్వయంకృతాపరాధమువలన వారు చెడుతెరువులం బ్రవర్తింప సన్మార్గమునం బ్రవర్తించుమార్గమును జూపక మీదుమిక్కిలి విటులను

జంపింపఁ జూచుట మనుష్యకృత్యమగునా? సద్వంశమున జనించిన కన్యలు ద్వితీయవివాహము లేకపోవుటచే నిల్లు విడిచి లేచిపోయి బహిరంగముగా వ్యభిచరించుచు జాతిభ్రష్ట లగుచుండఁ జూచుచు నూరకుండుట మనకు గౌరవావహ మగునా? రాజదండనమునకు వెఱచి కన్నబిడ్డలను జంపక చండాలురు మొదలగువారి కియ్యఁగా. ఉత్తమజాతులయందుఁ బుట్టిన యట్టిబాలురు చండాలురై చెప్పరాని పనులను జేయుచుండఁగా జూచుట మనకు లాఘవము కాదా? ఇట్టి గణనాతీతము లయిన దుష్కృత్యముల కొడిగట్టుటకంటె సను సర్వదోష నివారకమును శాస్త్రీయము నైన వివాహమునే చేయరాదా? ఓ జనులారా! భగవంతుఁడు మనకు జ్ఞానమును దయచేసియున్నందున దానిని సార్థక పఱిచి, లోకముయొక్క మేలును జింతించి ప్రస్తుతమున రజస్వల కాకమునుపు భర్తలను పోఁగొట్టుకొన్న స్త్రీలకైనను పునర్వివాహమున కనుజ్ఞనియ్య మిక్కిలి ప్రార్థించుచున్నాను. మీకట్టి సద్బుద్ధి నుదయింపఁజేయుటకయి కరుణానిధియైన పరమేశ్వరుని త్రికరణశుద్ధిగాఁ బ్రార్థించి, ఇప్పటి కీవిషయము నింతటిలో విరమించుచున్నాను.



# స్త్రీపునర్వివాహ శాస్త్రసంగ్రహము



By

**K. VEERESA LINGAM**

# స్త్రీపునర్వివాహ శాస్త్రసంగ్రహము

## ఉపోద్ఘాతము.

సువివేకులారా !

ఇప్పు డిక్కడ స్త్రీపునర్వివాహవిషయకమయిన చర్చ విశేషముగా జరుగుచున్నందున సత్యమును తెలిసికొనుటయం దిష్టముగల వారి యుపయోగమునిమిత్తమయి యీ విషయమునఁ గల శాస్త్రసంబంధమయిన సాధక బాధకములను పూర్ణముగా తెలుపవలసియేయున్నను, అట్టిపని చేయుట కిప్పు డవకాశము చాలదు గనుక సంగ్రహముగా నేనీ యుపన్యాసమును జేయుచున్నాను. మనదేశములో స్త్రీపునర్వివాహ మాచారములో లేకపోవుటవలన బాలవితంతువులలో సాధారణముగా నడుచుచున్న హేయమయిన వ్యభిచారమును, కామోద్రేకముచేత జాతిగుణవివేచనము లేక వితంతువులు పరపురుషులతోఁ జేయు జారత్వమును, మానవంతులగు బంధువుల కంటఁ బడ్డప్పుడు కోపావేశముచేత ననివార్యముగా సంభవించు నరహత్యలు మొదలగు ఘోరకృత్యములును, వ్యభిచారమును మరగిన వితంతువులు ఉపపతుల నిమిత్తమునఁ జేయు దుర్వ్యయములును, అట్టి యనాథయువతులు తమకు తోడుగా నుండుటకయి మగఁడుగల భార్యలనుగూడ వ్యభిచారమునకు దింపఁగా వారిభర్తలు మొదలయిన వారికిఁ గలిగెడి యవమానమనఃఖేదములును, ఇంటఁగల నిర్బంధములకు తాళఁజాలక కామప్రేరణచేత వీధికెక్కి నీచులగు విటపురుషులతోడ బాలవితంతువులు లేచిపోయినప్పుడు బంధువర్గమునకుఁ గలుగు తలవంపు

లును, వితంతువుల వ్యభిచారమునకు ఫలముగా గర్భము నిలిచి నప్పుడు జరపఁబడు గర్భస్రావములు, భ్రూణహత్యలు, శిశుహత్యలు మొదలగు దారుణకృత్యములును అనేకములు కలవు. అట్టి క్రూరకృత్యములు రాజకీయాధికారులకుఁ దెలిసి వానితో సంబంధించినవారినెల్ల రచ్చ కీడ్చినప్పుడు నిర్దోషులకు సహితము ప్రాప్తములగు శిక్షలును, మానభంగములును, ముసలివాండ్రుసహిత మిరువురను ముప్వురను బాలికలనే వివాహమాడుచుండుటవలనను, బాల్యముననే భర్తలను పోగొట్టుకొన్న చిన్నకన్నియలు సహితము వివాహమున కక్కఱకురాక వ్యర్థురాండ్రగుచుండుటవలనను కన్నియలకు కఱవువచ్చి, ధనపిశాచగ్రస్తులైన జనకులు నరమాంసవిక్రయమునకు వెఱవక వందలకొలఁది రూప్యములను స్వీకరించి తమ ముద్దుకూతులను వృద్ధవిగ్రహములకు వివాహవ్యాజమున బలి పెట్టుచుండుటచే ప్రబలుచుండు కన్యాశుల్కమును, వ్యభిచరించి శిశువులను చంప చేతులాడక కులమువారికి వెఱచి దయార్ద్రహృదయముగల బాలవితంతువులు వారిని విజనప్రదేశమునఁ బాఱవేయఁగా మాలమాదిగలు వారి నెత్తి పెంచి బ్రాహ్మణాద్యుత్తమవంశసంభవులయిన యా బాలకులను పరమ నీచములయిన పనులయందు నియోగించినప్పుడు చూడెడి జననీప్రభృతులకు గలిగెడు మనఃపరితాపమును, వివాహమనఁగా నెట్టిదో యెఱుఁగని యజ్ఞానదశయందే పతులు పరలోకగతులుకాఁగా శోకసముద్రమున మునిఁగి పెద్దపెట్టున నేడ్చుచుండు జననీజనకులచెంతకుఁ బోయి పసిబాలికలు దుఃఖకారణమును దెలిసికోలేక యెఱుఁగని ప్రశ్నలు వేయునప్పుడు తల్లిదండ్రులకు మాత్రమేకాక కన్నవారికిని విన్నవారికినిఁగూడ గలిగెడి గుండెలవిసెడి సంతాపమును, చెడునడతలు ప్రవేశింప సాధ్వులు సహితము త్రోడి పడఁతులు కని పెంచుచున్నప్పుడును, సరివారి ముద్దు

లను ముచ్చటలను ననుభవించు చున్నప్పుడును, వృద్ధులగు తల్లిదండ్రులు కూడ గదులలో పట్టెమంచములమీఁద రాత్రులు సుఖముగా శయనించుచుండఁగా తా మొంటిగా గుమ్మములవద్దను పంచను జేరి, కటికినేలను బరుండి, వా రనుభవించు సుఖమును తమ దురవస్థను తలంచుకొను నప్పుడును పొందు వ్యాకులభావమును, తమ కడుపునఁ బుట్టిన బాలికలు పసితనములోనే విధవలయి తిన్నని బట్టయు కడుపునిండ రెండుపూటలు తిన్నంత యన్నము నైన నెఱుఁగక తలలు గొరిగించుకొని విహాపురాంద్రయి యింటిపని యంతయుఁ జేయుచుండియు నెల్లవారిచే రోతమాటలు పడుచు నెడతెగని దుఃఖము ననుభవించుచుండఁగా చూడలేక శోకించు తల్లిదండ్రుల మనోవేదనయు, ఇటువంటివే యనంతము లయిన యితర దుఃఖ విషయములును, ప్రతిదినమును ప్రత్యక్షమునఁ గనఁబడినప్పుడు దయ యెట్టిదో యెఱుఁగని కిరాతునివంటి వానికి సహితము మనసు కరఁగి యీ దురాచారమును మాన్పింపవలె నని పలుమాఱు మనసులో నూహ పుట్టియు దుర్లంఘ్యము లయిన శ్రుతిస్మృతులేమో యీ విషయమున క్రౌర్యమును వహించుచున్న వని యాచారపిశాచ ప్రేరణమున నొక భ్రమ పొంది, నిరాశను జెంది యూరకుండవలసిన గతి సంభవింపక మానదు. కాఁబట్టి తాము చేసెడి యెల్లపనులను శాస్త్రానుగుణ్యముగానే నడపవలయు నను నియమము గల హిందువులను పూర్వాచారమునుండి మరలించుట కయి శాస్త్రప్రమాణములు మాత్రమే కావలసి యుండును గాని యుక్తులును, లోకనిదర్శనములును నావశ్యకములు కావు. ఇట్టి విషయముల యం దొక సిద్ధాంతము నేర్పఱుచుకొనుటకు ప్రమాణములు కొందఱు శ్రుతి స్మృతి పురాణము లనియు కొందఱు శ్రుతి స్మృతి శిష్టాచారము లనియు నిర్ణయించి యున్నారు.

శ్లో. య దదృష్టం హి వేదేషు త ద్ద్రష్టవ్యం స్మృతౌ కిల
ఉభాభ్యాం య దదృష్టస్తు త త్పురాణేషు పఠ్యతే.

వేదములయం దేది కనఁబడదో యది స్మృతులయందుఁ జూడఁ బడఁ దగిన దనియు, ఆ రెంటియందును కనఁబడనిది పురాణముల యందుఁ జెప్పఁబడు ననియు, ఆపస్తంబస్మృతి యందును,—

శ్లో. ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః
ద్వితీయం ధర్మశాస్త్రం తు తృతీయో లోకసంగ్రహః.

ధర్మజిజ్ఞాసముఁ జేయు వారికి మొదటి ప్రమాణము శ్రుతి యనియు, రెండవ ప్రమాణము స్మృతి యనియు, మూఁడవ ప్రమాణము లోకాచార మనియు భారతానుశాసనిక పర్వమునందును జెప్పఁబడి యున్నది. పురాణాచారముల విషయ మయి భిన్నాభిప్రాయము కలిగి యున్నను, శ్రుతిస్మృతులు పరమప్రమాణము లనుటమాత్రము నిర్వివాదాంశము.

శ్లో. శ్రుతిస్మృతిపురాణేషు విరుద్ధేషు పరస్పరం
పూర్వం పూర్వం బలీయం స్యా దితి న్యాయవిదో విదుః.

శ్రుతిస్మృతి పురాణములలో పరస్పరవిరోధము సంభవించి నప్పుడు పురాణమునకంటె స్మృతియు, స్మృతికంటె శ్రుతియు బలీయములని యాపస్తంబుఁడు చెప్పి యున్నాఁడు. శ్రుతులలోఁ గాని, స్మృతులలోఁ గాని విరోధవచనములు కనఁబడినప్పు డవి యన్నియు సమన్వయించున ట్లర్థము చేయవలయుననియు, అవి యేవిధముచేతను సమన్వయించనప్పుడు ధర్మము వికల్పముగాఁ జెల్లు ననియు, వేదార్థమును వ్యాకరణాది షడంగముల ననుసరించియే చేయవలయు ననియు, స్మృతులలో చతుర్యుగసాధారణ స్మృతులకంటె నా యా యుగస్మృతు

లాయా యుగములయందు బలవత్తరము లనియు, పదముల కర్థమును జేయునప్పుడు విశేషబాధకము వచ్చినప్పుడు తప్ప యౌగికార్థమును గ్రహింపఁ గూడదనియు, నిఘంటువులయందుఁ గనుపట్టు రూఢార్థమునే గ్రహింపవలయుననియు, శాస్త్రములయందలి పారిభాషికములయిన పదములను పారిభాషికములయిన యర్థములయందే గ్రహింపవలె ననియు, విశేషవిధులున్న స్థలములయందు సామాన్యవిధులు ప్రవర్తింపవనియు, వ్యాఖ్యానము లెప్పుడును స్వతంత్రప్రమాణములు కావనియు, మన పూర్వులు నియమములు చేసియున్నారు. ఈ నియమములతోనే వరుసగా స్త్రీపునర్వివాహమునకు సాధకబాధకములుగా నుండు శ్రుతిస్మృతిపురాణవచనముల నుదహరించుచు, వానియర్థ నిర్ణయమును జేయుటకుఁ బ్రయత్నించెదను.

## శ్రుతి ప్రమాణములు.

మొట్టమొదట శ్రుతి ప్రమాణములను గూర్చి విచారింతము. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వవేదము అని శ్రుతి నాలుగుభాగములు గలది.

౧. ఉదీర్ష్వ నా ర్యభి జీవలోకం గతాసు మేత ముపశేష ఏహి
హ స్తగ్రాభస్య దిధిషో స్త్వ మేతత్పత్యు ర్జనిత్వ మభిసంబభూవ.

ఓ నారీ! చచ్చియున్న యీ పెనిమిటియొద్ద పడియున్నావు; బ్రతికియున్నవారిని జూచి లేచిరా; పాణిగ్రాహకుఁడును వితంతువును వివాహమాడ నిచ్ఛగలవాఁడుచు నగుభర్తకు భార్యవు కమ్ము. అని యీ శ్రుత్యర్థము.

ఈ శ్రుతి యజుర్వేద తైత్తిరీయారణ్యకములోని యాఱవ ప్రపాఠకమునందలి ... [illegible]

యిన యాహితాగ్ని బ్రాహ్మణుని భార్యను గూర్చి చెప్పఁబడిన వాక్యము. 'ఇయం నారీ' యను మంత్రప్రకారముగా మృతభర్తృక పెనిమిటి శవమునొద్ద పడియుండఁగా బంధువు లీ మంత్రమును జెప్పి యామెను లేవఁదీసికొని వత్తురు. సంతానమున్నను, లేకపోయినను, ఆహితాగ్ని బ్రాహ్మణుని భార్యవంటిదానికే వేదము పునర్వివాహమును విధించుచున్నప్పుడు బాల వితంతువులకు వివాహము విధించు ననుట నిరాక్షేపము కాదా ? పితృమేధమునందలి యీ మంత్రమును సహగమనము చేయని స్త్రీలయొద్దనే చదివి లేవఁదీయవలెనని విధులు గలవు. కల్ప సూత్రములలో నొకటగు భారద్వాజ సూత్రము "తాం ప్రతీత్థ ఏకధనే నోత్థాపయ త్యన్యో వా బ్రాహ్మణ ఉదీర్ష్వ నారీతి" యని మృతభర్తృకను మఱఁదిగాని మఱియొక బ్రాహ్మణుఁడుగాని లేవఁదీయవలయు నని విధించుచున్నది. "తాం ప్రతిగతః సవ్యే పాణా వభిపాద్యోత్థాపయతి" యని విద్యారణ్యులవారు భాష్యమునం దుదాహరించిన కల్పసూత్రము కుడిచేతితో పట్టుకొని లేవ నెత్తవలయు నని యొకవిశేషమును గూడ జెప్పుచున్నది.

ఈ శ్రుతియొక్క యర్థము స్త్రీ పునర్వివాహపక్షమున స్పష్టముగానే యున్నను, ఈ విషయమును మఱింత బలపఱుచుట కయి దీని పూర్వశ్రుతిని గూడ నిందుదాహరించుచున్నాను.

౨. ఇయం నారీ పతిలోకం వృణానా నిపద్యత ఉప త్వా మర్త్య ప్రేతం విశ్వం పురాణ మనుపాలయంతీ తస్యై ప్రజాం ద్రవిణం చేహ దేహి. యజుర్వేదము.

ఓ మృతుఁడా ! నీభార్య నీలోకమును గోరుచు ప్రేతవగు నీయొద్ద పడియున్నది; ప్రాచీన మగు పాతివ్రత్యధర్మము ననుసరించి వర్తించుచునున్నది: ఈలోకమున నీమెకొఱకు సంతానమును ధనమును కలుగు

నట్లు చేయుము—అని పై శ్రుతి కర్థము. "అత్ర పత్నీ ముపనిపాతయ తీ యం నారీతి" యను కల్పసూత్రమునుబట్టి భార్యను చచ్చిన భర్త సమీపమున పరుండబెట్టి, బంధువులు ప్రేతము నుద్దేశించి యీమంత్ర మును పఠింతురు. బంధువులు ప్రేతపత్నికొఱకు (పునర్వివాహమువలన) సంతానాదికము కలుగున ట్లనుగ్రహింపవలయునని ప్రేతమును గోరు టయు పునర్వివాహము చేసికొనఁగోరువానికి భార్యవుకమ్మని ప్రేతపత్నిని గోరుటయు చూడఁగా స్త్రీపునర్వివాహము వేదవిహిత మనుట కరతలామలక మగుచున్నది. సూత్రకారు లందఱును ఐకకంఠ్యముతో పూర్వోక్తమంత్రద్వయమును పఠింపవలసినవారు మఱది మొదలగు బంధువులే యని విధించుటవలన, కర్మచేయవలసిన పుత్రులను వదలి పెట్టి తదితరులను నియమించుటచూడ పుత్రసంతానము లేనివారి విష యముననే యీ రెండుమంత్రములు వినియోగపడవలసిన ట్లూహింప దగియున్నది. అందుచేతనే పితృమేధానుక్రమణికయందు "ఏతన్మంత్ర ద్వయం సపుత్రకాయా నాస్తి" యను వాక్యము కనబడుచున్నది. దీనినిబట్టి విచారింపఁగా వేదము సంతానవతులుగూడ పునర్వివా హము చేసుకోవచ్చునని చెప్పుచున్నను, సూత్రకారులు మాత్రము సంతానములేని కాంతలకుమాత్రమే పునర్వివాహానుజ్ఞ నియ్య నుద్దే శించిన ట్లూహించఁదగియున్నది.

3\. యా పూర్వం పతిం విత్వాథాఽన్యం విందతే పతిం
పంచౌదనం చ తావజం దదాతో న వియోషతః. ౨౭
సమానలోకో భవతి పునర్భువా పరఃపతిః
యోఽజం పంచౌదనం దక్షిణా జ్యోతిషం దదాతి. ౨౮
అనుపూర్వవత్సాం ధేను మనడ్వాహ ముపబర్హిణం
వాసో హిరణ్యం దత్వా తే యాంతి దివ ముత్తమమ్. ౨౯
అధర్వసంహిత, ౯ కాండ, ౫ ప్రపాఠకము.

ఒకస్త్రీ మొదట నొకనిని వివాహమాడి మరల మఱియొకనిని వివాహము చేసుకొన్నయెడల, అజాపంచౌదనముచేసిన యా దంపతు లెడఁబాయకుందురనియు; దక్షిణాపూర్వకముగా నజాపంచౌదనవ్రత మును జేసినయెడల పునర్భువు రెండవభర్తలోకమును పొందు ననియు, సవత్సకగోదానాదులనుజేసి వారు త్తమలోకమును పొందుదురనియు, పై శ్రుతి తాత్పర్యము. స్త్రీపునర్వివాహము నింతకన్న స్పష్టముగాఁ జెప్ప శ్రుతికి యుండ నేరదు. పూర్వకాలమునందు బ్రాహ్మణులు బ్రాహ్మణేతరజాతులలోని స్త్రీలను మాత్రమేకాక, బ్రాహ్మణేతర జాతుల విధవలనుగూడి వివాహమాడుచు వచ్చిన ట్లీక్రింది యథర్వవేద వచనము చూపుచున్నది.

౪. ఉత యత్పతయో దశ స్త్రియాః పూర్వే అబ్రాహ్మణా
బ్రహ్మ చేత్ హ స్త మగ్రహీత్ స ఏవ పతి రేకథా
బ్రాహ్మణ ఏవ పతి ర్న రాజన్యో న వైశ్యః తత్సూర్య
ప్రబ్రువ న్నేతి పంచభ్యో మానవేభ్యః.

అధర్వసంహిత.

ఒకస్త్రీకి మొదట బ్రాహ్మణులు కానివారు పదిమంది భర్త లయి యామెను బ్రాహ్మణుఁడు పెండ్లి చేసికొన్న పక్షమున, అతఁడే యామెకు పతికాని, రాజన్యుఁడును వైశ్యుఁడును కాఁడనియు, ఈ యర్థమునే యైదుజాతుల మానవులకును సూర్యుఁడు చాటుచు తిరుగు చున్నాఁడనియు ఈశ్రుతి బోధించుచున్నది.

౫. తస్మా దేకస్య బహ్వ్యో జాయా భవ న్తి
నై కస్యై బహవ స్సహ పతయః
ఋగ్వేదము, ఐతరేయబ్రాహ్మణము, 3 పంచిక, ౨౨ ఖండ.

"ఆ కారణమువలన నొకపురుషునకు బహుభార్య లగుదురు; ఒకస్త్రీకి 'ఏకకాలమునందు' బహుభర్తలు కారు" అని యీ శ్రుతి కర్థము. పురుషవిషయమున కాలభేదమును దెలుపు పదమును బ్రయోగింపక, స్త్రీవిషయమున నేకకాలమునందని తెలియఁజేయు "సహ" శబ్దమును బ్రయోగించుటచేతనే స్త్రీలకు భిన్నకాలములయందు వేఱు వేఱు భర్త లుండవచ్చునన్నమాట స్పష్టమగుచున్నది. భారత వ్యాఖ్యానమునందు నీలకంఠాచార్యులవారీశ్రుతికి "సహేతి యుగపద్బహుపతిత్వ నిషేధో నతు సమయభేదేన" యని 'సహ' యనుటవలన నేకకాలమునందు బహుపతిత్వనిషేధమేకాని కాలభేదమునందుఁ గాదని యర్థము వ్రాసియున్నారు.

౬. సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః
తృతీయో అగ్నిష్టే పతి స్తురీయ స్తే 'మనుష్యజాః.'

ఋగ్వేదము, ౧౦ మండలము, ౨ అధ్యాయము, ౮౫ సూక్తము

'నీకు సోముఁడు మొదటి భర్త; రెండవభర్త గంధర్వుఁడు; మూఁడవభర్త అగ్ని; నాలవభర్త నీకు మనుష్యునివలనఁ బుట్టినవాడు' అని యీశ్రుతి తాత్పర్యము. ఇది వివాహమంత్రములయందు వచ్చును. నీకు (స్త్రీకి) నాలవభర్త మనుష్యునివలనఁ బుట్టినవారు "మనుష్యజాః" అని బహువచనమును బ్రయోగించుటచేత స్త్రీలకు భిన్నకాలములయందు బహుభర్త లుందురని యీ శ్రుతి సూచించుచున్నది. "తురీయః" అను విశేషణ మేకవచనమునం దుండుటచేత నొక్కకాలమునం దొక్క భర్తమాత్రమే యుండవలయుననియు "మనుష్యజాః" అని విశేష్యము బహువచనమునం దుండుటచేత నొక పతి యనంతరము మఱియొక పతి చొప్పున బహుభర్త లుందురని పారస్యము కనుపట్టుచున్నది.

౭. కుహస్విద్దోషా కుహవస్తోరశ్వినా కుహాభిపిత్వం
కరతః కుహోషతుః కోవాంశయుత్రా 'విధవేవ దేవరం'
మర్యన్న యోషా కృణుతే సదస్థ ఆ.

ఋగ్వేదము, ౮ అష్టకము.

ఈ ఋగ్వేదవచనమునందు "విధవ పాన్పునందు దేవరుని కౌఆకు కనిపెట్టుకొని యున్నట్లు" అని యొక యుపమానము కనఁబడుచున్నది. వేదమునం దెక్కడను నియోగము విధింపఁబడి యుండలేదనియు, స్త్రీ మఱఁదిని వివాహమాడెడి యాచారము కనఁబడుచున్నదనియు, ఎల్లవారును నెఱిఁగి యుండవచ్చును. అందుచేతనే యీ దేవరశబ్దము నకు నిరుక్తమునందు 'ద్వితీయవరుఁడు' అని యర్థము వ్రాయఁబడి యున్నది.

నిరుక్తము—క్వస్విద్రాత్రౌ భవథః క్వ వా హ్యాభిప్రాప్తిం
కురుథః క్వ వసథః । కోవాం శయనే విధవేవ దేవరం
దేవరః కస్మా ద్ద్వితీయో వర ఉచ్యతే॥

ఈ శ్రుతికూడ పూర్వకాలమునందు విధవలు ద్వితీయభర్తలతో సుఖ మనుభవించుచుండుట సర్వసాధారణముగా నుండెనని చూపుట కనుకూలపడుచున్నది.

౮. అంతేకాక వేదమునం దనేకస్థలములలో దిధిషువు పేరుదాహరింపఁబడి యున్నది. "పునర్భూ ర్దిధిషూ రూఢా ద్విస్తస్యా దిధిషుః పతిః" అను నమరకోశమువలన వివాహితయొక్క ద్వితీయభర్త దిధిషువని యెల్లవారు నెఱిఁగియుందురు. తైత్తిరీయబ్రాహ్మణమున 3 కాండ, ౪ ప్రపాఠకము, ౧ అనువాకమునందు, అశాధియను దేవతకు దిధిషువును బలిపెట్టవలసినట్టు చెప్పఁబడి యున్నది. ఆ యనువాకమునందే వేఱువేఱు దేవతలకు వరుసగా పిల్లలను, స్త్రీలను, వృద్ధులను,

వేదము చదివిన బ్రాహ్మణులను బలిపెట్టవలసినట్టుకూడఁ జెప్పఁబడి యున్నది. ఇప్పుడు చెప్పినదానివల్లను, నరమేధయాగ ముండుటవల్లను, పూర్వకాలమునందు నరబలు లుండెననుట స్పష్టము. వేదమునందు దిధిషుశబ్దము పలుచోట్ల కనఁబడుచుండుటవలన, ఆ కాలమునందు పురుషులకువలెనే స్త్రీలకును పునర్వివాహములు సాధారణముగా నున్నట్టు తెలియవచ్చుచున్నది.

౯. ఋగ్వేద, ౮ అష్టకము, ౧౦ మండలము, ౧౦౯ సూక్తమునందు ఒక బ్రాహ్మణుని భార్యయగు 'జుహు' అనెడి స్త్రీ బృహస్పతికి మరల వివాహము చేయఁబడినట్టు చెప్పఁబడి యున్నది. దీనివలన వేదమునందు స్త్రీపునర్వివాహమును విధించునట్టియు సూచించునట్టియు వచనములు మాత్రమే కాక సరిగా స్త్రీ పునర్వివాహము జరిగిన నిదర్శనముకూడ స్పష్టముగాఁ గానవచ్చు చున్నది.

స్త్రీ పునర్వివాహము వేదచోదితమని చూపుట కిట్టివి సాధకములు గనుపట్టుచున్నప్పుడు ప్రతిపక్షులు వేదమునుండి యొక్క బాధక వచనమునైనఁ గనఁబఱుపఁ గలుగుదురా? వారు తీసికొనివచ్చెడి దంతయు,—

> యదేకస్మిన్ యూపే ద్వే రశనే పరివ్యయతి తస్మాదేకో
> ద్వేజాయే విందతే । యన్నైకాగ్ం రశనాం ద్వయో
> ర్యూపయోః పరివ్యయతి తస్మాన్నైకా ద్వౌ పతీ విందతే.

కృష్ణ యజుర్వేదము, ౭ కాండము, ౭ ప్రపాఠకము, ౪ అనువాకము.

ఒక యూపమునకు రెండుత్రాళ్ళను గట్టునట్లే యొకని కిద్దఱు భార్య లుండురు; ఒక త్రాడును రెండుయూపములకు కట్టకూడనట్లే ఒకస్త్రీ కిద్దఱు భర్త లుండరను నర్థమిచ్చెడి యీ యొక్క స్మృతియు తప్ప వేఱేదియుఁ గానరాదు. ఈ శ్రుతి యేకకాలమునందే స్త్రీలకు

బహుపతులను నిషేధించుచున్న దనుట కొంచె మాలోచించువారి కందఱికిని దెలియును. దీనికి వినియోజక వాక్యమైన "అగ్నిష్ఠం ద్వాభ్యాగ్ం రశనాభ్యాం పరివీయ" యను కల్పసూత్రము ఏకకాలము నందే యూపమునకు రశనాద్వయబంధమును విధించుచు నయి నిర్బంధ మేకకాలమునందు మాత్రమే యని స్పష్టపఱుచుచున్నది. దృష్టాంత మునుబట్టి చూచినను, ఒక్కత్రాటిని రెండు స్తంభముల కేకకాలము నందు కట్టుట యశక్యముగాని యొక స్తంభమున నున్నదానిని విప్పి మఱియొక స్తంభమునకుఁ గట్టుట యసాధ్యము కాదు. కాఁబట్టి కాలాంతరములయందు స్త్రీలకు భిన్నపతులుండుట కే యాక్షేపణ మును గనఁబడదు. పూర్వోక్తములయిన శ్రుతివచనములతో సమన్వ యించునట్లు అర్థము చేసెడి పక్షమున దీనికి మఱియొక యర్థమును గల్పించి సాధించుట కెవ్వరికిని శక్యముకాదు. అంతేకాక యీ శ్రుతి యందలి నిషేధము సామాన్యముగా నున్నది; ఉదీర్ష్వనారీత్యాది శ్రుతులు విశేషముగా మృతభర్తృకకు పునర్వివాహమును విధించు చున్నవి. కాఁబట్టి మృతభర్తృకకు తప్ప ద్వితీయభర్త యుండఁగూడ దనియైనను విశేషసామాన్యభావముచేత నీ శ్రుతి కర్థము చేయ వచ్చును. ఇంతవఱకును విచారించిన దానినిబట్టి శ్రుతులలో పరస్పర విరుద్ధములగు వచనములేవియుఁ గనఁబడ లేవు గాని, ఒకవేళ కనఁబడినను, —

శ్లో. ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః
శ్రుతిద్వైధంతు యత్రస్యా త్తత్ర ధర్మా వుభౌ స్మృతౌ.

అను మనువచనమునుబట్టి శ్రుతి రెండువిధములఁ జెప్పిన మొదలన్నీ వికల్పముచేత రెండును ప్రమాణములే యగును గనుక,

అప్పుడు సహిత మిష్టమున్నవారు వివాహము చేసుకోవచ్చుననియే పరమసిద్ధాంత మేర్పడును.

ధర్మనిర్ణాయక గ్రంథములలోనెల్ల నుత్కృష్ట ప్రమాణమయిన శ్రుతి సోమిదేవివల్లికను స్త్రీల కందఱికిని పునర్వివాహము నంగీకరించుచున్నదనియు, అట్టి పునర్వివాహితను విడువఁగూడదనియే కాక యాదంపతులకు పుణ్యలోకము వచ్చుననికూడ తెలుపుచున్నదనియు ఇంతవఱకును వ్రాసినదాని వలన విస్పష్టముగాఁ గనబడుచియున్నాను.

## చతుర్యుగ సామాన్య స్మృతి ప్రమాణములు.

స్మృతి ప్రమాణముల నుదాహరించుటకు ముందు సమస్తస్మృతులును సమానబలము కలవి యగునో కావో, కానియెడల నే స్మృతు లెప్పుడు బలవత్తరములో వివరింపవలసియున్నది.

శ్లో. అన్యే కృత యుగే ధర్మాస్త్రేతాయాం ద్వాపరే పరే
అన్యే కలియుగే నృణాం యుగ హ్రాసానురూపతః.

అను మనువచనమునుబట్టి యుగసామర్థ్య దౌర్బల్యానురూపముగా కృతయుగ ధర్మములు వేఱనియు, త్రేతాయుగ ధర్మములు వేఱనియు, ద్వాపరయుగ ధర్మములు వేఱనియు, కలియుగ ధర్మములు వేఱనియు తెలియవచ్చుచున్నది. ఇఁక నే యుగములో నే ధర్మశాస్త్రము ప్రబలమైనదో నిర్ణయింపవలయును.

శ్లో. కృతేతు మానవా ధర్మా స్త్రేతాయాం గౌతమాః స్మృతాః
ద్వాపరే శాంఖలిఖితాః కలౌ పారాశరాః స్మృతాః.

అను బృహస్పతి పరాశర వచనములవలన కృతయుగమునందు మనుస్మృతియు, త్రేతాయుగమునందు గౌతమస్మృతియు, ద్వాపరయుగమునందు శంఖస్మృతియు లిఖితస్మృతియు, కలియుగమునందు పరా

శరస్మృతియు ముఖ్యములైనవని స్పష్టపడుచున్నది. ఆయా యుగముల యందు క్రమముగా పూర్వోదాహృతములయిన స్మృతులు మాత్రమే ప్రమాణములైనచో యాజ్ఞవల్క్యాది సమస్తేతర స్మృతులును నిష్ప్రయోజనములు కావలసివచ్చునని కొందఱికి సందేహము పుట్ట వచ్చును. ఆ యుగస్మృతియందుఁ జెప్పఁబడని యంశములలో తక్కిన స్మృతులును ప్రమాణములే యగును గనుక, అన్నిటివలనను ప్రయోజనము గలదు. ఈ స్మృతులలో పరస్పరవిరోధము కలిగినప్పుడు ధర్మము వికల్పమని యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యానమునందు విజ్ఞానేశ్వర యోగి నిర్ణయించియున్నాఁడు.

మ ను వు.

౧ శ్లో. నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే.

పతి దేశాంతరగమనముచేత నష్టుఁడైనప్పుడును, మృతుఁడైనప్పుడును, సన్యసించినప్పుడును, నపుంసకుడైనప్పుడును, కులభ్రష్టుడయినప్పుడును, ఈ యైదాపదలయందును స్త్రీలకు మఱియొక భర్త విధింపఁబడుచున్నాఁడు—అని పై శ్లోకార్థము. ఇది యిప్పుడు ముద్రితమైయున్న మనుస్మృతియందుఁ గనఁబడదు కాని మాధవాచార్యుని కాలమువరకు మనుస్మృతిలో నీ వచనమున్నట్టు పరాశరమాధవీయములో వివాహప్రకరణమున మాధవాచార్యులీ వచనము మనుస్మృతిలోనిదని యుదాహరించుటవలన విస్పష్టమగుచున్నది. నారదస్మృతి కూడ పై వచనము మనుస్మృతిలోనిదే యయినట్టు సాక్ష్యమిచ్చుచున్నది.

శ్లో. ప్రోషితో ధర్మకార్యార్థం ప్రతీక్ష్యోష్టౌ నర స్సమాః
విద్యార్థం షడ్యశోర్థం వా కామార్థం త్రీంతు వత్సరాన్.

అను మనుస్మృతిలోని తొమ్మిదవ యధ్యాయమునందలి యీ శ్లోకమునకు ముందు "నష్టే మృతే" యను శ్లోకము పూర్వముండి యున్న ట్టూహింపఁదగియున్నది. భర్త ధర్మకార్యార్థము దేశాంతర గతుఁ డయినపక్షమున నెనిమిది సంవత్సరములును, విద్యార్థమైనయెడల నాఱుసంవత్సరములును, కీర్తి కొఱకుఁగాని కామముకొఱకుఁగాని యయిన యెడల మూఁడుసంవత్సరములును ప్రతీక్షింపవలసినట్టుమాత్రము పయి శ్లోకమువలనఁ గనఁబడుచున్నది గాని తరువాత భార్య యేమి చేయవలెనో యెక్కడను గనఁబడదు. "నష్టే మృతే" యను శ్లోక మిక్కడ నున్న పక్షమున తరువాత మఱియొకనిని వివాహమాడ వలయునన్న మాట స్పష్టము. ఇందలి యెనిమిదిసంవత్సరముల మితియు భర్త నష్టుఁడయినయెడల భార్య పునర్వివాహమునకు వేచియుండ వలసిన కాలమును దెలుపు ముం దుదాహరింపఁబోయెడి నారద వచనముతో నేకీభవించుచున్నది. ఎనిమిది సంవత్సరముల తరువాత భార్య భర్తను వెదకుకొనుచు పోవలయునని కుల్లూకభట్టు వ్యాఖ్యానములో వ్రాసినాఁడుగాని, నష్టుఁడయినవాని నిమిత్తమయి యెనిమిది సంవత్సరములు వేచియుండి తరువాత వెదుకుకొనుచు వెళ్ళవలయునన్న మాట సయుక్తికము కానేరదు. "ఊర్ధ్వం భర్త్రంతర పరిగ్రహే న దోషో స్త్రీత్యభిప్రాయః" అని తరువాత మఱియొక భర్తను గ్రహించుట యందు దోషములేదని వ్రాసిన శ్రీనందన వ్యాఖ్యానమే యెంతయు యుక్తియుక్తమయినది.

౨ శ్లో. సా చేదక్షతయోనిః స్యాద్గతప్రత్యాగతాపి వా
పౌనర్భవేన భర్త్రా సా పునస్సంస్కార మర్హతి.

ఆ స్త్రీ (విధవయైనట్టిగాని భర్తచేత విడువఁబడినట్టిగాని స్త్రీ) వెళ్లి మరల వచ్చిన దయినను అక్షతయోనియైనయెడల పునర్భువును

వివాహమును చేసికొనెడు భర్తచేత మరల వివాహమున కర్హురాలగు చున్నది—అని యీ మనువచనమున కర్థము. "క్షతా సంస్కారా త్ప్రాగేవ పురుష సంబంధ దూషితా" అను మితాక్షరావచనమును బట్టి పునర్వివాహమునకు మునుపే పురుషసంభోగముచేత దూషితురాలయిన స్త్రీ క్షతయనఁబడును; అట్టి పురుషసంభోగమును పొందనిది అక్షతయోని. "వైవాహికో విధిః స్త్రీణాం సంస్కారో వైదికః స్మృతః" అను మనువచనమును బట్టి స్త్రీలకు వివాహము సంస్కార మనఁబడును.

## నారదుఁడు.

3. శ్లో. నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే.

ఈ శ్లోకమును నారదుఁడు మనుస్మృతి నుండియే గ్రహించి యున్నాఁడు. ఇది వాగ్దత్తాపరమని, నియోగపరమని వ్యర్థవాదములు చేయువారిని సమాధానపఱచుటకయి దీని క్రింది శ్లోకములను గూడ సందర్భోచితముగా నిందుదాహరించుచున్నాఁడను. పయిని జెప్పఁబడిన యయిదాపదలలోను నష్టుని విషయమునందును, నపుంసకుని విషయమునందును మాత్రమే కాలనియమము కావలసియుండును.

శ్లో. అష్టౌ వర్షాణ్యుపేక్షేత బ్రాహ్మణీ ప్రోషితం పతిమ్
అప్రసూతా తు చత్వారి పరతోఽన్యం సమాశ్రయేత్
క్షత్రియా షట్సమా స్తిష్ఠే దప్రసూతా సమాత్రయమ్
వైశ్యా ప్రసూతా చత్వారి ద్వే వర్షే త్వితరా వసేత్
న శూద్రాయాః స్మృతః కాల ఏవ ప్రోషితయోషితాం
జీవతి శ్రూయమాణే తు స్యాదేష ద్విగుణోవిధిః.

భర్త నష్టుఁడైనయెడల బ్రాహ్మణస్త్రీ యెనిమిదిసంవత్సరములును, సంతానము లేనియెడల నాలుగుసంవత్సరములును వేచి యుండి మఱియొకనిని సమాశ్రయింపవలెననియు; క్షత్రియస్త్రీ యాఱుసంవత్సరములును, సంతానవంతురాలు కానియెడల మూడు సంవత్సరములును, వైశ్యస్త్రీ సంతానము కలది నాలుగు సంవత్సరములును, సంతానము లేనిది రెండుసంవత్సరములును కనిపెట్టి యుండి తరువాత మఱియొకని నాశ్రయింపవలయు ననియు; శూద్రస్త్రీల కట్టి కాలనియమము లేదనియు; భర్త జీవించినవార్త తెలియవచ్చుచున్న యెడల పైకాలమునకు ద్విగుణకాలము వేచియుండవలెననియు; "నష్టే మృతే" యను శ్లోకముక్రింద నవ్యవధానముగా నున్న యీ శ్లోకములు చెప్పుచున్నవి. సంతాన మున్నవారికి నియోగము లేదు గనుకను, వాగ్దత్తలకు సంతానము గలుగుట యసందర్భము గనుకను, పయివిధి వాగ్దత్తాపరమని కాని, నియోగపరమని కాని చెప్ప వలనుపడదు. మఱియును,—

ర. శ్లో. ఈర్ష్యా దండాదయోఽన్యేచ చత్వార స్సముదాహృతాః
త్యక్తవ్యా స్తే పతితవత్ క్షతయోన్యా అపిస్త్రియా ।
అక్షతమోఘబీజానాం కృతేపి పతి కర్మణి
పతి రన్యః స్మృతో నార్యా వత్సరార్థం ప్రతీక్ష్య తు ।

అను తరువాతి శ్లోకములు, ఈర్ష్యాదండాదు లగు నలుగురు నపుంసకులును క్షతయోనియైనను స్త్రీచేత పతితులవలె విడువఁదగిన వారనియు, అక్షతమోఘబీజుల విషయములో పతికర్మ జరిగినను ఆఱుమాసములు ప్రతీక్షించి స్త్రీ మఱియొక పతిని గైకొనవచ్చు ననియు చెప్పుచున్నవి. వాగ్దత్తలకను పక్షమున వారు క్షతయోను లగుట కాని పతికర్మ జరగుటకాని సంభవింప నేరదు. నియోగ మను

పక్షమున బ్రతికియున్న మగని యనుమతి లేక పతిని పతితునివలె త్యజించి స్త్రీ స్వతంత్రించి మఱియొక పతిని చేకొనుట సంభవింపనేరదు. కాఁబట్టి "నష్టే మృతే" యనుశ్లోకము నారీ పునర్వివాహపర మనక తప్పదు.

౫. ఉద్వాహితాపి యా కన్యా నచే త్సంప్రాప్త మైథునా
పున స్సంస్కార మర్హేత యథా కన్యా తథైవ సా ॥

కన్య వివాహితురా లయినను పురుషసంభోగము పొందని దయిన పక్షమున కన్యక వలెనే పునర్వివాహమున కామె యర్హురా లగును.

శాతాతపుఁడు.

౬. శ్లో. వర శ్చే త్కులశీలాభ్యాం నయుజ్యేత కదా చ న
న మంత్రాః కారణం తత్ర న చ కన్యానృతం భవేత్ ॥
సమాచ్ఛిద్యతు తాం కన్యాం బలా దక్షతయోనికాం
పున ర్గుణవతే దద్యా దితి శాతాతపోఽబ్రవీత్ ॥
హీనస్య కులశీలాభ్యాం హర న్కన్యాం న దోషభాక్
న మంత్రాః కారణం తత్ర నచ కన్యానృతం భవేత్ ॥

వరుఁడు కులశీలములచేత హీనుఁ డయినప్పుడు అక్షతయోని యైన కన్యను బలవంతముగా పుచ్చుకొని మరల గుణవంతుని కీవలయు ననియు, అట్టిచో వివాహమంత్రములు ప్రయోజనకరములు కావనియు, కన్యానృతము సంభవింప దనియు, పై వచనముల తాత్పర్యము.

వసిష్ఠుఁడు

౭ శ్లో. పాణిగ్రాహే మృతే బాలా కేవలం మంత్రసంస్కృతా
సా చే దక్షతయోని స్స్యాత్ పునస్సంస్కార మర్హతి॥

పాణిగ్రహణము చేసినవాఁడు మృతుఁ డయినప్పుడు కేవల మంత్ర సంస్కృతురా లయిన కన్య అక్షతయోని యైనయెడల పునర్వివాహమున కర్హురా లగును.

౮. శ్లో. కులశీల విహీనస్య షండాది పతితస్య చ
అపస్మారీ విధర్మస్య రోగిణాం వేషధారిణాం
దత్తామపి హరేత్కన్యాం సగోత్రోఢాం తథైవ చ॥

భర్త కులశీలములచేత హీనుఁడును, షండుఁడును, పతితుఁడును, వెఱ్ఱివాఁడును, విధర్ముఁడును, రోగియు, వేషధారియు, సగోత్రుఁడును, అయిన యెడల దత్తురాలయినను కన్యను మరల పుచ్చుకోవలెను.

కా త్యా య నుఁ డు.

౯. శ్లో. స తు యద్యన్యజాతీయః పతితః క్లీబ ఏవ చ
వికర్మస్థ స్సగోత్రోవా దాసో దీర్ఘామయోపి వా
ఊఢాపి దేయా సాన్యస్మై సప్రావరణభూషణా.

మగఁడు అన్యజాతీయుఁడును, నపుంసకుఁడును, వికర్మస్థుఁడును, సగోత్రుఁడును, దీర్ఘరోగియును అయినప్పుడు వివాహితురాలయినను స్త్రీ వస్త్రములతోను నగలతోనుకూడ మరల మఱియొకని కియ్యఁదగినది.

ఈరీతి వచనములే ప్రజాపతిస్మృతియందును, బోధాయనస్మృతియందును, మఱికొన్ని చోట్లనుగూడ కానఁబడుచున్నవి. వీనిలో కొన్ని విధవావివాహమునుగూర్చి చెప్పకపోయినను సాధారణముగా స్త్రీపునర్వివాహమునుగూర్చి చెప్పుచున్నవి గనుక, సప్తపద్యనంతరము కన్యను మఱియొకని కియ్యఁగూడదను వారి వాదమును ఖండించుటకివియన్నియు పరమప్రయోజనకరములుగానే యుండును. స్త్రీ పున

ర్వివాహమున కనుజ్ఞ యిచ్చుచున్న తొమ్మిది స్మృతులలోను అయిదు విధవావివాహము నంగీకరించుచున్నవి. తక్కిన స్మృతులన్నియు నీవిషయమున మూకీభావమును వహించుచున్నవి. ఇట్లన్ని స్మృతులు స్త్రీపునర్వివాహము నంగీకరించుచుండఁగా స్త్రీపునర్వివాహమును నిషేధించు స్మృతి యొక్కటియైనను గనఁబడదు. ప్రతిపక్షులు కష్టపడి తీసికొనివచ్చినదంతయు నీ క్రింద నుదహరింపఁబడిన యొక్క యాశ్వలాయనవచనము.

శ్లో. అజ్ఞాతశ్చ ద్విజో యస్తు విధవా ముద్వహేద్యతి
పరిత్యజ్య చ తాంచైవ ప్రాయశ్చిత్తం సమాచరేత్.

ద్విజుఁడు తెలియక విధవను వివాహము చేసికొన్న పక్షమున దానిని పరిత్యజించి ప్రాయశ్చిత్తము చేసుకోవలెనని పై వచనమున కర్థము. ఇది యొక్కటితప్ప ఖండనవాదుల కాధారము లేశ మయినను లభింపలేదు. దీనికైనను,—

శ్లో. పాణిగ్రాహే మృతే బాలా కేవలం మంత్ర సంస్కృతా
సాచే దక్షతయోనిః స్యా త్పునస్సంస్కార మర్హతి.

ఇత్యాది పూర్వోదాహృత స్మృతివచనములతో సమన్వయించునట్లుగా నర్థముచేయునప్పుడు సామాన్యవిశేషభావముచే క్షతయోనికా పునర్వివాహనిషేధము మాత్రమే యర్థమగును. పూర్వోక్తము లయిన స్మృతివాక్యములను బట్టి విచారింపఁగా కొందఱు స్మృతికర్త లక్షతయోనికావివాహమును మాత్ర మంగీకరించినట్లును, కొందఱక్షతయోనులకును క్షతయోనులకును కూడ వివాహ మంగీకరించినట్లును స్పష్టమగుచున్నది. ఋషులలో నిట్టి యభిప్రాయభేద మున్నను, స్త్రీపునర్వివాహము నంగీకరింపని ఋషి యొకఁడును కనఁబడఁడు. ఈ యాశ్వలాయనుఁ డక్షతయోనికా వివాహమును మాత్ర మంగీక

రించు తరగతిలోనివాఁడుగా నున్నాఁడు. ఇంతవఱకును జూపిన వచన ములవలన స్త్రీపునర్వివాహము వేదమునుబట్టి మాత్రమే కాక చతుర్యుగ సామాన్యములయిన సమస్త స్మృతులనుబట్టియుకూడ నిర్వివాదముగా స్థాపన మగుచున్నది గదా ? ఇట్టిస్ని ప్రబలనిదర్శనము లున్నను పాటిం పక విరోధులు తమవాదమున కేమో సాధకములుగా నున్న వనుకొని సంతోషించు మన్వాది వచనములనుగూర్చి కొంచెము విచారింతము.

బాధక స్మృతులు.

౧. శ్లో. న ద్వితీయశ్చ సాధ్వీనాం క్వచి ద్భర్తోపదిశ్యతే.

౨. ఆసీతా౽మరణాత్ క్షాంతా నియతా బ్రహ్మచారిణీ.

అను మనువచనముల నుదాహరించి స్త్రీల కెక్కడను ద్వితీయ భర్త విధింపఁబడలేదనియు, మృతభర్తృక మరణాంతమును బ్రహ్మ చారిణి యయియే యుండవలయు నఁయు, ప్రతిపక్షులు చెప్పు చున్నారు. పూర్వోక్తవచనము లెక్కడ చెప్పఁబడినవో సందర్భము కొంచెము విచారించిన పక్షమున, అవి పునర్వివాహ నిషేధకములు కావని బాలుఁడయినను తెలిసికొనవచ్చును.

మనుస్మృతి పంచమోధ్యాయము.

శ్లో. యస్మై దద్యా త్పితా త్వేనాం భ్రాతా వా౽నుమతే పితుః
తం శుశ్రూషేత జీవంతం సంస్థితం చ నలంఘయేత్. ౧౫౧
మంగళార్థం స్వస్త్యయనం యజ్ఞశ్చాసాం ప్రజాపతేః
ప్రయుజ్యతే వివాహేషు ప్రదానం స్వామ్యకారణం. ౧౫౨
అనృతావృతుకాలే చ మంత్రసంస్కారకృత్పతిః
సుఖస్య నిత్యం దాతేహ పరలోకే చ యోషితః. ౧౫౩
విశీలః కామవృత్తో వా గుణైర్వా పరివర్జితః
ఉపచర్యః స్త్రియా సాధ్వ్యా సతతం దేవవత్పతిః ॥ ౧౫౪

నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషితం
పతిం శుశ్రూషతే యేన తేన స్వర్గే మహీయతే. ౧౫౫.

పాణిగ్రాహస్య సాధ్వీ స్త్రీ జీవతో వా మృతస్య వా
పతిలోక మభీప్సంతీ నాచరే త్కించి దప్రియమ్. ౧౫౬.

కామంతు క్షపయే ద్దేహం పుష్పమూలఫలై శ్శుభైః
న తు నామాపి గృహ్ణీయా త్పత్యౌ ప్రేతేఽపరస్య తు. ౧౫౭.

ఆసీతాఽమరణాత్ క్షాంతా నియతా బ్రహ్మచారిణీ
యోధర్మ ఏకపత్నీనాం కాంక్షంతీ త మనుత్తమమ్. ౧౫౮.

అనేకాని సహస్రాణి కుమార బ్రహ్మచారిణాం
దివం గతాని విప్రాణా మకృత్వా కులసంతతిమ్. ౧౫౯.

మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా
స్వర్గం గచ్ఛ త్యపుత్రాపి యథా తే బ్రహ్మచారిణః. ౧౬౦.

అపత్యలోభా ద్యాతు స్త్రీ భర్తార మతివర్తతే
సేహ నిందా మవాప్నోతి పతి లోకాచ్చ హీయతే. ౧౬౧.

నాన్యోత్పన్నా ప్రజా స్త్రీహ నచాప్యన్యపరిగ్రహే
నద్వితీయశ్చ సాధ్వీనాం క్వచి ద్భర్తోపదిశ్యతే. ౧౬౨.

పతిం హిత్వాపకృష్టం స్వ ముత్కృష్టం యా నిషేవతే
నింద్యైవ సా భవేల్లోకే పరపూర్వేతి చోచ్యతే. ౧౬౩.

వ్యభిచారాత్తు భర్తుః స్త్రీ లోకే ప్రాప్నోతి నింద్యతామ్
సృగాలయోనిం ప్రాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే. ౧౬౪.

మనువు స్త్రీధర్మములను వివరించుచు, ౧౫౧ వ శ్లోకముచేత తండ్రికాని, తండ్రి యనుమతిని భ్రాతకాని యెవనికిచ్చి వివాహము చేయునో యతనికి స్త్రీ బ్రతికియున్నంతవఱకు పరిచర్యచేయుచు, చచ్చిన తరువాతను వ్యభిచరింపఁ గూడదని చెప్పినాఁడు. "సలంఘు

యేత్” అనుపదము నాధారముచేసికొని పునర్వివాహము చేసికొనఁ గూడదని ప్రతివాదు లర్థము చేయఁజూతురు గాని యట్టి తలంపు వ్యర్థము. వ్యాఖ్యానములో కుల్లూకభట్టు సహితము (నాతిక్రమేత్ వ్యభిచారేణ తదీయ శ్రాద్ధతర్పణాఽకరణేన పారలౌకికకృత్య ఖండనేన చ) వ్యభిచారముచేతను శ్రాద్ధతర్పణాదులు చేయక పోవుటచేతను పారలౌకికకృత్య ఖండనముచేతను అతిక్రమింపఁగూడదనియే యర్థము వ్రాసియున్నాఁడు. తరువాత ౧౫౭ వ శ్లోకము వఱకును సువాసినీ ధర్మములను బోధించుచు స్త్రీకి భర్తయే యిహపరలోకములయందు సుఖదాయకుఁడనియు, అతఁడు మంచినడత లేనివాఁడయినను కామవ్యాపారమునందు వర్తించువాఁడయినను గుణహీనుఁడయినను విడిచిపెట్టక పతివ్రతయైన స్త్రీ పతికి పరిచర్య చేయవలయు ననియు, స్త్రీకి పతి శుశ్రూషకంటె వేఱుగ నుపవాసములును, వ్రతములును, యజ్ఞములును లేవనియు, పతిలోకమును గోరెడి స్త్రీ పతి జీవించియున్నను మృతుఁడైనను కొంచెమయిన నతని కప్రియము చేయఁగూడదనియు చెప్పియున్నాఁడు. ఇక్కడ నప్రియమును స్థలమునందును, వ్యభిచారముచేతను విహితశ్రాద్ధఖండనముచేతను ననియే వ్యాఖ్యానము చేయఁబడినది గాన ప్రతివాదులు దానికి మఱియొక్క యర్థమును కల్పింపఁబూనుట వృథాప్రయాసము. అటుతరువాత మనువు విధవాధర్మములను జెప్పుచు ౧౬౧ శ్లోకము వఱకును పుష్పమూలఫలాదులచేత దేహమును శుష్కింపఁ జేయవలయు ననియు, పరపురుషుని యొక్క నామోచ్చారణమునైనను చేయఁగూడ దనియు, మరణము వఱకును బ్రహ్మచారిణియై నియమము గలదియై యుండవలసిన దనియు, సంతానము లేకపోయినను కుమారబ్రహ్మచారులు స్వర్గమును పొందినట్లే భర్త పోయినతరువాత బ్రహ్మచర్యవ్రతమును నడి

పెడి సాధ్వియు సంతానహీనురాలయినను స్వర్గమునకు వెళ్ళుననియు, సంతానాపేక్షవలన భర్త నతిక్రమించి వర్తించు స్త్రీ యీ లోకమున నింద పొందుటయేకాక పరలోకమునుండి భ్రష్టురా లగుననియు, చూపియున్నాఁడు. "అతివర్తతే" యనుదానికి "వ్యభిచరతి" యనియే కుల్లూకభట్టు రము వ్రాసి యున్నాఁడు. విధవకు బ్రహ్మచర్యమును చెప్పినంతమాత్రమున మృతభర్తృకలు మఱియొకలాగున నుండఁగూడ దనియే సిద్ధాంత మేర్పరచినయెడల, పా చే దహితయో నీత్యాది పునర్వివాహవిధులును సహగమనవిధులును నిరర్థకములు కావలసివచ్చును. అటుపిమ్మట పరునివలనఁ బుట్టినవాఁ డా స్త్రీకిఁగాని యా పరపురుషునకుఁగాని పుత్రుఁడు కాఁడనియు, ద్వితీయుఁ డనఁగా భర్తృవ్యతిరిక్తుఁడయిన జారపురుషుఁడు సాధ్వుల కెప్పుడును భర్త యనిపించుకొనఁ డనియు ౧౬౨ వ శ్లోకముచేతఁ జెప్పియున్నాఁడు. కడపటి రెండు శ్లోకములచేతను తక్కువవాఁడైన భర్తను విడిచి గొప్పవాని నాశ్రయించు నది యీ లోకమున నింద్యురాలయి పరపూర్వ యనఁబడు ననియు వ్యభిచరించు స్త్రీ యీ లోకమునందు నిందను పొంది నక్కజన్మమెత్తి పాపరోగములచేత పీడింపఁబడుననియు చూపబడినది. కాఁబట్టి విధవాధర్మముల నిరూపించెడునట్టియు వ్యభిచారమును దూషించెడు నట్టియు పయివచనములలో నేదియు పునర్వివాహమును నిషేధించుట కుద్దేశింపఁబడ లేదని ప్రకరణమునుబట్టి బాలుఁడయినను సులభముగా తెలిసికొనవచ్చును.

శ్లో. పాణిగ్రహణికా మంత్రాః కన్యాస్వేవ ప్రతిష్ఠితాః
నా౽కన్యాసు క్వచిన్నౄణాం లుప్తధర్మక్రియా హి తాః.

మను. అ. ౮, శ్లో. ౨౨౬.

వివాహమంత్రములు కన్యలవిషయమే ప్రతిష్ఠింపఁబడి యున్న వనియు, ధర్మక్రియలు లేనివా రగుటవలన కన్యలు కానివారి విషయమయి కావనియు, మనువు చెప్పుటవలన కన్యలకే కాని విధవలకు వివాహము కూడదని ప్రతిపక్షులు చెప్పుదురు. ఇక్కడ ఆ కన్యలనఁగా వ్యభిచారాదులచేత కన్యాత్వము చెడఁగొట్టుకొన్నవారే కాని విధవలు మొదలయినవారు కారు. "లుప్తధర్మక్రియాః" అను హేతువును జెప్పుటవలనను, విధవలు ధర్మక్రియలు లేనివా రని యెవ్వరును చెప్పసాహసింపఁ జాలరు గనుకను, ఆ కన్యలను విధవలనుగాఁ జెప్పుటకు లేశమయిన నవకాశము లేదు. మఱియు నట్టియర్థమును జెప్పితిమేని, స్త్రీపునర్వివాహమును విధించు శ్రుతిస్మృతివచనము లన్నియు నర్థహీనము లయిపోవును. ఇదియంతయు నాలోచించియే కుల్లూకభట్టు వ్యాఖ్యానములో శాస్త్రవిహితమయిన వివాహరీతిని గాక యన్యవిధమున చెడిపోయిన వారని యకన్యల కర్థము వ్రాసియున్నాఁడు. అదిగాక విధవలకును వివాహితలకును స్మృతులయందు కన్యాపదవ్యవహారము కలదు,—

శ్లో. విధవా యా భవే త్కన్యా నిర్దోషా భర్తృవర్జితా
తస్యాఽవాసః పితుర్వేశ్మ సలజ్జా చైవ సర్వదా.—పరాశరుఁడు.

శ్లో. కన్యాయాం దత్తశుల్కాయాం మ్రియేత యది శుల్కదః
దేవరాయ ప్రదాతవ్యా యది కన్యాఽనుమన్యతే.— మనువు.

కన్యాశబ్దము వివాహితలయందుఁగూడ వర్తించును గనుకను, విధవావివాహము మనుస్మృతియందే విధింపఁబడినది గనుకను, చెడి తిరిగెడివారికి మాత్రమే వివాహము లే దని మనువాక్యమున కర్థము చేయక తప్పదు.

శ్లో. సకృదంశో నిపతతి సకృ త్కన్యా ప్రదీయతే
సకృ దాహదదా నీతి త్రీణ్యేతాని సతాం సకృత్.

మను, అ. ౯, శ్లో ౪౭

భాగము వచ్చుటయు, కన్య నిచ్చుటయు, వస్తుదానమును, ఈ మూడును ఒక్కపర్యాయమే యని మనువు చెప్పుటవలన పునః కన్యాదానము కూడదనియు, అందుచేత స్త్రీపునర్వివాహము నిషిద్ధ మనియు, నిషేధవాదులు పలుకుదురు. ఇది సామాన్యవచనము; ఒకరి కిచ్చిన కన్యను మఱియొకనికి సాధారణముగా నియ్యఁగూడ దను మాట వాస్తవమే కాని విశేషవిధులనుబట్టి నష్టత్వాదినిమిత్తముల యందుమాత్రము పునర్దానము చేయవచ్చునని శాస్త్రముచేతనే తెలుచున్నది. కాఁబట్టి నష్టత్వాదులయందు తప్ప కన్యను పునర్దానము చేయఁగూడ దని పయిశ్లోకమున నర్థ మగుచున్నది.

శ్లో. నోద్వాహికేషు మంత్రేషు నియోగః కీర్త్యతే క్వచిత్
న వివాహవిధా వుక్తం విధవావేదనం పునః.

మను. అ. ౯ శ్లో. ౬౫

వివాహమంత్రములయందు నియోగ మెక్కడను జెప్పఁబడ లే దనియు, వివాహవిధులయందు మగల విధవావివాహము చెప్పఁబడ లే దనియు మనువు చెప్పెను గాన విధవావివాహము కూడ దని ప్రతి పక్షులు వాదింతురు. "వివాహోపయమౌ సమౌ తథా పరిణయో ద్వాహోపయమాః పాణిపీడనమ్" అను నమరనిఘంటువును బట్టి వేదనపదము వివాహార్థబోధకముగాఁ గనుబట్టదు. వేదనపదము గ్రహించుట యనునర్థ మిచ్చు "విద్" ధాతువునుండి పుట్టిన విశేష్య మగుటచేత దానికి గ్రహణ మర్థము కాఁబట్టి పై వచనము విధవ నొకరు నియమించుట గాని యొకరు గ్రహించుట కాని వివాహమంత్ర

ములయందు లే దని చెప్పుచున్నదే కాని యది విధవావివాహవిషయ మెంత మాత్రమును కాదు. ప్రకరణమునుబట్టి చూచినను, అది యంతయు నియోగవిషయమే కాని వివాహప్రసంగతిని చెప్పుట కావ శ్యక మెంతమాత్రమును లేదు. వివాహప్రకరణములో వదలివేసి నియోగప్రకరణమధ్యమున నీ యొక్క మాటయు సందర్భము లేకుండ వివాహమంత్రములో విధవావివాహము లే దని చెప్పు ననుట యుక్తి యుక్తముగా కనుపట్టదు. వేదనశబ్దమునకు వివాహ మర్థము చేసెడు పక్షమున, సా చే దక్షతయోనిః స్యా దిత్యాది మనువచనమునకే యిది విరుద్ధ మగును. "ద్విజో విందేత దేవరః" అని మను వీ క్రియను నియోగమున గ్రహించుటయం దుపయోగించి యున్నాడు. ప్రకరణ సందర్భము తెలియుట కయి దాని పూర్వోత్తరశ్లోకముల నిం దుదాహ రించుచున్నాను.

శ్లో. దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా
ప్రజేప్సితాఽధిగంతవ్యా సంతానస్య పరిక్షయే. ౫౯
విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి
ఏక ముత్పాదయే త్పుత్రం న ద్వితీయం కథం చ న. ౬౦
ద్వితీయ మేకే ప్రజనం మన్యంతే స్త్రీషు తద్విదః
అనిర్వృత్తం నియోగార్థం పశ్యంతో ధర్మత స్తయోః. ౬౧
విధవాయాం నియోగార్థే నిర్వృత్తే తు యథావిధి
గురువచ్చ స్నుషావచ్చ వర్తేయాతాం పరస్పరమ్. ౬౨
నియుక్తౌ యౌ విధిం హిత్వా వర్తేయాతాం తు కామతః
తావుభౌ పతితౌ స్యాతాం స్నుషాగగురుతల్పగౌ. ౬౩
నాన్యస్మిన్ విధవా నారీ నియోక్తవ్యా ద్విజాతిభిః
అన్యస్మిన్ హి నియుంజానా ధర్మం హన్యు స్సనాతనం. ౬౪

నోద్వాహికేషు మంత్రేషు నియోగః కీర్త్యతే క్వచిత్
న వివాహవిధా వుక్తం విధవాఽఽవేదనం పునః. ౬౫

అయం ద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో విగర్హితః
మనుష్యాణా మపి ప్రోక్తో వేనే రాజ్యం ప్రశాసతి. ౬౬

స మహీ మఖిలాం భుంజన్ రాజర్షి ప్రవరః పురా
వర్ణానాం సంకరం చక్రే కామోపహతచేతసః. ౬౭

తతఃప్రభృతి యో మోహాత్ ప్రమీతపతికాం స్త్రియం
నియోజయత్యఽపత్యార్థం తం విగర్హంతి సాధవః. ౬౮

మనుస్మృతి నవమాధ్యాయమునందలి పై శ్లోకములవలన నిది యంతయు నియోగప్రకరణ మగుట స్పష్టమే. "నాన్యస్మిన్ విధవా నారీ" మొదలుకొని యైదుశ్లోకములును ప్రక్షిప్తము లనియు, ఈ శ్లోకములు పూర్వ మవ్యవధానముగా మనువు చెప్పినదానికే విరుద్ధముగా నున్నవనియు, విధవావివాహము శాస్త్రనిషిద్ధ మని సాధించుట కెవ్వరో పినిని కల్పించి మధ్య నిమిడ్చి యుందురనియు, ఇవి మనువచనములే యైనయెడల మనువు తరువాత త్రేతాద్వాపరయుగములు దాటి ప్రభుత్వమునకు వచ్చిన వేనుఁడు తనకు పూర్వమే రాజ్యము చేసి నియోగమును వ్యాపింపఁజేసి వర్ణసాంకర్యమును గలుగఁజేసె ననుట తటస్థింప దనియు కొంద అభిప్రాయపడుచున్నారు.

విధవావివాహఖండనవాదులు విధవోద్వాహముతో దూర సంబధమైనను లేని యీ నాలుగుశ్లోకవచనములను సాధనములుగా జేకొని పోరాడి కంఠోక్తిగా స్త్రీపునర్వివాహమును విధించుచున్న బలవత్తరము లయిన యనేక శ్రుతిస్మృతివచనములను ఖండించి తమ వాదమును స్థాపింపఁ జూచుచున్నారు.

## పురాణ ప్రమాణములు;

ఇంక పురాణములయందు స్త్రీపునర్వివాహవిషయమునఁ గను పట్టు ప్రమాణములను యోచింతము.

### ౧. అగ్నిపురాణము.

శ్లో. నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే.
మృతే తు దేవరే దేయా తదభావే యథేచ్ఛయా.

ఈయివచనము నష్టత్వాది పంచాపదలయందును స్త్రీలకు మఱి యొక పతి విధింపఁబడుచున్నాఁ డనియు, మృతుఁ డయినప్పుడు మొదల దేవరునకును, దేవరుఁడు లేనప్పుడు మనసువచ్చిన వారికిని స్త్రీ నియ్యఁ దగు ననియు స్పష్టముగా చెప్పుచున్నది.

### ౨. బ్రహ్మపురాణము.

శ్లో. మృతే భర్తరి యా నారీ త్యక్తవత్యథా తం స్వయమ్
సవర్ణా జ్జనయే ద్గర్భం భర్తుః పౌనర్భవం సుతమ్.
యది సా బాలవిధవా బలా త్త్యక్తాఽథవా క్వచిత్
తథా భూయస్తు సంస్కార్యా గృహీత్వా యేన కేన చిత్.

ఇందలి మొదటిశ్లోకము విధవగాని భర్తచే విడువఁబడినదిగాని స్వయముగా సవర్ణునివలన బిడ్డను గన్నపక్షమున నట్టిసుతుఁడు భర్తకు పౌనర్భవపుత్రుఁ డగునని పౌనర్భవలక్షణమును చెప్పుచున్నది. అట్టి స్త్రీ బాలవిధవగాని బలవంతముగా మగనిచే విడిచిపెట్టఁబడినదిగాని యయినపక్షమున మనసువచ్చిన వానిని వివాహము చేసికొనుట కర్హురా లగుచున్నదని రెండవశ్లోకము పునర్వివాహానుజ్ఞ నిచ్చుచున్నది.

## ౩. భా ర త ము.

శ్లో. అర్జున స్యాత్మజః శ్రీమా న్నిరావ న్నామ వీర్యవాణ్
సుతాయా నాగరాజస్య జాతః పార్థేన ధీమతా
ఐరావతేన సా దత్తా హ్యనపత్యా మహాత్మనా
పత్యౌ హతే సుపర్ణేన కృపణా దీనచేతనా
భార్యార్థం తాం చ జగ్రాహ పార్థః కామవశానుగాం.

* * * *

అజాన న్నర్జున శ్చాపి నిహతం పుత్ర మౌరసం
జఘాన సమరే శూరాన్ రాజ్ఞ స్తాన్ భీష్మరక్షిణః.

భీష్మపర్వము

ఈ శ్లోకములు పూర్వోక్తపురాణవచనములవలె స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మత మని మాత్రమే తెలుపక సుపర్ణునిచేత భర్త చంపఁబడిన తరువాత ఉలూపిని మరల నర్జునుఁడు వివాహము చేసికొనుటను మృతభర్తృక యయిన యులూపిని తండ్రి యైన నాగరాజే మరల దానము చేయుటను పునర్వివాహ మాడిన యువతికి పుట్టిన పుత్త్రుఁడు ఔరసుఁడే యనుటను కూడ తెలిపి సరిగా స్త్రీ పునర్వివాహము త్తమవంశమునందు జరగిన సంగతినికూడ స్థాపించుచున్నది.

శ్లో. అస్థాస్యతి పునర్భైమీ దమయంతీ స్వయంవరమ్
తత్ర గచ్ఛంతి రాజానో రాజపుత్రాశ్చ సర్వశః.

ఆదిపర్వము.

నలుఁడు నష్టుఁ డయినప్పు డాతనిని కనుఁగొనుట కయి దమయంతి సుదేవుఁ డను బ్రాహ్మణుని ఋతుపర్ణునొద్దకుఁ బంపునప్పుడు దమయంతీ పునస్స్వయంవరము జరగఁబోవు ననియు, అందు

నిమిత్తమయి యందఱు రాజులును రాజపుత్రులును వచ్చుచున్నా రనియు ఋతుపర్ణునితోఁ జెప్పుటకయి నియమించెను. పోయినభర్తను వెదకి కనుఁగొనుటకయి పతివ్రతాశిరోమణియైన దమయంతి తనకు పునస్స్వయంవరమని బహిరంగముగా రాజసభకుఁ జెప్పఁబంపుటయు, ఆ వార్త విన్నతోడనే లేశ మయినను సంశయింపక రాజర్షియైన ఋతుపర్ణు నంతటివాఁడు వెంటనే బయలుదేఱి వచ్చుటయు, ఆ యుపాయము సుదేవునకుఁగాని దమయంతియొక్క జననీజనకులకుఁగాని మఱియెవ్వరికిఁగాని వింతగా తోఁచకపోవుటయు, విచారింపగా పూర్వకాలమునందు స్త్రీపునర్వివాహము సర్వసాధారణముగా నడుచుచు వచ్చెననియు నట్టి ద్వితీయవివాహ మేవిషయమునందును ప్రథమవివాహమునకంటె క్రొత్తగా తోఁచకుండె ననియు విదిత మగుచున్నది.

౮. పద్మపురాణము.

శ్లో. సతాం దృష్ట్వా దివోదాసో దివ్యా దేవీం సుతాం తదా
కస్మై చ దీయతాం కన్యాం సువరాయ మహాత్మనే.
ఇతి చింతాతురో భూత్వా సమాలోక్య నరోత్తమః
యూపదేశస్థ రాజానం సమ్యక్ జ్ఞాత్వా మహీపతిః.
చిత్రసేనం మహాత్మానం సమాహూయ తతో నృపః
కన్యాం దత్తా దివోదాస శ్చిత్రసేనాయ ధీమతే.
తస్యా వివాహకాలస్య సంప్రాప్తే సమయే నృప
మృతో౽సౌ చిత్రసేనస్తు కాలధర్మేణ వై కిల.
దివోదాస శ్చ ధర్మాత్మా చింతయామాస భూపతిః
బ్రాహ్మణానాం సమాహూయ పప్రచ్ఛ నృపనందనః.

అస్యా వివాహకాలే తు చిత్రసేనో దివం గతః
అస్యాస్తు కీదృశం కర్మ భవిష్యతి బ్రువంతు మే.

బ్రాహ్మణా ఊచుః.

శ్లో. వివాహే జాయతే రాజన్ కన్యాయా స్తే విధానతః
పతి ర్మృత్యుం ప్రయాత్యేవ యో వా త్యాగం కరోతి చ.
మహావ్యాధినా భూత స్త్యాగం కృత్వా ప్రయాతి చ
ప్రవ్రాజితో భవే ద్రాజన్ ధర్మశాస్త్రేషు దృశ్యతే.
తస్యాం రజస్వలాయాం చ పతి రన్యో విధీయతే
వివాహం తు విధానేన పితా కుర్యా న్న సంశయః.
ఏవం రాజన్ సమాదిష్టం ధర్మశాస్త్రం శుభై ర్జనైః
వివాహ క్రియతా మస్యా ఇత్యూచు స్తే ద్విజోత్తమాః.
దివోదాసస్తు ధర్మాత్మా బ్రాహ్మణై స్సంప్రచోదితః
వివాహార్థం మహారాజా మానసం కృతవా న్నృపః.
పున ర్దత్తా తదా తేన దివ్యా దేవి ద్విజోత్తమ
పుణ్యసేనాయ పుణ్యాయ తస్మై రాజ్ఞే మహాత్మనే.
మృత్యుధర్మగతో రాజా వివాహసమయేఽపి సః
యదా యదా మహాభాగో దివ్యా దేవ్యా స్సభూమిపః.
కరోతి సత్యోద్యోగం వివాహాయాఽతిదుఃఖితః
భర్తాఽపి మ్రియతే కాలే ప్రాప్తలగ్న స్తదా తదా.
ఏకవింశతి భర్తారః కాలే కాలే మృతా స్తథా
తతో రాజా మహాదుఃఖ సంజాతః ఖ్యాతవిక్రమః.

చిత్రోపాఖ్యానము; సప్తమోధ్యాయము

ఈ వయివాక్యములవలన కాశీరాజైన దివోదాసుఁడు తన కొమార్తెకు భర్తపోయినప్పుడెల్లను మరలమరల వివాహముచేయుచు

వచ్చెనని తెలియుటయేకాక పతి మృత్యుగతుఁడౌట మొదలుగాఁ గల యాపదలయందు రజస్వలలకు సహితము పునర్వివాహ మొనర్చుట శాస్త్రసిద్ధాంత మని నిరాక్షేపముగా నేర్పడుచున్నది. వివాహ సమయమునందు పతి మృతుఁ డయ్యెనని యుండుటచేత భర్తలు సప్తపదికి పూర్వమే మృతు లగుచువచ్చిరని కొందఱు వాదింపఁ జూతురుగాని, "కన్యాం దద్యా" "పునర్దత్తా" "భర్తా" "ప్రాప్తలగ్నః" మొదలగుపదములు నిస్సందేహముగా భర్తలు వివాహదినములలో సప్తప ద్యనంతరమే మృతులగుచు వచ్చిరనుటను స్థాపించుచున్నవి.

ఈ పూర్వోదాహృత సమస్తవచనములనుబట్టి చూచిన పక్షమున మందుఁడయినను శ్రుతిస్మృతిపురాణేతిహాసములు నిస్సంశయముగా స్త్రీపునర్వివాహమును సిద్ధాంతపఱుచుచున్న వని తెలిసికొనవచ్చును. ఇందువలన స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమనుట మాత్రమే కాక క్రమముగా నట్టివివాహములు నడుచుచు వచ్చెననియు బృహస్పతి పార్థుఁడు దివోదాసుఁడు మొదలుగాఁగల పుణ్యపురుషులు సహితము స్త్రీపునర్వివాహముచు చేసికొనుటకును చేయించుటకును వెనుకతీయ లేదనియు తేటపడుచున్నది.

## కలియుగస్మృతి ప్రమాణములు.

స్త్రీపునర్వివాహమునకు సాధకముగా శ్రుతిస్మృతిపురాణముల నుండి యిట్లన్ని వచనముల నుదాహరించినను, అవు నివి యన్నియు ననుకూలములుగానే యున్నవి కాని యివి కలియుగధర్మైకబోధకములు కావు కాఁబట్టి, కలియుగమునందు స్త్రీపునర్వివాహము కర్తవ్యమని చూపుటకు నివి ప్రయోజనకరములు కావని నిషేధవాదు లొక్కమాట యనవచ్చును. కలియుగధర్మైకబోధకమగు పరాశరస్మృతి నుండి స్త్రీపునర్వివాహము నిషిద్ధమని యొక్క వచనమును ప్రతి

పక్షులు చూపఁగలుగుదురేని, ఈ పడినప్రయాస యంతయు వ్యర్థమగును. కాఁబట్టి విధాయకవాదులు తమ పక్షమును స్థిరపఱుచుకొనుటకయి పరాశరస్మృతియందు దట్టినిషేధము లేదని యయినను స్థాపింపవలసి యున్నది. అట్లుగాక విధాయకవాదు లిప్పుడు పరాశరస్మృతియం దట్టినిషేధ మేదియు లేదని చూపఁగలిగినవారు మాత్రమే కాక స్త్రీపునర్వివాహము చేయవచ్చు నన్న స్పష్టమయిన విధినిగూడ గనఁబఱిచి తమవాదమును నిరాక్షేపముగా సాధింపఁగలిగిన స్థితియందు కూడ నున్నారు.

పరాశరస్మృతి చతుర్థాధ్యాయములో

శ్లో. నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే.

పతి నష్టుఁడైనను, మృతుఁడైనను, సన్యసించినను, నపుంసకుఁడయినను, పతితుఁడయినను, స్త్రీల కీయైదాపదలయందును మఱియొకపతి విధింపఁబడుచున్నాఁడని స్పష్టమైన విధి కనఁబడుచున్నది. ఈ వాక్యముయొక్క సందర్భము తెలియుటకయి పూర్వోత్తరశ్లోకముల నిం దుదాహరించుచున్నాను,—

శ్లో. జ్యేష్ఠభ్రాతా యదా తిష్ఠే దాధానం నైవ కారయేత్
అనుజ్ఞాతస్తు కుర్వీత శంఖస్య వచనం యథా. ౨౭
నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే. ౨౮
మృతే భర్తరి యా నారీ బ్రహ్మచర్యే వ్రతే స్థితా
సా మృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః. ౨౯
తిస్రః కోట్యర్ధకోటీ చ యాని రోమాణి మానుషే
తావత్కాలం వసేత్స్వర్గే భర్తారం యాఽనుగచ్ఛతి. 30

పరాశరుఁడు వివిధధర్మములను జెప్పుచు మొదట పరివేదనము కూడదని చెప్పి తరువాత ౨౭ వ శ్లోకముచేత జ్యేష్ఠభ్రాత బ్రతికి యుండఁగా తమ్ముఁడు యజ్ఞము చేయఁగూడదనియు అనుజ్ఞ పుచ్చుకొని చేయవలయుననియు చెప్పి, పిమ్మట మృతభర్తృకాదివిషయము నెత్తుకొని ౨౮ వ శ్లోకముచేత నష్టత్వాద్యాపదలయందు స్త్రీ పునర్వివాహము చేసికోవచ్చునని విధించి, ౨౯ వ శ్లోకము చేత భర్త మృతుఁడయిన స్త్రీ బ్రహ్మచర్యము చేసినపక్షమున మరణానంతరము స్వర్గమును పొందునని చెప్పి, 30 వ శ్లోకముచేత సహగమనము చేసిన స్త్రీ మనుష్యశరీరముమీఁద నెన్నిరోమము లుండునో యన్నిసంవత్సరము లనఁగా మూఁడుకోట్ల యేఁబదిలక్షలసంవత్సరములు స్వర్గమున వసించునని చెప్పినాఁడు. ఈ పునర్వివాహము పరివేదినుల కని యొకరును, వాగ్దత్తల కని మఱియొకరును, నియోగపర మని యింకొకరును వ్రాసియున్నారు. ప్రకరణమునుబట్టికాని శబ్దశక్తి చేతఁగాని యట్టి యర్థము వచ్చుట కవకాశము లేదు. వివాహము వాగ్దత్తల కయినపక్షమున ప్రకరణమునుబట్టి బ్రహ్మచర్యమును సహగమనమునుకూడ వాగ్దత్తలకే యయి పరిహాసాస్పద మయిన యర్థమేర్పడును. కొంద ఱీవిధి ద్విజులకు కాదని వాదించిరికాని మూలవాక్యములోని "ప్రవ్రజితే" శబ్దము వారిని బాధించునుగాన సన్న్యాసము ద్విజులకే యని తెలిసికొని వారూరకుండవలసినవా రగుచున్నారు. ఇంకొకరు పతి యనఁగా రక్షకపతి యని రెండవ పతిశబ్దమున కర్థముచేయ యత్నించినారు; మూలములో "క్లీబే" యను పద ముండుటచేత నపుంసకుఁడు తనభార్యను రక్షించుటకు సమర్థుఁడు కాకపోఁడు గనుక వారియర్థము వ్యర్థము. మఱియొకరు "పతౌ" యను పదము వ్యాకరణదుష్టముగ కనఁబడుచున్నది. గనుక, 'అపతౌ' యని

పూర్వార్థమున పదవిభాగము చేసి పర్యుదాసముచేత దానికి పతిసదృశుఁడును పతిభిన్నుఁడు ననఁగా వాగ్దత్తాపతి యని యర్థము చేయవలె ననిరి. ఉత్తరార్థమున "పతిరన్యః" అని మఱియొకపతిని విధించుటను బట్టి "అన్య" పదస్వారస్యముచేత నొకటివాఁడు పతియైనంగాని రెండవవాఁ డన్యపతి కానేరఁడు కాఁబట్టి నొకటిది 'పతి' శబ్దమేకాని 'అపతి' శబ్దము కాదు. నియోగపర మని వాగ్దత్తాపర మని యర్థము చేయువారినికూడ ఈ 'యన్య' పదమే బాధించును. కొందఱు 'పతౌ' యనుదానికే గౌణపతి యని యర్థము చేయ యత్నించిరి కాని,

శ్లో. నోదకేన న వా వాచా కన్యాయాః పతి రుచ్యతే
పాణిగ్రహణసంస్కారా త్పతిత్వం సప్తమే పదే.

అను నారదవచనమును బట్టియు,

శ్లో. నోదకేన న వా వాచా కన్యాయాః పతి రుచ్యతే
ప్రాణిగ్రహణసంస్కారో నియతం పతిలక్షణమ్.

అను పరాశరవచనమునుబట్టియు, సరిగా పాణిగ్రహణము చేసినవాఁడే పతి యగును గనుక మఱి యే యర్థమును పొసఁగదు. మనోరమా, తత్వబోధినీ వ్యాఖ్యానములయందు "పతౌ" యను రూపము సాధువుగానే చేయఁబడియున్నది. అంతియకాక యిది యార్షప్రయోగ మగుటచేత నిక్కడ నట్టి వివాదముతో పనియే లేదు.

౧. సీతాయాః పతయే నమః—రామాయణము.

౨. క్రీడతే పతినా సార్థం యావదింద్రాశ్చతుర్దశ—హారీతస్మృతి.

3. సమాంశభాగినీ మాతా పుత్రాణాం సా స్మృతే పతౌ.

నారదస్మృతి.

మొదలుగాఁగల యార్షప్రయోగములు పెక్కులు కనఁబడుచుండుటచేత 'పతౌ' పదము దుష్టమును గాదు; దానికి మఱియొక

యుద్ధము చేయ నావశ్యకమును లేదు. మాధవాచార్యులవారు వ్యాఖ్యానములో 'నష్టే మృతే' యనునది స్త్రీపునర్వివాహపరమని యొప్పుకొని యీ వచనమును యుగాంతరవిషయమునుగాఁ జెప్పి తమ వాక్యమున కుపబలముగా,—

శ్లో. ఊఢాయాః పునరుద్వాహం జ్యేష్ఠాంశం గోవధం తథా
కలౌ పంచ న కుర్వీత భ్రాతృజాయాం కమండలుమ్.

అని ఆదిపురాణవచనము నుదాహరించి యున్నారు. పరాశరుఁడే కలియుగమున కని చెప్పిన విధిని పూర్వవిరుద్ధముగా నితర యుగమునకన్న వ్యాఖ్యానము గ్రాహ్యము కానేరదు. గనుకను స్మృతికంటె పురాణ మెప్పుడును దుర్బలమయిన దగుటచే నాది పురాణవచనము పరాశరస్మృతిని బాధింపఁజాలదు గనుకను, కలియుగమున స్త్రీపునర్వివాహ మాచరణీయమే యగును. అదిగాక పురాణవచనము "ఊఢాయాః పునరుద్వాహ—" మని సామాన్యముగా వివాహితలకు పునర్వివాహము కలినిషిద్ధ మని చెప్పుచున్నది; పరాశరస్మృతి యన్ననో విశేషముగా నష్టత్వాదులయిన యయిదాపదలయందు మాత్రమే స్త్రీలకు పునర్వివాహమును విధించుచున్నది. కాఁబట్టి స్మృతి పురాణవచనమున కెంతమాత్రమును విరోధముగా నుండక యుత్సర్గాపవాద న్యాయమున నాపత్పంచకమునందు మాత్రము పునరుద్వాహమును సిద్ధాంతీకరించుచున్నది. అందుచేత రెంటికి సమన్వయము చేసినయెడల నష్టత్వాద్యాపత్పంచకమునందు తప్ప నారీపునర్వివాహము కూడదన్న సిద్ధాంత మేర్పడుచున్నది. కలియుగనిషేధ మన్నతోడనే పూర్వయుగములయం దున్నదానిని దేనినో నిషేధింపవలయును గనుక, పయిపురాణవచనము పూర్వ

యుగములయం దున్న పునర్వివాహములను వేసిని నిషేధించుచున్న వని కొందఱు శంక చేయవచ్చును. "వరశ్చే త్కులశీలాభ్యాం" మొదలగు పూర్వోదాహృతి వచనములనుబట్టి వరుఁడు మంచివాఁడు దొరకినపక్షమున వివాహితను మరల మఱియొకని కిచ్చి వివాహము చేయవలయునన్న విధులనుమాత్రమే కలియుగమునందు నయిపురాణ వచనము నిషేధించుచున్నది. ఈ యొక్కవచనముమాత్రమే కాక కలినిషేధములను గూర్చి చెప్పెడి పురాణవచనము లన్నియు నీ ప్రకార ముగానే, యిచ్చిన కన్యను మరల నియ్యఁగూడ దని సామాన్యముగానే చెప్పుచున్నవి.

౨. శ్లో. సముద్రయాత్రా స్వీకారః కమండలు విధారణమ్
ద్విజానా మసవర్ణాసు కన్యాసూపయమ స్తథా.
దేవరాచ్చ సుతోత్పత్తి ర్మధుపర్కే పశోర్వధః
మాంసదానం తథా శ్రాద్ధే వానప్రస్థాశ్రమ స్తథా.
దత్తాయాశ్చైవ కన్యాయాః పునర్దానం వరస్యచ
దీర్ఘకాల బ్రహ్మచర్యం నరమేధాశ్వమేధకౌ.
మహాప్రస్థానగమనం గోమేధశ్చ తథా మఖమ్
ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యానాహుర్మనీషిణః.

బృహన్నారదీయము.

3. శ్లో. దేవరాచ్చ సుతోత్పత్తి ర్దత్తాకన్యా ప్రదీయతే
న యజ్ఞే గోవధం కార్యః కలౌ న చ కమండలుః—క్రతువు.

౪. శ్లో. దీర్ఘకాలం బ్రహ్మచర్యం ధారణశ్చ కమండలోః
దేవరేణ సుతోత్పత్తి ర్దత్తా కన్యా ప్రదీయతే.
కన్యానా మసవర్ణానాం వివాహశ్చ ద్విజాతిభిః
ఆతతాయి ద్విజాగ్ర్యాణాం ధర్మయుద్ధేన హింసనమ్.

వానప్రస్థాశ్రమస్యాపి ప్రవేశో విధిదేశితః
వృత్తస్వాధ్యాయసాపేక్ష మఘసంకోచనం తథా.
ప్రాయశ్చిత్తవిధానంచ విప్రాణాం మరణాంతికమ్
సంసర్గదోష పాపేషు మధుపర్కే పశోర్వధః.
దత్తౌరసేతరేషాస్తు పుత్రత్వేన పరిగ్రహః
శూద్రేషు దాసగోపాల కులమిత్రార్ధసీరిణామ్.
భోజ్యాన్నతా గృహస్థస్య తీర్థసేవాతిదూరతః
బ్రాహ్మణాదిషు శూద్రస్య పక్వతాదిక్రియాపిచ.
భృగ్వగ్ని పతనశ్చైవ వృద్ధాది మరణం తథా
ఏతాని లోకగుప్త్యర్థం కలేరాదౌ మహాత్మభిః
నివర్తితాని విద్వద్భిర్వ్యవస్థాపూర్వకం బుధైః.

ఆదిత్యపురాణము.

ఇట్లు ముదాహరింపఁబడినవానిలో (ఊఢాయాః పునరుద్వాహమ్) వివాహితకు మరల వివాహమని యాదిపురాణములోను, (దత్తాయాశ్చైవ కన్యాయాః పునర్దానం వరస్య చ) దత్తయైన కన్యను వరునకు మరల దానముచేయుట యని బృహన్నారదీయ పురాణము నందును, (దత్తా కన్యా ప్రదీయతే) దత్తయైన కన్య యియ్యఁబడుట యని క్రతువచనమందును, (దత్తా కన్యా ప్రదీయతే) దత్తయగు కన్య యియ్యఁబడుచున్నదని యాదిత్యపురాణమునందును, సామాన్యముగా నొకసారి యియ్యఁబడిన కన్య మరల నియ్యఁబడఁ గూడదని చెప్పఁబడినదే కాని పరాశరస్మృతియందువలె నింకొకదానియందును విశేషాపత్తుల విషయమును చెప్పఁబడి యుండలేదు. స్త్రీపునర్వివాహ విధాయక వాక్యములు సహితము పూర్వోక్తపురాణములవలెనే సామాన్యముగా వివాహితకు మరల వివాహము చేయఁగూడదనియు దానము

చేయఁబడిన కన్యలను మరల దానము చేయఁగూడదనియునే చెప్పు దురు. కాని వారు పరాశరుఁడు చెప్పిన యాపత్సమయములయందు మాత్రము విశేషవిధిచేత స్త్రీపునర్వివాహము కూడునందురు.

ఈ వాదము నటుండనిచ్చి సత్యమెట్లున్నను ప్రతిపక్షులకే సమస్తవిధములు లాభము గలుగఁజేసి స్మృతికంటె పురాణమే బల మయినదనియు విశేషసామాన్యభావము లేదనియు పురాణవచనము లన్నియు విధవావివాహమునే కలియుగమునందు నిషేధించుచున్న వనియు క్షణకాల మంగీకరించినను ఇఁక ముప్పదియొక్కవేల సంవత్స రములవాటికిఁగాని యీనిషేధములకు చెల్లుబడి సేమి కలుగదు. ఎట్లనిన,—

శ్లో. చత్వార్యాహుః సహస్రాణి వర్షాణాంతు కృతం యుగమ్
తస్య తావచ్ఛతీసంధ్యా సంధ్యాంశశ్చ తథావిధః. ౬౯
ఇతరేషు ససంధ్యేషు ససంధ్యాంశేషు చ త్రిషు
ఏకాపాయేన వర్తంతే సహస్రాణి శతాని చ. ౭౦

మనుస్మృతి ప్రథమాధ్యాయమునందలి పయి శ్లోకములవలన కృతయుగ పరిమాణము నాలుగువేల దివ్యసంవత్సరములనియు దానికి సంధ్య నాలుగువందల దివ్యసంవత్సరములును సంధ్యాంశము నాలుగు వందల దివ్యసంవత్సరములు నుండుననియు, తక్కిన యుగములును క్రమముగా సంధ్యాసంధ్యాంశలతోఁగూడ నొక్కవేయిసంవత్సరముల చొప్పునను వందసంవత్సరముల చొప్పునను తక్కువగా నుండు ననియు స్పష్టపడుచున్నది. దీనినిబట్టి చూడఁగా సంధ్యాసంధ్యాంశలు గాక మిగిలియున్న మధ్యకాలమే క్రమముఖ్యయుగమని తేటపడు చున్నది.

శ్లో. కృతం త్రేతా ద్వాపరశ్చ కలిశ్చేతి చతుర్యుగమ్
దివ్యై ర్ద్వాదశభి ర్వర్షైః సావధానం నిరూపితమ్. ౧౮

చత్వారి త్రీణి ద్వే చైకం కృతాదిషు యథాక్రమమ్
సంఖ్యాతాని సహస్రాణి ద్విగుణాని శతాని చ. ౧౯
సంధ్యాసంధ్యాంశయో రంత ర్యత స్సర్గో యతో లయః
తమే వాహు ర్యుగం తద్జ్ఞా యత్ర ధర్మో విధీయతే. ౨౦

శ్రీమద్భాగవతము తృతీయస్కంధము ఏకాదశాధ్యాయము నందలి పయి శ్లోకములనుబట్టి కృత త్రేతా ద్వాపర కలియుగము లన్నియుఁ గలసి పండ్రెండువేల దివ్యసంవత్సరములు కలవనియు, అందు నాలుగువేల యెనిమిదివందల దివ్యసంవత్సరములు కృతయుగ మనియు, మూడువేల యాఱువందల దివ్యసంవత్సరములు త్రేతాయుగ మనియు, రెండువేల నాలుగువందల దివ్యసంవత్సరములు ద్వాపరయుగ మనియు, పండ్రెండువందల దివ్యసంవత్సరములు కలియుగమనియు, యుగాదికాలము సంధ్యయనియు, యుగాంతరకాలము సంధ్యాంశ మనియు, ఆ యా యుగధర్మములు విధింపఁబడెడు కాలము సంధ్యా సంధ్యాంశల నడిమిభాగమగు క్రమమయిన యుగము మాత్రమే యనియు స్పష్టమగుచున్నది. పూర్వోదాహృత మనుస్మృతివచనముల వలనను, "క్రమాత్కృత యుగాదీనాం షష్ఠాంశ స్సంధ్యయో స్స్వకః" ఇత్యాద్యార్యభటసిద్ధాంతవచనమువలనను, కలియుగమునందు నూఱు దివ్యవర్షములు సంధ్యగాను నూఱుదివ్యవర్షములు సంధ్యాంశముగాను నేర్పడుచున్నవి. ఒక దివ్యవర్షమునకు మన సంవత్సరములు మూఁడు వందలయిరువది యగును గనుక కలియుగప్రమాణము ౪,౩౨,౦౦౦ సంవత్సరములలో సంధ్యాకాలము మొదటి ముప్పదియాఱువేలసంవత్సరములుగా నుండును. పయి భాగవతపురాణ ప్రమాణమునుబట్టి పూర్వోక్తములయిన కలినిషిద్ధధర్మములన్నియు కలియుగ మారంభమయిన ముప్పదియాఱువేల సంవత్సరముల కనఁగా నీవలి కించుమిం

చుగా గతించిన యైదువేలసంవత్సరములును గాక యింక ముందు ముప్పదియొక్క వేల సంవత్సరములు దాటిన తరువాతనే వ్యవహారము నకు రావలయును కాఁబట్టి ప్రతిపక్షుల కలినిషేధములును వారి కిప్పు డేవిధమునను సాహాయ్యము చేయఁజాలవు. పూర్వోదాహృతము లయిన భాగవత శ్లోకములలో కడపటిదానికి వ్యాఖ్యానము చేయుచు శ్రీధరాచార్యులవారు,—

"యుగస్యాదౌ సంధ్యా, అంత్యే తు సంధ్యాంశః తయోరంతరం (తయోర్మధ్య ఇత్యర్థః) యుగస్వరూపం వేదితవ్య మిత్యాహుః- సంధ్యాసంధ్యాంశయో ర్విశేషమాహ - యత స్సర్గో యతో లయ ఇతి- తత్రస్యైవ కర్మకృతఫలభోగినాంచ ప్రాణినాం, యతో యత్ర సర్గ ఉత్పత్తిః, సా యుగస్యసంధ్యా - తేషాం, యతో యత్ర లయో నాశః స సంధ్యాంశ ఇతి- తన్మధ్యపతితయుగస్య విశేష మాహ- యత్ర ధర్మో విధీయత ఇతి-యత్ర గవాలంభనాది ధర్మవిశేషో విధీయతే, తద్ జ్ఞాః, తదభిజ్ఞాః, తమేవ యుగమాహుః- సాధారణధర్మస్తు సంధ్యా సంధ్యాంశయో రప్య స్త్యేవ."

అవి గవాలంభనాది కలిపిషేధములు సంధ్యాసంధ్యాంశముల నడిమి భాగమయిన క్రమమయిన యుగమునందు మాత్రమే చెల్లు ననియు సాధారణ ధర్మములే సంధ్యాసంధ్యాంశములలో నడుచు ననియు వివరముగా తెలిపియున్నారు. క్రమమయిన కలియుగము వచ్చిన తరువాత నహితము మనుష్యకృతము లయిన పూర్వోక్త కలి నిషేధవచనములు దేవదత్తములయిన వేదవాక్యములను ఋషి ప్రోక్తము లయిన స్మృతివాక్యములను బాధింపఁజాలవని యీ వఱకే సప్రమాణముగా స్థాపించి యున్నాను. ప్రాచీను లేర్పఱుచుకొన్న కట్టు పాటులే శ్రుతిస్మృతులను బాధింపఁ గలిగిన పక్షమున దేశకాలాను

సారముగా నాకట్టుపాట్లు నిప్పటివారేల మార్చుకొనరాదో నే నూహింపఁజాలకున్నాను.

శ్లో. పరిత్యజే దర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ
ధర్మంచా ప్యసుఖోదర్కం లోకవిక్రుష్ట మేవ చ.

మను, అ-౪, శ్లో. ౧౭౬.

అని మనువే లోకమునకు అసుఖమును బాధకరము నైన ధర్మమును సహితము త్యజింపవలెనని యనుజ్ఞ యిచ్చి యున్నాఁడు గాన పూర్వపు పెద్దలు శాస్త్రానుసారముగానే దేశకాలపాత్రతను విచారించి యట్టి సమయము నేర్పఱచుకొని యున్నారనెడు పక్షమున ఆ మనువచనము పూర్వపువారి కట్టుపాటును మనము మీఱకూడదని విధించుట కనుకూలపడదు. గాని యిప్పటి దేశకాల స్థితినిబట్టి మనము సహితము తగిన మార్పులను చేసికోవచ్చుననియు పూర్వమేదో బాధ సంభవించినందువల్ల తత్కాలానుగుణముగా తొంటి పెద్ద లట్టి కట్టును జేసికొని యుందురనియు తెలిసికొనుటకు మాత్రమే యక్కఱకు వచ్చుచున్నది. శ్రుతి స్మృతి పురాణేతిహాసముల యందింత బలముగా విధింపఁబడిన స్త్రీపునర్వివాహము నిలిచిపోవుటకు కారణమేమయి యుండునో తెలిసికోవలె నని పలువుర కభిలాష యుండవచ్చును. గనుకను, ఆ కారణము నూహించుటకు పూర్వోదాహృతములయిన కలి నిషేధవచనములు కొంత తోడుపడును గనుకను, ఆ విషయమయి నా యభిప్రాయమును సంగ్రహముగా తెలిపెదను.

శ్లో. ఏతాని లోక గుప్త్యర్థం కలే రాదౌ మహాత్మభిః
నివర్తితాని విద్వద్భి ర్వ్యవస్థాపూర్వకం బుధైః.

అను పూర్వోదాహృతమయిన యాదిత్యపురాణవచనమును బట్టి పయి కలినిషేధములన్నియు లోకరక్షణార్థమయి కలియుగాది

యందు మహాత్ములును విద్వాంసులు నగు పెద్దలచేత వ్యవస్థాపూర్వకముగా నివర్తింపఁబడినట్లు స్పష్టమగుచున్నది. ద్వాపరాంతము వఱకును స్త్రీపునర్వివాహము లవిచ్ఛిన్నముగా నడుచుచు వచ్చెననుటకర్జునుఁడు విధవయైన యులూపిని పరిణయ మగుటయే చాలినంత నిదర్శనముగా నుండును. ద్వాపరాంతమువఱకును జరిగిన వివాహముల నంత శీఘ్రముగా కలియుగాదియందే నిలుపుటకు తగినంత దేశోపద్రవ మప్పు డేది కలిగినదని విచారింపఁగా, ఆ యుపద్రవము భారతయుద్ధముగాఁ గనఁబడుచున్నది. భారతయుద్ధమునందు హిందూదేశమునందుఁగల రాజులందఱును తమ సైన్యములతో నేదో యొక కక్షిని జేరి యుద్ధము చేసినట్లును, పదునెనిమిదక్షౌహిణుల బలము నాశము చెందినట్లును, భారతమును జదివినవారి కందఱికిని తెలిసి యుండును. కౌరవ పక్షమున సేనాధిపతులుగా నుండిన ద్రోణకృపాశ్వత్థామలను బట్టి యుభయసైనికులలోను పలువురు బ్రాహ్మణులు సహిత ముండి యుందురు. యుద్ధము చేసెడివారు బాలురును వృద్ధులునుగా నుండక సాధారణముగా వయస్సులో నున్నవారుగానే యుందురు గనుకను, అన్ని జాతులలోను లక్షలకొలఁది జనులు రణనిహతు లయిరి గనుకను, అన్ని జాతులలోను లక్షలకొలఁది వయస్సులో నున్న స్త్రీలు నేకకాలమునందు విధవలయి యుందురు. అందఱు పురుషులు ఏకకాలమునందు మృతులయి యుండుటచేత హిందూదేశమునం దా కాలమునందు పురుషులసంఖ్య యత్యల్పముగాను, స్త్రీలసంఖ్య యత్యధికముగాను ఉండెననుటకు లేశమయినను సందేహ ముండదు. అందుచేత నా కాలమునందు స్త్రీలకందఱకును వివాహమగుట సంభవింపనేరదు గనుకను హిందువు లితరదేశములవారితో సంబంధములు చేయువారు కారు గనుకను అప్పుడు కొందఱికి మాత్రమే వివాహమగుటకుఁ దగిన

యేర్పాటు చేసికోవలసి వచ్చినది. అందునిమిత్తమయి పెద్దలందఱును సభచేరి ధర్మబుద్ధిచేత విచారించి వివాహితలయి కొంతకాలము కాకపోయినఁ గొంతకాలమయినను వివాహసుఖ మనుభవించినవారికి మాత్రము పునర్వివాహములు లేకుండఁజేసి, కన్యలకు మాత్రమే వివాహములగునట్లు స్త్రీలోక రక్షణార్థముగా నియమము నొకదానిని జేసిరి. అట్టి కట్టుపాటప్పుడు చేయకపోయిన పక్షమున, పురుషులు సాధారణముగా సద్యఃకాలమున కక్కఱకువచ్చెడు మితిమీఱియున్న యనాథలయిన యువతులనే వివాహము చేసికొందురు గనుకను, ఎప్పుడో యెదిగి కాపురమునకురాఁగల బాలికలను వివాహమాడ వాంఛింపరు గనుకను, కన్యలకు వివాహములుకాక వ్యభిచారాదిదోషములు ప్రబలును. అట్టి బాధకములను నివారించుటకై కొంతకాలము సౌఖ్యపడి తృప్తినొందియున్న వారికి వ్యభిచారాదులకు దిగకుండుటకు శక్యమగును గనుక వారికి వివాహమును మాన్పి కన్యలకే మన పెద్ద లప్పటికి వివాహముల నేర్పఱచిరి; వా రప్పుడంతకన్న చేయవలసిన కార్య మేదియు లేదు. కొంతకాలము సౌఖ్య మనుభవించిన ముప్పది యేండ్ల యువతి యొకతెయు, పండ్రెండేండ్ల బాలిక యొకతెయు వివాహమునకుండి, పురుషుఁ డొక్కఁడుమాత్రమే దొరకెడు పక్షమున వివేకముగలవాఁ డెవ్వఁడైనను వయసుమీఱిన దాని నట్టేయుంచి కన్నియకు వివాహము చేయింపక మానఁడుగదా! ఆ ప్రకారము చేసి యిప్పటి పెద్దలు పురుషు లేవిధముగా మనదేశమును విడువకుందురో, వ్యర్థులుగాక యేవిధముగా వివాహమున కక్కఱకు వత్తురో, యాయావిధములఁ జేయఁదగిన ప్రయత్నములను కట్టుపాటులను అన్నిటినిఁ జేసియున్నారు. వారప్పుడు పునర్వివాహములను మాన్పుటయేకాక, సముద్రయాత్రను, సన్న్యాసమును, వానప్రస్థాశ్రమమును,

దీర్ఘకాల బ్రహ్మచర్యమును, నరమేధమును, మహాప్రస్థానగమనమును, ఆతతాయిద్విజులధర్మ్యయుద్ధహింసనమును, మరణాంతికప్రాయోపవేశమును, అతిదూరగతీర్థసేవనమును, భృగ్వగ్నిపతనమును, వృద్ధాదిమరణమును గూడ నిషేధించియున్నారు. వారప్పుడంతకంటె మఱియేమి చేయఁగలుగుదురు? ఆ కాలమున కాకట్టుపాటు సరిపడియే యుండినది. ఇప్పుడటువంటి యావశ్యకము మన దేశమున లేదు కనుకను, స్త్రీపునర్వివాహము లేకపోవుటవలన మన దేశమున ననేకానర్థములు కలుగుచున్నవి గనుకను, లోకరక్షణార్థమయి జీర్ణమయిపోయిన ధర్మము నవశ్యకముగా పునరుద్ధారణము చేయువలయుట వివేకశాలులయి దేశాభిమానము గలవారి కందఱికిని పరమధర్మము. పయి మనువచనమును బట్టియు, కలియుగాదిని పెద్దలేర్పఱిచిన కట్టుపాటులను బట్టియు, కాలానుగుణముగా స్మృత్యుక్తధర్మములను సహితము విద్వాంసులు సభచేసి మార్పఁగూడ వచ్చునని యేర్పడుచుండఁగా జీర్ణమయిపోయిన ధర్మమును లోకరక్షణార్థము పునరుద్ధారణము చేయుటకు మనమేల సందేహపడవలెను? పూర్వులు నిషేధించిన సన్న్యాసము మొదలయిన వానిని కొందఱు పునరుద్ధారణము చేయుటకూడ దేశకాలానుసారముగా నిషేధించినవానిలో నేదైనను పునరుద్ధారణము చేసికొనవలెనని బోధించుచుండలేదా?

శ్లో. యత్కర్మ కుర్వతోఽస్య స్యాత్ పరితోషోఽన్తరాత్మనః
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతంతు వర్జయేత్.

మను. అ. ౪, ౧౬౧

అను మనువచనమును మూలమాత్రమునుగాఁ గైకొని పామరుల మాటలను వినక యేపని మీ యంతరాత్మకు సంతోషము కలిగించునో యా పనినే లోకోపకారముగాఁ జేయఁజూడుఁడు. ఇన్ని

విధముల శాస్త్రము స్త్రీపునర్వివాహ మాచరణీయమని బోధించు చున్నను, అది లేకపోవుటవలన లోకములో ననంతములైన నష్టములు కనఁబడుచున్నను, జనులను ఈ సత్కార్యమునుండి విముఖులనుగాఁ జేయునది యొక్క యాచారపిశాచముగాఁ గనఁబడుచున్నది.

శ్లో. స్మృతి వేదవిరోధేతు పరిత్యాగో యథా భవేత్
తథైవ లౌకికం వాక్యం స్మృతిబాధే పరిత్యజేత్.

వేదవిరుద్ధముగా నున్నప్పుడు స్మృతి యేలాగున పరిత్యాజ్యమో స్మృతివిరోధమయిన యాచారము సహిత మాలాగుననే పరిత్యాజ్యమగును గాన పరాశరస్మృతికి విరుద్ధమయిన యీ యాచార మవశ్యముగా విడిచిపెట్టవలసి యున్నది. శ్రుతిస్మృతులను మీఱి వర్తించువారు శిష్టులుకారు గనుకను, వారి యాచారము సదాచారము కాదు గనుకను శిష్టాచారము ప్రమాణమన్నమాట యీ విషయమున వర్తింపదు.

## దాయాది నిర్ణయ ప్రమాణములు

పైని జెప్పిన దంతయు విని నిజముగా స్త్రీ పునర్వివాహము శాస్త్రసమ్మతమే యయిన యెడల, పునర్వివాహితల పుత్రులకు దాయ మెక్కడఁ జెప్పఁబడెనయు, పునర్వివాహమునకు మంత్రము లెక్కడ నున్నవనియు, లెండికి మరల కన్యాదానము చేయుటకు స్వత్వ మెట్లు కలుగునియు, జాతాశౌచ మృతాశౌచములకు విధు లెక్కడ నున్నవనియు, పూర్వభర్తయొక్క శ్రాద్ధ మెవ్వరు పెట్టవల యుననియు, పునర్వివాహమున కన్యను సగోత్రమున దానము చేయవలయుననియు, వివాహము జరిగిన స్త్రీగతి యేమికావలయు ననియు, ప్రతిపక్షులు ప్రశ్న చేయువచ్చును. కాఁబట్టి యీ యంశముల కన్నిటికిని సంగ్రహముగా సమాధానములు చెప్పెదను.

౧. దాయము. —పరాశరస్మృతినిబట్టి స్త్రీ పునర్వివాహము వలనఁ బుట్టిన పుత్రులు ఈ యుగమున ఔరసులే యగుదురు గాన వారికి మొదటి భార్యవలనఁ గలిగిన పుత్రులకు వలెనే దాయము వచ్చును. పూర్వయుగములయందు సహితము పౌనర్భవులకు దాయము సమస్త స్మృతులయందును జెప్పఁబడి యున్నది.

శ్లో. ఔరసః పుత్రికాపుత్రః క్షేత్రజో గూఢజ స్తథా
కానీనః పంచమప్రోక్త ష్షష్ఠః పౌనర్భవః స్మృతః.
దత్తః క్రీతః కృత్రిమశ్చ స్వయందత్త ఇతీరితః
సహోఢ జోపవిద్ధశ్చ పుత్రా ద్వాదశ కీర్తితాః.

* * * *

పిండ దోంశ హర శ్చైషాం పూర్వాభావే పరఃపరః
యాజ్ఞవల్క్యస్మృతి.

అని యాజ్ఞవల్క్యుఁడు ద్వాదశవిధ పుత్రులను జెప్పి వారు వరుసగా నొకరి యభావమునం దొకరు తండ్రికి పరక్రియలు జరపి శ్రాద్ధము పెట్టుటకును, దాయమును పొందుటకును నర్హులని నిర్ణయించియున్నాఁడు; అంతేకాక యతఁడు పౌనర్భవుని దత్తపుత్రుని కంటె ముఖ్యునిగాఁగూడ నేర్పఱిచి యున్నాఁడు.

శ్లో. ద్వౌతు యౌ వివదేయాతాం ద్వాభ్యాం జాతౌ స్త్రియా ధనే
తయో ర్యద్యస్య పిత్ర్యం స్యా త్తత్సగృహ్ణీత నేతరః.
మనుస్మృతి, అ ౯.

ఇద్దఱు తండ్రులవలన నొక్క స్త్రీయందుఁ గలిగిన పుత్రులు తమ తల్లియొద్ద నున్న ధనము నిమిత్తము వివాదపడెడు పక్షమున, ఎవని తండ్రిసొత్తును వాఁడు పొందవలయునే కాని యితరమును పొందఁ గూడదు అని మనువు చెప్పియున్నాఁడు.

శ్లో. అనేక పితృకాణాం చ పితృతో భాగకల్పనా
యస్య యత్ పైతృకం రిక్థం స తద్గృహ్ణీత నేతరః.

విష్ణుస్మృతి.

అను విష్ణువచనమునుబట్టి స్త్రీకి మొదటిభర్తవలనను రెండవ భర్తవలనను గూడ సంతాన మున్నయెడల వారు తండ్రులనుబట్టి భాగము పంచుకోవలసినవా రగుదురు.

౨. మంత్రములు:— పురుషులకువలెనే స్త్రీలకును మొదటి మంత్రములే ద్వితీయవివాహమునకును పనికివచ్చును. తొమ్మిదిసంవత్సరములదానికిఁగాని పండ్రెండు సంవత్సరములదానికిఁగాని వివాహము చేయునప్పుడు మంత్రములయందలి "కన్యామ్" అను పదమును "రోహిణీమ్" అనికాని, "రజస్వలామ్" అనికాని మార్చనట్లే స్త్రీపునర్వివాహమునందును మంత్రములను మార్చవలసిన యావశ్యకము లేదు. పూర్వోదాహృతమయిన "విధవా యా భవేత్కన్యా" మొదలయిన స్మృతివచనములను బట్టి విధవకు సహితము కన్యాశబ్ద వ్యవహారము కలదు గాన ద్వితీయ వివాహమునందును పూర్వమంత్రములే నిరాక్షేపముగా నుపయోగింపఁబడవచ్చును. ఒకపక్షమున మొదటి మంత్రములు ఒక్క పురుషుల విషయమున మాత్రమే పనికిరావని చెప్పవచ్చును. దానవాక్యములో "స్నాతకాయ కన్యార్థినే తుభ్యమహం సంప్రదదే" యని కన్యను గోరెడు స్నాతకుఁడవైన నీకు నేను కన్య నిచ్చుచున్నానని యుండుటవలనను ద్వితీయవివాహము చేసికొనువాఁడు స్నాతకుఁడెన్నఁడును కానేరఁడు గనుకను, విధుర విషయమున దాన వాక్యమెట్లుపయోగించును?

శ్లో. అవిప్లుత బ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియ ముద్వహేత్
అనన్య పూర్వికాం కాంతా మసపిండా మవీయసీమ్.

అను యాజ్ఞవల్క్య వచనమునుబట్టి బ్రహ్మచారి లక్షణవంతు రాలును, పరపూర్వ కానిదియు, మనోహరురాలును, అసపిండురాలును వయస్సుచే చిన్నదియు నగు స్త్రీని వివాహమాడవలయునని విధి యగుటవలన, యనన్యపూర్వికే యనుటచే వివాహితకు మరల వివాహము కూడదనియు శంకింపవచ్చును. యాజ్ఞవల్క్యుడు స్త్రీవిషయమున "అనన్యపూర్వికే" యన్నట్లే పురుషవిషయమున "అవిప్లుత బ్రహ్మచర్య" యని కూడఁ జెప్పియున్నాడు. ఈ ప్రకారముగా నే బోధాయనులు "శ్రుతిశీలినే విజ్ఞాయ బ్రహ్మచారిణే౽ర్థినే దేయా" యని వేదాభ్యాసకుడును, సదాచారసంపన్నుడును, బ్రహ్మచారియు నైన వరునకు కన్య నియ్యవలయునని యే చెప్పియున్నాడు. వీని యవయవార్థమునే మనము పుచ్చుకొన్నయెడల పురుషులలో సహితము బ్రహ్మచారులకు తప్ప మఱియెవ్వరికిని వివాహము కాకపోవలసి యుండును. ఈ సామాన్యవిధుల కపవాదములుగా స్త్రీలకువలెనే పురుషులకును పునర్వివాహవిషయమున విశేషవిధు లనేకములు కనఁబడు చున్నందున, కన్యావరు లట్టి లక్షణములు కలవారగుట ప్రశస్తమనియే కాని విధియని యేర్పడదు. అంతేకాక,—

శ్లో. పతిం హిత్వాపకృష్టం స్వముత్కృష్టం యా నిషేవతే
నింద్యైవ సా భవే ల్లోకే పరపూర్వేతి చోచ్యతే.

అను మనువచనమువలన హీనుఁడగు పతిని విడిచిపెట్టి ఘనుఁ డగువానిం జేరినదే పరపూర్వ యగును గాన, అట్టిదానిని వివాహమాడఁగూడదనియైనను "అనన్య పూర్వికా" శబ్దముచేత నర్థము చేయవచ్చును.

3. కన్యాదాత:—ప్రథమ వివాహమునందు వలెనే ద్వితీయ వివాహమునందును కన్యాదాతలు తండ్రి మొదలగువారే.

శ్లో. పితా దద్యా త్స్వయం కన్యాం భ్రాతా వానుమతే పితుః
మాతామహో మాతులశ్చ సకుల్యో బాంధవ స్తథా.
మాతాత్వభావే సర్వేషాం ప్రకృతౌ యదివర్తతే
తస్యా మప్రకృతిస్థాయాం కన్యాం దద్యు స్స్వజాతయః.

నారదసంహిత.

అని నారదుఁడు ప్రథమ ద్వితీయ వివాహవివేచనము చేయక సామాన్యముగా కన్యను దానము చేయవలసినవారు తండ్రి మొదలు కొని స్వజాతివారు వఱకును జెప్పియున్నాఁడు. కాఁబట్టి పునర్వివాహము నందు కన్యను పునర్దానము చేయవలసినవారు తండ్రి మొదలగువారనుటకే యాక్షేపమును లేదు. పూర్వము దివోదాసుఁడు తన కొమారైయైన దివ్యాదేవిని, ఐరావతుఁడు తన కూఁతురైన యులూపిని, పునర్దానము చేసినట్లు వెనుక నుదాహరించిన పురాణవచనములవలనఁ గూడ స్పష్టమగుచున్నది. ఇఁకమీఁద నొకసారి యిచ్చివేసిన కన్యను మరల నిచ్చుటకు తండ్రి మొదలగువారికి స్వత్వ మెక్కడనుండి వచ్చునని సందేహము తోచవచ్చును. స్త్రీ పునర్వివాహమునకు విధు లెప్పు డున్నవో యప్పుడే పునర్దానము శాస్త్రవిహిత మగును గనుక, అట్టి సందేహమున కవకాశమే లేదు. కన్యాదానము వధూవరు లిద్దఱును యావజ్జీవము పరస్పర సౌఖ్యము నిమిత్తమును ధర్మప్రజోత్పత్త్యర్థమును కలిసి యుండుటకయి యేర్పడిన వివాహసంబంధము యొక్క పూర్వాంగమే కాని దాత కన్యయెడలఁ గల తన సత్వమును పూర్ణముగా వదలుకొని యన్యునకు స్వత్వము కలుగఁజేయుట కాదు. అట్లు కానియెడల పూర్వోక్త నారదవచన ప్రకారముగా, కన్యక విషయమున బొత్తిగా స్వత్వము లేని స్వజాతివారు సహితము కన్యను దానము చేయుట కెట్లర్హు లగుదురు? తక్కిన సమస్త దానములయందును "సంప్రదాన

దే న మమ" ఈవస్తువు 'నీ కిచ్చుచున్నాను; ఇఁక నాది కాదు' అని యుండి కన్యాదానమునందు మాత్రము 'న మమ' 'నాది కాదు' అను మాట యుండఁగూడదని విధులుండుటయు, కన్యాదాన మాత్రముననే మగని యధీనురాలుగాక యుక్తవయస్సు వచ్చుపర్యంతము జనకుని యింటనే యుండవలయుటయు, దానమాత్రము చేతనే పుత్రికాత్వము పోక జనకుని సొత్తునకు పుత్రికయు నామె పుత్రులును కర్త లగుటయు, విధవకు పరాశరుఁడు పితృగృహ నివాసమే విధించుటయు, మహిత విషయమయిన స్వామ్యము తండ్రికి కన్యాదానమాత్రమున పోవనుటకు చాలిన నిదర్శనములుగా నుండవచ్చును. అట్లు కాదేని, స్త్రీ పునర్వివాహమును విధించెడి శ్రుతిస్మృతిపురాణ వచనములన్నియు నిష్ప్రయోజనములు కావలసివచ్చును.

ర. జాతాశౌచ మృతాశౌచములు:— తల్లి విషయమున కొమాళ్ళు కాని, భార్యవిషయమున భర్త కాని, పట్టవలసిన సూతకాదులనుగూర్చి యిప్పుడు సందేహమేదియు లేదు. ఆవిషయమున సామాన్యవిధులే పట్టవచ్చును. ఇఁక నొకస్త్రీకి పూర్వభర్తవలనను పరభర్త వలననుగూడ సంతానాదికము కలిగినయెడల వారిలో వారికి మాత్రము సూతకాదులు నిర్ణయింపవలసి యుండును.

శ్లో. మాతృకయా ద్విపితృకౌ భ్రాతరా వన్యగోత్రజౌ
ఏకాహం సూతకే తత్ర త్రిరాత్రం మృతకే తయోః.

మరీచి స్మృతి.

అను మాధవాచార్య ధృతమయిన మరీచివచనము ఒక తల్లి యందిద్దఱు తండ్రులవలనఁ బుట్టిన వేఱువేఱు గోత్రములుగల సోదరుల విషయమయి యన్యోన్యము పురుడు ఒక్క దినమేయనియు, మృతాశౌచము మూఁడుదినములనియు విధించుచున్నది. వా రేకగోత్రజు

లయిన పక్షమున ఆశౌచము పదిదినము లన్నమాట వేఱుగ చెప్పనక్కఱయే లేదు.

౫. పూర్వభర్తృశ్రాద్ధము:— పునర్వివాహిత ప్రథమ భర్త వలన సంతానముకలది యైనప్పుడు అతని శ్రాద్ధవిషయమయి సందేహమే లేదు.

శ్లో. అపుత్రా శయనం భర్తుః పాలయంతీ వ్రతే స్థితా
పత్న్యేవ దద్యాత్తత్పిండం కృత్స్నమంశం లభేతచ —మనువు

అను విజ్ఞానేశ్వరధృత వృద్ధమను వచనము వలన అపుత్రవంతురాలు భర్తృశయన పరిపాలనము చేయుచు, బ్రహ్మచర్య వ్రతమునం దున్నయెడలనే భర్తకు పిండప్రదానముచేసి భాగమును స్వీకరింపవలయునని విధించుటచేత, స్త్రీ బ్రహ్మచర్యవ్రతమును మాని వివాహమాడినయెడల శ్రాద్ధము పెట్టనక్కఱ లేదని స్పష్టమగుచున్నది. స్త్రీ పునర్వివాహమువలన మఱియొక గోత్రమునకు మాఱును గనుకను, మొదటిభర్త కుటుంబముతోడి సంబంధమును పూర్ణముగా వదులుకొని యాశ్రమాంతరమును స్వీకరించును గనుకను, పూర్వ భర్తయొక్క శ్రాద్ధాదులు పెట్టకుండుట న్యాయమే. పురుషుఁడు సహితము దత్తుఁడై యన్య గోత్రమునకు మాఱినప్పుడును తన కుటుంబముతోడి సంబంధమును వదులుకొని సన్యాసాశ్రమమును స్వీకరించినప్పుడును జనకుని యొక్క శ్రాద్ధమునే పరిత్యజించునుగదా?

౬. గోత్రము— కన్యాదానము తండ్రిగోత్రముననే యవశ్యముగా జరగవలయును. గోత్రశబ్దార్థమును కొంచెము విచారించిన పక్షమున సందేహమే కలుగకపోవును.

శ్లో. జమదగ్ని ర్భరద్వాజో విశ్వామిత్రాఽత్రి గౌతమాః
వశిష్ఠ కాశ్యపాఽగస్త్యా మునయో గోత్రకారిణః.
ఏతేషాం యాన్యపత్యాని తాని గోత్రాణి మన్యతే.

జమదగ్ని, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, అత్రి, గౌతముఁడు, వశిష్ఠుఁడు, కాశ్యపుఁడు, అగస్త్యుఁడు, గోత్రకర్తలనియు, వీరిలో నెవరి గోత్రమునఁ బుట్టినవారు వారిగోత్రము కలవారగుదురనియు పై స్మృతివచనములు బోధించుచున్నవి. ఇందువలన తండ్రి గోత్రమే కొమార్తెదియు నగుననుట నిస్సందేహముకదా ?

శ్లో. స్వగోత్రాద్భ్రశ్యతే నారీ వివాహాత్సప్తమే పదే
పతిగోత్రేణ కర్తవ్యా తస్యాః పిండోదక క్రియా.

అను లఘుహారీత వచనమునుబట్టి స్త్రీ వివాహమువలన సప్తపది యందు తన గోత్రమును పోగొట్టుకొనుననియు, పతిగోత్రముచేత నామె పిండోదకక్రియలు చేయవలయుననియు, కనబడుచున్నది. ఇందలి పూర్వార్థముచేతనే స్వగోత్రము మారుననని కనఁబడు చుండఁగా మరల ఉత్తరార్థముచేత నామె పిండోదకక్రియలు పతి గోత్రమున చేయవలయునని చెప్పుటచేత కర్మలు చేయునప్పుడు భర్తృగోత్రమున చేయవలసినను తనగోత్రమునుకూడ నామె కలిగి యుండుననియే యూహింపఁదగియున్నది.

శ్లో. సంస్కృతాయాం తు భార్యాయాం సపిండీకరణాంతికం
పైతృకం భజతే గోత్ర మూర్ధ్వంతు పతిపైతృకమ్.

అను కాత్యాయన వచనమువలన కర్మలు పతిగోత్రమునే యుపయోగించినను, వివాహితయైన స్త్రీ తన సపిండీకరణమువఱకును తన పితృగోత్రమునే ధరించుననియును, అటుపిమ్మట పూర్ణముగా భర్తృగోత్రమును పొందుననియు స్పష్టమగుచున్నది. ఇందుచేతనే వివాహిత స్త్రీ తనతండ్రికి గయాశ్రాద్ధాదులుచేయుట కర్హురాలగుచున్నది.

శ్లో. అముష్య పౌత్రీం చాముష్య పుత్రీం చాముష్య గోత్రజాం
ఇమాం కన్యాం వరాయాస్మై వయం తద్వృణీమహే
శ్రుణుధ్వ మితి వై బ్రూయా దసౌ కన్యాప్రదాయకః.

అనుటవలన కన్యాప్రదాత ఫలానివాని పౌత్రియు, ఫలానివాని పుత్రియు, ఫలానివాని గోత్రమునం బుట్టినదియును, అగు నీకన్యను ఈ వరున కిచ్చుచున్నానని యందఱి ముందఱ నుపలుకవలసినట్టు కనంబడుచున్నది. ఒకసారి వివాహమాడిన మాత్రమున స్త్రీ తన పితామహునకు పౌత్రియు జనకునకు పుత్రికయుఁ గోత్రమునఁ బుట్టినదియు కాకపోదు గనుక,-

శ్లో. వరగోత్రం సముచ్చార్య ప్రపితామహ పూర్వకమ్
నామసంకీర్తయే ద్విద్వాన్ కన్యాయా శ్చైవ మేవ హి.

ప్రపితామహపూర్వకముగా వరగోత్రము నుచ్చరించి నామమును ప్రకటించి యద్దే ప్రకారముగా కన్యయొక్క గోత్రనామములను జెప్పవలసిన వివాహమంత్రములయందు కన్యయొక్క పితృగోత్రము తప్ప మఱియొక్కగోత్రము నుచ్చరించుటకు మంత్రములను బట్టియే యవకాశము లేదు. కాఁబట్టి కన్య యవశ్యముగా పితృగోత్రముతోనే పుర్దానము చేయఁబడవలయును.

౭. ముండనము — "మృతభర్తృకను మగఁడుపోయిన పదవ దినమున శిరోముండనము చేయవలయునుగదా? పునర్వివాహమును చేసికొనెడి స్త్రీకి అట్టిపనిని చేయఁగూడదని యెక్కడనైన విధి యున్నదా" యని కొందఱడుగవచ్చును. స్త్రీకి పదవదినమున తల గొరిగించుట లౌకికమేకాని స్మృతిసమ్మతము కాదు; అట్టి ముండనమును విధించు మంత్రము లెక్కడను కనఁబడవు. స్త్రీలకు కేశవపనము లేదని పెక్కుస్మృతులు ఐకకంఠ్యముగా ఘోషించుచున్నవి. పరాశరుఁడును,-

శ్లో. సర్వాన్ కేశాన్ సముద్ధృత్య ఛేద యే దంగుళద్వయమ్
ఏవం నారీ కుమారీణాం శిరసో ముండనం స్మృతమ్.

న స్త్రియాగ కేశవపనమ్ న దూరే శయనాసనమ్
న చ గోష్ఠే వసేద్రాత్రౌ న దివాగా అనువ్రజేత్
నదీషు సంగమేచ్చైవ అరణ్యేషు విశేషతః
న స్త్రీణా మజినం వాసో వ్రతమేవ సమాచరేత్.

అని తొమ్మిదవ యధ్యాయమున స్త్రీలకుఁగాని బాలికలకుఁ గాని యెక్కడనైనను ముండనము విధించిన పక్షమున కేశముల నన్నిటిని వదలివేసి చివర రెండంగుళములు మాత్రము ఖండింపవలయు ననియు, బ్రహ్మచర్యాది వ్రతములయందు స్త్రీల కెప్పుడును కేశవప నము లేదనియు స్పష్టపఱిచి యున్నాఁడు. ఈ పైని వ్రాసిన దానివలన ప్రతిపక్షులు సాధారణముగాఁ జేయు ముఖ్యమయిన యాక్షేపణల కన్నిటికిని సంగ్రహముగా సమాధానములు వచ్చినవని తలఁచెదను.

## పౌనర్భవ విచారము

కొందఱు చెప్పిన దంతయు నొప్పుకొని స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమే కాని ద్వితీయవివాహము చేసికొన్నవారును తత్సం తతివారును ప్రథమవివాహితలకంటెను తత్సంతతివారికంటెను తక్కు వవారనియు, వారు అపాంక్తేయులును, హవ్యకవ్యముల కనికి రానివారు ననియు; వారు ప్రత్యేకజాతిగా నుండఁదగినవారనియు వాదించుచు తెలియనివారిని భ్రమింపఁజేయుదురు. అట్టివారు చూపెడు ప్రమాణములను గూర్చి కొంత విమర్శింతము.

## మనుస్మృతి, తృతీయాధ్యాయము

శ్లో. చికిత్సకాన్ దేవలకాన్ మాంసవిక్రయిణ స్తథా
విపణేన చ జీవంతో వర్జ్యా స్స్యు ర్హవ్యకవ్యయోః. ౧౫౨
ప్రేష్యో గ్రామస్య రాజ్ఞశ్చ కునఖీ శ్యావదంతకః
ప్రతిరోద్ధా గురోశ్చైవ త్యక్తాగ్ని ర్వార్ధుషిక స్తథా. ౧౫౩

యక్ష్మీచ పశుపాలశ్చ పరివేత్తా నిరాకృతిః
బ్రహ్మద్విట్ పరివిత్తిశ్చ గణాభ్యంతర ఏవ చ. ౧౫౪
కుశీలవోఽవకీర్ణీ చ వృషలీపతి రేవ చ
పౌనర్భవశ్చ కాణశ్చ యస్య చోపపతి ర్గృహే. ౧౫౫
భృతకాధ్యాపకో యశ్చ భృతకాధ్యాపిత స్తథా
శూద్రశిష్యో గురుశ్చైవ వాగ్దుష్టః కుండగోళకౌ. ౧౫౬
అకారణపరిత్యక్తా మాతాపిత్రో ర్గురో స్తథా
బ్రాహ్మై ర్యౌనైశ్చ సంబంధై స్సంయోగం పతితై ర్గతః. ౧౫౭
అగారదాహీ గరదః కుండాశీ సోమవిక్రయీ
సముద్రయాయీ వందీచ తైలికః కూటకారకః. ౧౫౮
పిత్రా వివదమానశ్చ కితవో మద్యప స్తథా
పాపరోగ్యఽభిశ స్తశ్చ దాంభికో రసవిక్రయీ. ౧౫౯
ధనుశ్శరాణాం కర్తాచ యశ్చాగ్రే దిధిషూపతిః
మిత్రధ్రు గ్ద్యూతవృత్తిశ్చ పుత్రాచార్య స్తథైవ చ. ౧౬౦
భ్రామరీ గండమాలీచ శ్విత్ర్యథో పిశున స్తథా
ఉన్మత్తోఽంధశ్చ వర్జ్యాః స్యు ర్వేదనిందక ఏవ చ. ౧౬౧
హస్తిగోఽశ్వోష్ట్రదమకో నక్షత్రై ర్యశ్చ జీవతి
పక్షిణాం పోషకో యశ్చ యుద్ధాచార్య స్తథైవ చ. ౧౬౨
స్రోతసాం భేదకో యశ్చ తేషాం చావరణేరతః
గృహసంవేశకో దూతో వృక్షారోపక ఏవ చ. ౧౬౩
శ్వక్రీడీ శ్యేనజీవీ చ కన్యాదూషక ఏవ చ
హింస్రో వృషలవృత్తిశ్చ గణానాం చైవ యాజకః. ౧౬౪
ఆచారహీనః క్లీబశ్చ నిత్యం యాచనక స్తథా
కృషిజీవీ శ్లీపదీచ సద్భిర్నిందిత ఏవ చ. ౧౬౫

ఔరభ్రికో మాహిషికః పరపూర్వాపతి స్తథా
ప్రేతనిర్యాతకశ్చైవ వర్జనీయాః ప్రయత్నతః. ౧౬౬

ఏతాన్ విగర్హితాచారా నపాంక్తేయాన్ ద్విజాధమాన్
ద్విజాతిప్రవరో విద్వా నుభయత్ర వివర్జయేత్. ౧౬౭

ఆయాస్మృతులు ప్రత్యేకముగా పునర్భువు నేప్రకారముగా నిర్వచించి పునర్భువులను పునర్భూపుత్రులను ఎట్టివారినిగాఁ జెప్పినవో యాసంగతి నించుకయు విచారింపక, పునర్భూలక్షణ మొకస్మృతినుండియు తద్దూషణము మఱియొక స్మృతినుండియు పుచ్చుకొని మనసువచ్చినట్లుగా నొకదానితో నొకటి కలిపి పాడుచేయుటవలన నీ యసందర్భార్థము పొసగినదే కాని దేనికది ప్రత్యేకముగా విమర్శించినపక్షమున విధివిహితముగా పునర్వివాహము చేసికొన్నవారు పునర్భువులే కారనియు, ఒకవేళ పునర్భూనామము వారికిఁగూడ కలిగినను వారు నింద్యులైన నిషిద్ధ పునర్భూజాతిలోఁ జేరరనియు, నిరుమములోఁ స్పష్టము కాఁగలదు. "ఋషీణాం మతయశ్చ భిన్నాః" అనియుండుటచే తక్కిన పెక్కువిషయములయందువలెనే పునర్భూనిర్ణయమునందును స్మృతికర్తలు భిన్నాభిప్రాయము కలవారుగానే యున్నను, అన్నిఁటిని సమన్వయము చేసెడి పక్షమున విధ్యుక్తవివాహమాడిన పునర్భువు లెంతమాత్రమును దూష్యులు కారనియే సిద్ధాంతమేర్పడును.

౧. శ్లో. సప్తపౌనర్భవాః కన్యా వర్జనీయాః కులాధమాః
వాచాదత్తా మనోదత్తా కృతకౌతుకమంగళా.
ఉదకస్పర్శితా యా చ యా చ పాణిగృహీతికా
అగ్నిం పరిగతా యా చ పునర్భూ ప్రభవా చ యా.
ఇత్యేతాః కాశ్యపే నోక్తా దహన్తి కుల మగ్నివత్.-కాశ్యపస్మృతి.

అని కశ్యపుఁడు వాగ్దత్తలను, మనోదత్తలను, మంగళస్నానాదికము చేసినవారిని, ఉదకస్పర్శితలను, పాణిగృహీతకలను, అగ్నిప్రదక్షిణము చేసినవారిని, పునర్భూప్రభవలను, ఏకవిధముగా నీ యేడుగురను పునర్భువులనుగాఁ జెప్పి వారు కులము నగ్నిహోత్రమువలె కాల్చివేయుదురని దూషించియున్నాఁడు. దీని యవయవార్థమునే మనము పుచ్చుకొని ప్రవర్తింతుమేని, ఇంచుమించుగా లోకములోని కన్నియ లందఱును పునర్భువులే యయి దూష్యురాండ్రు కావలసి వచ్చును. ఎల్లవారికిని తమకూఁతులను మొదట మనసులో నొకరికియ్యవలె ననుకొనియు, వారి కిచ్చెదమని నోటితో చెప్పియు, మంచి వరుఁడు లభించిన యెడల తమ యుద్దేశమును మార్చుకొనుట సహజమయి యుండును. అంతేకాక పయిని జెప్పఁబడినవారిలో మొదటి యెదు తెగలవారికిని మనమిప్పుడు నిరాక్షేపముగా వివాహములు చేయుచునే యున్నాము. అట్టి కన్నియలు పునర్భువులని చెప్పుట కెవ్వరును సాహసింపరు.

శ్లో. దత్త్వాం న్యాయేన యః కన్యాం వరాయి న దదాతి తాం
అదుష్టశ్చే ద్వరో రాజ్ఞా సదండ్య స్తత్ర చోరవత్.—నారదుఁడు.

న్యాయముచేత నియ్యఁబడిన కన్యను వరున కెవ్వఁడియ్యఁడో వాఁడు వరుఁడు దుష్టుఁడు కానిపక్షమున రాజుచే చోరునివలెనే దండ్యుఁడగునని చెప్పు నారదాది స్మృతివచనముల ననుసరించి పై కాశ్యప వచనమునకు అదుష్టవరపరమని సంకోచము కల్పించి శాస్త్రోదితమయిన వరదోషము లేక ధనాశచేతను ద్వేషముచేతను వివాహము చేసినప్పుడుమాత్రమే వాగ్దత్తాదులు పునర్భువు లగుదురని నిర్ణయము చేసియున్నారు. ఈప్రకారముగానే బోధాయనులును,—

వాచాదత్తా మనోదత్తాఽగ్నింపరిగతా
సప్తమంపదం నీతా భుక్తా గృహీతగర్భా

ప్రసూతా చేతి సప్తవిధా పునర్భ్వా స్తాం
గృహీత్వా న ప్రజాం న ధర్మం విందేత.

వాగ్దత్తాదులగు సప్తవిధ పునర్భువులను చెప్పి కశ్యపుఁడు చెప్పిన వారిలో నడుమ కొందఱిని వదలి సంభోగసౌఖ్య మనుభవించిన దానిని, గర్భము ధరించిన దానిని, సంతానము కన్నదానిని గూడఁ జేర్చి వారిని గ్రహించి సంతానమును ధర్మమును పొందఁ గూడదని విధించి యున్నాఁడు. అనేకస్మృతులు వాగ్దత్తాదులకు వివాహమును విధించుచున్నవి. ఇందుకు నిదర్శనముగా కాత్యాయనుఁడు,—

శ్లో. వరే దేశాంతరగతే త్రీన్మృతూ న్సంప్రతీక్ష్య వా
కన్యాన్యస్మై ప్రదాతవ్యా వాగ్దానేతు కృతే సతి.
పంచత్వం చే ద్వరో గచ్ఛేత్ వాగ్దానేతు కృతే సతి
కన్యాన్యస్మై ప్రదాతవ్యా తథా సప్తపదాత్పరమ్.

వరుఁడు వాగ్దానాంతరము దేశాంతరము పోయినను, మృతుఁడయినను, కన్యను మఱియొకని కియ్యవలెనని చెప్పుచున్నాఁడు. ఆ ప్రకారముగానే లోకములో సర్వసాధారణముగా వ్యవహారమును జరుగుచున్నది. అట్టి కన్యకల నెవ్వరును పునర్భువులనిగాని తక్కువ వారనిగాని యెంచరు. దీనినిబట్టి చూడఁగా పునర్భువులను నిందించిన యీ స్మృతియందుఁగాని మఱియొక స్మృతియందుఁగాని వివాహ మెవ్వరికి విధింపఁబడెనో వారు పునర్భూ నిర్వచనమునకు లోఁబడినవారయినను వారికి పునర్భూనామము చెందదనియు, వారేవిధముచేతను తక్కినవారికంటె తక్కువవారు కారనియు విస్పష్ట మగుచున్నది. సప్తపదికి పూర్వమునం దనేకస్మృతులలో వివాహము విధింపఁబడినది గనుక నట్టివారు పునర్భువులు గాకుండవచ్చును గాని సప్తపద్యనంతరము వివాహమాడువారు పునర్భువులు కాకతప్పరని కొంద

అనవచ్చును. సప్తపదికి పూర్వమునందు వివాహమును విధించిన కాత్యాయనవచనమే "తథా సప్తపదాత్పర" మని సప్తపది తరువా సహితము మృతభర్తృకకు పునర్వివాహము విధించుచున్నది గనుక పూర్వము చెప్పిన హేతువుచేతనే సప్తపద్యనంతరము శాస్త్రవిహిత మయిన వివాహము చేసికొన్నవారు సహితము పునర్భువులు కారు. మఱియు పునర్భువుల నాప్రకారముగా నిందించిన బోధాయనుఁడే తన స్మృతిలోని వివాహప్రకరణమునందు,-

శ్లో. విసృష్టా వా హతో వాపి యస్యా భర్తా మ్రియేతి వా
సా చే దక్షతయోని స్యాత్ గతప్రత్యాగ తాపివా
పౌనర్భవేన విధినా పున సంస్కార మర్హతి.

భర్త నష్టుడయినప్పుడును హతుఁడయినప్పుడును మృతుఁడయినప్పుడును అక్షతయోనికి పునరుద్వాహమును విధించుచున్నాఁడు. ఇందువలన బోధాయనుని యభిప్రాయము విధ్యనుసారముగా వివాహితలయినవారు తప్ప తక్కిన స్త్రీలే పునర్భువు లగుదురనియు శాస్త్రమును తిరస్కరించి వివాహము చేసుకొనువారు మాత్రమే పునర్భువులును దూష్యులును అగుదురనియు ననుట కరతలామలక మయిన విషయమే కాఁబట్టి "నష్టే మృతే" లోనుగాగల పునరుద్వాహ విధుల ననుసరించి వివాహము చేసికొన్నవారు పునర్భువులు కారనియు స్మృతియందు పునర్భూలక్షణ మేవిధముగాఁ జెప్పఁబడినను శాస్త్ర విధుల నతిక్రమించి వివాహమాడినవారును వారి సంతతివారును మాత్రమే పునర్భువులును పౌనర్భవులును నయి నింద్య లగుదు రనియు పరమసిద్ధాంత మగుచున్నది.

౨. ఒకవేళ యౌగికముగా పునర్వివాహము చేసికొనెడి స్త్రీలందఱియందును పునర్భూశబ్దము వర్తించినను, పునర్భువులను దూషిం

చెడి సామాన్యవిధుల కపవాదములుగా నుండు విశేషవిధులచేత విధ్యుక్తరీతిని వివాహము చేసికొన్న స్త్రీలును వారి కొమాళ్ళు మొద లయినవారును పరిరక్షింపఁబడి యెంతమాత్రమును వారు దూష్యులు కాకన్నే యుందురు ఎట్లనఁగా,—

శ్లో. దారాగ్నిహోత్రసంయోగం కురుతే యోఽగ్రజే స్థితే
పరివేత్తా స విజ్ఞేయః పరివిత్తిస్తు పూర్వజః.

మనువు. అ 3, శ్లో. ౧౭౧

అను వచనమునుబట్టి అన్నకు ముందు వివాహమాడువాఁడు పరివేత్త యనంబడును. అట్టి పరివేత్త పాపాత్ముఁడయిన నరకమును పొందుననియు బహుస్మృతులు ఘోషించుచున్నవి. పౌనర్భవాదులను పంక్తిబాహ్యులనుగాఁ జెప్పిన పూర్వోదాహృత మనువచనముల లోనే పరివేత్తకూడ అపాంక్తేయుఁడుగాను హవ్యకవ్యముల కనర్హుఁడు గాను వాఁడుగాను పరిగణింపఁబడి యున్నాఁడు. అయినను,-

శ్లో. కుబ్జవామన షండేషు గద్గదేషు జడేషు చ
జాత్యంధే బధిరే మూకే న దోషః పరివేదనే.

అని స్మృత్యంతరమునందు జ్యేష్ఠభ్రాత కుబ్జుఁడుగాఁ గాని, వామనుఁడుగాఁగాని, నపుంసకుఁడుగాఁగాని, నత్తిగలవాఁడుగాఁ గాని, జడుఁడుగాఁగాని, జాత్యంధుఁడుగాఁగాని, చెవిటివాఁడుగాఁగాని, మూగవాఁడుగాఁగాని ఉన్నయెడల పరివేదనమువలన దోషము లేదని అపవాదవిధి కనఁబడుచున్నది. అందుచేత అన్నకు ముందుగా వివాహము చేసికొన్నవాఁడగుటచే నతఁడు పరివేత్తయైనను, అన్న యందు కుబ్జత్వాది దోషము లున్నప్పుడు విధ్యనుసారముగా వివాహము చేసికొన్న కనిష్ఠభ్రాత యెన్నఁడు నపాంక్తేయుఁడును దూష్యుఁడును కానేరఁడు. అదేప్రకారముగా ద్వితీయవివాహము చేసుకొన్న స్త్రీ

లందఱును పేరున పునర్భువులే యగుదురని రెండవ వారును వస్త్రే మృతేత్యాది స్మృతివచనముల ననుసరించి వివాహముల చేసికొన్న వారును వారిపుత్రాదులును పంక్తి కనర్హులును దూష్యులును కారు.

3. ప్రతిస్మృతిని ప్రత్యేకముగాఁ జదివి యా స్మృతికర్త చెప్పిన పునర్భూ లక్షణములను పునర్భువుల యోగ్యతను పరీక్షించిన యెడల, విధివిహితముగా పునర్వివాహ మాడిన స్త్రీ లేవిషయమునను తక్కువవారుగా నుండనట్టు తెలిసికోవచ్చునని యీవఱకే తెలిపి యున్నాను. కొందఱు స్మృతికర్తలు శాస్త్రమువిూఱి పరపురుషుని వరించి సంతానము గన్నవారినే పునర్భువులనుగాఁ జెప్పి వారిని దూషించియున్నారు; కొందఱు పునర్వివాహ మాడిన స్త్రీల నందఱిని పునర్భువులనుగాఁ జెప్పి వారిని తక్కువవారినిగా చెప్పకయున్నారు. కొందఱు సామాన్యముగా పునర్భువులను దూషించిమాత్ర మున్నారు. ఇందుకు దృష్టాంతముగా మనువు తొమ్మిదవ యధ్యాయములో,—

శ్లో. యాఽ పత్యావా పరిత్యక్తా విధవా వా స్వయేచ్ఛయా
ఉత్పాదయే త్పునర్భూత్వా స పౌనర్భవ ఉచ్యతే. ॥౧౭౫॥

పతిచేత విడిచిపెట్టఁబడినగాని విధవయయిగాని స్త్రీ స్వేచ్ఛ చేత ననఁగా శాస్త్రవిరుద్ధముగా బిడ్డను గన్నదానినే పునర్భువనియు, ఆ పుత్రుఁడే పౌనర్భవుఁడనియు నిర్వచించి యట్టివారిని మాత్రమే యుపాంక్తేయులనుగాఁ జెప్పియున్నాఁడు. కాని విధి విహితముగా ద్వితీయ వివాహమాడిన దాని పుత్రుని పౌనర్భవునిగా నెక్కడను చెప్ప లేదు. అట్టి ద్వితీయ వివాహితపుత్రుఁడు మొదటి భర్తకు మాత్రమే పౌనర్భవుఁడగును గాని ద్వితీయభర్త కౌరసుఁడేయగును. "సహాతం పుత్రమౌరస" మనియున్న భారతవచనమును జదివినచో నీయంశము స్పష్టమగును. ఇదేప్రకారముగా నా యా స్మృతులను ప్రత్యేకము

గాఁ జదివిన యెడల, పునర్భూవిషయమయిన మన ఋషుల యభిప్రాయము వారి వారికే తెలియును. ఏ స్మృతియైనను పునర్భూలక్షణమును సామాన్యముగాఁ జెప్పి వారిని దూషించినపక్షమున నక్కడ ననుష్టానరీతిచేత విధియుక్తముగా పునరుద్వాహ మాడినవారి విషయములో తప్ప తక్కిన వారివిషయములో మాత్రమే యా దోషములు పట్టునని యర్థము చేయవలెను.

4. పూర్వోదాహృత మనుస్మృతి వచనములయందును, తదితర స్మృతివచనములయందును కొందఱు హవ్యకవ్యముల కనర్హులని దూషించుట యతిశయోక్తిచేత సాధారణముగా తదితరులు ప్రశస్తులని చూపుటకొఱకే గాని వానియందంతకంటె విశేషమేమియు లేదు. అట్లుచోట్ల మన మెప్పుడును వాని యుద్దేశమునే గ్రహింపవలయును గాని యక్షరయవార్థమును గ్రహింపరాదు. శబ్దార్థమునే గ్రహింతె మనుపక్షమున, పయిని చెప్పఁబడిన మనువచనములను బట్టి వైద్యులును, వాణిజ్యము చేయువారును, గ్రామోద్యోగులును, రాజకీయోద్యోగస్థులును, పుష్పిగోళ్ళవారును, కప్పుపడ్డవారును, జ్యోతిష్కులును, చిలుకలు మొదలగు పక్షులను పెంచువారును, యాచకులును, వ్యవసాయము చేయువారును కూడ పంక్తిబాహ్యులే యగుదురు. అట్టివారి నెవ్వరు నిప్పుడు అపాంక్తేయులనుగాఁ జూడరు. కాఁబట్టి పయివాక్యములలో పయిని చెప్పఁబడినవారు కానివారు ప్రశస్తులని తాత్పర్యమే కాని వారందఱు నపాంక్తేయులని కాదు. ఒకవేళ పైదాని కక్షరయవార్థము యంగీకరించి, వాదము నిమిత్తమై పునర్వివాహము చేసికొన్న వారిసుతులు పౌనర్భవులే యనియు వారు నిందిత పౌనర్భవులలోనే చేరుదురనియు నొప్పుకొన్నను, అప్పుడు సహితము వారు వైద్యులు, వర్తకులు, రాజకీయోద్యోగస్థులు, జ్యోతిష్కులు,

కృషిచేయువారు, మొదలగువారితో సమానులే యగుదురు గాని వారికంటె తక్కువవారు కాజాలరు.

౫. పరాశరుఁడు "నష్టే మృతే" త్యాది వచనముచేత స్త్రీ పునర్వివాహమును విధించి పౌనర్భవపుత్రుని నెక్కడను చెప్పకపోవుట చేత కలియుగమునందు పునర్భూవ్యవహారముగాని పౌనర్భవ వ్యవహారముగాని యొంతిగానే లేనట్టును, ద్వితీయవివాహితల పుత్రులు ఔరసులే యగుదురని పరాశర మతమైనట్టును స్పష్టమగుచున్నది.

శ్లో. ఔరసః క్షేత్రజ శ్చైవ దత్తః కృత్రిమక స్సుతః
దద్యా న్మాతా పితావాపి సపుత్రో దత్తకః స్మృతః.

అని కలియుగమునందు త్రివిధపుత్రులను మాత్రమే పరాశరుఁడు చెప్పియున్నాఁడు. ఏవ పదసారస్యముచేత స్వక్షేత్రజుఁడనఁగా స్వభార్యయందు పుట్టినవాఁడే యౌరసుఁడని పై శ్లోకమునందలి మొదటి పదమున కర్థము. ఈ యర్థమునే దత్తక మీమాంసయందు నంద పండితుఁడు వ్రాసియున్నాఁడు.—

ఔరసః క్షేత్రజశ్చైవ దత్తః కృత్రిమకస్సుతః-ఇతి కలిధర్మ ప్రస్తావే పరాశరస్మరణాత్, నచైవం క్షేత్రజోపిపుత్రః కలౌ స్యాదితి వాచ్యం-తత్రనియోగ నిషేధేనైవ తన్నిషేధాత్ అస్తుతర్హి విహితప్రతిషిద్ధత్వాత్ వికల్ప ఇతిచేన్నదోషాప్పత్తేః-కథం తర్హ్యత్ర క్షేత్రజగ్రహణ మితిచేత్ ఔరస విశేషణత్వేనేతి బ్రూమః- తథాచమనుః- శ్లో. స్వక్షేత్రే సంస్కృతాయాంతు స్వయ ముత్పాదితశ్చయః-తమౌరసం విజానీయాత్ పుత్రం ప్రథమకల్పితమ్. ఇతి— దత్తకమీమాంస.

ఈ పయిదానినిబట్టి పునర్వివాహము చేసికొన్న స్త్రీలు పునర్భువులును, వారిపుత్రులు పౌనర్భవులును కారనియు, వారెంతమా

త్రమును కులములో తక్కువవారు కారనియు, వారికిఁ బుట్టిన సుతు లౌరసులును, వారు సాధ్వులును నగుదు రనియు, కొంచె మాలో చించి చూచినయెడల నిష్పక్షపాతబుద్ధుల కందఱకును విశదము కా వచ్చును. భారతమున పునర్వివాహిత యయిన యులూపి పుత్రుఁ డౌరసుఁడుగాను, ఉలూపి సాధ్విగాను జెప్పఁబడియుండుటచే యందఱకు విశదమయియే యుండును.—

శ్లో. ఆగతస్తు పున స్తత్ర గంగాద్వారం తయా సహ
పరిత్యజ్య గతా సాధ్వీ ఉలూపీ నిజమందిరమ్.

## ఉ ప సం హా ర ము

ఇంతవఱకును స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమని చూపుట కయి ప్రయత్నించి నాకు తెలిసినదానిని సంగ్రహముగా తెలిపి యున్నాను. ఇప్పుడవకాశము లేకపోవుటచేతను, గ్రంథవిస్తారము చేయుట నాయుద్దేశము కాదు గనుకను, నేను శ్రుతిస్మృతిపురాణ ములయందలి వచనముల నుదాహరించి వాని తాత్పర్యమును వ్రాసితినే కాని యర్థవిషయమయిన యాక్షేపసమాధానములను పూర్ణముగా వివరింపఁగలిగినవాఁడను గాను. కొంచెమాలోచించి చూచినయెడల నేను జెప్పిన యర్థములు క్లిష్టములు కావనియు శబ్దములవలన స్పష్ట ముగా కనఁబడునవియే యనియు మీకు విశదము కావచ్చును. ఈ విన్నదానినిబట్టి స్త్రీపునర్వివాము శాస్త్రసమ్మతమనియు, అవ శ్యాచరణీయమనియు మీమనసునకయినను తోచవచ్చును. లోకాను భవమునుబట్టి చూచిన స్త్రీపునర్వివాహము కర్తవ్యమని తలఁపనివా రెవ్వరుందురు ? ఈ కాలమునందు మాత్రమే కాక పూర్వకాలమునందు సహితము స్త్రీలదురవస్థను జూచి మనసు కరఁగి విధవావివాహమును

పునరుద్ధారణము చేయుటకయి ప్రయత్నించిన పుణ్యపురుషు లనేకు లుండి యున్నారు. కొంచెమయినను దయారసముగలవారీసత్కార్య విషయమున తగినతోడ్పాటును చేయకుండరని దృఢముగా విశ్వసించు చున్నాను. పెక్కువందల సంవత్సరముల క్రిందటనే మనదేశపు స్త్రీల దుర్దశలను మాన్పుటకయి జీర్ణమయిపోయిన నారీపునర్వివాహమును పునరుద్ధారణము చేయవలెనని జయపురమహారాజగు జస్వంతసింగనువారును, సుప్రసిద్ధులయిన యప్పయదీక్షితులవారును ప్రయత్నము చేసినట్టు మనము వినుచుండుటయేకాని యాకాలమునందలి జనుల మౌఢ్యాధిక్యమునుబట్టి వారికోరికలు సఫలమయినట్టు వినలేదు. వంగదేశమునందు మూడువందలయేఁబది సంవత్సరముల క్రిందట పండితమండలాగ్రగణ్యుఁడుగా నుండిన స్మార్త భట్టాచార్య రఘునందను లను వారొక గ్రంథమునుజేసి బాలవిధవ యయిన తన కొమార్తెకు వివాహము చేయవలెనని ప్రయత్నించిరి కాని చిరకాలాగతమయిన దురాచారప్రభావముచేత వారికోరికయు విఫలమే కావలసివచ్చినది. అటుతరువాత కొంతకాలమునకు రాజవల్లభుఁడను నతఁడు గొప్పప్రయత్నముచేసి పండితులచేత నొకవ్యవస్థ చేయించెను. గాని వివాహములనుమాత్రము చేయింపఁగలిగినవాఁడు కాఁడు. ఇప్పటి కించుమించుగ నూఱుసంవత్సరముల క్రిందట పీష్వాసద్ద సేనాధిపత్యము వహించి ఘనతకెక్కిన పరశురామపట్ట బాహువర్ధనులనువారు తన కొమార్తెయగు దుర్గాశాయి యను నామె యెనిమిది సంవత్సరముల ప్రాయమున భర్తను పోఁగొట్టుకొన్నప్పు డామెకు పునర్వివాహము చేయుటకయి విశ్వప్రయత్నములు చేసిరి గాని తుదకప్పుడును కార్యము కాలేదు. అప్పుడు పునానగరమునం దుండు పండితులు మాత్రమే కాక కాశీపురమందలి పండితులును స్త్రీపునర్వివాహము

శాస్త్రసమ్మతమని సిద్ధాంతముఁ జేసిరి; అప్పటి శంకరాచార్యుల వారును దాని నంగీకరించిరి. అంతట వివాహము జరుగుటకు సిద్ధమయియుండఁగా బ్రాహ్మణులందఱును జేరి పరశురామపట్ట బాహు వర్థనుల భార్యపాదములమీఁద పడి మొఱ్ఱపెట్టుకొని యీమెమూలమున వివాహము జరుగకుండఁ జేసిరి. అటుపిమ్మట కొందఱు నాగపురము మొదలయిన స్థలములయందు కొంతప్రయత్నము చేసిరి కాని వారిప్రయత్నములు ఉపన్యాసములతోనే సరిపోయినవి. తరువాత మొట్టమొదట మన హిందూదేశములో స్త్రీ పునర్వివాహములను సరిగా జరిపించిన వారు గొప్పపండితులయి కాళీఘట్ట రాజధానియందు వసియించెడి పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరు లనువారు. వారు బహుప్రయాస పడి జనులకు శాస్త్రమును జూపి వారి కన్నులను విప్పుటయేకాక స్త్రీపునరుద్వాహవిషయమయి రాజకీయశాసనము నొకదానిని కలిగించి ౧౮౫౬ వ సంవత్సరములో మొట్టమొదట రెండువివాహములను జరిగించిరి. నాటినుండి బంగాళారాజధానియందు పెక్కు వివాహములు జరుగుచునేయున్నవి. తరువాత బొంబయి నగరమునందు విష్ణుపరశురామశాస్త్రిలవారు ౧౮౬౭ వ సంవత్సరమునందు వాదమున నారంభించి ౧౮౭౦ వ సంవత్సరమున సరిగా కొన్నివివాహములను జరిగించిరి. ఇప్పుడా శాస్త్రిలవారు మృతులయినను, ఆ ప్రాంతములయందు పునరుద్వాహములు విస్తారముగా జరుగుచు వచ్చుచున్న వనుమాట వార్తాపత్రికలను జదువువారి కందఱికిని తెలిసియుండును. ఎక్కడ నేవిధముగా జరుగుచున్నను మన రాజధానిమాత్రము నేటి వఱకును కన్నులు మూసికొని హాయిగా నిద్రపోవుచున్నది. ఈ పట్టణమున పదునెనిమిది సంవత్సరములనుండి ఒకసమాజమున్నను చేసినపని యేమియును గానరాదు. నేను ౧౮౭౯ వ సంవత్సరమునందు రాజ

మహేంద్రవరమున నీవిషయమున నుపన్యాసములను జేయనారంభించి, భగవదనుగ్రహమువలన నిప్పటికి రెండువివాహములను జేయింపఁ గలిగినాఁడను. ఈ రాజధానివారిఁకనైన నిద్రనుండి లేచి చుఱుకుగా పనిచేసి తక్కిన రాజధానులవారితో సామ్యమును పొంద ప్రయత్నింతురని కోరుచున్నాను. సర్వదయాపరుఁడయిన యీశ్వరుఁడే యీ విషయమున మాకు ధైర్యస్థైర్యముల నిచ్చునుగాక యని ప్రార్థించుచు, ఈ యుపన్యాసమును యింతటితో ముగించుచున్నాను.

# స్త్రీపునర్వివాహ వ్యాపారము యొక్క భూత వర్తమాన స్థితులు.



By

**K. VEERESA LINGAM**

# స్త్రీ పునర్వివాహ వ్యాపారము యొక్క భూత వర్తమాన స్థితులు.



ఓ మహాజనులారా!

ఈపట్టణమునం దారంభింపఁ బడిన స్త్రీ పునర్వివాహవ్యాపారము యొక్క భూతవర్తమానస్థితులను గుఱించి నేటి మహాసభలో నుపన్యాసింపవలసినదని వెనుకటిసభలో కార్యదర్శిగారు నన్నడిగినప్పుడు నేను నిర్వహింపవలసిన కార్యభారముయొక్క కష్టమును చక్కఁగా విచారింపక మంచిదని యొప్పని కంగీకరించినాను. కాని సభవిడిచిపోయిన పిమ్మట నాలో నే నాలోచించుకొనఁగా నాకు నియమించిన యీ యుపన్యాసము మఱియొకరు నిర్వహించుట యుచితముగా నుండునని నా కప్పుడు తోఁచినది. ఐనను చేసెదనని సభవారిముం దొప్పుకొని వచ్చినతరువాత వెనుకతీయుట ధర్మముకాదు గనుక, నామనస్సున కిది రుచించిన విషయము కాకపోయినను విధిగా భావించుకొని తోఁచినట్లు చెప్పఁబోవుచున్నాను. నాసంగతి నేను చెప్పుకొనుట లేశమాత్రమును నాకిష్టమయినపని కాదు. కాని మొదటినుండియు నాకున్న యెడతెగని సంబంధమునుబట్టి నాపేరు విడిచిపెట్టి యీస్త్రీపునర్వివాహ చరిత్రమును చెప్పగలుగుట నాకు సాధ్యముగా తోఁచలేదు. అంతేకాక సంగతులు తెలియక కొందఱును, బహుకారణములచేత నాకు ద్వేషులుగా నేర్పడినవారు చెప్పెడు గిట్టనిమాటలను నమ్మి కొందఱును, నేను చేయుచున్న యీ కృషి విషయమయి విపరీతాభిప్రాయము కలిగియున్నట్టు నాకిప్పుడు కొన్నిసూచనలు గానఁబడుచున్నం

దున ప్రస్తుతాంశముతో సంబంధించి యున్నంతవఱకు నావిషయమయి కూడ కొంత చెప్పుకొనుటయు నావశ్యకముగానే కనుపట్టుచున్నది; కాబట్టి నేనిప్పుడు చెప్పఁబోయెడు సంగతులను సావధానముగా చిత్తగింపవలెనని మహాజనులను వేఁడుకొనుచున్నాను.

ప్రప్రథమమున నే నీ స్త్రీ పునర్వివాహవిషయమున కృషి కారంభించినప్పు డెవ్వరో యొకరిద్దఱుతప్ప ఇప్పుడున్న యీ సామాజికులలో నెవ్వరును నాకు సహాయులుగా నుండలేదు. న్యాయపతి సుబ్బారావుపంతులుగా రప్పు డీ పట్టణమునకు క్రొత్తగా వచ్చియుండరు. ఆరంభించిన రెండుసంవత్సరములకుఁగాని ఆత్మూరి లక్ష్మీనరసింహముగారీపట్టణమునకు రాలేదు. బసవరాజు గవర్రాజుగారు మాత్రము నాకు తోడుపాటుగా నుండిరి. కాని నాకు ముఖ్యప్రోత్సాహకులుగానుండి యీకృషిలో నన్ను ప్రవేశపెట్టి నాచేత పనిచేయించినవారు నా సహపాఠియు, మిత్రులునైన చల్లపల్లి బాపయ్యగారు. లౌక్యాధికారధూర్వహుఁడను విద్యాధికుఁడనుగాని నే నీమహాకార్యమును నిర్వహింపఁజాలనని యధైర్యపడి నిరుత్సాహుఁడను కాఁగా నాకు ధైర్యముచెప్పి పురికొల్పి నన్ను వెంటఁగొని బయలుదేఱి స్త్రీపునర్వివాహసమయమున భోజనములకు వచ్చెదమని ముప్పదిమంది బ్రాహ్మణ గృహస్థులచేత వ్రాళ్ళుచేయించి నాకంటెను మహాశ్రద్ధతో పనిచేసిన దీయనయే. ఈయన ప్రోత్సాహముచేతనే ౧౮౭౯ వ సంవత్సరము జూలై నెలలో శ్రీవిజయనగరపు మహారాజుగారి బాలికాపాఠశాలయందు నేను స్త్రీపునర్వివాహవిషయమయి నా మొదటియుపన్యాసమును జేసినాను. కాఁబట్టి యిప్పు డంకురించి పెరుగుచున్న స్త్రీపునర్వివాహక్రియావృక్షమునకు బీజావాపము చేసినవారు శ్రీ చల్లపల్లి బాపయ్యగారనియే చెప్పవలసియున్నది. అప్పుడు బాపయ్యగారును, నేనును, నామిత్రులు మఱికొందఱును జేరి స్త్రీపునర్వివాహసమాజమని పేరుపెట్టుకొని పని

చేయ నారంభించితిమి. ఆరంభదశయందు మాయొద్ద నొక్క కాసును నిధిగా లేదు; మహారాజులు సహితము పూని నిర్వహింపలేకపోయిన యీపని మేము నలుగురయిదుగురము పూని నిర్వహింపఁ గలుగుదుమన్న విశ్వాసము మాకప్పుడు కలలోను లేదు. కాని యీవిషయమయి కృషిచేయుట మాకు పరమధర్మమనుకొని సమస్తమునకు పరమేశ్వరుని నొక్కనినే నమ్ముకొని త్రికరణశుద్ధిగా పనిచేయ మొదలుపెట్టితిమి. ఈకృషి యారంభమయిన కొన్నివారములకు నాకు పరిచితులయిన శ్రీ బారు రాజారావుపంతులుగారు శ్రీపైడా రామకృష్ణయ్యగారీపట్టణమునకు వచ్చినప్పుడు నాకు వారితోడి మైత్రిని కలిగించినారు. వారప్పుడీపని నిమిత్తమయి తాము ముప్పదివేల రూపాయల నిచ్చెదమని వాగ్దానము చేసినారు. ఈశ్వరుఁడు మాకీ గొప్పప్రాపు కనఁబఱచినందున మాకు మఱింత యుత్సాహముకలిగి మేము ఒంటికంటె ద్విగుణధైర్యముతో పనికిఁ బూనితిమి. ఈకాలము మొదలుకొని తరువాత రెండుసంవత్సరములకు పిమ్మట ప్రథమ వివాహమునకు పట్టిన సమస్తవ్యయములను నేనే వహించినాను. నేను చేసిన యుపన్యాసములను ముద్రించి కొన్ని ప్రతులను విక్రయించినను విశేషభాగ మూరక పంచిపెట్టినాను; వాదము నిమిత్తమయి ముప్పదినలువది స్మృతులను, ఇతరపుస్తకములను కొని కృషిచేసినాను; బహుస్థలములయందున్నవారితోను తత్ప్రత్యుత్తరములను జరుపుచు వలసినప్పుడితరస్థలములకుఁగూడ పోయి యుపన్యసించుచు వచ్చినాను; వివాహములు చేసికొనెదమని వాగ్దానముచేసిన విద్యార్థులకుఁ గొందఱికి పాఠశాలజీతములకు సహాయము చేయుచు వచ్చినాను; బాలవితంతువులున్న స్థలములను విచారించి సమాచారములు తెచ్చుటకును కృషిచేయుటకును మనుష్యులకు సొమ్మిచ్చుచు వచ్చినాను; బాలవితంతువుల సంరక్షకులతో మాటాడుటకయి అమలాపురము, మం

డపేట, తాళ్ళపూడి, కాకినాడ దొడ్డిపట్ల, విశ్వేశ్వరము, రామచంద్రపురము, పాలకొల్లు మొదలయిన స్థలములకు మనుష్యులను పంపుటయేకాక, వీనిలో నొకటిరెండుస్థలములకు నేనును బోవుచు వచ్చినాను; ఈ ప్రయాణములలో నొకసారి యొకపల్లెలో శీతకాలపు రాత్రి యందొక మిత్రుఁడును నేనును పశువులపాకలోని పశువులతోఁ గలసి గొచ్చుగంపులో పరుండి నిద్రింపవలసివచ్చినది. ఈ కృషిలో నాకక్కడి రాజకీయపాఠశాలలోని విద్యార్థులు మొదటినుండియు ముఖ్యసహాయులుగా నుండిరని చెప్పవలసియున్నది. ఇప్పుడు వివాహములు చేసికొన్నవారిలో పులవర్తి శేషయ్యగారును నల్లగొండ కోదండరామయ్యగారును పయినిజెప్పిన గ్రామములలోఁ గొన్నిటికిఁ బోయి కృషిచేసినందునకయి వారికృతజ్ఞతనిక్కడఁ దెలుపుచున్నాను. మేమిప్పుడు వితంతువివాహములను జేసికొన్న బీదవాండ్రకు నెల ౧కి ఇంచుమించుగా రు ౮ ల చొప్పున కొన్నిసంవత్సరముల వఱకును ఇచ్చెదమని ప్రచురించినారము. కొంతకాలమైన తరువాత సుబ్బారావుపంతులుగారు మొదలయినవారు మాలోఁ జేరినారు; చెన్నపట్టణమునుండి సోమంచి భీమశంకరముగారు వచ్చినారు; కాకినాడకు సబుజడ్జిగా వచ్చిన శ్రీ కంచి కృష్ణస్వామిరావుపంతులుగారు వాక్సహాయము చూపి మాకు మఱింత ప్రోత్సాహము కలిగించినారు; మొదటి వివాహ మయిదాఱు మాసములకు జరుగునవఁగా ఆత్మూరి లక్ష్మీనరసింహముగా రిక్కడకు డిస్ట్రిక్టుమునసబుగా వచ్చి బహువిధముల తోడుపడినారు. ఇతరస్థలములయందును లక్ష్మీనరసింహముగారి తోఁపలను పెక్కుసభలు జరిగిన తరువాత న్యాపతి సుబ్బారావుపంతులుగారును, ఆత్మూరి లక్ష్మీనరసింహముగారును, కొమ్ము రామలింగశాస్త్రిగారును, బసవరాజు గవర్రాజుగారును, నేనును జేరి యొక యాంతరంగికసభ యేర్పఱుచుకొని కార్యాలోచనము చేయుచు

౧౮౮౧ వ సంవత్సరము డిసెంబరు నెల ౧౧ వ తేదిని మాగృహము నందు మొదటి వితంతూద్వాహమును జరిగించితిమి. ఈ వివాహము జరుగుటకు కొన్నిదినములు ముందు శ్రీపైడా రామకృష్ణయ్యగారు తమ సహజౌదార్యముతో వేయిరూపాయలను మాయొద్దకుఁ బంపి నారు. ధనవ్యయవిషయమయిన భారమును నామీఁదఁ బెట్టుకొనుట కిష్టములేనివాఁడ నయినందున, మొదటి రెండువివాహములును మా యింటనే జరిగినను వివాహముల నిమిత్తమై రామకృష్ణయ్యగారు మొదట పంపిన వేయిరూపాయలను తరువాత పంపిన మొత్తమునుగూడ శ్రీలక్ష్మీనరసింహముగారే వాడినారు. ఇంచుమించుగా నేకకాలము నందే జరిగిన రెండువివాహములకును రెండువేల రూపాయలవఱకును వ్యయమునపడినను, రెండవపెండ్లికుమార్తె కిచ్చెదమన్న రెండువందల రూపాయల నగలలోను డెబ్బది యెనుబది రూపాయల నగలకంటె మే మప్పు డెక్కువ పెట్టలేకపోయినాము. వివాహము లయినతరువాత పెండ్లికొమార్తెలును పెండ్లికొమాళ్ళును రెండవపెండ్లికొమార్తెయొక్క తల్లిదండ్రులును తమ్ములును పినతల్లియు తాతగారును నలుగురు వంట బ్రాహ్మణులును పురోహితుఁడును వివాహములలో భోజనములకు వచ్చి మాలోఁజేరిన ముంజులూరి వేంకట్రామయ్యగారును కుటుం బమును నల్లగొండ కోదండరామయ్యగారును మాయింటనే యుండ వలసినవారయిరి. వీరికందఱికి నయ్యెడు వ్యయములను ౧౮౮౨ వ సంవత్సరము మార్చినెల కడపటివఱకు శ్రీరామకృష్ణయ్యగారు లక్ష్మీ నరసింహముగారివద్దకుఁ బంపుచురాఁగా వారివద్దనుండి ముంజులూరి వెంకట్రామయ్యగారు కొంతకాలమును నల్లగొండ కోదండరామయ్య గారు కొంతకాలమును సొమ్ము తెచ్చి తామే వాడి లెక్కనుంచుచు వచ్చిరి. పలుచోట్లనుండి వచ్చి బహువిధాభిప్రాయములు గలవా రింత మంది యొక్కచోట కూడినప్పుడు వారిలో నైకమత్యము ముందునో

లేదో నేను జెప్పవలసిన యక్కఱలేదు. అంతలో గొందఱిని వేఱు చేయవలసి వచ్చినందునను, ఈపక్షములోఁ జేరినవారి కితరులు కాపురము లుంచుటకై యిండ్లియ్యకపోయినందునను, రామకృష్ణయ్యగారిక్కడకు వచ్చినప్పుడు వారితోఁ జెప్పఁగా వారప్పుడు వివాహములాడినవారును తత్సంబంధులును కాపురములుండుటకయి యిన్నీసుపేటలో నొక గృహమును కొన్నారు. నెల కెనిమిది రూపాయలు జీతము లేర్పఱిచి ముందుగా రెండవ పెండ్లికొమార్తె పుట్టినింటివారిని, తరువాత రెండవపెండ్లి దంపతులను, అయింటికిఁ బంపినాము. ఈలోపల క్రొత్తగా పెండ్లియైన దంపతులను దీసికొని చెన్నపట్టణము రాదలసినదని దివానుబహదూరు రఘునాథరావుగారును పల్లె చెంచలరావు పంతులుగారును మమ్మాహ్వానము చేసినందున ప్రథమ వివాహదంపతులను దీసికొనిపోఁదలఁచి విశాఖపట్టణమునుండి మొదటి పెండ్లికుమారుని రప్పించినాము. ప్రయాణవ్యయముల నిమిత్తమయి యేప్రిల్ నెలలో రామకృష్ణయ్యగారు నూఱురూపాయలను నాకుఁ బంపినారు. నేను ప్రయాణము కాఁబోవునప్పటికి జీతములవారందఱును నేను మరల వచ్చువఱకును తమకుఁ గావలసిన జీతముల నియ్యవలసిన దని నిర్బంధపఱుపఁగా నేను ఋణముచేసి వారిజీతము లియ్యవలసివచ్చినది. ప్రథమదంపతులను వెంటఁబెట్టుకొని వంటబ్రాహ్మణునితో కుటుంబసహితముగా బయలుదేఱి యిందుతో సంబంధించిన యొక కోర్టువ్యవహారము నిమిత్తమయి ముందుగా విశాఖపట్టణమునకుఁబోయి యక్కడినుండి చెన్నపట్టణము పోయితిమి. అక్కడ మమ్మాదరించి మాకు వస్త్రములు కట్టఁబెట్టి దారిఖర్చులక్రింద నూఱు రూపాయలిచ్చి చెంచలరావు పంతులుగారు మమ్ము పంపివేయఁగా జూను నెలమధ్యమున బయలుదేఱి వచ్చి రాజమహేంద్రవరము చేరినాము. అప్పటికి సమాజమునకు నిధిగా ధనమేదియు లేదు; మాన

వ్యయములకయినను రామకృష్ణయ్యగారు దయచేసి పంపినఁ గలదు; లేకపోయిన లేదు; ఈస్థితియందయి శ్రీ కంచి కృష్ణస్వామిరావుపంతుల వారితో మనవిచేయఁగా వారు రామకృష్ణయ్యగారిని ప్రోత్సాహ పఱిచి దివాన్ బహదూరు రఘునాథరావుగారిని పత్తి చెంచలరావు పంతులుగారిని ట్రస్టీలనుగా నేర్పఱిపించి పది వేల రూపాయలను చెన్న పట్టణమునకుఁ బంపునట్లు చేసినారు. ఆ ట్రస్టుపత్త్రములో రెండుసంవత్సరములలోపల వివాహములు జరుగని పక్షమున తమసొమ్ము మరల తమకు పంపివేయునట్లు వ్రాసి వివాహములు జరగెడు పక్షమున వివాహ మొకటికి వేయేసి రూపాయలవంతున నాయొద్దకు పంపుచుండవలసినదనియు వ్యయములక్రింద జూనునెల మొదలుకొని నెలకు డెబ్బదియైదు రూపాయల చొప్పునఁ బంపవలసినదనియు వారికి వ్రాసినారు. అప్పుడు మరల వివాహములకున్న యాశ రామకృష్ణయ్యగారికిని లేదు; ఈపక్షములోఁ జేరినవారిని జనులు పెట్టెడు బాధ మహో గ్రముగనే యుండినది; శంకరాచార్యులవారి బహిష్కారపత్త్రికలు వచ్చి పులుఁగులవలె సంతతిని బెదరించుచుండినవి; లక్ష్మీనరసింహము గారు శంకరాచార్యులవారిమీఁద తెచ్చిన యభియోగము కొట్టుపడి పోయినది; రామకృష్ణయ్యగారు మొదలుకొని యిందులోఁ జేరినవారనేకులు ప్రాయశ్చిత్తములు చేయించుకొని ప్రతిపక్షులలోఁ జేరవలసినవారయిరి. ఈపక్షమునందభిమానము గలవారు సహితము బహిరంగముగా మాసభలకు వచ్చుటకే భయపడుచుండిరి. అయినను మేమింతలోపల నిరుత్సాహులమయి యూరకున్నవారము కాము. మొట్టమొదట మాలోఁ జేరినట్లున్నవారే కొందఱు మమ్ము చేయి విడిచినను, కొందఱు ప్రతిపక్షులుగాకూడ మాఱినను, తాంబూలములకు వచ్చియు భోజనములు చేసియు మఱియొకవిధముగా సాహాయ్యముచేసియు స్త్రీపునర్వివాహపక్షము నభిమానించుకొన్న

వారిని మరల సమాజముగాఁ గూర్చుకొని లక్ష్మీనరసింహముగారి లోపల సభచేసి దానికి పూండి సుబ్బరాయలయ్యగారిని సహాయ కార్యదర్శినిగా నేర్పఱచుకొన్నాము. వారు కొంతకాలమున కుద్యోగాంతరముమీఁద దేశాంతరమునకు పోవలసినవారయినారు. మాలోఁ జేరినవారు ప్రాయశ్చిత్తములు చేయించుకొని యొక్కరొక్కరే మమ్ము విడుచుచు రాఁగా ౧౮౮౮ వ సంవత్సరారంభమున కోదండ రామయ్యగారి వివాహమగునప్పటికి పైవారిలో కొటికలపూడి రామేశ్వరరావుగారును, బసవరాజు గవర్రాజుగారును, నేనును ముగ్గురము మాత్రమే యీసమాజములో నిలిచియున్నాము. ఇప్పుడు మొదటివారుగాక తక్కిన యిద్దఱము మాత్రమే యున్నాము. రామకృష్ణయ్యగారు మాసవ్యయములక్రింద నాకిచ్చుచున్న జూను నెల డెబ్బదియైదు రూపాయలును సెప్టెంబరు మొదటి తేదివఱకు నాకు ముట్టనేలేదు. ఇట్లు మాసవ్యయములక్రింద డెబ్బదియైదురూపాయలు చొప్పున వచ్చుచున్నను వానిలో నుండి నెలజీతములను రొక్కముగా నిచ్చెడు సొమ్మును తప్ప మఱియేమియు వ్యయపెట్టలేదు; భోజనాదివ్యయముల నన్నిటిని నాసొంత సొమ్మునుండి నేనే వహించుచుంటిని. నల్లగొండ కోదండరామయ్యగారు ౧౮౮౭ వ సంవత్సరము జూలయినెలలో ప్రాయశ్చిత్తము చేయించుకొని మాయింటినుండి వెడలిపోవువఱకును తానే వెచ్చమంతయు వాడి లెక్కవ్రాసెను. వంటబ్రాహ్మణులు లోనుగాఁగలవారు కొందఱు సంవత్సరములకాలఁదిసి, కొందఱు నెలల కాలఁదిని మాయింటనే యుండి భోజనములుచేయుచు వచ్చెడువారు. రెండవ పెండ్లికొమార్తెకు బాకియున్న నగలు పెట్టినను మఱియేయితర వ్యయములు చేసినను మాసమాసమునకు వచ్చెడి సొమ్ములో నుండియో, వివాహమైనప్పు డందుల వ్యయములలోనుండి మిగిల్చియో చేయవలెను. మాసవ్యయములనుండి నగలు పెట్టుటకు సాధ్యముగాక

పోగా కొంతకాల మయినతరువాత రామకృష్ణయ్యగారు తామే రెండవపెండ్లికొమార్తెకు మిగిలినసగలను పెట్టినారు. వివాహ మొకటికి వేయేసిరూపాయలచొప్పున వ్యయపెట్టుటకయి రామకృష్ణయ్యగారు నాకధికారమిచ్చినను నేను విచ్చలవిడిగా సొమ్ము వ్యయపెట్టక తాత్కాలికస్థితినిబట్టి సాధ్యమయినంత మితముగానే సొమ్ము వాడుచు వచ్చినాను. నాకిచ్చిన స్వాతంత్ర్యప్రకారముగా నేను చేయించిన పదునొకండువివాహములకును వివాహ మొక్కంటికి వేయేసిరూపాయలచొప్పున పదునొక్కవేలరూపాయలును, నెలకు డెబ్బదియైదు రూపాయలచొప్పున రెండుసంవత్సరములమూడుమాసములకును రెండువేలమూడువందల యిరువదియైదు రూపాయలును, నేను వ్యయపఱిచి యుండినయెడల, రామకృష్ణయ్యగా రిచ్చిన పదివేలును పోగా పయిగా మూడువేలరూపాయ లప్పయియుండును. అట్లు చేయక సాధ్యమయినంత పొదుపుగా వాడియుండుటచేత నేను ప్రస్తుత సమాజమువారికి లెక్క యొప్పగించునప్పటికి చెన్నపట్టణములో నూటయిరువదియెనిమిది రూపాయలు నిలువయున్నవి.

ప్రథమమున జరగిన రెండువివాహములును అయిన తరువాత మరల వివాహములు జరుగుట దుస్సాధ్యమయినందున మూడవ వివాహము చేయించు నిమిత్తము మొదటికంటెను విశేషశ్రమ పడవలసివచ్చినది. ౧౮౮౨ వ సంవత్సరము ఆగష్టునెల కడపట తృతీయవివాహ మగునట్లు కనబడగా చెన్నపట్టణము వ్రాసి సెప్టెంబరునెల మొదట వేయిరూపాయలను తెప్పించినాను. అప్పుడు సహితమా సొమ్మును లక్ష్మీనరసింహముగారియొద్దనే యుంచి పెండ్లికొమారునకు ఋణములు తీర్చుకొనుటకు నిమిత్తమై యిచ్చిన రెండువందల రూపాయలును మఱి నలువదిరెండు రూపాయలును కర్చుపడువఱకును ఆయనచేతనే వ్యయపఱిపించినాను. వివాహసమయమునకు లక్ష్మీ

నరసింహముగారు బందరువెళ్ళుట తటస్థించినందున మిగిలిన యేను వందలయేఁబదియెనిమిది రూపాయలు నేను పుచ్చుకొని వ్యయము చేసినాను. ఆ సంవత్సరము సెప్టెంబరు నెల యిరువది రెండవ తేదిని జరిగిన యావివాహమునకు తొమ్మిదివందల తొంబది యేను రూపాయలు వ్యయమయినవి. వివాహమునకు పూర్వమునందయిన రెండువందల నలువది రూపాయలునుగాక నగలకు రెండువందల యిరువదియేను రూపాయలును, బట్టల కేఁబది యేను రూపాయలును, భోజనములకు డెబ్బదియెను రూపాయలును ఊరేగింపునకు డెబ్బదియొక రూపాయలును పోఁగా తక్కిన రెండుమూడువందల రూపాయలును తక్కిన ఖర్చుల కయినవి. మొదటి వివాహమునకు బాజాభజంత్రీలకు నలువది రూపాయల కేర్పడినను తగ్గించి మూడవవివాహమునకు నలుబది రూపాయలును, తరువాత కొన్ని వివాహములయిన తరువాత ముప్పదియొక్క రూపాయలును, కట్టకడపట కొంతమంది మనుష్యులను తగ్గించి పదిరూపాయలును చేసినాను. పురోహితునకు మొదట వివాహమొకటి కేఁబది రూపాయలు చేయఁగా మూడవవివాహమున కిరువదియైదు రూపాయలును తరువాత వివాహముల కెనిమిదేసి రూపాయలును చేసినాను. తంత్రిబ్రాహ్మణులకు జీతములుగాక వివాహదినములలో దిన మొకటికి నాలుగేసి రూపాయలచొప్పున నియ్య నిర్ణయించుకొన్నను మూడవ వివాహమునకు దిన మొకటికి రెండేసిరూపాయలును తరువాత దిన మొకటికి రూపాయచొప్పునను కట్టకడపట దిన మొకటి కేబదణాల చొప్పునను చేసినాను. ఈప్రకారముగా క్రమక్రమముగా బహు వ్యయములను తగ్గించుచు వచ్చినాను. వితంతువివాహములను చేసికొన్నవారి కితరులు కాపురముండుట కిండ్లియ్యకపోవుట విచారించి రామకృష్ణయ్యగారితో నాలోచించి ముందు వివాహములు చేసికొను వారు కాపురముండుట కిల్లిచ్చెదమని ప్రథమ ద్వితీయవివాహము

లయినతరువాత ప్రచురించినను, అప్పటి యావశ్యకమునుబట్టి యీ మూడవపెండ్లికొమారునకు స్థిరముగానే మూడువందల రూపాయల వెలచేసెడి యిల్లుగాని రొక్కమునుగాని యిచ్చెదనని వ్రాసి యియ్య వలసివచ్చినది. ౧౮౮౩ వ సంవత్సరము జనవరు నెలలో జరిగిన నాలవవివాహమునకు ౭౨౩ రూపాయలు వ్యయపడినవి; ఈ వివాహ మునం దాదటికిని బట్టలు పెట్టినందున ౧౨౨ రూపాయలు బట్టలకే యైనవి; ఈవివాహము మొదలుకొని సామాన్య వాడుకగా నా కెవ్వరును తాంబూలములకు వచ్చుట సహితము కానరాకుండుట సదా వివాహగృహమునందుండుట నాకే వాడుకవచ్చినది. ఆ మరుసటి జనేవరు నెల కడపట జరిగిన యైదవవివాహమునకు ౫౧౮ రూపాయలు వ్యయపడినవి; తరువాత మార్చినెలలో జరిగిన యారవవివాహము నకు ౪౧౫ రూపాయలు ఖర్చుపడినవి; ఆవెనుక ఏప్రిల్ నెలలో జరిగిన యేడవవివాహమునకు ౪౯౭ రూపాయలు వ్యయమయినవి; ఇది ఇక్కడ జరిగినవానిలో మొదటి కోమటివివాహము. ఈసమయము నందు చెంచలరావుపంతులుగారు దక్షిణహిందూస్థానమునకు రాజ ధానియైన చెన్నపట్టణమునం దొకటి రెండు వివాహములు చేయించ వలసినదని నన్నును రామకృష్ణయ్యగారిని కోరినందున వారి యభిమత మును దీర్చుటకయి యిద్దఱు వితంతుకన్యలను వరులను దీసికొని పురో హితుడు మొదలయిన పదుముగ్గురు జనముతో నేను చెన్నపురికి పోయినాను. అక్కడ జూన్ నెల ౮ వ తేదీని ఒక్కవివాహము మాత్రము జరిగినది. ఆవివాహమున కక్కడ నెనిమిదివందల యేబది రూపాయలు వ్యయమయినవి; రాకపోకలకు ప్రయాణములక్రింద ౩౩౧ రూపాయలు ఖర్చుపడినవి; రెండువందలరూపాయలు పెట్టి పెండ్లి కొమార్తెకు మాన్యము విడిపించి యిచ్చినాను; సంబంధమును కుదిర్చి యీవితంతుకన్యలను తెచ్చినవారికి నలువదిరూపాయ లిచ్చినాము;

పెండ్లికొమార్తెలను తల్లిని కృష్ణామండలములోని గుంటూరి కావల నుండు వల్లూరునుండి రెండుసారులు తీసికొనివచ్చినందునకయి నలు వదిరూపాయ లయినవి; పెట్టిన నగలు రెండువందల రూపాయలును కలుపుకొనియు యెనిమిదవ వివాహమునకు ౧౬౭౧ రూపాయలయి నవి. అటుపిమ్మట ఆగష్టునెలలో జరిగిన తొమ్మిదవ వివాహమునకు ౪౦౩ రూపాయలు వ్యయపడినవి; ౧౮౮౪ వ సంవత్సరము జనేవరి నెలలో జరిగిన పదవవివాహమునకు ౫౫౪ రూపాయలు కర్చుపడినవి. ఈవ్యయములలో నించుమించుగా రెండేసివందల రూపాయలు ప్రతి వివాహమునకు నగలక్రింద నగుచువచ్చినవని నేనిక్కడ చెప్పనక్కఱలే లేదు. ౧౮౮౫ వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో బళ్ళారిలో జరిగిన పదునొకండవ పండ్రెండవ వివాహములకు రెండున్నర వేయిరూపాయలు కర్చుపడినవి. నేను డిసెంబరుసెలవులలో చెన్నపట్టణము వెళ్ళినప్పుడు కుదిరిన యీ రెండుసంబంధములకును కొన్ని కారణములచేత చెన్నపురిలో వివాహములు చేయుకుండుటకు నిశ్చయింపఁబడినందునను సెలవుదినము లయిపోవుటచేత వివాహము లగువఱకును నేనక్కడ నుండుటకు వల్లపడనందునను, వివాహ మొకటికి యిరువదేసివందల రూపా యలచొప్పున వ్యయపెట్టుటకు నిర్ణయించి సొమ్మును మున్నవ బుచ్చయ్య పంతులువారి ద్వారున నిమ్మనట్లు చెంచలరావుపంతుల వారి కొప్పన చేసి బయలుదేఱి వచ్చినాను. బళ్ళారిలోని సభాపతి మొదల్యారిగారు తమయూర వివాహములు చేయవలసినదనియు వ్యయములు తాము వహించెదమనియు వ్రాసినందున బుచ్చయ్య పంతులుగారు దంపతు లను బళ్ళారికి గొనిపోయి వారి వివాహముల నక్కడ జరిగించినారు. వ్యయపడిన నాలుగువందల రూపాయలును పోఁగా మిగిలిన యారు వందల రూపాయలును దంపతులకును కన్యాదాతలకును పంచిపెట్టఁ బడినవి. ౧౮౮౪ వ సంవత్సరము డిసెంబరునెలలో జరిగిన పదుమూడవ

వివాహమునకయిన మూడువందలరూపాయలును రామకృష్ణయ్యగారు నావద్దకు ప్రత్యేకముగాఁ బంపినారు. రామకృష్ణయ్యగా రిచ్చిన వివాహ నిధిలోనుండి కర్చుపెట్టి చేసిన పదివివాహములకును గలిసి ౬౬౬౮రూపాయలయినవి. కొన్ని వివాహముల కెక్కువయినను కొన్నివివాహములకు తక్కువయినను సగటున వివాహ మొకటికి రూ ౬౬౬ లు వ్యయపడినవి.

నేను కర్చుచేసిన మాసవ్యయములు ముప్పదియొక్క నెలలకును రు ౧౯౩౧ లయినవి. సగటున నెల యొకటికి రు ౬౨ – ౦ – ౦ లు కర్చుపడినవి. వివాహములు మొదలయిన వాని నిమిత్తమయి నేను చేసిన వ్యయములన్నియు నీదిగువ ప్రకారముగా నుండును:—

| | | |
|---|---|---|
| ప్రత్యేకముగా వివాహముల నిమిత్తము. | రు | ౬౬౬౭-౧౫-౮ |
| మాసవ్యయములు. ... | ... | ౧౯౩౧-౫-౩. |
| కొన్ని యిండ్లును స్థలములును. | ... | ౧౧౬౪-౦-౦. |
| కొన్ని పాత్రసామగ్రియు మంచములును. | | ౧౮౧-౨-౯. |
| వైద్యపుకర్చులు. | | ౪౮-౧౨-౬. |
| రావి గుర్నావధానులవలన రావలసినది.. | | ౯౦- ౦ ౦. |
| | మొత్తము | ౧౦,౦౮౫-౪-౨. |

నేను చెన్నపట్టణమునుండి తెప్పించిన సొమ్మంతయు బళ్ళారిలో జరిగిన వివాహములకుఁ గలుపుకొని ౬౭౫౪-౭-౫ పోఁగా నేనీసమాజమువారికి లెక్క యొప్పగించునప్పటికి నాకే ౩౩౦-౧౨-౯ లు రావలసియున్నవి. నాకెంతబాకి యున్నను నే నా సొమ్మిప్పుడును మరల పుచ్చుకోఁదలఁచుకోలేదు. వివాహము లారంభమైనది మొదలుకొని ౧౮౮౬ వ సంవత్సర ప్రారంభమువఱకును శీతకాలపు నెలవులలోను వేసవికాలపు నెలవులలోను కూడ నేనీపనిమీఁద చెన్నపట్టణమునకో మఱియొక స్థలమునకో పోక మానిన సంవత్సరము లేదు.

నావ్యయములను తమసొమ్ములోనుండి పుచ్చుకొమ్మని రామకృష్ణయ్య గారెన్నిసారులు చెప్పినను పుచ్చుకోక నాప్రయాణవ్యయములను నేనే వహించుచు వచ్చినాను. ౧౮౮౫ వ సంవత్సరము మే, జూన్ నెలలలో చందాల నిమిత్తము చెన్నపురికి వెళ్ళినప్పటి వ్యయములను మాత్రము వసూలయిన చందాసొమ్ములోనుండి పుచ్చుకొన్నాను. ఇంతేకాక యీ కార్యములమీఁద మునిస్వామి మొదలయినవారిని నెలకొలఁది త్రిప్పినను సమాజధనమునుండి నేమియు గ్రహింపక వారిజీతములు మొదలయిన వానిని నేనే భరించుచు వచ్చినాఁడను. కార్యసాఫల్యము కానివిషయములలో శ్రీపునర్వివాహప్రయత్నము లందు నేను వ్యయపెట్టిన సొమ్మేమియు నేను సమాజపులెక్కలో వ్రాయలేదు. విశాఖపట్టణమునుండి యొకబ్రాహ్మణుఁడు పిల్లతో కన్యలను తీసికొని వచ్చెదనని చెప్పి మునిస్వామిని విశాఖపట్టణ మండలమునందు పెక్కుదినములు త్రిప్పి తుదకు కొంతసొమ్ము తీసికొని వాచీపోవుట మొదలయిన వార్తలను కలుగఁజేసి యున్నారు. రామకృష్ణయ్యగారు ౧౮౮౬ వ సంవత్సరము జూన్ నెలలో సొమ్ము పంపి నది మొదలుకొని ౧౮౮౭ వ సంవత్సరము మార్చినెలవఱకు చెన్న పట్టణపు సమాజమువారికి మనసొమ్ములోనుండి పాదరుక్రింద ౧౩౦ రూపాయలు ఖర్చుపడినప్పు డిక్కడ నాకెంత ఖర్చయియుండునో మీరే యూహించుకోవచ్చును. ఈసొమ్ములోనుండి చెన్నపట్టణపు సమాజము క్రింద అయిదువందలరూపాయలు ఖర్చుపడినవి—అందులో మూఁడు వందలరూపాయలు శ్రీపునర్వివాహము మంచిదని బోధించు బోధకుల జీతములక్రింద వ్యయపడినవి.

నాలుగయిదు వివాహము లయిన తరువాత మూఁడవపెండ్లి కొమారునికిఁ జేసిన వాగ్దానమునుబట్టి తక్కినవారికిఁగూడ వారువారు కాపురములున్న యిండ్లు వారివారి కిచ్చివేయవలసినదని రామకృష్ణయ్య

గారిపేర నేను వ్రాసితిని గాని వారందున కంగీకరింపక తగిన హేతువులు చెప్పినందున నేనును వారిలోనే యేకీభవించి పారంపర్యముగా శాపురము లుండుటకు మాత్రమే యిచ్చుట శ్రేయస్కరమని తలంచినాను. నేను వివాహములు చేసిన వరులందఱును విద్యాధికులు కారని చాటున కొందఱాక్షేపించుచున్నారఁట! ఒక్కకుటుంబములో పదిమంది కన్యలున్నప్పుడు వారికందఱికిని విద్యాధికులనే భర్తలనుగాఁ దెచ్చుట సామాన్యకుటుంబములోనే సాధ్యమగుచున్నదో లేదో యాలోచించినయెడల, వితంతువుల విషయమున వారి యాక్షేపణకు వారికే సమాధానము తోఁచవచ్చును. ౧౮౮౮ వ సంవత్సరము జనేవరునెలలో నల్లగొండ కోదండరామయ్యగారి వివాహమగువఱకును సామాజికులకును వివాహములు చేసికొన్న వారికిని ఐకమత్యమున కేమియు కొఱంతరాలేదు. కోదండరామయ్యగారి వివాహము నిమిత్తమయి కన్యను తీసికొని రావలసినదని నేను పులపర్తి శేషయ్యగారిని పంపినప్పు డాయన సంకోచింపక పెండ్లికూఁతురువారి వస్తువులను సహితము కొంతదూరము సంతోషపూర్వకముగా మోచుకొనివచ్చుట యీ యైకమత్యమునకొక నిదర్శనముగా చెప్పవచ్చును. పదిమంది యొకసంఘములో చేరిన తరువాత వారిలో వారి కప్పుడప్పుడు తగవులు రాకమానవు. తమకు ప్రతికూలముగా తీర్చినప్పుడు తగవు తీర్పఁబూనిన వానియెడల కొందఱికి మనస్తాపమును కోపమును వచ్చుటయు స్వాభావికమే. కాని యా ద్వేషము మాత్రము చిరకాలముండదు. నాచేతిలో సొమ్ము లేకపోయినప్పుడును యుక్తకాలములో నాకు చెన్నపురినుండి సొమ్ము రానప్పుడును కొన్నిసారులు రాఁబోవు నెలజీతములు ముందుగా ముట్టక కొందఱి కాలస్యముగా ముట్టినవి. అప్పుడును నే నప్పయినను చేసి కొంతసొమ్మయినను ముందుగా నియ్యని మాస మొక్కటియు లేదు. కోదండరామయ్యగారి వివాహ

మయిన రెండుమూడు మాసములలో కొన్ని కలహకారణములు కలిగి నవి. లోకములో వైరమునకును నేరములకును ఏవి కారణములుగా నుండునో తెలిసినవారి కీ వైరమునకుఁగల కారణమును తెలుపవలసిన పని యుండదు. ఉన్న యైకమత్యమును చెడఁగొట్టుట యెట్టివారికిని సులభము కాని చెడినదానిని మరల కూర్చుట సాధారణముగా సాధ్యము కాదు. అట్లు నాటఁబడిన వైరవిషబీజము మెల్లమెల్లఁగా నంకురించి వివాహములు చేసికొన్న వారికేకాక సామాజికులలో నొక రిద్దఱికిఁగూడ తన విషవాయువును బఱపి యీ మహాకార్యమునకు భంగకరమయిన దుష్ఫలమును కొంతవఱకుఁ గలుగఁజేసినందున కయి యెంతయు చింతిల్లుచున్నాను. ఒకసత్కార్యమునకు విఘ్నము కలుగఁజేసెడి యవకాశము కొంచెము లభింపఁగానే దానిని సందు చేసికొని గోరంతలు కొండంతలుచేసి ద్వేషాగ్నిని ప్రజ్వలింపఁజేసి కార్యవిఘాతమయినప్పుడు చూచి సంతోషింపవలెనని కనిపెట్టుకొని యుండు మహానుభావులు లోకములో ననేకులుందురు. అట్టివారి దుర్బోధలు విని చెడిపోక బీటలువాఱుచున్న యైకమత్యమార్గమును స్వలాభముకొఱ కెల్లవారును మరల శాంతిసుధతో నతికింపఁ జూతు రని నమ్ముచున్నాను. యుక్తకాలములో నట్లు చేయకపోయినయెడల కార్యము మించిన తరువాత పశ్చాత్తాపపడిన ప్రయోజనము లేక స్వయంకృతదోషము ననుభవింపవలసివచ్చును. ౧౮౮౮వ సంవత్సరము మెయినెలలో నేను నరసాపురము వెళ్ళియుండినప్పుడు నేనప్పుడు నెదురుచూడని తావునుండి నాకొక యుత్తరమువచ్చి నా కాశ్చర్యము పుట్టించినది. నేనీపనిమీఁద నరసాపురమునుండి బందరుపోయి తిరిగి రాఁగానే జూన్ నెలలో సభచేసి యిప్పుడున్నరీతి సమాజము నేర్పఱుచుటకుఁ బ్రయత్నించినాను ఇప్పుడున్నరీతిగా మన యీ సమాజ మప్పు డేర్పడినదే. అవఱకు నేఁటుగా చందాలు లేవు గనుక చందా

లిచ్చినవారెల్ల సభికులని యిప్పటివలె నంతకుముం దేర్పఱుచుటకు వీలులేదు. అవఱకు నేను వివాహములు చేయవలసి వచ్చినప్పుడుగాని ముఖ్యమయిన పనిని దేనినైనను నిర్ణయింపవలసి వచ్చినప్పుడుగాని యీ విషయమయి నిజమైన శ్రద్ధగలవారని నేను నమ్మిన యొకరిద్దఱి తోను పైడా రామకృష్ణయ్యగారితోను ఆలోచించుచుండెడివాఁడను. స్త్రీపునర్వివాహప్రయత్నమున కెల్లను రామకృష్ణయ్యగారు ప్రాణముగా నుండెడివారు; నిజము విచారింపఁగా సమాజమన్న పరమార్థమాయన యొక్కరే గనుక నేను వివాహములు చేయించుచున్నను, ఆయనయే యిండ్లు మొదలయినవి కట్టించుచు పెండ్లి చేసికొన్న వారికిని తత్సంబంధులకును తగిన సాహాయ్యముచేయుచు భేదము లేక వర్తించుచుండెడివారు; వివాహముల ధనములోనుండి నేను కొన్న స్థలములో ఆయన యిండ్లు కట్టించినారు; నేను కొన్న యిండ్లను వారి వారి కియ్యవలసినదని మరణశాసనములో వ్రాసినారు. అటువంటివారు లోకాంతరగతులగుటచేత మన సమాజము ప్రాణములేని బొందెవంటి దైనదని చెప్పవచ్చును. ఏవివాహమున కెంత సొమ్మయినదో యాయనయే విచారించుచుండెడివారు; మూడవ వివాహమునకయిన వ్యయముల వివరము నేనాయనకుఁ బంపినప్పుడు వివర మక్కఱలేదనియు మొత్తములను మాత్రము పంపుచుండవలయుననియు కోరినారు. నేనాప్రకారముగా పంపుచుండఁగా పదివివాహము లయిన తరువాత వివరములన్నియు తమయొద్ద లెక్కయుంచుకొను నిమిత్తమయి కోరినారు. లెక్కయంతయు మరల వ్రాయుటకు నాకవకాశము లేక కొన్నిమాసములకు మన సమాజమువారి నిమిత్తమయి వ్రాసిన పుస్తకమునే నేను పంపఁగా వారు దానికి నకలు వ్రాయించి తమయొద్ద నుంచుకొని పుస్తకము సమాజమువారి తావునకుఁ బంపినారు. అటుపిమ్మట రామకృష్ణయ్యగారిక్కడకు వచ్చినప్పుడు తాము

తరువాత నిచ్చిన పదివేలరూపాయలును మొదటి రెండువివాహములకు ప్రత్యేకముగా చేసిన వ్యయములును కట్టించిన యిండ్లును శ్రీపునర్వివాహాభివృద్ధినిమిత్తమయి చేసిన యితరవ్యయములును కలుపుకొని యిరువది వేలరూపాయ లయ్యెననియు, మొట్టమొదట వాగ్దానము చేసిన మొత్తములో అవిపోఁగా మిగిలిన పదివేలరూపాయలును వేగిర మిచ్చెదననియుఁ జెప్పి మూలధనము వ్యయపడక వృద్ధివలన సమాజమునకు తోడుపడునట్లుగాఁ జేయుటకయి యేమిచేయుట యుచితముగా నుండుననని నన్నాలోచన యడిగిరి. అప్పుడు నేనొకసారి నాగోజీరావుపంతులు వారియొద్దకును ఇంకొకసారి ఆచంట లింగరాజుగారి యొద్దకును వారితోఁగలిసి పోయి యాలోచించితిమి గాని యప్పుడెట్లు చేయుటకును నిశ్చయింపలేదు. దేశముయొక్క యభాగ్యముచేత నింతలో వారి కవసానదశ సంప్రాప్తమయినందున, ఉద్దేశించిన పదివేలరూపాయలను మరణశాసనమూలమున నిచ్చి, చేసిన వాగ్దానమును చెల్లించుకొన్నారు. మనమందఱమును వారియెడల కృతజ్ఞులమై యుండి వారిచ్చిన ధనము వారి యుద్దేశప్రకారముగా సార్థకపడునట్లు చేయుటకును, వారవలంబించిన యీ ఘనకార్యము దినదినాభివృద్ధి చెందునట్లు చేయుటకును, సర్వవిధముల ప్రయత్నింపవలెను. ఈమధ్యకాలములో పుట్టిన వైకమత్యాభావమును పోఁగొట్టి యీ లోకోపకారకార్యము నిర్విఘ్నముగా సాగునట్లు చేయవలయునని యీశ్వరుని హృదయపూర్వకముగా ప్రార్థించుచున్నాను.

# స్త్రీ పునర్వివాహ ప్రవర్తక సమాజమువారి
# వి జ్ఞా ప న ము.



By

**K. VEERESA LINGAM**

# స్త్రీ పునర్వివాహ ప్రవర్తక సమాజమువారు హిందూ మహాజనులకు చేయు విజ్ఞాపనము

అస్మద్దేశీయులగు మహనీయులారా!

సాధారణముగా హిందూదేశముయొక్క యభివృద్ధికొఱకును అంతకంటెను ముఖ్యముగాఁ బూర్వకాలమునందు హిందూసుందరులు పొందియున్నట్టియు అధికనాగరికతగల ప్రపంచములోని యితరదేశములయందలి స్త్రీ లిప్పుడు బొందుచున్నట్టియు ఉన్నతదశకు మరల మన స్త్రీలను దీసికొనివచ్చుటకొఱకును అభిలాషగలవారందఱును, అత్యంతాపేక్షణీయమయిన యీ యభివృద్ధివిషయమయి యేమాత్రము శ్రద్ధచేయువారయినను మనలో సంతకంతకు ముదురుచున్న యీ క్రిందఁ జెప్పఁబోయెడి యాచారమువలనఁ గలుగుచున్న విషతుల్యములయిన ఫలములను తెలిసికొని చింతిలకపోరు. కేవలము పసితనములోనే భర్తలను పోఁగొట్టుకొన్న బాలికలయినను యావజ్జీవమును దుఃఖైకమూలమయిన విధవావస్థయందే కాలము వెళ్ళఁబుచ్చవలయునను నిర్బంధకరమయిన యీ యాచారమును మళ్ళించుటకై భరతఖండములోని భిన్నభిన్న దేశములయందలి మహాపురుషులు కొంద ఱప్పుడప్పుడు ప్రయత్నములు చేయుచు వచ్చినను, దానిని సంపూర్ణముగ మాన్పవలెనన్నచో ఈ దేశమునందలి వివేకిలోకమంతయు సంక్షోభవించి ఐకమత్యముతో మహాప్రయత్నము చేయవలయుట యనివార్యకార్యమయినట్టు కనఁబడుచున్నది.

ఓ దేశీయులారా! హిందువులను జూచి యితరదేశములవారు నాగరికతను నేర్చుకొన్నటువంటి పూర్వకాలమును నిమిషమునేపు మీ మనసులలో నిలుపుకొండి. అప్పుడు మీదేశము సమస్తవిద్యలకును కళలకును ఆటపట్టయి యున్నందుకై మీకిప్పుడు సంతోషము కలుగుచుండలేదా? గ్రీకుదేశస్థులును యవనదేశస్థులును వైద్యశాస్త్రరహస్యములను గణితశాస్త్ర మూలవిధులను నేర్చుకోఁగలిగినది మీపూర్వులవలననే కాదా? సమస్తభాషలలోను ఉత్కృష్టమయిన సంస్కృతమును, సమస్తశాస్త్రములలోను శ్రేష్ఠమయిన జ్యోతిషమును మిక్కిలి సంపూర్ణములయిన శాస్త్రసంప్రదాయములును, అసమాన ప్రజ్ఞావంతులయిన ధర్మశాస్త్రకర్తలును, వెనుక నొకప్పుడు మన దేశము నలంకరించి యుండలేదా? మన శాస్త్రములు న్యాయముగా నర్థముచేయఁబడి, ప్రామాణికబుద్ధితో ననుసరింపఁబడుచువచ్చిన కాలమొకటి యుండలేదా? తక్కిన యుత్తమపదార్థసంపదతోడిసాటిగా మన దేశమునం దప్పుడు దేశాభిమానులును పలువు రుండలేదా? ఓహో! వారి ప్రయత్నములెంత శ్లాఘనీయములుగా నుండెను! అపరిమిత మేధాసంపన్నులకుఁగాక మఱియెవ్వరికైన మన ధర్మశాస్త్రములను, వ్యాకరణశాస్త్రమును, తర్కశాస్త్రమును, వేదాంతశాస్త్రమును, జ్యోతిషశాస్త్రమును చేయుటకు శక్యమగునా? అట్టి యుత్తమకాలమునందు మనదేశమునందలి స్త్రీలుగూడ విద్యావతులయి, పురుషులతో సమానముగా గౌరవింపఁబడుచుండలేదా?

అట్టి పూర్వకాలములయందు వారెట్టి యున్నతదశను జెందియుండిరో మీమనసులకు తార్కాణపఱుటకయి, సీత, శకుంతల, అనసూయ, అవ్వ మొదలయిన పుణ్యసతుల నామములను స్మరణకుఁ దెచ్చుచున్నాము. అనేక ప్రతిబంధములుగల యీ కాలమునందు

సహితము కొంత లెంతటి విద్యావతులు కాఁదగియుందురో చూపుటకయి కొంతకాలముక్రిందట లోకాంతరగతురాలయిన తారాదత్తను నిదర్శనముగాఁ బుచ్చుకొనుచున్నాము. ఆమె ప్రతిభవిషయమయి గడచిన శ్రావణమాసమునఁ బ్రకటితమయిన ఖండాంతరమునందలి "స్థిరవారవిమర్శని" యను పత్రిక యీవిధముగా భాషించి వ్రాయుచున్నది:—"విష్ణుపురాణమును ఇంగ్లీషుభాషయందుఁ బద్యకావ్యముగా భాషాంతరీకరించిన తారాదత్త విషయమయి మాకిప్పుడు సంపూర్ణముగాఁ దెలిసినది; ఆమె ఫ్రెంచిభాషయందొక వచన ప్రబంధమును రచించి ప్రచురించిన ౧౮౭౬ వ సంవత్సరమున నిరువదిసంవత్సరముల ప్రాయముగలది; ఆమె యైరోపీయ సంపర్కమెఱుఁగని శుద్ధ హిందూసుందరి; భాష చేసికొన్న యభాగ్యముచేతనే యామె తన యిరువదిరెండవ సంవత్సరమునఁ బరమపదమును పొందినది... ఈవరకు భూమిమీఁద జనన మొంది విశేషజ్ఞురాండ్రని ప్రసిద్ధికెక్కిన వారిలో తారాదత్త యగ్రగణ్యురాలని నమ్ముటకు హేతువులనేకములు గనఁబడుచున్నవి. జార్జి సాండు దొరసాని గాని, జార్జి యీలియట్టు దొరసాని గాని, తన యిరువదియొకటవయేట మృతినొంది యుండెనేని, ఇప్పుడు తారాదత్త రచియించిన గ్రంథమువలన మనకుఁ దెలియవచ్చుచున్న కల్పనాశక్తిని ప్రౌఢిమను మించిన మంచికావ్యములను వారు రచియింపఁగలిగి యుందురని యూహించుటకుఁగల నిదర్శనము లేవియు మనకిప్పుడు లేకపోయినే యుండును; అద్భుతప్రతిభావంతురాలయిన యీచిన్నదాని పాండిత్యమునందు దూరాలోచన లేనట్టు గనఁబడునది యించుకయు లేదు."

దేశీయులారా! ఇఁక ప్రస్తుతకాలస్థితికి దిగి శ్రద్ధతోఁ బరిశీలింపుఁడు. నిలువక పరుగెత్తు అవిమర్శకుఁడైనను మనము హీనదశను

పొందియున్నామని కనుగొనవచ్చును. దైవముఖమునుజూచి యెవ్వరైన నందుకు వ్యతిరేకముగాఁ జెప్పఁగలరా? పూర్వము ప్రపంచమున కంఠమును అభరణముగానుండి హిందూదేశమే యిప్పు డెల్లవారల పరిహాసమునకును బాత్రమైనది. మనపెద్దలు మన కిచ్చిపోయిన దాని నేమైన మనము వృద్ధిపఱుచుకొనియున్నామా? వారి యాజ్ఞలకు బద్ధులమై గౌరవముకలిగి నడుచుకొనుచున్నామా? మాననీయులారా! క్షణ మాలోచించితిరేని మనపూర్వులేర్పఱిచిన సనాతనములైన సద్విధులను మనము భ్రాంతిగా నలక్ష్యము చేయుచున్నామనియు వానిస్థానమున పూజనీయుఁడుకాని యొకద్రోహిని తెచ్చిపెట్టి సింహాసనమెక్కించి యాతని నారాధించుచుండుటయేకాక యాతనికి హైన్యముతో దాస్యము చేయుచున్నామనియు మీకే తెలియవచ్చును. బాహుళ్యముగా మనమందఱమును వంగి సేవచేయుచున్న దుష్టుఁడు ఆచారమను క్రూరరాక్షసుఁడు. అతని క్రౌర్యముయొక్క ఫలమును మన మందఱము ననుభవించుచున్నాము. కాని, అతని యధికారము నతిక్రమించి స్వతంత్రించుటకు శక్తులము గాకయున్నాము. అతఁడు మనకు సర్వాధికారి కాఁడని యెఱుఁగుదుము; అట్లయ్యును అతనితోఁగల బద్ధసంబంధమువలన, న్యాయముగా మనకు మార్గప్రదర్శకములైన శాస్త్రములమాటయే మఱచిపోవుచున్నాము. ఆచారపిశాచము మనలను దారి తప్పించి తప్పుత్రోవను బెట్టి, మన యభివృద్ధి మార్గమున కడ్డముగా కంటకప్రాయములగు ప్రతిబంధములను గల్పించి మన సౌఖ్యవృక్షమును మూలముతో ఛేదింపఁ జూచుచున్నదని మన మెన్నిసారు లనుభవమువలనఁ దెలిసికొనియున్నాముకాము? అతఁడు మనకుఁ దెచ్చిపెట్టిన మితిమీఱిన కడగండ్ల ననుభవించుచుండియు, ఇంకను మన మతనికి లోఁబడి యుండవలెనా? అక్కఱలేదు ; మన

మీ రీశ్వరశాసనమునకుఁ లోఁబడవలెను; కార్యక్రమ మెప్పుడును మారుచుండును. ఈవఱకు మనము కాళ్ళను చేతులను గట్టుకొని యాచారమున కధీనులమై పడియున్నాము; మీరాకట్లు త్రెంచుకొని స్వచ్ఛందదశను పొందుఁడని బోధించు విధిమాటను విని, మన మిఁక మాంద్యమునుండి లేతము. ఆచారముయొక్క సమ్మోహనమంత్ర ప్రభావముచేత మన మిప్పుడు దేహములు మఱచి యుండలేదు. మన మియ్యెడ నడుము కట్టుకొని నిలిచి, అధికారము నక్రమముగా నాక్రమించుకొన్న యా ద్రోహిని క్రిందఁ బడవైచి, క్రమబాధ్యతగల శాస్త్రములకు మరల సింహాసనము నర్పింతము. ఈ ఘనకార్యనిర్వహణము మనలను దేశముయొక్క ఋణమునుండి విముక్తులను జేయుటయేకాక, పూర్వ మొకప్పుడు ధర్మరాజు, గౌతముఁడు, మనువు, పరాశరుఁడు, విక్రమార్కుఁడు, మొదలయిన కీర్తిశరీరులచే నలంకరింపఁబడిన దేశమున వసించు మహాపురుషుల సంతతివారమని చెప్పుకొనుటకు మన మర్హులము కావలెనని ప్రయత్నము చేయుచున్నందుకు నిదర్శనముగా నుండును.

దేశీయులారా! ఇంతవఱకును మే మొక ముఖ్యోద్దేశము లేకయే యేమో చెప్పుచున్నామని మీ రనుకోవచ్చును. కాఁబట్టి మాముఖ్యోద్దేశము నవశ్యముగాఁ జెప్పవలసియున్నది. మనదేశములో స్త్రీల స్థితి యెంత దౌర్భాగ్యదశయం దున్నదో మీ రందఱు నెఱుఁగుదురు; వివాహబంధమువలన తన జీవితదశయందు ముందు రాఁబోవు మార్పుయొక్క గౌరవస్వభావము నించుకయుఁ దెలిసికోలేని పసితనములోనే కన్నియకు వివాహము చేయఁబడుచున్నది. ఎన్ని విషయములలో జ్ఞానము రాని చిన్న పెండ్లికొమార్తెలు వివాహమహోత్సవమునంతను భక్ష్యములు చేసికొని వాద్యములు వాయించు నొక సాధారణపు పండు

గునుగా భ్రమించుటలు వీరారు చూచియున్నారు కారు? భర్త పోయినాఁడన్న పిడుగువంటి దుర్వార్త కుటుంబమునంతను దుఃఖసముద్రములో ముంచినప్పుడును, పెండ్లినాటికంటె నెక్కువ జ్ఞానము రాని ముగ్ధబాలిక లెందఱున్నారు కారు? ప్రాణసమానలయిన ప్రియపుత్రికలను యావజ్జీవమును దుస్సహమయిన వైధవ్యదశకుఁ దెచ్చిన దురవస్థను దలఁచుకొని తలలువీడ, ఱొమ్ములు బాదుకొనుచు రోదనముచేయు తల్లిదండ్రులకడకుఁ బోయి, వారి వ్యసనకారణమును లేశమయినను దెలిసికోఁజాలక, "నాయనా! ఏమికష్టము వచ్చినది? ఏల యేడ్చుచున్నావు? అమ్మా! ఏల దుఃఖించెదవు?" అను నిట్టియెఱుఁగని ప్రశ్నలను విధవలయిన పసిబిడ్డలు వేయునప్పుడు చూచువారి గుండెలు బ్రద్దలుచేయు అట్టి ప్రదేశములను యథాస్థితముగా వర్ణింపఁగల కాళిదాసు నొకని మనమిప్పుడు కోరవలసినదే కదా?

మనలో విధవావస్థ యనఁగా నెటువంటిదో వర్ణించుటకై మేము ప్రయత్నింపవలసిన యావశ్యము లేదు. కొంతవఱకు బాల్యవివాహములనుబట్టియు, కొంతవఱకు స్త్రీలకు పునర్వివాహము లేకపోవుటంబట్టియు, వయసుచెల్లిన రెండవపెండ్లివాండ్రు సహితము బాలికలనే వివాహమాడుచుండుటం బట్టియు, ఈ యన్ని హేతువులచేతను మనలో విధవలసంఖ్య విస్తారముగా పెరుగుచున్నది. వారి సంఖ్యతోనే వైధవ్యజీవనమువలనఁ గలుగు కష్టములును వృద్ధియగుచున్నవి. ఒక బాలిక భర్త పోయినతోడనే మనుష్యులు పెట్టినఁ యలంకారములను మాత్రమేకాక తలఁచుగా భగవంతుఁడు దయచేసిన నల్లని నిడుదశిరోరుహములనెడి స్వతస్సిద్ధమయిన యమూల్యాలంకారమును సహితము పోఁగొట్టుకొనును; ఆమె దినమున కొక పూట మాత్రమే మితాహారముతో తృప్తిపొందవలసి యుండుటయే కాక యింటఁగల

హీనమయిన కష్టపుపని యంతయు ఆమెపాలనే పడును. ఇదియంతయు నేమి? ఆమెచేత శక్తికిమించిన పని చేయించి తిన్నఁగా నన్నము పెట్టక కడుపు మాడ్చుటయేకదా? ఆమె శ్రమయంతయు నింతేకాదు— అన్నిటికంటెను భయంకరమైన దింకొకటి యున్నది. భాగ్యహీనలైన విధవలు వీనికన్నిటికి లోఁబడఁగలరు గాని, ప్రకృతిని మాత్రము జయింపలేరు. అందుచే వారేమిచేయుటకును తోఁచని కష్టదశయందుందురు. స్వజాతివారి మెప్పు వడయుటకై ప్రకృతిని జయింపవలసినదా, లేక, ప్రకృతిసిద్ధమైన యింద్రియాకర్షణమునకు లోనై వారి దృష్టియందు హీనురాండ్రుగాఁ గనఁబడవలసినదా? ప్రకృతిని జయించుట యించుమించుగా నసాధ్యకార్యము. ప్రియజనకునిని, ప్రియతరులయిన తోఁబుట్టినవాండ్రను, తోడఁబుట్టినపడుచులను, ప్రియతమురాలయిన తల్లిని విడిచి, నీచురాండ్రవలె జీవించుటయు నొకవిధమున ప్రకృతిని జయించుటయేయైనను, స్త్రీలపాలిటి కది గొప్పకష్టమేయైనను, నిరాశ్రయతా దశయందున్న యీ యనాథలయిన యబలలు దుస్స్వభావముగల పురుషుల ప్రేరణమువలన నుద్రేకించిన యింద్రియముల ప్రోత్సాహముల నెట్లు నిగ్రహింపఁ గలుగుదురు? అంతట వారు ఇంద్రియనిగ్రహము చేయలేక, పురుషులవలలోఁ బడుదురు. అందువలనఁ గలిగెడి ఫలమేది? గర్భోత్పత్తి! కులమువారి కన్నులనుగప్పి, వారి నోరడంచవలెను. ఇంతవఱకును నిరపరాధులుగా నుండు భాగ్యహీనులయిన తల్లిదండ్రులును, సోదరులును ఇప్పుడు నేరమునకు సహకారులగుదురు. అప్పుడు గర్భపాతకర్మ ప్రారంభింపఁబడి, మరల నవసరము వచ్చినప్పుడెల్ల నాపనియే యాచరింపఁబడుచుండును. అట్టిస్థితిలో నొకానొకప్పుడు తనపనికి విఘాతము చేయవలెనని వ్యర్థముగా మనుష్యులు చేయు దుర్బల ప్రయత్నమును

జూచి ప్రకృతి పరిహసించుటయు సంభవించును. ఇట్టి పోరాటములో ప్రకృతియే విజయముఁగాంచి, మంచిశిశువు జనన మొందును. ఇప్పుడు మరల కులమువారి కన్నులకు గంతలుకట్టి దోషము లెన్ను వారి నోళ్ళను కట్టిపెట్టవలెను. అందుకుఁ దగిన యుపాయమేది ?— శిశుహత్య. ఓకులమా ! నీవెంత క్రూరమైన దానవుగా నున్నావు ? నీ వెంత కరుణమాలినదానవుగా నున్నావు ? నీవు కన్నులు తెఱచి క్రూరదృష్టితోఁ జూచుచున్నంతవఱకును, ఈదేశములో శిశుహత్యలు మానినవని మేమెట్లు చెప్పఁగలము ? ఎంతమంది చక్కని శిశువులను నీపొట్టను బెట్టుకొన్నావు? నీ యశనాశ కిప్పటికిని పరిమితిలేదా? ఇప్పుడు నీ క్రూరకృత్యములను విడిచిపెట్టవలసిన కాలము వచ్చినది.

నేరములు పట్టుకొనుటకై నియమింపఁబడియుండు రాజకీయ భటులవలని గాని, యుద్యోగస్థులవలనిగాని భీతివలన ఈపనిఁ జేయ వెనుకదీయువారు తాము కన్న పిల్లలను వేశ్యాంగనలకును, మాల వాండ్రకును, వీధులు తుడుచు వాండ్రకును ఇచ్చి వేయుదురు. అయ్యో ! ఉత్తమకులమునందుఁ బుట్టిన బిడ్డలు భోగస్త్రీలుగాను, చెప్పులు కుట్టువారుగాను, పెంటలు బాగుచేయువారుగాను అగునట్లు చేయఁబడుచున్నారు! ఈ యనర్థముల కన్నిటికిని కారణము కులా చారమే. ఇవి తల్లిదండ్రుల, యిల్లు విడిచి వెళ్ళలేని స్త్రీలు చేసెడి యపరాధములు (?) భ్రూణహత్యలు, శిశుహత్యలు, శిశువులను పాఱవేయుటలు ఇవియన్నియు మన యాచారమువలన సంభవ మగుచున్న ఫలములు. ఇట్టి యాచారమును మన తండ్రులును, తాత లును అనుసరించిరి కాఁబట్టి మనమును అవలంబింపవలెను ! పై నుదాహరింపఁబడిన నేరములు మాత్రమే కాక, అట్టినేరములు చేసి వారను సనుమానము సహితము వారిని రాజకీయశాసనములయొక్క

మృదుతరకటాక్షముల కొప్పగింతపెట్టునని మేమిక్కడఁ జెప్ప నక్కఱయుండదు. కులమువారి భయమువలనను, ప్రసవము నాప శక్యము కాదను నిరాశవలనను, తమరు కన్నకూఁతులకే తండ్రు లెన్ని మాఱులు విషము పెట్టినారుకారు? విధవలయిన కొమార్తెల విట పురుషులకు తల్లులు విషము పెట్టుచుండలేదా? నిజమునకు ప్రకృతి ధర్మమేయైనను తాము పాపమని భ్రమించిన దానిని వారించుటకై నిర్భాగ్యులయిన తలిదండ్రులు ఘోరతరపాతకములను జేయుచుండ లేదా? కులమువారి శిక్షను తప్పించుకొను నిమిత్తము వారు చేసిన పాపకార్యముల శిక్షను వారనుభవింపవలసిన వారు కారా? మే మింతవఱకును జెప్పి ఒకతరగతి స్త్రీల విషయమయి మాత్రము మాటాడియున్నాము. రెండవతరగతి స్త్రీలు కులమునం దంతగా గౌరవ ముంచువారు కారు. తల్లిదండ్రులయెడఁ గల ప్రేమానుబంధ మయినను వారిని వారింపఁజాలదు. జననీజనకులను; గృహములను వారు ప్రేమింతురుగాని, వారిప్రేమ కంతకును ముఖ్యాస్పదమయిన యొక్క పదార్థమును ప్రపంచమును విడిచిపోయినది. ఇఁక వారు మఱుఁగు చొచ్చుటకు కులమువారిలో నేమియు నాధారము లేదు. కులమును యితరుల దౌర్బల్యమును జూచి యపరాధము లెంచుట కిష్టమును సిద్ధపడి యుండుటయేకాని వారి విషయమయి లేశ మయినను దాక్షిణ్యము పూనకున్నది. కాఁబట్టి, వారవలంబించెడి యుత్తమపద్ధతి కులము నతిక్రమించి ప్రవర్తించుటయే. అట్లు చేయుటయు వారికి నైసర్గికమే. కులమునకు వారియెడల నాదరము లేనపుడు వారికి కులమునెడ నాదరము లేకపోవుట యద్భుతముకాదు. కులమునువిడిచి వారెక్కడకుఁ బోవుదురు? బహిరంగముగా నిల్లు విడిచి జారవృత్తియందుఁ బ్రవేశింతురు. ఇటువంటి విషయములలో

వారిస్థితి వేశ్యలస్థితికంటెను హీనమయినదిగా నుండునని మీరెఱుఁగుదురు. వేశ్యలు బాల్యమునుండియు నభ్యాసము చేసెడి మాయలేవియు వారికిఁ బట్టుపడవు. ఓ దేశీయులారా! మేముసంగతుల సగము సగము చెప్పలేదు. హిందూదేశమునందు ప్రతి పురుషుఁడును కనుచుండునట్టియు, అదృష్టహీనులయిన జననీజనకు లనేకులుఁ తఱుచుగా మనసు కుంద దుఃఖించుచుండునట్టియు సంగతులనే మీ కన్నులయెదుటఁ బెట్టియున్నాము.

దేశీయులారా! మీ దేశముయొక్క పూర్వపు మహోన్నతదశను, ఇప్పటి యత్యంత నీచదశను కొంచె మాలోచించుకొండి. మనపూర్వులనుండి విద్యాబుద్ధులను నేర్చుకొన్నవారు మనలను భ్రష్టులగుచున్నారని వ్రేలుపెట్టి చూపుచుండఁగా, అటువంటి మహానుభావుల సంతతివార మయ్యును చేతులు వలుపుకొనుచు మన మూరక కూరుచుండ వలసినదేనా? మన స్త్రీలను గుడిసె వేటులయి బహిరంగముగా వ్యభిచరించుటకయి మనము పంపివేయవలసినవారమేనా? ఓ బ్రాహ్మణులారా! విధవలయిన మీ కొమార్తెలు కష్టజనులను తగులుకొని లేచిపోయి కడపక మీకన్నుల యెదుటనే జారిణులై పడుచుకొనుచుండఁగా మీరు చూచుచు నూరకుండెదరా? మీగొప్పతనమున కంతకు నిదియే లక్షణమా? బుద్ధిసంపదయందితరులకంటె నధికులని ప్రసిద్ధి గనుచున్నట్టియు దేశముయొక్క పరిపాలనమును పూర్వము నిర్వర్తించియుండి, యిప్పుడట్టి పరిపాలనములో భాగము కావలెనని కోరుచున్నట్టియు జనుల వివేకమంతయు నిదియేనా? మీపూర్వులు లక్షలకొలఁది జనులకు ధర్మశాస్త్రములను జేసి వారిని యుక్తధర్మములయందుఁ బ్రవర్తింపఁజేసి యుండఁగా, మీరు మాత్రము మీప్రవర్తనమునయినను బాగుచేసికొనుటకు శక్తి

లేనివారయి యొుక దుష్టాచారమునకు దాసులయి యూరకుండెదరా? ఓ దేశీయులారా! బ్రాహ్మణులారా! మీ పెద్దలసంగతి జ్ఞప్తియం దుంచుకొని, వారిని జూచియైనను వారి మహాత్త్వమునందు గౌరవబుద్ధి యుంచి యీ దుష్టాచారమునకు మిమ్ముల బద్ధులనుగాఁ జేసినకట్లను త్రెంచుకొని, వారి గౌరవమునకు మీరు క్రొత్తగా నేమియుఁ జేర్ప లేకపోయినను మునువున్న దానినైనను నిలువఁబెట్టుఁడు. నష్టకరము లని తోఁచినప్పుడెల్లను మీ పూర్వు లాచారములను మార్చుకొనుచు రాలేదా? వారు ప్రదర్శించిన మార్గమును మీరవలంబింపరాదా? ఈ యాచారమువలన నష్టములు ప్రత్యక్షముగా మీకుఁ గనఁబడు చుండఁగా, వారు చేసినపనిని మీరు చేయరాదా? ఆచారమునుండి మనము తొలఁగి ప్రవర్తించునెడల, ఏ మార్పును మనము తెచ్చిపెట్ట వలయునని మీ రడుగవచ్చును. మీ ప్రశ్న కుత్తరము చెప్పుటకై, ఈ దుర్దశ లన్నిటికిని మూలకారణమును మరల మేము చెప్పవలసి యున్నది. వచ్చినతరువాత మాన్పఁ బ్రయత్నించుటకన్న మొదటనే రాకుండఁ జేసికొనుట యుత్తమకార్యము; నిర్బంధముచేతఁగాని సుబో ధలచేతఁగాని బాలవిధవల నందఱిని మనము మహాపతివ్రతలనుగాఁ జేయఁగలమా? చేయలేము. మన మనుష్ఠించుటకయి యున్న యాధారమెల్లను స్త్రీలకు పునర్వివాహము చేయుటయే. మనశాస్త్రము విధవావివాహము నంగీకరించునని మాకు రూఢిగాఁ దెలిసియున్నను, ప్రస్తుతము యుక్తవయస్సు రాకమునుపు భర్తలను పోఁగొట్టుకొన్న వారికి మాత్రము వివాహములు చేయింపఁ బూనుకొన్నాము.

దేశీయులారా! మీరు నాయకత్వమును వహించి యీ సత్కా ర్యోద్ధారణమును నడిపింప నమ్మతింతురేని, మీకు మనఃపూర్తిగా సర్వసహాయములను జేయుటకు సిద్ధముగా నున్నాము. మీరు సంశ

యుంచెడి పక్షమున మేము నడిపెదము; మీరు మాకు సముఖులగుదురేని, శుద్ధమైన మనజాతి కంతకును అపకీర్తికరమయిన గొప్పకళంకముగానున్న యీ దురాచారమును నివర్తింపఁజేయుటకై శక్తివంచనలేక ధైర్యముతో మాచేతనైనంతయుఁ జేసెదము. మన పూనిక కిష్టము లేనివారు కొందఱున్నారని మీరు చెప్పవచ్చును. మన పక్షమునకు విరోధులున్నారు—ఉన్ననేమి ? ప్రతికార్యమునకును ప్రతికూలురు కొందఱుండరా ? ప్రతిపక్షమే లేనియెడల, ఘనత యెక్కడిది ? పూర్వపక్ష మెంత యధికముగా నుండునో ప్రతిష్ఠయు నంత యధికముగా నుండును. మొట్టమొదట పూర్వపక్షకోటి యెంత ప్రబలముగా నుండినను, అదియంతయు క్రమక్రమముగా నశించి పోవును.

మేము మిమ్మిప్పుడు కోరఁబోవు తోడుపాటు రెండువిధము లయినది. మొదటిది స్త్రీపునర్వివాహము చేసికొనువారితో నిరభ్యంతరముగా సర్వకార్యములయందును కలిసి యుండుట. రెండవది ధన సాహాయ్యము.

ఈ ద్వివిధ సహాయత్వమును చేసెదమని వాగ్దానము చేసిన వారిని మే మీవఱకే కొందఱిని సంపాదించియున్నాము. అనేక హేతువులనుబట్టి మొదటి విధమైన సాహాయ్యమును జేయ సిద్ధపడువారిసంఖ్య తక్కువగానే యుండును. ఐనను మమ్మది ప్రోత్సాహపఱచుటకుఁ జాలియుండలేదని మే మెంచుకోలేము. ద్వితీయవివాహములు జరిగించుటకు కొందఱు బీదకుటుంబములవారు బయలుదేఱుచున్నందున, అట్టిబీదలను సంరక్షించుచున్నట్టియు, ఈనూతనపద్ధతి కిష్టములేనట్టియు ధనికులు వారిని వదిలిపెట్టుదురేమోయని భయపడవలసి యున్నది. అట్లగుట యిట్టి వివాహసంబంధములయందుఁ ప్రవేశించువారికి మిక్కిలి

నిరుత్సాహకరముగా నుండును గనుక ఇటువంటి యిబ్బందికిఁ దగిన ప్రతిక్రియను విచారించుట యావశ్యక మగుచున్నది.

హిందూదేశమునందలి రాజకుమారులారా! ఓ సంస్థానాధిపతులారా! మీపూర్వులు మతసంబంధ మయినట్టియు, సర్వజనోపయుక్తము లయినట్టియు నూతనసిద్ధాంతముల నాదరించి, కవులచేత కీర్తికాయులుగాఁ జేయఁబడి యున్నారు. ఓ రాజచంద్రులారా! సంస్థానాధిపతులారా! దేశముయొక్క యభివృద్ధికొఱకును క్షేమముకొఱకును ఈదేశము మిమ్మే దృఢముగా నమ్ముకొని యున్నది గాన, మీయౌదార్యమును గనఁబఱిచి యీ యుద్యమమునకు తోడుపడుఁడు.

హిందూదేశమునందలి విద్యాసంపన్నులారా! ఈదేశము మిమ్ములనుండియే యెంతో మేలును పొంద ప్రతీక్షించుచున్నది. లోకమంతయు దేశాభివృద్ధికొఱకు మీనిమిత్తమె యాశపడి చూచుచున్నది. అభిముఖులై వచ్చి మీ తోఁబుట్టువులకు సహాయము చేయుఁడు "సంఘే శక్తిః కలౌయుగే" అని యుండుటవలన, వచ్చి యౌదార్యముతో సహాయులరు కండి. మీరు సిద్ధపడుఁడు. మేము వెనుకదీయఁగలవారము కాము. మేము మనఃపూర్వకముగా పని చేయుచున్నవారమని నమ్ముఁడు.

శ్రీపునర్వివాహప్రవర్తక సమాజము. } కం. వీరేశలింగము,
రాజమహేంద్రవరము, సెప్టెంబరు ౧౮౭౮ } కార్యదర్శి.

# గోదావరీమండల సాంఘికసభలో
# చేసిన ప్రసంగము.



By

**K. VEERESA LINGAM**

ఏలూరులో జరిగిన మూడవ గోదావరీ మండల సాంఘికసభలో సభా నాయకత్వము వహించినప్పుడు చేయఁబడిన ప్రసంగము.

---

ఓ మహాజనులారా !

నాకంటె సమర్థతరులైన వా రనేకులుండఁగా, మీరు దయాపూర్వకముగా నన్నే నేఁడు సభానాయకత్వమునకు నియమించినందుకు మిక్కిలి కృతజ్ఞత గలవాఁడనయి మీ కనేకాభివందనములు సమర్పించుచున్నాఁడను. మ. రా. శ్రీ. దీ ఆనరేబిల్ న్యాపతి సుబ్బారావుపంతులుగారు నేఁడు సభానాయకత్వమును వహించుటకు మొట్టమొదట నేర్పాటు జరిగినను కొన్నికారణములచేత వారు నేఁ డిచ్చటకు రాలేకపోయినందునకుఁ జింత నొందుచున్నాను. వారే నేఁ డగ్రాసనాసీనులయియుండుట తటస్థించిన పక్షమున, మీరు శ్రవణానందకరమయిన మంచిప్రసంగమును వినియుందురు. నేను వక్తను గాను. కాఁబట్టి మీలో నెవ్వరును నేఁడు నావలన హృదయాహ్లాదకరమయిన యుపన్యాసము నెదురుచూడఁ బోకుఁడు. సభలో నగ్రాసనాధిపత్యమును వహించువారు నాఁటిదినము విచారింపఁబోయెడి యంశములనుగూర్చి ముందుగాఁ బ్రసంగించుట యాచారమయి యున్నందున నేనును నేఁడిచ్చట నిర్ధారణము చేయ నేర్పఱుచుకొన్న విషయములను గూర్చి రెండేసిమాటలు చెప్పక తప్పదు.

సంఘసంస్కారవిషయములను జర్చించుటకయి యిక్కడ మీ రింతమంది కూడుట నాకెంతో సంతోషకరముగా నున్నది. రాజ్యతంత్రసంస్కారమునకంటె ముందుగాఁ గాకపోయినపక్షమున దానితో

సమానముగా నైనను సాంఘికసంస్కార మవశ్యకముగా నడుచు చుండవలెను. సాంఘికసంస్కారము జరగకపోయినయెడల రాజ్యతంత్రస్వాతంత్ర్యములవలని ఫలములను మన మెన్నఁడును బూర్ణముగా ననుభవింప శక్తులము కాము. ఈ మండలసభయొక్క ప్రథమ దినమునం దొక రన్నట్టుగా సంఘసంస్కార మాత్మసంస్కారము వంటిది; రాజ్యాంగసంస్కారము బాహ్యసంస్కారమువంటిది. ఆత్మ సుఖస్థితియం దున్నమీఁదటఁగాని బాహ్యసుఖము లానందప్రదములు కాఁజాలవు. దేహమంతయు లోపల జ్వరముచేత తపించుచున్నప్పుడు పయి శీతలోపచారము లేవి తాపనివారకములు కాఁగలుగును ? లోపల జీర్ణశక్తి చెడి యున్నప్పుడు బాహ్యములయిన యుత్తమపదార్థము లేవి బలదాయకములు కాఁజాలును ? బాహ్యపదార్థముల ననుభవించి సుఖపడఁ గోరెడు పక్షమున ముందుగా మనము లోపలి వ్యాధులను పోఁగొట్టుకొని సమస్తాంగములను సుఖస్థితికిఁ దెచ్చుకోవలెను. మన సంఘస్థితి యుండవలసినరీతిగా నుండ లేదనియు, సంఘమును బాధించుచున్న యనేక దురాచారరోగములను నివారణము చేసికొని పూర్ణారోగ్యదశ నొందఁ బాటుపడుట యావశ్యకమనియు నిప్పుడిప్పుడు కొంచెముగానో గొప్పగానో యెల్లవారును దెలిసికొనుచున్నారు. సంఘసంస్కారము మనలో మనము చేసికోవలసినది; రాజ్యాంగసంస్కారమో యితరుల యనుగ్రహమువలనఁ గలుగవలసినది. ప్రయత్నము చేసినచో సంఘసంస్కారము జరుగుట నిశ్చయము; రాజ్యాంగసంస్కారము జరుగుట సంశయము. కాఁబట్టి చేతిలోనున్న సంఘసంస్కారకార్యము నుపేక్షించుట వివేకులకు ధర్మముగాదు. బాహ్యములయిన రాజ్యాంగస్వాతంత్ర్యములు లక్ష కలిగినను లోపల సాంఘికస్వాతంత్ర్యములు లేక నిజమైన సౌఖ్యము కలుగఁజాలదు. గనుక నేఁ డిక్కడ దయచేసిన మహాజనులందఱును

సాంఘికసంస్కార విషయమున శ్రద్ధ వహించి పనిచేయుదు రని నమ్ముచున్నాను.

సాధ్యమైనవఱకు వివాహవ్యయములను తగ్గించుటకయి కృషి చేయవలె ననుట మన మిప్పుడు నిర్ధారణము చేయవలసిన విషయములలో నొకటిగా నున్నది. వివాహసమయములయం దిప్పుడు చేయఁబడుచుండెడి వ్యయములలో ననావశ్యకములయిన వనేకములున్నను వానిలో ముఖ్యములైన యొకటి రెంటిని గూర్చి మాత్రము నేను రెండుమాటలు చెప్పుచున్నాను. సదస్యదినమున భూరిసంభావన యను పేర బ్రాహ్మణులకు ధనదానము చేయుట కలిగినవారిలోను లేనివారిలోనుగూడ నిప్పుడొక దురాచారమయి యున్నది. ఆ సమయమునందు దాత తన శక్త్యశక్తులను విచారింపక వ్యర్థదంభముచేతను స్తోత్రప్రియత్వముచేతను తాను ధనసంపన్నుఁడు కాకపోయినను ఋణములు చేసియు భూములు విక్రయించియు వచ్చినవారికెల్లను ధనము పంచిపెట్టుచున్నాఁడు. అప్పు డిచ్చెడు విత్తము మొత్తముమీఁద తలకొక డబ్బు మొదలుకొని రూపాయకు మించకపోయినను స్వీకరించు బ్రాహ్మణోత్తములకు దానివలన సంతృప్తి కలుగకపోయినను, ఇచ్చెడి గృహస్థునకు మాత్ర మధికధనవ్యయమయి కొన్నిసమయములయందు బహుకష్టములకుఁ గారణమగుచున్నది. భూరిసంభావనల మూలమునఁ జెడిపోయి నేఁటికి పేదలయిన వారి ననేకులను నే నెఱుఁగుదును. రాజమహేంద్రవరమునం దొక సంపన్నగృహస్థుఁడు పేరున కాశపడి పెండ్లిసమయమునం దిచ్చిన దొడ్డిసంభావనమూలమున భూములను గ్రామములను బోఁగొట్టుకొని, యూళ్లేలినవాఁడు భుక్తికిఁ జాలక కష్టపడుచుండఁగా నేను జూచియున్నాను. అంతధనమును స్వీకరించి యా వివాహసమయమునందుఁ జేసిన మహదాశీర్వచనము తరువాత నెట్లు

ఫలించినదో చిత్తగింపుడు. వరుఁడు వివాహమయిన యల్పకాలము లోనే యీ లోకమును విడిచిపోయెను; వధు పట్టి భాగ్యమునకు నోచుకోకపోయినను యుక్తవయస్సు వచ్చిన పిమ్మటఁ దానును యథాశక్తి నుపభర్తతో నిల్లువిడిచి లేచిపోయెను. నాలుగుదినములు నలుగురిలో దలయెత్తుకొని తిరుగఁగలుగుటకయి పనికిమాలిన యపాత్రదానములు చేసి తరువాత యావజ్జీవమును తలవంపులు తెచ్చుకొనుటకంటెఁ బెండ్లి నాలుగుదినములు సూచకాధముల దూషణములకు తలయొగ్గి తరువాత నెల్లకాలము హాయిగా తలయెత్తుకొని తిరుగఁగలుగునట్లు వర్తించుట యెంత శ్రేయస్కరము! వివాహసమయములయందు భోగముమేళము నిమిత్తము చేయునది యింతకంటెను దుర్వ్యయము. అది యిందు ప్రత్యేకవిషయముగా నున్నందున దానినిగూర్చి ముందు కొంత చెప్పెదను.

మనము నిర్ధారణము చేయవలసిన విషయములలో నింకొకటి బ్రాహ్మణాదివర్ణములలోఁగల శాఖలలోను ఉపశాఖలలోను భోజన ప్రతిభోజనములను సంబంధబాంధవ్యములను నెలకొల్పుట యావశ్యకమని; పూర్వకాలమునందు వర్ణములు నాలుగే యేర్పడినను కాలక్రమమునఁ బ్రతివర్ణములోను శాఖోపశాఖ లంకురించుచు వచ్చి బలపడి యిప్పుడు లెక్కకెక్కువయయి యనేకానర్థములకు మూలములగుచున్నవి. ఈ యీ శాఖోపశాఖలలోనివారు తమలో తామే కాని వివాహసంబంధములు చేసికొనరాదని పనికిమాలిన నియమ మొకటి యేర్పఱుచుకొని యుండుటచేతఁ గొన్నిశాఖలలో వరునకుఁ దగిన వధువు దొరకకయు వధువునకుఁ దగినవరుఁడు దొరకకయు పెక్కుబాధలు కలుగుచున్నవి. రాజకీయాధికారధూర్వహుఁడయి ధనసంపన్నుఁడయి యున్న గృహస్థు విద్యావతియు రూపవతియు గుణ

మతియు నైన తన పుత్రికను దన శాఖలోనివానికే యియ్యవలెనన్న నిర్బంధముచేత విద్యాగంధమెఱుఁగని పశుప్రాయునకో చేష్టలయందే కాక రూపమునందును మర్కటమును బోలిన రూపగుణహీనునకో కట్టిపెట్టవలసినవాఁ డగుచున్నాఁడు. అట్లు లభించువరుఁడు నిర్ధనుఁడును వృద్ధుఁడును నగుటకూడఁ దటస్థించెనా కాపురమునకుఁ బోయిన తరువాత కన్య పడు పాట్లు భగవంతుఁ డెఱుఁగును. ఇట్టి వివాహములు సాధారణముగా సుఖప్రదములగుటకు మాఱుగా దుఃఖకరము లగుచున్నవి. ఒక్క వర్ణములోని శాఖోపశాఖలలో నన్యోన్యవివాహములు లేకపోవుటయే కొంతవఱకు ధనాశాపరులలో కన్యాశుల్కమునకును వరవిక్రయమునకును గారణమగుచున్నది. ఇట్టి యశాస్త్రీయములైన యనావశ్యక నిర్బంధములు లేక బ్రాహ్మణులలోను తక్కిన వర్ణములలోను శాఖోపశాఖలలో పరస్పరసంబంధబాంధవ్యము లున్నపక్షమున నిట్టి యనర్థము లనేకములు రూపుమాసి పోవుననుటకు సందేహము లేదు. శాఖాభేదమును పాటింపక మనలోని చదుకొన్నవా రితర శాఖలలోని తగు మనుష్యులతో వియ్యమంది సామరులకు మార్గప్రదర్శకు లగుదురుగాక !

ఇప్పుడు విచారింపవలసిన యంశ మింకొకటి యీ దేశములో స్త్రీవిద్య తగినంత వృద్ధికి రావందునకు మన విచారమును దెలుపుచు ప్రముఖులుగా నున్నవారి నందఱిని స్త్రీవిద్యాభివృద్ధికొఱకై గట్టికృషి చేయఁ బ్రార్థించుటనుగూర్చి. ఈ కాలమునందు స్త్రీవిద్య యావశ్యకమని చూపుటకయి యుక్తిబాహుళ్య మక్కఱలేదు. “విద్యావిహీనః పశుః” అని మనపూర్వులే చెప్పియున్నారు కదా ? విద్యను నేర్చియుండుటయే మనుష్యలక్షణము. మనుష్యరూపమును ధరించియున్నను విద్యాగంధము లేనివాఁడు నిజముగా ద్విపాదపశువే. స్త్రీ

తాను పురుషునిలో నర్ధభాగమని నాగరికతాలేశముగల యెల్లదేశములవారును ఘోషించుచున్నారు. స్త్రీపురుషు లిద్దఱును గలసి యేకదేహ మని ఘోషమిడుచున్నప్పుడు పురుషుల విద్యాభివృద్ధినిమిత్తమయి శ్రద్ధవహించుచు స్త్రీల విద్యాభివృద్ధి నిమిత్తమయి యుపేక్షచేయుట నేకదేహములో నర్ధభాగమును మనుష్యునిగాఁజేసి తక్కిన యర్ధభాగమును మృగమునుగా నుంచుటయే కాని వేఱుకాదు. స్త్రీలు విద్యావతులు కానంతవఱకు మనదేశము బాగుపడదు. మన యభివృద్ధి యంతయు స్త్రీల యభివృద్ధిలోనే యున్నది. నాబుద్ధికిఁజూడ మనకిప్పుడు రెండుగతులు మాత్రమేకనబడుచున్నవి. మనతో సమానముగా స్త్రీలకు విద్యచెప్పించి వారితో గలసి మన మూర్ధ్వగతికైనను బోవలెను. లేదా, వారిని మూఢదశయందుంచి వారితోఁ గలిసి మన మధోగతికైనను బోవలెను. ఈ రెంటికంటెను మనకు వేఱుగతి లేదు. పయికయినను క్రిందికయినను బోవుచుండక త్రిశంకుస్వర్గమువలె నడుమ నూగులాడుచుండుట మనుష్యస్వభావము కాదు. పురుషుఁడు తానెంత స్వతంత్రుఁడనని విఱ్ఱవీఁగువాఁ డయినను కార్యములలో స్త్రీకి దాసుఁడు కాక తప్పదు. గృహమునకు రాణి యనఁదగిన స్త్రీ మాట చెల్లును. గాని యింట బురుషునిమాట చెల్లదు. స్త్రీలను విద్యావతులనుగాఁ జేసినచో వారు సమస్త సత్కార్యములయందును మనతో నేకీభవించి మన పురోభివృద్ధిలో సహాయురాం డ్రగుదురు. స్త్రీల నవిద్యావతులనుగా నుంచినచో వారు సమస్త సంస్కారములయందును మనతోఁ గలహించి మన పురోభివృద్ధికిఁ బ్రతిబంధకారిణు లగుదురు. కాఁబట్టి పురుషుని వృద్ధిని గోరువారందఱును తప్పక స్త్రీలను విదుషులనుగాఁ జేయ సర్వప్రయత్నములను జేయవలెను.

నేఁడు నిర్ధారణము చేయఁబడవలసినది వితంతు వివాహములను

ప్రోత్సాహకులుగ నుండవలయుననియు విధవలను విరూపిణులనుజేసెడి యాచారమును నిరుత్సాహపరుపవలయు ననియు ప్రముఖులుగా నుండువారిని కోరుట మఱియొకవిషయముగా నున్నది. ఇది యీ ప్రాంతములయందు బహుసంవత్సరములనుండి చర్చింపఁబడుచున్న విషయము. మన కడుపునఁ బుట్టిన వితంతుబాలికలును తోడఁబుట్టిన యనాథయువతులును పసితనమునందే భర్తలనుగోలుపోయి దుర్లంఘ్యమైన దురాచార పిశాచబలముచేత యావజ్జీవమును దుర్భరవైధవ్యదుఃఖముల ననుభవింపవలసినవారగుచుండఁగా శక్తులమయ్యును వారియాపద తొలఁగింపఁ జూడకుండుటకంటె క్రూరకృత్యము వేఱొకటి యేముండును? మన తోఁబుట్టిన పడుచులయొక్కయు పుత్రికలయొక్కయు స్వాతంత్ర్యములనుమన్నించి వారిని సుఖపెట్టలేనివారము రాజ్యతంత్రస్వాతంత్ర్యములు లభించినప్పుడు పరుల నేమి సుఖపెట్టఁగలుగుదుము? మన యిల్లు బాగుచేసికోలేనివారము లోకము నేమి బాగుచేయగలుగుదుము? ముందు స్వకుటుంబసౌఖ్యమును సమకూర్చుచు గృహపరిపాలనము చక్కఁగా నిర్వహించికదా ప్రజాసౌఖ్యమును సమకూర్చి స్థానికపరిపాలనమును వహించుట కర్హుల మని చూపవలెను? స్థానికప్రభుత్వమునకయి కృషిచేయుచున్న మనవారందఱును హిందువులు క్రూరాచారపిశాచావేశముచేత స్వకృత్యము నెఱుఁగజాలక తమగర్భవాసమునఁ బుట్టిన యనాథబాలలను బాధించుచున్నారన్న యపయశమును మనలోనుండి తొలఁగించుటకయి నిరంతరప్రయత్నము చేయవలెను. భర్తృమరణశోకముచేత పరితపించుచున్న యనాథకాంతల తల గొఱిగించుట తలతఱిగించుటకన్నను క్రూరకృత్యము-జన్మాదిగా నబలల కలంకారముగా నీశ్వరుఁడు దయచేసిన మృదుశిరోజములను మంగలవాని కఱకుకత్తుల కప్పగించుటకంటెఁ బురుషుల కధికావమానకరమైనకర్మము మఱి యేముండును? హృదయమున కరుణ

యున్నది యేమూలలనైనను గొంచెమున్నవారి కీవిషయమునుగూర్చి చెప్పవలసిన పనిలేదు. చెప్పుటకును వినుటకునుగూడ నాకును మీకును సంతాపకరమయిన యీ విషయమును విడిచి తరువాతి విషయమునకుఁ బోదము.

పదిసంవత్సరములకు లోపలియీడుగల బాలికలకును పదునారేండ్లకు లోపలి వయస్సుగల బాలురకును వివాహము చేయుటయు, ఏఁబదియేండ్లు దాటిన పురుషులు పదునారేండ్ల లోపలి ప్రాయముగల కన్యలను వివాహమాడుటయు, ప్రజాక్షేమమునకు భంగకరమన్న మన నిశ్చితాభిప్రాయమును బ్రకటించుచు మైసూరి వివాహశాసనమువంటి శాసనము నొకదానిని జేయ దొరతనమువారిని ప్రార్థింపవలయు నన్నది తరువాతి విషయము. శిశువివాహమువలనఁ గలుగుచున్న యనర్థము లిన్నియన్ని యని చెప్పశక్యముకాదు. ఈ యతిబాల్యవివాహమువలననే మనదేశమునందు బాలవితంతువుల సంఖ్య నానాటికి వర్ధిల్లుచున్నది; ఈ యతిబాల్యవివాహమువలనే కన్యాశుల్కములు ప్రబలుచున్నవి. కన్యాశుల్కమును గైకొని జననీజనకులు తమకూఁతులను వృద్ధులమెడలకుఁ గట్టిపెట్టక పోయినను వధూవరులలో నకాలమరణములు సంప్రాప్తము కాకపోయినను, బాల్యవివాహమువలన దంపతులనేకులు విపద్దశల పాలగుచున్నారు. చిన్నతనములో నెవ్వరివర్తన మెట్లగునో, ఎవ్వరికేమి ప్రాప్తమగునో, తెలియదు. పరమసాధ్వియైన కన్యకామణియొక్క బాలభర్త ప్రాయము ముదిరినతరువాత వేశ్యలయింటిబంటయి కులకాంతనొల్లని శృంగారనాయకుఁడుకావచ్చును. పరమసాధువైన పురుషరత్నముయొక్క పసిభార్య యేండ్లు పైఁబడినకొలఁదిని గయ్యాళితనమునకుఁ గుండు మీఁది గృహము నరణ్యముగామార్పఁగలిగిన ప్రత్యక్షరాక్షసి కావచ్చును. స్ఫోటకము మొదలైన రోగములచే వధూవరులలో నొకరు వికలాం

గులో విముఖులోయయి వివాహబంధమును దుర్భరదుఃఖజనకము నుగాఁ జేయవచ్చును. ఇవియన్నియు నటుండఁగా బాల్యవివాహము కన్యావరులవిద్యకు వినాశనమును గలిగించి వారి సౌఖ్యమునకుఁ గొఱఁత దెచ్చును. ఈ బాలభర్త క్రిందితరగతులలోఁ జదువుకొను చుండఁగానే భార్య యెదిగి కాపురమునకు వచ్చుట తటస్థించి కష్టము లెఱుఁగక యుల్లాసస్థితిలో నుండవలసిన విద్యార్థిదశలోనే సంసార భారమును సంతానశోకమును మోఁపఁబడి పురుషుఁ డుత్సాహహీనుఁ డయి యకాలవృద్ధుఁడు కావలసివచ్చును. ఇంగ్లీషువిద్య నేండ్లు మీఱిన తరువాతనే యారంభించినను పెండ్లిని మాత్రము గోచి పెట్టుకొని యీడుననే చేసెదరు. నా చిన్నతనములో నా సహపాఠి యొకఁడు ప్రవేశ పరీక్షతరగతికి వచ్చునప్పటి కాతని కుమారుఁడును మా పాఠశాలలోని క్రింది తరగతిలోఁ జదువ నారంభించెను. అది చూచి యాతనిని తోడి విద్యార్థులందఱును పరిహసింపఁ జొచ్చినందున సిగ్గుచేత నతఁడు పరీక్షయందుఁ గృతార్థుఁడు కాకయే పాఠశాలను విడిచి తనపురోభి వృద్ధికి భంగము తెచ్చుకొనవలసినవాఁ డయ్యెను. విద్యకు వినాశకర మయిన దగుటచేతను, అనేకానర్థములకు మూలమయిన దగుట చేతను, వివేకు లందఱును బాల్యవివాహములను సాధ్యమైనవఱకు నిరుత్సాహ పఱుపవలెను.

ఇప్పుడు విచారణీయమైన మఱియొక యంశము కన్యాశుల్కమును వరవిక్రయమును మాన్పఁ బ్రయత్నింపవలె ననుట. ఈ కన్యాశుల్కము బాల్యవివాహవిషవృక్షమువలనఁ గలిగెడు దుష్ఫలములలోఁ బ్రధాన మయినదని చెప్పవచ్చును. కన్యాశుల్కరూపమయిన నరమాంసవిక్రయము క్రూరకిరాతుఁడు చేయు గోమాంసవిక్రయమునకన్నను ఘోరతర మయిన దని చెప్పవచ్చును. కటికివాఁడు

చేయు మాంసవిక్రయములో చంపఁబడిన జంతువు బాధ యాక్షణము లోనే యంతము నొందును; ఈ నరమాంసవిక్రయములో బాధ యావజ్జీవము నుండును. పొట్టకయి తాను బెంచిన కోడిపెట్ట మెడను నలిపి చంపెడు దయావిహీనునికంటెను నిర్దయుఁడయి కన్యాశుల్కమును గ్రహించెడు నరపశువు తాను కని పెంచిన ముద్దుపట్టిని గర్భదరిద్రునకో రోగపీడితునకో పండ్లూడిన ముదిపెండ్లికొడుకునకో బ్రతికియున్నంతవఱకును బాధపడునట్లుగా వివాహవ్యాజమున బలిపెట్టుచున్నాఁడు. కడుపునఁ బుట్టిన కన్యలను బాధలపాలుచేయఁ బితృరూపమున నవతరించిన యీ కలియుగరాక్షసులను జాతినుండి బహిష్కరించుచు వచ్చినఁగాని యీ యనర్థము కొంతవఱకైనను తొలఁగదు. దీనిని బూర్ణముగా రూపుమాపవలె నన్న పక్షమున బాల్యవివాహములను మాని యుక్తవయస్సు వచ్చిన తరువాత వరులను వరించెడు స్వాతంత్ర్యమును వధువుల కియ్యవలెను. స్వయంవరముగల యితర దేశములలో మాత్రము వృద్ధులు వయస్సులోనున్న కన్నెలను బెండ్లియాడుచుండ లేదాయని కొందఱడుగవచ్చును. బొత్తిగా లేదని నేను చెప్పఁజాలనుగాని కన్య యిష్టపడి వరించుటచే నందు దోషమేదియు లేదు. ఒకఁడు తాను బుద్ధిపూర్వకముగాఁ జేసినప్పుడు మంచిదయిన పనినే, యితరులు వానిచేత బలవంతముగాఁ జేయించినప్పు డది పాపకార్య మగును. దానము చేయుట సత్కార్యమని యెల్లవారు నెఱుఁగుదురు. ఒకఁడు క్షుద్బాధితునినో రోగపీడితునినో చూచినప్పుడు మనస్సు కరఁగినవాఁడయి తన వ్రేలి నున్న యుంగరమునో చెవినున్న పోగులనో తీసి వాని కిచ్చిన యెడల దాపున నున్నవారందఱును సత్కార్యము చేసెనని యా దాతను మెచ్చుకొందురు. అట్లతఁడు బుద్ధిపూర్వకముగా దానము చేయకున్నప్పుడు దాపుననున్నవారిలో బలవంతులయిన యిద్దఱు

పయోధరు తల బద్దలుకొట్టెదమని బెదరించియో మోసఁబడి యూపఁ బెరికియో యా యుంగరమునుగాని పోగులనుగాని యా బీదకో రోగికో యిప్పించినను దానిని దాపుననున్నవారు గొల్లిటివలెఁ బుణ్యకార్య మని మెచ్చుకొనక యా పనికి దారిదోపిడియనియు దొంగతనమనియు పేరులుపెట్టి పాపకార్యమునుగా బరిగణించి దూషింతురు. ఈ విధము గానే వితంతుకాంత కాంతునిపయినిగల ప్రేమాతిశయముచేతఁ బున ర్వివాహము నొల్లక బ్రహ్మచర్యమునకుఁ బూనినచో నా పని శ్లాఘ్య మగును; ఆ పనినే యితరులు నిర్బంధపఱిచి చేయించినచో దూష్య మగును. వితంతువు లందఱును బునర్వివాహము చేసికొనుట విధి కాక పోయినను వివాహము చేసికో నిచ్ఛగలవారి కనుజ్ఞ నిచ్చుట మాత్రము మనకుఁ గర్తవ్యము. మూఁడేండ్లప్పుడు ముండమోసిన దానినిగూడ మగలఁ బెండ్లి యాడఁగూడదని నిర్బంధపఱుచు చుండుటచేతను, ముగ్గురు భార్యలను మ్రింగి ముదిసిన వగ్గును సహితము ముప్పనఁ బెండ్లి యాడ నంగీకరించు చుండుటచేతను, భార్యలు కావలసిన పురుషుల సంఖ్య యెక్కువగుటయు భార్యలు కాఁజాలిన బాలికల సంఖ్య తక్కు వగుటయు సంభవించి కన్యాశుల్కమున కవకాశము కలుగుచున్నది. కన్యాశుల్కమువలెనే వరదక్షిణయని పేరుపెట్టి మనలోని చదువుకొన్న వారు కన్యల సంరక్షకులవలన బేరమాడి బలవంతముగాఁ బుచ్చుకొనెడి వరశుల్కమును దూష్యమైన దగుటకు సందేహము లేదు. బాల్య వివాహములను మాన్పి వితంతువివాహములను నెలకొల్పి స్త్రీవిద్యను వ్యాపింపఁ జేసినచో వరశుల్క కన్యాశుల్క రూపములయిన యీ రెండు దురాచారములును నామమాత్రావశిష్టములు కావచ్చును.

వివాహాదులయిన వేడుకలయందు భోగముమేళములఁ బెట్టుట దూష్యమన్న విషయము తరువాత నిర్ధారణము చేయవలసినది. నృత్త గీతాదు లాదరణీయములు కావని చెప్పువారు లోకములో నెవ్వరు,

నుండరు. కఠినచిత్తుల హృదయములను సహితము కరఁగించి యానంద వార్ధిని దేల్చి భక్తికిని సత్కార్యాచరణమునకును బురికొల్పుటలో గానరసమునకున్న శక్తి మఱిదేనికిని లేదు. అటువంటి సంగీతము మన దేశమునం దభాగ్యవశముచేత వ్యభిచారమే కులవృత్తిగాఁగల వేశ్యల పాలఁ బడుటచే సర్వజనశ్లాఘాపాత్రమైన గానవిద్య దూషణమునకుఁ బాత్రమయి శ్మశానకుసుమమువలె వర్జనీయమైనది. గృహమును భూతలస్వర్గమునుగాఁ జేసెడు నృత్యగానవిద్యలు కులకాంత లభ్యసించుట యిప్పుడు తప్పయినది. కాసునకయి తమ కాయములను కష్టరోగికయినను విక్రయించెడు పశుపడఁతుల పాలఁబడఁబట్టికదా యీ దేశమునందు సంగీతమున కట్టిదురవస్థ పట్టినది! అది యటుండనిండు. వివాహసమయములయందు భోగముమేళముల మూలమున నయ్యెడు దుర్వ్యయముమాట యటుండఁగా రత్నములు చెక్కిన సంకెలలవలె సమస్తాభరణములను ధరించుకొని దీపములవెలుతురున తళుక్కుమన్నప్పుడు మనస్సులు చలించి పెండ్లికొమారుఁడు మొదలుగా ననేక యౌవనపురుషులు కొన్నిసమయములయందు వేశ్యలకు దాసులయి తమధనమును యౌవనమును మన్మథాగ్ని కాహుతి చేయుచున్నారు. వేశ్యలయిండ్లను వెదకుకొని వ్యభిచారమునిమిత్తమయి పోవువా రెక్కడనో నీతిమాలినవారు కొందఱే యుందురు. వేశ్యలలోఁ బలువురు పగలు కంటఁ బడినపక్షమున చింపితలలతోను వికృతవిగ్రహములతోను మర్కటములవలె రాత్రి కలలోఁ గనఁబడు స్థితియందే యుందురు. అట్టివారు వన్నెలు చిన్నెలు ధరించివచ్చి కప్పగొంతు పాములవలెఁ బాటలు పాడుచు మన గృహములలోనే ప్రవేశించినప్పుడు సాన్నిధ్యప్రభావముచేత ననేక సాధుపురుషులకు సహిత మా మేకవన్నెపులులవాతఁ బడుట కవకాశము కలుగునుగాన నీతిపరులయిన వారందఱును మణిభూషితఫణులనువలె వేశ్యలను గృహము చొరనీక

దూరముగా తఱుమవలెను. వధువులకుఁ బాతివ్రత్యము నేర్పఁదగిన వివాహములవంటి పవిత్రసమయములందుఁ బాతివ్రత్యకల్పలతకు వేరుపురుగులై యపవిత్రలయిన పడుపుపడఁతుల నింటికి రప్పించి వారిచేత వ్యభిచారోద్దీపకములైన శృంగారగీతములను పాడించుట యెంత హేయకృత్యము? మానవంతుఁడు తనవారు మఱియే యపరాధమును జేసినను సహింపఁగలుగును గాని వ్యభిచరించినప్పుడు మాత్రము చేసికొన్న భార్యనయినను కన్న కూఁతునయినను దోఁడబుట్టిన కోమలినైనను విటపురుషసహితముగాఁ జంపఁజూడక మానఁడు గదా? లోకములో జరగెడు హత్యలలో సగము వ్యభిచారమూలమున జరుగుచున్నవి. అట్టి హేయాతిహేయమైన వ్యభిచారమును కులవృత్తిగాఁ గైకొన్న దూష్యురాండ్రను డబ్బిచ్చి పిలిపించి యెవ్వరును దమ గృహములను దూష్యములనుగాఁ జేసికొనకుందురుగాక! ఈశ్వరసృష్టిలో పాపమెప్పుడును స్థిరముగా వర్ధిల్లదు. సద్వంశజలయిన బాలవితంతువులు గన్నబిడ్డలును బీదలమ్ముకొను బిడ్డలును భోగకాంతల పాలఁ బడకుండిన పక్షమున సంతానహీనతచే మనదేశములో వేశ్యాకుల మీవఱ కెంతకాలముక్రిందటనో నశించియే యుండును.

ఇప్పుడు నిర్ధారణముచేయ నేర్పఱుచుకొన్న మఱియొక విషయము సామాన్యముగా నిప్పటి మఠాచార్యులును ముఖ్యముగా నీ ప్రాంతమందలి శంకరాచార్యులును స్వకృత్యమును మఱచి, శిష్యులను బాధించి విత్తార్జనము చేయుచుండుటయు, పాదపూజలు సమర్పింపనివారికి బహిష్కారపత్రికలు పంపుచుండుటయు ననుచితమని మన యసంతృప్తిని దెలుపుటయయి యున్నది. మఠమును, నీతిని వ్యాపింపఁజేయుచు, నీతిబాహ్యులయిన వారిని శిక్షించుచు, స్వకృత్యమును నిర్వహించుచున్నంతవఱకు మఠాచార్యులుండుట యావశ్యకమనుట నిర్వివాదాంశము. పీఠాధిపతులు కేవల శిష్యవిత్తాపహారులు

గాక హృత్తాపహారులుగా నున్నంతవఱకు వారిని గౌరవించుటయు భక్తిపూర్వకముగా శక్తికొలఁదిని వారిని ధనాదులతో సత్కరించుటయు మనకు ధర్మమే. అయిన పీఠాధిపతులు తమ ధర్మమును విస్మరించి లోకమున కేవిధమునను ప్రయోజనపడక ప్రజాపీడాకరులుగా నున్నప్పుడు మాత్రము మనము వారియాజ్ఞలను మన్నింపవలసిన పనిలేదు. అక్రమములయిన వారియాజ్ఞలను సంక్షోభపఱచి ధిక్కరించి జనులమీఁద నిరంకుశాధికారము చెల్లించుచుండుటయే తమ పనియని దుర్భ్రమగొని యున్న యాచార్యపురుషుల కన్నులఁదెఱపి వారిని స్వకృత్యమునకుఁ దింపుట లోకోపకారము బరమధర్మమును నగును. సన్న్యాసు లైహికసుఖపరిత్యాగముచేసి కేవల పారమార్థిక చింతతో బ్రహ్మానుసంధానము చేయుచు శిష్యులకు ముక్తిమార్గోపదేశము చేయుచుఁ గాలము గడపవలసినవారు. పూర్వకాలమునందాదిశంకరులు మొదలయినవారు పాదచారులయి సేతువు మొదలుకొని హిమాచలమువఱకును దేశసంచారము చేసి భరతఖండమునందు మతవ్యాపనము చేయుచు వచ్చిరి. విద్యారణ్యులని నామాంతరము వహించిన మాధవాచార్యులవారు బుక్కరాజునకు మంత్రిగా నుండి శంకరాచార్యపీఠమునకు వచ్చిన తరువాత పీఠాధిపతు లయిన సన్న్యాసుల కిప్పటి వైభవము లారంభమయినట్టు కనుపట్టుచున్నవి. అయినను వెనుకటి పీఠాధిపతులు వైభవయుక్తులయినను స్వకృత్యమునుపేక్షచేయక లోకోపకారులయి జనుల సత్కారమునకును గౌరవమునకును యోగ్యులగుచుండిరి. ఇఁక నిప్పటి యతులో స్వప్నావస్థయందయిన స్వకృత్యమును దలపెట్టక పెండ్లికూతురు లేకపోయినను క్రొత్తపెండ్లికొడుకులవలె వాద్యములతోను గజాశ్వాదులతోను పెండ్లిపల్లకులలో నెక్కి యూరేగుచుఁ దమవైభవమును గాపాడు నిమిత్తమే జనులు సృజింపఁబడినారని భావించుచు తత్త్వవిచారమున్న

మాట యెఱుఁగక భోగపరాయణులయి యథేచ్ఛావిహారులగుచున్నారు. శిష్యుల కుపదేశించుటకు మొదల మతమన్న వారికే తెలియదు. వారికిఁ దెలిసినదెల్ల జనులను నిర్బంధించి గురుదక్షిణలు గైకొనుటయు భక్ష్యములతో షడ్రసోపేతముగా భిక్షలు చేయుటయు మాత్రమే. ఈ విషయమున మనలో వాడుకగానున్న యొకకథ నాకు స్మరణకు వచ్చుచున్నది. ఒక స్వాముల వారొక గృహస్థుని యింటికి భిక్షకు విజయం చేసెనఁట! ఆయతీశ్వరునకు భిక్షామిషమునఁ బంచభక్ష్యపరమాన్నభుక్తి యొక్కటియే ముక్తివిచారమన్న సత్యము నెఱుఁగజాలక ముద్దరాలయిన యాయింటి యిల్లాలు భిక్షానంతరమున స్వాములవారివద్దకు వచ్చి వేదాంతగ్రంథపారాయణము చేసికొందురేమోయన్న భ్రమచేత "స్వామీ! భగవద్గీతలు తెత్తునా?" యని యడిగెనఁట! భక్ష్యభక్షణచింత తప్ప వేఱుచింత లేని యా యతీంద్రుఁడు మిన్నువంకఁజూచి కొంతసేపాలోచించి యా పేరుగల భక్ష్యములను దాను మున్నెన్నఁడును దిన్నట్టు స్మరణకు రాకపోయినను భగవద్గీత లనునవి యేవో యపూర్వభక్ష్యము లయియుండునని భావించి కడుపు నిమురుకొనుచు "అమ్మా! కడుపు నిండుగా నున్నది. ఇప్పుడు పుచ్చుకోలేను. కొంతసేపు తాళి తీసికొనివచ్చిన పక్షమున భక్షించెదను" అని యుత్తరము చెప్పెనఁట. గృహయజమానురా లాయన భోజనపాండిత్యమునకు సంతోషించి మాఱుమాటాడక లోపలికిఁ బోయెనఁట! ఇది యతిశయోక్తియే యైనను, ఇప్పటి పీఠాధికారుల పాండిత్యప్రకర్షమునుబట్టి విచారింపఁగా నిందును గొంత సత్యమున్నదని తోఁచకపోదు. ఇటువంటి యనేక దురాచారముల కాలవాలమగుటచేతనే పూర్వకాలమునందు మనదేశమునందు సన్న్యాసము నిషేధింపఁబడినది. పూర్వకాలమునందు సంస్కృతభాషలో రచియింపఁబడిన ప్రహసనములలో సన్న్యాసుల వ్యభిచారాదులు బహు

విధముల వర్ణింపఁబడి పరిహసింపఁబడినవి. నిషేధింపఁబడిన సన్న్యాసమును శంకరాచార్యులవారు మరల నుద్ధరించి యీ దేశమున వ్యాపింపఁజేసిరి. ఇప్పటి స్వాములవార లెట్లున్నారో కొంతవఱకు మన యిక్కడి శంకరాచార్యులను బట్టియే తెలిసికోవచ్చును. ఈయన ధనార్జనమే పరమార్థముగా భావించుకొని తన శిష్యులైనవారిని కాని వారినిగూడ ధనము సమర్పింపుఁడని బాధించుచు నడిగినంత మొత్తమియ్యలేనివారికి బహిరంగముగా బహిష్కారపత్రికలను బంపుచున్నారు. కలియుగకాలములో నిట్లు నిర్బంధపఱిచి ధనము లాగఁజూచుట దారులఁగొట్టుటకంటె శ్రేష్ఠమయిన పనియని నే ననుకోను. మతాచార్యులవలని యిటువంటి దౌర్జన్యములను వారింపఁజూచుట దేశాభిమానుల కందఱకును గర్తవ్యము.

ఇఁకను నేఁడు మనము విచారింప నేర్పఱుచుకొన్న విషయ మింకొకటి మాత్రమే మిగిలియున్నది. ఇప్పుడు పేర్కొనఁబడిన విషయములలోను, ఇట్టివే మఱికొన్ని విషయములలోను, సంస్కారము జరుగుట సంఘముయొక్క యభివృద్ధి కావశ్యకమని విద్యావివేకములు గలవారు దృఢముగా నమ్ముచున్నారు. ఆచారమునే దేవతనుగా నమ్మి కొలుచు పామరులును పూర్వదురాచారములవలననే లాభము ననుభవింపమరగిన స్వప్రయోజనపరులును సంస్కారమునకుఁ బ్రతికూలురుగా నున్నారు. ఇట్టి సమయమునందు సంఘములో నట్టి మార్పులు చేయుట యెట్లు సాధ్యమగును? పామరులకు సంస్కారమువలనఁ గలుగు లాభములను దెలిపియు మొట్టమొదట నూతన మార్గములను తాము త్రొక్కి చూపియు సంఘాభివృద్ధికయి పాటుపడెడు దేశాభిమానులు కొందఱు తేర్పడినఁగాని యీ మహాకార్యము సాధ్యము కాదు. కాఁబట్టి యట్టిపనికయి యందందు సంస్కారసంఘము లేర్పడుట యావశ్యకము. ఇప్పుడీ సభవారు రాజమహేంద్రవరము

నందు మండలసంఘసంస్కారసమాజ మొకటి స్థాపింపఁబడి యేలూరు, కాకినాడ మొదలయిన ప్రధానస్థలములయం దెల్లను దానికి శాఖ లేర్పఱుపఁబడవలయునని నిర్ధారణ చేయవలసియున్నది. ఇది మిక్కిలి శ్లాఘ్యమైన పని. పలువు రేకీభవించి పూనికతో బనిచేసినంగాని యేవిషయములోను కార్యసాఫల్యము కాదు. "సంఘే శక్తిః కలౌ యుగే" యన్న యార్యోక్తి యెల్లవారును పలుమాఱు వినుచున్నదే. ఒక్క యీ కలియుగమునందు మాత్రమే కాక సమస్తయుగముల యందును సమస్తదేశములయందును గూడ సంఘీభవించి చేసిన పని లోనే యత్యద్భుతశక్తి యుండుననుటకు సందేహము లేదు. విద్యార్థులు సంఘములుగాఁ జేరి యైకమత్యముతోఁ బనిచేసిన పక్షమున నత్యల్పకాలములోనే బహుసంస్కారములను జేసి దేశమున కమిత లాభములను గలిగింపవచ్చును. ఇట్లేర్పడు సమాజములవారు చేయ వలసిన పను లేవియని కొందఱడుగవచ్చును. వారు సంస్కారవిషయమున సులభశైలిని దేశభాషలలో పుస్తకములను పత్రికలను వ్రాసి ప్రచురించి యల్పక్రయమునకో ధర్మార్థముగానో సర్వజనుల కును పంచిపెట్టుచుండవలయును; తమ కవకాశము గలిగినప్పు డెల్లను గ్రామములకుఁ బోయి సభలుచేసి యుపన్యాసములను ప్రసంగములను జేయుచుండవలయును. వారపత్రికనో పక్షపత్రికనో మాస పత్రికనో యొకదానిని బ్రకటించుచు నందు సంస్కారవిషయమున గల సాధకబాధకములను బలుమాఱు చర్చించుచుఁ బూర్వపక్షులు చేసెడి యాక్షేపణములకు సమాధానము లిచ్చుచుండవలయును; ఇతరస్థలములయం దిట్టి పని కయి యేర్పడియున్న సమాజములతో ను త్తరప్రత్యుత్తరములు జరుపుచు వారి మంచిపద్ధతుల నవలంబించు చుండవలయును. సంఘమువలన బహుప్రయోజనములు గలుగు ననుట కిప్పు డిక్కడ సమావేశమయి యున్న యీ మహాసంఘమే నిదర్శనము. సాంఘికసంస్కారము జరగక రాజ్యాంగసంస్కారము




వలని లాభములను మనము పూర్ణముగా ననుభవింపఁజాలమని మొదలనే చెప్పియున్నానుగదా ? దొరతనమువారు భూములమీఁది నెకరమున కొక రూపాయి తగ్గించినను, ఒక్క పెండ్లి[illegible]సంభావన లిచ్చుటకో బ్రాహ్మణసంతర్పణములు చేయుటకో [illegible] నాడించుటకో యీ ధాన్యములను తెగనమ్ముచున్నప్పుడు దానివలన నేమి ప్రయోజనము కలుగును ? ప్రభుత్వమువారు పారిశుద్ధ్యవిచారణసంఘాదికములలో సభికుల నేర్పఱుచుకొను స్వాతంత్ర్యము మనకిచ్చినను, వచ్చినవారు పాక్షికబుద్ధిని వహించి సర్వసమభావములేక శాఖాభేదములను బట్టి స్వశాఖేతరులను ద్వేషించుచు వచ్చినపక్షమునఁ బ్రజల కేమిక్షేమము కలుగును ? కాఁబట్టి రాజ్యాంగసంస్కారములతోఁగూడ సాంఘికసంస్కారములు కూడ జరిగి తీఱవలెను. రాజ్యాంగసభకు వచ్చినంతమంది యించుమించుగా నీసంఘసంస్కారసభకును విచ్చేయుట చూడఁగా మనదేశముయొక్క పురోభివృద్ధికి మంచిదినములు వచ్చినట్టు స్పష్టమగుచున్నది. నేటి సభయందు దేశాభివృద్ధిసూచకమయిన యింకొక విశేషముకూడఁ గనఁబడుచున్నది. ఈ వఱ కెప్పుడును మనప్రాంతములయం దుపన్యాసములు వినుటకయి స్త్రీలు వచ్చిన ట్లంతగాఁ గనఁబడదు. సాహసముచేసి తమభార్యలను బంధుస్త్రీలను సభకుఁ బంపిన మహాపురుషులును, విద్యాగంధములేని పామరస్త్రీల దూషణోక్తులను సరకుగొనక సభకు విచ్చేసిన కాంతారత్నములును మిక్కిలి కొనియాడఁ దగియున్నారు. సంఘసంస్కారములోఁ పురుషులకు స్త్రీలు తోడ్పడినఁగాని శీఘ్రముగా కార్యసాఫల్యము కాదు. ఇఁకముందు సభలకింతకంటె నధికసంఖ్యగల స్త్రీలువచ్చి యుపన్యాసాదులు విని యానందింతురుగాక ! ఈ సభవారు నాకుఁ జేసిన గౌరవమునకయి యిం[illegible] పునరభివందనముల నర్పించుచున్నాను.

# కీర్తిశేషులైన రావుబహద్దూరు
# కందుకూరి వీరేశలింగం పంతులుగారి
# గ్రంథములు

## ప్రహసనములు

మొదటి సంపుటము.

1 అపూర్వబ్రహ్మచర్య ప్రహసనము
2 విచిత్రవివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్రహస॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్రహస॥
8 యోగవిద్యా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 హాస్యసంజీవి మొదటి భాగము
15 రెండవ భాగము
16 మూడవ భాగము

## నాటకములు

రెండవ సంపుటము.

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషికాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము

రెండవ సంపుటము.

5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము.

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్ని మిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్ర

## వచన ప్రబంధములు

## పద్యకావ్యములు

నాల్గవ సంపుటము.

1 సత్యరాజాపూర్వదేశ
యాత్రలు మొదటి భా॥
,, రెండవ భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధం
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము

ఏడవ సంపుటము

20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము

21 స్త్రీ పునర్వివాహ విషయక ప్రధమవిజ్ఞాపనము

22 స్త్రీ పునర్వివాహ విషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీ పునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీ పునర్వివాహ భూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు - జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ, దానియుద్దేశము

2 శంకరాచార్యులు

3 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము

4 జీసస్ చరిత్రము

5 స్వదేశసంస్థాన చరిత్రాదులు

6 విగ్రహతంత్ర విమర్శనము

7 ఉపన్యాసమంజరి

ఎనిమిదవ సంపుటము

8 వివేకవర్ధని మొదటి భాగము

9 .. రెండవ భాగము

10 .. మూడవ భాగము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము

2 కావ్యసంగ్రహము

3 అలంకార సంగ్రహము

4 నీతిచంద్రిక-విగ్రహము

5 నీతిచంద్రిక-సంధి

6 తర్క-సంగ్రహము

7 సత్యవాదిని

8 ఉత్తమస్త్రీ చరిత్రములు

పదియవ సంపుటము

పూర్వాంధ్రకవులు

ఆధునికాంధ్రకవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు :

కార్యదర్శి - హితకారిణీ సమాజము,

రాజమహేంద్రవరము

అని వ్రాసిన బడయగలరు.